శ్రీరస్తు

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణేనమః

    

108 వ శ్రీరామ మహాక్రతుస్మారకముగా

శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజజీయరుస్వామివారి
ఆదేశానుసారముగా

శ్రీ తూ. వెం. చూడామణిచే
ఆంధ్రీకరించబడిన

# శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యము

( మూడవ భాగము )

గోపాలాచార్యస్వామివారిచే
పరిశోధించబడినది

ప్రకాశకులు :
శ్రీ శ్రీ శ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణరామానుజజీయర్ స్వామివారు

1973 మూ

ప్రతులు 1500

వేఙ్కటేశస్యమాహాత్మ్యం యస్యగేహేఽవతిష్ఠతే ।
ఆయురారోగ్యమైశ్వర్యం సోఽన్తేవిష్ణుపదంలభేత్ ॥

(బ్రహ్మాణ్డపురాణే దశమాధ్యాయే 45 శ్లోకః)

శ్రీ వెంకటాచలమాహాత్మ్య గ్రంథ మెవ్వరియింట నుండునో వారాయురారోగ్యైశ్వర్యాదులను బడసి చివరకు పరమపదమునుబడయుదురు.

అవంతీ ప్రెస్,
రాజమండ్రి - 1.

# శ్రీ భవిష్యోత్తర పురాణాన్తర్గత శ్రీ వేఙ్కటాచల మాహాత్మ్య

# విషయానుక్రమణిక

# - శ్రీ వేఙ్కటేశస్తవః -

శ్లో॥ శ్రియః కాన్తాయ కల్యాణ । నిధయే నిధయే ఒర్థినామ్ ।
శ్రీవేఙ్కటనివాసాయ । శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥

లక్ష్మీదేవికి భర్తయు, సమస్త సన్మంగళములకు గనియైనవాడును, పేదలపాలిటి పెన్నిధియైనవాడును, శ్రీ వేంకటాచలమున నివసించు శ్రీనివాసునకు మంగళమగుగాక ।

శ్లో॥ శ్రీవేఙ్కటాచలాధీశం । శ్రియా ఒఒధ్యాసిత వక్షసమ్ ।
శ్రితచేతనమన్దారం । శ్రీనివాస మహం భజే ॥

శ్రీవేంకటాద్రియందు నివసించునట్టియు, లక్ష్మీదేవిచే నలంకరింపబడిన వక్షస్థలము కలిగినట్టియు, ఆశ్రితులపాలిటి కల్పవృక్షమగు శ్రీనివాసుని సేవించుకొనుచున్నాను.



హరిః ఓమ్

# అథ ప్రథమో ఽధ్యాయః

## శ్రీ భవిష్యోత్తర పురాణాన్తర్గత వేంకటేశ్వర మాహాత్మ్యమ్

## జనకనృపానుభూతశోకాతిరేకప్రకారః

శౌనకః —

సూత ! సూత ! మహాభాగ ! । సర్వశాస్త్రవిశారద ! ।
త్వత్తో ఽహం శ్రోతు మిచ్ఛామి । మాహాత్మ్యం పుణ్యవర్ధనమ్ ॥ 1

కథితం రఙ్గమాహాత్మ్యం । త్వయా హస్తిగిరీశితుః ।
జగన్నాథస్య వై విష్ణోః । మాహాత్మ్య మతులం మునే ! ।
ఇదానీం శ్రోతు మిచ్ఛామి । మాహాత్మ్యం వేఙ్కటేశితుః ॥ 2

శ్రీసూతః —

సాధు పృష్టం త్వయా బ్రహ్మన్ ! । చరితం వేఙ్కటేశితుః ।
యథాశ్రుతం మయా పూర్వం । వ్యాసా దమితతేజసః ॥ 3

త త్తథా ఽహం సమాచక్షే । సావధానమనా శ్శృణు ।
పురా తు జనకో నామ । రాజా పరమధార్మికః ॥ 4

సత్యవాక్ సర్వశాస్త్రేషు । కోవిదః కోపవర్జితః ।
వాసుదేవప్రసాదస్య । ముఖ్యపాత్ర మభూ న్నృపః ॥ 5

నిర్మమో నిత్యతృప్త శ్చ । నిరహఙ్కృతి రాత్మదృక్ ।
తస్య భ్రాతా ఽభవ త్పూర్వం । కుశకేతు రితి స్మృతః ॥ 6

కుశధ్వజస్య తనయాః । త్రయ స్త్రైలోక్యసున్దరాః ।
దుహితౄణాం త్రయం తస్య । కుశకేతో ర్మహాత్మనః ॥ 7

జనకస్యా భవ త్పుత్రీ । జానకీ నామ సా రమా ।
భ్రాత్రా చ కారయామాస । రాజ్యం జనకభూపతిః ॥ 8

హరిః ఓమ్

# మొదటి అధ్యాయము

(శ్రీ భవిష్యోత్తర పురాణమునందలిది)

## జనకమహారాజు దుఃఖోద్రేకము ననుభవించిన విధము

శౌనకుడు —

"సూతా! పుణ్యపురుషా! సకలశాస్త్రపారంగతా! పుణ్యము నభివృద్ధిచెందించు మాహాత్మ్యమును నీవలన వినగోరుచున్నాను. 1

నీవలన కరిగిరినిలయుడగు వరదరాజునియొక్కయు, జగన్నాథునియొక్కయు సాటిలేని మాహాత్మ్యమును వింటిని. ఇపుడు శ్రీ వేంకటాచలపతి మాహాత్మ్యమును వినగోరుచున్నాను తెలుపుమ"ని శౌనకమహర్షి సూతు నడుగగా 2

శ్రీ సూతుడు —

సూతుడు "మహర్షీ! వేంకటాచలపతి చరితమును చక్కగా నడిగితివి. మహా తేజశ్శాలియగు వ్యాసునివలన పూర్వము నేను వినినదానిని 3

వినినట్లే బాగుగా తెలిపెదను. శ్రద్ధతో నాలకింపుము. పూర్వము మహా ధర్మాత్ముడును. 4

సత్యసంధుడును, సకలశాస్త్రపరిజ్ఞాతయు, కోపము లేనివాడును, శ్రీమన్నారాయణ కృపకు ముఖ్యపాత్రుడును నగు జనకమహారాజు కలడు. 5

ఆతనికి మమకారరహితుడును, పొందినదానితో తృప్తిగొందువాడును, అహంకారము లేనివాడును, ఆత్మధ్యానము కలవాడునగు కుశకేతు డను సోదరుడు కలడు. 6

ఆతనికిము ల్లోకములయందును సౌందర్యవతులగు ముగ్గురు కుమారులును, అట్టి ముగ్గురు కుమార్తెలను నుండిరి. 7

జనకమహారాజునకు లక్ష్మియే "జానకి" యను కుమార్తెగా జన్మించెను. జనక మహారాజు సోదరునిచే రాజ్యపాలన మొనరించుమందెను. 8

స భ్రాతు రాజ్ఞయా రాజ్యం । చకారా ర్యేషు భక్తిమాన్ ।
కదాచిత్ జనకో రాజా । మనసీ ద్ధ మచిన్తయత్ ॥ 9

"సుఖ మేవ సదా మే స్యాత్ । దుఃఖం మాభూత్ కదాచన ।
దుఃఖం న వీక్ష్యే నేత్రాభ్యాం । సుఖం వీక్షే సదా ఽఽత్మనః ॥ 10

అసాధుసమ్మతం వాక్యం । శ్రుత్వే త్థ ముదితం హరిః ।
దుఃఖం ప్రదర్శయామాస । రాజ్యమ త్తస్య భూపతేః ॥ 11

కదాచి ద్దైవయోగేన । కుశకేతు రగా న్మృతిమ్ ।
హతే ఽనుజే చ తద్భార్యా । తేన పాకం మమార చ ॥ 12

రాజ్యం పుత్రాం స్తత స్త్యక్త్వా । త్వగా త్పతిసలోకతామ్ ।
తౌ దమ్పతీ నృపో దృష్ట్వా । త్యక్తపుత్రౌ సుఖోచితౌ ॥ 13

విలలాప మహారాజో । భ్రాతరం భ్రాతృవత్సలః ।
"హా భద్రే! బాలకాం స్త్యక్త్వా । వృద్ధం మాం జానకీం తథా ॥ 14

క్వ గచ్ఛసి వరారోహే! । పతి మాలిఙ్గ్య మఙ్గళే! ।
అశీతివర్షసాహస్రం । సమ్ప్రాప్తం మమ భామిని ॥ 15

ఏతావత్కాలపర్యన్తం । న దృష్టో దుఃఖసఞ్చయః ।
అద్య దృష్టో వరారోహే! । త్వద్వియోగేన కేవలమ్ ॥ 16

ఇతి సఞ్చిన్త్య మనసి । వారం వారం మహీపతిః ।
చకార ప్రేతకార్యాణి । పుత్రాణా శ్చైవ శైశవాత్ ॥ 17

మాతృహీనాం స్తతో బాలాన్ । అలిఙ్గ్యాఙ్కే నిధాయ చ ।
భో! పుత్రాః! బాలభావే తు । మాతృహీనా శ్చ కర్శితాః ॥ 18

కథం పశ్యామి నేత్రాభ్యాం । మాతృహీనాం శ్చ బాలకాన్ ।
ఇతి చిన్తాపర స్సో ఽభూత్ । త్యక్తరాజ్యో ఽతిదుఃఖితః ॥ 19

కుశకేతుడును అన్నగారి యాజ్ఞానుసారము పెద్దలయందు భక్తికలిగి రాజ్యపాలన మాచరించెను. ఒకప్పుడు జనకమహారాజు తన మనస్సులో 9

నా కెప్పుడును సుఖమే కలుగవలెను. కాని దుఃఖ మెన్నడును సంభవింపరాదు. నేను నా కన్నులతో దుఃఖమును దర్శింపజాలను; ఎల్లపుడును సుఖమునే గాంచెదన"ని తలంచసాగెను. 10

అంత శ్రీమన్నారాయణుడు సజ్జన సమ్మతముకాని వాక్యమును విని రాజ్యసంపదలచే మదించిన జనకచక్రవర్తికి దుఃఖమునే చూపింపదలచెను. 11

ఒకానొకతరి దురదృష్టవశమున కుశకేతుడు మరణించెను. ఆతనితో నాతని భార్యయు రాజ్యమును పుత్రులను విడిచి సహగమనము నాచరించి పతిసాలోక్యమును బడసెను. 12

సుఖింపదగినవారై యుండియు పుత్రులను వీడి మరణించిన యా దంపతులను గాంచి 13

సోదరునియం దధికమైన ప్రేమగల జనకచక్రవర్తి " మంగళరూపిణీ! పిల్లలను ముసలివాని నగు నన్ను, జానకిని విడచి 14

నీ భర్త ననుగమించి ఎచటి కేగితివి ? నా కెనుబదివేల సంవత్సరము లేతెంచినవి. 15

ఇంత కాలమువరకు దుఃఖ మన దానిని గాంచలేదు. నీ వియోగముచే మాత్రమే నేడు దుఃఖము ప్రాప్తించినది. 16

అని మాటిమాటికి తలంచుచు బిడ్డలు పసివారగుటవలన వారికి శ్రాద్ధాదికర్మలను తానే నిర్వర్తించి పసివయస్సుననే 17

తల్లిని కోల్పోయిన బాలురను కౌగలించుకొని ఒడిలో కూర్చుండబెట్టుకొని బిడ్డలారా ! చిన్నతనముననే తల్లిలేక కృశించియున్నారే 18

ఈ తల్లిలేని పిల్లలను నే నెట్లు నా కన్నులతో వీక్షించగలన'ని విచారించుచు రాజ్యమును వీడి దుఃఖపరవశుడై 19

త్యక్త్వా న్నః త్యక్తభోగ శ్చ । త్యక్తనిద్రో ఽతికర్శితః ।
తస్య దుఃఖోపశా న్త్యర్థం । శతానన్దః పురోహితః ॥ 20

సమ్ప్రాప్తో దైవయోగేన । వాసుదేవానుజో మునిః ।
ప్రాప్తం పురోహితం దృష్ట్వా । రాజా పూజా మకల్పయత్ ॥ 21

స పూజితో మునివరో । నివిష్టో మృగచర్మణి ।
తతః కాలోచితాం వార్తాం । కథయా మాస గౌతమిమ్ ॥ 22

## శతానన్దంప్రతి జనకకృతస్వశోక నివృత్త్యుపాయ ప్రార్థనా

జనకః —

శతానన్ద ! మహాప్రాజ్ఞ ! । కా గతిః స్యా దితో మమ
వృద్ధత్వా దాత్మన శ్చైవ । పుత్రాణా శ్చైవ శైశవాత్ ॥ 23

కన్యకారత్నబాహుళ్యాత్ । హతబన్ధో ర్మహామునే ! ।
బహవః శత్రవ స్సన్తి । రావణేన్ద్రజిదాదయః ॥ 24

తేభ్యో యుద్ధం కథం దాస్యే । హ్యసహాయో ఽతిజీర్ణవాన్ ।
దివా వక్తుం సమాయాతి । రావణః కేన హేతునా ॥ 25

న జానే మునివర్యా ! హం । ప్రజ్ఞా చక్షు ర్న విద్యతే ।
నిమిత్త మేకం కథితం । ద్వితీయం ప్రవదామి తే ॥ 26

సీతాయా శ్చ సు రూపాయాః । సరూపః పురుషః కథమ్ ।
లభ్యతే ? వద విప్రేన్ద్ర । తృతీయం ప్రవదామి తే ॥ 27

దీర్ఘాయుష శ్చ మే పుత్రాః । పుత్ర్య శ్చాపి సభర్తృకాః ।
ఏక దేశాధిపశ్చైవ । స్నుషా స్తా శ్చభవన్తు మే ॥ 28

జామాతర శ్చ చత్వారః । ఏకరాజసుతా స్తథా ।
వర్ధిత శ్చైవ మే రాజ్యం । త్వయ్యే మేవ పురోహిత ! ।
కేనోపాయేనవై భూయాత్ । తదేతత్కారణంవద ॥ 29

ఆహారమును, భోగములను, నిద్రనువీడి కృశించుచుండగా నాతని దుఃఖమును పోగొట్టుటకై 20

వసుదేవుని సోదరుడగు శతానందు డను పురోహితు డదృష్టవశమున నేతెంచెను. అట్లు వచ్చిన ఆ పురోహితుని జూచి యా రాజు పూజించిన పిమ్మట 21

కృష్ణాజినమున కూర్చుండెను. పిమ్మట జనకచక్రవర్తి సమయానుసారముగా భాషించుచు 22

## జనకచక్రవర్తి తన విచారము పోవుట కుపాయమును చెప్పుమని శతానందుని ప్రార్థించుట

జనకుడు —

శతానందా! విద్వన్మణీ! నేను ముసలివాడనైతిని, బాలురు పసివారు. 23

కన్నియలు చాలమంది కలరు. బంధుగులు మృతిచెందిరి. రావణ ఇంద్రజిత్తు మొదలగు శత్రువులు మిక్కుటముగా నున్నారు. 24

మిక్కిలి వృద్ధుడను. నిస్సహాయుడ నగు నే నెట్లు వారితో యుద్ధమొనరింతును· రావణు డెందులకో రాత్రింబవలులు వచ్చుచున్నాడు. 25

నాకు జ్ఞాననేత్రము లేకుండుటంజేసి కారణ మారయజాలకున్నాను. నా కిదియొక చింతాకారణమై యున్నది. 26

మిక్కిలి రూపవతియగు సీతకు సౌందర్యశాలియగు పురుషుడు లభించు నుపాయ మేమి? యని రెండవ విచారము. 27

నా పుత్రులు దీర్ఘాయుష్మంతులు కావలెను. పుత్రికలును వారి భర్తలును దీర్ఘాయుష్మంతులు కావలెను. ఒకే దేశాధిపతికి మాత్రమే వారు కోడండ్రు కావలెను. 28

మా నలుగురు పుత్రికలకును ఒకే రాజునకు జనించిన నలుగురు పుత్రులను భర్తలుగా లభింపవలెను, నా రాజ్య మే యుపాయముచే వృద్ధిపొందు ననునది మూడవ విచారము. పురోహితా! నా కిట్టి వ్యాకులపాటు నశించునుపాయమును తెలుపుమని ప్రార్థించెను.

## జనకాయ శతానన్దోక్తః శ్రీవేఙ్కటాచల ప్రభావః

శతానన్దః —

అస్తి కశ్చి ద్విశేషో ఽస్మిన్ । భూలోకే భూమిపాలక ! ।
దుహితు స్తవ కల్యాణ- । సుఖదం శత్రునాశనమ్ ॥ 30

వైకుణ్ఠగిరి మాహాత్మ్యం । న భవిష్యం న హో త్తరమ్ ।
కలౌ తత్కీర్తనం పుణ్యం । సర్వదుఃఖహరం శివమ్ ॥ 31

ధనకామస్య ధనదం । పుత్రకామస్య పుత్రదమ్ ।
రోగార్తస్య చ రోగఘ్నం । జ్ఞానినాం జ్ఞానసాధనమ్ ॥ 32

య చ్ఛృత్వా సర్వలోకేశో । బ్రహ్మా బ్రహ్మపదం గతః ।
నీలకణ్ఠ స్తు య చ్ఛ్రుత్వా । నిర్విషః సుఖ మాప్తవాన్ ॥ 33

వజ్రీ నాకపదం ప్రాప్తో । యత్కథా శ్రవణాదరాత్ ।
పదాన్యాపుర్లోకపాలాః । యత్కథాశ్రవణేనవై ॥ 34

కిముక్తేన విశేషేణ । తదనన్తఫలం శృణు ।
ఇత్యుక్తో మునినాతేన । జనకోవాక్య మబ్రవీత్ ॥ 35

జనకః —

వద వైకుణ్ఠమాహాత్మ్యం । కలౌ త చ్చరితం కథమ్ ।

శతానన్దః —

కృతే వృషాద్రిం వక్ష్యన్తి । త్రేతాయా మఞ్జనాచలమ్ ॥ 36

ద్వాపరే శేషశైలేతి । కలౌ శ్రీవేఙ్కటాచలమ్ ।
నామాని యుగభేదేన । శైలస్యా స్య భవన్తి హి ॥ 37

జనకః —

చతుర్యుగే త్వయా ప్రోక్తం । నామ యద్యద్గిరే ర్మునే ।
తస్య తస్య చ వై హేతుం । విస్తరా ద్వద మే గురో ! ।
కృతే వృషాచల ఇతి । కథం నామ గిరే రభూత్ ॥ 38

శతానందుడు జనకునకు శ్రీ వేంకటాచలమాహాత్మ్యము నెఱింగించుట.

శతానందుడు —

ఆ మాటలను విని శతానందుడు "రాజా! భూలోకమున నొక విశేషము కలదు. అది నీ పుత్రికకు కల్యాణసంపద నొసగూర్చును, శత్రువుల నశింపజేయును. 30

వైకుంఠపర్వత మాహాత్మ్యము ముందెన్నడు జరుగనిది. పూర్వకాలమున జరుగనిది. కలియుగమున దాని మాహాత్మ్యమును కీర్తించినంతనే పుణ్యము కలుగును. సమస్త దుఃఖములు నశించును. 31

మంగళముల నిచ్చును. ధనమును కోరువారికి ధనము నొసంగును. శత్రులయము కాంక్షించువారికి శత్రుల నిచ్చును. రోగముచే. పీడింపబడువారికి రోగమును పోగొట్టును. జ్ఞానులకు జ్ఞానము నభివృద్ధి నొందించు సాధనమగును. 32

దీని మాహాత్మ్యమును వినుటవలననే సకలలోకాధిపతియగు బ్రహ్మ బ్రహ్మలోకమున కధిపతియాయెను. గరళకంఠుడీ మాహాత్మ్యమును వినుటవలనతే విషమును త్రావియు సుఖముగా నుండెను. 33

దేవేంద్రుడీ మాహాత్మ్యశ్రవణముననే స్వర్గలోకాధిపత్యము నందెను. లోకపాలురందరు నీ మాహాత్మ్య శ్రవణముననే తమతమ నెలవుల కాధిపత్యమును వహించిరి.

పెక్కు మాటలేల? శ్రీ వేంకటాచలకీర్తన పెక్కు ఫలితములను నొసంగును. దానిని వినుము అని శతానందుడు తెలుపగా జనకచక్రవర్తి 35

జనకుడు —

శ్రీ వైకుంఠమాహాత్మ్యమును, కలియుగమున దానిచరిత్ర విధము నెఱింగింపుమని కోరినంతనే శతానందుడు మరల తెలుపుట కారంభించెను.

శతానందుడు —

ఈ పర్వతమును కృతయుగమున వృషాద్రి అనియు త్రేతాయుగమున అంజనాచలమనియు 36

ద్వాపరయుగమున శేషాద్రియనియు, కలియుగమున శ్రీ వేంకటాచలమనియు యుగములమార్పు ననుసరించి వ్యవహరింతురు. 37

జనకుడు —

దానిని విని జనకమహారాజు శతానందునితో "మునివర్యా! ఈ పర్వతమునకు నాల్గుయుగములయందు కలుగు నామములను తెలిపితిరి. ఆ యా నామములు వచ్చుటకు కారణమును విస్తారముగా తెలుపుచు కృతయుగమున వృషాచల మను పే రెట్లు కలిగెనో వక్కాణింపుమని యడిగెను. 38

## వృషభాచలనామనిష్పత్తిః

పురా తు వృషభో నామ । రాక్షసో రూక్షకర్మకృత్ ।
ఆక్రమ్య శేషశైల ఇ్చ । తాపసా నప్యబాధత ॥ 39

తేన సఙ్క్లిష్టతపసః । తదర్థం శరణం గతాః ।
శ్రీనివాసం హృషీకేశం । భక్తానా మభయఙ్కరమ్ ॥ 40

తుష్టువు ర్హృష్టమనసః । స్రష్టారం సర్వచేతసామ్ ।
ప్రాదుర్బభూవ భగవాన్ । మునీనాం పురతో హరిః ।
వ్యజ్ఞాపయ న్మునిశ్రేష్ఠాః । అసకృ త్కృతసంస్తవాః ॥ 41

మునయః —

భగవ ! న్నరవిన్దాక్ష ! । వృషభోనామ రాక్షసః ।
సమ్బాధతే సదా క్రూరః । తపోభఙ్గకరః ఖలః ॥ 42

తస్మా ద్రక్ష క్షరాతీత ! । భయా ద్రాక్షస కల్పితాత్ ।
బాధ మిత్యు క్తవాన్ కృష్ణో । దుష్ట మభ్యద్రవ ద్రుషా ॥ 43

స రాక్షసో మహావీర్యః । తీర్థే తుమ్బురుసంజ్ఞకే ।
స్నాత్వా త్రిషవణం పుణ్యాం । సాలగ్రామశిలాం నృప ! ॥ 44

నారసింహాత్మికాం దివ్యాం । సకరాలా మధోముఖామ్ ।
" నిత్య మారాధయేయా హ " । మితి నిశ్చిత్య పూజయన్ ॥ 45

పూజాన్తే స్వశిరఃపుష్పం । ఖడ్గేనా హృత్య భూపతే ! ।
సమర్పయామాస తతః । తచ్ఛిరః పునరాగతమ్ ॥ 46

ఏవం పఞ్చ సహస్రాణి । వర్షాణి విగతాని చ ।
తస్మిన్ కాలే ఒరవిన్దాక్షః । ప్రత్యక్షః సమజాయత ॥ 47

శిలాన్తర్యామిభగవాన్ । శ్రీనివాసః సతాం గతిః ।
త మాలోక్య హృషీకేశం । వృషభో దణ్డవ ద్భువి ॥ 48

## వృషభాచల మను పేరు వచ్చుట

పూర్వము దారుణకృత్యముల నొనరించుచు వృషభు డను రాక్షసుడు శేషాద్రి నాక్రమించుకొని మునీంద్రులను బాధింపసాగెను. 39

అతని బాధలచే తపోభంగము కలుగుటంజేసి భక్తుల కభయము నొసంగు వాడును, 40

సకలప్రాణికోటి ఉత్పత్తికి కారణభూతుడును నగు శ్రీనివాసుని సంతోషాంత రంగములతో స్తుతించగా వారి యెదుట భగవంతుడు ప్రత్యక్షమాయెను. మునీంద్రు లాతనిని పరిపరివిధముల స్తుతించుచు నిట్లు విన్నవించిరి. 41

మహర్షి —

పద్మపత్రేక్షణా! వృషభాసురుడు కఠినాత్ముడై దుష్టుడై మా తపస్సునకు విఘ్నము నొనరించుచు బాధించుచున్నాడు. 42

కావున ఆ రాక్షసునివలన సంభవించిన భయమును తొలగించి కాపాడుమని ప్రార్థింపగా భగవంతు డందుల కంగీకరించి రాక్షసుని కోపముతో తరిమివేసెను. 43

ఆ పరాక్రమశాలి యగు రాక్షసుడు తుంబురుతీర్థమున మూడువేళలయందు స్నానమాచరించి పవిత్రముగ 44

దివ్యమును, భయంకరమైనదియు క్రిందబిలముగల సాలగ్రామశిలను "నేను నిత్యమారాధింతున"ని నిశ్చయించి పూజించుచు 45

పూజను పూర్తిగా నొనరించినపిమ్మట తన శిరమనెడు పుష్పమును ఖడ్గముతో ఖండించి భగవంతుని కర్పించెను, ఆ శిర మటులనే మరలవచ్చి నిలచెను. 46

ఈ విధముగా నయిదువేల సంవత్సరము లతిక్రమించగా 47

శిలలో నంతర్యామిగా నున్నట్టియు సత్పురుషులకు పొందదగినవాడునగు శ్రీని వాసుడు ప్రత్యక్షమాయెను. వృషభాసురు డాతనిని గాంచినంతనే కఱ్ఱవలె భూమిపైబడి 48

పపాత రాజశార్దూల ! । స విసంజ్ఞా ముపేయివాన్ ।
ముహూర్తా త్తే సముత్థాయ । ప్రత్యభాషత కేశవమ్ ॥ 49

వృషభః —

కేశవా నన్త ! గోవిన్ద ! । శ్రీనివాస ! సురో త్తమ ! ।
న చ మోక్షం న చ స్వర్గం । పారమేష్ఠ్యపదం హరే ! ॥ 50

న యాచే జగతాం నాథ ! యుద్ధభిక్షాం చ దేహి మే ।
దశావతారవిభవే । శ్రుత స్తేవిక్రమో హరే ॥ 51

అద్య తం సత్య మాధత్స్వ । విక్రమం పురుషో త్తమ ! ।
దేవ స్తద్భారతీం శ్రుత్వా । కిఞ్చి ద్ధాస్యముఖో హరిః ॥ 52

ఉవాచ వచనం తం హి । రాక్షసం యుద్ధదుర్మదమ్ ।
శ్రుత్వా తదు క్తవాన్ కృష్ణః । 'తథా ఒ స్త్వి' త్యరిమర్దనః ॥ 53

తయో ర్యుద్ధ-మభూ త్త్ర త । వృషభశ్రీనివాసయోః ।
యత్కృతం శ్రీనివా సేన । తత్కృతం వృషభేణ చ ॥ 54

త దద్భుత మభూ త్త్ర త । దేవానాం పశ్యతా మపి ।
త ద్యుద్ధకౌశలం దృష్ట్వా । భగవాన్ పర్యపూజయత్ ॥ 55

భో రాక్షసకులోత్పన్న ! । పశ్య మే పౌరుషం బలమ్ ।
ఇ త్యుక్త్వా దర్శయామాస । గరుడం వికృతాకృతిమ్ ॥ 56

తత్రస్థం వాసుదేవ ఞ్చ । విశ్వరూపిణ మవ్యయమ్ ।
సహస్రభుజసంయు క్తం । సహస్రాయుధభూషితమ్ ॥ 57

తన్మాయాం రాక్షసో దృష్ట్వా । స్వయ ఞ్చ గరుడం హరిమ్ ।
దర్శయన్ వ్యఞ్జయామాస । స్వమాయాం సురమోహినీమ్ ॥ 58

న క్తఞ్చరస్య చరిత । మతిక్రాన్తుం క్షమో ఒవ్యయమ్ ।
ప్రశంసన్ రాక్షసం వీరం । 'సాధు సాధ్వి' త్యభాషత ॥ 59

చైతన్యము లేకయుండెను. కొద్దిసమయము గడచినంతనే లేచి శ్రీమన్నారాయ ణునితో 49

వృషభాసురుడు —

కేశవా ! అనంతా ! గోవిందా ! శ్రీనివాసా ! దేవాధిదేవా ! నేను మోక్షమును, స్వర్గమును, బ్రహ్మలోకము 50

నభిలషింపను. నాకు యుద్ధమును ప్రసాదింపుము. నీ పరాక్రమమును దశావతార వైభవమున వింటిని. 51

నేడా పరాక్రమమును సత్యమొనరింపుమ'ని కోరగా శ్రీమన్నారాయణు డావాక్య మును విని మందస్మితవదనారవిందుడై 52

యుద్ధమునందు దుష్టవ్యామోహముచే గర్వించిన రాక్షసునితో నట్లే యగుగాక యని పలికెను. 53

శ్రీనివాసుడును, వృషభాసురుడును ఒకరినొక రనుకరించుచు యుద్ధము నొనర్చిరి. 54

ఆ యుద్ధ మత్యంతాశ్చర్యకరమాయెను. దేవత లందరును చూచుచుండిరి. అపు డా యుద్ధమునందలి నేర్పరితనమునుగాంచి శ్రీనివాసుడు ఆతని నాదరించుచు 55

రాక్షసవంశసంజాతుడవగు వృషభాసురా ! నా బలమును, పౌరుషమును గాంచు మ'ని భయంకరాకారముగల గరుడుని 56

విశ్వరూపధారియు, నాశరహితుడును వేయిభుజములును, వాటియందు వేయి ఆయుధములచే నలంకరింపబడిన వాసుదేవుని చూపించెను. 57

రాక్షసు డా మాయను గరుడుని, హరినిగాంచి దేవతలను గూడ మోహపరచు తన మాయను ప్రయోగించెను. 58

రాక్షసుని మాయను జయింపజాలియు శ్రీనివాసు డాతనిని "చాల బాగున్నది, చాల బాగున్నద'ని స్తుతించుచు 59

రే రే రాక్షసవర్యా ద్య । చక్రేణ శతనేమినా ।
హరిష్యే తే శిరః కాయాత్ । యథా పక్వఫలం ద్రుమాత్ ॥ 60

ఇ త్యుక్తో దేవరాజేన । వృషభో దణ్డవద్భువి ।
ప్రణిపత్యా హ విశ్వేశం । అస్తువ ద్రాక్షసేశ్వరః ॥ 61

వృషభః —

చక్రపాణే నమ స్తుభ్యం । చక్రస్య చరితం శ్రుతమ్ ।
య చ్చక్రేణ ప్రత ప్తస్తు । ము క్తి మేతి న సంశయః ॥ 62

య చ్చక్రేణ పురా రాజా । కీ ర్తిమాన్ కీ ర్తి మా ప్తవాన్ ।
త్వచ్చక్రేణ హతో రాజన్ ! । గచ్ఛామి తవ మన్దిరమ్ ॥ 63

ఏవ ముక్త్వా హరేః పాదౌ । పస్పర్శ వృషభాసురః ।
వరం యయాచే వృషభః । "శై లో మదభిధో ఽ స్త్వి తి" ॥ 64

సమాలిఙ్గ్య "భవే దేవ" । మి త్యుక్త్వా హరిణా ఽథ సః ।
విసృష్టచక్ర సఞ్ఛిన్నః । త్య క్తవాన్ న కలేవరమ్ ॥ 65

తస్మా ద్వృషభశై లో ఽయం । కృతే ఖ్యాతి ముపేయివాన్ ।

జనకః —

కథ మఞ్జనశై లే తి । త్రేతాయాం నామ మే వద ॥ 66

## త్రేతాయుగేఽఞ్జనాచలనామనిష్ప త్తిః

శతానన్దః —

పురా కేసరిణః పత్నీ । హ్యఞ్జనా కఞ్జలోచనా ।
అనపత్యత్వదుఃఖేన । మతఙ్గముని మాగమత్ ॥ 67

అనమ్య మునిశార్దూల । అనపత్యా తికర్శితా ।
ఉవాచ వచనం నేత్ర । నీరసి క్తకలేవరా ॥ 68

అఞ్జనా —

రాక్షసా ! నీ శిరమును నీ శరీరమునుండి పండిన ఫలమును చెట్టునుండి రాల్చు నటుల నా మూరంచులుగల చక్రాయుధముచే సంహరింతున'ని పలుకగా 60

వృషభాసురు డాతనికి సాష్టాంగముగ నమస్కరించి 61

వృషభాసుడురు —

శ్రీమన్నారాయణా ! నీ చక్రమాహాత్మ్యము నిదివరలో వినియుంటిని. నీ చక్రముచే తపింపబడినవారికి ముక్తి లభించు ననుటలో సంశయములేదు. 62

కీర్తిమంతుడను రాజు నీ చక్రముచే దునుమబడి కీర్తిని గాంచెను. నీ చక్రముచే దునుమబడిన నేనును మోక్షసామ్రాజ్యము నలంకరింతున'ని 63

పలికి శ్రీమన్నారాయణుని పాదములను స్పృశించెను. మరియు "ప్రభూ ! ఈ పర్వతము నా పేరున బరగునుగాక !" యని ప్రార్థించెను. 64

శ్రీనివాసుడాతని నాలింగన మొనర్చుకొని చక్రముతో నాతని శిరమును ఖండించగా వృషభాసురుడు మృతినందెను. 65

జనకుడు —

కావున నీ పర్వతము కృతయుగమున వృషభాద్రియను నామముతో, వ్యవహరింపబడున'ని శతానందుడు తెలుపగా జనకుడు త్రేతాయుగమున "అంజనశైలమను" పేరెట్లు కలిగెనో తెలుపుమని యడుగగా శతానందుడిట్లు తెలిపెను. 66

## త్రేతాయుగమున అంజనాచలమను పేరు కలిగిన విధము

శతానందుడు —

పూర్వము కేసరి భార్యయు పద్మనేత్రయగు అంజనాదేవి సంతానము లేక దుఃఖించుచు మతంగముని సమీపమునకు వచ్చెను. 67

ఆ మునిపుంగవునకు నమస్కరించి కంటినీరు శరీరమును తడుపుచుండ 68

అంజనాదేవి —

అహో తాపసశార్దూల! । అపుత్రాయా మమ కా గతిః ? ।
ఏవ ముక్తో ఒఞ్జనా దేవ్యా । మతఙ్గో వాక్య మబ్రవీత్ ॥ 69

మతఙ్గః —

పమ్పాయాః పూర్వదిగ్భాగే । పఞ్చాశద్యోజనాన్తరే ।
నారసింహాశ్రమం దేవి! । వర్తతే వసుధాతలే ॥ 70

తస్య దక్షిణదిగ్భాగే । నారాయణగిరే స్థితే ।
ఉత్తరే స్వామితీర్థస్య । వర్తతే క్రోశమాత్రకే ॥ 71

వియద్గఙ్గే తి విఖ్యాతా । తత్ర గచ్ఛ యథాసుఖమ్ ।
తత్ర స్నాత్వా ఒథ కల్యాణి । ద్వాదశాబ్దం తప శ్చర ॥ 72

తేన పుణ్యేన తే పుత్రో । భవిష్యతి గుణాధికః ।
మతఙ్గే నైవ ముక్తా సా । నారాయణగిరిం యయౌ ॥ 73

కృత్వా స్వామిసరః స్నానం । అశ్వత్థస్య ప్రదక్షిణమ్ ।
వరాహరూపిణం నత్వా । పీత్వా తత్సలిలం శుభమ్ ॥ 74

ఆకాశగఙ్గా మాసాద్య । తపః కర్తుం ప్రచక్రమే ।
మునిం శ్చా మస్త్ర్య భర్తారం । వ్రతార్థం భక్ష్యవర్జితా ॥ 75

ఉపవాసరతా బాలా । బాహ్యభోగవివర్జితా ।
కాష్ఠవత్ పర్యవస్థాప్య శరీరం స్వాత్మనఃశుచి ॥ 76

పూర్ణే సంవత్సరే జాతే । వాయుదేవో మహాబలః ।
ఫల మాహృత్య భక్ష్యార్థం । ప్రత్యహం హ్యా దదా న్మరుత్ ॥ 77

అథై కస్మిన్ దినే వాయుః । ఫలే వీర్య మపూరయత్ ।
వీర్యగర్భం ఫలం తస్యాః । ప్రాక్షిప త్కరసమ్పుటే ॥ 78

ఫలం సా మన్యమానా హి । క్షుదార్తా తదభక్షయత్ ।
తతో గర్భః సముదభూత్ । అఞ్జనాయా శ్చ భామిప! ॥ 79

మునీంద్రా ! సంతానహీనురాలనగు నా గతియేమి ? యని విలపింపగా మతంగ మహర్షి 69

మతంగుడు —

"పంపానదికి తూర్పుదిశలో నైదువందల యోజనముల దూరమున భూమిపై నారసింహాశ్రమము కలదు. 70

దానికి దక్షిణదిశలో నారాయణాద్రి తీరమున స్వామితీర్థమున కుత్తరభాగమున క్రోశమాత్రదూరమున 71

ఆకాశగంగ ప్రసిద్ధమై యలరారుచున్నది. అచ్చటికి సుఖముగా జేరి అందు స్నానమాచరించి పండ్రెండు సంవత్సరములు తపమొనరింపుము. 72

ఆ పుణ్యముచే నీకు సద్గుణవంతుడగు పుత్రుడు కలుగున'ని పలుకగా నామె నారాయణగిరికేగి 73

స్వామితీర్థమున స్నానమాచరించి రావివృక్షమునకు ప్రదక్షిణము నాచరించి వరాహస్వామికి నమస్కరించి స్వామిపుష్కరిణీ తీర్థమును త్రావి 74

మతంగమునియొద్దను తన భర్తయొద్దను అనుజ్ఞను బడసి ఆకాశగంగనుజేరి వ్రతమునకై యాహారమును వీడి 75

ఉపవాసమొనరించుట యందాసక్తి కలదై శారీరక భోగముల నన్నిటిని వీడి పవిత్రమైన తన శరీరమును కఱ్ఱవలె దృఢముగా నిలిపి తపమొనర్చుట కారంభించెను. 76

అట్లు సంవత్సరము గడచినంతనే మహా బలవంతుడగు వాయుదేవు డామె భుజించుటకై ఫలము ననుదినమొసంగుచుండెను. 77

అంత నొక దినమున వాయువు ఫలములో తన వీర్యమునుంచి యా ఫలము నంజనాదేవి దోసిలియందుంచెను. 78

ఆమె యాకలిగొన్నదై దానిని సామాన్యఫలమని తలంచి భుజించెను. అనంతర మామెకు గర్భము కలిగెను. 79

3

మునినా మఘవ ద్దర్శో । వాయో ర్గర్భసముద్భవః ।
అథ సా దశమాసా న్తే । సుషువే పుత్ర ముత్తమమ్ ॥ 80

హనూమ న్త మిమం ప్రాహుః । మునయో వీతకల్మషాః ।
అఞ్జనా వ్రత మాస్థాయ । పుత్రం ప్రాప గిరీశ్వరే ।
తస్మా దఞ్జనశైలో ఽయం । లోకే విఖ్యాతకీ ర్తిమాన్ ॥ 81

## ద్వాపరేయుగేశేషాచలనామనిష్పత్తిః

జనకః —

సన్తోషో హ్యా భవ న్మహ్యం । శ్రుత్వా తన్నామకారణమ్ ।
ద్వాపరే శేషశైలేతి । కథం ఖ్యాతి ర్భవిష్యతి ॥ 82

శతానన్దః —

పురా వైకుణ్ఠనగరే । ద్వారి శేషం సమాదిశత్ ।
జానన్ భగవతో భావం । సో ఽతిష్ఠత్ భావికర్మణి ॥ 83

చిక్షిప్తే మారుతేన । ద్వారి జాగ్ర త్కుతూహలీ ।
దేవాధిదేవో భగవాన్ । రేమే చ రమయా సహ ॥ 84

తస్మి న్కాలే మహారాజః । మారుత స్తు కదాచన ।
అకస్మా త్కారణాత్ ప్రాప్తో । భగవ న్తం జనార్దనమ్ ॥ 85

ద్వారే తం రోధయామాస । రుక్మదణ్డేన సర్పరాట్ ।
" కి మర్థం రుద్ధ్యతే మూర్ఖ! । కార్యస్య మహతీ త్వరా ।
ఇత్యుక్తే వాయునా శేష । ఉవాచ వచనం పునః ॥ 86

శేషః —

" అహ మాజ్ఞాధరో విష్ణో । ర్మా త్వ మ న్తఃపురం గమః " ।
ఇతి తస్య వచః శ్రుత్వా । జగత్ప్రాణో ఽబ్రవీ దిదమ్ ॥ 87

వాయుః —

వాయువువలన గర్భము కలిగెనని మును అందరును సంతసించిరి. అనంతర మామెకు పదినెలలు నిండినంతనే పుత్రరత్న మావిర్భవించెను. 80

ఆ బాలునకు పాపదూరులగు మునీంద్రులు హనుమంతుడను నామము నుంచిరి. అంజనాదేవి వ్రతము నాచరించి పర్వతరాజమున పుత్రుని గనియుండుటచే నీ పర్వత "మంజనాద్రి" యను ప్రఖ్యాత నామమును గాంచెను. 81

## ద్వాపరయుగమున శేషాచల మను పేరు కలుగుట

జనకుడు —

జనకచక్రవర్తి యా చరిత్రమును విని "మునీంద్రా! అంజనాద్రి యను పేరు కలుగుటకు గల కారణమును విని చాల సంతసము కలిగెను. ద్వాపరయుగమున "శేషశైల" మను పేరెట్లు ప్రసిద్ధి కెక్కెనో తెలుపుడ'ని యడిగెను. 82

శతానందుడు —

పూర్వము వైకుంఠనగర ద్వారరక్షణకై శ్రీమన్నారాయణుడు శేషుని నియోగించెను. 83

ఆతడును వాయువుచే నాచరింపబడు కాగలకార్యమునందు భగవంతుని మనోగతము నెఱింగినవాడై జాగరూకతతో సంతోషముగా ద్వారరక్షణ మొనర్చుచుండగా సర్వదేవవంద్యుడగు శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవితో క్రీడించుచుండెను. 84

ఆ సమయమున వాయువు హఠాత్తుగా ప్రాప్తించిన కారణముచే శ్రీమన్నారాయణుని సన్నిధికేతెంచెను. 85

దారిలో నాదిశేషుడాతనిని బంగారుదండముతో నడ్డగించెను. వాయువంతట "మూర్ఖా! ఎందులకు నన్నడ్డగించుచున్నావు? నాకు చాల తొందరపనియున్నద'ని పలుకగా నాదిశేషుడు— 86

శేషుడు —

నేను శ్రీమన్నారాయణుని యాజ్ఞాపరిపాలకుడను. నీ వంతఃపురమున ప్రవేశింపజనద'ని నుడువగా వాయువు— 87

వాయువు —

జయ స్తు విజయ శ్చైవ । సంశప్తౌ మునిభిః పురా ।
అహఙ్కారేణ తౌ జాతౌ । కుమ్భకర్ణదశాననౌ ॥ 88

విస్మృతా కిం త్వయా మూర్ఖ ! । ద్వారపత్యే నియోజితౌ ।
తద్వాక్యా న్తే చ రాజేన్ద్రః ! । ప్రజజ్వాల విషోల్బణః ।
గర్హాయన్ వచనై స్తీక్ష్ణైః । జగత్ప్రాణ మహీశ్వరః ॥ 89

శేషః —

కిం గరిష్ఠం వచః ప్రోక్తం । జీవనేచ్ఛా న విద్యతే ? ।
తారేనా నుగతో లోకో । నైవ జానాతి మోహితః ॥ 90

త్వం తాదృ ఙ్నరవ ద్దణ్డ్యో । వృథా మోహా త్ప్రభాషసే ।
బలే జ్ఞానే విరాగే చ । విష్ణుభక్తౌ న మత్సమః ॥ 91

సదా మే ఽన్తఃపురే వాసః । పుత్రా దప్యధికో హరేః ।
లోకానా ఞ్చ హితార్థాయ । హితార్థం జగదీశతుః ।
స్థాపితో ఽస్మి ద్వారపత్యే । లక్ష్మ్యా నారాయణేన చ ॥ 92

వాయుః —

బిడాలో ఽన్తఃస్థితో వా పి । బహిస్థేభసమో న హి ।
శయానం రత్నపర్యఙ్కే । రాజాన మపి సేవతే ॥ 93

కశ్చి ద్దూతో నియుక్త స్తు । పర్యఙ్కాధిష్ఠిత స్స్వయమ్ ।
కి మాధిక్యం తస్య శేష ! । పుత్రే కాన్యూనతా వద ॥ 94

తయో ర్వివాదో హ్యభవత్ । శేషవాయ్వో ర్మహాత్మనోః ।
లక్ష్మ్యా ఽవబోధిత శ్శ్రీమాన్ । ఉత్తస్థౌ గరుడధ్వజః ॥ 95

కిమర్థం క్రోశసే శేష ! । కః పుమా నాగతః పరః ।
ఇత్యుక్తో దేవదేవేన । ఫణిరాజో ఽభ్యభాషత ॥ 96

శేషః —

బుద్ధిహీనుడా! ద్వారపాలకులుగా నియమించబడిన జయవిజయు లహంకార ముతో ప్రవర్తించుటవలననేగదా మునులచే శపింపబడి రావణ కుంభకర్ణులైరను వృత్తాంతమును మరచితివా? యని పరిహసింపగా నాదిశేషుడు పరుషవాక్కులతో వాయువును నిందించుచు విషమును క్రక్కుచు మండిపడసాగెను. 88-89

శేషుడు —

మరియు వాయువుతో— పెద్దమాటల నాడుచుంటివే? నీకు బ్రతుకునం దాశ లేనటులున్నదే? ప్రాణికోటి మృత్యువు వెన్నంటి వచ్చుచున్నను మోహాంధులై తెలియ జాలకున్నారు, 90

నీవు నట్టి వివేకహీనుడగు మనుజునివలెనే దండింపబడదగినవాడవు. నీ వజ్ఞానముచే వదరుచున్నావు. ఏ విష్ణుభక్తుడును బలమునందు జ్ఞానమునందు వైరాగ్యమునందు నాకు సాటిగా జాలడు. 91

నే నెల్లవేళలయందు నంతఃపురమున వసించుటంజేసి శ్రీమన్నారాయణునకు నాయందు పుత్రునికంటె ప్రీతి యత్యధికముగా నున్నది. లోకమునకును శ్రీమన్నారాయణునకును మేలుచేయు కోరికతో లక్ష్మీనారాయణులచే నేను ద్వారపాలకుడిగా నియోగింపబడితి న'ని గర్వముగా పలికెను. 92

వాయువు —

అంత వాయువు— పిల్లి ఇంటిలో నుండినను బయట సంచరించు మత్తగజమునకు సరిరాదు. రత్నములచే కూర్చబడిన మంచమున పవళించియున్న రాజును 93

వేతనమునకై నియోగింపబడిన భృత్యుడు తానును (కాళ్లు పిసుకుటకై) మంచమున కూర్చుండి సేవించినను రాజపుత్రునికంటె గొప్పవాడు కాజాలడ'ని వచించెను. 94

ఇట్లు వా రిరువురకును వాదవివాదములు జరుగుచుండగా శ్రీమన్నారాయణుడు లక్ష్మిచే మేల్కొలుపబడి లేచి 95

'ఆదిశేషా! ఎందుల కట్లరచుచున్నావు? పరపురుష డెవ్వడైన నరుదెంచెనా? యని యడుగగా నాదిశేషుడు 96

శేషుడు —

మలయాచలవాస స్తు । వాయు రత్యన్తగర్వితః ।
అకాలే ఽన్తఃపురం శీఘ్రం । ప్రవేష్టు మిచ్ఛ సముద్యతః ॥ 97

అవాచ్యవచనం ప్రోక్తం । అనేనా త్యన్తమానినా ।
ఇత్యా హూతః ఫణీన్ద్రేణ । భావజ్ఞేన తదా హరిః ॥ 98

సంజ్ఞాపయ న్నిజం భావం । ఇఙ్గితైః ద్వార మాయయా ।
ఏతస్మి న్నేవ కాలే తు । సాష్టాఙ్గం ప్రణిపత్య తమ్ ॥ 99

వాయు స్తుష్టావ పురుషం । పురాణం వేదగోచరమ్ ।
వాయు మాలోక్య వచనం । వారిజాక్షో ఽబ్రవీ త్స తమ్ ॥ 100

భగవాన్ —

కిమర్థం కలహః పుత్ర ! । శేషేణా త్యన్తమానినా ।
ఇత్థం హరే ర్వాగమృతం । పీత్వా కర్ణపుటద్వయాత్ ।
తూష్ణీం బభూవ నృపతే ! । వాయు రత్యన్తభక్తిమాన్ ॥ 101

శేషః —

అహం సమర్థో భగవన్ ! । బలే జ్ఞానే తవ ప్రియే ।
మత్సమో నాస్తి భూలోకే । నాకే వా బ్రహ్మసద్మని ॥ 102

సరీసృపవచః శ్రుత్వా । ప్రహసన్ ఫణినం హరిః ।
'సాధు సాధ్వి' తి సమ్భావ్య । చో వాచ ఫణినాం పతిమ్ ॥ 103

శ్రీ భగవాన్ —

న వాఙ్మాత్రేణ పౌరుష్యం । క్రియా కేవల ముత్తరమ్ ।
బలాబలే పరీక్ష్యన్తాం । దేవా శ్చే న్ద్రపురోగమాః ॥ 104

అత్రై వో త్తరదిగ్భాగే । పర్వతం మేరునన్దనమ్ ।
స్వకాయరజ్జునా బద్ధ్వా । బలం తే యావ దస్తి హి ॥ 105

తావతై వ బలేన త్వం । సంయుక్తః సుస్థిరాఽత్మనా ।
తిష భద్ర ! మహాభాగ ! । విషపూత్కారజృమ్భితః ॥ 106

మలయాచలమున నివసించు వాయువత్యంత గర్వము కలవాడై వేళకానివేళ యందంతఃపురమున ప్రవేశించుటకు ప్రయత్నించుచున్నాడు. 97

దురహంకారుడై యీతడు పలుకరాని మాటలనాడుచున్నాడ'ని మనోభిప్రాయము నెఱుంగగల ఆదిశేషుడు శ్రీమన్నారాయణుని పిలువగా 98

తన యభిప్రాయమును చేష్టలచే తెలుపుచు శ్రీమన్నారాయణుడు ద్వారమువద్దకు చనుదెంచెను. ఈ సమయముననే వాయువు శ్రీమన్నారాయణునకు సాష్టాంగముగా నమస్కరించి 99

వేదములచేతనే సాక్షాత్కరింపదగిన పురాణపురుషుడగు పరమాత్మను స్తుతించెను. అంత శ్రీమన్నారాయణుడు వాయువుతో— 100

భగవానుడు —

నాయనా ! నిరవధికాహంకారియగు శేషునితో కలహించుటకు హేతువేమ'ని యడుగగా భగవంతునియందపార భక్తియుక్తుడగు వాయువు శ్రీమన్నారాయణుని యమృత తుల్యములగు మాటలను వీనులవిందుగా నాలకించి మిన్నకుండెను. 101

శేషుడు —

శేషుడు శ్రీమన్నారాయణునితో - కల్యాణగుణధామా ! నేనత్యంత బలశాలిని. బలమున జ్ఞానమున నీ యనురాగమున నాతో సమానులు భూలోకమునకాని, స్వర్గలోకమున కాని, బ్రహ్మలోకమునగాని యుండజాలడ'ని పలుకగా 102

శ్రీమన్నారాయణుడు నవ్వుచు "బాగున్నది, బాగున్నద'ని, యాతనిని గౌరవించి యాతనితో 103

శ్రీభగవానుడు —

మాటలతో మాత్రమే పౌరుషము చూపుటకన్న చేష్టలతో పౌరుషమును చూపుటయే సరియగు సమాధానమగును కాన నింద్రుడు మున్నగు దేవతలందరును మీ శౌర్య పరాక్రమముల పరీక్షింతురుగాక ! 104

ఇచ్చటనుండి యుత్తరదిక్కున మేరుపుత్రుడగు ఆనందాద్రి కలదు. నీ బలమునంతను ఉపయోగించి నీ శరీరమనెడు త్రాటితో బంధించి 105

కదలక నిలచి విషమును వెదజల్లెడు బుసలతో గర్వించుచు నిలచియుండుమ'ని యాజ్ఞాపించెను. 106

హృషీకేశవచః శ్రుత్వా । హృష్టపుష్టాఙ్గవిగ్రహః ।
స్వకాయరజ్జునాబధ్నన్ । ఆనన్దాద్రిమహీశ్వరః ॥ 107

స్థిరో బభూవ చామన్త్ర్య । వాయుం వేగవతాం వరమ్ ।
త మాలోక్యా గ్నిదయితః । పర్వతం తము పాగతః ॥ 108

ఆజ్ఞయా వాసుదేవస్య । దేవానాం పశ్యతాం సతామ్ ।
స్వస్మిన్ భగవతః ప్రీతిం । మత్వా ఽతిశయితాం మరుత్ ॥ 109

మదోద్ధతో మహావేగం । చక్రే పర్వతచాలనే ।
న చకమ్పే గిరిః కిఞ్చిత్ । అపి శేషేణ వేష్టితః ॥ 110

తతో ఽపి సుమహావేగం । చక్రే వాయుః ప్రకోపనః ।
సంస్పర్ధమానయో రిత్థం । శేషవాయో ర్మహాత్మనోః ॥ 111

హాహాకారో జగత్యా సీత్ । అధరో త్తరితే తథా ।
తతో బ్రహ్మాదిభి ర్దేవైః । యాచితో ఽపి యదా మరుత్ ॥ 112

ప్రపేదే న శమం కిఞ్చిత్ । తదా ఽసౌ ఫణినాం పతిః ।
జానన్ భగవత శ్చాపి । భావం దేవాం శ్చ తోషయన్ ॥ 113

క్వచి త్ఫణా న్తరం కిఞ్చిత్ । శ్లథయామాస వై విభుః ।
తతః ప్రకుర్వతో వేగం । మారుతస్య మహాత్మనః ॥ 114

కనిష్ఠాఙ్గుళిమాత్రే తు । ప్రదేశే శ్లథబన్ధనే ।
మహావేగస్య సమ్పర్కాత్ । పర్వతో భోగిసంయుతః ॥ 115

యోజనా న్యతిలక్షాణి । దక్షిణాభిముఖో యయౌ ।
మేరు స్తుష్టావ నృపతేః । బలదేవం మహాబలమ్॥ 116

“త్రాయతాం త్రాయతాం స్వామిన్ । పుత్రం బాలం భవా న్మమ ।
ఏవ ముక్తో మేరుణా ఽయం । తత్పుత్రం పర్యపాలయత్ ॥ 117

ఆ మాటల కాదిశేషుడానందాతిశయముచే శరీరముప్పొంగగా తన శరీరమనెడు త్రాటితో నా పర్వతమును బంధించి 107

కదలక నిలచియుండి వేగవంతులలో నగ్రగణ్యుడగు వాయుదేవుని రమ్మని పిలచెను. అంత నా వాయువాతనిని జూచి యా పర్వతప్రాంతమున కేగెను. 108

శ్రీమన్నారాయణుని యాజ్ఞచే దేవతలందరు చూచుచుండగా - తనయందు భగవంతునకు, కలయత్యంతానురాగమును తలంచి 109

బలగర్వితుడై పర్వతమును కదలింపవలెనని గొప్ప వేగమును చూపెను. కాని ఆదిశేషునిచే చుట్టబడియుండుటచే కొంచెమైనను పర్వతము కదలకుండెను. 110

అందులకు మిక్కిలి కోపించి వాయువు మునుపటికంటె యధికవేగముతో విజృంభించెను. ఈ విధముగా వాయువు నాదిశేషుడును తగవులాడుచుండ 111

జగత్తంతయు తారుమారగుచుండగా హాహాకారములుప్పతిల్లెను. అనంతరము బ్రహ్మాదిదేవతలచే వేడుకొనబడియు వాయువుపశమింపకపోవుటచే 112

నాదిశేషుడు భగవంతుని సంకల్పము నెఱింగి యుండుటచేతను, దేవతలను సంతసపరచు నుద్దేశ్యమునను 113

పర్వతమున నొక ప్రదేశమున తన పడగను సడలించెను. అమితవేగమును కనుపరచుచున్న వాయుదేవుని 114

వేగాతిశయము, చిటికెనవ్రేలుమాత్ర ప్రదేశమున పడగ వదులుగా నుండుటం జేసి యచట తాకినంతనే ఆదిశేషునితో గూడ నా పర్వతము 115

దక్షిణదిశగా ననేక లక్షల యోజనముల దూరమున కెగిరిపోయెను. మేరువంతట వాయుదేవుని స్తుతించి 116

స్వామీ! నా పుత్రుని నీవు రక్షింపవలెన'ని ప్రార్థింపగా వాయు వానందాద్రిని రక్షించెను. 117

స్వర్ణముఖ్యాః మహానద్యాః । ప్రతీరే చ తథో త్తరే ।
స్థాపయామాస రాజేన్ద్ర! గిరిరాజం సపన్నగమ్ ॥ 118

తతో వాయుం సురగణాః । బోధయామాసురాదరాత్ ।
అయం శేషాంశజో వాయో । శైలః శైలాత్మజేశ్వరః ॥ 119

హరేః సఞ్చోదనేనై వ । జాతః స్వావాసహేతవే ।
వ్యాజేనైవ త్వయా నీతః । తేన స్వర్ణముఖీతటమ్ ॥ 120

త్వత్సంవాదచ్ఛలే నైషః । స్వస్థానోత్థానితో ఽహినా ।
మాయావీ భగవా నిత్థం । కేవలంత్వాం వ్యపోహయత్ ॥ 121

త దద్య ఫణిరాజం త్వం । అన్తరఙ్గం హరే రిమమ్ ।
ప్రసాదయా పరాద్ధో ఽసి । వృథా తస్మిన్ మహాత్మని ॥ 122

ఇతి సమ్బోధితో దేవైః । హితకాఙ్క్షిభి రాదరాత్ ।
శేషం గతమదః పశ్చాత్ । తుష్టావ మరుతాం పతిః ॥ 123

క్షమస్వ మమ దౌరాత్మ్యం । అజ్ఞానే నాఽఽగతం విభో ! ।
త్వయి హ భగవాన్ సాక్షాత్ । ఆగమిష్యతి వై హరిః ॥ 124

మయా ఉపచరితం మౌర్ఖ్యాత్ । మహాభాగే వృథా త్వయి ।
ఇత్థం ప్రసాదయామాస । ఫణిరాజం తదా మరుత్ ॥ 125

నిర్వైరత్వాత్ ప్రసాదం స । చకార మరుతి స్వయమ్ ।
ఇత్థం శేషాంశజం శైలం । శేషేణపరివేష్టితమ్ ॥ 126

స్వావాసహేతో ర్హరిణా । వాహితం వాయునా ఛలాత్ ।
రాజన్ ! శేషనిమిత్తేన । శేషాచల మిమం విదుః ॥ 127

కలియుగే శ్రీవేఙ్కటాచలనామనిష్పత్తిప్రకారః

జనకః

కథం వేఙ్కటశైలేతి । కథం నామ మహామునే ! ॥ 128

స్వర్ణముఖీనదికుత్తరతీరమున నాదిశేషునితో కూడిన పర్వతమును నిలపెను. 118

శ్రేయోభిలాషులగు దేవతలాదరముగా వాయువుతో - మేరుపర్వతపుత్రుడగు నీ యానందాద్రి ఆదిశేషుని యంశమున పుట్టినది. 119

శ్రీమన్నారాయణుని ప్రేరణముచేత నివాసయోగ్యముగా నిట్లు కల్పింపబడినది. నీ విందు నిమిత్తమాత్రుడవే. 120

మీ వాదోపవాద వ్యాజముచే నీ పర్వతము తననివాసమునుండి శేషునిచే పెకలింపబడినది. మాయాస్వరూపుడగు శ్రీమన్నారాయణుడు నిన్ను కేవలము భ్రమింపజేసెను. 121

కావున నీవిపుడు శ్రీమన్నారాయణున కత్యంత ప్రీతిపాత్రుడగు నాదిశేషుని అనుగ్రహింపజేసికొనుము. అవసరముగా నా సజ్జనునియం దపరాధము నొనర్చియున్నావని యాతని హితమునుగోరి ఆదరముతో తెలుపగా 122

వాయువు గర్వమును వీడి యాదిశేషుని స్తుతించెను. 123

ప్రభూ ! అజ్ఞానముచే నేనొనర్చిన దుష్కృత్యమును క్షమింపుము. సాక్షాత్ శ్రీమన్నారాయణుడు నీ యందధివసించును. 124

పూజ్యుడవగు నీ విషయమున నకారణముగా నపరాధము నొనరించితి'నని యాదిశేషుని కోపమును పోగొట్టి యనుగ్రహించునటుల నొనర్చెను. 125

ఒండొరులయందు తగవులు లేకుండుటంజేసి యాదిశేషుడును వాయువునందు ప్రీతికలిగియుండెను. ఇట్లాదిశేషుని నంశచే బుట్టి యాతనిచే చుట్టబడిన శేషాచలము 126

తన నివాసమునకై శ్రీమన్నారాయణుడే వాయువుచే వ్యాజముగా తెప్పించుకొనెను. శేషుని యంశమగుటచే నీ పర్వతము శేషాచలమను సుప్రసిద్ధ నామము నందెను.

## కలియుగమున శ్రీ వేంకటాచలమను పేరుకలిగిన విధము

జనకుడు —

ఇట్లు శతానందుడు తెలుపగా జనక చక్రవర్తి "వేంకటాచలమని కలియుగమున పేరెట్లు కలిగెన'ని ప్రశ్నించెను. శతానందుడిట్లు తెలుపుట కారంభించెను. 128

శతానన్దః —

పురా పురన్దరో నామ । సోమయాజీ దృఢవ్రతః ।
కాలహస్త్యాఖ్యనగరే । సత్యవాక్ బ్రాహ్మణో ఽభవత్ 129

అపుత్రస్యా పి విప్రస్య । నా భూ ద్దుఃఖం సుతా ప్తయే ।
దైవేన పూర్వపుణ్యేన । వృద్ధస్యా స్య సుతో ఽభవత్ ॥ 130

చకార నామ్నా స సుతం । మాధవం విప్రసంసది ।
పిత్రో పనీతో బాల స్తు । వవృధే చన్ద్రివన్నృప ॥ 131

వేదవేదాఙ్గత త్త్వజ్ఞః । సర్వవిద్యావిశారదః ।
తతః కాలా న్తరే పుత్రం । సదారం తం చకార హ ॥ 132

స చన్ద్రిలేఖయా రేమే । బహుకాల ఇ చ్ఛ మాధవః ।
పఞ్చయజ్ఞపరో నిత్యం । పఞ్చాననసమద్యుతిః 133

త్రిఃస ప్తవర్షో రేజే స । ద్వితీయ ఇవ భాస్కరః ।
సా కన్యా పాణ్డ్యదేశీయా । పాణ్డ్యానా ఇ చ్ఛ తథా ప్రియా ॥ 134

పత్యౌ సుప్తే స్వయం శిష్యే । పత్యౌ భు క్తే త్వ భు క్తిచ ।
కదాచి ద్విప్రపుత్ర స్తు । దివా సఙ్గమతత్పరః ॥ 135

రాజపుత్రీం సమాసాద్య । రాజన్ ! కామాతురో ఽబ్రవీత్ ।
మమే చ్ఛా వ ర్తతే భద్రే ! । సఙ్గమే తవ భామిని ! ।
పతివాక్య ముపాకర్ణ్య । పతిం ప్రాహ ప్రజాపతే ! । 136

చన్ద్రిలేఖా —

శరీర మస్థిమాంసాద్యైః । పూరితం పురుషర్షభ ! ।
శరీరేణ శరీరస్య । సఙ్గమః సాధ్వ సమ్మతః ॥ 137

తత్రా పి దివసక్రీడాం । అయుక్తాం మునయో విదుః ।
నికేతనే పితా మాతా । చాగ్నిహోత్ర ఇ చ్ఛ దేవరాట్ ॥ 138

శతానందుడు —

పూర్వము కాలహస్తి నగరమున సత్యవచనము కలవాడు, వేదోక్తకర్మల నాచరించుటలో గట్టి పట్టుదల గలవాడును, పెక్కు యాగముల నొనరించిన పురందరుడను బ్రాహ్మణుడు కలడు. 129

అతనికి సంతానము లేకున్నను పుత్రులకై విలపింపక తన కర్తవ్యమును నిర్వహించుచుండగా పూర్వజన్మ పుణ్యవిపాకమున నావృద్ధుకొక పుత్రుడు కలిగెను. 130

అతడు బ్రాహ్మణులను రావించి వారినదస్సున నా బాలునకు మాధవుడను పేరుంచెను. తండ్రిచే నుపనయన మాచరింపబడి యా బాలుడు చంద్రునివలె వృద్ధి పొందెను. 131

వేదముల నామూలాగ్రముగ పఠించెను, వేదాంగముల సకలశాస్త్రముల యందసమానపాండితి నలవరచుకొని యౌవనవంతుడైనపిమ్మట తండ్రి యాతనికి వివాహము నొనరించెను. 132

మాధవుడనుదినము యజ్ఞముల నైదింటి నొనర్చుచు (దైవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, ఋషియజ్ఞము, నృయజ్ఞము) బ్రహ్మతేజోవిరాజితు డగుచుండెను. 133

ముప్పదియేడు సంవత్సరము లా మాధవుడు రెండవ సూర్యునివలె ప్రకాశించెను. మాధవుని భార్యయగు చంద్రలేఖ యను పాండ్యదేశమున బుట్టి పాండ్యదేశీయుల కభిమానవతియై 134

భర్త నిదురించిననే తాను నిదురించుచు భర్త భుజించిననే తాను భుజించుచు పాతివ్రత్యము నెరపుచుండెను. ఒకప్పుడు మాధవుడు పగటిపూటయందు రమింపగోరి 135

మదనార్తుడై చంద్రలేఖను సమీపించి "నేను నీతో రమింపగోరుచున్నాన"ని పలుకగనే చంద్రలేఖ యాతనితో — 136

చంద్రలేఖ —

శరీరము ఎముకలు, మాంసము మున్నగువాటిచే నిండియుండునుకదా ! ఒక శరీరముతో మరియొక శరీరము కలియుటను సజ్జనులు గర్హింతురు. 137

అదియునుగాక పగటి సంగమము కూడదని మునులు వచింతురు. మన గృహమున తల్లి, తండ్రి, అగ్నిహోత్రుడు, పరమేశ్వరుడు 138

ప్రభాకరప్రభాం పశ్య । త్యజ కామం ద్విజాత్మజ ! ''
వధూవచనమాకర్ణ్య । మాధవో వాక్య మబ్రవీత్ ॥ 139

మాధవః —

భవ భామిని ! సౌఖ్యే మే । పూరయా ద్య మనోరథమ్ ।
తవ స్యాత్ పుత్రసౌభాగ్యం । వరం పతిసలోకతా ॥ 140

భర్తు ర్వచన మాకర్ణ్య । భర్తారం వాక్య మబ్రవీత్ ॥ 141

చన్ద్రలేఖా —

గచ్ఛామి జలహేతో స్తు । గచ్ఛ త్వం పురతో మమ ।
తదా జగామ రాజేన్ద్ర ! । కుశార్థం స స్వభావతః ॥ 142

సా జగామా థ పానీయ । పాత్ర మాదాయ భామినీ ।
తామన్వగా న్మాధవో ఽపి । వటకూట మభిద్రుతః ॥ 143

తత్రా న్తరే విప్రపుత్రో । దదర్శా న్యాం స్త్రియం పునః ।
వనా న్తరే వస న్తీచ । వస న్తీం ద్రుమమూలగామ్ ॥ 144

ధవలామ్బరసమ్బద్ధాం । కటిమేఖలయా ఽన్వితామ్ ।
సునాసాంసుభగాంసుభ్రూం । నీలాలకవిరాజితామ్ ॥ 145

ముమోహ విప్ర స్తాం దృష్ట్వా । సువర్ణాం సుపయోధరామ్
స్నిగ్ధకఞ్చుకసమ్బద్ధాం । కోకిలస్వరరఞ్జితామ్ ॥ 146

అఞ్జనా లి ప్తనయనాం । అ న్త్యజాం నామకు న్తలామ్ ।
పాదేన విలిఖ న్తీం గాం । జానుస్థితశిరోరుహామ్ ॥ 147

దృష్ట్వా భిన్నమనా భూత్వా । చి న్తయన్ బ్రహ్మనిర్మితమ్
స భార్యాం ప్రత్యువాచే దం । ' గచ్ఛ ప్రాణప్రియే ! గృహమ్
ఇచ్ఛా మే పూర్ణతాం ప్రాప్తా । త్వద్భక్త్యా పరితుష్యతః ॥ 148

చన్ద్రలేఖా —

సూర్యకాంతియు కలవు. కనుగొనుము. కామమును వీడుమ'ని పలుకగా మాధవుడు దానిని విని యిట్లనెను 139

మాధవుడు —

'సుందరీ! నాకు సౌఖ్యము నొసంగుము. నా కోరికను తీర్చుము. నీకు పుత్రుడు కలుగును. నీకు భర్తతో సమానమగు లోకము లభింపగలద'ని చెప్పినంతనే 140

చంద్రలేఖ —

చంద్రలేఖ యాతనితో నేను నీటిని తెచ్చుటకై పోవుచున్నాను. నీవు నాముందుగా నడచుచుండుమ'ని తెలిపెను. మాధవుడు తన యలవాటుప్రకారము కుశలకై బయలు దేరెను. 141-142

చంద్రలేఖ నీటికై ఘటము తీసికొని బయలుదేరెను. ఆమెను జూచి మాధవుడును మఱ్ఱిచెట్ల గుబురువైపు తొందర తొందరగా పరిగిడెను. 143

ఇంతలో మాధవుడు వసంతఋతువులో వనమధ్యమున నొక వృక్షము మొదట నిలచియున్నట్టియు 144

తెల్లని వస్త్రమును ధరించి మొలనూలు దాల్చి చక్కని ముక్కు కలిగి, సౌందర్యవతియై, చక్కని కనుబొమలు కలిగి, నల్లని ముంగురులు కలిగి ప్రకాశించుచున్న ఒక స్త్రీని గాంచెను. 145

చక్కని రంగుకలిగి చక్కని పాలిండ్లు కలిగి నునుపగు రవికను ధరించి కోకిలస్వరమువలె మధురస్వరము కలిగి 146

కాటుకచే కండ్ల నలంకరించుకొని మోకాటిపై తలవెంట్రుకలను విరియబోసుకుని కాలితో భూమిపై వ్రాయుచు కూర్చునియున్న కుంతలయను చండాలకన్యను 147

గాంచి చతురాననుని సృష్టినిగూర్చి విచారించుచు మనమున ఖేదమునందుచు తన భార్యతో - "ప్రియతమా! ఇంటికేగుము. నీ భక్తిచే సంతసించుచున్న నా కోరిక నెరవేరినద'ని నుడువగా 148

చంద్రలేఖ —.

యు_క్త ముక్తం త్వయా భద్ర! । గచ్ఛామి భవనం స్వకమ్ ।
భర్తు రాజ్ఞా ముపానీయ । చన్ద్రిలేఖా గృహం గతా ॥ 149

యావ ద్గచ్ఛతి సా భార్యా । తావ త్తత్ర స్థితో ఽభవత్ ।
గతాయాం స్వప్రియాయా స్తు । తాం బాలాం పరిచి న్తయన్ ॥ 150

శనై ర్జగామ రాజేన్ద్ర! । స్మరేణ హృతచేతనః ।
సమీపస్థం మునిం ప్రేక్ష్య । సా రాజన్ పృథులోచనా ।
స్వరభేదం ప్రకుర్వ న్తీ । వాక్య మూచే ఽథ మాధవమ్ ॥ 151

కు న్తలా —

మా యాహి మునిశార్దూల! । మత్సమీపం మహామతే! ।
స చ తద్వచనం శ్రుత్వా । సహసా వాక్య మబ్రవీత్ ॥ 152

మాధవః —

కా త్వం కల్యాణి! భద్రం తే । జననీ జనకశ్చ చ కః ।
ఆవాస స్తవ భద్రం తే! । కస్మిన్ రాష్ట్రే వరాననే! ।
సా చైవ ముక్తా మునినా । జాతి మాహ మనస్వినీ ॥ 153

కు న్తలా —

కిం మాం పృచ్ఛసి పాపిష్ఠాం । వభిచారకులోద్భవామ్ ।
అ న్త్యజా న్త్యజయోర్జాతాం । సురామాంసాశినీం ఖలామ్ ॥ 154

మధ్యదేశే నివాసో మే । కిం త్వం పృచ్ఛసి భూసుర! ।
వేదవేదా న్తవేదిం స్త్వం । న మాం ద్రష్టు మిహార్హసి ॥ 155

మాం ప్రష్టుం క్రీడితుం వా పి । కథ మిచ్ఛసి మూఢధీః ।
ఏవ మాది ప్రజల్పన్తీం । మాధవ స్తా మథాబ్రవీత్ ॥ 156

మాధవః —

స్వయం నారాయణా జ్జాతో । బ్రహ్మా లోకపితామహః ।
అన్త్యమేవం మహారాజం । మన్యతే మే మతి స్సదా ॥ 157

చంద్రలేఖ "స్వామీ ! చక్కగా పలికితిరి. నేను నా యింటికేగుదు'నని భర్త యాజ్ఞనుకొని వెడలిపోయెను. 149

మాధవుడామె వెడలునంతవరకచ్చటనే యుండి యామె చనినంతనే తాను కనిన బాలికనే తలంచుచు 150

మన్మథావిష్టచిత్తుడై మెల్లగా నామెవద్దకు వెళ్ళగనే విశాలనేత్రముగల యామె తన సమీపముననున్న మాధవుని జూచి తొట్రుపడుచు 151

కుంతల —

మునీంద్రా ! బుద్ధిశాలీ ! నావద్దకు రావలద'ని హెచ్చరించగా నాతడామెను 152

మాధవుడు —

కల్యాణీ ! నీ వెవతెవు ? నీ తలిదండ్రులెవరు ? నీ నివాస మేరాష్ట్రమున మన్నది ?" అని ప్రశ్నించెను. మాధవుడిట్లు ప్రశ్నింపగా నామె తన జాతి నీ విధముగా జెప్పెను. 153

కుంతల —

వేశ్యాకులమున జనించిన పాపాత్మురాలనగు నన్నెందులకు ప్రశ్నింతువు ? నా తలిదండ్రులు చండాల జాతివారు. నేను కల్లు మాంసములను తిను దుష్టురాలను. 154

నా నివాసము మధ్యదేశమున కలదు. వేదములను వేదాంతముల నెఱింగిన నీవు నన్ను చూచుటకైన తగవు. 155

అట్టితరి నన్ను తాకుటకు నాతో విహరించుటకు సజ్జనివై యేల కోరుచున్నా వ'ని యనేక విధముల పలుకుచుండగా, 156

మాధవుడు —

లోకములకు పితామహుడగు బ్రహ్మ శ్రీమన్నారాయణునుండి జనించుట నిరుప యోగము. నే నాతనిని గుడ్డివానినియే తలంతును. 157

వృథా యజ్ఞనయామాస । వనితాం వనహేతవే ।
తథా ఽపి మమ బుద్ధి స్తు । త్వయ్యే వ రమతే సదా ॥ 158

యత స్త్వయ్యేవ నిరతం । మనో మే కృతవా నజః ।
అతో మనో మే సమ్పూర్య । జీవయా ద్య శుచిస్మితే ! ॥ 159

కున్తలా —

కులాటనం ప్రకుర్వాణాః । కుల మాశత మాకులమ్ ।
దహ న్తీతి వద న్తి స్మ । కులజాః వరమానినః ॥ 160

మాధవః —

లవణోదకజాతాని । రత్నాని వివిధాని చ ।
అఙ్గీకుర్వ న్తి దేవా శ్చ । తేజఃప్రాధాన్యకారణాత్ ॥ 161

తస్మా దిహం సురూపత్వాత్ । త్వయి భోగం కరోమి చ ।
నరకం వా మృతో యాస్యే । పితృభి స్సహ సుస్మితే ॥ 162

ఇత్యే వ ముక్తా ద్విజబాలకేన । రురోద కన్యా తరుణా రుణాభా ।

కు న్తలా —

దివాకసో విప్రవరో విమోచ్యో । దోషా దముష్మా దసతీప్రసఙ్గాత్ ॥ 163

దిగ్దేవతాయా శ్చ గణాధిపాయే । పాన్విన్దుపూర్వాశ్చననగ్రహాయే ।
శృణ్వన్తు వాక్యం మమ తే వృథా ఽ యం।విప్రో మృతిం సాస్యతి పాపసఙ్గాత్॥

విలలాప మహారాజ ! । బ్రాహ్మణార్థం సుమధ్యమా ।
మా స్పృశా ద్య మహీదేవ ! । పాపినీం వ్యభిచారిణీమ్ ॥ 165

కః స్పృశే దగ్ని మా ర్త స్సన్ । సర్పం వ్యాఘ్రం గజం ద్విజ ! ।
పరపత్న్యో హి తత్తుల్యాః । కిము చణ్డాలకన్యకా ॥ 166

ఉత్తమం వద మాస్థాయ । నీచా ఇచ్ఛ న్త్య ధోగతిమ్ ।
జ్ఞానినో వ తథా విప్రాః । తవ బుద్ధి స్తు తాదృశీ ॥ 167

నీ వంటి సౌందర్యవతిని యడవి పాలొనరించిన బ్రహ్మ గ్రుడ్డివాడేకదా!
అయినను నా బుద్ధి నీ యందే క్రీడించుచున్నది. 158

బ్రహ్మ నా మనసును నీ యందే లగ్నమగునట్లొనర్చుటంజేసి నా మనో
రథము నీ దేర్చి నన్ను బ్రతికింపుమ'ని యనునయ వాక్యముల పలుకుచుండగా. 159

కుంతల —

కుంతల యాతనితో - కుల విపర్యాసముల నొనరించువారు నూరు తరముల
వరకు కులనాశకు లగుదురని సద్వంశ సంజాతులగు పండితులు వక్కాణింతుర'ని
తెలిపెను. 160

మాధవుడు —

ఆ మాటను విని మాధవుడు - తేజమే ప్రధాన మగుటంజేసి ఉప్పు సముద్ర
మున పుట్టిన పలువిధ రత్నములను దేవతలుపైత మాదరించుటలేదా? 161

కావున నీవు సౌందర్యరాశి వగుటచే నిన్ననుభవింతును. నేను చనిపోయిన
పిమ్మట పితృదేవతలతోగూడ నరకమున కేగినను సమ్మతమే. 162

కుంతల —

అని మాధవుడు పలికినంతనే బాలసూర్యునివంటి కాంతిగల కుంతల గట్టిగా
ఓ దేవతలారా! వేశ్యాంగనతో బ్రాహ్మణుడు మాటలాడరాదు. 163

ఓ దిక్పాలకులారా! గణాధిపతులారా! ఈ దోషమునుండి యీ బ్రాహ్మణుని
కాపాడుడు. చంద్రాది నవగ్రహములారా! నా మాటను వినుడు. ఈ బ్రాహ్మణు డనావశ్య
కముగా పాపాత్మురాలనగు నన్ను కూడుటంజేసి మృతి నొందనున్నాడు. ఈతనిని రక్షిం
పుడు అనెను. 164

బ్రాహ్మణుని గూర్చి మిక్కిలి దుఃఖించుచు విప్రోత్తమా! వేశ్యాంగనను
పాపాత్మురాలనగు నన్ను తాకకుము. 165

ఆర్తుడగు నెవ్వడైన నగ్నిని ముట్టుకొనునా? సర్పము చెంత కేగునా? పులిని
సమీపించునా? మత్తగజము నెదుర్కొనునా? పరస్త్రీల నట్లే సమీపింపరానివారు. ఇక
మాతంగ కన్నియనుగూర్చి వేరుగ చెప్పున దేమున్నది? 166

మూఢులు గొప్ప పదవిలో నుండియు నధోగతి నందగోరుదురు. జ్ఞానులట్లు
కోరుకొనరు. కాని, నీ బుద్ధి యధోగతినే కోరుచున్నది కదా! 167

జాతీ ద్వే నిర్మితే పూర్వం । విష్ణునా ద్విజసత్తమ ! ।
స్త్రీత్వం పుంస్త్వం యథా తద్వత్ । చాతుర్వర్ణ్యే ఇచ్ఛ భూసుర ! ॥ 168

బ్రాహ్మణస్య బ్రహ్మయోన్యాం । రన్తు మిచ్ఛా ప్రశస్యతే ।
తథా ఽన్యేషా ఇచ్ఛ వర్ణానాం । స్వస్వజాత్యా ప్రశస్యతే ॥ 169

విపరీత మిమం మన్యే । ధర్మత్యాగం ద్విజన్మనామ్ ।
శరీరం తవ విప్రేన్ద్ర ! । వేదపూతం విశేషతః ॥ 170

ఋతుకాలే చ య న్మాతుః । తవ పిత్రా సమాగమే ।
రేతః సృష్టం వేదపూతం । గర్భాధాన మిదం విదుః ॥ 171

సీమన్తం కల్పయామాసుః । మన్త్రైః వేదమయై ర్ద్విజ ! ।
దశమే మాపి సమ్ప్రాప్తే । ప్రాసూత జననీ తవ ॥ 172

తదా పిత్రా జాతకర్మ । కృతం నామ చ మన్త్రవత్ ।
అన్నప్రాశనచౌలాది । బ్రహ్మవాచనపూర్వకమ్ ॥ 173

అగ్నిసాక్షివిధానేన । ప్రాప్తదారః కృతో భవాన్ ।
అధీతవేదశాస్త్రస్సన్ । ఆహితాగ్నివ్రతే స్థితః ॥ 174

ఏతాదృశస్య దేహస్య । మయా సఙ్గః కథం భవేత్ ।
కర్ణౌ హరికథాః శ్రుత్వా । పావితౌ నాసికా తవ ॥ 175

హర్యర్పితసుగన్ధేన । పావితా జఠరం తవ ।
వాసుదేవార్పితాన్నేన । పవిత్రం పురుషర్షభ ! ॥ 176

కృష్ణార్చనప్రసఙ్గేన । కరౌ పావనతాం గతౌ ।
హరినామకలాపేన । జిహ్వా తే పావనాత్మికా ॥ 177

పుణ్యక్షేత్రసంచారేణ । పాదౌ తే పావనీకృతౌ ।
ఏతాదృశేన దేహేన । కథం సఙ్గం ప్రశంససి ॥ 178

మమా పి శ్రుణు మాహాత్మ్యం । దేహస్యా మితదోషిణః ।
అవాచ్యవచనైః క్రూరైః । జిహ్వా మే దహ్యతే సదా ॥ 179

పూర్వము స్త్రీజాతి యనియు, పురుషజాతియనియు, రెండేజాతులు, విష్ణువుచే నిర్మింపబడినవి. అట్లే వర్ణములును నాలుగేగదా ! 168

బ్రాహ్మణునకు బ్రాహ్మణజాతి కన్యయు నితర వర్ణముల కితరవర్ణ కన్యలను తమ తమ జాతికి తగినట్లూ కన్యలతో రమింపవలెనని కోరుట యుక్తమైనది 169

బ్రాహ్మణులు తమ వర్ణాశ్రమ ధర్మములను వీడుట విపరీతమని తలంతును. అదియునుగాక నీ శరీరము వేదమంత్రములచే పవిత్రమైనది. 170

నీ తల్లి ఋతుకాలమున నీ తండ్రితో సంగమించగా వేదపఠనముచే పవిత్రు డగు నీ తండ్రి రేతము నీ తల్లియందు ప్రవేశింప జేయబడినది, దీనినే గర్భాధానమని యందురు. 171

అనంతరము వేదమంత్రములతో సీమంతము నొనరించిరి. పదియవ మాసము రాగానే నీ తల్లి నిన్ను కనెను. 172

అపుడు నీ తండ్రి నీకు జాతకర్మము నాచరించి మంత్రమువలె పవిత్రమగు నామకరణము నొనరించెను. మంత్రోచ్చారణ పూర్వకముగా అన్నప్రాశనము, పుట్టువెంట్రు కలు, చెవులు కుట్టుట మొదలగు విధులను నిర్వర్తించెను. 173

అగ్నిహోత్రుని సాక్షిగా నుంచుకొని అగ్నిహోత్రవిధానముతో నీకు వివాహము జరిగెను. నీవు వేదశాస్త్రములను చదివి నిత్యాగ్నిహోత్రముల నొనరించుచు పవిత్ర మొన రించుకొనియున్న 174

నీ దేహమునకు నాతో సంగమించుటెట్లు పొసగును ! నీ చెవులు విష్ణుకథలను వినుటచేతను, నీ ముక్కు 175

విష్ణునకు సమర్పించి తీసిన తులసీదళ పరిమళము నాఘ్రాణించియు, నీ గర్భము శ్రీమన్నారాయణునకు నివేదించిన యన్నమును భుజించుటచేతను. 176

నీ చేతులు శ్రీమన్నారాయణ పూజాతత్పరతచేతను, నీ నాలుక హరినామ సంతతస్మరణాభ్యాసముచేతను. 177

నీ పాదములు పుణ్యక్షేత్రముల కేగుటచేతను పవిత్రత నొందియుండగా హేయ మగు నా శరీరముతో పొందెట్లు పొసగును. 178

వచింప నలవికాని దోషములకు తావగు నా శరీర మాహాత్మ్యమునుకూడ వినుము, నా నాలుకెల్లపుడును పలుకరాని పరుష భాషణముచే దహింపబడుచున్నది. 179

సురామాంసాశనే నైవ । జఠరే గుల్మ మాగతమ్ ।
వ్యభిచారకథా ఽఽలాపాత్ । కర్ణౌ మే శిథిలీ కృతౌ ॥ 180

పాదౌ జారగృహం గత్వా । పాషాణసదృశౌ మమ ।
గోవధా న్మే కరౌ క్రూరౌ । యమదణ్డసమప్రభౌ ॥ 181

ఏతాదృశస్య దేహస్య । త్వయా సఙ్గః కథం భవేత్ ।
ఉత్తమో నీచతాం ప్రాప్య । కథం స్వర్గం గమిష్యతి ॥ 182

పరస్త్రీసఙ్గదోషేణ । బహవో నరకాన్ గతాః ।
తస్మా దుత్తిష్ఠ భద్రన్తే । తవ దాసీ భవామి భోః ! ।
వనితా వచనం శ్రుత్వా । వాక్య మూచే ద్విజాత్మజః ॥ 183

త్వదీయసఙ్గో బహుకాలపుణ్య । ప్రభావజో ముక్తికరః శుభావహః ।
దైవేన యోగేన హరేః ప్రసాదాత్ । పుణ్యేన లబ్ధః పురుషార్థహేతుః ॥ 184

తస్మా ద్భజస్వా నుగతో ఽస్మి భామిని ! ।
త్యజా ద్య లజ్జాం కురు మే మనోగతమ్ ॥ 185

గచ్ఛన్త్యద్య మమప్రాణాః । త్వ ద్వియోగేన కేవలమ్ ।
తస్మా జ్జీవయ భద్రం తే । మరణాభిముఖ ఞ్చ మామ్ ॥ 186

ఏవ ముక్తా ద్విజేన్ద్రేణ । పృథుశ్రోణీ సముత్థితా ।
పలాయనాయ ఽఽశు మతిం । చక్రే చణ్డాలకన్యకా ॥ 187

ధావమానా మనుద్రుత్య । మాధవ స్తా ముపాస్పృశత్ ।
రౌరవం జనకస్యా ఽపి । జనన్యాః కులయోః ధ్రువమ్ ॥ 188

స్యా దితి క్రోశమానాం తాం । మాధవో మన్మథా ఽహతః ।
బలాత్కారేణ సఙ్గృహ్య । బుభుజే భోగ ముత్తమమ్ ।
భోగాత్యయే ద్విజం బాలా । వాక్య మూచే మనస్వినీ ॥ 189

మద్యమాంసముల భుజించుటవలననే గర్భమున దుష్టరక్తమువలన కలుగు వ్రణముద్భవించినవి. అనవరత జారకథా ప్రసంగమున నా చెవులు జీర్ణించియున్నవి. 180

జారుని యింటికేగి యేగి నా పాదములు సౌకుమార్యమును వీడి కఠినములైనవి. గోహత్యలచే చేతులు యముని దండమువలె క్రూరములై కన్పట్టుచున్నవి. 181

ఇట్టి వికృతశరీరముతో నీకు పొందెట్లు పొసగును ? ఉత్తముడధఃపతితుడై స్వర్గము నెట్లు పొందును ? 182

పరాంగనా సంపర్కదోషమున ననేకులు నరకమున కేగిరికదా ! కావున నీవు జాగరూకుడవగుము. నీకు శుభమగుగాక ! నేను నీకు దాస్యము నొనరింతు" నని పలుకగా మాధవుడు — 183

నీతో చెలిమి నా కనాదికాలపుణ్యముచే సంప్రాప్తమైనది. మోక్షహేతువు. శుభకరము. అదృష్టవశమున, శ్రీమన్నారాయణుని యనుగ్రహమున పురుషార్థప్రదాయియై లభించినది. 184

కావున నో సుందరీ ! నన్ను ఆదరింపుము. నిన్ననుసరింతును. సిగ్గునువీడి నా కోరికను తీర్చుము. 185

నీ వియోగమాత్రముననే నా ప్రాణములు పోవుచున్నవి. కావున మృత్యువాతబడనున్న నన్ను బ్రతికింపు" మని 186

పలుకుచుండగా చండాల బాలికయగు కుంతల లేచి పరుగెత్తుట కుద్యుక్తురాలాయెను. 187

మాధవుడు పరుగిడుచున్న కుంతల వెంట పరుగిడి "మాధవా ! నీ తలిదండ్రుల వంశములు రెంటికిని రౌరవనరకము తప్పక సంప్రాప్తించు" నని కుంతల 188

మొరపెట్టుచున్నను మదనావిష్టుడై బలాత్కారముగ నామెను పట్టుకొని రమించెను. అనంతర మా యువతి మాధవునితో — 189

అద్య ప్రభృతి భో విప్ర ! । పతి స్త్వం మమ భూసుర ! ।
త్యజ యజ్ఞోపవీతం త్వం । ముణ్డయిత్వా శిర స్తథా ॥ 190

అబ్రాహ్మణ్య ముపాగమ్య । భుఙ్క్ష్వ గోమాంస ముత్తమమ్ ।
పిబ మద్యోదకం శీఘ్రం । చణ్డాలత్వ ముపాశ్రితః ॥ 191

తద్వాక్య మాకర్ణ్య తదా । తయో క్తం సర్వ మాచరన్ ।
చణ్డాలాచరితాచారం । జగామ విధిచోదితః ॥ 192

విప్ర స్తయా సమేత స్తు । కృష్ణవేణీ నదీతటమ్ ।
ద్వాదశాబ్దం వసన్ విప్రః । తత్సఙ్గ పరిమోహితః ॥ 193

అనిత్యత్వా చ్ఛరీరాణాం । కాలపాశేన యన్త్రితా ।
జగామ మరణం రాజన్ ! । కు న్తలా నీలకు న్తలా ॥ 194

తయా విరహితః శ్రీమాన్ । మాధవో దుఃఖకాతరః ।
అచర ద్భువనం సర్వం । ఉన్మాదేనో ద్భ్రమ న్నివ ॥ 195

అకస్మా ద్దైవయోగేన । రాజాన శ్చొత్తరా స్తదా ।
యాత్రార్థం సముపాజగ్ముః । వరాహస్య చ పర్వతమ్ ॥ 196

మార్గమధ్యే దదర్శా సౌ । మాధవ స్తా న్మహీపతీన్ ।
గచ్ఛ న్నేవ చ తై స్సార్ధం । తదుచ్ఛిష్టాన్నభోజనః ॥ 197

ప్రాప సర్పగిరిం రాజన్ ! । దైవయోగేన కర్మణా ।
తే రాజాన స్తత్ర గత్వా । తీర్థే కపిలసంజ్ఞికే ॥ 198

స్నాత్వా భక్తిభరోపేతాః । వపనం చక్రు రాదరాత్ ।
మాధవః స్వయ మప్యే త్య । వాపయామాస వై శిరః ॥ 199

పార్వణాని ప్రకుర్వ న్తః తత్ర రాజన్ ! క్షితీశ్వరాః ।
పిణ్డాని చ మనంహృష్టాః । శ్రాద్ధీయాని దదు స్తదా ॥ 200

ద్విజోత్తమా ! నేటినుండి నీవు నా భర్తవైతివి. యజ్ఞోపవీతము నావల పారవేయుము తలను గొరిగించుకొనుము. 190

నీవు బ్రాహ్మణ్యమునుండి భ్రష్టుడవైతివి. చండాలుడవైతివి. చక్కని గోమాంసమును భుజింపుము. కల్లుత్రాగు "మని తెలుపగా 191

నాతడామె చెప్పినదానినెల్ల ఆచరించుచు దైవయోగమున చండాలవర్తను డాయెను. 192

కుంతలా స్నేహాసక్తచిత్తుడై ఒడలెఱుంగక మాధవు డామెతో కృష్ణవేణీ నదీ తీరమున పండ్రెండు సంవత్సరములు వసించెను. 193

నల్లని ముంగురులుకల కుంతల, శరీరము అనిత్యమగుటంజేసి కాలగతి విబద్ధయై మరణించెను. 194

ఆమె విరహముచే కలిగిన దుఃఖమనుభవింపజాలక మాధవుడు పిచ్చిపట్టినవాని వలె భూమియందంతటను సంచరించెను. 195

తలవనితలంపుగా విధివశమున ఉత్తరదేశీయులగు రాజులు యాత్రకొరకు వరాహపర్వతము వద్దకు చనుదెంచిరి. 196

మాధవుడు కొంతదవ్వేగిన పిమ్మట వారివిగాంచి వారు భుజింపగా మిగినదానిని భుజించుచు వారి వెనుకనే పయనించుచు 197

శేషాచలమునకేగెను. రాజులును శేషాచలమునకేగి కపిలతీర్థమున స్నాన మాచరించి 198

అతిశయిత భక్తిభావముతో శ్రద్ధాళులై తలలను గొరిగించుకొనిరి. మాధవుడును వారితోగూడ నేగి తన తలనున్ను గొరిగించుకొనెను. 199

రాజులందరును సంతసమున శ్రాద్ధమునకు సంబంధించిన పిండప్రదానముల నొనరించు చుండగా 200

మాధవో ఽపి శుభే తీర్థే । స్నాత్వా తద్వ చ్చ పారణమ్ ।
కుర్వన్ పిణ్డాన్ మృదా కృత్వా । పితృభ్యః శ్రద్ధయా దదౌ ॥ 201

దైవా త్తత్కర్మదై వా సౌ । తదా ఽభూ ద్గతకల్మషః ।
తస్మా ద్యో మానవో భక్త్యా । కుర్యా త్తీర్థావగాహనమ్ ॥ 202

పితృశ్రాద్ధం పిణ్డదానం । ముక్తి స్తస్య న సంశయః ।
మృత్పిణ్డం కృతవాన్ విప్రః । పుణ్యక్షేత్రే పురాతనే ॥ 203

కిం వర్ణయామః పురుషోత్తమస్య । క్షేత్రస్య తీర్థస్య చ పుణ్యశక్తిమ్ ।
మృత్పిణ్డదానా త్పతర శ్చ తస్య । ముక్తిం ప్రపనాః మురవైరిశాసనాత్ ॥ 204

ప్రభాతే విమలే జాతే । రాజానో రాజసత్తమ ! ।
సమారోహన్ గిరిశ్రేష్ఠం । సపుత్రా శ్చ సబాన్ధవాః ॥ 205

తేషా మనుపదం రాజన్ ! । ప్రాప శేషగిరి ఞ్చ సః ।
విశ్రామ్య న్తః సర్వ ఏవ । తే తస్థుః తత్ర తత్ర చ ॥ 206

సో ఽపి తస్థౌ మహారాజ ! । మాధవో గిరి మస్తకే ।
భూధరస్పర్శమాత్రేణ । త దఘం పర్యకమ్పత ॥ 207

మాధవస్యా భవ త్కష్టం । యథా వై మక్షికాశనః ।
వమ న్త మేనం స్వం పాపం । సమావృణ్వన్ సమన్తతః ॥ 208

తదఙ్గజాతః కో ఽప్య గ్నిః । అద్రిమాహాత్మ్యత స్తదా ।
ప్రజజ్వాల దహన్ పాపం । సురామాంసాశనోద్భవమ్ ॥ 209

తస్య దుర్గన్ధధూమేన । వాసితాః సర్వదేవతాః ।
తద్భావం వేదితుం దేవాః । బ్రహ్మరుద్రపురోగమాః ॥ 210

విమానాని విచిత్రాణి । భాసయ న్తః సమాగతాః ।
ఖమార్గే సంస్థితా స్సర్వే । దృష్ట్వా తచ్చరితం నృప ॥ 211

వవృషుః పుష్పవర్షాణి । మాధవస్యో త్తమాఙ్గకే ।
దృష్ట్వా పితామహః శ్రీమాన్ । విమానా దవరుహ్య సః ॥ 212

మాధవుడును పవిత్ర తీర్థమున స్నానము నాచరించి వారివలెనే పిండప్రదానమునకై మట్టితో పిండముల నొనరించి పితృదేవతలకు శ్రద్ధతో నొసంగెను. 201

భాగ్యవశమున అమాత్ర కార్యముచే నాతడు పాపవిముక్తుడాయెను. కావున నీ పుణ్యతీర్థమున భక్తితో స్నానము నాచరించి 202

పితృశ్రాద్ధమును పిండప్రదానము నొనరించిన మనుజుడు మోక్షమునందుననుటలో సందియములేదు. అయ్యో! పితరులకు విప్రుడే మట్టిపిండముల నొసంగి తరించెనే. ఆహా! 203

శేషాచలము నందవతరించిన శ్రీనివాసుని యొక్కయు, నా పుణ్యక్షేత్రము యొక్కయు, నా పుష్కరిణి యొక్కయు మహిమ నెంతని వర్ణింతుము? ఆ మట్టితో నొనరించిన పిండప్రదానముననే మాధవుని పితృదేవతలను శ్రీ మన్నారాయణుని యాజ్ఞచే మోక్షమును బడసిరి. 204

సుప్రభాతమయినంతనే రాజులందరును తమ తమ పుత్రమిత్ర కళత్రములతో పర్వతము నధిరోహించిరి. 205

మాధవుడును వారి వెనువెంట నేగుచు వేంకటాచలమును సమీపించెను. అందరు నచ్చటచ్చట విశ్రమించిరి. 206

మాధవుడును పర్వతశిఖరమున విశ్రమించెను. పర్వతమును తాకినంతనే మాధవుని పాపమంతయు గజ గజ వడంకెను. 207

సాలిపురుగువలె మాధవుని పాపమంతయు బయటకేతెంచి యాతనిని చుట్టిపెట్టుటచే నాతడు చాల కష్టపడెను. 208

శేషాచలమాహాత్మ్యమున మాధవుని శరీరమునుండి యావిర్భవించిన యగ్ని, మద్యపానము మాంసభక్షణములచే సంభవించిన పాపమును దహించివేయుచు ప్రజ్వరిల్లెను. 209

ఆ సమయమునందలి దుర్గంధ మన్నిదిక్కులయందు వ్యాపింపగా బ్రహ్మరుద్రాది దేవతలందరును దాని కారణము నెఱుంగగోరి 210

కాంతివంతములగు విచిత్ర విమానములతో విచ్చేసి యాకాశమునుండి యా చరిత్ర నవలోకించి 211

మాధవుని శిరమున పుష్పవర్షమును కురిపించిరి. బ్రహ్మ దానిని జూచి విమానమునుండి దిగివచ్చి 212

మాధవం గతపాప్మానం । యథా హరి రజామిలమ్ ।
కృపయో ద్ధృతవా నేనం । కృపాలు ర్ద్విజపుఙ్గవమ్ ॥ 213
ఇతి సఙ్కీ_ర్తయం_స్తస్య । నికటం ప్రాప సాదరమ్ ।
క్షిప్రం శ్చ తచ్ఛిరః శ్రీమాన్ । బ్రహ్మా వాణీ మదా బ్రవీత్ ॥ 214
భో భో మాధవ విప్రేన్ద్ర ! । గతపాపో ఒసి కేవలమ్ ।
స్వామితీర్థ స్య నికటం । గత్వా స్నాత్వా చ తజ్జలే ॥ 215
వరాహవదనం నత్వా । త్యజ దేహం మహీసుర ! ।
మహీపాలో ఒథ భూత్వా ఒత్ర । కురు రాజ్య మకణ్టకమ్ ॥ 216
పాణ్డవానా ఞ్చ దౌహిత్ర । కులే జాతో ఒసి కీ_ర్తిమాన్ ।
సుధర్మస్య సుతో భూత్వా । ఒఒకాశనామా థ దక్షిణే ॥ 217
నారాయణపురే వీర ! । తొణ్డదేశాధిపో భవ ।
తవపుత్రీజగన్మాతా । జామాతా చ జగత్పతిః ॥ 218
భవిష్యతి మహారాజ ! । పశ్చా ద్వైకుణ్ఠ మాప్నుహి ।
ఇతి తస్య వరం దత్వా । చతుర శ్చతురాననః ॥ 219
తదా నామ చకారా ద్రేః । "వేఙ్కటాచల" ఇత్య పి ।
సర్వపాపాని "వేం" ప్రాహుః । "కటః" తద్దాహ ఉచ్యతే ॥ 220
తస్మా ద్వేఙ్కటశైలో ఒయం । లోకే విఖ్యాతకీ_ర్తిమాన్ ।
ప్రభాతకాలే రాజేన్ద్ర ! । యః కీ_ర్తయతి భూధరమ్ ॥ 221
తస్య పుణ్య ఫలం వక్ష్యే । శృణు రాజన్ యథా స్థితమ్ ।
ఫలం భవే ద్ధ్రువం గఙ్గా । సేతు యాత్రాసహస్రజమ్ ॥ 222
ఇతిహాస మిదం ప్రో_క్తం । గౌతమేనో దితం హి మే ।
పుణ్యం పరమకల్యాణం । శ్రవణా త్పుత్రదాయకమ్ ॥ 223

ఇతి శ్రీ భవిష్యోత్తరపురాణే తీర్థఖణ్డే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే భగవత్క్రీడాద్రే ర్యుగభేదేన వృషభాద్రినామభేదవర్ణనం నామ ప్రథమో ఒధ్యాయః.

"శ్రీమన్నారాయణు డజామీళుని బ్రోచినటులనే శ్రీనివాసుడు మాధవుని దయతో నుద్ధరించెనుకదా!" యని 213

మనమున నాలోచించుచు పాపవిదూరుడగు మాధవుని సమీపించి వాని శిరము నాఘ్రాణించుచు మాధవునితో — 214

బ్రాహ్మణశ్రేష్ఠుడవగు మాధవా! నీ పాపమంతయు నశించిపోయినది. స్వామి పుష్కరిణికేగి యా తీర్థమున స్నానము నొనరించి 215

వరాహస్వామిని సేవించి నీ శరీరమును వదలివేయుము. అనంతరము క్షత్రియుడవై నిరాటంకముగ రాజ్యపాలన మొనరింపుము. 216

పాండవులకు మనుమడగు పరీక్షిన్మహారాజు కులమున నావిర్భవించితివి. దక్షిణదేశమున నారాయణపురమున సుధర్మువి పుత్రుడవై యాకాశరాజను పేరుతో కీర్తిమంతుడవై తొండదేశమున కధిపతివి కమ్ము. 217

లోకమాతయగు లక్ష్మి నీ కుమార్తెయు, సకలలోక ప్రభువగు శ్రీమన్నారాయణు డల్లుడును కాగలరు. 218

అనంతరము నీవు వైకుంఠమున కేగెద" వని వరము నొసంగి 219

పర్వతమునకు "వేంకటాచల" మను నామము నుంచెను. "వేం" అనగా పాపములు. "కటః" అనగా దహింపజేయున"దనియు శబ్దార్థముకదా! 220

కావున నీ పర్వతము ప్రపంచమున వేంకటాద్రియని ఖ్యాతిని గడించెను. వేకువజామున మేల్కాంచినంతనే యీ పర్వత నామము ననుసంధించువానికి 221

గంగ, సేతు స్నానములు వేలకొలది పర్యాయము లాచరించిన కలుగు ఫలితము తప్పక పొందకలుగుదురని యదార్థముగా తెలుపుచున్నాను, వినుము. 222

ఈ చెప్పబడిన ఇతిహాసమును (చరితమును) గౌతముడు నాకు తెలిపెను. ఈ చరితము మిక్కిలి శుభదాయకము. వినుటవలన మంగళప్రదమునై వెలయుచున్నది 223

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున తీర్థఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున భగవంతుని క్రీడాచలమునకు యుగముల తారతమ్యముచే వృషభాద్రి మొదలగు పేరులుకలుగు వృత్తాంతమును వర్ణించుట యనెడు మొదటి యధ్యాయము.

---

# అథ ద్వితీయో ऽధ్యాయః

## భగవతః శ్రీవైకుణ్ఠాత్ వేఙ్కటాచలాగమనమ్

జనకః —

మరు త్పుత్రేహ హిరాజం తం । భగవా నాగమిష్యతి ।
ఇతి త్వయో దితం పూర్వం । త న్మమా చక్ష్వ వి స్తరాత్ ॥ 1

కథం నారాయణః ప్రాప్తః । కేన వా కారణేన భోః ।
తత్రా గత్య కృతం కిం తు । త న్మమా చక్ష్వ వి స్తరాత్ ॥ 2

కథం వైకుణ్ఠలోక స్తు । త్యక్తవాన్ పురుషో త్తమః ।
చరితం తస్య మాహాత్మ్యం । తీర్థానాం పర్వతస్య చ ॥ 3

వరాహరూపిణో విష్ణోః । మాహాత్మ్యం వద వి స్తరాత్ ।
ఆకాశనామ్నః చరితం । రాజ్ఞ స్తస్య మహాత్మనః ॥ 4

యస్య పుత్రీ రమాదేవీ । జామాతా చ జగత్పతిః ।
దేవానా ఞ్చ ఋషీణా ఞ్చ । దేవస్త్రీణాం సమాగమమ్ ॥ 5

## సాత్త్వికదేవతాత్వపరీక్షార్థం భృగోః సత్యలోకాదిగమనమ్

శతానన్దః —

పురా తు ఋషయ స్సర్వే । కశ్యపాద్యా మునీశ్వరాః ।
సన్మఖం జాహ్నవీతీరే । సన్తోషాత్ చక్రిరే ద్విజాః ॥ 6

తస్మి న్కాలే మునిశ్రేష్ఠో । నారదో మునిస త్తమః ।
ఉవాచ వచనం విప్రాన్ । కిమర్థో ऽయం క్రతూ త్తమః ॥ 7

కో వా భు ఙ్క్తే యజ్ఞఫలం । కో వా ధ్యేయః సురో త్తమః ।
కృతయజ్ఞఫలం కస్య । చార్ప్యతే మునిస త్తమాః ॥ 8

ఇతి నారదవాక్య స్తు । శ్రుత్వా తే మునిపుఙ్గవాః ।
సంశయార్థం సమాపన్నాః । కథ మత్ర విచార్యతామ్ ॥ 9

# రెండవ అధ్యాయము

## భగవంతుడు శ్రీవైకుంఠమునుండి వేంకటాచలమున కేతెంచుట

జనకుడు —

జనకుడు శతానందునితో — భగవంతుడు వేంకటాచలమున కేతెంచుననియాదిశేషునితో వాయువు వచించెనని నీవు తెలియజేయుము. 1

ఏ కారణమున నెట్లు శ్రీమన్నారాయణుడు వేంకటాచలమున కేతెంచెను? అప్పటనేమి యొనరించెనో దానిని కూడ నాకు సవిస్తరముగ వివరింపుము. 2

శ్రీమన్నారాయణుడు వైకుంఠమును వదలుట కేమి హేతువు? ఆ చరిత్రను, వేంకటాచలమున విలసిల్లు తీర్థమాహాత్మ్యమును, పర్వత వైభవమును 3

వరాహరూపధారియగు శ్రీమన్నారాయణుని వైభవమును, మహాత్ముడగు ఆకాశరాజు చరితమును. 4

లక్ష్మి యాకాశరాజునకు కుమార్తెయై, శ్రీమన్నారాయణు డల్లుడునయిన విధమును, ఆ కొండకు దేవతలు, ఋషులు, దేవస్త్రీలరుదెంచిన వృత్తాంతమును విస్తారముగా నా కెఱింగింపు" మని యడిగెను. 5

## దేవతలలో సత్వగుణప్రధానులగు దేవతలెవరని పరీక్షించుటకై భృగుమహర్షి సత్యలోకాదులకేగుట

శతానందుడు —

శతానందుడిట్లు చెప్పనారంభించెను. మున్నొకానొక సమయమున కశ్యపాది మహామునులందరును గంగాతీరమున నొక మంచియాగము నానందముగా నొనరించిరి. 6

ఆ సమయమున నారదమునీంద్రు డేతెంచి " ఈ క్రతువు నెందుల కొనరించుచున్నారు? 7

ఈ యజ్ఞఫలము నందుకొనువాడును, ధ్యానింపతగినవాడునగు దైవమెవ్వరు? చేసిన యజ్ఞముయొక్క ఫలము నెవ్వరికర్పించవలెనని 8

ప్రశ్నింపగా మునీంద్రులందరును సంశయాందోళితమనస్కులై దీనినెట్లు నిర్ధారింతు" మని యాలోచించి 9

సమ్మీలిత్వా తదా సర్వే । భృగుం బ్రహ్మవిదాం వరమ్ ।
త మూచు ర్భక్తినమ్రాఙ్గాః । కృతాఞ్జలిపుటాః స్థితాః ॥ 10

గచ్ఛ శీఘ్రం మహాబుద్ధే । పరీక్షార్థం సురోత్తమాన్ ।
ఇతి తేషాం వచః శ్రుత్వా । యయౌ కఞ్జజమన్దిరమ్ ॥ 11

తత్ర దృష్ట్వా ఉష్టబాహుం తం । సాక్షా ద్బ్రహ్మణ మగ్రజమ్ ।
చతుర్ముఖ ముదారాఙ్గం । సరస్వత్యా సుసేవితమ్ ॥ 12

చతురాస్య సముద్భూత । వేదఘోషవిరాజితమ్ ।
దిక్పాలకగణై స్సార్ధం । కిరీటమకుటోజ్జ్వలమ్ ॥ 13

స్తువన్తం జగదీశానం । నారాయణ మనామయమ్ ।
ప్రణమన్ భక్తిభావేన । మదదీప్తివిరాజితమ్ ॥ 14

పాతయామాస కాయం స్వం : పురతః కఞ్జజన్మనః ।
పతితం స భృగుం దృష్ట్వా । నో వాచ వచనం విధిః ॥ 15

తం మత్వా కిఞ్చి దజ్ఞానాత్ । అపూజ్యం మునిపుఙ్గవః ।
అలబ్ధ్వా స్వాత్మనః కార్యం । కైలాసం స ఋషి ర్యయౌ ॥ 16

కైలాసగిరి మాసాద్య । తత్రా ద్రాక్షీత్ త్రిలోచనమ్ ।
కాముకం పార్వతీదేవ్యా । క్రీడన్తం నిజమన్దిరే ॥ 17

తస్మిన్ కాలే త మాయాతం । నా జానా త్కాముకో హరః ।
ఆగతం సా మునిం దృష్ట్వా । పార్వతీ లజ్జయా ఉవదత్ ॥ 18

"త్యజ శీఘ్రం మహాబాహో ! । హ్యాగతో మునిపుఙ్గవః" ।
ఇతి తస్యా వచః శ్రుత్వా । క్రోధా త్తామ్రవిలోచనః ॥ 19

తం హన్తు మద్రవ చ్ఛీఘ్రం । ఋషిః శాపా న్నిరాకరోత్ ।
శశాప స ఋషిః శమ్భుం । "లోకే త్వం నైవ పూజ్యసే ॥ 20

అందరును గుమిగూడి బ్రహ్మజ్ఞానులలో మిన్నయగు భృగుమహర్షిని సమీపించి భక్తిచే వినయవినమితగాత్రులై చేతులుజోడించి 10

"మహాత్మా! దేవతలను పరీక్షించుటకు నీవే సమర్థుడవు. వెంటనే బయలుదేరు" మని ప్రార్థింపగా భృగుమహర్షి చతుర్ముఖుని మందిరమున కేగెను. 11

అప్పుట నెనిమిది భుజములచే ప్రకాశించుచు సృష్టికామ్యుడై సుదృఢావయవములు కలిగినవాడై సరస్వతీదేవిచే నారాధింపబడుచున్నట్టియు 12

నాల్గు ముఖములనుండియు వేదఘోషలు వెలువడుచు, అష్టదిక్పాలురతో గూడి 13

జగత్ప్రభువగు శ్రీమన్నారాయణుని కీర్తించుచున్నట్టియు, ఉజ్వల కిరీటముచే నొప్పారుచు శ్రీమన్నారాయణుని భక్తిపూర్వకముగ నమస్కరించుచు రజోగుణజనితయహంకారముచే ప్రకాశించెడు చతుర్ముఖునకు 14

సాష్టాంగముగ నమస్కరించెను. కాని చతురానను డాతనిని పలుకరింపకుండెను. 15

భృగుమహర్షి బ్రహ్మనుగాంచి "ఈతనికి గల యజ్ఞానలేశమున నీతడు పూజ్యుడుకాడని" తలంచి తన పని పూర్తికాకుండుటచే కైలాసమున కేగెను. 16

అచ్చటికేగి కాముకుడై పార్వతీదేవితో క్రీడించుచున్న ముక్కంటిని గాంచెను. 17

మన్మథావిష్టుడగు రుద్రుడు భృగుమహర్షి రాకను గుర్తింపకుండెను. పార్వతి మాత్రమా మహర్షిని గాంచి సిగ్గుపడుచు శివునితో — 18

"మహేశ్వరా! భృగుమహర్షి వేంచేసియున్నాడు. నన్ను విడువు" మని పలుకగా యామె మాటలను విని శంకరుడు కోపముచే కనులెఱ్ఱబారగా 19

భృగుమహర్షిని చంపుటకై యాతనిని సమీపించెను. భృగుమహర్షి శంకరుని "లోకమున నీవు పూజింపబడకుందువు గాక! 20

త్వం శేషః పూజనే నైవ । లోకే ఖ్యాతిం గమిష్యసి ।”
ఇత్యుక్త్వా స ఋషి శ్చాగాత్ । వైకుణ్ఠం హరిమన్దిరమ్ ॥ 21

ప్రాకారగోపురద్వార । నవతోరణభూషితమ్ ।
చతుర్దిక్షు చతుర్ద్వార । పాలకై రుపశోభితమ్ ॥ 22

తత్ర శయ్యాగృహే రమ్యే । శేషమఞ్చకశాయినమ్ ।
లక్ష్మ్యా సమేతం దేవేశం । దదర్శ స భృగు స్తదా ॥ 23

తతాడో రసి గోవిన్దం । భృగుః పాదతలేన తమ్ ।
తాడ్యమానో హరిః సాక్షాత్ । ఉత్థాయ వినయాన్వితః ॥ 24

పపాత భగవాన్ భక్త్యా । ఋషిపాదసరోరుహే ।
ఆలిలిఙ్గే ఽథ భక్త్యై వ । చో వాచ ఋషిపుఙ్గవమ్ ॥ 25

## భృగుం ప్రతి శ్రీవైకుణ్ఠనాథో క్తవినీతవచనమ్

శ్రీ భగవాన్ —

కిమర్థం త్వం ఋషిశ్రేష్ఠ ! । మచ్ఛరీరం కఠోరకమ్ ।
అతాడయో ఽజరాయు క్తం । అభేద్యం దేవమానవైః ॥ 26

వజ్రా దష్టగుణాం విద్ధి । మచ్ఛరీరే కఠోరతామ్ ।
కిమర్థం తాడితం విప్ర ! కోమలాఙ్ఘ్రితలేన తత్ ॥ 27

పాదౌ తే కోమలౌ దివ్యౌ । మచ్ఛరీరసమాగమాత్ ।
కియ ద్దుఃఖం సమాపన్నౌ । న జానామి ద్విజో త్తమ ॥ ” 28

ఇత్యుక్త్వా ద్విజపాదౌ తౌ । ప్రక్షాళ్యో ష్ణోదకేన వై ।
దధార శిరసా భక్త్యా । విప్రపాదోదకం శుభమ్ ॥ 29

జగృహే సకుటుమ్బ శ్చ । సర్వలోకం విడమ్బయన్ ।
“ విబుధా దర్శనే నైవ । పునన్తి చ జగ త్త్రయమ్ ।”
ఇత్యుక్తో దేవదేవేన । ఋషి శ్చాగా ద్ధరాతలమ్ ॥ 30

శివ లింగాకారముననే పూజింపబడుదు" వని శపించి శ్రీమన్నారాయణు నివాస భూమియు. 21

ప్రాకారములును, గోపురములును, ద్వారములు కలిగి క్రొంగ్రొత్త తోరణములచే నలంకరింపబడి నాల్గు దిశలయందును నలుగురు ద్వారపాలురచే విరాజిల్లుచుండు 22

వైకుంఠమున నింపగు పడకటింటిలో నాదిశేషునిచే సమర్పబడిన పాన్పుపై పవళించి శ్రీదేవితో కూడియున్న శ్రీమన్నారాయణుని గాంచెను. 23

వెంటనే భృగుమహర్షి తన యరికాలితో శ్రీమన్నారాయణుని వక్షస్థలమున తన్నెను. అంతట అట్లాతనిచే తన్నబడిన శ్రీమహావిష్ణువు పాన్పునుండిలేచి వినయముతో 24

భృగుమునీంద్రుని పాదపద్మములకు ప్రణమిల్లి భక్తితో నాతని నాలింగన మొనర్చుకొనెను. 25

## భృగుమహర్షితో శ్రీమన్నారాయణుడు వినయోక్తులనాడుట

శ్రీ భగవానుడు —

మరియు భృగుమహర్షితో — మునిసత్తమా ! మిక్కిలి కఠినమును, యౌవనముచే సుదృఢమును భేదింపశక్యముగానిదియు 26

వజ్రముకంటె నెనిమిది రెట్లధిక కఠోరమగు నా శరీరమును నీ మృదువగు పాదముచే నేల తన్నితివి ? 27

విప్రోత్తమా ! మృదువగు మీ దివ్యపాదములు నా శరీరమును తాకుటచే నెంత నొచ్చినవో యెఱుంగజాలను కదా ! 28

అని పలికి భృగుమహర్షి పాదములను గోరువెచ్చని యుదకముచే కడిగి ఆ పవిత్రపాదోదకమును శిరమున భక్తితో జల్లుకొనెను. 29

సకలలోక నివాసులు నాశ్చర్యమును చెందునట్లుల తన వారందరిపై నా యుదకమును జల్లి "సజ్జనులు దర్శనముచేతచే ముల్లోకములను పవిత్రతనొందింతు" రని స్తుతింపగా భృగుమహర్షి భూలోకమునకు మరలిపోయెను. 30

## భగవతో భృగుకృతసాత్త్వికదేవతాత్వసమర్థనమ్

ఋషీణా మగ్రజాతీనాం । సభాయాం స ఋషి స్తదా ।
బోధయామాస తాన్ సర్వాన్ । హరిః సర్వోత్తమః స్వయమ్ ॥ 31

హరిః సర్వోత్తమః సాక్షాత్ । రమాదేవీ తదన్తరా ।
తదధో విధివాయ్వో చ । తదధః శర్వపూర్వకాః ॥ 32

ఏవం తరతమా జ్ఞేయాః । సురదైత్యనరేషు చ ।
ఇత్యేవం బోధితా విప్రాః । భృగుణా తత్త్వవేదినా ।
హరిం నిశ్చిత్య సర్వేశం । చక్రు స్తస్మై మఖార్పణమ్ ॥ 33

## భృగుపాదాహతికుపితాయా లక్ష్మ్యాః కరవీరపురగమనమ్

తత స్తు భగవాన్ దేవః । ఏకాన్తే నిజమన్దిరే ।
సార్ధ ఞ్చ రమయా ఽతిష్ఠత్ । తదోవాచ రమా హరిమ్ ॥ 34

శ్రీరమా —

గచ్ఛామి దేవదేవేశ ! । త్యక్త్వా త్వాం జగదీశ్వర ! ।
తాడితోఽసి జగన్నాథ ! । ఋషిణా త్వం జగన్మయః ॥ 35

మదాలిఙ్గస్థలే దేవ ! । పాదేనైవ జగత్పతే ! ।
కరవీరపురం దివ్యం । గచ్ఛామి గరుడధ్వజ ! ॥ 36

ఇతి ప్రేమ్ణా చ కలహం । కృత్వా తు హరిణా సహ ।
రమా జగామ తత్క్షేత్రం । కరవీరపురాహ్వయమ్ ॥ 37

## లక్ష్మ్యన్వేషణార్థం శ్రీవేఙ్కటాచలం ప్రతి భగవదాగమనమ్

యదా గతా మహాలక్ష్మీః । తదా నారాయణో హరిః ।
అష్టావింశతిమే ప్రాప్తే । ద్వాపరాన్తే కలేర్యుగే ।
యస్మిన్ దేశే యదా ప్రేమ । కలహోఽస్యాః ప్రవర్తతి ॥ 38

## శ్రీమన్నారాయణుడే సత్వగుణప్రధాన దైవమని భృగుమహర్షి సమర్థించుట

బ్రాహ్మణోత్తములగు మునీంద్రులచే నమరియుండు సభలో భృగుమహర్షి "శ్రీమన్నారాయణుడే సకల దేవతాశ్రేష్ఠుడనియు. 31

శ్రీ లక్ష్మీసమేత శ్రీమన్నారాయణుడే సర్వశ్రేష్ఠుడనియు, బ్రహ్మ సరస్వతులు వారి క్రిందవారనియు, రుద్రాదులందరు వారి క్రిందవారనియు 32

ఇట్లే దేవతలలోను, రాక్షసులలోను, మనుష్యులలోను నౌకరికంటె నౌకరు తక్కువ వారుండురనియు, తెలుపగా మహర్షులందరును జగదీశ్వరుడు శ్రీమన్నారాయణుడేయని నిశ్చయించి యాతనికే యజ్ఞఫలము నర్పించిరి. 33

## భృగుమహర్షి తన్నుటచే శ్రీ మహాలక్ష్మి కోపించి కరవీరపురమున కేగుట

భృగుమహర్షి వెడలినపిమ్మట శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవితో వైకుంఠమున నేకాంతముగ నుండగా నాతనితో లక్ష్మి 34

శ్రీ రమాదేవి —

దేవాదిదేవా! జగన్నియన్తా! సకల చరాచర ప్రపంచవ్యాప్తుడవగు 35

నీ వక్షస్థలముపై నేను నిత్యనివాసము నొనరించు స్థానమున భృగుమహర్షి తన పాదముచే తన్నుటంజేసి నేను నిన్ను విడచి దివ్యమగు కరవీరపురి కేగెద 'ననెను 36

శ్రీమన్నారాయణునితో ప్రణయకలహము నాచరించి కరవీరపురి కేగెను. 37

## లక్ష్మిని వెదకుటకై శ్రీ వేంకటాచలమునకు శ్రీమన్నారాయణుడు వచ్చుట

అంతట శ్రీమన్నారాయణుడు ద్వాపరయుగము గతించిన పిమ్మట యిరువది యెనిమిదవ కలియుగమున లక్ష్మీదేవితో తనకు కలిగిన ప్రణయకలహ మేదేశమున నుపశమించునో 38

కర్మణా యేన చ యథా । త త్తథా చ కరోమి తత్ ।
ఇతి సఙ్కల్ప్య గోవిన్దో । లీలామానుషవిగ్రహః ॥ 39

మాయావీ పరమానన్దం । త్యక్త్వా వైకుణ్ఠ ముత్తమమ్ ।
గఙ్గాయా దక్షిణే దేశే । యోజనానాం శతత్రయే ॥ 40

సువర్ణముఖరీ నామ । నదీనాం ప్రవరా నదీ ।
శుకన్య వరదా పుణ్యా । హ్యగస్త్యమునిపూజితా ॥ 41

తస్యా ఏవో త్తరే తీరే । క్రోశార్ధద్వయమాత్రకే ।
శ్రీవేఙ్కటగిరి ర్నామ । వ ర్తతే పుణ్యకాననః ॥ 42

సువర్ణగిరిపుత్రస్తు । సర్వతీర్థసమన్వితః ।
సాక్షాచ్ఛేషావతారోఽసౌ । సర్వధాతువిరాజితః ॥ 43

వైకుణ్ఠసదృశో దివ్యో । నారాయణసమాశ్రయః ।
శేషమారుతసంవాదాత్ । ఆగతఃపుణ్యకాననః ॥ 44

యోజనత్రయవిస్తీర్ణః । త్రింశ ద్యోజన మాయతః ।
వదనం వేఙ్కటగిరిః । నృసింహాద్రి శ్చ మధ్యమః ॥ 45

శ్రీశైలః పుచ్ఛభాగస్థః । సర్వక్షేత్రమయో గిరిః ।
సర్వవృక్షసమాకీర్ణః । సర్వధాతువిభూషితః ॥ 46

కున్దమన్దారపనస ప్లక్షోదుమ్బరకింశుకైః ।
పిచుమన్దైః పారిజాతైః । తిన్త్రిణీజమ్బుమణ్డలైః ॥ 47

పరలై శ్చ మహావృక్షైః । కృష్ణాగరుభి రఞ్చితః ।
తాలహిన్తాలపున్నాగైః । దేవదారుభి రాశ్రితః ॥ 48

హంసకారణ్డవాకీర్ణః । బకకోకశుకైర్యుతః ।
కపోతైః క్షీరహంసాద్యైః । మృగపక్షై శ్చ భూషితః ॥ 49

సింహశార్దూలశరభ । క్రోడమాతఙ్గవానరైః ।
జమ్బుకై శ్చైవభల్లూకైః । కస్తూరీమృగమాహిషైః ॥ 50

యే కృత్యమైనరించిన నే దేశమున ప్రణయకలహముపీడి లక్ష్మీ ప్రసన్నురాలగునో యట్లొనరింతు 'నని తలంచి విలాసముగా మనుష్య శరీరమును ధరించి విచిత్ర సృష్టికర్తయగు 39

శ్రీయఃపతి పరిపూర్ణానందనిలయమగు పరమపదమును వీడి దక్షిణదేశమున గంగకు మూడువందల యోజనముల దూరమున 40

నదీశ్రేష్ఠమును, శుకమహర్షికి వరమునొసంగినదియు, అగస్త్యమౌనీంద్రునిచే పూజింపబడిన సువర్ణముఖరీ యను నదికి 41

ఉత్తరతీరమున రెండున్నర క్రోశుల దూరమున పవిత్రములగు విపినములచే కూడి 42

సువర్ణగిరికి (మేరువునకు) పుత్రుడై సకలతీర్థరాజోజ్వలమై సాక్షాత్తు ఆదిశేషుని యవతారమై సకల ధాతుసంకలితమై, 43

వైకుంఠమువలె విలసిల్లుచు, విలక్షమైనదై శ్రీమన్నారాయణుని నివాస ప్రదేశమై ఆదిశేష వాయు సంవాదమువలన భూలోకమునకు కొనిరాబడినదై 44

మూడు యోజనముల వెడల్పుకలిగి ముప్పది యోజనముల పొడవుకలిగి వేంకటాచలము ముఖముగను, నృసింహపర్వతము వడుముగను 45

శ్రీశైలము వెనుక భాగముగాగలిగి, సకల పుణ్యక్షేత్రవిరాజితమై, నానావిధ తరుమండితమై, సకల ధాతుసంకలితమై 46

మల్లి, మందార, పనస, జువ్వి, మేడి, మోదుగ, వేప, పారిజాత, చింత, నేరేడు తరుసముదాయములచే నలంకృతమై 47

విరివిగా పెరిగిన టేకు వృక్షములు, పీలిచందన వృక్షములచేతను, తాటి, గిరకతాటి, కొండమల్లి వృక్షములచేతను, దేవదారు తరువులచే నలరారుచున్నదై 48

హంసలు, కన్నెలేడి పక్షులచే నిండినదియు, కొంగలు చక్రవాకములు చిలుకలు మొదలగువానిచే కూడినదియు, పావురములు, పాలపిట్టలు, జింకలు మున్నగు గుంపులచే నలంకరింపబడినదియు 49

సింహములు, పెద్దపులులు, ఖడ్గమృగములు, అడవిపందులు, ఏనుగులు, కోతులు, నక్కలు, ఎలుగుగొడ్డులు, కస్తూరి మృగములు, అడవి దున్నలు 50

ఉరగై ర్వ్యాలభగ్నైశ్చ । గోమాయుభి రపి వ్రృతః ।
మల్లికామాలతీజాతి । నన్ద్యావర్తై ర్విరాజితః ॥ 51

చమ్పకాశోకపున్నాగ । కేతకైః స్వర్ణకేతకైః ।
ఏవం మనోహరః శ్రీమాన్ । పర్వతః పుణ్యకాననః ॥ 52

తరవో దైవతగణాః । మృగా శ్చ ఋషిపుఙ్గవాః ।
పితరః పక్షిణ స్సర్వే । పాషాణా యక్షకిన్నరాః ॥ 53

ఏవం ప్రభావో ఽస్య గిరీన్ద్రజన్మనః । శ్రీవేఙ్కటాద్రే స్తు హరే స్తథైవ ।
జానన్తి న బ్రహ్మశివేన్ద్రపూర్వకాః । అత్యల్పవీర్యా మనుజా స్తు కిం పునః ॥ 54

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే తీర్థఖణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే భగవతః శ్రీవైకుణ్ఠాత్ వేఙ్కటాచలాగమనవర్ణనం నామ ద్వితీయో ఽధ్యాయః

---

# అథ తృతీయో ఽధ్యాయః

## శ్రీస్వామిపుష్కరిణీమాహాత్మ్యమ్

శతానన్దః —

తస్యోపరి వరా దివ్యా । స్వామిపుష్కరిణీ శుభా ।
మత్స్యకచ్ఛపసమ్బాధా । జలకుక్కుటభూషితా ॥ 1

శింశుమారగణాకీర్ణా । మణ్డూకస్వరహుఙ్కృతా ।
తీరజై ర్వృక్షసఙ్ఘై శ్చ । తుఙ్గై రాచుమ్బితామ్బరా ॥ 2

గఙ్గాదిసర్వతీర్థానాం । జన్మభూమి ర్విరాజతీ ।
తస్యాం యే స్నాన్తి మనుజాః । తే ధన్యాః పుణ్యవర్ధనాః ॥ 3

ధనుర్మాసే సితే పక్షే । ద్వాదశ్యా మరుణోదయే ।
కాఙ్క్షన్తి విబుధశ్రేష్ఠాః । మజ్జనం కర్తు మత్ర శుభే ॥ 4

కొండచిలువలు మున్నగు పెద్దపాములచేతను. నాగుపాములచేతను. ఖడ్గమృగములచేత నాశ్రయింపబడినదియు, మల్లె మాలతీ జాజి నందవర్ధన మొదలగు పుష్పతరు మండితమును. 51

సంపంగి, అశోక, నాగకేసర, పచ్చపూమొగలి బంగారు రంగుకల మొగలి పొదలచే నలంకృతమై హృద్యమగు వేంకటాచలము కలదు. 52

ఆ కొండపై వృక్షములు, దేవతాసమూహములు, మృగములు, మునీంద్రులు, పితృదేవతలు, పక్షులు, వివిధశిలలు, యక్షులు, కిన్నరులు నివసింతురు. 53

ఇట్టి మాహాత్మ్యోపేతమగు నీ వేంకటాచలవైభవమును, ఇచ్చట వేంచేసియుండు శ్రీనివాసుని వైభవమును, బ్రహ్మ, శివ, ఇంద్రాది దేవతలైన నెఱుంగజాలరు, ఇక మందబుద్ధులగు మనుజులెఱుంగజాలరని చెప్పవలెనా? 54

ఇది
శ్రీ భవిష్యోత్తర పురాణమున తీర్థఖండమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున శ్రీమన్నారాయణుడు వైకుంఠమునుండి వేంకటాచలమునకు విచ్చేయుట యనెడు
రెండవ అధ్యాయము సంపూర్ణము.

---

# మూడవ అధ్యాయము

## శ్రీ స్వామిపుష్కరిణీ మాహాత్మ్యము

శతానందుడు —

ఆ శ్రీ వేంకటాచలముపై చేపలు తాబేళ్ళచే నలరునదియు, నీటికోళ్ళచే నొప్పారునదియు, 1

అసంఖ్యాకములగు మొసళ్ళచే వ్యాపింపబడినదియు, కప్పల బెకబెకలచే ప్రతిధ్వనించునదియు, ఆకసమునందుకొను నంతటి నిడివిగల వృక్షసముదాయములచే తీరము నిండియున్నదియు 2

గంగ మొదలగు సకల తీర్థరాజముల యావిర్భావమునకు కారణమై విలసిల్లు స్వామిపుష్కరిణియను పవిత్ర పుష్కరిణి రాజిల్లుచుండెను. ఆ స్వామిపుష్కరిణిలో 3

ధనుర్మాసమున శుక్లపక్షమున ద్వాదశిరోజున సూర్యోదయమునకు ముందుగా స్నానము నాచరించిన మనుజులు ధన్యులు పుణ్యశీలురు నగుదురు. దేవతలు నీ పుష్కరిణీ స్నానము నభిలషింతురనిన నిక 4

కాఙ్క్షన్తి మనుజాః స్నానం । ఇతి భోః కిం వదామి తే ।
యే ఽత్ర శ్రాద్ధాది కర్మాణి । పితౄణాం కుర్వతే ద్విజాః ॥ 5

తేషా ఞ్చ పితర స్తుష్టాః । నృత్య న్తి హరిమన్దిరే ।
జన్మనా కి మనేనే హ । వ్యర్థేన భవతా మహో ॥ 6

స్నానదానేన తత్తీర్థే । మనుజా భాగ్యశాలినః ।
శఙ్ఖో నామ నృపః కశ్చిత్ । స్నానమాత్రేణ రాజ్యగః ॥ 7

పురా నారాయణో నామ । బ్రాహ్మణో ఽఙ్గిరసః సుతః ।
స్వామిపుష్కరిణీతీర్థే । మహిమ్నా స్నానజేన హి ॥ 8

వరం లబ్ధ్వా హరిం దృష్ట్వా । జగామ హరి మన్దిరమ్ ।
రామో ఽపి తత్ర స్నానేన । హృతాం సీతా మగాత్పురా ॥ 9

ఏవం తీర్థవరా తత్ర । స్వామిపుష్కరిణీ శుభా ।
తస్యాః పశ్చిమదిగ్భాగే । వరాహవదనో హరిః ॥ 10

ధరా మాలిఙ్గ్య వల్మీకే । ఆస్తే పిప్పల రాజితే ।
త్రికోటితీర్థ జాతానాం । జన్మస్థానం స భూధరః ॥ 11

ఏవం గిరివరం ప్రాప్య । భగవా న్వేఙ్కటాచలమ్ ।
వైకుణ్ఠా దధికం మత్వా । విచచార తత స్తతః ।
స ప్రాప కిఞ్చిదా స్థానం । గూహనార్థం రమాపతిః ॥ 12

## శ్రీనివాసస్య స్వామితీర్థ పశ్చిమ తీరస్థ వల్మీక ప్రవేశ ప్రకారః

ఇత్థం విచార్యమాణే తు । స్వామిపుష్కరిణీతటే ।
దక్షిణే విమలం దివ్యం । వల్మీకం దృష్టవాన్ ముదా ॥ 13

తిన్త్రిణీ వృక్షమూలస్థం । భగవాన్ జగదీశ్వరః ।
మత్వే దం పరమం స్థానం । తత్ర లీనో ఽభవ ద్ధరిః ।
ఏవం దేవే స్థితే తత్ర । విగతం వత్సరాయుతమ్ ॥ 14

ఏనుజులాతిక్రమున మునుంగగోరుమనని ప్రత్యేకముగ చెప్పవలసినదిలేదు కదా!
ఆ స్వామి పుష్కరిణీతీరమున శ్రాద్ధాది కర్మలను పితరులనుద్దేశించి యాచరించువారి 5

పితృదేవతలు సంతసించి పరమపదమున నాట్యమొనరింతురు. శ్రీ వేంకటా చలక్షేత్రమున నావిర్భవించని మీ జన్మవ్యర్థము. 6

ఆ పుష్కరిణిలో స్నానమొనరించిన, దానమాచరించిన మనుష్యు లదృష్టవంతులు. శంఖుడను నొక రాజు పుష్కరిణీ స్నానమాత్రముననే రాజ్యమును పొందెను 7

ఆంగిరస పుత్రుడగు నారాయణుడను బ్రాహ్మణుడు స్వామిపుష్కరిణీ స్నాన మహిమచే 8

పరమునుబడసి శ్రీనివాసుని దర్శించి వైకుంఠధామమునకు చేరెను. శ్రీరామ చంద్రుడును పుష్కరిణీ స్నానముచే రావణునిచే నపహరింపబడిన సీతను పొందెను. 9

ఇట్లు స్వామిపుష్కరిణినదీశ్రేష్ఠమై యలరారుచున్నది. ఆ నదికి పశ్చిమదిక్కున వరాహరూపుడగు శ్రీమన్నారాయణుడు 10

భూదేవితో గూడి రావిచెట్టుక్రింది పుట్టలో ప్రకాశించుచున్నాడు. శ్రీ వేంకటా చలము మూడుకోట్ల నదీమతల్లుల కవతార కారణమైయున్నది. 11

ఇట్టి శ్రీ వేంకటాచలమునుజేరి శ్రీమన్నారాయణు డాపర్వతమునే వైకుంఠము కంటె నధికముగా తలంచి యిటునటు సంచరించుచు తాను తలదాచుకొనుటకొక ప్రదేశ మును చూచుచుండ 12

## శ్రీనివాసుడు స్వామిపుష్కరిణికి పడమటి తీరముననున్న పుట్టలో ప్రవేశించుట

నా పుష్కరిణికి దక్షిణమున నొక నిర్మలమైన గొప్ప పుట్టను 13

చింతచెట్టు క్రింద సంతోషముతో గాంచి యదియే తన కనువగు ప్రదేశమని తలంచి యందు దాగియుండెను. ఆ పుట్టలో శ్రీమన్నారాయణునకు పదివేల సంవత్సర ములు గడచెను. 14

అతీతే ద్వాపరే చైవ । త్వష్టావింశతిమే కలౌ ।
అతీతే వత్సరే కశ్చిత్ । చోళరాజో నృపోత్తమః ॥ 15

అవతారం సమాపన్నో । నాగకన్యోదరే తథా ।
తస్మి న్ఛాసతి భూఖణ్డం । బహుపుణ్య ఫలప్రదమ్ ॥ 16

బహుక్షీరప్రదా గావః । పుత్రా వై పితృవత్సలాః ।
కాలే వవర్ష పర్జన్యః । సస్యా వై బహుధాన్యదాః ॥ 17

నార్యః పతివ్రతాః సర్వాః । పురుషా శ్చ సతీవ్రతాః ।
ఇత్థం శాసతి రాజ్ఞ్యస్మిన్ । జనా ఆనన్ద తత్పరాః ॥ 18

## ఆకాశ నృపగృహే బ్రహ్మాదీనాం ధేన్వాది రూపేణ స్థితిః

తస్మి న్కాలే విధిః సాక్షాత్ । ధేనురూపం సమాశ్రితః ।
బ్రహ్మధేనోః పాలికా ఽభూత్ । గోపాలీ కమలా ఽలయా ॥ 19

సాక్షా ద్రుద్రో వత్సరూపీ । తాభ్యా శ్చేయం సమాగతా ।
పశ్య న్తీ పతిమార్గ న్తు । చోళరాజం సమభ్యగాత్ ॥ 20

చోళరాజ గృహం ప్రాప్య । సమౌల్యేన సవత్సకామ్ ।
విక్రీయ గాం మహాలక్ష్మీః । జగామ నిజధామ చ ॥ 21

గృహీత్వా తాం మహీపాలో । ముద మాప ప్రియాన్వితః ।
బహుక్షీరప్రదాం తాం సః । పుత్రార్థ మకరో త్తదా ॥ 22

తతో దేవమహా ప్రేణ । సాకం శ్రీవేఙ్కటాచలే ।
సా గా ర్జగామ నిత్యన్తు । రమానాథం విచిన్వతీ ॥ 23

తత్ర తత్ర సమాజిఘ్రన్ । భూధరేన్ద్రే వృషాకపిమ్
వినోదిన్య సర్వత్ర । ధేనురూపీ విధి స్తదా ॥ 24

తతః కాలేన మహతా । స్వామి పుష్కరిణీతటే ।
వల్మీకస్థం హరిం జ్ఞాత్వా । తుతోష మనసా విధిః ॥ 25

ద్వాపరయుగము పూర్తిగాగడచి కలియుగమున నిరువది యెనిమిది సంవత్సరములు గడువగా నొకానొక 15

చోళరాజేంద్రుడు నాగకన్య గర్భమునుండి యవతరించి అనేక పుణ్యఫలముల నొసంగు భూమండలమును పాలించుచుండెను. 16

ఆతని పరిపాలనమున గోవులు మిక్కుటముగా పాలనొసంగుచుండెడివి. బిడ్డలు తల్లిదండ్రుల కత్యంత ప్రీతిపాత్రులై యుండిరి. సరియగు సమయమునకు వర్షములు వర్షించుచుండెను. పొలములలో మిక్కిలిగా ధాన్యము పండుచుండెను 17

స్త్రీలు పతివ్రతలై మెలగుచుండిరి. పురుషు లేకపత్నీవ్రతులై యుండిరి. ఇట్లా రాజుయొక్క రాజ్యపాలనమున జనులానందపరవశులై యుండిరి. 18

## ఆకాశరాజ గృహమున బ్రహ్మాదిదేవతలు ఆవు మొదలగు రూపములతో నవతరించుట

ఆ సమయమున బ్రహ్మ ఆవుగను, లక్ష్మీదేవి ఆ యావును గాపాడు గొల్లదానిగను 19

శివుడు దూడగను రూపుపొందిరి. లక్ష్మి గొల్లభామ రూపమున ఆవును దూడను వెంటబెట్టుకొని తన భర్త మార్గము నన్వేషించుచు చోళరాజును సమీపించి 20

ఆవును దూడను మూల్యమున కాతనికమ్మివేసి తన గృహమున కేగెను. 21

చోళరాజు వాటిని గొని సంతసించి చాల పాలనొసంగు నా యావును తన పుత్రుని పాలకై యుపయోగించెను. 22

ఆ గోవు రూపముననున్న బ్రహ్మ చోళరాజు వేయి గోవులతోకలసి శ్రీ వేంకటాచలమున ప్రతినిత్యము శ్రీనివాసుని వెదకుచు తిరుగుచుండెను. 23

శ్రీ వేంకటాచలమున శ్రియఃపతికై యచ్చటచ్చట స్థలమును వాసన చూచుచు వెదకుచు 24

చాల కాలమునకు స్వామిపుష్కరిణీ తీరమున పుట్టలోనున్నట్లుగా నెఱింగి బ్రహ్మ మనమున సంతసించుచు 25

సముత్పత్య చ వల్మీకం । సమన్తాత్ క్షీరధారయా ।
తదా ప్రభృతి నిత్యం తు । రాజధేనుగణాత్ స్వహా ॥ 26

తత్ర గత్వా చ భక్త్యైవ । వల్మీకే క్షీరసేచనమ్ ।
జగన్నాథస్య సమ్ప్రీత్యై । ధేనురూపీ పితామహః ॥ 27

చకార సుదినం గేహే । నైవ క్షీరం దదౌ తదా ।
చిర మేవం గతే కాలే । చోళరాజసతీ స్వయమ్ ॥ 28

ధేనుపాలం సమాహూయ । వచనం చేద మబ్రవీత్ ।
గవాం పాలక! దుర్బుద్ధే! పయో ఽస్యాః కిం కరోషి రే! ॥ 29

కిం త్వం భుఙ్క్షే ఽథవా వత్సో । భుఙ్క్తే తద్వద మే ద్రుతమ్ ।
ఇతి తస్యాః వచః శ్రుత్వా । గోపాలో భయవిహ్వలః ।
ఉవాచ వచనం మన్దం । రాజభార్యాం సగద్గదమ్ ॥ 30

## గోక్షీరపాయినం శ్రీనివాసం ప్రతి గోపాలకృతతాడనమ్

న జానే ఽహ ఇ్చ త త్కర్మ । న మయా పీయతే పయః ।
స్వయం పిబతి వా ధేనుః । వత్సో వేతి న విద్మహే ॥ 31

సత్యం వచన మేతద్ధి । విచారం కురు భామిని! ।
ఇతి గోపవచః శ్రుత్వా । సా సతీ విహ్వలేక్షణా ॥ 32

తాడయామాస తం గోపం । రజ్జుభిః చర్మనిర్మితైః ।
తతః పరదినే ప్రాప్తే । తాడితో రాజభార్యయా ॥ 33

కణ్ఠాత్ప్రిబద్ధరజ్జుం తాం । త్యక్త్వైవ తత్పృష్ఠతో యయౌ ।
ధేనుః ప్రాప్యాథ వల్మీకం । దివ్యం తద్ధరిమన్దిరమ్ ॥ 34

అభ్యషిఞ్చత్పయోభిశ్చ । స్వపయోధరసమ్భవైః ।
తాం దృష్ట్వా ధేనుపః కోపాత్ । కుఠారం హస్తమాత్రకమ్ ॥ 35

ఆ పుట్టనంతను పాలతో తడిపివైచెను. ఆ దినము మొదలుకొని యా గోరూపి బ్రహ్మ ప్రతినిత్యము చోళరాజన్యుని ఆలమందతో 26

ఆ కొండపైకేగి భక్తితో శ్రీమన్నారాయణుడు సంతసించుటకై పుట్టను పాలతో తడపుచు 27

గృహమునకేగిన పిమ్మట పాలనీయకుండెను. ఇట్లు చాలకాలము గడచిన పిమ్మట చోళనరేంద్రుని భార్య 28

గొల్లవానిని పిలచి "గోపాలా! దురాత్మా! ఈ ఆవుపాల నేమిచేయుచున్నావురా? 29

నీవు త్రాగుచున్నావా? దూడ త్రాగుతున్నదా? నాకు వెంటనే బదులు పలుకు" మని యడుగగా గొల్లవాడు భయముచే వడంకుచు నామెతో 30

## ఆవుపాల నారగించుచున్న శ్రీనివాసుని గొల్లవాడు దండించుట

అమ్మా! నేనేమియు నెఱుంగను. నేను పాలను త్రాగుటలేదు. ఆవు తానే త్రాగివేయుచున్నదో యెఱుంగజాలను. 31

నేను నిజమునే పలుకుచున్నాను. నీవు పరీక్షింపుము" ని పలుకగా నా రాణి కోపముచే కనులు చలించుచుండ 32

తోలుచే చేయబడిన త్రాళ్ళతో నా గొల్లవానిని దండించెను. ఇట్లు రాజుభార్యచే కొట్టబడిన నా గొల్ల మరునటి దినమున 33

గొల్లవాడా యావునకు మెడకును కాలికిని యొకే త్రాటితో బంధమువైచి విడచి దాని వెనువెంట నేగెను. ఆవు తిన్నగా శ్రీనివాస నిలయమగు పుట్టచెంతకేగి 34

తన పొదుగుమండి కారుచున్న పాలనా పుట్టపై స్రవింపజేసెను, దానిని గని గొల్లవాడు కోపముతో చేతిపొదవుననున్న గండ్రగొడ్డలి నెత్తి 35

ఉద్ధృత్య తరసా తస్యాః । వక్షోదోగ్ధ్యం సమాచరత్ ।
తదా వల్మీకగః స్వామీ । వాత్సల్యం దర్శయన్ హరిః ॥ 36

"స్వభక్తహననం లోకే । స్వాత్మార్థం సహతే తు యః ।
స ఏవ నరకం భుఙ్క్తే । యావ దాచన్ద్రతారకమ్" ॥ 37

మదర్థే చ కుఠారేణ । హనిష్యతి చ గాం ఖలః ।
ఇతి మత్వా రమాకాన్తః శ్రీనివాసో నిరామయః ॥ 38

"తులసీదళమాత్రేణ । మామకే నైవ యః పుమాన్ ।
పూజయే ద్భక్తిభావేన । తం రక్షామీ తి మత్పణః" ॥ 39

ఇయం తు భక్త్యా మాం నిత్యం । సిఞ్చతి క్షీరధారయా ।
ఇత్థం విచార్య గోవిన్దః । తత్ప్రహారం నిగృహ్య చ ॥ 40

స్వయం జగ్రాహ తం ఘాతం । మౌలౌ స్వే చ జగత్పతిః ।
కుఠారేణాతితీక్ష్ణేన । తాడితే వేఙ్కటేశ్వరే ॥ 41

శిరఃస్ఫోటం సమాపన్నే । కుఠారేణ తదోత్థితా ।
సప్తతాళప్రమాణేన । రక్తవృద్ధి రభూ త్తదా ॥ 42

స తం కోలాహలం దృష్ట్వా । గోపాలో మరణం యయౌ ।
హతే గోపే తదా సా గౌః । అవరుహ్య గిరే స్తటాత్ ॥ 43

రాజానం సమనుప్రాప్య । వత్సహీనేవ దుఃఖితా ।
లుణ్ఠనం పరిచక్రే ఽథ । రాజాగ్రే రాజమన్దిరే ॥ 44

## మృతగోపవిలోకనార్థం శ్రీవేఙ్కటాచలప్రతి నృపాగమనమ్

తాం దృష్ట్వా విహ్వలాం గాం । ఊత స్తిం చార మబ్రవీత్ ।
కిమర్థం లుఠతీయం గౌః । త్యక్త్వా గోసన్తతిం కుతః ॥ 45

గవా సార్ధం గచ్ఛ చార । మేల ద్త్రైన్వాం గవాం గతే ।
ఇతి రాజ్ఞా సమాజ్ఞప్తః । చారః తత్పృష్ఠతో యయౌ ॥ 46

వెంటనే దానిని చంప ప్రయత్నించెను. అపుడు పుట్టలోనున్న శ్రీనివాసుడు "తనను రక్షించుకొనుటకై తన భక్తులను హింసించుటను గాంచియు మిన్నకున్నవారు నక్షత్రాదులుండునంత కాలము నరకము ననుభవింతు"రను నార్యోక్తి ననుసరించి 36.37

నా కొఱకై పాలనర్పించు నీ గోవును దుర్మార్గుడు పరశువుతో చంపబోవ నున్నాడుగదా యని తలంచి. 38

"తులసీదళము మాత్రముచే భక్తితో నన్ను పూజించువానిని సైతము రక్షింతునను" తన ప్రతిజ్ఞను స్మరించి 39

ఈ గోవు ప్రతినిత్యము భక్తితో పాలధార నొసంగుచున్నది కదా ! దీనిని రక్షింపవలెనని యాలోచించి యా గండ్రగొడ్డలి వ్రేటునడ్డి 40

తన తలపై వేసికొనెను. అట్లా పదునుగల గండ్రగొడ్డలి తగులుటచే 41

శ్రీనివాసుని తలపగిలి యేడు తాటిచెట్ల ప్రమాణమున రక్తము ప్రవింప నారంభించెను. 42

ఆ భయంకర దృశ్యమును గాంచి గొల్లవాడు మరణింపగా నా గోవు వేంకటాచలమునుండి వెంటరిగనే దిగి 43

రాజును సమీపించి రాజునకెదురుగా రాజమందిరమున తన దూడ చనిపోయెనో యన్నట్లు భూమిపైబడి దుఃఖముతో పొరలసాగెను. 44

## చనిపోయిన గొల్లవానిని గాంచుటకు శ్రీ వేంకటాచలమునకు రాజేగుట

అట్లు పొరలుచున్న గోవును గాంచి రాజు చారునితో "ఈ ఆవిట్లు పొరలుట కేమి హేతువు ? గోమందనేల విడచివచ్చినది ? 45

నీవీ గోవు వెంటబని దీని నాలమందలో కలుపుము" ని యాజ్ఞాపింపగా నా చారు డావు వెంటబని 46

ఆరుహ్య వేఙ్కటగిరిం । వల్మీకాగ్ర ముపాశ్రితః ।
పతితం ధేనుపం దృష్ట్వా । వల్మీకాగ్రాత్ సముత్థితామ్ ॥ 47

రక్తవృద్ధి ఘోరతరాం । సప్తతాళప్రమాణికామ్ ।
సంవీక్ష్య ధావన్ చారో ఽసౌ, జగామ నృపమన్దిరమ్ ॥ 48

చార స్త మానమ్య నరేన్ద్రసన్నిధౌ । గోపాలకృత్యం సకలం జగాద ।
గోపాలఘాతేన కృతం సరక్తం । వల్మీకరన్ధ్రాంతముపాచధీరః ॥ 49

రక్తవృద్ధిం తతః శ్రుత్వా । రాజా విస్మితమానసః ।
ఆరుహ్య నరయాన ఇవ । శీఘ్రమాగాత్ వృషాచలమ్ ॥ 50

వల్మీకస్యా న్తికే స్థిత్వా । స ఇదం వాక్య మబ్రవీత్ ।
కి మిదం భోః మహత్కష్టం । కేన పాపేన వైకృతమ్ ॥ 51

ధేనుపాలస్య మరణం । వల్మీకం రక్తపూరితమ్ ।
గవా వృత్తా న్తకథనం । కి మిదం వేఙ్కటాచలే ।
ఇతి రాజవచో ఽశ్రౌషీత్ । వల్మీకస్థో జగత్పతిః ॥ 52

ఉద్భిద్య వల్మీక మన న్తవీర్యవాన్ । అన న్తశైలేన్ద్రతలం సమాశ్రితః ।
శ్రీస్వామితీర్థస్య చ దక్షిణే తటే, వల్మీకగః శ్రీభగవా నువాచ ॥ 53

సగద్గదోత్కణ్ఠసమాకులాననః సర క్తబాష్పోదకపూర్ణలోచనః ।
చోళం నృపేన్ద్రం బహుధిక్కృతం గిరా । సశఙ్ఖచక్రప్రతిమాం సమాశ్రితః ॥ 54

## నృపం ప్రతి వల్మీకనిర్గత శ్రీనివాసశాపః

శ్రీ భగవాన్ —

పాపిష్ఠో ఽపి దురాచారః । రాజ్యగర్వమదోన్నతః ।
అనాదం శక్తిహీనం మాం । దరిద్రం వనచారిణమ్ ॥ 55

పితృమాతృవిహీన ఇవ । భార్యాబన్ధువివర్జితమ్ ।
మిత్రభ్రాతృహీనం కుటిలః । కుఠారేణా పి ధారిణా ॥ 56

శ్రీ వేంకటాచలముపైకెక్కి పుట్టదరిజేరి పడియున్న గొల్లవానిని పుట్టలోనుండి వచ్చిన 47

ఏడు తాటిచెట్ల ప్రమాణమున ప్రవహించుచున్న గొప్ప రక్తప్రవాహమును గాంచి యా రాజకింకరుడు పరుగు పరుగున రాజమందిరమున కేగి 48

రాజునకు ప్రణమిల్లి యా గోపాలుని సమాచారమునంతను తెలిపెను. గొల్లవాడు కొట్టుటచే పుట్ట ప్రవేశద్వారమంతయును రక్తముతో తడిసియుండుటను కూడ రాజునకు చెప్పెను. 49

రాజును యా వృత్తాంతము నెఱింగి యాశ్చర్య చకితచిత్తుడై వెంటనే శ్రీ వేంకటాచలమునకు పల్లకిపై జని 50

పుట్టదరిజేరి " ఇట్టి ఘోరకృత్యము నొనరించిన దుర్మార్గుడెవడు? 51

గొల్లవాడు చనిపోవుటకు హేతువేమి? పుట్ట రక్తమయమెట్లయ్యెను? గోవు వలన నీ వృత్తాంతము తెలియుట యెట్లు? శ్రీ వేంకటాచలమున నిట్లు జరుగనేల?" యని పలుకగా 52

శ్రీ స్వామిపుష్కరిణికి దక్షిణతీరమునందలి పుట్టలో వేంచేసియున్న మహాపరాక్రమవంతుడగు శ్రీనివాసుడు పుట్టను భేదించుకొని శేషశైలశిఖరమున శంఖచక్రధారియగు మూర్తితో ప్రత్యక్షమగుచు కంఠము వణకుచుండ బాధచే ముఖము ముకుళించియుండ కమలనుండి రక్తాశ్రువులు స్రవించుచుండ చోళరాజుతో నతితీక్ష్ణముగా 53, 54

## పుట్టనుండి వచ్చిన శ్రీనివాసుడు రాజును శపించుట

శ్రీ భగవానుడు —

" దురాత్మా! నీవు పాపాత్ముడవు. రాజ్యగర్వమదాంధుడవు. అనాథుడనై, భక్తబృందములేనివాడనై, దరిద్రుడనై, వనమున సంచరించువాడనై 55

తల్లిదండ్రులు లేనివాడనై, భార్యచేతను బంధువులచేతను విడువబడినవాడనై, మంచి సోదరులు లేనివాడనై యున్న నన్ను కత్తివలె పదునుగలిగిన గండ్రగొడ్డలితో 56

ఆరాధయత్ నృపశ్రేష్ఠ ! । తద్దుఃఖ మతులం హ్యభూత్ ।
ధేనుపాలాయుధాఘాతా । జ్ఞాతం దుఃఖం మహాద్భుతమ్ ॥ 57

శిరోభిన్నం ధేనుపేన । దయాహీనేన దుర్మతే ! ।
యజమానో గృహే యస్తు । న విచారపరో భవేత్ ॥ 58

స్త్రీపుత్రాద్యైః కృతం కర్మ । తస్యా నిష్టకరం విదుః ।
ఇత్యుక్త్వా భగవాన్ దేవః । శశాప నృపపుఙ్గవమ్ ॥ 59

పిశాచో భవ దుర్బుద్ధే !। మద్దుఃఖాధానకర్మణా ।
ఇత్థం శప్తో నృపశ్రేష్ఠః । పతితః శాపమూర్ఛితః ।
ముహూర్తాన్తే సముత్థాయ । ప్రోవాచ జగదీశ్వరమ్ ॥ 60

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే తీర్థఖణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే స్వామితీర్థపశ్చిమతీరస్థ వల్మీకాత్ శ్రీనివాసావిర్భావవర్ణనం నామ తృతీయో ఽధ్యాయః

---

# అథ చతుర్థో ఽధ్యాయః

## నృపం ప్రతి శ్రీనివాసకృతశాపహేతూపన్యాసః

రాజా —

కిమర్థ మశపో దేవ ! । మా ఽపరాధవివర్జితమ్ ।
అవిచార్య జగన్నాథ ! । కిం మయా ఽపచరితం తవ ॥ 1

న జానేఽహం కిఞ్చిదపి । దుఃఖదం తే రమాపతే ! ।
కో కష్ట మతులం ప్రాప్తం । కథ మత్ర జగత్పతే ॥ 2

ఇతి తేన స విజ్ఞప్తః । శ్రీనివాసో ఽతిదుఃఖితః ।
ఉవాచ మృదుం వచనం । రాజానం శాపమూర్ఛితమ్ ॥ 3

శ్రీనివాసః —

దురాత్ముడు. నిర్దయుడునగు గొల్లవాడు కొట్టిన దెబ్బచే గొప్పదుఃఖము సంభవించినది. వాని గొడ్డలిదెబ్బ సామాన్యమైనదికాదు గొప్పది. 57

ఆ దెబ్బచే నా తల పగిలినది. అనాలోచితముగ కర్మల నాచరించు యజమాని ఇంటనుండగా 58

ఆతని భార్యాపుత్రులు, భృత్యులొనరించు పనులవలన కలిగిన ఫలితము యజమానికే చెందునని పలికి 59

నాకు దుఃఖము నొనగూర్చుటకు నీవే కారణమగుటంజేసి నీవు పిశాచరూపుడవగుమని శపింపగా నా రాజా శాపమును విని మూర్ఛనొంది ఒక్కక్షణకాలము పిమ్మటలేచి శ్రీమన్నారాయణునితో నిట్లు పలికెను. 60

ఇది శ్రీ భవిషోత్తర పురాణమున తీర్థఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున స్వామి పుష్కరిణి పశ్చిమ తీరమునయున్న పుట్టమంది శ్రీనివాసు డవతరించుటను వర్ణించుట యనెడు మూడవ యధ్యాయము.

---

# నాల్గవ అధ్యాయము

## రాజుతో శ్రీనివాసుడు శాపకారణమును వచించుట

రాజు —

సకల లోకైకనాథా! శ్రీనివాసా! అపరాధము నొనరింపని నన్నేల అనాలోచితముగా శపించితివి? నేను నీకేమి ఎగ్గొనరించితివి? 1

నీకు దుఃఖమును కలిగించు కృత్యమును నే నెఱుంగను. ఇట్టి ఘోరశాపము నొసంగితివి. ఇది తీరు నుపాయమేద్ది? 2

అని రాజు ప్రార్థింపగా - శ్రీనివాసుడు మిక్కిలి దుఃఖించి శాపమును విని మూర్ఛ నొందిన రాజుతో - 3

శ్రీనివాసుడు —

పాపిష్ఠో ఽహం దురాచారో ఽ। సత్య విచారీ నృపోత్తమ ।
అజ్ఞానేన తిమఃఖేన । వృథా శాపో మయా ఽర్పితః ॥ 4

తథాఽపి మాం విదుర్దేవాః । భగవన్తం సనాతనమ్ ।
యతో ఽతో మద్వచః సత్యం । మద్భక్తా మా ముపాసతే ॥ 5

దుర్వాపో హ్యనృతో న స్యాత్ । ఇతి వేదవిదో విదుః ।
భక్తవాత్సల్యదోషేణ । దుఃఖితో ఽహం భవామి చ ॥ 6

యావత్కలియుగం తిష్ఠేత్ । తావద్దుఃఖీ భవాన్ నృప ।
ఉభౌ దుఃఖం సమాపన్నౌ । సత్యసఙ్కల్పదోషతః ॥ 7

భవిష్యతి నృపశ్రేష్ఠః । ఆకాశ ఇతి నామవాన్ ।
సో ఽపి మే దాస్యతే కన్యాం । నామ్నా పద్మావతీం శుభామ్ ॥ 8

కన్యాదానస్య కాలే చ । దదాతి వరదక్షిణామ్ ।
కిరీటం శశధార ఇవ । రత్నవజ్రసమాకులమ్ ॥ 9

శుక్రవారే తు సాయాహ్నే । కిరీటం ధారయా మ్యహమ్ ।
కిరీటధారణే స్యాతాం । నేత్రే మే జలపూరితే ॥ 10

ఘటికాషట్కమాత్రం తే । సుఖం తత్ర భవిష్యతి ।
ఇతి కాలావధిం కృత్వా । రాజ్ఞః స్వస్య చ మాధవః ॥ 11

సుఖస్య కాలం సంసూచ్య । స్వావతారప్రయోజనమ్ ।
స్వావతారస్య చరితం । కలౌ కన్యాపరిగ్రహమ్ ॥ 12

ఇతి సమ్భాష్య రాజానం । తత్రా ఽస్తే భగవాన్ హరిః ।
శతశాస్త్రార్థ మాకాఙ్క్షన్ । వైద్యశాస్త్రవిశారదమ్ ॥ 13

గురుం నరపతిర్వా ఇవ । సస్మార జగదీశ్వరః ।
ఆగత ఇవ గురుం దృష్ట్వా । ఔషధం వద మే ద్రుతమ్ । 14

రాజా : నేను పాపాత్ముడను. దుర్మార్గప్రవర్తనశీలుడను. మంచి చెడ్డల నరయ జాలనివాడను. మందబుద్ధితో మహాదుఃఖముతో నవవసరముగా నిన్ను శపించితిని. 4

నన్ను దేవతలు, వేదవేత్తలు, నా భక్తులు భగవంతుడనియు, పురాణ పురుషుడనియు ధ్యానింతురు. అందుచే నా మాట తిరుగజాలదు. 5

నా శాప మసత్యమును కాజాలదు. భక్తుడవగు నీ యందు నాకుగల వాత్సల్యమనెడు దోషముచే నేమను దుఃఖింతును. 6

కలియుగాంతమువరకు నీవును దుఃఖింతువు. నేను తలచినది జరిగియే తీరును గాన నీకును నాకును దుఃఖించు టనివార్యము. 7

కొంతకాలము పిమ్మట ఆకాశరా జావిర్భవించును. ఆతడు పద్మావతియను కన్నియను నా కొసంగును. 8

కన్యాదాన కాలమున వరదక్షిణగా రత్నవజ్ర ఖచితమగు నూర్లకొలది బరువుగల కిరీటమును నా కొసంగును.

శుక్రవారము రోజున సాయంసమయమున నే నా కిరీటమును ధరింతును. అపుడు నా కన్నులలో నీరు నిండును. 10

ఆ సమయమున నారు ఘడియల కాలము నీవు సుఖింతువు అని యిట్లు రాజునకును, తనకును సుఖసమయ పరిమితి నేర్పాటు గావించి 11

తన అవతార ప్రయోజనమును, కలియుగమున తన అవతారచరిత్రమును, కన్యను పరిణయమాడుటయును 12

రాజుతో సంభాషించెను. అనంతరము శ్రీయఃపతి యచ్చటనే యుండి తన గాయము మానుటకై వైద్యశాస్త్ర నిపుణుడగు 13

దేవేంద్రాదుల కాచార్యుడగు బృహస్పతిని తలంచెను. గురువు వచ్చినంతనే తన వ్రణమున కౌషధము త్వరలో తెలుపుమని యాజ్ఞాపింపగా 14

### భగవత్క్షతతాపనోదాయగురుకృతచికిత్సా ప్రకారః

ఇతి తేన సమాజ్ఞప్తో । జీవో జీవవతాం వరః ।
" క్షీర మౌదుమ్బరం దేవ ! । తథా కార్పాస మర్కజమ్ ॥ 15

మేళయిత్వా రమాకాన్త ! । తత్క్షతే పరి ధార్యతామ్ ।
ఇత్యే వం గురుణా ఽఽజ్ఞప్తః । త చ్చకార యథోదితమ్ ॥ 16

### శ్రీవేఙ్కటాచలస్య అయోధ్యామథురాదితాల్యవర్ణనమ్

ఏవం కుర్వన్ రమానాథః । తత్ర లీనో ఽభవ ద్ధరిః ।
కౌసల్యా కీటకగృహం । తిన్త్రిణీ దశరథా గ్రథః ॥ 17

గిరిరూపో ఽనుజః సాక్షాత్ । అయోధ్యా ఽభూదధిత్యకా ।
ఇత్థం రామావతారేణ । సమాం క్రీడా మకల్పయత్ ॥ 18

వల్మీకం దేవకీ సాక్షాత్ । వసుదేవో ఽథ తిన్త్రిణీ ।
బలభద్రః శేషశైలో । మధురా ఽభూ దధిత్యకా ॥ 19

స్వామిపుష్కరిణీ తత్ర । యమునా చ వ్యరాజత ।
యాదవా శ్చ మృగా స్సర్వే । ఖగా వై గోపికాదయః ॥ 20

ఏవం శ్రీకృష్ణరూపేణ । క్రీడితో వేఙ్కటాచలే ।
ఆరాయకాణేవికటే । గిరింగచ్ఛే తితంవిదుః ॥ 21

ఏవం వేదమయః సాక్షాత్ । గిరిర్వ్రైః పన్నగాచలః ।
ఛన్నవల్మీకదేహోఽథ్యే । వైకుణ్ఠా దధికో హ్యభూత్ ॥ 22

సువర్ణముఖరీ నామ । నదీ సావిరజానదీ ।
వైకుణ్ఠో వేఙ్కటగిరిః । వాసుదేవో రమాపతిః ॥ 23

ముక్తా అజాః పక్షిగణాః । ముక్తా రుద్రా మృగోత్తమాః ।
సనత్కుమారప్రముఖాః । వానరాద్యాః ద్విజోత్తమాః ॥ 24

## శ్రీనివాసుని గాయము మానుటకు గురు వొనరించిన చికిత్సా విధానము

ప్రాతము కలవారలలో శ్రేష్ఠుడగు నా బృహస్పతి. "దేవా ! మేడిచెట్టు పాలతో జిల్లేడు ప్రత్తిని 15

కలిపి ఆ గాయముపై నుంచిన గాయము మానును. అట్లు చేయుమని యాజ్ఞాపింపగా నాతడు చెప్పినట్లే యొనర్చుచు 16

## శ్రీ వేంకటాచలమును అయోధ్య మధురా పట్టణములతో పోల్చుట

అచ్చటనే ఎవరికిని కానరాకుండ ఉండెను. పుట్టనే కౌసల్యగను, చింతచెట్టునే దశరథుడుగను 17

శ్రీ వేంకటాచలమునే తమ్మునిగను, పర్వత ప్రదేశమునే అయోధ్యగను తననే శ్రీరామచంద్రునిగను భావించి క్రీడించెను. 18

మరికొన్ని దినములు సాక్షాత్తు పుట్టమే దేవకిగను, చింతచెట్టే వసుదేవుడుగను, వేంకటాచలమే బలభద్రుడుగను, శ్రీ వేంకటాచల శిఖర ప్రదేశమే మధురగను, 19

స్వామి పుష్కరిణియే యమునానదిగను, మృగములే యాదవులుగను, పక్షులే గోపికలుగను, 20

తాను శ్రీకృష్ణుడుగను వేంకటాచలమున విహరించెను. 21

ఈ విధముగా వేదస్వరూపమై శేషశైల మలరారుచున్నది. ఆ పర్వతమున పుట్టయందు తనను దాచుకొని వైకుంఠములో నుండుకంటె యధికానందముతో నుండెను.

సువర్ణముఖరీనదియే విరజానది. శ్రీ వేంకటాచలమే వైకుంఠము; శ్రీనివాసుడే శ్రీమన్నారాయణుడు. 23

ఆ పర్వతమునందలి పక్షులే ముక్తులైన చతుర్ముఖులు. మృగరాజములే ముక్తులైన రుద్రులు. వానరులే సనత్కుమారుడు మున్నగు బ్రాహ్మణ పుంగవులు. 24

మానుషం జన్మ చా ఽప్యాప్య । యః పుమాన్ వేఙ్కటాచలమ్ ।
గన్తు మిచ్ఛతి ధర్మిష్ఠః । తేన సర్వ మనుష్ఠితమ్ ।
ప్రీతో భవే ద్రమానాథః । సర్వదేవనమస్కృతః ॥ 25

శ్రీవేఙ్కటాద్రే ర్మహిమాన ముత్తమం । జానన్తి న బ్రహ్మశివేన్ద్రపూర్వకాః।
కి మల్పవీర్యా మనుజా స్తమోగతాః । జానన్తి విష్ణోః స్థల మద్భుతం హి తత్ ॥

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే తీర్థఖణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే నృపతిం ప్రతి శ్రీనివాసకృతశాపహేతూపన్యాసాదివర్ణనం నామ చతుర్థో ఽధ్యాయః

---

# అథ పఞ్చమో ఽధ్యాయః

## పద్మావతీపరిణయోపోద్ఘాతః

ఋషయః —

సూత ! సూత ! మహాభాగ ! । సర్వశాస్త్రవిశారద ! ।
శ్రుతం శ్రీవేఙ్కటేశస్య । మాహాత్మ్యం పాపనాశనమ్ ॥ 1

అవతారప్రభావ శ్చ । చోళరాజవిబన్ధనమ్ ।
వైకుణ్ఠా చ్చైవ వా గమనం । చరితం లౌకికం పరమ్ ॥ 2

కృపాలో ఽపి దయాసారః । శిష్యప్రీతిపరాయణః ।
తత్కల్యాణవిధిం బ్రూహి । కో వా ఽఽకాశనృపోత్తమః ॥ 3

కథం పుత్ర్య భవ త్పూర్వం । కథం జామాతృతాం గతః ।
యోగినాం మనసా ఽచిన్త్యః । శ్రీనివాసః సతాం గతిః ॥ 4

త త్త్వేన బ్రూహి భగవన్ ! । సాఙ్గం వైవాహికం శుభమ్ ।
యః పుమాన్ వేఙ్కటేశస్య మహిమక్షీరసాగరే ।
స్నానాచారపరో నిత్యం । సదన్యః పుణ్యవర్ధనః ॥ 5

మనుష్య శరీరమును ధరించి శ్రీ వేంకటాచలమున కేగగోరు పుణ్యపురుషుడు సకల ధర్మముల ననుష్ఠించిన ధర్మమూర్తి. సకల దేవతారాధ్యుడగు శ్రీమన్నారాయణు డాశనియం దధిక ప్రీతి కలిగియుండును. 25

గొప్పదైన ఈ శ్రీవేంకటాచల మాహాత్మ్యమును బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు సైతము తెలియజాలకున్నారు. ఇక అజ్ఞానావృతులై అశక్తులగు మనుష్యులు తెలియజాలకున్నారనుట సహజమేకదా ! (తెలియ జాలదురా ?) 26

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున తీర్థఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున చోళరాజును శ్రీనివాసుడు శపించుటకు గల హేతువును వివరించుట యనెడు నాల్గవ అధ్యాయము.

---

# అయిదవ అధ్యాయము

## పద్మావతీ వివాహమునకు కారణము

మహర్షులు —

శౌనకాది మహామునులందరును సూతునితో సూతా ! పుణ్యచరితా ! సకల శాస్త్రవిశేషజ్ఞా ! పాపముల నశింపజేయువట్టియు, 1

శ్రీ వేంకటాచలపతియవతార మాహాత్మ్యమును, చోళరాజుతో జరిగిన యేర్పాటులను, వైకుంఠమునుండి స్వామి వెడలివచ్చుటయు మొదలగు నాశ్చర్యకరమగు శ్రీ వేంకటాచలపతి చరితమును వింటిమి. 2

కరుణాసాగరా ! శిష్యులయందనురాగముకల సూతా ! శ్రీనివాసుని కల్యాణ ప్రకారమును తెలుపుము. ఆకాశరాజెవరు ? 3

లక్ష్మియాతని పుత్రికగా నెట్లాయెను ? సాధుజన సంరక్షకుడును యోగులకైన మనసునకైన నూహింపనశక్యుడగు శ్రీనివాసు డల్లుడగుటకు కారణమేమి ? 4

శ్రీనివాసుని వివాహ విధానమునంతను మాకు చక్కగా నెఱింగింపుము. శ్రీ వేంకటేశుని మహిమయనెడు పాలకడలిలో నిత్యము స్నానమొనరించు (శ్రీ వేంకటేశుని మహిమ ననవరత మనుసంధించు) మనుజుడు పుణ్యము నధికముగా పొందుననుట తథ్యము అతడే ధన్యజీవి. 5

ఏవం మునీనాం వచనం నిశమ్య । సూతో నితాన్తం నిజశిష్యసఙ్ఘాన్ ।
ఉవాచ భక్త్యా హ్యతినమ్రదేహః । సాధ్వి త్య సౌ తాన్ కృపయా ఽభినన్దన్॥ 6

శ్రీసూతః —

శృణ్వన్తు మునయ స్సర్వే । భక్తిభావేన సంయుతాః ।
పన్నగాచలనాథస్య । కన్యాసఙ్గ్రిహణం శుభమ్ ॥ 7

కదాచి ద్వేఙ్కటేశ స్తు । స్వాషధార్థం స్వయం హరిః ।
గమనాభిముఖో భూత్వా । నిర్జగామా రుణోదయే ॥ 8

తస్మి న్కాలే వరాహ స్తు । మృగయాయాం స సూకరః ।
శ్యామాకహారిణం జిత్వా । దైత్యం వృషభనాయకమ్ ॥ 9

సమాగచ్ఛ త్తదా దేవో । వేఙ్కటేశం దదర్శ సః ।
గర్జన్తః కోఽ సి కో ఽసీ తి । సూకరా స్తత్ర చా ఽయయుః ॥ 10

తాన్ దృష్ట్వా జగదీశ స్తు । తత్ర లీనో ఽభవ ద్ధరిః ।
లీనం తం వేఙ్కటే దృష్ట్వా । వరాహవదనో హరిః ॥ 11

వైకుణ్ఠా దాగతం మత్వా । వేఙ్కటేశం శ్రియఃపతిమ్ ,
ఉవాచ వచనం దేవం । ధైర్య మాలమ్బ్య బుద్ధిమాన్ ॥ 12

సో ఽపి శ్వేతవరాహం తం । జానన్ వల్మీకత స్తదా ।
నిరీక్షమాణః సోత్కణ్ఠం । నిర్గత్యో త్తర మభ్యధాత్ ॥ 13

తతో ఽన్యోన్యవిలోకోత్థ । బాష్పసన్దిగ్ధలోచనౌ ।
క్రోడనారాయణౌ సాక్షాత్ । రూపద్వన్ద్వవిరాజితౌ ॥ 14

ఊచతు ర్భాషణ శ్శోభితౌ । కృతలోకవిడమ్బనౌ ।
తయో స్తదద్భుతం కర్మ । దృష్ట్వా బ్రహ్మపురోగమాః ।
వవృషుః పుష్పవర్షాణి । క్రోడ నారాయణోపరి ॥ 15

యథా యుగం యథా దేశం । యథా కాలం యథా వయః ।
తథా ఽవతార మాకాఙ్క్షన్ । రమతే ప్రాకృతో యథా ॥ 16

అని మునీంద్రులడుగగా సూతుడు తన శిష్యులనందరగాంచి మిక్కిలి భక్తికల వాడై "చక్కగా నడిగితిర" ని వారిని దయతో ప్రశంసించుచు 6

శ్రీ సూతుడు —

మునీంద్రులారా ! భక్తితో శ్రీ వేంకటేశుని మంగళకరమైన పరిణయగాథను వినుడు. 7

ఒకానొకతరి శ్రీ వేంకటాచలపతి తన గాయము మాను నౌషధము నన్వేషించుటకై ప్రాతఃకాలముననే బయలుదేరెను. 8

ఆ సమయమున శ్వేతవరాహరూపధారియగు శ్రీమన్నారాయణుడును వేటలో శ్యామాకధాన్యము (చామల) నపహరించు వృషభాసురుని జయించి 9

వచ్చుచు వేంకటాచలపతిని చూచెను. అంతలో అనేక అడవిపందులు "నీవు ఎవడవు, ఎవడవ ' ని గర్జించుచు నచ్చటికి వచ్చిపడెను. 10

ఆ సూకరములను గాంచి వేంకటేశుడు పుట్టలో దాగెను. అంతట శ్వేతవరాహ రూపియగు శ్రీమన్నారాయణుడు పుట్టలో దాగియున్న శ్రీనివాసుని గాంచి 11

వైకుంఠమునుండి చనుదెంచిన శ్రీయఃపతినిగా నెఱింగి ధైర్యముతో నా బుద్ధిమంతుడు పలుకరించగా 12

పుట్టలోనుండి సంతసమున గాంచి యాతనిని శ్వేతవరాహరూపునిగా తెలిసికొని బయటకు చనుదెంచి 13

ఒకరి నొకరు గాంచుటచే నానందాశ్రువులు కనులనిండియుండ వరాహ శ్రీనివాస రూపములతో ప్రకాశించుచున్న వా రిరువురును 14

లోకమున మనుష్యుల ననుకరింపగోరి పరస్పరము సంభాషించుకొనసాగిరి. వారి యా అలౌకిక కృత్యమునుగాంచి బ్రహ్మాదిదేవత లా యిరువురిపై పుష్పవర్షములను కురిపించిరి. 15

మరియు యుగానుసారముగా, నుచితదేశమున, కాలము ననుసరించి, వయోభేదములచే నవతరింపగోరుచు కర్మానుసారము జనించి కర్మఫలము ననుభవించు మనుజుని వలె సంచరించునుకదా ! 16

ఏవం వదన్తః సురపుఙ్గవా స్తే । విచిత్రమాయాం జగదీశచేష్టామ్ ।
స్తువన్త ఊచు స్త మనన్తవీర్యం । అనన్తశైల ఇవ రమాపతి ఇవ ॥ 17

## శ్రీవరాహానుజ్ఞయా శ్రీనివాసస్య శేషాచలప్రాప్తిః

ఇత్య న్యోన్యం భాషమాణౌ । సాక్షా న్నారాయణౌ విభౌ ।
సకౌతుక ఇవ సంవీక్ష్య । స్తుత్వా స్వం స్వం పదం తతః ॥ 18
గతే దేవగణే తత్ర । వరాహో హరి మబ్రవీత్ ।

శ్రీవరాహః —

త్యక్త్వా వైకుణ్ఠలోక స్తు । కిమర్థం త్వ మిహాగతః ? ॥ 19
త ద్వదస్వ మహాభాగ ! । జగదానన్దకారణ ! ।
ఇతి తేన సమాజ్ఞప్తో । న్యగద త్క్రోడరూపిణా ॥ 20

శ్రీనివాసః —

భృగో రఙ్ఘ్రిప్రపాతా చ్చ । రమా కొల్హాపురం గతా ।
తేన దుఃఖేన సన్తప్తః । త్యక్త్వా వైకుణ్ఠ ముత్తమమ్ ॥ 21
ఆగతో ఽస్మి ధరాకాన్త ! । వల్మీకే తవ దక్షిణే ।
నివసన్త మివ మాం దేవ ! । ధేనుపాలో హ్యతాడయత్ ॥ 22
కుఠారేణా సిధారేణ । తత్క్షతం మాం ప్రబాధతే ।
ఔషధార్థం వరాహాత్మన్ ! । గచ్ఛామి హ నిర న్తరమ్ ॥ 23
దైవేన దృష్టవా నస్మి । త్వా మద్యే హ ధరాధరమ్ ।
అత్రైవ నివసామీ తి । సఙ్కల్పో మమ వర్తతే ॥ 24
స్థలం దేహ్యా వసీయా న్త ! । యావ త్కలియుగం భవేత్
ఇతి తేన స విజ్ఞప్తో । వరాహవదనో హరిః ॥ 25
ఉవాచ వచనం దేవః । స్థలం మౌల్యేన గృహ్యతామ్ ।
ఇతి వాక్యం తతః శ్రుత్వా । ప్రోవాచ మధురం వచః ॥ 26

యని శ్రీమన్నారాయణుని అద్భుతకృత్యములను. అపార పరాక్రమశాలియు. శేషాచలవాసియగు శ్రీనివాసుని ఆ పర్వతమును వరాహరూపుడగు శ్రీమన్నారాయణుని స్తుతించుచు 17

## శ్రీ వరాహస్వామి యనుమతితో శ్రీనివాసుడు శేషాద్రియందు నివసించుట

తమలో తాము మాటలాడుకొనుచున్న సాక్షాన్నారాయణ స్వరూపులగు వరాహ శ్రీనివాసులను కుతూహలముతో దర్శించుచు స్తుతించి తమతమ నిలయములకు జనిరి. 18

శ్రీ వరాహస్వామి —

అంత వరాహస్వామి - శ్రీనివాసా ! నీవు వైకుంఠమును వీడి యిచటి కెందులకు వచ్చితివని యడుగగా 19

శ్రియఃపతి యాతనితో - భృగుమహర్షి పాదప్రహారముచే లక్ష్మీదేవి కోల్హాపురమునకు వెడలిపోయినది. ఆ దుఃఖపీడితుడనై వైకుంఠమును వీడి 20,21

శ్రీనివాసుడు —

వచ్చి, నీకు దక్షిణ దిశయందున్న పుట్టయందు నివసించుచున్న నన్ను పశుల కాపరి 22

కత్తివలె పదునగు గండ్రగొడ్డలిచే కొట్టెను. ఆ దెబ్బనన్ను మిక్కలి బాధించుచుండుటచే ఔషధమునకై అనవరతము సంచరించుచున్నాను. 23

అదృష్టవశమున వరాహరూపివగు నిన్ను దర్శింప గలిగితిని. ఇచ్చటనే నివసింపవలెనని నాకు కోర్కెగా నున్నది. 24

కలియుగము గడుచునంతవరకు నాకు స్థలమునిమ్ము " ని యడుగగా 25

వరాహస్వామి మూల్యమిచ్చిన స్థలము నిచ్చెదనని పలికెను. ఆ మాటలకు శ్రియఃపతి 26

ప్రథమం దర్శన ఇచ్చ స్యాత్ । నై వేద్యం క్షీరసేచనమ్ ।
ఇద మేవ పరం ద్రవ్యం । దదామి కరుణానిధే ! ॥ 27

దాస్యామి య త్తే భూకాన్త ! । త దఙ్గీకురు మాధవ ! ।
వరం ద్రవ్య మిదం తాత ! । కృపాం కురు కృపానిధే ! ॥ 28

ఇత్యుక్తో హరిణా పోత్రీ । హరయే స్థానకాఙ్క్షిణే ।
తదా దదౌ స్థలం పాద- । శతమాత్రం రమాపతేః ॥ 29

పరస్పరం వినోదేన । కుర్వాణౌ వేకరూపిణౌ ।
మోహనార్థ మభక్తానాం । భక్తానాం భక్తిసిద్ధయే ॥ 30

వల్మీకే క్రీడతే వేఙ్కటేశ- । క్రోడరూపౌ సురోత్తమౌ ।
తదా రక్ష్య ధరాకాన్తో । వకుళాం పాకకారిణీమ్ ॥ 31

అర్పయామాస దేవస్య । సేవార్థం వేఙ్కటేశితుః ।
భోజనార్థం రమేశస్య । శ్యామాకాన్నం నిరన్తరమ్ ॥ 32

సమధు ప్రేషయ న్నిత్యం । తయా వకుళమాలయా ।
సా బాలా భక్తివిరతా । శ్రీనివాసస్య సన్నిధౌ ॥ 33

అన్నపానౌషధాద్యై శ్చ । పాదసంవాహనాదిభిః ।
పూజయామాస గోవిన్దం । శ్రీనివాసం నిరామయమ్ ॥ 34

ఋషయః —

శ్రుతం సూత ! మహాభాగ ! । దేవాగమన ముత్తమమ్ ।
స శ్రుతం శ్రీవరాహస్య । ప్రథమం దర్శనే ఫలమ్ ॥ 35

శ్రీనివాసస్య కృష్ణస్య । కల్యాణం శుభదం మహత్ ।
పునః శ్రీవేఙ్కటగిరౌ । వాసః శ్రీశార్ఙ్గధారిణః ।
వకుళా సేవికా ప్రోక్తా । కా సా పూర్వం వదస్వ నః ॥ 36

జనులు నన్ను దర్శించుటకంటె ముందు నీ దర్శనమొనరించుటయు, నిత్యము నీకు పాలతో నభిషేకమును, నైవేద్యమును ముందుగావించుటయు మహద్ధనముగా నొసంగెదను. 27

నేనిచ్చు నీ శ్రేష్ఠమగు ద్రవ్యము నంగీకరించుము. దయ చూపుము ' ని 28

తన నివాసమునకు భూమినడుగుచున్న శ్రియఃపతికి వరాహస్వామి నూరడుగుల స్థలము నొసంగెను. 29

వారిరువురు నొకే స్వరూపులైనను భక్తిలేనివారలను మోహింపజేయుటకును, భక్తులకు భక్తినభివృద్ధిపరచుట కన్యోన్యము సరసాలాపక్రీడల నొనరించుచుండిరి. 30

ఆ నాటినుండియు వరాహస్వామి "వకుళ" యను వంటకత్తెను శ్రీనివాసునకు 31

ఉపచారముల నొనర్చుటకై నియమించి శ్రీనివాసునకు భోజనమునకై ప్రతి నిత్యము శ్యామాకధాన్యమును 32

తేనెను వకుళమాల ద్వారా పంపించుచుండెను. ఆ వకుళమాలయు నత్యంత భక్తితో శ్రీనివాసుని సన్నిధానమున మెలంగుచు 33

అన్నపానాదులచేతను, ఔషధము నొసంగుటచేతను, పాదమునొత్తుట మొదలగు శుశ్రూషలచేతను పూజించుచుండెను. 34

మహర్షులు —

అని సూతుడు తెలుపగా శౌనకాది మునీంద్రులు సూతా ! నీవు తెలిపిన శ్రియఃపతి వైకుంఠమునుండి భూలోకమునకు వచ్చిన కారణమును వింటిమి. శ్రీ వరాహస్వామిని మొదట చూచుటవలన కలుగు ఫలితమును 35

సంపత్కరమగు శ్రీనివాసుని కల్యాణమును శ్రీ వేంకటాచలమున శ్రీనివాస నివాసమును, ఆతనికి సేవలొనరించుచున్న వకుళాదేవి పూర్వచరితమును మేము వినలేదు. వానిని మాకెఱింగింపుము " ని యడిగిరి. 36

## వకుళమాలికాఖ్య భగవత్పరిచారికా పూర్వజన్మవృత్తాన్తః

శ్రీసూత: —

పురా యశోదా వకుళా । కృష్ణస్య జననీ హ్యభూత్ ।
అదృష్ట్వా ఽనన్తరూపస్య । కృష్ణస్య తనయస్య సా ॥
కల్యాణం సుఖదం స్వస్య । త దయాచత తం హరిమ్ ॥ 37

యశోదా —

మనః సీదతి మే కృష్ణ ! । తవ కల్యాణవీక్షణే ।
ఉద్యమస్వ రమానాథ ! । యశోదానన్ద వర్ధన ॥ 38

కల్యాణాది మహాపుణ్యం । పావనం చరితం తవ ।
తయే త్యుక్తో రమానాథః । సో ఽవద న్మధురం వచః ॥ 39

శ్రీ భగవాన్ —

జన్మన్య నన్తరే దేవి ! । తావకీనం మనోరథమ్ ।
శ్రీశైలే పూరయిష్యామి । కిఞ్చిత్కాలా దనన్తరమ్ ॥ 40

దేవేనే త్థం రత్నవరా । సా ఽత్యజ త్తేన హేతునా ।
కలేవరం తు కల్యాణీ । యశోదా నన్దవల్లభా ॥ 41

తస్యాః ప్రీత్యై వాసుదేవో । హ్యష్టావింశే కలౌ యుగే
ఆవిర్భూయ యశోదాయాః । తోషకై ర్గుణకర్మభిః ॥ 42

క్రీడ న్నాస్తే జగద్యోనిః । నిర్దోషో ఽపీశ్వరో ఽపి చ ।
దైత్యానాం వఞ్చనార్థాయై వ । సురాణాం ముక్తిహేతవే ॥ 43

వ్యక్తానాం హితార్థాయ । విరక్తానాం విశేషతః ।
ముక్తి మాపాదయన్ దేవః । క్రీడతే ప్రాకృతాకృతిః 44

ఇత్యేవం కారణా దేవ । యశోదా వకుళా ఽభవత్
సా కరిష్యతి కల్యాణం । హరే ర్వేఙ్కటవాసినః ॥ 45

## వకుళమాలికయను శ్రీనివాసుని పరిచారికయొక్క పూర్వజన్మ వృత్తాంతము

శ్రీ సూతుడు —

సూతుడు వారితో - పూర్వము శ్రీకృష్ణుని తల్లియగు యశోద తన పుత్రుడుగా నవతరించిన శ్రీమన్నారాయణుని శుభకరము తన కానందదాయకమునగు కల్యాణమును గాంచకుండుటచే నాతనితో — 37

యశోద —

కృష్ణా ! నీ కల్యాణమును గాంచవలెనని నా మనసు శిధిలమగుచున్నది. 38

మహా పవిత్రమగు కల్యాణము మున్నగు నీ పవిత్ర చరితమును నాకు దర్శింపజేయుము" ని ప్రార్థింపగా శ్రీయఃపతి యామెతో - 39

శ్రీ భగవానుడు —

నీ కోర్కెను కొంతకాలము జరిగిన పిమ్మట మరియొక జన్మలో శ్రీశైలమున తీర్చగలను. 40

అని యిట్లు శ్రీకృష్ణుడు వరము నొసంగగనే నందుని భార్యయగు యశోద తన శరీరమును విడచెను. 41

ఆమెను సంతోషపెట్టుటకై శ్రీమన్నారాయణుడు యిరువది యెనిమిదవ కలియుగమున యశోదను సంతసింపజేయు గుణములచేతను కర్మలచేతను 42

సకల జగన్నియంతయైనను, హేయగుణరహితుడైనను రాక్షససంపన్నులను వంచించుటకు, దైవీసంపన్నులకు మోక్షము నొసంగుటకును 43

తన భక్తులకు హితము నొనగూర్చుటకును, సంసార విముఖులగు వారికి ముక్తినొసంగుటకును, మనుష్యరూపధారియై విహరించుచున్నాడు. 44

ఈ కారణముచే యశోద వకుళమాలికయై యవతరించెను. శ్రీ వేంకటాచల నివాసియగు శ్రీమన్నారాయణున కామె కల్యాణము నొనరించును. 45

కే మలిఘ్యా హరౌ తుష్టే । జ్ఞాన విజ్ఞాన సమ్పదః ।
కశ్చి ద్దేవం పూజయతి । కశ్చి ద్దేవేన పూజ్యతే ॥ 46

హనూమతా పూజితో ఒపి । స్వయ మర్జున మర్చతి
కో వర్ణయే ద్ధరేః క్రీడాం । విచిత్రాం జనపావనీమ్ ॥ 47

విత్య శుద్ధస్య వై విష్ణోః । యతో ఒముష్యా భివన్దనే ।
కృతే పుణ్య మృషిణా మ । ప్య కృతే దోషసఙ్గ్రహః ॥ 48

తస్మా త్పూజ్యో హరి స్సర్వైః । ఋషిభి స్తత్వకోవిదైః ।
పితృభి ర్భూమిపై ర్విప్రైః । మానవైః రాక్షసై ర్గజైః ॥ 49

కలౌ కలుషచిత్తానాం । పాపాచార రతాత్మనామ్ ।
రక్షణార్థం రమాకాన్తో । రమతే ప్రాకృతో యథా ॥ 50

దైత్యానాం మోహనార్థాయ । సురాణాం మోదనాయ చ ।
క్రీడతే బాలకై ర్బాలో । జగత్పాలకబాలకః ॥ 51

జగన్మోహనసౌన్దర్య- । లీలామానుషవిగ్రహః ।
నైత ద్రూపం కృతం దేవైః । న కృతం విశ్వకర్మణా ॥ 52

స్వేచ్ఛయా క్రీడతే తత్ర । స్వేచ్ఛారూపవిరాజితః ।
క్షేత్రస్య మహిమా దివ్యః । తథా తీర్థస్య వైభవమ్ ॥ 53

తత్ర పాతి రమాకాన్తః । కిం తత్ర సుకృతంకృతమ్ ।
బహుజన్మార్జితైః పుణ్యైః । లభ్యతే క్షేత్రదర్శనమ్ ॥ 54

తత్రాపి వేఙ్కటగిరేః । దర్శనం ముక్తిదం పరమ్ ।
దుర్లభం దేవసఙ్ఘానాం । మనుష్యాణా న్తు కాకథా ॥ 55

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే తీర్థఖణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే పద్మావతీపరిణయో
పోద్ఘాతాది వర్ణనం నామ పఞ్చమో ఒధ్యాయః

శ్రీమన్నారాయణుడు సంతసించిన జ్ఞానవిజ్ఞాన సంపదలు సుకరముగా సిద్ధించును. ఒకడు దేవునిచే పూజింపబడును. ఒకడు దేవుని పూజించును. 46

శ్రీరాముడు హనుమంతునిచే పూజింపబడినను తానర్జునుని పూజించెను. లోకమును పవిత్రము నొందింపజాలు ఆశ్చర్యకరమగు శ్రీమన్నారాయణుని క్రీడనెవరు వర్ణింపగలరు? 47

ఋషిశ్రేష్ఠులైనను నిత్యశుద్ధుడగు శ్రీమన్నారాయణుని సేవించిననే పుణ్యము హస్తంగతమగును. సేవింపనిచో పాపము పెరుగును. 48

కావున శ్రీమన్నారాయణుడు సత్వగుణసంపన్నులగు మునీంద్రులచేతను, పితృదేవతలచేతను, రాజులచేతను, బ్రాహ్మణులచేతను, మనుజులచేతను, రాక్షసులచేతను, మహాత్ములచేతను పూజింపబడతగియున్నాడు. 49

కలియుగమున పాపపంకిలమనస్కులై పాపముల నొనరించుటయందే సంలగ్నచిత్తులగు వారిని రక్షించుటకు శ్రీమన్నారాయణుడు మనుష్యులవలెనే నటించును. 50

రాక్షసులను మోహపరచుటకును, దేవతలను సంతసింపజేయుటకును శ్రీమన్నారాయణుడు జగత్తును బ్రోచు బాలుడై బాలురతో క్రీడించును. 51

శ్రీమన్నారాయణుడు జగత్తును మోహింపజేయు సౌందర్యముకలిగి లీలకై ధరించిన మనుష్యశరీరము కలవాడగును. ఇట్టి రూపమును దేవతలుగాని, విశ్వకర్మగాని నిర్మింపజాలరు. 52

అతడు భూలోకమున తన సంకల్పమున క్రీడించుచు, తన సంకల్పముతో రూపముల ధరించుచు ప్రకాశించుచుండును. శ్రీ వేంకటాచలమహిమ దివ్యమైనది. అట్లే నదీ మాహాత్మ్యమును దివ్యమైనది. 53

సాక్షాత్తు శ్రియఃపతియే యచ్చట అవతరించుట కేమి పుణ్యమోగదా! అనేక జన్మలచే నార్జించిన పుణ్యములచే పుణ్యస్థల దర్శనము సిద్ధించును. 54

అందున శ్రీ వేంకటాచలమును దర్శించుట మోక్షహేతువు. ఈ వేంకటాచల దర్శనము దేవతాసమూహములకే సంభవించుట కష్టమనిన నిక మనుజులమాట చెప్పనేల?

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున తీర్థఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున పద్మావతీ వివాహ కారణముల వర్ణించుట యనెడు అయిదవ యధ్యాయము సంపూర్ణము.

---

# అథ షష్ఠో ఽధ్యాయః

## మృగయావిహారోద్యుక్త శ్రీనివాసాలఙ్కార వర్ణనమ్

శ్రీ సూతః —

స కదాచి ద్రమేశ స్తు । చిన్తయామాస వై హయమ్ ।
మనసా చిన్త్యమానే తు । హయః ప్రత్యక్షతాం గతః ॥ 1

వాయు రశ్వత్వ మాపన్నో । రజ్జు స్తత్వాభిమానినీ ।
ఉపాసర్ప త్స్వయం లక్ష్మీః । తతో ఽశ్వం తం స పూజయన్ ॥ 2

తస్యో పరి సమాతిష్ఠత్ । సర్వాభరణభూషితః ।
శుభ్రవస్త్రం పఞ్చదశ హస్తం । బిభ్ర త్తథో పరి ॥ 3

కాఞ్చీం బద్ధ్వా రమాకాన్తః । కాఞ్చీదామవిభూషితః ।
శుభ్రవర్ణ ఞ్చో త్తరీయం । పఞ్చహస్తం తథా దధత్ ॥ 4

ఆదర్శాలోకితే వక్త్రే । ధృత్వా శుభ్రా ఞ్చ మృత్తికామ్ ।
తన్మధ్యే కుఙ్కుమేనా పి । తిలకం సుమనోహరమ్ ॥ 5

పూగీఫలఞ్చ తామ్బూలం । చూర్ణవిక్షేపపాత్రకమ్ ।
కర్పూరవాసితైః పూగ । కాచైర్జాతీఫలైః శుభైః ॥ 6

లవఙ్గైఃపత్రసమ్మిశ్రైః । గర్భితాం రత్నపేటికామ్ ।
ఆదర్శమ్మృత్తికాంశుభ్రాం । తథాకుఙ్కుమభాజనమ్ ॥ 7

స్వర్ణనిర్మితవస్త్రేణ । బద్ధ్వాతుకటిమధ్యతః ।
స్వర్ణయజ్ఞోపవీతాఙ్గః । కణ్ఠాభరణభూషితః ॥ 8

కఙ్కణాఙ్కితదోర్భ్యాఞ్చ । సమ్పూర్ణవరగాత్రకః ।
భుజకీర్త్యా రత్నమయ్యా । రాజమానో ఽఙ్గులీయకైః ॥ 9

# ఆరవ అధ్యాయము

## వేటకొఱకు వేంచేయు శ్రీనివాసుని అలంకారాము వర్ణించుట

శ్రీ సూతుడు —

ఒకానొకతరి శ్రీనివాసుడు గుఱ్ఱము కావలెనని సంకల్పించగనే గుఱ్ఱము ప్రత్యక్షమాయెను. 1

వాయుదేవుడు గుఱ్ఱమయ్యెను. తత్వములకు అభిమానిని యగు లక్ష్మీదేవి కళ్ళెమై సమీపించెను. శ్రీనివాసుడా గుఱ్ఱమును పూజించినవాడగుచు దానిపైనెక్కెను. 2

అతడు సమస్తాభరణముల నలంకరించుకొని పదునైదు మూరల పొడవైన తెల్లని వస్త్రమును ధరించి దానిపై 3

పటకానుగట్టి దానిక్రింద బంగరు త్రాటిచే నలంకృతుడై అయిదు మూరల తెల్లని కండువను పైనవేసికొని 4

అద్దమును చూచుకొని తెల్లని మట్టిని (తిరుమణిని) ముఖమున ధరించి దాని మధ్యలో కుంకుమచే చక్కని బొట్టు నమర్చుకొని 5

వక్కలను, తాంబూలమును, సుగంధద్రవ్యములనుంచు భరిణను. పచ్చకర్పూరముతో పరిమళించు కాచును. మంచి జాజికాయలతోను. 6

ఆకుపత్రితో కలసిన లవంగములతో నిండియున్న రత్నములచే కూర్చబడిన పెట్టెలో తెల్లని మట్టిని (సున్నమును) కుంకుమపువ్వు భరిణిని 7

బంగారముచే వేసిన వస్త్రముతో మొలకుకట్టుకొని బంగారు యజ్ఞోపవీతమును ధరించి, మెడయందాభరణముల నలంకరరించుకొని 8

బాహు మూలములయందు రత్నజటిత భుజకీర్తులను సొంపుగా ధరించి, శరీరమునందంతట నింపగు నాభరణముల ధరించి, ఉంగరములచే ప్రకాశించుచు, 9

కఞ్చుకామాక్తసుగన్ధేన । లిప్తోరోబాహూ రఞ్జితః ।
కబరీకృతకేశేషు । రక్తవస్త్రం సువేష్ట్య చ ॥ 10

లమ్బితైః పుష్పజాలైశ్చ । స్కన్ధగైః పరిభూషితః ।
సువర్ణ రత్నసమ్బద్ధ । పాదుకాసహితాఙ్ఘ్రికః ॥ 11

ధనుర్బాణధర శ్రీమాన్ । సాక్షా న్మన్మధమన్మధః ।
ఏవం మనోహరం రూపం । ధృత్వా శ్రీవేఙ్కటేశ్వరః ॥ 12

హయం రత్నసమాకీర్ణైః । ఉపబర్హై ర్విభూషితమ్ ।
సువర్ణ తిలకోల్లాసి- । వక్త్రం వాయుమనోజవమ్ ॥
నీలవర్ణం పాణ్డుపాదం । హస్తపఞ్చశతోన్నతమ్ ॥ 13

ఆరుహ్యాదేవమణ్యాది । సర్వలక్షణసంయుతమ్ ।
అవరుహ్యాగిరిశ్రేష్ఠాత్ । మృగయార్థం జగామసః ॥ 14

## మృగయావిహారసమయే శ్రీనివాసస్య కన్యాదర్శనమ్

మృగాన్ బహువిధాకారాన్ । సింహశార్దూలజమ్బుకాన్ ।
మాతఙ్గాన్ శరభాన్ ఘోరాన్ । తథా వై మహిషా నపి ॥ 15

జఘాన తాన్ వనే దేవః । సఞ్చరన్ స ఇత స్తతః ।
తత్రైకం హస్తినం దృష్ట్వా । మదోన్మత్తం వనేచరమ్ ॥ 16

తం హన్తు మగమ త్ప్రేష్ఠం । అనుసృత్య రమాపతిః ।
స జగామ వనే దూరం । భయా ద్భీతో వృషాకపిః ॥ 17

స యోజనార్థం గత్వా తు । తత్ర దేవం జనార్దనమ్ ।
దణ్డవ త్ప్రతితో భూత్వా । శుణ్డా ముద్ధృత్య గర్జయన్ ।
యదా గత స్తదా కన్యా । దృష్టిమార్గ ముపాశ్రితా ॥ 18

కుంకుమముచే కూడి పరిమళించు చందనమును వక్షస్థలమునను బాహువుల యం దలముకొని, ముడిగా వేసికొనిన జుట్టునందెట్టివి వస్త్రమును చుట్టుకొని 10

మూపున వ్రేలాడుచున్న పుష్పసమూహములచే విరాజిల్లుచు, బంగారముచేత కప్పబడిన పాదములకలిగి 11

ధనుర్బాణముల ధరించి, శోభాయుక్తుడై మన్మధుని మించిన సోయగముకలిగి, మనోహరమగు రూపమును ధరించి శ్రీనివాసుడు 12

రత్నములచేనిండిన దిండ్లతో నలంకరింపబడినట్టియు, బంగారు బొట్టుతో ప్రకాశించు ముఖము కలిగినట్టియు, వాయువువలెను, మనస్సువలెను వేగము కలిగినట్టియు నల్లని రంగుకలిగి, తెల్లని పాదములు కలిగి పదునైదుచేతుల ఎత్తుకలిగి 13

మెడయందు సుడికలిగియుండుట మొదలగు సకల లక్షణములచే నొప్పుచున్నదగు గుఱ్ఱమునెక్కి కొండనుండి దిగి వేటకొరకేగెను. 14

## వేటసమయమున శ్రీనివాసుడు కన్నియను గాంచుట

ఆ వేటలో అనేక విధములగు మృగములను, సింహములను, పులులను, నక్కలను, ఏనుగులను, శరభమృగములను, అడవి దున్నలను 15

సంహరించి యిటునటు తిరుగుచు నచ్చట మదముచే మదించి అడవిలో సంచరించుచున్న యేనుగును గాంచి 16

దానిని వేటాడుటకై వెంబడించెను. ఆ మదపుటేనుగు మిక్కిలి భయపడి యడవిలో 17

రెండున్నర మైళ్ళ దూరమేగి యచటనున్న జనార్దనస్వామికి సాష్టాంగముగా నమస్కరించి తొండమును పైకెత్తి గర్జించుచుండగా నొక కన్నియ దాని కంటి కగుపడెను. 18

మహర్షులు —

సాకన్యా కస్య సమ్భూతా । కి మర్థం వన మాగతా ।
కస్యే యం తనయా కన్యా । త ద్వదస్వ మహామునే ॥ 19

ఇతి తై శ్చ స విజ్ఞప్తః । సూతః పరమధార్మికః ।
ఉవాచ వచనం భక్త్యా । సన్తోషోద్యుక్తమానసః ॥ 20

శ్రీసూతః —

శృణ్వన్తు మునయ స్సర్వే । కన్యాయా జన్మపావనమ్ ।
పురా తు ద్వాపరస్యా న్తే । పాణ్డవానాం మహాత్మనామ్ ॥ 21

యుద్ధే తు భారతే ఒతీతే । త్వ ష్టావింశే కలౌ యుగే ।
విక్రమార్కాదయో భూపాః । స్వర్గలోకం యదా యయుః ॥ 22

తత్కాలా న్తే వత్సరేషు । సాహస్రేషు గతేషు వై ।
చన్ద్రవంశే నృపఃకశ్చిత్ । సువీర ఇతి విశ్రుతః ॥ 23

జజ్ఞే సుధర్మ స్తత్పుత్రః । తత్సుతౌ నృపపుఙ్గవౌ ।
ఆకాశతొణ్డమానాఖ్యౌ । జాతౌ లోకయశస్కరౌ ॥ 24

ధర్మిష్ఠౌ దృఢభక్తౌ తు । నారాయణపరాయణౌ ।
జ్యేష్ఠో వియన్నృపః సాధుః । కనిష్ఠః తొణ్డమాన్ నృపః ॥ 25

తొణ్డదేశాధిపో భూత్వా । శశాస పృథివీ మిమామ్ ।
తస్మిన్ శాసతి భూచక్రం । ఇదం స్వర్గ ఇవా భవత్ ।
విరాతఙ్క మభూ త్సర్వం । జగత్ స్థావరజఙ్గమమ్ ॥ 26

గావో బహుపయోదా శ్చ । నార్యః పతిపరాయణాః ।
కదాచిత్ పుత్రకాఙ్క్షీ స । హ్యేకా న్తే భవనే స్థితః ॥
అపుత్రో నృపతి ర్దుఃఖాత్ । గురుం ప్రోవాచ భక్తితః ॥ 27

## పుత్రాలాభేన వియన్నృపానుభూత చిన్తాప్రకారః

అనుభూత మిదం రాజ్యం । హ స్త్యశ్వరథసఙ్కులమ్ ।
నానాదాన మహార్ష ఇ్చ । తీర్థయాత్రాం విశేషతః ॥ 28

ఇట్లు సూతుడు తెలిపినంతనే ఋషులాతనితో - ఆ కన్నియ ఎవరు? ఎందులకు ఏనమున కేతెంచినది? ఎవరి పుత్రిక? మాకెఱింగింపుమ ' ని యడుగగా - 19

పరమధర్మాత్ముడగు సూతుడు మిక్కిలి సంతుష్టాంతరంగుడై భక్తితో 20

శ్రీ సూతుడు ---

మునీంద్రులారా! ఆ బాలికయొక్క పవిత్ర జన్మవృత్తాంతమును వినుడు. పూర్వము ద్వాపరయుగము గడుచుచుండగా పాండవులకు కౌరవులకు జరిగిన 21

భారతయుద్ధమున కలియుగమున నిరువదియెనిమిదవ సంవత్సరము గడువగా, విక్రమార్కాది రాజులు స్వర్గమునకేగగా 22

ఆ కాలము చివరి సంవత్సరములు వేయిగడువగా చంద్రవంశమున సువీరుడను రాజు ప్రఖ్యాతినిబడసెను. 23

ఆతనికి సుధర్ముడను పుత్రుడును, ఆతనికి ఆకాశరాజు, తొండమానులను యిరువురు పుత్రులు కలిగి లోకమున విఖ్యాతినార్జించిరి. 24

వారిరువురును ధర్మనిష్ఠులై, దృఢమగు భక్తికలవారై శ్రీమన్నారాయణుని యందత్యంతాసక్తచిత్తులై యుండిరి. పెద్దకుమారుని పే రాకాశరాజు. చిన్నవాని పేరు తొండమానుడనియు వ్యవహరించుచుండిరి. 25

ఆకాశరాజు తొండదేశాధిపతియై భూమండలమునంతను పాలించెను. ఆతడు భూమిని పరిపాలించుచుండగా భూలోకము స్వర్గలోకమువలె భాసిల్లెను. చేతనాచేతన రూపమగు ప్రపంచమునంతయు (నిరంకుశమాయెను) నేకచ్ఛత్రాధిపత్యముగా నేలుచుండెను 26

ఆవులు మిక్కుటముగా పాలనొసంగుచుండెను. స్త్రీలు పతివ్రతలై యుండిరి. ఒకానొకతరి రాజు సంతానాభిలాషియై దుఃఖించుచు రహస్యముగా గురువుతో - 27

## పుత్రులు లేకుండుటచే ఆకాశరాజనుభవించిన విచారమును వర్ణించుట

గుఱ్ఱములతోను, ఏనుగులతోను నిబిడముగానున్న రాజ్యము ననుభవించితిని. అనేక దానముల నొనర్చితిని. పెక్కు తీర్థయాత్రల గావించితిని. 28

నానుభూతం పుత్రసుఖం । పితౄణాం ముక్తిదం ద్విజ ! ।
కిం మయా ఽఽచరితం పాపం । కస్య పుత్రో హతః పురా ॥ 29

కేన పాపేన విప్రేన్ద్ర ! । న ప్రాప్తం పుత్రజన్మ మే ।
నేత్రాభ్యాం నైవ దృష్ట ఞ్చ । పుత్రస్య ముఖపఙ్కజమ్ ॥ 30

కర్ణాభ్యాం న శ్రుతః శబ్దః । పుత్రేణ రుదతా కృతః ।
ద్విజేన్ద్ర ! పితృఽస్థానాం । దుర్గతి శ్చ భవే త్తథా ॥ 31

అపుత్రస్య గతి ర్నాస్తి । త్యే వం వేదవిదా విదుః ।
పుత్రేణ రుక్మపాత్రే తు । నా న్నం భుక్తం మయా సహ ॥ 32

కృతదోషేణ న మయా । కదాచి ల్లాభితః సుతః ।
భూషణా న్యాదరా త్కృత్వా । న పుత్రో ఽలఙ్కృతో మయా ॥ 33

న సఞ్జాతో న మే యః స్యాత్ । పుత్రః పితృహితే రతః ।
సుతార్థం కవచం కృత్వా । త్వమేహీ తి నచోదితః ॥ 34

పుత్రహీన ఞ్చ మాం దృష్ట్వా । కర్ష న్తి యమకిఙ్కరాః ।
గచ్ఛ రాజన్ జవే నై వ । యమస్య భవన త్వి తి ॥ 35

పాశకృన్తితసర్వాఙ్గః । కిము వక్ష్యే మ్యపుత్రవాన్ ।
చిత్రగుప్తేన లిఖితం । అపుత్రత్వం మహామతే ॥ 36

మద్గర్భజేన సుకులం । మూర్జితం తు కదా భవేత్ ।
దురాచారో ఽసి దుర్బుద్ధిః । అపుత్రే తి యమేన చ ॥ 37

భాషితం వచనం శ్రుత్వా । కః పుమాన్ సుఖ మాప్నుయాత్ ।
నష్టదీపో ఽతినైష్ఠుర్యః । కష్టోద్భూతకలేబరః ॥ 38

వృథాజాతో ఽతిపాపాత్మా ఽ । స్మ్యాత్మనో నరకావహః ।
తన్తుహీనం కులఞ్చాపి । విగతామ్బు ఞ్చ వాపికామ్ ॥ 39

స్త్రీణాం భర్తృహీనా ఞ్చ । పశ్యో విష్ఠన్తి సంసది ।
కిం కరోమి మహీదేవ ! । క్వ గచ్ఛామి హా కా గతిః ॥ 40

పితృదేవతలకు ముక్తినొసంగు పుత్రసుఖము ననుభవించనైతిని. నేనొనర్చిన పాపమేమి ? క్రిందటి జన్మమున నేనెవరి పుత్రుని సంహరించితినోకదా ! 29

నాకు సంతానము కలుగకుండుటకు కారణమేమి ? పుత్రుని ముఖకమలమును గాంచు భాగ్యమునందనైతిని. 30

తనయుని ఆక్రందన ధ్వనిని వీనులార విననైతిని. బ్రాహ్మణశ్రేష్ఠులకు, పితృదేవతలకు బంధువులకు నేను నిస్సంతానుడనగుటచే నధోగతిప్రాప్తించును. 31

పుత్రులులేనివారి కుత్తమగతులు ప్రాప్తించవని వేదశాస్త్రము లెఱింగినవారందురు. నా పుత్రునితోగూడి బంగారు పాత్రమున భుజించు భాగ్యము నందనైతినికదా ! 32

పాపాత్ముడనగు నాచే పుత్రుడు ప్రేమాతిశయముచే నాడింపబడలేదు. పలువిధాభరణములతో పుత్రునలంకరించు నదృష్టమును గాంచనైతిని. 33

తండ్రి మేలును కాంక్షించు పుత్రుని బడయనైతిని. పిల్లవానికై కవచమును (చొక్కాను) చేయించి నాయనా ! రమ్మని పిలువజాలనైతిని. 34

పుత్రులులేని నన్ను యమకింకరులు " రాజా ! శీఘ్రముగా నరకమునకు నడువుము " ని పట్టిలాగుదురు. 35

అవయవములన్నియు పాశముచే నొప్పించబడుచుండగా పుత్రులులేని నే నేమని మారుపలుకుదును ? నాకు చిత్రగుప్తుడు సంతానహీనతను వ్రాసియున్నాడు. 36

నా సంతానముచే నా పవిత్రమగు వంశమంతయు శుద్ధమగుట యెన్నడోకదా ! చెడ్డనడతకలవాడవు, దుర్బుద్ధికలవాడవు, పుత్రులులేనివాడవ ' ని యముడు 37

పలుకు మాటలను వినుచు నే పురుషుడు సుఖమునందును ? తేజోవిహీనుడై మిక్కిలి క్రూరుడై కష్టముల ననుభవించుటకే జనించిన దేహముకలవాడై 38

మిక్కిలి పాపముల నాచరించువాడై, తనకు నరకము నాపాదించుకొను ప్రవృత్తిగల మనుజుని జీవితము వ్యర్థము. నేనట్టివాడనైతినిగదా ! సంతానములేని కులమును, నీరులేని దిగుడుబావిని, 39

భర్తలేని స్త్రీని సత్పురుషులు బాహాటముగా నిందింతురు. బ్రాహ్మణోత్తమా ! ఏమి చేయుదును ? ఎచటికేగుదును ? నా గతియేమి ? 40

కం దేవం శరణం గత్వా । భవాబ్ధిం ప్రతరా మ్యహమ్ ।
రుష్టం పుత్ర మాలోక్య । కదా ప్రేమ్ణా త మాహ్వయే ॥ 41

ఘణ్టా ఇవ ప్రతిమాం దత్త్వా । పుత్రస్య ఫలకన్దుకౌ ।
గజ మారోప్య మాం తాత ! । కుర్వన్ గ్రామప్రదక్షిణమ్ ॥ 42

సభాం గచ్ఛ త రాజేన్ద్ర! । తథా తాలస్వనేన చ ।
ఇతి పుత్రేణ సోత్కణ్ఠం । కృతాం మఞ్జులభాషిణా ॥ 43

కదాచిద పి నై వా హం । శ్రుతవాన్ ప్రార్థనా మితి ।
అజాతపుత్రః శోకేన । మూర్ఛా మాప మహీపతిః ॥ 44

పునః సంజ్ఞా మవాప్యా థ । విలలాప సుదుఃఖితః ।
కవచం కారయిత్వా తు । శిరోభూషణ మప్య థ ॥ 45

కేశభూషణ మత్యర్థం । రత్నవ్రజసమాకులమ్ ।
కదాచిదఙ్కమారోప్య । న మయా ఽలఙ్కృతః సుతః ॥ 46

నో పనీతో ఽపి చ ప్రీత్యా । సుతో మే పఞ్చవార్షికః
అష్టమేవా ఽథ దశమే । న కృతో దారసఙ్గ్రహః ॥ 47

బాలస్య జాతకర్మాఽపి । నాకార్షం నా పి చాభిధామ్ ।
పుత్రార్జితం ధనం బ్రహ్మన్ ! । నో పజీవిత మద్య మే ॥ 48

అభిషిచ్య సుతం రాజ్యే । భార్యయా కృతభోజినా ।
న గత ఇవ వనం విద్వన్ । పారమ్పర్యక్రమా న్మయా ॥ 49

అహో దరిద్రస్య మహానుభావ ! మే । పుత్రేణ హీనస్య కథం గతి ర్భవేత్
వృథా శరీరం ఘటకుడ్యసన్నిభం । జాతం సుధర్మస్య కులే సుపావనే ॥ 50

మమసాస్యణా మనాథానాం । దుర్లభం పుత్రజన్మ చ ।
బహుపుణ్యవశా త్పుత్రో । జాయతే మానవోదరే ॥ 51

కన్యకా ఽపి న సమ్భూతా । హ్యస్మాక మతిపాప్మనామ్ ।
సత్పుత్రాః క్వ ను జాయేరన్ । ధర్మసన్తాన సంజ్ఞికాః ॥ 52

ఏ దేవుని శరణువేడి యీ సంసారసాగరమును తరింతును ? ఏడ్చుచున్న బిడ్డనుగాంచి ప్రేమతో పిలచి 41

గంటను, బొమ్మలను, పండ్లను, బంతుల నొసంగి లాలించు భాగ్యమెన్నడో గదా ! 'నన్ను ఏనుగుపై నెక్కించి గ్రామముచుట్టును ప్రదక్షిణమాచరించుచు 42

తాళవాయిద్యములతో సభకేగుమ 'ని మిక్కిలి తహతహతో మృదుమధురముగా పలుకు 43

ప్రార్థన నెన్నటికి వినునట్టి భాగ్యమునకు నేను నోచుకొనలేదుకదా ! అని యిట్లు విలపించుచు రాజు మూర్ఛాక్రాంతుడాయెను 44

మరల కొంతసేపటికి తెలివినొందినవాడై మిక్కిలి యేడ్చి కవచమును, తలను ధరించు నాభరణములను, 45

జుట్టున నలంకరించు నగలను, రత్నములతోను, వజ్రములతోను సమకూర్చి పుత్రునివడిలో కూర్చుండబెట్టుకొని అలంకరించుట దెన్నటికైన లభ్యమగునా ? 46

బిడ్డకయిదు సంవత్సరములు వచ్చినంతనే ఉపనయనము నాచరించుట, ఎనిమిది లేక పదియవ సంవత్సర మరుదెంచినంతనే వివాహమొనరించుట 47

జాతకర్మ (బారసాల) నామకరణాదుల నొసర్చు నదృష్టము నాకు లభింపలేదు. వయసు గడచుచున్న నాకు పుత్రుడు సంపాదించి యొసంగు ధనముతో కాలక్షేపము నొన రించు భాగ్యమబ్బుకున్నది. 48

భోగముల ననుభవించిన పిమ్మట నా పుత్రుని రాజ్యమునందు పట్టాభిషిక్తు నొనరించి మా వంశాచారముగవచ్చు "వృద్ధులు అడవులకేగి వానప్రస్థాశ్రమమును స్వీక రింపవలెన" ను పద్ధతి నవలంబింపనోచనైతిని. 49

మహాత్మా ! సంతానమను సంపదలేని నాకు సద్గతి ఎట్లుకలుగును ? కుండవలె గోడవలె నా శరీరము వ్యర్థము. పరమపవిత్రమగు సుధర్ముని కులమున జనించినను నా జన్మ వ్యర్థము. 50

నావంటి దరిద్రులకు పుత్రులు కలుగుట యసంభవము. పెక్కు పుణ్యవిశేషము లచే మనుజుని గర్భమున పుత్రుడు జనించును. 51

మిక్కిలి పాపాత్ములమగు మాకు కన్నియయైనను కలుగలేదు. పుణ్యసంతా నము బుద్ధిమంతులునగు పుత్రులెచట జన్మింతురోకదా ! 52

వరదా చ్యుత రఙ్గేశ ! జగన్నాథ ! జగద్గురో !
సుబ్రహ్మణ్య ! సురాధీశ ! । రామకృష్ణ ! నమో ఽస్తు తే॥ 53

వేఙ్కటేశ ! రమాకాన్త ! । వరాహవదనా చ్యుత ! ।
నారాయణ ! రమాధీశ ! । కృపాం కురు కృపానిధే ! ॥ 54

సుపుత్రవన్తః ఖలు భాగ్యవన్తో । హ్యపుత్రవన్తో భువి దుఃఖవన్తః ।
సంసారసిన్ధో స్తరణే ఽస్మ్య శక్తః । కా మే గతిః కర్మఫలానుభోగినః ॥ 55

ఏవ ముక్త్వా మహీదేవం । విరరామ మహీపతిః ।
పాపిష్ఠో ఽహం దురాచారః । పుత్రేణా హం దరిద్రితః ॥ 56

హా కాన్ లోకాన్ గమిష్యామి । కృూరం వా నరకం గురో !
క ఉపాయో మహాప్రాజ్ఞ ! । పుత్రలాభే ద్విజోత్తమ ? ।
ఇతి రాజవచః శ్రుత్వా । గురు ర్వాక్య మువాచ హ ॥ 57

## ధరణీ తలాత్ పద్మావత్యుత్పత్తి వర్ణనమ్

గురుః —

యజ్ఞం కురు నృపశ్రేష్ఠ ! । పుత్ర స్తేన భవిష్యతి ।
గురో ర్వాక్యం సమాకర్ణ్య । యజ్ఞాయా శోధయ ద్ధరామ్ ॥ 58

స్వర్ణలాఙ్గలసఙ్ఘై శ్చ । ద్విజమన్త్రిగణై స్తథా ।
శోధ్యమానే ధరాపృష్ఠే । తత్ర పద్మం దదర్శ సః ।
సహస్రపత్రం రాజేన్ద్రః । కి మేత దితి విస్మితః ॥ 59

కన్యాం చ పత్రేషు రమాకృతిం శుభాం । దృష్ట్వా ఽతి సన్తుష్టమనా బభాషే
దేవేన దత్తా త్వియ మిన్దిరాభా । కన్యా కుమారీ కమలాభనేత్రి ॥ 60

ఇత్థం సమాభాష్య నృపోత్తమో ఽసౌ । హస్తే ప్రగృహ్యా ఽశు బభాణదీనః ।
మాయా మహేశస్య దురత్యయా హరేః । కేయం తు యా సమ్ప్రతి గృహ్యతే
మయా ॥

వరములనొసంగు ప్రభూ! అచ్యుతా! శ్రీరంగనాథా! జగత్ప్రభూ! జగదాధారా! చేతనాచేతనములకు సర్వావస్థలయందును హితమై యుండువాడా! దేవాదిదేవా! శ్రీరామా! శ్రీకృష్ణా! నీకు నమస్కారము. 53

శ్రీ వేంకటాచలాధీశా! శ్రియఃపతే! వరాహావతారా! అచ్యుతా! నారాయణా! రమాపతే! దయాసముద్రా! దయయుంచుము. 54

భూలోకమున సత్సంతానము కలవారే అదృష్టవంతులు. సంతానరహితులే దుఃఖభాజనులు. నా కర్మఫలము ననుభవించుచు జీవించుచున్న నేను సంసారసాగరమును దాటు సామర్థ్యము లేనివాడను. నాకు దిక్కెవ్వరు? 55

నేను పాపాత్ముడను. దుష్కర్మనిరతుడను. సంతానభాగ్యము లేనివాడనుగా చేయబడితిని. 56

నే నేలోకముల కేగుదునోకదా! భయంకర నరకమే నాకు ప్రాప్తించునేమో? నాకు సంతానముకలుగు నుపాయమును తెలుపుము' ని విలపింపగా గురువాతనిని గాంచి 57

## భూమినుండి పద్మావతి ఆవిర్భావమును వర్ణించుట

గురుడు —

రాజా! నీవు యజ్ఞము నాచరించిన పుత్రుని బడయగలవ' ని యూరడించగా రాజు యజ్ఞమొనరింపటకై 58

బంగారు నాగళ్ళచే బ్రాహ్మణ మంత్రి సంఘములతో భూమిని పావనమొనరించుచుండగా నచ్చట రాజునకు వేయిదళములుగల పద్మము కనుపించినంతనే "ఇది యేమి" యని ఆశ్చర్యమునంది 59

ఆ రేకులలో లక్ష్మీరూపమున నున్న కన్నియ నాలోకించి మిక్కిలి సంతుష్టాంతరంగుడై "కమలపత్రములవంటి కనులుగలిగి, లక్ష్మివంటి కాంతిగల ఈ బాలికను నాకు భగవంతుడే ప్రసాదించెన" ని 60

సంతసముతో పలుకుచు నా బాలికనెత్తుకొని యీశ్వరుని మాయ దాటశక్యము కానిది. నాకిట్లు దొరికిన ఈ బాలిక యెవ్వరోకదా! అని యిట్లు 61

ఇత్యే వం సంశయానం తం । ఆకాశాఖ్యం నరాధిపమ్ ।
ఉవాచ రాశగా వాణీ । పుత్రీ యం తవ వల్లభా ॥ 62

సంరక్షై నాం మహాభాగ ! । బహుకీర్తిఫలప్రదామ్ ।
ఇత్య న స్తగతాం వాణీం । శ్రుత్వా రాజా ఽతిహర్షితః ॥ 63

తాం కన్యాం ప్రతిగృహ్యై ఽశు । స్వభార్యాం ప్రత్యు వాచ హ
శృణు భద్రే మహాప్రాజ్ఞే ! । దేవదత్తా మిమాం శుభామ్ ॥ 64

వంవర్ధయ వరాం పుత్రీం । గర్భజాతాం సుతా మివ ।
ఇత్యు క్త్వా తత్కరే దత్వా । బహుదాన మథా కరోత్ ॥ 65

## వియన్నృపస్య వసుదానాఖ్య సుతోత్పత్తిః

కన్యా ఽఽగమన పుణ్యేన । సా దేవీ గర్భమాదధే ।
గర్భిణీం స్వసతీం దృష్ట్వా । చక్రే పుంసవనం పతిః ॥ 66

పఞ్చమా సే తు సఞ్జాతే । సీమన్తం నృపపుఙ్గవః ।
కారయామాస విధినా । బ్రాహ్మణై ర్యజుషాం గణైః ॥ 67

తతః కాలేన సా సాధ్వీ । నవమా సే గతే సతీ ।
మాసే తు దశమే ప్రాప్తే । సుషువే పుత్ర ముత్తమమ్ ॥ 68

కన్యారాశిగతే భానౌ । దశమ్యాం రోహిణీయుజి ।
పక్షే తు ప్రథమే దేవీ । సాయఙ్కాలే గురో ర్దినే ॥ 69

పుత్రోత్పత్తి ప్రవ క్తృణాం । సర్వస్వం దత్తవాం స్తదా ।
గవాం కోటిసహస్రాణి । చా శ్వానామయుతం తథా ॥ 70

నవధాన్యాది వస్త్రాణి । వినా స్వే ఛత్రచామరే ।
దానం కృత్వా నృపశ్రేష్ఠః । స్వస్తివాచన మాచరత్ । 71

జాతకర్మాదికం కర్మ । కృతవాం స్తత్క్షణం నృపః ।
దినే చ ద్వాదశే ప్రాప్తే । కృత్వా పుత్రాభిధాం తథా ॥ 72

సంరక్షింపుచున్న ఆకాశరాజుతో ఆకాశవాణి - ఈమె నీ ప్రియ పుత్రిక. 62

ఈమె వలన నీకు చాల కీర్తికలుగును. ఈమెను సంరక్షింపుము' ని పలుకగా ఆకాశరాజు మిక్కిలి సంతసించుచు 63

ఆ కన్యకను స్వీకరించి తన భార్యతో - "కల్యాణీ! వినుము. భగవంతు డొసంగిన మంగళావహయగు 64

ఈ పుత్రికారత్నమును నీవు కన్నబిడ్డనువలె పోషింపుము" ని యామెకొసంగి పుత్రిక దొరికినదను సంతోషముతో పెక్కుదానముల నొసంగెను. 65

## ఆకాశరాజునకు వసుదానుడను పుత్రుడు కలుగుట

కన్నియ దొరికిన వేళావిశేషమున నాకాశరాజు పత్ని గర్భమును దాల్చెను. రాజామెకు పుంసవనమును గావించెను. 66

అయిదవ మాసము రాగానే శ్రేష్ఠులగు వేలాది ఋత్విక్కులచే యథావిధిగా సీమంతమును చేయించెను. 67

అంతట నా సతీతిలకమునకు తొమ్మిది మాసములునిండి పదియవమాసము వచ్చినంతనే 68

సూర్యుడు కన్యారాశియందుండగా రోహిణీ నక్షత్రముతో కూడిన దశమి తిథియందు శుక్లపక్షమున సాయంసమయమున గురువారమున 69

పుత్రరత్నమును కనెను. పుత్రుని యావిర్భావ వృత్తాంతమును తెలిసినవారి కందఱకును రాజు, వేలకొలది కోట్లకొలది యావులను, పదివేల గుఱ్ఱములను 70

నవధాన్యములను, తన ఛత్రచామరములను దక్క తన కున్నదంతను దాన మొనరించి మంగళాచరణమును గావించెను. 71

బాలునకు వెంటనే జాతకర్మాదుల నాచరించి పండ్రెండవ దినమున "వసుదానుడ" ను నామకరణమాచరించి 72

యన్నామ్నా వసుదాతే తి । లోకే ఖ్యాతిం గమిష్యతి ।
తద్దినే బహువిప్రౌఘాన్ । అన్నాద్యైః పర్యతోషయత్ ॥ 73

ఋషయః —

శ్రుతం పుత్రస్య చరితం । న శ్రుతం వ్యాసవల్లభ ।
అయోనిజాయా స్తత్పుత్ర్యాః । కిం నామ చ తదా ఽకరోత్ ॥ 74

శ్రీసూతః —

పద్మోదరీం పద్మగర్భాం । పద్మజాతాం వరాననామ్ ।
పద్మాయా అవతారాం తాం । మత్వా తస్యా స్తదా ఽకరోత్ ॥ 75

అనురూపం నామకర్మ । నామ్నా పద్మావతీ తి చ ।
వర్ధమానౌ సుతౌ దృష్ట్వా । రాజా సన్తోష మాగతః ॥ 76

అకలఙ్కేన్దు సదృశౌ । రమాచన్ద్రిమసా వివ ।
కిం తేన సుకృతం రాజ్ఞా । బహుజన్మసు సఞ్చితమ్ ॥ 77

అగ్రజాం పుత్రికాం దృష్ట్వా । తదన్తే పుత్ర ముత్తమమ్ ।
దృష్ట్వా తుతోష మనసా । సమ్పూర్ణానన్ద విభ్రమః ॥ 78

ఇత్థం కాలే గతే తస్మిన్ । సా బాలా యౌవనం గతా ।
యౌవనాఢ్యాం విశాలాక్షీం । దృష్ట్వా రాజా ఽప్య చిన్తయత్ ॥ 79

విచారయన్ స నృపతిః । పుత్ర్యర్థం వర ముత్తమమ్ ।
నప్రాప దుఃఖసన్తప్తః । "కస్మై దేయా మయా సుతా" ॥ 80

ఇతి చిన్తాబ్ధిమగ్నో ఽసౌ । పుత్రీపరిణయే తదా ।
అపమ్మతో ఽకరో త్పుత్రం । పరం సంస్కార సంస్కృతమ్ ॥ 81

శ్రుత్వా రాజసుతా బాలా । బ్రాహ్మణై రనుజం వరమ్ ।
తదోపనీతం సద్యో ఽభూత్ । పుత్రీ యౌవన పీడితా ॥ 82

సా కదాచి ద్వనం బాలా । సఖీభిః పరివారితా ,
జగామ పుష్పాణ్యా హర్తుం । కన్యా కమలలోచనా ॥ 83

ఆ దినమున చాలమంది బ్రాహ్మణులను అన్నము, వస్త్రము, రూప్యకాది దానములతో సంతసపరచెను. 73

మహర్షులు —

వ్యాసమహర్షి శిష్యుడవగు సూతమహర్షీ! రాజపుత్రుని చరితమును వింటిమి. రాజు భూమినుండుద్భవించిన యా బాలిక కేమని నామకరణ మాచరించెను. 74

శ్రీ సూతుడు —

ఆకాశరాజు బాలికను పద్మమువంటి వర్ణముకలదియు, పద్మముయొక్క గర్భమున (మధ్య) నుండునదియు, పద్మమునుండి పుట్టినదియు, సుందరముఖాబ్జము కలిగి లక్ష్మీదేవి యుపలాపరాజగా నా కన్నియను తలంచి 75

ఆమెకు తగినవిధముగా పద్మావతి యను నామము నుంచెను. పుత్రుడును, పుత్రికయు దినదినాభివృద్ధిని గాంచుచుండగా రాజు మిక్కిలి సంతసించుచుండెను. 76

బాలబాలిక లిరువురును కళంకములేని చంద్రునివలెను, లక్ష్మీ బాలచంద్రుల వలెను విరాజిల్లుచుండిరి. ఆ రాజిట్టి సంతానమును బడయుటకు పెక్కు జన్మలనుండియు నెంతపుణ్యము నార్జించెనోకదా! 77

ముందు జనించిన పుత్రికను ఆ వెంబడిని జనించిన పుత్రరత్నమునుగాంచి మహదానందనిర్భరుడై మనమున నతిమోదమునందెను. 78

ఇట్లు కాలము గడుచుచుండగా ఆ బాలిక యౌవనవతియు, విశాలనేత్రయు నగు పద్మావతిని గాంచి 79

"ఈమె నెవరికిచ్చి వివాహమొనరింతును" ని యాలోచించుచు శ్రేష్ఠుడగు వరుని గానక మిక్కిలి దుఃఖించెను. 80

ఇట్లు పద్మావతీ వివాహ చింతాక్రాంతమనస్కుడై తన కిష్టములేకున్నను బాలున కుపనయనాది సంస్కారముల నొనరించెను. 81

ఉత్తముడగు తన తమ్మున కుపనయనము జరిగెనను వార్తను బ్రాహ్మణుల వలన నెఱింగినంతనే పద్మావతి యౌవనముచే పీడితురాలాయెను. 82

ఆ కమలాక్షి యొకానొక దినమున చెలికత్తెలంగూడి పుష్పములనుకోసి తెచ్చుటకై వనమున కేగెను. 83

వసన్త మాగతం వీక్ష్య । వనే తాభి ర్భయాకులా ।
పుష్పా ణ్యాహారయా మాస । తరుమూల ముపాశ్రితా ॥ 84

తదా ఽఽగతో నారద స్తు । వృద్ధో భూత్వా జటాధరః ।
ధూళిధూసరితాఙ్గ శ్చ । కర్పూర సదృశద్యుతిః ॥ 85

ఆగతం తం మునిం దృష్ట్వా । విస్మయా కులమానసా ।
పద్మావతీ సఖీః ప్రాహ । చటులా భృశకాతరా ॥ 86

కో ఽసౌ భయఙ్కరో బాలాః । క్వ యాత్య త్ర విచార్యతామ్ ।
ఇత్యుక్తా స్తా స్తదా కన్యాః । పప్రచ్ఛుః స్థవిరం ద్విజమ్ ॥ 87

కో ఽసి విప్రః మహాప్రాజ్ఞః । కి మర్థం త్వ మిహా ఽఽగతః ।
వాక్యం తాసాం సమాకర్ణ్య । గురుః ప్రోవాచ సద్వచః ॥ 88

నారదః —

అహం కులగురు స్సాక్షాత్ । యుష్మాకం వరయోషితామ్ ।
హస్తం దర్శయ మే పుత్రి ! । లక్షణాని వదామి తే॥
ఉవాచ లజ్జయా దేవీ । కిం వదిష్యసి హేద్విజ ! ॥ 89

విద్ధి త్వం పితృతుల్యం మాం । మనసా నిర్మలేన చ
ఇత్యు క్తా మునినా మునినా తేన । దత్త్వా హస్తం వరాఙ్గనా ।
ప్రాహ భావి శుభం శ్రోతుం । నిజలక్షణ లక్షితమ్ ॥ 90

పద్మావతీ —

సత్యం వద మహాప్రాజ్ఞ ! । లక్షణాని విలోక్య మే
తతో దృష్ట్వా పాణితలం । ప్రాహ స్మాజ తనూభవః ॥ 91

## నారదోక్త పద్మావతీ శరీర సల్లక్షణాని

నారదః —

పతి ర్భవతి ధర్మజ్ఞో । త్రిలోకేశో రమాపతిః ।
పాణీ పద్మదళో పేతౌ । పాదౌ తే స్వస్తికాయుతౌ ॥ 92

ఆ పుష్పవనమున వసంతర్తుసమాగమమును గాంచి యౌవనపీడితయగుచు సఖియలతో భయపడుచు పుష్పములనుకోసి యొక చెట్టునీడలో నిలచెను. 84

ఆ సమయమునకు నారదుడు జడలను ధరించి ఒడలంతయును భస్మమును రాచికొని తెల్లని కాంతికలిగి వృద్ధరూపమున చనుదెంచెను. 85

ఆతనిని గాంచి పద్మావతి ఆశ్చర్యచకితమానసయై చలించుచు మిక్కిలి భయ విహ్వలయగుచు చెలికత్తెలతో - 86

"సఖులారా ! ఈ భయంకరమూర్తి యెవరు ? ఎచ్చటకేగుచున్నాడో ? కనగొనుడ "ని పలుకగా నా బాలిక లా ముసలి బ్రాహ్మణునితో - 87

విదుషాగ్రేసరా ! బ్రాహ్మణోత్తమా ! నీ వెవరు ? ఎందుల కిచ్చటికేతెంచితివ ' ని యడిగిరి. వారిమాటలకా బ్రాహ్మణవేషధారియగు నారదుడు 88

నారదుడు —

మీవంటి నాకీతిజకములకు నేను కులగురువును. అమ్మా ! నీ చేయిచూపిన నీ శుభలక్షణములను తెలిపెదననగా పద్మావతి సిగ్గుతో " బ్రాహ్మణోత్తమా ? ఏమి తెలుపుదువ " ని యడిగెను. 89

బ్రాహ్మణుడు " బాలా ! నీవు నన్ను నీ తండ్రినివలెనే నిర్మలమైన మనస్సుతో తలంపు " మనగా పద్మావతి యాతనికి తన చేతిని జూపి తన చేతిలోని రేఖల ననుసరించి తనకు రాబోవు శుభమును వివవలెనని 90

పద్మావతి —

" మునీంద్రా ! నా రేఖలనుగాంచి నిజమును తెలుపుమ " ని కోరగా బ్రహ్మ మానసపుత్రుడగు నారదు డామె యరచేతిని జూచి 91

## నారదుడు పద్మావతీ శరీర శుభలక్షణముల వర్ణించుట

నారదుడు —

అమ్మా ! ధర్మవేత్తయు, ముల్లోకనాధుడునగు శ్రియఃపతి నీకు భర్తకాగలడు. నీ యరచేతులు తామరరేకులవలె యెఱ్ఱగను మృదువుగనున్నవి. నీ పాదములు స్వస్తిక చిహ్నములతో చక్కని వంపుకలిగియున్నవి. 92

ముఖం చన్ద్రసమాకారం । చక్షుః కమలకుడ్మలమ్ ।
తిలపుష్పసమాకారా । నాసికా తే విరాజితే ॥ 93

కపోలౌ ముకురాభౌ తే । భ్రువౌ తే ధనుషా సమే ।
దన్తా దాడిమబీజాభాః । ఆస్యం కర్పూరభాజనమ్ ॥ 94

అధరం రక్తపద్మాభం । జిహ్వా మృదుతరా శుభా ।
అరాలాలక సమ్బద్ధా । శ్యామలా భాతి వేణికా ॥ 95

లలాటం రత్నపీఠాభం । శ్రోత్రే శష్కులికాసమే
తను స్తే మన్మథాకార । ప్రతిమా ఒప్రతిమప్రభా ॥ 96

కణ్ఠః సూర్యాంశు సదృశ । తామ్బూలరస దర్శకః
స్తనౌ పీనౌ ఘనౌ కుమ్భౌ । శుభౌ తే మగ్నచూచుకౌ ॥ 97

ఉదరం కదలీపర్ణ । సదృశం నిమ్ననాభికమ్ ।
కటి స్తవ కరిధ్వంసి । కటిసామ్యయుతా శుభా ॥ 98

రమ్భా స్తమ్భ సమాకారం । తవోరు యుగళం రమే : ।
పృష్ఠం తే వేదివ ద్భాతి । కిం త్వయా సుకృతం కృతమ్ ॥ 99

గమనం కరిరాజస్య । సదృశం తే వరాననే : ।
ఇతి సమ్భాష్య తాం దేవీం । దేవర్షిః పద్మసమ్భవామ్ ॥ 100

అన్తర్దధే నారద స్తు । సర్వాసాం పురతో మునిః ।
సంస్తుత్య కమలాం దేవీం । మనసా చిన్తయన్ రమామ్॥
మనసా వన్దనం కృత్వా । జగామా థ ఋషి స్తదా ॥ 101

ఇతి శ్రీ భవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే మృగయావిహారోద్యుక్త శ్రీనివాసా లఙ్కారాది వర్ణనపూర్వకం ఆకాశనృపతేః కన్యాపుత్ర ప్రాప్తివర్ణనం నామ షష్ఠో ఒధ్యాయః

మోము పిండుచంద్రునివలె నొప్పుచున్నది. నేత్రములు తామరమొగ్గలవలె నున్నవి. నీ ముక్కు నూవుపూవువలె విలసిల్లుచున్నది. 93

నీ చెక్కిలద్దమువలె నున్నది. నీ కనుబొమలు ధనురాకారమున ప్రకాశించు చున్నవి. నీ పలువరుస దానిమ్మగింజలవలె రాజిల్లుచున్నది. నీ నోరు కప్పూర భరిణెవలె యలరారుచున్నది. 94

నీ యధరోష్ఠమెఱ్ఱని కాంతికలదై కలకల లాడుచున్నది నాలుక మిక్కిలి మార్దవము, పవిత్రతకలిగి భాసిల్లుచున్నది. నీ జడ వంపుతిరిగిన ముంగురలతో నల్లని వర్ణము కలిగియున్నది. 95

నీ ఫాలప్రదేశము రత్నపీఠమువలె నమరియున్నది. చెవులు చక్కిలములవలె నందగించుచున్నవి. నీ శరీరము మన్మథునివలె చక్కదనముకలిగి సాటిలేని కాంతిపుంజ ముతో వలరారుచున్నది. 96

నీ మెడ సూర్యకిరణమువలె మెరయుచు ప్రమింగిన తాంబూలరస వర్ణమును పైకి జూపుచు నెట్టనిదై కాంతి నింపుచున్నది. స్తనములు బలిసి పెద్దవై, అణగి లోనణ గిన చనుమొనలుకలవై మంగళావహములై యున్నవి. 97

నీ కడుపు అరటియాకువలె సొంపుగనున్నది. నీ బొడ్డు మిక్కిలి లోతుగా నున్నది. నీ నడుము సింహపునడుమువలె మిక్కిలి సన్నముగ నొప్పుచున్నది. 98

నీ తొడలు అరటిబోదెలవలె తెల్లగ నునుపుగా నింపెసగుచున్నవి. నీ పృష్ఠ భాగము యజ్ఞవేదికవలె విశాలమైయున్నది. నీ వొనర్చిన పుణ్యవిశేషమత్యధికమైనది. 99

ఓ సుందరముఖీ ! నీ నడక మదగజ గమనము బోలియున్నది. అని యిట్లు పద్మమునబుట్టిన యామెను గారవించి పలికి 100

మౌనీంద్రుడు పద్మావతిని స్తుతించి లక్ష్మీదేవిని మనసున తలంచుచు మనసు లోనే నమస్కరించి అంగనామణులందరు గాంచుచుండగా నంతర్హితుడాయెను. 101

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున వేటాడుటకేగనున్న శ్రీనివాసుని యలంకారమును వర్ణించుచు ఆకాశరాజునకు పుత్రిక పుత్రుడు కలుగుటను వివరించుట యనెడు ఆరవ అధ్యాయము సంపూర్ణము.

---

# అథ సప్తమోఽధ్యాయః

## పద్మావత్యాః పుష్పాపచయ సమయే శ్రీనివాస దర్శనమ్

శ్రీసూతః —

కన్యాయా జననం ప్రోక్తం । కుమారస్యా పి వై తతః ।
తస్యా వదామి చారిత్రం । వైవాహం పుణ్యవర్ధనమ్ ॥ 1

శ్రీ సూతః —

కరీన్ద్రసఙ్గేన సమాగతో హరిః । తురఙ్గ మాస్థాయ వరాఙ్గనానామ్ ।
శ్రీగన్ధలేపారుణచారువక్షాః । బాలార్కభాః సోఽథ సమీప మాయయౌ ॥ 2

గర్జన్తం గజరాజం తం । దృష్ట్వా పద్మావతీముఖాః ।
వనస్పతి ముపాశ్రిత్య । తత్ర లీనా స్తదాఽభవన్ ॥ 3

నిమీల్య నేత్రవర్త్మని । వ్యూహం కృత్వా వరాఙ్గనాః ।
పశ్యన్త్యోఽథ తరుచ్ఛన్నాః । పునః పున రవస్థితాః ॥ 4

తదన్తరేఽబలా స్సర్వాః । దదృశు ర్హయ ముత్తమమ్ ।
బాలార్కసదృశాకారం । స్వర్ణాభరణభూషితమ్ ॥ 5

పురుషేణ సమాయుక్తం । మన్మథాకారతేజసా ।
తం దృష్ట్వా గజరాజోఽపి । హయస్థం పురుషోత్తమమ్ ॥ 6

నమస్కృత్య యథాన్యాయం । జగామ విపినం నదన్ ।
తం దృష్ట్వా యోషితః సర్వాః । విస్మయాఽకులమానసాః ॥ 7

కరసమ్పుట మాపన్నాః । చలితా స్తు భయాతురాః ।
వృక్షమూలం గతా బాలాః । అన్యోన్యం వాక్య మబ్రువన్ ॥ 8

కోఽయ మత్ర వరారోహే ! సఖి ! కఞ్జాయతేక్షణే ! ।
కోఽసౌ కిరాతరూపీ చ । కిం న దృష్ట స్త్వయా పురః ॥ 9

# ఏడవ అధ్యాయము

## పద్మావతి పూలుకోయుచున్న సమయమున శ్రీనివాసుని గాంచుట

శ్రీ సూతుడు —

పుత్రుడు పుత్రిక జనించుటను తెలిపితిని. పుణ్యము నభివృద్ధిపరచు పద్మావతీ కల్యాణ చరితము తెలిపెదను; 1

ఎఱ్ఱని శ్రీగంధము నలందిన చక్కని వక్షస్థలముతో బాలసూర్యునివలె భాసించు శ్రీనివాసుడు గుఱ్ఱమునెక్కి మత్తగజమును వెంబడించుచు యువతులచెంత కేతెంచెను. 2

పద్మావతి మున్నగు వంగనామణులు గర్జించుచున్న మదకరీంద్రమును గాంచి యొక వృక్షము వెనుక దాగియుండి 3

గుంపుగగూడి కనులను మూసికొనుచు తెరచుచు మాటిమాటికిని ఆ గజమును గాంచుచుండగా 4

బాలసూర్యునివలె తేజరిల్లుచు బంగారు ఆభరణములచే నలంకరింపబడి నవమన్మథునివలె నున్న పురుషునిచే నధిష్ఠింపబడిన ఉత్తమాశ్వమును గాంచిరి. మదేభము గుఱ్ఱముపై కూర్చునియున్న శ్రీనివాసుని గాంచి 5, 6

తన స్వభావానుసారముగ నమస్కరించి గర్జించుచు నడవిలోనికి వెడలిపోయెను. చెట్టుక్రిందనున్న అంగనామణులందరు నాశ్చర్యచకితమానసులై శ్రీనివాసునిగాంచి 7

భయముచే రెండు చేతులను కలిపికొనుచు వణకుచు చెట్టుమొదలునచేరి తమలో తాము 8

పద్మాక్షీ ! సుందరీ ! కోయవాని వేషమున నిచ్చటికేతెంచిన ఈ పురుషుడెవరు ? గుఱ్ఱముపై నధిష్ఠించి వచ్చుచున్న నీ యెదుటనున్న పురుషుని నీవు చూచుటలేదా ! 9

తురఙ్గోపరి సంస్థాయ । య ఆగచ్ఛతి హే సఖి ! ”
ఏవం వదన్త్యః స్తాస్తస్థుః । సా చ పద్మావతీ శుభా ॥ 10

ఉవాచ మన్దం వచనం । సఖీ స్తాస్తు తతో ద్విజాః ।
పృచ్ఛన్తు తస్య వృత్తాన్తం । పితృమాతృస్వబాన్ధవాన్ ॥ 11

దేశం వృత్తం కులం శీలం । నామ గోత్రాదికం తథా ।
ఇతి సఖ్యా స్సమాజ్ఞప్తాః । తా ఊచు ర్వచనం స్త్రియః ।
ఆగతం పురుషం దృష్ట్వా । కో ఽసి కో ఽసీతి చా బ్రువన్ ॥ 12

కన్యాః —

కి మర్థ మాగతో ఽసి త్వం । కిం తే కార్యం వద ప్రభో ।
న సన్తి పురుషా హ్యత్ర । గచ్ఛ గచ్ఛేతి చా బ్రువన్ ।
తాసాం తద్వచనం శ్రుత్వా । హయస్థో వాచ మూచివాన్ ॥ 13

శ్రీ భగవాన్ —

అస్తి కార్యం వరారోహాః । రాజపుత్ర్యాః సమీపకే ॥ 14

స్త్రియః —

కిం కార్యం వద శీఘ్రం త్వం । య త్తే మనసి వర్తతే ।
క్వ తే వాస శ్చ కిం నామ । కా తే మాతా చ కః పితా ॥ 15

కో భ్రాతా కా చ భగినీ । కిం కులం గోత్ర మేవ చ ।
ఇతి తాసాం వచః శ్రుత్వా । వ్యగద జ్జగదీశ్వరః ॥ 16

## పద్మావతీశ్రీనివాసయోఃపరస్పరసంవాదః

శ్రీనివాసః —

కన్యా పేక్ష ముఖ్యకార్యం । త దస్తే ప్రవదామి వః ।
ఇతి తాః ప్రోచ్య చోవాచ । దేవీం పద్మావతీ మథ ॥ 17

విష్ణుపుత్రకులం ప్రాహుః । అస్మాకం తు పురావిదః ।
జనకో వసుదేవ స్తు । దేవకీ జననీ మమ ॥ 18

అని సంభాషించుచు నిలచియుండగా పద్మావతి వారితో "సఖులారా ! 10

ఆ వచ్చిన పురుషుని వృత్తాంతమును, ఆతని తలిదండ్రు లెవ్వరైనదియు, ఆతని బంధుగులను గూర్చియు, 11

ఆతని దేశమును వ్యాపారమును, కులమును, శీలమును, నామమును, గోత్రమును అడిగి తెలిసికొనుడ 'ని రహస్యముగా నాజ్ఞాపింపగా నా నారీమణులు శ్రీనివాసుని చెంతకేగి నీ వెవడవు ? నీ వెవడ 'వని యడిగిరి. 12

కన్యకలు —

ఎందులకు వచ్చితివి ? నీ కిచట పనియేమి ? ఇచ్చట పురుషులులేరు. పొమ్ము పొమ్ము 'ని పలికిరి. వారి మాటలకు శ్రీనివాసుడు గుఱ్ఱముమీదనుండియే 13

శ్రీ భగవానుడు —

సుందరీమణులారా ! మీ రాజపుత్రితోనే నాకు పనియున్నద ' నెను. 14

స్త్రీలు —

దానిని విని యా లలనామణులు "మా రాజపుత్రికతో నీ కేమిపని ? నీ మనసులోని మాటయేమి ! నీ నివాసమెచ్చట ? నీ పేరేమి ? నీ తలిదండ్రులెవరు ? 15

నీ సోదరసోదరీమణులెవరు ? నీ కులగోత్రములేమి ?" యని ప్రశ్నించగా శ్రీనివాసుడు

## పద్మావతీ శ్రీనివాసుల సంవాదము

శ్రీనివాసుడు —

కన్నియను కోరి యన్వేషించుట నా ప్రధానకృత్యము. దానిని మీకు నా పని గడచిన పిమ్మట తెలుపగలన ' ని వారితో పలికి పద్మావతితో - 17

మా పెద్దలు మాది యదువంశమందురు. తండ్రి వసుదేవుడు. నా తల్లి దేవకి. 18

అగ్రజః శ్వేతకేతు స్తు । సుభద్రా భగినీ మమ ।
పార్థో ఽపి మే సఖా దేవి ! । పాణ్డవా మమ బాన్ధవాః ॥ 19

షణ్ణాం తు మృతపుత్రాణాం । కృతనామ్నాం మహాత్మనామ్ ।
వియోగతప్తౌ పితరౌ । సప్తమం రామ ఇత్యథ ॥ 20

చక్రతుః సంస్కృతం నామ్నా । పితృలిఙ్గ ముపాగతమ్ ।
జాతో ఽహ మష్టమో ఽష్టమ్యాం । సుభద్రా మదనన్తరమ్ ॥ 21

మాతృవర్ణ శ్చ మే దేవి । కృష్ణపక్షే జని ర్మమ ।
తస్మా త్కృష్ణేతి మాం దేవి ! । చక్రతు ర్నామ సంస్కృతమ్ ॥ 22

వర్ణతో నామత శ్చా పి । కృష్ణం ప్రాహు ర్మనీషిణః ।
వృత్తాన్తో హ్యఖిలో మత్తో । జ్ఞాతః పణ్డితనన్దిని ! ॥ 23

యుష్మాభి రుచ్యతాం వార్తా । గోత్రనామకులాదికమ్ ।
ఇతి తేన సమాజ్ఞప్తా । ప్రోవాచ నృపనన్దినీ ॥ 24

పద్మావతీ —

ఆకాశరాజతనయాం । నిషాదాధిప ! విద్ధిమాం ।
నామ్నా పద్మావతీం కృష్ణ ! । కులం శీతకరస్య చ ।
అత్రిగోత్రం కిరాతేన్ద్ర ! । శీఘ్రం గచ్ఛే తి చా బ్రవీత్ ॥ 25

శ్రీనివాసః —

కి మర్థం నిష్ఠురం వాక్య । మస్మంకిం న ప్రభాషసే ।
అన్నం కాఙ్క్షన్తి పై లోకాః । యో దదాతి నరోత్తమః ॥ 26

స పుమాన్ పుణ్య మాప్నోతి । జలదో ఽపి ఫలం లభేత్ ।
అదిశన్ మృదుభాషీ చ । న తు నిష్ఠురభాషణః ॥ 27

అథా హం కామ ముద్దిశ్య । పాత్రభూతో ఽస్మి సాంప్రతమ్ ।
మత్త మేష్యసి దానేన । త్వ న్తే స్వర్గం గమిష్యసి ॥ 28

నా అన్న శ్వేతకేతువు (బలరాముడు) సుభద్ర నా సోదరి. అర్జునుడు నా స్నేహితుడు. పాండవులు నా బంధువులు. 19

నామకరణము లొనరింపబడిన మహాత్ములగు అర్గురు పుత్రులు చనిపోయిన వియోగముచే తలిదండ్రులు పీడింపబడుచుండిరి. 20

తండ్రివలె రూపసాదృశ్యముగల ఏడవ బాలునకు బలరాముడను నామకరణము నొనరించిరి. నే నష్టమి దినమున నెనిమిదనవాడుగా జనించితిని. నా తరువాత సుభద్ర జనించెను. 21

నేను నా తల్లిరంగులో కష్ణపక్షమున జనించుటచే నాకు కృష్ణుడను పేరు నుంచిరి 22

రంగు ననుసరించియు, పేరు ననుసరించియు నన్ను ప్రాజ్ఞులు కృష్ణుడందురు. పద్మావతీ ! నా వలన నా వృత్తాంతము నంతయు వింటివికదా ! 23

మీ కులమును గోత్రమును పేరును చెప్పుము ' ని యడుగగా నామె - 24

పద్మావతి —

కోయరాజా ! నన్నాకాశరాజ పుత్రినిగా నెఱుంగుము. నా పేరు పద్మావతి యందురు. మాది చంద్రవంశము. అత్రిగోత్రము. మా వార్త నెఱింగితివికదా ! ఇక వెంటనే వెడలిపొమ్ము' ని నుడువగా 25

శ్రీనివాసుడు —

రాజపుత్రీ ! అంత నిష్ఠురవాక్కులేల ? మెల్లగా పలుకరాదా ? ప్రజలన్నము నభిలషింతురు. అట్టివారి కన్న మొసంగువాడు 26

పుణ్యమును పొందును. దాహముగొన్నవారి కుదకమునిచ్చినను పుణ్యలోకము నొందును. అన్నమును, జలము నీయకున్నను మర్యాదగ మాటాడిన వారికి పుణ్యము లభించును, కాని నిష్ఠురోక్తులనాడు వారికి పుణ్యము కలుగనేరదు. 27

నే నిపుడు కామార్తుడనైతిని. నా కోర్కెనుతీర్చి సుఖమునుపొంది అంతమున స్వర్గమున కేగుము. 28

ఆత్మానం దిశ మహ్యం త్వం । కిం వృథా నిష్ఠురోక్తిభిః
సా తస్య వచనం శ్రుత్వా । క్రోధా త్తామ్రవిలోచనా ॥ 29

పద్మావతీ —

అవాచ్యం వదసే మూఢ ! । జీవనేచ్ఛా న విద్యతే ।
ఆకాశరాజ స్త్వాం దృష్ట్వా । హనిష్యతి న సంశయః ।
యావ న్నాయాతి తావ త్త్వం । గచ్ఛ శీఘ్రం స్వ మాలయమ్ ॥ 30

శ్రీనివాసః —

కార్యా స్తే మరణం సౌఖ్యం । కార్యహానౌ మృతిః కుతః ।
కథం హన్యాత్ స రాజేన్ద్రః । స్త్వద్ధర్మాభిముఖో హి మామ్ ।
త్వం కన్యా ఽహం వరో దేవి ! । కో ఽత్రా న్యాయో మహీపతేః ॥ 31

పద్మావతీ —

శృణు మూఢ ! న జానాసి । బాలభావేన కిం వృథా ।
త్వాం దృష్ట్వా ఽఽకాశరాజో ఽపి । కృత్వా తే గలబన్ధనమ్ ॥
బధ్నీయా న్నిగళై ర్మూర్ఖ ! భవిష్యత్త్వవదామ్యహమ్ ॥ 32

శ్రీనివాసః —

నిశ్చిత్య మరణం దేవి ! । రన్తుకామో ఽస్మ్య హం త్వయా ।
జాతస్య మరణం నిత్యం । పూర్వకర్మఫలానుగమ్ ।
ఆకాశరాజో ధర్మాత్మా । కథం హన్యా దనాగసమ్ ॥ 33

పద్మావతీ —

గౌరవం య న్నిషాదేన్ద్ర ! । నృపస్యా స్య హరే ర్వృథా ।
వరదస్యా థ రఙ్గస్య । వేఙ్కటాచలవాసినః ॥ 34

త ద్రక్ష త్వం మహాబాహో ! । సుఖం గచ్ఛ స్వ మాలయమ్ ।
ఇత్యు క్తో ఽపితయా దేవ్యా । విషదేన్ద్రాకృతి ర్హరిః ॥ 35

నిరాకృత్య చ త ద్వాక్యం । హయస్థః పున రాప తత్ ।
హయ మగ్రాగతం వీక్ష్య । సా బాలా వాక్య మబ్రవీత్ ॥ 36

నీవు నిన్ను నా యధీనము గావించుకొనుము, కఠినోక్తులనాడకుము 'ని అను నయముగ పలుక పద్మావతి కోపముచే కనులెర్రవారగా 29

పద్మావతి —

'' దురాత్మా ! ఇట్టి దుర్భాషల నాడుచుంటివేల ? నీకు ప్రాణములపై నాశ లేనటులున్నది. మా తండ్రియగు ఆకాశరాజు నిన్ను గాంచిన తప్పక చంపివేయును. అతడు వచ్చునంతలో నీ ఇంటికిపొమ్ము ' ని గద్దించగా 30

శ్రీనివాసుడు —

నా పని పూర్తిఅయిన పిమ్మట చనిపోయిన నాకు సుఖముగనుండును గాని పని జరుగకుండ చనిపోయిన ఫలితమేమి ? రాజు అధర్మశాలియై నన్నెందులకు వధిం చును ? నీవు పెండ్లికావలసిన బాలికవు, నేను నీకు తగిన పెండ్లికుమారుడను. నేను నిన్ను కోరుటలో నన్యాయమేమున్నది " ని యనినంతనే పద్మావతి - 31

పద్మావతి —

మూఢాత్మా ! నీవు చిన్నతనముచే నేమియు నెఱుంగజాలకున్నావు. ఆకాశరాజు నిన్నుగాంచిన నీ కంఠమును బంధించి సంకెళ్ళతో నిన్ను బంధించును. ఇది తప్పక జరిగియే తీరున' ని పలుకగా శ్రీనివాసుడు - 32

శ్రీనివాసుడు —

నాకు మరణము సంభవించినను నీతో రమింపవలెనను నాశను వీడజాలను. దానిని నిశ్చయించుకొనియే వచ్చితిని. పుట్టినవానికి గిట్టకతప్పదు. పూర్వకర్మ ఫలము ననుసరించి శుభాశుభము లనుభవించియే తీరవలెను. నిరపరాధినగు నన్ను ధర్మాత్ముడగు ఆకాశరాజెట్లు చంపున ' ని తన నిశ్చయమును తెలుపగా పద్మావతి — 33

పద్మావతి —

కిరాతరాజా ! శ్రీమన్నారాయణుని యొక్కయు, వరదరాజుని యొక్కయు, శ్రీరంగనాథునియొక్కయు, శ్రీ వేంకటాచలపతియొక్క గౌరవమువలెనే యీ రాజునకును గొప్ప గౌరవమున్నది కావున నాతని యాజ్ఞననుసరించియే మనమందరము 34

మెలంగవలెను. కావున నీవు సుఖముగా నీ యింటికేగుము ' ని తెలిపినను కిరాతరాజు వేషమునందున్న శ్రీనివాసుడు 35

పద్మావతీ వచనముల తిరస్కరించి యామెకు దగ్గరగా గుఱ్ఱమును నడుపించగా తనకెదురుగా సమీపించిన గుఱ్ఱమును గాంచి పద్మావతి 36

పద్మావతీ —

త్యక్త్వా చ పితరౌ బన్ధూన్ । భ్రాతృముఖ్యాన్ వనేచరన్ ! ।
అనాథో భ్రమియసే వ్యర్థం । కిమర్థం కాకభాజనమ్ ।
ఇతి తస్యాః వచః శ్రుత్వా । తా మూచే వారిజేక్షణః ॥ 37

శ్రీనివాసః —

విధినా లిఖితం య త్తు । న త ద్వ్యర్థం భవిష్యతి ।
జయో వా ఽపజయో వా స్యాత్ । త్వయి భోగం కరోమ్య హమ్ ॥ 38

ఇ త్యుక్త్వా కోపతామ్రాక్షీ । సఖీభిః పరివారితా ।
ఉద్దియన్తీ జగద్యోనిం । శిలాపాణిః సమాగమత్ ॥ 39

తాడయామాస గోవిన్దం । శిలౌఘైః శీఘ్రగత్వరైః ।
తాడ్యమానః శిలావర్షైః । న్యపతత్ ఘోటరాట్ స్వయమ్ ॥ 40

త్యక్త్వా తం స హయం దృష్ట్వా । ము క్తకేశో ముహు ర్ముహుః ।
పశ్యన్ పశ్యన్ దిశ స్సర్వాః । అభ్రమ ద్విభ్రమ న్నివ ॥ 41

హయో వై సఙ్కటంప్రాప్తో । మమా త్ర కృతసన్నిధేః ।
ఇత్యు చ్చరన్ రమాకాన్తో । జగామో త్తరదిఙ్ముఖః ॥ 42

ఆరూఢసోపానగణో గిరేర్విభుః । విడమ్బయన్ లోక మవాప శయ్యాన్ ।
ప్రాప్యా ధి మానన్దయుతో ఽపి మాధవో । యథా యుగా న్తే వటపత్రశాయీ ॥

ఇతి శ్రీభవిష్యో త్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే పద్మావతీశ్రీనివాసయోః
పరస్పరం సంవాదాదివర్ణనం నామ స ప్తమో ఽధ్యాయః సంపూర్ణః.

---

పద్మావతి —

"అయ్యో! కిరాతరాజా! తలిదండ్రులను, బంధువులను, ప్రియ సోదరులను విడచి అడవిలో సంచరించుచు కాకివలె దిక్కులేని మృతినందెదవ" వి మందలింపగా 37

శ్రీనివాసుడు —

"బ్రహ్మవ్రాసిన వ్రాతనెవరును తప్పింపజాలరు. నాకు జయము కలిగినను, అపజయము కలిగినను విన్ననుభవించియే తీరుదున" వి తన నిశ్చయము నెఱింగింపగా 38

పద్మావతి కోపముచే కనులెఱ్ఱవారగా చెలికత్తెలతోగూడి రాళ్ళను చేతగొని శ్రీనివాసుని భయపెట్టుచు 39

వెంటవెంటనే చాల రాళ్ళతో రాళ్ళవర్షమో యనునటుల కొట్టెను. ఆ రాతి దెబ్బలకు అశ్వరాజము నేలకూలెను. 40

శ్రీనివాసుడు చనిపోయిన గుఱ్ఱమునుగాంచి జుట్టువిప్పికొని మాటిమాటికి దిక్కులను జూచుచు పిచ్చిపట్టినవానివలె తిరుగుచు 41

నేను దగ్గరలో నుండగనే గుఱ్ఱము చనిపోయినదికదా! అని విలపించుచు నుత్తరదిక్కున కేగెను. 42

నిరవధికానందమయుడైనను లోకులు తనను సాధారణ మానవుడని తలంచవలెనను నుద్దేశముతో మెట్లమీదుగా శ్రీ వేంకటాచలమున కేగి వ్యాధిని నటించుచు ప్రళయకాలమునందు మఱ్ఱియాకుపై పవళించు పరమాత్మవలె పక్కపై పవళించెను. 43

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున పద్మావతీ శ్రీనివాసుల సంభాషణను వర్ణించుట యనెడు ఏడవ యధ్యాయము.

# అథ అష్టమో ఽధ్యాయః

## పద్మావతీపరాజితశ్రీనివాసం ప్రతి వకుళమాలికా సాన్త్వవచనమ్

శయనం ప్రాప పర్యఙ్కే । శ్రీనివాసో వృషాకపిః ।
తదా గతా చ సా దేవీ । సేవార్థం వకుళా శుభా ॥ 1

షడ్విధాన్నం సమాదాయ । సూపాపూపరసాన్వితమ్ ।
రమాపతే స్తు బహుళ । భక్తిభావేన సంయుతా ॥ 2

శయానం శ్రీనివాస ఇ్చ । వల్మీకస్థానసంస్థితమ్ ।
శ్వసన్తం దీర్ఘనిఃశ్వాసం రుదన్తం నేత్రబిన్దుభిః ।
అభాషమాణం శ్రీకాన్తం । బభాషే వకుళా శుభా ॥ 3

వకుళా —

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ! । కిం శేషే పురుషోత్తమ ! ।
న కదా ఽపి దివా ఽస్వాప్సీః । నా కార్షీః రోదనం హరే ! ॥ 4

కిమర్థం దుఃఖ మేణాక్ష ! । ఆర్తవత్ దృశ్యసే కుతః ।
మనోగతం వా కిం దేవ । త ద్వదస్వ యథార్థతః ॥ 5

పరమాన్నం కృతం దేవ ! । భోక్తు మాగచ్ఛ మాధవ ! ।
ఇత్యుక్తం వచనం శ్రుత్వా । నో వాచ వచనం హరిః ।
హరిం దృష్ట్వా హిరణ్యాఙ్గీ । పున ర్వాచ మువాచ హ ॥ 6

కిం దృష్టం విపినే కృష్ణ ! । కిమర్థం దుఃఖముల్బణమ్ ।
ఆర్తిహీనో ఽపి దేవ ! త్వం । ఆర్తవ ద్దృశ్యసే కుతః ॥ 7

మనోగతం వదా ఽశేషం । గౌరవం మయి మాకృథాః ।
గౌరవంబలరామేస్యాత్ । దేవకీవసుదేవయోః ॥ 8

దుఃఖం భవతి దృష్ట్వా త్వాం । అభుక్తం భూతభావన ! ।
సర్వలోకార్తిసంహర్తః । పుణ్యమూర్తేనమోఽస్తుతే ॥ 9

# ఎనిమిదవ అధ్యాయము

## పద్మావతిచే పరాభవింపబడిన శ్రీనివాసుని వకుళమాలిక ఊరడించుట

శ్రీనివాసు డట్లు పక్కపై పరుండినంతనే వకుళమాలిక యాతని శుశ్రూషకై యాతని చెంతకు 1

పప్పు అప్పములు పులుసులతోగూడి కారము, ఉప్పు, పులుపు, వగరు, తీపి, చేదు అనెడు ఆరు రకముల పదార్థములతోగూడిన అన్నమును మిక్కిలి భక్తిసంభరితాంతరంగయై తీసికొని వచ్చి 2

పుట్టకు దగ్గరగా వసించి నిడుద నిట్టూర్పులు విడుచు కన్నుల నీరు కారుచుండ నేడ్చుచు మాటలాడకయున్న శ్రీనివాసుని గాంచి వకుళ. 3

వకుళ —

గోవిందా! లెమ్ము, లెమ్ము. పరుండి యుంటివేలనయ్యా? నాయనా! నీ వెన్నడును పగటివేళ నిద్రించెడివాడవు కావుగదా! ఎన్నడును నీవు విచారించుటను గాంచి యెఱుంగను. 4

నీ దుఃఖకారణమేమి? నీ వెందులకు దీనునివలె కనుపించుచున్నావు? నీ మనస్సునం దున్నదానిని నాకు నిజముగా నెఱింగింపుము. 5

నీకై పరమాన్నమును చేసి తెచ్చితిని. ఆరగించుటకు రమ్మని పిలువగా నాతడు బదులు పలుకకుండుటచే మరల 6

కృష్ణా! అడవిలో నీకేమిగోచరించెను? నీకు మిక్కుటమగు దుఃఖము కలుగుటకేమి హేతువు? నీ కిసుమంత కష్టములేకున్నను పీడితునివలె కనుపించుట కేమి హేతువు? 7

నీ మనస్సునందలి యాదేశమును వినిపింపుము. నాయందు గౌరవభావముంచి తెలియజేయుటకు సంకోచింపకుము. దేవకీ వసుదేవులందుగాని, బలరామునియందుగాని నీకు గౌరవమున్న నుండుగాక. 8

సకలప్రాణి సృష్టికర్తా! భోజనముచేయక శయనించియున్న నిన్నుగాంచి దుఃఖమున కలుగును, సకలలోక దుఃఖపరిహారకా! పుణ్యచరితా! నీకు నమస్కారము. 9

కా దృష్టా కన్యకా కృష్ణ ! । గాన్ధర్వీ వా సురోత్తమ ! ।
కస్యాః సఙ్గం సమాపేక్ష్య । చిత్తవైకల్ప్య మద్య తే ॥ 10

కా చ పుణ్యవతీ బాలా । బాలం భక్తవశం హరిమ్ ।
మోహయామాస కామార్తా । న జానామి జగద్గురో ! ॥ 11

వద గోవిన్ద ! తే కార్యం । క్షణమాత్రా త్కరోమ్య హమ్ ।
మృగం దృష్ట్వా భయం వాప్తం । చోరం వా క్రూరరూపిణమ్ ॥ 12

పిశాచభూతప్రేతాన్ వా । న జానామి రమాపతే ! ।
మన్త్రం వా మన్త్రపూగా న్వా । మూలికా ఔషధాన్య పి ॥ 13

కారయిత్వా యథా శాస్త్రం । తత్సర్వం శమయా మ్యహమ్ ।
ఇత్యుక్తే ఽపి హరౌ తూష్ణీం । స్థితే వకుళమాలికా ॥ 14

ఆనీతం తత్ర నిక్షిప్య । తత్సమీప ముపాశ్రితా ।
పాదసంవాహనం కృత్వా । సాన్త్వయామాస చాసకృత్ ॥ 15

సాన్త్వయన్త్యా తయాఽఽయాస । స్విన్నం దేహం సమస్తతః ।
ఆపాదమౌలిపర్యన్తం । కరాభ్యాం పరిమృజ్య చ ॥ 16

బోధితో ఽపి రమాకాన్తో । నోవాచ వచనం యదా ।
తదా సా వకుళాఖేదాత్ । ఉవాచ వచనం హరిమ్ ॥ 17

పృథక్కృత్వా ఛన్నవస్త్రం । హస్తేన పరిమృజ్య చ ।
దేవదేవ ! జగన్నాథ ! । పురాణపురుషోత్తమ ॥ 18

మనోగతం కరిష్యామి । నాత్ర కార్యా విచారణా ।
సత్యం వద మనస్థం తే । మా లజ్జాం మా భయం కృథాః ॥ 19

పూరయా మ్యవిలమ్బేన । యావ న్మే వర్తతే బలమ్ ।
ఇతి తద్వచనం శ్రుత్వా । హరి రుష్ణం సముచ్ఛ్వసన్ ।
ఉవాచ బా తిదుఃఖేన । మన్దం మన్దం మనోగతమ్ ॥ 20

నీ వేకన్నియను గాంచితివి ? గంధర్వ కన్యనా ! ఏ కన్నియను పొందగోరి నీ మనస్సు కలతచెందుచున్నది ? 10

అదృష్టశాలియగు నే బాలిక మదనసంతప్తురాలై భక్తులకు వశుడగు శ్రీని వాసుని మోహింపజేసినది ? 11

నీవు చేయమనిన పనిని నిమిషమాత్రములో చేసివేయుదును. ఘోర మృగ మును గాంచి గాని ఘోరకృత్యముల నొనరించు దొంగ కనుపట్టినగాని నాకు భయము కలుగనేరదు. 12

భూత ప్రేత పిశాచముల నే నెఱుగను. మంత్రములను జపించిగాని, మంత్రించి యొసంగిన వస్తువులనుగాని, మూలికలనుగాని, ఔషధములనుగాని 13

శాస్త్రానుసారముగా చేయించి నీ బాధనంతను తీర్చివైతున ' ని తెల్పినను శ్రీనివాసుడు మాటాడకుండుటంజేసి 14

తెచ్చిన పదార్థముల నచ్చటనే యుంచి పాదములొత్తుచు మాటి మాటికి నోదార్చసాగెను. 15

మిక్కిలి వెతచెందుచున్న దేహమునంతను చేతులతో నిమురుచు లాలించినను మాటలాడకుండుటచే వకుళాదేవి దుఃఖముతో 16, 17

శ్రీనివాసుని దుప్పటిని తొలగించి చేతితో నొడలు నిమిరి జగన్నాథా ! దేవదేవా ! 18

నీ మనోరథమును తీర్చెదను. నీవీ విషయమున శంకించకుము. నీ మనస్సులో నున్న దానిని నిజముగా తెలుపుము. సిగ్గుజెందకుము. భయపడకుము. 19

నా శక్త్యానుసార మాలసించక పూర్తిచేసెదన ' ని పలుకగా శ్రీనివాసుడు వేడి నిట్టూర్పులు విడచుచు దుఃఖించుచు మెల్లమెల్లగా 20

## వకుళాం ప్రతి శ్రీనివాసోక్తస్వమనోనిర్వేదహేతువర్ణనమ్

నా మోహయ న్మాం గాన్ధర్వీ । న ర్షిపుత్రీ న రాక్షసీ ।
న పిశాచా భూతగణాః । ప్రేతా వా మే భయావహాః ॥ 21

మృగా శ్చారణ్యకా శ్చోరాః । న క్రూరా మే కదాచన ।
మన్నామస్మరణా దేతే । విద్రవన్తి దిశో దశ ॥ 22

తత స్తేభ్యో భయం నే హ । మృత్యుమృత్యో ర్మమానఘే ।
మయా దృష్టా వరా కన్యా । నామ్నా పద్మావతీ శుభా ॥ 33

తాందృష్ట్వామేమనోభ్రాన్తం । కామమోహవశంగతమ్ ।
సురూపాంసున్దరీంసుభ్రూం । నీలాలకవిరాజితామ్ ॥ 24

పూర్ణేన్దువదనాంశ్యామాం । నీలమాణిక్యవిగ్రహమ్ ।
సాక్షా ద్రమా సమాం కన్యాం । ఘటయా ఽశు వరాననే ! ॥ 25

బహుజన్మార్జితైస్తై వ । పుణ్యైస్తై షా హి లభ్యతే ।
మత్పుణ్యం పక్వతాం యాతం । దర్శనేన సులోచనే ! ॥ 26

మానుషం దేహ మాసాద్య । తాం కన్యాం కః పుమాం స్త్యజేత్ ।
లోకే వినా జడమతిం । అన్నపానవివర్జితమ్ ॥ 27

జీవనేన కి మేతేన । కార్య హీనేన మే సఖి ! ।
ఘటయా ఽశు వరాఙ్గీం తాం । ఆకాశనృపనన్దినీమ్ ॥ 28

తాం వినా న హి జీవామి । సత్య మిత్య వధారయ ।
తాడితో ఽహం శిలావర్షైః । హతా శ్చో ఽస్మివరాననే ! ॥ 29

మజ్జీవనం వృథా మాతః । జాతం స్తై వేఙ్కటాచలే ।
యతో ఽభూ దవతారో ఽత్ర । పద్మావత్యర్థ మేవ మే ॥ 30

పుత్రో మే వైర మాపన్నః । కిం కృతం పూర్వజన్మని ।
దృష్టిహీనేన విధినా । నిర్మితా కన్యకా వరా ॥ 31

## వకుళమాలికతో శ్రీనివాసుడు తన మనస్సునందలి దుఃఖకారణమును తెలుపుట

వకుళమాలికా! నన్ను గంధర్వకన్యగాని, ఋషిపుత్రికగాని, రాక్షసాంగనకాని మోహపరచలేదు. పిశాచములుగాని, భూతములుగాని, ప్రేతములుగాని నన్ను భయ పెట్టజాలవు. 21

అడవి మృగములుగాని, దొంగలుగాని నా కెట్టి కీడునొనరింపజాలరు. నా పేరును తలచినంతనే వారు పదిదిక్కులకును పారిపోదురు. 22

అంతకునకును అంతకుడనగు నాకు వాటివలన భయము కలుగజాలదు. 23

చక్కని రూపము కలదియు, సుందరియు, అందమగు కనుబొమలు కలదియు, నల్లని ముంగురులతో నొప్పునదియు 24

పూర్ణచంద్రునిబోలు మోముకలదియు, యౌవన మధ్యస్థురాలును, ఇంద్రనీల మాణిక్యమువలె నిగ నిగ మెఱయుచున్న శరీరము కలదియు, సాక్షాత్తు లక్ష్మీదేవి వంటి పద్మావతియను పేరుగల కన్నియను గాంచినంతనే నా మనసు వికారమును చెందినది. నా కా కన్నియను శీఘ్రముగా చేకూర్చుము, 25

పలుజన్మలచే సంపాదించిన పుణ్యముచే నామె లభించును. ఆ కన్నియను గాంచుటచే నా పుణ్యము ఫలించినది. 26

ఈ లోకమున అన్నపానాదులను వీడిన మందబుద్ధిగల పురుషుడు తక్క మనుష్య జన్మము నొందిన పురుషుడెవడు నా కన్నియను వీడజాలడు. 27

నా కోర్కె ఫలింపనిచో నాకీ జీవితమే వలదు. ఆకాశరాజకుమార్తె యగు పద్మావతిని నాకు శీఘ్రముగ చేకూర్పుము. 28

ఆమె లేనిదే నేను జీవింపజాలను. నా మాట నిజమని నమ్ముము. ఆ కన్నియలు రాలవర్షముచే నన్ను కొట్టిరి, నా గుఱ్ఱమును చంపివైచిరి. 29

నా అవతార మీ వెంకటాచలమున పద్మావతికొఱకే గాన అది లభింపనిచో నా జీవితము వ్యర్థము. 30

నా యందా పద్మావతి కనురాగము గలుగకుండుటకు నా పుత్రుడగు మదనుడు నాతో శత్రుత్వమును వహించుటవలననేకదా! విచక్షణాజ్ఞానములేక తొలిజన్మమున నేమి పాప మొనరించెనోకదా! అంధుడగు బ్రహ్మచే సృష్టింపబడిన యా కన్నియ 31

అనామేనేన మే సా స్యాత్ । ఇతిమే నిశ్చితా మతిః ।
కిం సృష్టం బ్రహ్మణా పూర్వం । మత్పాపం ఘోరదర్శనమ్ ॥ 32

యత్పాప మనుసృత్యే వం । ఘటనం నా కరో ద్విధిః ।
మద్భాగస్థో విధి స్త్వం హి । సాహాయ్యం కురు మే ఽఙ్గనే ! ॥ 33

న కరోషి యదా బాలే ! తదా మే మరణం ధ్రువమ్ ।
మరణే జీవనోపాయం । యే కుర్వన్తి నరోత్తమాః ॥ 34

తే దివం యాన్తి యానేన । పుణ్యమార్గేణ కన్యకే ! ।
ఇత్థం ధర్మార్థకామా త్వం । ధర్మమార్గ ముపాశ్రయ ॥ 35

కి ముక్తేన విశేషేణ । విదితాఽసి ఽసి సఙ్గమే ।
త్వం మే మాతా పితా దేవి ! । భ్రాతా మాతుల ఏవ చ ॥ 36

త్వం ప్రహ్లాద స్త్వం మకన్దాః । త్వం ధ్రువ స్త్వం గజేశ్వరః ।
త్వ ముద్ధతో ఽతిభక్తో మే । త్వం కిరీటీ బలి స్తథా ॥ 37

అజామిళో ద్రౌపదీ చ । భక్తో మే త్వం విభీషణః ।
త్వాం దృష్ట్వా మే మనో హర్షం । గచ్ఛతీ హ నిరన్తరమ్ ॥ 38

మద్దుఃఖ వ్యపనోదాయ । నిర్మితా విధినా ఽఙ్గనా ।
గవాం కోటిసహస్రేణ । హయానా మయుతై స్తథా ॥ 39

సువర్ణతిలదానై శ్చ । సమం మాఙ్గల్యవర్ధనమ్ ।
కన్యాం దృష్ట్వా తు సన్తోషం । లభనే నా త్ర సంశయః ।
ఇతి తేన సమాజ్ఞప్తా । వకుళా వాక్య మబ్రవీత్ ॥ 40

వకుళా —

కుత్రా ఽప్తే జగదాధార ! । త్వయా యా ఽత్ర నిరీక్షితా ।
తన్మార్గం వద గోవిన్ద ! । గచ్ఛామి కరుణానిధే ॥ 41

కా సా పూర్వం కిమర్థ ఞ్చ । కన్యకా జనితా భువి ।
తద్వృత్త మఖిలం బ్రూహి । సత్యేన మమ కేశవ ॥ 42

నాకు సులభముగ లభింపనని నా నమ్మకము. భయంకరమగు పాప మేమి యొనర్చితినో ? బ్రహ్మ నాయం దే పాపమును జూచెనో కదా ! 32

నా పాపమును దేవినమపరించియో బ్రహ్మ మా కిరువురకును సంధాన మొనరించ కున్నాడు. నీవే నా భాగధేయము. నాకు నీవు సహాయము నొనరింపుము. 33

నీ వనుకూలించనిచో నాకు మరణము నిశ్చయము. చనిపోవనున్నవారిని బ్రతికించు నుపాయము నొనరించు మానవులు 34

విమానములలో పుణ్యమార్గమున స్వర్గము నలంకరింతురు. ఇది ధర్మార్థకామముల తత్వము. నీవు ధర్మమార్గ మనుసరింపుము. 35

ఇంకను పెక్కు వచనములేల ? నా కోర్కె నెఱింగించితివి. నీవే నాకు తల్లివి. నీవే తండ్రివి సోదరుడవు, మేనమామవు నీవే. 36

నీవు నా భక్తురాలవై నా కత్యంతప్రియులగు ప్రహ్లాద, అక్రూర, ధ్రువ, గజాది పతుల కోటిలో జేరదగినదానవు. నీవు భక్తులలో శ్రేష్ఠురాలవు. నాయం దత్యంత భక్తి కలదానవు. నీ వర్జునునివంటిదానవు. బలిచక్రవర్తితో నుపమింపతగినదానవు. 37

అజామీళుడు, ద్రౌపది, విభీషణులతో పోల్చతగిన భక్తురాలవు. నిన్ను గాంచి నంతనే నా మనస్సత్యంతానందము నందుచున్నది. 38

నా దుఃఖమును పోగొట్టుటకై బ్రహ్మచే నా నారీరత్నముగా నిర్మింపబడితివి. కోటిగోవుల దాన మొనర్చుటయు, పదివేల గుఱ్ఱముల దానమిచ్చుటయు, 39

బంగారము, నువ్వుల దాన మొనర్చుటయు, నొక వివాహ మొనరించుటయు సమానముగా ఫలితము నొసంగు పుణ్యకర్మలు. నీవా కన్నియను గాంచిన సంతసింతువను టలో సందియములేద'ని తన మనోరథమును వ్యక్త మొనరించినంతనే వకుళమాలిక — 40

వకుళా —

జగత్ప్రభూ ! నీవు గాంచిన కన్నియ యెచ్చట నున్నది ? ఆ మార్గమును తెలుపుము. తప్పక వెళ్లగలను. 41

ఆమె పూర్వజన్మవృత్తాంత మేమి ? ఎందులకు భూమిపై జనించినది ? ఆ కన్నియ వృత్తాంతమునంతను పూర్తిగా వివరింపుమ'ని యడుగగా — 42

ఇత్యా జ్ఞప్తో విరిఞ్చేశ । వినతాఙ్ఘ్రి సరోరుహః ।
ఉవాచ మన్దం వచనం । వకుళాం ధరణీధరః ॥ 43

వకుళాం ప్రతి శ్రీనివాస వర్ణిత పద్మావతీ పూర్వజన్మోదన్తః

శ్రీనివాసః —

శృణు బాలే పురావృత్తం । పద్మావత్యాః జనేః శుభమ్ ।
త్రేతాయాం రామరూపేణ । త్వ వతార మహం గతః ॥ 44

పితృ మాతృ వచః శ్రుత్వా । దణ్డకారణ్య మాగతః ।
లక్ష్మణేన సహ భ్రాత్రా । సీతయా వకుళే! శుభే! ॥ 45

తదా తు రావణో నామ । రాక్షసో లోకకణ్టకః ।
లోకభర్తుః సతీం హృత్వా । లఙ్కాం గన్తు మవర్తత ।
లక్ష్మణో ప్య గ్రజం ద్రష్టుం । సీతయా ప్రేషితో బలాత్ ॥ 46

తత్కాల మాలక్ష్య స రాక్షసేన్ద్రో । విమాన మారోపయితుం హి సీతామ్ ।
ప్రావర్తతైషా చ తదా రురావ । "హా రామ! హా లక్ష్మణ! రాఘవే"తి ॥

తదార్త రావేణ తదా వనౌకసో । విచుక్రుశు స్తత్ర వనాన్తర స్థితాః ।
తద్వాక్య మాకర్ణ్య చ హవ్యవాహనః । పాతాళలోకా దుపగా ద్ధరాతలమ్ ॥48

సమాయాన్తం దురాధర్షం । ఆకర్షన్త మ్బ జానకీమ్ ।
సమ్భాష్య రావణం క్రూరం । పాతాళా దుపగమ్య చ ॥ 49

రావణేన చ పాపేన । సహితః సీతయా తయా ।
రావణం బోధయామాస । నానావాక్యగణై స్తదా ॥ 50

ఇయం జనకపుత్రీ న । విప్రపత్నీ తు ఖేచర ।
రాఘవ స్త్వద్భయా ద్రక్షన్ । జానకీం మమ సన్నిధౌ ॥ 51

సంస్థాప్య విపినే రామో । వ్యచర త్సహలక్ష్మణః ।
శిష్యో ఽసి పరమోదార! । మమ కల్యాణ! రావణ! ॥ 52

బ్రహ్మరుద్రాదులచే నమస్కరింపబడు పాదపద్మములుగల శ్రీనివాసుడు— 43

## శ్రీనివాసుడు వకుళాదేవికి పద్మావతీ పూర్వజన్మ వృత్తాంతము నెఱింగించుట

శ్రీనివాసుడు —

పాపరహితురాలా! పుణ్యప్రదమగు పద్మావతీ పూర్వజన్మ వృత్తాంతమును వినుము. నేను త్రేతాయుగమున శ్రీరామచంద్రుడనిగా నవతరించితిని. 44

తలిదండ్రులయాజ్ఞ ననుసరించి సీతతోను సోదరుడగు లక్ష్మణునితోను దండకారణ్యమునకు వచ్చితిని. 45

ఆ సమయమున లోకములను బాధించు రావణుడను రాక్షసుడు జగన్నాథుడగు శ్రీరామచంద్రుని భార్యయగు సీత నపహరించి లంకకు గొనిపోవ నుద్యుక్తుడాయెను. లక్ష్మణుడు సీతచే బలవంత పెట్టబడి సోదరుని చూచుటకు వెళ్లెను. 46

రావణు డా సమయమును చూచికొని సీతను విమానముపై నెక్కించుకొనుట కారంభించగనే ఆమె "హా రామా! హా లక్ష్మణా! హా రాఘవా!" యని ఏడ్చుట కారంభించెను. 47

ఆ రోదనధ్వని విని అడవియందు నివసించువా రందరు బిగ్గరగా విలపించిరి. దీనిని విని గార్హపత్యాగ్నిగా గల అగ్నిహోత్రుడు పాతాళలోకమునుండి భూమిపైకి వచ్చి 48

వారింప శక్యముకానివాడై జానకిని లాగికొనుచు వచ్చుచున్న క్రూరుడగు రావణుని కుశలప్రశ్నలచే పలుకరించి 49

పాపాత్ముడగు రావణునితోను సీతతోను కలిసినవాడై గగనచారివగు రావణా! ఈమె జనకమహారాజు కుమార్తెకాదు. బ్రాహ్మణపుత్రిక. శ్రీరామచంద్రుడు నీ వలన భయపడి జానకిని దాచద్దాచి 50-51

లక్ష్మణునితో గూడ నడవిలో సంచరించుచున్నాడు. ఈమె బ్రాహ్మణుని భార్య. కాని సీతకాదు. సద్గుణములుకల రావణా! ఔదార్యశాలీ! నా శిష్యుడవు. 52

ప్రియో ఽసి మా గమో విప్ర । పత్న్యాం సీతాభ్రమం వృథా ।
ఇతి ప్రతారయన్ రక్షః । ఛద్మనా జనకాత్మజామ్ ॥ 53

ఇత్థం స్వలోక మాదాయ । తాం సమ్పూజయితుం ద్రుతమ్ ।
స్వాహాయాం సన్నివేశ్యా థ । నామ్నా వేదవతీం శుభామ్ ॥ 54

ప్రా గ్రావణాపచారేణ । ప్రతిశ్రుత్య చ తద్వధమ్ ।
కృతప్రవేశాం క్రోధేన । సమిద్ధే జాతవేదసి ॥ 55

తత ఆరభ్య సమయం । ఆకాఙ్క్షన్తీం స్థితాం సతీమ్ ।
సీతా ఽఽకృతిధరాం కృత్వా । మాయయా మేషవాహనః ॥ 56

ప్రదర్శయ న్నదాదా థ । రావణం ప్రీణయన్ని వ ।
"ఇమాం సీతాం సమాదాయ । గచ్ఛ శీఘ్రం నిశాచర" ॥ 57

ఇత్యు క్తః పావకేనా యం । తా మాదాయా గమ ద్ద్రుతమ్
హరే చా గ్నౌ విశేషేణ । భక్తి ర్వై రావణస్యచ ॥ 58

తస్మా దగ్నివచః శ్రుత్వా । త్వే వం తాం జానకీం తదా ।
అజ్ఞానా న్మన్యమానో ఽసౌ । రావణో మోహదర్పితః ॥ 59

లఙ్కాం గత్వా ఽశోకవనే । శింశుపావృక్షమూలతః ।
సీతాకృతిం తాం సంస్థాప్య । విష్ణ్వావిష్టాం స రాక్షసః ॥ 60

కృతకృత్యం తదా ఽఽత్మానం । మేనే వై కాలచోదితః ।
రామో గత్వా తు తం హత్వా । రావణం సగణం ఖలమ్ ॥ 61

సీతాం ప్రాప్య జగన్నాథో । యుద్ధాన్తే పర్యచిన్తయత్ ।
తా న్తు లోకాపవాదేన । పావకేన విశోధితామ్ ॥ 62

జిఘృక్షుణా రాఘవేణ । సీతా చా గ్నౌ ప్రవేశితా ।
సీతా ద్వన్ద్వం తత్ర దృష్ట్వా । ప్రోవాచ విజభామినీమ్ ॥ 63

అనంతరముగా బ్రాహ్మణుని భార్యయందు సీతయను తలంపు నుంచకుమని మాయమాటచే సీతను రావణునినుండి వంచించి 53

ఆమెను పూజించుటకు శీఘ్రముగా తన లోకమునకు తోడ్కొని చని స్వాహా దేవియందు ప్రవేశపెట్టెను పవిత్రురాలై 54

మున్ను రావణు డొనరించిన అపచారమువలన రావణుని చంపునటుల ప్రతిజ్ఞచేసి కోపముతో మిక్కిలి ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రమున ప్రవేశించినదై 55

ఆనాటినుంచియు రావణునివధకై నిరీక్షించుచున్న వేదవతికి సీతరూపమును ధరింపజేసి 56

రావణునకు చూపించుచు ఆతనిని సంతోషపరచుచున్నటుల "రావణా ! ఈ సీతను తీసికొని శీఘ్రముగా నేగుము"ని 57

పలుకగా రుద్రునియందును అగ్నియందును తనకు గల భక్తివిశేషముచే 58

ఆతని మాటలను నిజమని నమ్మి మోహాంధుడై అజ్ఞానముచే వేదవతిని సీతవమ్మగా తలంచి 59

లంకకేగి అశోకవనమున ఇరుగుడుచెట్టుక్రింద విష్ణునియందే సంలగ్నమై యున్న ఆమెనుంచి 60

మృత్యువు సమీపించుటంజేసి తన కార్యభారము తీరినటుల తలంచెను. రాముడు కొంతకాలముపిమ్మట బంధుపుత్రమిత్రకళత్రసహితముగా రావణుని చంపి 61

యుద్ధము జరిగిన పిమ్మట లోకాపవాదముచే నగ్నిహోత్రమున దుమికి పవిత్రత నొందింపబడిన సీతను 62

గ్రహింపగోరగా సీత అగ్నిలో ప్రవేశించెను రామచంద్రు డగ్నిహోత్రమున నిరువురి సీతలను గాంచి తన భార్యతో

తా సా దేవీ తవ సమా । తవ రూప మన్వితా ।
న జానే ఽహం వరాఙ్గీం తాం । తవ బిమ్బనిభాం శుభామ్ ॥
రాఘవేణైవముక్తా సా । జానకీవాక్యమబ్రవీత్ ॥ 64

జానకీ —

మద్దుఃఖం హ్యే తయా భుక్తం । నిర్నిమిత్తం దయాళునా ।
కా సా వేదవతీ దేవ! । స్వాహాయాః సన్నిధౌ స్థితా ॥ 65

తా మఙ్గీకురు గోవిన్ద! । వివాహం విధిపూర్వకమ్ ।
ఇతి సీతావచః శ్రుత్వా । రామో వచన మబ్రవీత్ ॥ 66

శ్రీరామః —

ఏకపత్నీవ్రతం మే ఽద్య । కృతం జానాసి భామిని! ।
ద్వాపరే ఽఙ్గీకరోమీ తి । బహూనాం వరదో యతః ॥ 67

తవ వాక్యం కరిష్యామి । త్వ ష్టావింశే కలౌ యుగే ।
తావ దేషా బ్రహ్మలోకే । బ్రహ్మణా పూజితా భవేత్ ॥ 68

శ్రుత్వైవం రామవాక్యం సా । జగామ భవనం విధేః ।
పద్మావత్యాః కారణం తు । భణితం తవ సువ్రతే ॥ 69

న మే వాక్య మసత్యం స్యాత్ । ఇతి వేదవిదో విదుః ।
శ్రుత్వా తజ్జననే హేతుం । వకుళా ఽఽనన్దనిర్భరా ।
కౌతూహలసమావిష్టా । శ్రీనివాస మభాషత ॥ 70

## శ్రీనివాసాజ్ఞయా నారాయణపురం ప్రతి వకుళాగమనమ్

[illegible] । యత్రాఽఽసతే సర్వకళావిశారదాః ।
ఆకాశరాజస్యపురీం సురోత్తమైః । సంస్తూయమానాశ్చరమాంవిగూహితామ్॥71
ఇత్యేవ ముక్త్వా భగవాన్ జగద్గురుః । సంప్రేషయిష్యన్ వకుళాం స్వకారణాత్।
ఉత్థాయ తల్పాత్స్తిమితాన్తరఙ్గః । తస్థౌ తదానీం భృశహృష్టచేతాః ॥ 72

సీతో సమానముగా ఉన్న ఆ దేవి ఎవరు ? నిన్ను బోలియుండుట కేమి హేతువు ? నీ పోలికగనున్న ఆమెను నే నెఱుంగన'ని పలుకగా జానకి యాతనితో — 64

జానకి —

కారణ మేమియు లేకుండా నా కొఱకై నా దుఃఖమును తా ననుభవించిన యీ వేదవతి ఎవరు ? స్వాహాదేవి సన్నిధిలో ఎందుల కున్నది ? 65

రామచంద్రా ! యథాశాస్త్రముగా నామెను పరిణయమాడుమ'ని ప్రార్థించెను. దానికి శ్రీరాముడు ఆమెతో — 66

శ్రీరాముడు —

జానకీ ! నే నీ యవతారమున నొకే యువతిని పరిణయమాడి భార్యగా నంగీకరింతును. ఇది నావ్రతము. చాలమందికి వరముల నొసంగియుండుటంజేసి ద్వాపరయుగమున తప్పక వేదవతిని భార్యగా నంగీకరింతును. 67

ఇరువది యెనిమిదవ కలియుగమున అంతవర కీమె బ్రహ్మలోకమున బ్రహ్మచే పూజింపబడును. 68

అని రామచంద్రుడు పలుకగా విని వేదవతి బ్రహ్మలోకమున కేగెను. వకుళమాలికా ! పద్మావతీ జన్మవృత్తాంతమును తెలిపితిని. 69

నామాట అబద్ధము కాజాలదని వేదశాస్త్రజ్ఞులు పలుకుదుర'ని తెలుపగా వకుళ ఆనందపరవశురాలై పద్మావతీ జననవృత్తాంతమును విని కుతూహలముకలదై యాతనితో 70

## శ్రీనివాసుని యాజ్ఞచే వకుళ నారాయణపురమున కేగుట

శ్రీనివాసా ! పదునాల్గు కళలయందు నిపుణులగు సభికులచే సంశోభితమును, దేవతోత్తములచే స్తుతింపబడునదియు, ధనధాన్యలసితమునగు ఆకాశరాజసభ కేగెదన'ని 71

చెప్పగా లోకనాథుడగు శ్రీమన్నారాయణుడు తనకొఱకై వకుళమాలిక నాకాశ రాజువొద్దకు పంపి మిక్కిలి సంతసించుచు మనస్సు కుదుటబడగా ప్రక్కనుండి లేచి 72

భుక్త్వా ఽన్న ముత్తమ మసౌ వకుళాప్రదత్తం ।
ఆనన్దపూర్ణసుమనాః సురబృన్దవన్ద్యః ।
తస్థా వలఙ్కృతవపు శ్చ విభూషణౌఘైః ।
ముక్తాఫలైః సురుచిరై రథ పుష్పసఙ్ఘైః ॥ 73

దివ్యం తురఙ్గ మారుహ్య । విస్మితాం దేవమాయయా ।
మార్గం విజ్ఞాతు కామా తం । ఆపృచ్ఛ్య వకుళాఽ వదత్ ॥ 74

మార్గం వద రమాధీశ ! । గచ్ఛామి నృపసత్తమమ్ ॥ 75

శ్రీనివాసః —

అస్మా ద్దేవ వరా న్మార్గాత్ । అవరుహ్య గిరే స్తటాత్ ।
త్వం గచ్ఛ భః ప్రదేశే చ । కాపిలం లిఙ్గ ముత్తమమ్ ॥ 76

తత్రాఽ స్తే తీర్థరాజో యః । కపిలేశ్వరసన్నిధౌ ।
తత్ర స్నాత్వా యథా యోగ్యం । మదర్థం తీర్థపుఙ్గవే ॥ 77

కపిలేశ్వర మాసాద్య । యాచ్యతాం వర మవ్యయమ్ ।
శ్రీనివాసేన బాలేన । సదా కల్యాణకాఙ్క్షిణా ॥ 78

ప్రేషితాఽహం తదర్థం వై । కురు మే ఽభీప్సితం ప్రియమ్ ।
ఏవ ముక్త్వా శివం దేవి ! । తతః పద్మతటం గతా ॥ 79

తత్ర దృష్ట్వా కృష్ణరామౌ । నత్వా తౌ భక్తిభావతః ।
పద్మతీర్థసముద్భూతైః । కమలైః కమలావనే ॥ 80

పూజాం కురు మదర్థం తౌ । భ్రాతృభూతౌ హి మే మతౌ ।
సువర్ణముఖరీం తీర్త్వా । తత్ర గచ్ఛ యథా సుఖమ్ ॥ 81

ఉచితం కురు కల్యాణి ! । కన్యా ఽర్థే కమలావనే ! ।
ఆజ్ఞప్తా దేవదేవేన ! । త్వి త్థం వకుళమాలికా ॥ 82

వకుళమాలిక యొసంగిన సరసభోజనము నారగించి ఆనందపరిపూరితాంతరం గుడై ఆభరణములచేతను మృత్యములచేతను మిక్కిలి అందమగు పువ్వులతోను శరీరము నలంకరించుకొనెను. 73

దేవమాయచే నిర్మింపబడిన దివ్యమగు నాదగుఱ్ఱమునెక్కి దారి నెఱుంగుటకై శ్రీనివాసునితో— 74

నే నాకాశరాజగృహమున కేగెదను. నా కా పట్టణమునకు మార్గము నెఱింగింపు మనగా నాతడు— 75

శ్రీనివాసుడు —

సుందరీ! ఈ మార్గముననే పర్వతపార్శ్వమునుండి దిగి క్రింద కపిలేశ్వరుని వద్దకేగుము. 76

ఆతని సన్నిధానమునయున్న పుష్కరిణిలో నా కొఱకై యథాశాస్త్రముగా స్నాన మాచరించి 77

కపిలేశ్వరునితో "బాలుడగు శ్రీనివాసు డెల్లవేళలయందును కల్యాణమునే కోరుచు 78

ఆ ఫలసిద్ధికై నన్ను పంపినాడు. నా కోర్కెను నెరవేర్పుమని వరమునుకోరి పిమ్మట పద్మసరోవరతీరమున కేగి 79

అచట బలరామకృష్ణులను పద్మసరోవరమున వికసించిన తామరపుష్పములతో భక్తియుక్తముగా సేవించి 80

నాకు సోదరులగు వారిని నా కొఱకై పూజించి సువర్ణముఖరీనదిని దాటి సుఖముగా నేగి 81

కన్యకామణికై తగినటుల ప్రవర్తింపుమ'ని శ్రీనివాసునిచే అజ్ఞాపింపబడినదై 82

జగామ శనకై శ్శేష । శైలా దుత్తీర్య చా జ్గనా ।
యదుక్తం శ్రీనివాసేన । త చ్చకార తదాఽబలా ॥ 83

హయ మారుహ్య వకుళా । సువర్ణముఖరీం తదా ।
తీర్త్వా గస్త్యాశ్రమం ప్రాప్య । సఖీ స్తస్యా వ్యలోకయత్ ॥ 84

శివాలయే శివం ద్రష్టుం । ఆగతాయా స్తు తత్ర వై ।
తత్ర దృష్ట్వా వరాః కన్యాః : కా యూయ మితి చాబ్రవీత్ ।
తయా సమ్భాషితా బాలాః । ఊచురేనాం తథోత్తరమ్ ॥ 85

## వకుళాం ప్రతిపద్మావతీసఖీజ్ఞాపితపద్మావత్యుదన్తః

**కన్యాః —**

వయ మాకాశరాజస్య । సన్నిధానగతాః సదా ।
ఇతః పూర్వదినే కశ్చి । త్పురుషం తురగాస్థితమ్ ॥ 86

పద్మావత్యాః సమీప ఇ్చ । సమ్ప్రాప్తం మన్మథాఽకృతిమ్ ।
దృష్టవత్యో వయం సర్వాః । కిరాతాకృతిశోభనమ్ ॥ 87

దృష్ట్వా పద్మావతీ భీత్యా । జ్వరతాపవిమూర్ఛితా ।
త త్తాపనో పశా న్త్యర్థం । రాజ్ఞాఽజ్ఞప్తా వయ న్త్విహ ॥ 88

అగస్త్యేశాభిషేకార్థం । వసామో ఽద్య సమాగతాః ।
ఇదానీం కన్యకారూపాం । త్వాన్తు వీక్షామహే వయమ్ ।
ఇతి తద్వచనం శ్రుత్వా । వకుళా వాక్య మబ్రవీత్ ॥ 89

**వకుళా —**

కో ఽసౌ కిరాతరూపీ చ । భవతీభి శ్చ సఙ్గతః ।
వదధ్వం కన్యకా స్సర్వాః । తద్వృత్త మఖిలం మమ ॥ 90

**కన్యాః —**

పద్మావత్యా శ్చ సహితాః । కదాచి ద్వయ మాగతాః ।
పుష్పాపచయనం కర్తుం । ఆరబ్ధా స్తు వనాన్తరే ॥ 91

శేషాచలమునుండి మెల్లగా దిగి శ్రీనివాసుడు చెప్పినట్లుగా వెళ్లి 83

గుఱ్ఱమును దిగి సువర్ణముఖరీనదిని దాటి అగస్త్యాశ్రమమున కేగి పద్మావతి చెలికత్తియలు 84

శివదర్శనమునకై శివాలయమునకు రాగా వారిని గాంచి "మీ రెవర"ని ప్రశ్నించెను. ఆ బాలిక లామెతో— 85

## పద్మావతి చెలికత్తెలు తమ సఖి చరితమును వకుళమాలిక కెఱింగించుట

కన్యక —

మే మాకాశరాజు పోషణమున నున్నవారము. ఇంతకు ముందురోజున గుఱ్ఱముపై నెక్కి 86

మన్మథునివలెనుండిన ఆకారముకలిగి, కిరాతవేషమున మిక్కిలి యందగాడైన మా పద్మావతివద్ద కేతెంచిన యువకుని మే మందరము గాంచితిమి. 87

పద్మావతి యాతనిని గాంచినంతనే భయపడి జ్వరమువలనను దానివలన కలిగిన తాపమువలనను మూర్ఛచెందెను. ఆ జ్వర ముపశమించుటకై మేము రాజుచే నాజ్ఞాపింపబడి

అగస్త్యేశున కభిషేకము నొనర్చుటకై వచ్చియున్నాము. కన్యకారూపమున నున్న నిన్నిపుడు గాంచితిమ"ని తెలుపగా విని - వకుళమాలిక వారితో— 89

వకుళ —

ఆ కిరాతరూపముననున్న పురుషు డెవడు ? మీతో నెట్లు కలసెను ? ఆ వృత్తాంతము నంతయు నాకు తెలియజెప్పుడ"ని యడుగగా 90

కన్యక —

నా కన్నియ లామెతో - మే మొక దినమున పద్మావతితో కలసి యుద్యానవనమున పువ్వులను కోయుచుండగా 9

తత్ర కశ్చిత్ పుమాన్ ప్రాప్తః । విచిత్రతురగాన్వితః ।
అస్మాన్ ప్రత్యుదితం తేన । హ్యవాచ్యవచనం తదా ॥ 92

తచ్ఛ్రుత్వా తనయా రాజ్ఞో । రుష్టా వచన మబ్రవీత్ ।
తయోః కలహ ఆసన్నః । కలహే తాడితో హయః ॥ 93

నిపపాత తదా ఽశ్వ స్తు । శిలాభి ర్హతచేతసః ।
స ఘోటం సమ్పరిత్యజ్య । జగామో త్తరదిఙ్ముఖః ॥ 94

గతే కిరాతే కమలోద్భవా ఽధ । మూర్ఛా ముపాగమ్య పపాత భూమౌ ।
కన్యాం తత స్తాం ఉపవేశ్య యానే । వయం స్వకం రాజపురం గతాః స్మః ॥ 95

తా మాగతాం యానగతాం సుతాం నృపః । చిన్తా ముపాగమ్య రురోద దీనః ।
ఆజ్ఞే విధాయా ఽత్మసుతా శ్చ పశ్యన్ । ముఖం ముదా హీన మభాషణ శ్చ ॥ 96

కా వా ఽభవ న్మే దుహితు ర్దురాసదా । విభీషికా విశ్వవినాశకారిణీ ।
తస్యా వినాశం న విజానతే నరాః । గురుం వినే తి ప్రసమీక్ష్య భూమిపః॥ 97

తతః సురాణాం గురు మాత్తకమ్పః । సమానయ త్తత్ర సుతేన శీఘ్రమ్ ।
శీఘ్రం ప్రసన్నో నిజమన్దిర శ్చ । త ద్వాక్య మాకర్ణ్య గురు ర్ధరాతలమ్॥ 98

ప్రాప్తం గురుం ప్రాణ మివా గతం తదా ।
ప్రాప్యే వ పుణ్యం పరిపక్వ మాగతమ్ ।

దత్త్వా ఽఽసనం రత్నమయం సమర్పయన్ ।
ముపాధనైః పార్ఘ్యసుపుష్పభోజనైః ॥ 99

కృతా ఽతిథేయో ద్విజ మాబభాషే । సుతా నిమిత్తం గగనాభిధో నృపః ।
తద్వాక్య మాకర్ణ్య గురుః పతాం పతిః । సమ్ప్రీణయన్ వాక్య మువాచ భూపమ్॥

దుహితు స్తవ సఙ్కష్టం । నిమిత్తం శృణు భూమిప ।
పుష్పార్థ స్తు గతా బాలా । భీతా పురుషదర్శనాత్ ॥ 101

అచట నొక పురుషుడు మిక్కిలి సుందరమగు గుఱ్ఱముపై నధిష్ఠించివచ్చి మాతో వనరావిమాటలనాడగా 92

మా రాజకుమార్తె మిక్కిలి కోపించెను. వా రిరువురకు జగడము సంభవింపగా నా కలహమున నాతని గుఱ్ఱమును రాళ్ళతో గొట్టుటచే 93

నది భూమిపై పడిపోయెను. దానిచే నాతడు చింతాక్రాంతచిత్తుడై గుఱ్ఱమును వదలి ఉత్తరదిశగా వెడలిపోయెను. 94

ఆ కిరాతరూపియగు పురుషుడు వెడలినంతనే మా పద్మావతి మూర్ఛాక్రాంతయై నేలకొరిగెను. మే మామెను పల్లకియం దిడుకొని రాజసౌధమున కేగితిమి. 95

అంత ఆకాశరాజు పల్లకియందుండి సంతసములేక మాటాడక వెలవెల బారుచున్న ముఖమును బాలికను గాంచి యామెను తన యొడిలో పరుండబెట్టుకొని మిగుల చింతించుచు దీనుడై యేడ్వసాగెను. 96

నా కెమార్తెకు సంభవింపరానిదై భయంకరమయి, జగద్విలయము నొనరించు నీ యవస్థ యెద్దియోకదా! దీనికి తగిన విధానమును బృహస్పతితక్క యితరు లెవ్వరు నెఱుంగజాలర'ని 97

కలవరపాటునంది తన పుత్రుని దేవగురువగు బృహస్పతిని తోడ్కొని రమ్మని పంపెను. ఆ వార్తను వినినంతనే బృహస్పతి భూలోకమున కరుగుదెంచి రాజమందిరము నకు చనుదెంచెను. 98

తన పుణ్యము ఫలించినటులను ప్రాణముపలె వచ్చి నిలచిన బృహస్పతినిగాంచి రత్నసింహాసనమున నాసీను నొనరించి చక్కని యుపకరణములతోడను అర్ఘ్యపాద్యముల తోను పుష్పఫలాదులతోను 99

ఆతిథ్యమును నెరవేర్చి తన పుత్రికనుగూర్చి యాకాశరాజడిగెను. అంత సజ్జన శ్రేష్ఠుడగు బృహస్పతి ఆకాశరాజును తన మాటలచే సంతసింపచేయుచు 100

రాజా! నీ కుమార్తె కాపద సంభవించిన కారణమును వినుము. నీ కుమార్తె పుష్పములను కోసుకొనుటకై యేగి యొక పురుషుని దర్శించి భయపడినది. 101

తస్య శాన్తిం ప్రవక్ష్యామి । శ్రూయతా మవధానతః ।
కారయ స్త్వధునా విప్రాః । అభిషేకం శివస్య చ ॥ 102

అగస్త్యేశస్య వై రుద్రైః । త్వ మేకాదశభిః ప్రభో ।
ఏవ ముక్తో ఽథ గురుణా । రాజా విప్రాన్ సమాదిశత్ ॥ 103

సమ్పాద్య సర్వసమ్భారాన్ । వయం విప్రసమన్వితాః ।
తత్పుత్రీజ్వరతాపేన । శాయితా నిజమన్దిరే ॥ 104

తచ్ఛాన్త్యర్థం వయం ప్రాప్తాః । అభిషేకార్థమజ్జనే ।
ధిషణేన సమాజ్ఞప్తాః । ద్విజవర్యాః సమాగతాః ॥ 105

తస్మాద్దేశాద్వయ ప్రాప్తా । కైలాసపతి మన్దిరమ్ ।
గచ్ఛసి త్వం కుత్ర బాలే । కిమర్థం త్వమిహాఽఽగతా ॥ 106

వద దేశ మితి స్త్రీభిః । వకుళా చోదితా ఽబ్రవీత్ ।

## పద్మావతీసఖీః ప్రతి వకుళా ఽవేదితస్వాగమన వృత్తాన్తః

శృణ్వ న్తు కన్యకా స్సర్వాః । మద్వాక్య మవిచారతః ॥ 107

## దేవతాన్తరభజననిరసనమ్

ప్రభావ మాత్మానుభవస్య విష్ణోః । యూయం న జానీథ పురాణపుంసః ।
కృష్ణం ముకున్దం తనయం విదన్త్యాః । వృథా శరీరం పున రాగతం మమ॥ 108

జగద్విధీశానమహేన్ద్రపూర్వం । సృజ న్నయం మానుషవ ద్విభాతి ।
యుష్మాన్ వహా స్మాభి రిహా న్యదైవతాన్ । సమ్ప్రార్థయ న్తి స్వశుభం
కరోత్య సౌ ॥ 109

హరి రేవ బలం యస్మాత్ । సర్వార్థానా మలం భవేత్ ।
ధ్రువంతతో నృణాం మోహాత్ । కుపథో ఽన్యసమాశ్రయః ॥ 110

హరే రవమతం యస్మాత్ । కుపథ ఇవ తదాశ్రయమ్ ।
లాలయామి తతో ఽహం వై । వకుళా మవగచ్ఛతామ్ ॥ 111

దానికి శాంతిని తెలిపెదను. జాగరూకుడవై వినుము. నీవు విప్రులను రావించి కొనుకొనుము, 102

పదకొండుగురు రుద్రులతో గూడ అగస్త్యేశునకు అభిషేకమును చేయించుమ'ని పలుకగా రాజు బ్రాహ్మణుల కాజ్ఞాపించెను. 103

మేము బ్రాహ్మణులతో గూడ సకలవిధ పూజాద్రవ్యములను సంపాదించితిమి. రాజపుత్రి జ్వరతీవ్రతచే తన మందిరమున పరుండియున్నది. 104

మేము మాహేశ్వర ముపశమింపజేయుటకై శివాలయమున కేగుచున్నాము. బృహస్పతి చేత పంపబడిన బ్రాహ్మణులు కూడవచ్చిరి. 105

ఆ నారాయణపురమునుండి శివాలయమునుగూర్చి మేము వచ్చితిమి. ఓ బాలా! నీవు యెచటి కేగుచున్నావు ? ఇచటికి యేల వచ్చితివి ? 106

నీ రాకకుగల కారణమును తెలుపుమ'ని యడిగిరి. అంత వకుళమాలిక వారితో

## పద్మావతి చెలికాండ్రతో వకుళాదేవి తనరాకకుగల కారణము నెఱింగించుట

బాలికలారా ! నా మాటలయందు సందియములేక వినుడు. 107

## నారాయణుని విడిచి ఇతర దేవతలను భజించరాదని చెప్పుట

అనాది పురుషుడును స్వయంప్రకాశమానుడగు శ్రీమన్నారాయణుని ప్రభావమును మీ రెఱుంగజాలరు. భగవంతుని పుత్రునిగా పొందగోరి నేను మరల జన్మించితిని. 108

బ్రహ్మరుద్రేంద్రాదులతో నారంభించి యీ జగత్తును సృజించిన పరమాత్మ మనుష్యునివలె విరాజిల్లుచున్నాడు ఆతనిని శరణువేడుచున్న మాతోపాటు ఇతర దేవతల ప్రార్థించుచున్న మీకును శుభంకరు డాతడే. 109

సకలాభీష్టసిద్ధికిని శ్రీమన్నారాయడే సమర్థుడై యుండ, మనుష్యు లజ్ఞానముచే నితర దేవతల నారాధించుట దుర్మార్గగమనమేకదా ! 110

కావున వది నారాయణునిపట్ల అనాదరణమే కాగలదు. అందుచే నితర దేవతల నారాధించుట దుర్మార్గమే. అందుచే మిమ్ముల మందలించుచున్నాను. నేను వకుళను, 111

మా మాం లాలయతీ త్యేవం । మాలా మప్య వగచ్ఛత ।
అహం శ్రీవేఙ్కటాధీశ । దాసీ భూతా ఽస్మి సామ్ప్రతమ్ ॥ 112

పురన్యా శ్చ సమీపే మే । కిఞ్చి త్కార్య స్తు వర్తతే ।
నారాయణపురం దివ్యం । అభేద్యం పరదేశిభిః ॥ 113

భవతీ సఙ్గమాత్రేణ । కరిష్య న్తి ప్రవేశనమ్ ।
ఇత్థ ముక్త్వా స్థితా బాలా । కన్యాభిః సా చ సఙ్గతా ॥ 114

## శ్రీనివాసస్య పుల్కసీరూపేణ నారాయణపురగమనమ్

ఏవం గతాయాం తస్యా స్తు । న విశ్వాస మగా ద్ధరిః ।
" ఏకపుత్రో హ్యపుత్రః స్యాత్ । ఏకనేత్రో హ్యనేత్రవాన్ ॥ 115

స్త్రీభి స్తు యత్కృతం కర్మ । న త త్కార్యం ఫలప్రదమ్ " ।
ఇతి సఞ్చి న్త్య గోవిన్దో । లీలామానుషవిగ్రహః ॥ 116

స్వయం శ్రీవేఙ్కటాధీశో । వనితారూప మాయయా ।
చీరవస్త్రం తతో బద్ధ్వా । చిత్రకఞ్చుకరఞ్చితా ॥ 117

బ్రహ్మాణ ఞ్చ శిశుం కృత్వా । యష్టిం కృత్వా మహేశ్వరమ్ ।
బ్రహ్మాణ్డం జగదాధారం । త్రైగుణ్యం గుల్మ మేవచ ॥ 118

ఆకీర్య కేశపుఞ్జాని । పఞ్చాశద్వర్షసంయుతా ।
గుఞ్జామణివిభూషాఙ్గ । శఙ్ఖబద్ధసుహారికా ॥ 119

వేణుగుల్మం స్వశిరసి । దధానా ధాన్యపూరితమ్ ।
లమ్బోదరీ లమ్బకర్ణా । లమ్బితార్ధపయోధరా ॥ 120

ఆదన్తా శుష్కవదనా । తదా ఽభూ ద్ధర్మదేవతా ।
బ్రహ్మాణం నాభిసఞ్జాతం । సప్తమాసవయోయుతమ్ ॥ 121

రుద న్తం శుష్కవదనం । కృశాఙ్గీ దీర్ఘబాహుకమ్ ।
శిశుం బద్ధ్వా చీరవస్త్రే । నృత్య న్తీ జగదీశ్వరీ ॥ 122

లక్ష్మి నన్ను కాపాడుచున్నది కాన నా పేరు "మాలి" యనియు నెఱుంగుము. నేనిపుడు శ్రీ వేంకటాచలపతికి దాసురాలనై యున్నాను. 112

నాకు ఆకాశరాజపత్నియగు ధరణీదేవివద్ద కొంచెము పనియున్నది. దివ్యమగు నారాయణపుర మితరదేశీయులచే ప్రవేశింప శక్యముకానిది. 113

మీ సహాయమున మీరు నన్ను ప్రవేశపెట్టగలర'ని పలికి యా కన్నియలతో స్నేహ మొనరించెను. 114

## శ్రీనివాసుడు శోదికత్తియ వేషమున నారాయణపురమున కేగుట

ఇట్లు వకుళమాలిక వెళ్లగనే శ్రీనివాసు డామె మాటలను నమ్మజాలక ఒక పుత్రుడు కలవాడు సంతానము లేనివానితోనే సమానుడు. ఒక కన్ను కలిగినవాడు గ్రుడ్డివానితో సమానుడు. 115

ఆడవా రొనరించిన పనులు సాఫల్యము నొందనేరవుకదా! అని యాలోచించి విలాసార్థముగా మనుష్యశరీరమును ధరించు 116

నా వేంకటాచలపతి నారబట్టను చినిగిన రవికను ధరించి 117

బ్రహ్మను చంటిపాపనిగను, ఈశ్వరుని మంత్రదండముగను, జగత్తునకాధారమై సత్త్వరజస్తమోగుణాత్మకమగు బ్రహ్మాండమును బుట్టగా జేసికొని 118

జుట్టు విరయబోసికొని యేబది సంవత్సరముల వయస్సు గలదియై గురివెంద పూసల యాభరణముల నలంకరించుకొని శంఖములచే కూర్చిన చిన్నమాలలను ధరించి 119

ధాన్యముతో నిండిన వెదురుబుట్టను తన తలపై నిడికొని పెద్దపొట్ట వ్రేలాడు చుండ చెవులు చేటలవలె నల్లాడుచుండ, స్తనములు దిగజారగా 120

పండ్లు ఊడిపోవుటచే బోసినోరు కలదై చూచుటకు సోదికత్తియవలె నుండు స్త్రీరూపమును దాల్చెను. తన బొడ్డునుండి పుట్టిన బ్రహ్మ ఏడు మాసముల బిడ్డడై 121

పొడవగు చేతులుకలిగి నోరెండునట్లు యేడ్చుచుండగా తన పమిటచెంగుతోకట్టి చిక్కిన దేహముకలదై నాట్యమొనరించుచు 122

యష్టిం ధృత్వా కరే బాలా ఒగాత్ । స బాలా ధర్మదేవతా ।
నారాయణపురం ప్రాప్తా । నారదాజ్ఞజవన్దితా ॥ 123

పురీం సమాగత్య జగర్జ చే త్థం । పతీన్సుతాన్ బన్ధుగణాన్ దదామి ।
శ్రుత్వా వచ స్తన్గదితం పురాఙ్గనాః । ఊచు స్తదా తాం వృషవల్లభాం ప్రతి ॥ 124

## పుల్కసీరూపధారిభగవతా పద్మావతీజనన్యా శ్చ అన్యోన్యసంవాదః

గ్రామికాః —

ధర్మదేవీ సమాయాతా ।నరనారాయణా శ్రమాత్ ।
వృద్ధా సా వర్తతే హ్యమ్బ । మితభాషే వ దృశ్యతే ॥ 1.5

మనోగతం వదామీ తి । వదతీ యం పునః పునః ।
తా మాహ్వయ మహాభాగే ! । ధర్మదేవీం పతివ్రతామ్ ॥ 126

తా మిత్థ మావేదితచిత్తవేదితా । విద్యాం నిజగ్రామభవాఙ్గనాగణైః ।
ఆహ్వాపయ త్తత్ర సఖీభి రాదరాత్ । సమ్ప్రాప్తభాగ్యా హ మితి స్మర న్త్య సా॥

ఆజ్ఞప్తా ధరణీదేవ్యా । వశీభూతా వరాఙ్గనాః ।
ఊచు స్తా మగ్రగా స్సర్వాః । సబాలాం ధర్మదేవతామ్ ॥ 128

గ్రామికాః —

యా హి మఙ్గళదే ! దేవి ! రాజభార్యా మిమా మితి ।
సా శ్రుత్వా వచనం తాసాం । మన్ద మాహ మనస్వినీ ॥ 129

ధర్మదేవీ —

అహం దరిద్రా కుటిలా । సబాలా ఒభాగ్యసంయుతా ।
ఆహ్వానం కిం వినోదార్థం । హాస్యార్థం హసితాననాః ॥ 130

మద్వస్త్రం పశ్యత చ్ఛిద్రం । మదాభరణమణ్డలమ్ ।
నవధాన్యసమాకీర్ణ । గుల్మం గుఞ్జావిభూషితమ్ ॥ 131

కర్రను చేతబూని నావద్ద. బ్రహ్మలు తనకు నమస్కరించుచుండగా నారాయణ పురమున కేతెంచె 123

"అమ్మలారా! భర్తలను, బిడ్డలను, బంధువులను మీకు సమకూర్చగలన'ని గట్టిగా పలికెను. ఆమె మాటలను పురంధ్రీమణు లందరును విని రాణితో— 124

## సోదిక త్తియ వేషమునను్న శ్రీనివాసునితో పద్మావతితల్లి సంభాషించుట

గ్రామిక —

అమ్మా! నరనారాయణాశ్రమమునుండి ధర్మదేవి వచ్చినది. ముదుసలిది. మితముగా మాట్లాడునదివలె నున్నది. 125

ఆమె మన మనస్సునందలి విషయములను తెలుపగలనని మాటిమాటికి పలుకు చున్నది. ఆ పతివ్రతను పిలపనంపుమ"నిరి. 126

తన గ్రామమునందలి నారీమణు లందరును మనోగతసంకల్పముల నెఱుంగ జాలెడు సోదిక త్తియను గురించి తెలుపగా ధరణీదేవి యాదరముతో "నా అదృష్టము ఫలించె"నని తలంచుచు నా సోదిక త్తియను పిలువుడి'ని 127

ఆజ్ఞాపింపగా నా సోదిక త్తియకు వశపడిన నారీమణు లందరు ధర్మదేవతను సమీపించి 128

గ్రామిక —

శుభప్రదురాలవగు నో దేవీ! రమ్ము. ఇదుగో, రాజపత్నివి సమీపించుమ'ని యనగా నా ధర్మదేవత వారిమాటలను విని మెల్లగా 129

ధర్మదేవత —

అమ్మలారా! నేను దరిద్రురాలను. నాగరికత నెఱుంగనిదానను. పిల్లవానిని వెంటనిడుకొని వచ్చినదానను. దురదృష్టవంతురాలను. మీరు నన్ను పిలచుట మీ వినోద మునకా? లేక నన్ను పరిహసించుటకా? 130

నా చిరిగిపోయిన చీరను చూడుడు, నా ఆభరణములను గాంచుడు. నవధాన్యము లతో నిండిన నా బుట్ట - గురివిందగింజలతో తయారుచేయబడిన ఆభరణములచే నలంక రింప బడిననన్ను— 131

అన్నహీనం శిశుం మాఞ్చ । దృష్ట్వా దేవ్యేతి నో ధ్రువమ్ ।
నా గచ్ఛామి విశాలాక్ష్యః । కిం కార్యం రాజమన్దిరే ॥ 132

ధర్మదేవీ వచః శ్రుత్వా । జగ్ముస్తా ధరణీం ప్రతి ।
యథోక్తం ధర్మదేవ్యా తు । త దాచఖ్యు శ్చ తాం ప్రతి ॥ 133

తాసాం తద్వచనం శ్రుత్వా । ధరణీ తాం యయౌ స్వయమ్ ।
ఉవాచ ధర్మదేవీం తాం । ధరణీరాజసున్దరీ ॥ 134

ధరణీ —

ఏహి భద్రే ! మహాభాగే ! । సాక్షా త్త్వం ధర్మదేవతా ।
దైవయోగా దాగతా ఽసి । మమ కల్యాణవర్ధినీ ॥ 135

మనోరథో మనఃసంస్థః । తథ్యం మే కథ్యతా మితి ।
భాషితా రాజపత్న్యా సా । సత్య మాహ ధరాం ప్రతి ॥ 136

ధర్మదేవీ —

కఠినం మమ వాక్య స్తు । శృణు రాజ్ఞస్తు వల్లభే ।
మయా తు గదితం వాక్యం । అసత్య శ్చే న్మనస్విని ! ॥ 137

పురా న్నిష్కాస్య మాం దేవి ! । జిహ్వాయా శ్ఛేదనం కురు ।
నరనారాయణః స్వామీ । మద్భర్తా రాజసున్దరి ! ॥ 138

తద్వీర్యజాతపుత్ర స్తు । ప్రజాపతి మిమం విదుః ।
తేనా ఽజ్ఞప్తా త్వదర్థే చ సమ్ప్రాప్తా తవ మన్దిరమ్ ॥ 139

భూతం భవ్యం భవిష్య చ్చ । జానామి జగదీశ్వరి ! ।
ఇత్యుక్త్వా ధర్మదేవ్యా సా । రాజపత్నీ పతివ్రతా ॥ 140

సువచోభిః సా త్త్వయిత్వా । ధరణీ ధర్మదేవతామ్ ।
ప్రాపయ ద్భవనం స్వస్యాః । మన్దం మన్దం ముదా ఽన్వితా ॥ 141

తా మాదాయ గృహం ప్రాప్య । వరం సింహాసనం వదౌ ।
సింహాసనగతా సా చ । ధర్మదేవీ వచో ఽబ్రవీత్ ॥ 142

అన్నము లేక నల్లాడు నా బిడ్డను చూచి తప్పక నామె సంతసించదు. ఓ స్త్రీలారా! రాజగృహముతో నా కేమిపని? నేను రాననెను 132

ధర్మదేవి పలుకుల నాలకించి ఆ నారీమణులు ధరణీదేవిని సమీపించి ధర్మదేవి పలికిన మాట లన్నింటిని తెలుపగా 133

ధరణీదేవి తాను స్వయముగా ధర్మదేవివద్ద కేగి యామెతో— 134

ధరణీదేవి —

పుణ్యశీలీ! నీవు సాక్షాత్తుగా ధర్మదేవతవు నాకు మంగళప్రవర్ధకురాలవై నా భాగ్యవశమున వచ్చితివి. 135

నా మనసునన్న కోరికను నాకు యదార్థముగా నెఱింగింపుమని యడుగగా ధర్మదేవత నిస్సంకోచముగా— 136

ధర్మదేవత —

రాజపత్నీ! వినుటకు కఠినముగానుండు నా మాటను వినుము. నేను చెప్పిన మాట యసత్యమగునేని 137

నన్ను పట్టణమునుండి వెడలగొట్టి నా నాలుకను ఛేదింపుము. నరనారాయణుడు నా ప్రభువు. (నరుని రూపమును ధరించిన నారాయణుడే నా భర్త) 138

ఆతనివలన పుట్టిన యీ బాలునిపేరు ప్రజాపతి. ఆ నారాయణునిచే నాజ్ఞాపింపబడి నీతో సంభాషించుటకై నీ యింటికి వచ్చితిని 139

జరిగినదానిని జరుగుచున్నదానిని జరుగబోవుదాని నెఱుంగజాలుదునని తెలిపెను. ఆ మాట లాలించి పతివ్రతయు రాజు భార్యయునగు ధరణీదేవి— 140

ధర్మదేవతను మృదుభాషణములచే ననునయించి మెల్లమెల్లగా తన భవనమునకు తోడ్కొనిపోయి 141

మంచి పీఠముపై నామెను కూర్చుండ జేసెను. అట్లా సింహాసనముపై గూర్చున్న ఆ ధర్మదేవి యంతట ధరణీదేవితో 142

ధర్మదేవీ —

మజ్జనం కురు కల్యాణి ! । వస్త్రాలఙ్కారభూషితా ।
గురుదేవనమస్కారం । కురు దేవి ! హరిప్రియమ్ ॥ 143

ఏవ ముక్తా ఽథ కల్యాణీ । తథా చక్రే యథోదితమ్ ।
తస్యా శ్చాభిముఖీ భూయ । పశ్చా ద్వాక్య మువాచ సా ॥ 144

కిం కార్యం వద భద్రం మే । కరోమి తవ శాసనాత్ ।

పులిన్దా —

వాయనం దేహి కల్యాణి ! । దేవానాం ప్రీతిసాధకమ్ ॥ 145

ఇత్థం పులిన్దావచనం । శ్రుత్వా సా ధరణీ తదా ।
స్వర్ణశూర్పం సమాదాయ । ముక్తాతణ్డులపూరితమ్ ।
నిక్షిప్య పురతః శీఘ్రం । ధర్మదేవీం వచో ఽబ్రవీత్ ॥ 146

ధరణీ —

సత్యం వద మహాప్రాజ్ఞే ! । మమ దుఃఖం ప్రణోదయ ।
ధరణీవాక్య మాకర్ణ్య । ధర్మదేవీ వచో ఽబ్రవీత్ ॥ 147

ధర్మదేవీ —

సత్యం వదామి సుశ్రోణి ! । శిశో రన్నం ప్రయచ్ఛ మే ।
అహః కృతం రాత్రికృతం । సుపక్వరససంయుతమ్ ॥ 148

శ్రుత్వా తద్వచనం రమ్యం । త్వరయా ఽఽనీయ భామినీ
క్షీరాన్నం స్వర్ణపాత్రస్థం । అర్భకాయ దదౌ నృప ॥ 149

త ద్దృష్ట్వా స్వర్ణపాత్రస్థం । మానుషాన్నం న భుక్తవాన్
రురోద చ శిశు స్తస్యాః । ధర్మదేవ్యాః స భూమిప ! ॥ 150

రుదన్త మాత్మజం దృష్ట్వా । వినిన్ద్య చ తతాడ సా ।
" దరిద్రో ఽపి దురాచార ! । కన్దమూలఫలాశనః ॥ 151

ధర్మదేవత —

కల్యాణీ ! నీవు చక్కగా స్నానమొనరించి వస్త్రాలంకారముల నలంకరించుకొని శ్రీమన్నారాయణుని అనుగ్రహపాత్రురాల వగునట్లు గురువులకు దేవతలకు నమస్కరించి రమ్మ'ని పలికెను 143

ధరణీదేవి యట్లే యొనర్చివచ్చి 144

యామె కెదురుగా కూర్చుని మరల నామెతో "నింకేమి చేయవలెనో తెలిపిన నీ యాజ్ఞ ననుసరించి యట్లే చేయుదున'నగా ధర్మదేవత రాజపత్నితో — దేవతలకు ప్రీతి నొసంగునట్లు నాకు వాయనము నిమ్మ'ని యడిగెను. 1 5

ఆ మాటల కంగీకరించి ధరణీదేవి బంగారుచేటయందు ముత్యములను బియ్యము నుంచి తెచ్చి ధర్మదేవత యెదుటనుంచి 146

ధరణీదేవి —

"నిజమును తెలిపి నా దుఃఖమును పోగొట్టుమ'ని యడుగగా ధర్మదేవత ఆమె మాటలను విని యామెతో— 147

ధర్మదేవత —

అమ్మా ! నిజమునే తెలిపెదను. నా బాలునకు పగటివేళ చేసినట్టియు రాత్రివేళ యందు చేసినట్టియు, మంచి వంటకముల రుచులతో గూడిన యన్నము నొసంగుము'ని యడుగగా 148

శీఘ్రముగా ధరణీదేవి బంగారుపాత్రతో పాయసాన్నమును తెచ్చి బాలున కొసంగెను. 149

కాని ఓ రాజా ! ఆ బాలుడు బంగారు పాత్రమునయున్న ఆ మనుష్యులు భుజించు నాహారమును భుజింపక ఏడ్వసాగెను. 150

అట్లేడ్చుచున్న బాలునిగాంచి "దరిద్రుడా ! దుష్టస్వభావము కలవాడా ! అడవి లోని దుంపలను మూలములను భుజించువాడా ! 151

కథం న భోక్ష్యసే మృష్టం । క్షీరాన్నం రాజనిర్మితమ్ ।
సదా ఽపి రోదనం మాతః । కిం కరోమీ ''తి భూమిప ! ॥ 152

శపం తం భర్త్సయిత్వా ఽథ । సమ్భోజ్యా న్న మనుత్తమమ్ ।
'' మమోదరగతం చా న్నం । పుత్రస్య హితకారణమ్ ॥ 153

ఇత్యు క్త్వా సా ధర్మదేవీ । శిరో ర్ధత్తం నృపో త్తమః ।
క్షీరాన్నం స్వర్ణపాత్రస్థం । భుక్త్వా స్వస్థా తదా ఽబ్రవీత్ ॥ 154

సత్యం వదామి శుక్రోణి ! । తామ్బూలం దేహి మే ఽఙ్గనే । ''
ఇత్యుక్తా ధరణీదేవీ । ధర్మదేవ్యా పుళిన్దయా ॥ 155

ఏలాలవఙ్గకర్పూర । నాగవల్లీదళై ర్యుతమ్ ।
తామ్బూల మర్పయామాస । పుళిన్ద్యై పతివ్రతా ॥ 156

తతః సా ప్రాఙ్ముఖీ భూత్వా । పుత్ర మఙ్కే నిధాయ చ ।
నిక్షిప్య పురతో గుల్మం । పాదా వాస్తీర్య సంస్థితా ॥ 157

ఏవం రూపం గతం కృష్ణం । శ్రీనివాసం సురో త్తమాః ।
ద్రష్టుకామాః సమాయాతాః । వైఖరీం ప్రాకృతోచితామ్ ॥ 158

సమ్ప్రశ్య న్త స్తస్య ఖస్థాః । సవిమానగతా స్తథా ।
సల్లాపం చక్రు రన్యోన్యం । సమ్భ్రమాత్ కౌతుకాన్వితాః ॥ 159

కిం తయా సుకృతం రాజ్ఞ్యా । కృతం పూర్వం తయా ఽధునా ।
లక్ష్మీసహాయో భగవాన్ । క్రీడతే ప్రాకృతో యథా ॥ 160

ఏవం హరే శ్చిత్రవిచిత్రకర్మ । గాయ న్తి కఞ్జోద్భవశమ్భుశక్రాః ।
కలౌ యుగే పాపకృతాం నరాణాం । హ్యుద్ధారణార్థా జగదీశచేష్టాః ॥ 161

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే శ్రీనివాసస్య పుళిన్దస్త్రీరూప వర్ణనం నామ అష్టమో ఽధ్యాయః సంపూర్ణః.

రాజులు వండిన రుచికరమగు పాయసాన్నమును భుజింపవేల? ఎప్పుడును పెద్దుమనే యుండును. అమ్మా! ఈ బిడ్డ నేమి చేయుదును? 152

అని ఆ పిల్లవానిని భయపెట్టి ఆ యన్నమును తినుపించి " నేను భుజించినను బాలునకే హితమును చేకూర్చున'ని 153

పలికి బాలునకై యొసంగబడిన బంగరు పాత్రలోని పాయసాన్నమును తాను తిని స్వస్థత చెంది 154

అమ్మా! నిజముగా చెప్పెదను నాకొక తాంబూలమును కూడ యొసంగుమ'ని మ్లేచ్ఛజాతికి చెందిన ఆ ధర్మదేవి (సోదెకత్తె) యడుగగా 155

ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము, తామలపాకులతో కూడిన తాంబూలము నా యెఱుకలదాని కొసంగెను. 156

సోదికత్తియ పిల్లవానిని తొడపై కూర్చుండబెట్టుకొని తూర్పుదిశవైపు తిరిగి ఎదురుగా గంప నుంచుకొని కాళ్లు జాపుకొని కూర్చుండెను. 157

ఇట్లు సోదికత్తియ వేషములోనున్న శ్రీనివాసుని చూచు కుతూహలముతో దేవతలందరు వచ్చి 158

ఆకాశమునందు విమానములపైనుండి చూచుచు కుతూహలముతో కూడిన సంభ్రమముతో తమలో తాము మాటలాడుకొనసాగిరి, 159

శ్రియఃపతి సాధారణ మనుష్యునివలె ధరణీదేవితో ఆడుకొనుచుండుటకు ఆమె పూర్వజన్మమున నెంత పుణ్య మొనరించెనోకదా! 160

అని యిట్లు బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు శ్రీనివాసుని అద్భుతకృత్యములను కీర్తింపసాగిరి. కలియుగమున పాపాత్ములకి శ్రీమన్నారాయణుని చేష్టలే పాపములను పోగొట్టి ఉత్తమగతి నొసంగును. 161

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున శ్రీనివాసుడు యెఱుకలదాని వేషమును ధరించుట యనెడు ఎనిమిదవ యధ్యాయము.

# అథ నవమో ఽధ్యాయః

## ధరణ్యా పృష్టో క్తపద్మావతీదేహశోషణనివృత్త్యుపాయః

శతానన్ద: —

భోజనాన్తే ఽస్మర ద్దేవీ । దేవాన్ స్వకులపూజితాన్ ।
ఆదౌ నారాయణం ధ్యాత్వా । పశ్చా ల్లక్ష్మీం పితామహమ్ ॥ 1

సరస్వతీ ముమాకాన్తం । ఉమా మిన్ద్రి మతః పరమ్ ।
శచీ మగ్నియమాద్యాంశ్చ । సర్వాన్ దిక్పతీ న్నథ ॥ 2

దేవాన్ ఋషీన్ పితౄన్ రాజన్ ! । గన్ధర్వాన్ రాజసత్తమాన్ ।
కాశీశం విశ్వనాథ ఞ్చ । బిన్దుమాధవ మేవ చ ॥ 3

విష్ణుపాదం ప్రయాగ ఞ్చ । గోదాతీరనివాసినమ్ ।
నారసింహం జగన్నాథం । పాణ్డురఙ్గ మహోబిలమ్ ॥ 4

పమ్పాధ్యక్షం విరూపాక్షం । శ్రీశైలం పుణ్యకాననమ్ ।
శ్రీవేఙ్కటగిరీశ ఞ్చ । కాళహస్తీశ్వరం హరమ్ ॥ 5

ఘటికాచలసంస్థానం । వృద్ధాచలనివాసినమ్ ।
వరదంసర్వలోకేశం । శ్రీరఙ్గంశ్వేతరూపిణమ్ ॥ 6

కుమ్భఘోణాలయం కృష్ణం । శార్ఙ్గపాణిం మహీపతే ।
సేతుంరామకృతంరాజన్ । పద్మనాభంజనార్దనమ్ ॥ 7

సుబ్రహ్మణ్యం కుమారాఖ్యం । మధుసూదనశఙ్కరౌ ।
రుద్రేశ్వర ఞ్చ గోకర్ణం । తథా హరిహరౌ నృప ! ॥ 8

గఙ్గాం గోదావరీం కృష్ణాం । తుఙ్గభద్రాం మలాపహామ్ ।
కావేరీం కపిలాంక్షీరాం । సువర్ణముఖరీతథా ॥ 9

# తొమ్మిదవ అధ్యాయము

## సోదిక క్షత్రియ ధరణీదేవికి పద్మావతీ శరీరము కృశించుట మాన్పు నుపాయమును తెల్పుట

శతానందనుడు —

అన్నమును భుజించిన పిమ్మట ధర్మదేవి తన కులదేవతలను, ముందుముందుగా శ్రీమన్నారాయణుని, పిమ్మట లక్ష్మిని, అనంతరము బ్రహ్మను 1

తదుపరి సరస్వతిని, అటుపిమ్మట రుద్రుని, పార్వతిని, ఇంద్రుని, శచీదేవిని' అగ్నిని, యముడు మున్నగువారిని, వారి భార్యలతో గూడ దిక్పాలురను. 2

దేవతలను, ఋషులను, పితృదేవతలను, గంధర్వులను, రాజేంద్రులను, కాశీపురాధిపతియగు విశ్వనాథుని, బిందుమాధవుని 3

విష్ణుపాదమును, ప్రయాగను, గోదావరీ తీరమునయున్న నరసింహస్వామిని, జగన్నాథుని, పాండురంగని, అహోబిలమును 4

పంపాధినేతయగు విరూపాక్షుని శ్రీశైలమును, నైమిశారణ్యమును, శ్రీవేంకటాచలపతిని, కాళహస్తీశ్వరుడగు రుద్రుని, 5

చోళంగిరిని, వృద్ధాచలవాసిని, సకలలోకప్రభువగు వరదరాజులను, శ్రీరంగమును, శ్వేతవరాహమూర్తిని, 6

కుంభఘోణమునయున్న కృష్ణుని, శార్ఙ్గపాణిని, శ్రీరామచంద్రునిచే నిర్మింపబడిన సేతువును, పద్మనాభుని, జనార్దనుని, 7

సుబ్రహ్మణ్యుని, కుమారస్వామిని, మధుసూదనుని, శంకరుని, చంద్రేశ్వరుని, గోకర్ణుని, హరిహరులను, 8

గంగానదిని, గోదావరిని, కృష్ణానదిని, పాపములను నశింపజేయు తుంగభద్రానదిని, కావేరీనదిని, కపిలతీర్థమును, క్షీరనదిని, సువర్ణముఖరీనదిని, 9

మూకామ్బికాం భైరవ ఞ్చ । కాలభైరవ మేవ చ ।
కామాక్షీ ఞ్చ విశాలాక్షీం । మత్స్యాక్షీ మపి సౌఖ్యదామ్ ॥ 10

నస్మార లోకభావేన । చో వాచ మధురం వచః ।
రమే కొల్హాపురాధ్యక్షే ! । పాహి మాం పరదేశగామ్ ॥ 11

ఇతి స్వకీయ భావేన । స్మరన్తీ ధర్మదేవతా ।
కృత్వా మౌక్తికరాశీం స్త్రీన్ । మధ్యరాశౌ విచిన్త్య తామ్ ॥ 12

హస్తే దత్వా పరాం యష్టిం । "ఎష్వేక మనయా స్పృశ ।
ఇత్యుక్తయా తయా దేవ్యా । మధ్యరాశౌ విలోడితే ।
భావసామ్యం తతో జ్ఞాత్వా । ప్రహృష్టా వాక్య మబ్రవీత్ ॥ 13

ధర్మదేవీ —

వదేయం కారణం దేవి ! । దుహితు స్తే ఽఙ్గశోషణే ।
ఆగతః పురుషేణా స్యాః । యేన కేనా ప్యుపద్రవః ॥ 14

ఇతః పూర్వదినే కశ్చిత్ । పురుషం తురగాఽస్థితమ్ ।
దృష్ట్వా మోహవశం యాతా । కామజ్వరసుపీడితా ॥ 15

శృణు మాతః సవిస్తారం । శపే గుల్మం సపుత్రకామ్ ।
భర్తారం బదరీవాసం । మాతరం పితరం గురుమ్ ॥ 16

పతిం శ్రీవేఙ్కటాధీశం । కర్తు మిచ్ఛతి తే సుతా ।
తథా భవిష్యతి శుభం । వా గియం నా న్యథా భవేత్ ॥ 17

స్వాత్మానం తు శపే రాజ్ఞి ! । సత్య మిత్య వధారయ ।
సత్యం వదామి సుశ్రోణి ! । తామ్బూలం దేహి మే ఽఙ్గనే ॥ 18

ఏలాలవఙ్గకర్పూర । జాతీపత్త్రైః సపూగకైః ।
నాగవల్లీదళై ర్యుక్తం । పున ర్దేహి వరాననే ॥ 19

ఇత్యుక్తా ధరణీదేవీ । తామ్బూలం పున రప్య దాత్ ।
పున రాలోచయన్తీ సా । పులిన్దా వాక్య మబ్రవీత్ ॥ 20

ముకాంబికను, భైరవుని, కాలభైరవుని, కామాక్షిని, విశాలాక్షిని, సుఖప్రద యగు మీనాక్షిని, 10

లోకరీతిగా తలంచి " లక్ష్మీ ! కోల్హాపురవాసినీ ! పరదేశముననున్న నన్ను రక్షింపుము'ని 11

తన యెఱుకజాతికి తగినటుల లక్ష్మిని తలంచుచు చేటలోని ముత్తియములను మూడు భాగములుగా విభజించి మధ్యరాశిలో ధరణీదేవి పేరును తలంచి 12

యామె చేతికి మంత్రకర్ర నొసంగి యీ ప్రోగులలో నొక భాగమును ముట్టు కొనుము'నగా ధరణీదేవి మధ్యరాశిని కలియబెట్టగా తన అభిప్రాయమున కనుగుణముగా నామె మధ్యభాగమును స్పృశించుటకు సంతసించి 13

ధర్మదేవత —

దేవీ ! నీ కుమార్తె శరీరము కృశించుటకు గల కారణమును తెలిపెదను. ఒకానొక పురుషునిచే నీమె కిట్టి యుపద్రవము సంభవించినది. 14

ఇంతకు మున్ను రోజుననే గుఱ్ఱముపై నధిష్ఠించివచ్చిన పురుషునిగూర్చి మదన తాపముచే పీడించబడుచు మోహమును చెందియున్నది. 15

అమ్మా ! వివరముగా తెలిపెదను వినుము. నా బిడ్డమీదను, యీ వెదురు బుట్టమీదను ఒట్టుపెట్టుకొనుచున్నాను. సకల ప్రాణికోటిని భరించువాడును, బదరికాశ్రమ నివాసియు, సకల చరాచరములకు తల్లి తండ్రి గురువును నగు 16

శ్రీ వేంకటాచలపతిని నీ కుమార్తె భర్తగా చేసికొనగోరుచున్నది. ఆమె కోరిక తప్పక నెరవేరును. నా మాట అసత్యముకానేరదు. 17

నాపై శపథమొనర్చి చెప్పుచున్నాను. దీనిని తప్పక నిజమని నమ్ముము. 18

ఏలకులు, లవంగములు, కర్పూరము, జాపత్రి, వక్కలతోగూడిన లేత తమల పాకులతో తాంబూలమును మరల నొసంగుము " ని 19

సోదికత్తియ యడుగగా ధరణీదేవి తాంబూలము నొసంగెను. అటుపిమ్మట ధర్మదేవత మరల నాలోచించుచు నా రాజపత్నితో 20

" యో ఽసౌ తురగ సారూఢః । పురుషః పూర్వ మాగతః ।
కిరాతరూపధారీ స । సాక్షా న్మన్మథ మన్మథః ॥ 21

తం దృష్ట్వా మోహ మాయాతా । కామజ్వరసుపీడితా ।
దుహితా తే ఽభవ ద్రాజ్ఞి ! । తతో ఽస్యా అఙ్గశోషణమ్ ॥ 22

తచ్ఛాన్త్యర్థం వరారోహే ! । తస్మై సా సమ్ప్రదీయతామ్ ।"
ఇత్యుక్త్వా ధరణీ దేవీ । ధర్మదేవీం వచో ఽబ్రవీత్ ॥ 23

ధరణీ —

క్వా ఽస్తే కిరాతరూపీ స । దుహితు ర్మే ఽఙ్గశోషకః ।
వద తన్నామ కిం భద్రే ! । వరం వాస్యై తవేప్సితమ్ ।
ఇతి పృష్టా ధర్మదేవీ । ధరణీం వాక్య మబ్రవీత్ ॥ 24

" వైకుణ్ఠస్థో హరిః సాక్షాత్ । వర్తతే వేఙ్కటాచలే " ।
" శ్రీనివాస " ఇతి ఖ్యాతో । విద్యావాన్ ధనవాన్ బలీ ॥ 25

తస్యా శ్వం త్వత్సుతా బాలా । తాడయామాస చాశ్మభిః ।
ఆరామద్వారనికటే । పతితః స హయోత్తమః ॥ 26

అశ్మభి స్తాడితో ఽత్యన్తం । విహ్వలః పృచ్ఛ తత్సఖీః ।
గౌరవా ద్రాజపుత్ర్యా స్తు । క్షమేత పురుషః స తత్ ॥ 27

ఇతి మే సత్యవచనం । దత్త్వా తాం సుఖ మేష్యసి ।
అదత్త్వా దుఃఖ మాప్నోషి । న మే వాణీ మృషా భవేత్ ॥ 28

అదానే దినమాత్రేణ । సా మ్రియేత న సంశయః ।
ఇతి తస్యాః వచః శ్రుత్వా । ధరణీ పున రబ్రవీత్ ॥ 29

ధరణీ —

కిం మాం వదసి దుర్వాక్యం । అసత్యం వామలోచనే ! ।
ఇతి తస్యా వచః శ్రుత్వా । పున రాహ మనస్వినీ ॥ 30

"కిరాతవేషమును ధరించి సాక్షాత్తుగా మన్మథుని మించిన సుందరాకారుడై గుఱ్ఱమునెక్కి వచ్చిన పురుషుని 21

గాంచి నీ కుమార్తె మదనజ్వరసంపీడితయై మోహమును గాంచినది. కావుననే యామె శరీరము కృశించుచున్నది. 22

అది శమింపవలెనన్న నీ కుమార్తె నా పురుషునికే యొసంగి పరిణయ మొనర్చుము" ని తెలిపినంతనే ధరణీదేవి యా సోదెకత్తెతో 23

ధరణీదేవి —

నా కుమార్తె శరీరమును కృశింపజేయు నా కిరాతరూపధారియగు పురుషుడెచ్చట నున్నాడు? అతని పేరేమి? ఎఱింగించినచో నీ వడిగినదిత్తును" ని పలుకగా ధర్మదేవి 24

సాక్షాత్తు పరమపదవాసియగు శ్రీమన్నారాయణుడే శ్రీ వేంకటాచలమున నివసించుచున్నాడు. అతని పేరు శ్రీనివాసుడందురు. విద్యలనేర్చినవాడు, ధనవంతుడు, బలశాలి. 25

అతని గుఱ్ఱమును నీ పుత్రిక రాళ్ళతో కొట్టగా ఉద్యానవన ద్వార ప్రదేశమున నా గుఱ్ఱము చైతన్యరహితముగా పడియున్నది. 26

ఈ సంగతిని నీ పుత్రిక చెలిమికత్తియల నడుగుము. రాజపుత్రికయందలి గౌరవముతో నా పురుషుడద్దానిని క్షమించియున్నాడు. 27

కావున నీవాతనికి నీ పుత్రిక నొసంగిననే సుఖపడుదువు. లేనిచో దుఃఖింతువు. నామాటలెన్నటికి, నసత్యములు కాజాలవు. 28

ఈ దినముననే నీ వాతనికి నీ పుత్రికనిచ్చుటకు నిశ్చయింపనిచో నామె తప్పక చనిపోవును' ని తెలుపగా 29

ధరణీదేవి —

సోదికత్తియతో — ఎందులకిట్లు నన్ను దుర్భాషలాడెదవు? అసత్యము లేల పలికెదవ' ని యడిగెను. అంత నా యెఱుకవనిత 30

ధర్మదేవీ —

నా సత్యం వచనం దేవి । మయో క్తం పూర్వ మేవ తత్ ।
ఇదాన్యత్ర వ్రజనా ప్రీతా । రాజ్ఞీ వాక్య మథా బ్రవీత్ ॥ 31

ధరణీ —

" అయాచితా మయా కన్యా । కథం దేయా భవిష్యతి "
ఇతి చిన్తాపరా రాజ్ఞీ । ధర్మదేవీం వచో ఽబ్రవీత్ ॥ 32

అద్యైవ ఘటికాస్తే త్వాం । ఆగమిష్యతి కాచన ।
అబలా బహువృద్ధా చ । ధర్మార్థకుశలా భువి ॥ 33

తస్యావాక్యం విశ్వసన్తీ త్వం । రాజానం పరిచోదయ ।
ఉద్దామాన శ్చ తే భర్తుః । భ్రాతరం ససుహృద్గణమ్ ॥ 34

సమ్భావ్య సాధు మార్గం త్వం । సమాశ్రయ నృపప్రియే ।
సన్నిధౌ మమ సఙ్కల్పం । కురు కన్యానిమిత్తకమ్ ॥ 35

ధరణీ —

యేన కేనా ప్యుపాయేన । జీవితా స్యాత్ సుతా మమ ।
సుతాం తస్యైవ దాస్యామి । గిరిగహ్వర వాసినః ॥ 36

ధర్మదేవీ —

ఏవం చేత్ తే సుతా రాజ్ఞి ! । జీవిష్యతి న సంశయః ।
పతి ర్మే వర్తతే యత్ర । దేవి ! తత్ర వ్రజామ్యహమ్ ॥ 37

ఇత్యుక్త్వా తద్వచః సత్యం । ద్రష్టుకామా ధరా ఽబ్రవీత్ ।

ధరణీ —

తదా తే వచనం సత్యం । యద్యే వం సమ్భవిష్యతి ॥ 38

ఇత్యుక్త్వా ఽసౌ జగామా శు । విజధామ వరాఙ్గనా ।
సా ఽపి తాం "బాఢ" మిత్యు క్త్వా । నిర్జగామ పురా ద్బహిః ॥ 39

కక్షే బద్ధ్వా సుతం రాజన్ ! స్వర్ణశూర్పం సగుల్మకమ్ ।
జగామో త్తర మభ్యేత్య । పులిన్దా మిథిలేశ్వర ! ॥ 40

ధర్మదేవత —

అమ్మా ! నామాట అసత్యముగా కాజాలదు. నేను ముందే చెప్పితినికదా ! అనెను. ఆ మాటలను విని ధరణీదేవి మిక్కిలి భయపడుచు 31

ధరణీదేవి —

కన్యయవివ్మని నన్నడుగకుండగనే నేనెట్లీయగలనని చింతించు ధరణీదేవితో 32

నే దిరుపదినాలుగు నిమిషముల కాలములో దుర్భరాలను ధర్మార్థములయందు పాతుర్యముగల నొకవృద్ధురాలు నీవద్దకు చనుదెంచును. 33

నీవు నా మాటను నమ్మి నీ భర్తను, నీ భర్త సోదరుడగు తొండమానుని సపరివారముగా 34

పిలచి నీవు సన్మార్గము నవలంబింపుము ప్రస్తుతము నాతో " కన్యనిత్తున 'ని సంకల్పించుకొనుము ' ని చెప్పగా 35

ధరణీదేవి —

నా పుత్రి కేయుపాయముచేనైనను బ్రతికినచో నా కొండగుహలయందు నివసించు నా కిరాతరూపహరికే నామె నొసంగెదన ' ని తన సంకల్పము నెఱింగించెను 36

ధర్మదేవత —

అంత ధర్మదేవి " రాణీ ! నీ విట్లు సంకల్పించితివిగాన నీ పుత్రిక తప్పక బ్రతుకును. నా భర్త నాకై వేచియున్నాడు. నే నేగెదన 'ని చెప్పెను. 37

ధరణీదేవి యా సోదికత్తియ మాటలలోని యదార్థము నెఱుంగగోరి యామెతో — 38

ధరణీదేవి —

" ఈ వృత్తాంతము జరిగినచో నీ మాట సత్యమే యగున ' ని పలుకుచు తన సౌధమున కేగెను. ఆ ఎఱుక వనితయు 'అట్లే' యని 39

ఆ సోదెకత్తె సంకలో పిల్లవానిని కట్టుకొని బంగరు చాటను, వెదురుబుట్టను తీసికొని నగరము వెలుపలకువచ్చి ఉత్తరదిశగా నేగెను. 40

పులిన్దాయాం గతాయా న్తు । ధరణీ వామలోచనా ।
పుత్ర్యా నికేతనం ప్రాప్య । రుదన్తీ భృశదుఃఖితా ॥ 41

కిం తే మనోగతం పుత్రి । య త్త్వ మిచ్ఛసి తద్వద ।
న చ మాతృసమం మిత్రం । పుత్రీణా మస్తి నన్దిని ॥ 42

కిన్ను కార్య మకార్యం వా । త న్మమా చక్ష్వ భామిని ।
పూరయామి మనఃస్థ మ్చ । కిమర్థం తవ శోషణమ్ ॥ 43

అభాగ్యా ఽహం మహాభాగే । విషపానం కరోమి చ ।
ఇత్యుక్త్వా సా పరాధీనా । దుఃఖితా రుదితా ఽభవత్ ॥ 44

దుఃఖితాం జననీం దృష్ట్వా । మన్ద మాహ మనోగతమ్ ।

పద్మావతీ —

కిం వదిష్యామి హేమాతః । సూతికా దుఃఖమాగతమ్ । 45

అథవా పుత్రలాభం కిం । ప్రవదామి నిగూఢజమ్ ।
నా కృత్యం తాదృశం కిఞ్చిత్ । జాతా క్వా పితు మే వరే ॥ 46

కాఙ్క్షా సమ్ప్రతి తా మద్య । వక్తుం శక్నోమి న స్వయమ్ ।
తథా ఽపి తవ వక్ష్యామి । మాతృత్వాత్ శృణు భామిని ॥ 47

## పద్మావతీ కథిత భగవల్లక్షణ తద్భక్త లక్షణాని

త్వయా ఽజ్ఞప్తా ఽగమం మాతః । పుణ్యారామం సఖీయుతా ।
తత్రా ఽయాతః పుమాన్ కశ్చిత్ । పురాణ పురుషోత్తమః ॥ 48

మాతః స్మరామి తద్వక్త్రం । పుణ్డరీక విశేషణమ్ ।
తం వినా న హి జీవామి । సత్య మిత్య వధారయ ॥ 49

చరితం తస్య కృష్ణస్య । జానన్తి విబుధేశ్వరాః ।
పాతాళజా శ్చ మనుజాః । న జానన్తి హరిం పరమ్ ॥ 50

శోకిక త్తియ యేగినంతనే ధరణీదేవి కుమార్తె యంతఃపురమునకేగి మిక్కిలి దుఃఖించుచు 41

అమ్మా ! నీ మనోరథమేమి ? నీ కోరిక నెఱింగింపుము. తల్లివంటి స్నేహితురాలు బాలికలకింకెవరు నుండబోరు కదా ! 42

చేయదగిన కృత్యమెద్దియో, చేయరానిదెద్దియో నా కెఱింగింపుము నీ కోరికను సఫలమొనరింతును. నీవు కృశించు కారణమేమి ? 43

నీవు తెలుపనిచో మందభాగ్యురాలనగు నేను విషయమును భ్రమింగెద ' నని తనను విలపించుకొనజాలనిదై బిట్టుగా నేడ్వసాగెను. 44

అంత పద్మావతి విలపించుచున్న తల్లినిగాంచి అమ్మా ! ఏమని చెప్పమందువు ? నావలన బాలెంత దుఃఖముగాని, 45

అతి రహస్యముగా జనించిన పుత్రలాభమనెడు కూడని పని యెద్దియు జరుగలేదు. 46

నా కోర్కెను నేను స్వయముగా నెఱింగింపజాలకున్నాను. నీవు తల్లివగుటం జేసి తెలిపెదను వినుము. 47

## పద్మావతి భగవంతుని చిహ్నములను ఆతని భక్తుల చిహ్నముల నెఱింగించుట

అమ్మా ! నీ యాజ్ఞానుసారము చెలిమికత్తియలతో పుష్పోద్యానమున కేగితిని. అచ్చట కొక ఆదిమధ్యాంతరహితుడగు నొక పురుషపుంగవు దేతెంచెను. 48

తామరరేకులవంటి నేత్రములుగల ఆతని ముఖము నెల్లపుడును నేను తలంచుచునేయున్నాను. అతడు లేనిచో నేను బ్రతుకజాలను. ఇది నిక్కమని నమ్ముము. 49

ఆ శ్రీకృష్ణుని చరిత్రమును విజ్ఞానవిధులెఱుంగుదురుగాని పాతాళలోక నివాసులుగాని, మానవులుగాని యెఱుంగజాలరు. 50

సత్యం సర్వోత్తమః సాక్షాత్ । స ఏవ పురుషోత్తమః
దక్షిణం పాణి మాశ్రిత్య । రాజతే చక్ర ముత్తమమ్ ॥ 51

తథా సవ్యే శఙ్ఖరాజో । రాజతే రాజవల్లభే ।
యత్కణ్ఠే కౌస్తుభం రత్నం । శ్రుత్యో ర్మకరకుణ్డలే ॥ 52

యస్య చక్ర ప్రభావేణ । దగ్ధా వారాణసీ పురీ ।
యస్య శఙ్ఖధ్వనిం శ్రుత్వా । విద్రవన్త్య సురాదయః ॥ 53

## భాగవత లక్షణ కథనమ్

తద్భక్త లక్షణం వక్ష్యే । శృణు మాతః సవిస్తరమ్ ।
వేదశాస్త్రపరా యే చ । స్వధర్మాచరణే రతాః ॥ 54

వేదోక్తం కర్మ కుర్వన్తి । తద్భక్తాన్ విద్ధి వైష్ణవాన్ ।
శఙ్ఖచక్రాఙ్కితా యే చా । పూర్ధ్వపుణ్డ్రధరా శ్చ యే ॥ 55

నా సత్య వచనా యే తు । పితృమాతృమతే స్థితాః ।
తద్భక్త లక్షణం త్వే తత్ । తం వినా కో ను జీవతి ? ॥ 56

తనయా వచనం శ్రుత్వా । సా ఽనన్దా వాక్య మబ్రవీత్ ।

ధరణీ —

సత్యం వద మహాప్రాజ్ఞే । భ్రమో వా జ్వరకారణమ్ ॥ 57

పద్మావతీ —

సత్యం వదామి మాత ర్యః । దృష్టపూర్వో మహాప్రభుః ।
తద్దర్శనధియా మే ఽద్య । జాయతే దేహశోషణమ్ ॥ 58

శతానన్దః —

సాన్త్వయిత్వా సుతాం భద్రా । భర్తు ర్భవన మభ్యగాత్ ।
పాకార్థం పరమానన్దా । భరితా భాగ్యసమ్పదా ॥ 59

పుత్ర్యఙ్గశోష సంక్లిష్టాం । కృచ్ఛ్రసన్తాపసంయుతమ్ ।
అవద త్ప్రపతిం ప్రాప్య । పుత్రీకాయవిశోషణే ॥ 60

ఆతడే పురుషోత్తముడు. ఇది నిజము. ఆతని కుడిచేతిలో చక్రము మెరయు చున్నది. 51

ఎడమచేతియందు శంఖము, కంఠమున కౌస్తుభమణియు, చెవులకు మకర కుండలములను మిలమిల్లుచున్నవి. 52

ఆతని చక్రప్రభావముచే మున్ను వారణాసి (కాశీకాపట్టణము) భస్మమాయెను. ఆతని శంఖధ్వనిని విని రాక్షసులు పర్వులెత్తుదురు. 53

## భగవద్భక్తుల లక్షణములను జెప్పుట

ఆ భగవంతుని భక్తుల లక్షణములను తెలిపెదను వినుము. భగవంతుని భక్తులు వేదశాస్త్రములయందాసక్తి కలిగియుందురు. తమ ధర్మానుష్ఠానమున శ్రద్ధకలిగియుందురు.

విష్ణుభక్తులై వేదశాస్త్రములందు చెప్పబడిన కర్మలనాచరింతురు. శంఖచక్రము లచే భుజమూలములయందు చిహ్నితులై, ఊర్ధ్వపుండ్రముల ధరింతురు. 55

అసత్యములాడజాలరు. తల్లిదండ్రుల యభిప్రాయముల తెలిసి మసలుకొందురు. అట్టి లక్షణములు కలవారే విష్ణుభక్తులు. అట్టి భగవంతుని వీడి యెవరు బ్రతకజాలుదుర' ని పద్మావతి తెలుపగా 56

ధరణీదేవి సంతసించి ' ఇది నిజమా ? లేక నీవు భ్రమచే నిట్టి సంతాపమును చెందుచుంటివా ' అని యడుగగా 57

పద్మావతి —

" అమ్మా ! నా మాట నిజము ఆ పురుషోత్తముని చూచిననాటినుండియు నాతనిని మరల గాంచవలెనను తలంపుతో నా శరీరము కృశించుచున్నద " ని తన మనోభీష్టమును తెలుపగా 58

శతానందనుడు —

ధరణీదేవి పద్మావతి నూరడించి అదృష్టసంపదతో నిండినదై మిక్కిలి సంత సించుచు కుమార్తె కోరికను సఫలతనొనరించుటకై తన పతి గృహమునకేగెను. 59

పుత్రిక శరీరము కృశించుటచే దుఃఖించుచున్నట్టియు, దానిని పోగొట్టు నుపా యమెఱుంగక మనస్తాపము చెందుచున్నట్టి తన భర్తతో కుమార్తె చిక్కిపోవుటకు కారణమును, 60

కారణం ధర్మదేవ్యోక్తం । అథ తచ్ఛాన్తికారణమ్ ।
సర్వం సమ్బోధయామాస । పుత్ర్యా హృద్గత మాదరాత్ ॥ 61

ధరణీశం ప్రతి పద్మావతీసఖీభిః సహ వకుళాగమనమ్

ఏతస్మి న్నేవ సమయే । కన్యా శ్చ వకుళా న్వితాః ।
అభిషిచ్యా ప్యగస్త్యేశం । శఙ్కరం బ్రాహ్మణైః సహ ॥ 62

సమ్భారాన్ శిరసా ధృత్వా । బ్రాహ్మణైః స్వపురోహితైః ।
రాజధానీం సమాసాద్య । భర్తు ర్భవన మభ్యయుః ॥ 63

సమాగతాన్ ద్విజాన్ సర్వాన్ । సమ్పూజ్య విధిపూర్వకమ్ ।
గన్ధపుష్పాక్షతాద్యై శ్చ । వస్త్రాలఙ్కారభూషణైః ॥ 64

విప్రాశీర్వాదమన్త్రై శ్చ । మార్జయిత్వా స్వకాం సుతామ్ ।
అభుఙ్క్త చ స్వయం రాజా । బ్రాహ్మణానా మథాఽఽజ్ఞయా ॥ 65

సా భుక్త్వా ఽథ మహాభాగ । ధరణీ బహి రాగతా ।
దదర్శ తాం మహారాజ । వకుళాం నవరూపిణీమ్ ॥ 66

ధర్మదేవ్యా వచః స్మృత్వా । తత్సమీప ముపాగమత్ ।
పప్రచ్ఛ తా స్తదా కన్యాః । ఏతద్వృత్తాన్త కోవిదాః ॥ 67

ధరణీ —

కైషా కస్మా దుపాయాతా । పూజ్యే వ ప్రతిభాతి మే ।
పృచ్ఛ్యతాం కన్యకాః అస్యాః । కి మాగమనకారణమ్ ॥ 68

ఏవ ముక్తాః కన్యకా స్తు । ధరణీ మబ్రువం స్తదా ।

కన్యకాః —

వాసః పన్నగశైలే ఽస్యాః । స్వామీ శ్రీవేఙ్కటేశ్వరః ॥ 69

త దాజ్ఞాకారికా కాచిత్ । నామ్నా వకుళమాలికా ।
ఆవయా ధరణీదేవ్యాః । సన్నిధౌ మమ కిఞ్చన ॥ 70

దానికి చేయవలసిన శాంతిని ధర్మదేవి చెప్పినటుల నంతయు నాతని కెఱింగించి పద్మావతి మనోభీష్టమును కూడ తెలియజేసెను. 61

## ఆకాశరాజువద్దకు పద్మావతి చెలికత్తెలతో వకుళాదేవి వచ్చుట

ఇంతలో పద్మావతి చెలికత్తెలు వకుళాదేవితో గూడ అగస్త్యేశుడగు ఈశ్వరుని బ్రాహ్మణులతో గూడ సందర్శించి 62

పురోహితులతోను, బ్రాహ్మణులతో గూడినవారై పూజాద్రవ్యములను శిరస్సులపై నుంచుకొని రాజధానిని ప్రవేశించి యందలి రాజభవనముకు వచ్చిరి. 63

రాజు వచ్చిన బ్రాహ్మణులనందరను యథావిధిగ పూజించి గంధపుష్ప అక్షతలతోను, నూతన వస్త్రాలంకారములతోను 64

బ్రాహ్మణుల ఆశీర్వాద మంత్రములతో తన కుమార్తె శరీరమును తు...
బ్రాహ్మణుల యాజ్ఞనుపొంది తాను భుజించెను. 65

అనంతరము ధరణీదేవియు భుజించి వెలుపలకురాగా నూతన సౌందర్యవతి యగు వకుళమాలికను గాంచెను. 66

అంత ధరణీదేవి ధర్మదేవి మాటను తలంచుచు వకుళాదేవిని సమీపించి యామె వృత్తాంతమును చక్కగా నెఱింగిన వా కన్నియ నిట్లడిగెను. 67

ధరణీదేవి —.

ఈమె ఎవరు? ఎటనుండి వచ్చినది? పవిత్రురాలువలె తోచుచున్నది. బాలికలారా! ఈమె రాకకుగల కారణమును తెలిసికొనుద' నినంతనే 68

కన్నియలందరు ధరణీదేవితో — ఈమె శేషశైలమున నివసించును. శ్రీ వేంకటాచలపతి యీమెకు ప్రభువు. 67

ఆతని ఆజ్ఞలనాచరించుచుండును. ఈమె పేరు వకుళమాలిక. ఈమె 'ధరణీ దేవితో కొంత మాట్లాడవలసియున్నద' ని 70

కార్య మ స్తీ'తి కథితం । తత స్తు సహితా స్తయా ।
వయం ప్రాప్తా మహాభాగే! । త్వత్సమీప మిహా ధునా ॥ 71

ప్రష్టవ్యతాం సైవ వృత్తాన్తం । తదాగమన కారణమ్ ।
ఏవ ముక్తా ఒథ కల్యాణీ । వకుళాం సమభాషత ॥ 72

తిష్ఠ భద్రే వరారోహే । రత్నపీఠే సునిర్మలే ।
ఇత్యుక్తా ఒఒసనస్థభరితా । వకుళా తత్ర సంస్థితా ॥ 73

మేనే కృతార్థ మాత్మానం । సాఫల్యం జన్మనో ఒపి చ ।

ధరణీ —

స్వాగతం తే వరారోహే! । మమ పుణ్యసముచ్చయాత్ ॥ 74

మన్యే కృతార్థ మాత్మానం । సఫలం సాధు సఙ్గమాత్ ।
పరిప్రష్టవ్యం భవత్కార్యం । త దిద్య విదకిమహి ॥ 75

"కిమర్థ మాగమో మాతః! । శీఘ్రం త త్కథ్యతా" మితి ।
బభాషే వకుళాం భార్యా । రాజ్ఞ స్తస్య మహాత్మనః ॥ 76

## ధరణీం ప్రతి వకుళోక్తస్వాగమన కారణమ్

కన్యాపేక్షా ముఖ్యకార్యం । పునః కార్యశతేన కిమ్ ।
ముఖ్యకార్యం తతః శ్రుత్వా । వకుళా మబ్రవీ దిదమ్ ॥ 77

ధరణీ —

సమ్య గుక్తం త్వయా దేవి! । వరాపేక్షా ఒపి వర్తతే ।
కో వరః క శ్చ దేశో ఒస్య । గోత్రం నక్షత్రక ఞ్చ కిమ్ ॥ 78

కిం నామ జనక శ్చా స్య । మాతా చా పి మహాత్మనః ।
కిం కులం కో ఒస్య చా ఒచారో । జాతి ర్వా తస్య కా వద ।
కులా ఒచారాదికం పృష్టా । వకుళా వాక్య మబ్రవీత్ ॥ 79

వకుళా —

పలుకుచే నామెను తోడ్కొని మీ సమీపమున కిప్పుడు వచ్చితిమి. 71

మీరే యామె రాకకుగల కారణము నడిగి తెలిసికొనుడ 'ని పలికిరి. అంత ధరణీదేవి వకుళమాలికతో — 72

'శుభాంగీ! ఈ నిర్మలమగు రత్నపీఠము నలంకరింపుమ 'ని నంతనే వకుళమాలిక యా పీఠముపై నధిష్ఠించి 73

తనను కృతార్థురాలయినట్లును, తన జన్మ తరించినట్లును తలపోయసాగెను, ఇంతలో ధరణీదేవి — అమ్మా! నీకు స్వాగతము నా భాగ్యవశమున చనుదెంచితివి. 74

సజ్జనసాంగత్యమున నేను కృతార్థురాలనయినట్లును, నా జన్మ సఫలమయి నట్లును తలంచెదను. నీ రాకకు కారణమును తెలుపుము. దానినిపుడే నెరవేర్తుము. 75

త్వరలో మీ రాకకుగల కారణమును తెలుపుడ 'ని యా రాజభార్యయగు ధరణీదేవి యడుగగా 76

## ధరణీదేవితో వకుళాదేవి తన రాకకుగల కారణమును తెలుపుట

వకుళమాలిక వారితో — నే ననేక కార్యముల నాశించుచు వచ్చినను వధువు నన్వేషించుటయే నా ముఖ్యోద్దేశమ 'ని తెలిపెను. 77

అంత ధరణీదేవి — దేవీ! బాగుగనే తెలిపితివి. నీవు వధువు నాశించినచో మేము వరుని కోరుచున్నాము. వరుడెవరు? ఈతని దేశమేమి? గోత్రమేమి? నక్షత్రమెద్ది?

ఈతని తల్లిదండ్రు లెవరు? కులమేది? ప్రవర్తన ఎట్టిది? జాతి యేమి? అని ప్రశ్నింపగా వకుళమాలిక యామెకు 79

వకుళమాలిక —

శ్రుణు రాజ్ఞి సవిస్తారం । గోత్రం బన్ధుజనం తథా ।
దేవకీ జననీ తస్య । జనకః శూరనన్దనః ॥ 80

నిశాకరకులం తస్య । నామ కృష్ణ ఇతి స్మృతమ్ ।
వసిష్ఠగోత్రే చోత్పత్తిః । నక్షత్రం శ్రవణం తథా ॥ 81

ఆవాసో వేఙ్కటగిరిః । విద్యావాన్ ధనవాన్ బలీ ।
బ్రాహ్మణాఽచార సమ్పన్నో । వయసా పఞ్చవింశకః ॥ 82

పాణిగ్రహణకాలే తు । తం దృష్ట్వా తోష మేష్యసి ।
కి మత్ర బహునోక్తేన । వర్ణ్యతాత్తే సుఖం భవేత్ ।
తద్వృత్త మఖిలం శ్రుత్వా । తా మాహాఽనన్ద నిర్భరా ॥ 83

ధరణీ —

శఙ్కా జాతా వరారోహే । మమ తే వచనాత్సఖీ ।
సభాగ్యశ్చ కులీనశ్చ । బుద్ధిమాంశ్చ యువా బలీ ॥ 84

వాగ్మీ చోక్తోఽస్య చైతావత్ । వివాహో న కృతః కుతః ।
సా తద్వచన మాకర్ణ్య । నపత్య మనుచిన్త్య తమ్ ।
ధైర్యేణ వచనం ప్రాహ । ధరణీం రాజవల్లభామ్ ॥ 85

వకుళా —

కృతపైవాహికో దేవి ! । బాల్యే భాగీరథీ పితా ।
తత్రాపత్య మనాలోక్య । ద్వితీయం కర్తు ముత్సుకః ॥ 86

న దోష మితరం విద్ధి । శ్రీనివాసే నిరామయే ।
తద్వృత్త మఖిలం శ్రుత్వా । సమాహూయ స్వకం సుతమ్ ॥ 87

నృప మాహ్వాపయామాస । ధరణీ పతి మాత్మనః ।
ఏకాన్తే రాజశార్దూలం । ఇదం వచన మబ్రవీత్ ॥ 88

## ధరణ్యుక్త్యా వియన్నృపకృత పద్మావత్యాశ్వాసన ప్రకారః

ధరణీ —

విస్తారముగా గోత్రమును, బంధుజనమును తెలిపెదను. వినుము. వరుని తల్లి దేవకి. శూరసేనుని పుత్రుడగు వసుదేవుడు తండ్రి. 80

అతనిది చంద్రవంశము. పేరు శ్రీకృష్ణుడు వాసిష్ఠగోత్రము. శ్రవణ నక్షత్రము. 81

శ్రీ వేంకటాచలము నివాసస్థానము. బాగుగా విద్యలనేర్చినవాడు. ధనవంతుడు. బలవంతుడు. గొప్ప సదాచారసంపన్నుడు. ఇరువదియైదు సంవత్సరముల ప్రాయమువాడు.

వివాహసమయమున నా వరుని గాంచిన సంతసించగలవు. పెక్కు మాటలేల ? అతనిని చూచినంతనే నీకు సుఖముచేకూరునని' ని తెలుపగా — దానినంతను విని ఆనందపరవశయై 83

ధరణీదేవి —

సఖీ ! నీ పలుకులవలన నాకొక సందియము కలిగినది. భాగ్యశాలియై మంచి కులమున పుట్టినవాడై, బుద్ధిమంతుడై, యౌవకుడై, బలవంతుడై 84

చక్కని వాక్కుగల వరుని కింతకాలమువరకును వివాహ మెందులకాచరింపలేద ' ని యడుగగా వకుళాదేవి యా వరునకు సంతానములేకుండుట నాలోచించి ధైర్యము నూని రాజపత్నితో — 85

వకుళమాలిక —

గంగానది తండ్రియగు శ్రీనివాసునకు బాల్యముననే వివాహమాయెను. కాని సంతానము లేకుండుటచే మరియొక వివాహము నొనర్చుకొనుట కాసక్తికలవాడాయెను. 86

అవికారుడగు శ్రీనివాసునిలో నింకే దోషమునులేద ' ని పలుకగా రాణి యా వృత్తాంతమునంతను విని తన పుత్రుని పిలచి 87

తన భర్తను పిలపించి యాతనితో రహస్యముగా 88

## ధరణీదేవి తెలుపగా ఆకాశరాజు పద్మావతి నూరడించుట

ధరణీదేవి —

కన్యార్థ మాగతా రాజన్ । వకుళా వేఙ్కటాచలాత్ ।
వరం (సుతం) సమ్ప్రేక్ష్య చాపి త్వం । స్వపురోహిత మన్త్రిభిః ॥ 89

వరస్యా పి విచార్యా చ । కులవిద్యాబలాదికమ్ ।
గోత్రయుక్తిద్యానుకూల్యం । బ్రాహ్మణై ర్వేదపారగైః ॥ 90

సర్వం సమ్య క్సమాలోచ్య । కన్యాదానం కురు ప్రభో ॥ 91

కన్యార్థ మాగతా సాక్షీ । దుహితు ర్విదితం మనః ।
త మేవే చ్ఛతి తే పుత్రీ । వేఙ్కటాచల వాసినమ్ ॥ 92

ధర్మదేవీవచః సత్యం । శుభం శీఘ్రం విధీయతామ్ ।
ఇతి పత్న్యాః వచః శ్రుత్వా । సో ఽభూ దానన్దనిర్భరః ॥ 93

ఆకాశరాజః —

" అహో మఙ్గళ మస్మాకం । సమ్ప్రాప్తం పూర్వపుణ్యతః ।
అస్మాకం పితరః సర్వే । కృతార్థా ముక్తిభాగినః ॥ 94

త్వద్వాక్యామృతపానేన । రోమహర్ష స్తు జాయతే ।
కదా పశ్యామి కల్యాణం । వధూవరసమాగతమ్ ॥ 95

సభర్తృకాం రాజపుత్రీం । రాజసింహాసనే స్థితామ్ ।
కదా పశ్యామి నేత్రాభ్యాం । బన్ధుమణ్డలమధ్యగామ్ " ॥ 96

ఇత్యుక్త్వా భవనం చాగాత్ । దుహితు ర్దుహితృప్రియః ।
నృపః పద్మావతీం ప్రాహ । సాన్త్వయన్ వచసా సుతామ్ ॥ 97

నృపః —

భద్రే! దుఃఖం మనస్స్థం తే । త్యజ శీఘ్ర మతః పరమ్ ।
హృదయే తవ కల్యాణి । కా ఽపేక్షా వర్తతే వద ॥ 98

తా మద్యా హం కరిష్యామి । నా త్ర కార్యా విచారణా ।
జనకస్య వచః శ్రుత్వా । జననీం వాక్య మబ్రవీత్ ॥ 99

పద్మా —

వేంకటాచలము నుండి కన్యకొఱకై వకుళమాలిక వచ్చినది. మీరు పురోహితుల తోను, మంత్రులతోను వరుని గాంచి 89

ఆతని కుల విద్య బలాదులను విచారించి గోత్రము నక్షత్రము మున్నగున వనుకూలముగానున్న సంగతియు వేదశాస్త్రము నామూలాగ్రముగ నెఱింగిన బ్రాహ్మణులచే

చక్కగా నాలోచించి కన్యాదానము నొనరింపుము. 91

ఈమె మన కుమార్తెకొఱకే వచ్చియున్నది. మన పుత్రిక మనసు మనకు తెలిసినది. మీ పుత్రికయు వేంకటాచల నివాసియగు నాతనినే కోరుచున్నది. 92

ధర్మదేవి తెలిపిన మాట సత్యమైనది. శీఘ్రముగా శుభమును జరిపింపుడ ' ని పలికెను. భార్య మాటలకాకాశరాజు మిక్కిలి సంతసించి 93

ఆకాశరాజు —

మన పూర్వజన్మ పుణ్యవిశేషమున మనకు మంగళము చేకూరినది. మన పితృ దేవతలందరును కృతార్థులైరి. ఇక నందరకు మోక్షముచేకూరినది. 94

నీ మధురములగు మాటలను వినినంతనే నాకు ఒడలు జలదరించుచున్నది. పెండ్లికుమార్తె, పెండ్లికుమారులతో కూడిన కల్యాణము నెపుడు గాంతునోకదా ! 95

రాజపుత్రిక తన భర్తతోగూడ రాజసింహాసనమున కూర్చుండి బంధుజనులు చుట్టుముట్టియుండగా నా కనులతో నెపుడు గాంతునో గదా ! 96

అని పలికి పుత్రికా వాత్సల్యముకలవాడై పుత్రిక భవనమునకు జని పుత్రిక యగు పద్మావతిని మృదువచనములతో నూరడించుచు 97

రాజు —

కల్యాణీ ! నీ మనస్సునందలి దుఃఖమును వీడుము, నీ హృదయమునందలి కోర్కెను తెలుపుము. 98

దాని నిపుడే నేను సఫలమొనరింతును విచారించవలద ' ని పలికెను. తండ్రి మాటలను విని పద్మావతి తన తల్లితో 99

పద్మావతి —

మాత స్తే కథితం సర్వం । జనకాయ వచో మమ ।
పమాచక్ష్వ ద్య సఙ్కోచాత్ । నా హం వక్తుం సముత్సహే ।
పుత్రీగిరం విదిత్వా సా । భర్తారం వాక్య మబ్రవీత్ ॥ 100

ధరణీ —

సాధయస్వ మహాభాగ । వివాహం విధిపూర్వకమ్ ।
విలమ్బో నైవ కర్తవ్యః । శుభార్థ స్తు శుభానన ॥ 101

రాజా —

తస్మై దాస్యామి కృష్ణాయ । శ్రీనివాసాయ ధీమతే ।
ఇత్యా స్వాస్య సుతాం రాజా । పుత్ర మిన్ద్రనికేతనమ్ ॥ 102
ప్రేషయామాసరాజేన్ద్రి । గుర్వానయనకాఙ్క్షయా ॥ 103
విలిఖ్య పత్రికాం రాజా । పుత్రీ కల్యాణసూచికామ్ ।
సమ్ప్రేషయామాస తదా । స్వపుత్రేణ వియన్నృపః ॥ 104

వియన్నృపాజ్ఞయా ధరాతలం ప్రతి బృహస్పత్యాగమనమ్

స గత్వా వాయువేగేన । చన్ద్రాగ్నిం శత్వా త్తు భూమిప ।
ఆవన్దతా ఒనపూర్ణో । గురు మిన్ద్రస్య చ క్షణాత్ ॥ 105
స పత్రం రాజపుత్ర ఇచ్చ । సమాలోక్య గతం గురుః ।
ప్రతిష్ఠాప్య సనే త ఇచ్చ । తేనా నీతాం తదా శుభామ్ ॥ 106
వపాఠ చ మహారాజః । పత్రికాం శుభసూచికామ్ ।
తత్క్షణా దాగమ ద్రాజన్ ! । రాజానం స పురోహితః ॥ 107
ప్రాప్తం పురోహితం దృష్ట్వా । కృత్వా ఒర్చాం విధిపూర్వకమ్ ।
కాలోచితం వాచయిత్వా । వర్ధమాన ఉవాచ సః ॥

రాజా —

తవా జ్ఞయా కరిష్యామి । వివాహం దుహితు ర్మమ ॥ 108
శ్రీనివాసస్య సమ్బన్ధో । విదితస్య ప్రశస్యతే ।
కన్యార్థ మాగతా సాధ్వీ । విదితే గోత్రవామరి ॥ 109

అమ్మా ! నీతో నేను చెప్పినదానిని నీవు తండ్రికి తెలుపుము. నేను సిగ్గుచే చెప్పజాలకున్నాన ' ని నుడువగా కుమరిత మాటలను తెలిసికొని భర్తతో — 100

ధరణీదేవి —

పూజ్యుడా : మనకు శుభము చేకూరవలెనన్న ఆలసింపక యథాశాస్త్రముగా వివాహమును జరిపింపుమ ' ని యడుగగా 101

రాజు —

" శ్రీకృష్ణస్వయాపుడగు శ్రీనివాసునకే తన నొసంగెదన " ని పుత్రికయగు పద్మావతి నూరడించి యింద్రుని భవనమునకు తన పుత్రుని 102

బృహస్పతిని తోడ్తెచ్చుటకై పంపించుచు 103

తన పుత్రిక కల్యాణమును సూచించు శుభలేఖను కూడ వ్రాసి పంపెను. 104

## ఆకాశరాజాజ్ఞచే బృహస్పతి భూమిపైకి వచ్చుట

రాజపుత్రుడును చంద్రుని యంశమున నవతరించినవాడగుటంజేసి వాయువేగముతో నేగి దేవేంద్రునకును గురువగు బృహస్పతికి వందన మాచరించెను. 105

బృహస్పతి శుభలేఖను గొనివచ్చిన రాజపుత్రునిగాంచి యాతనిని ఆసనమున కూర్చుండజేసి ఆతడు తీసికొనివచ్చిన శుభమును సూచించు 106

శుభలేఖను చదివి వెంటనే పురోహితునితో గూడి ఆకాశరాజువద్దకు అరుగుదెంచెను. 107

రాజు బృహస్పతికి యథావిధిగా పూజలనొనర్చి సమయానుసారముగా నాతిథ్యము నొసంగి పత్రికను చదివించి నమస్కరించుచు తమ యాజ్ఞ అయినచో నా కుమార్తెకు వివాహమును జరుపింతును. 108

సర్వలోకవిదితుడైన శ్రీనివాసుని సంబంధము చాల యుత్కృష్టమైనదేకదా ! ఈ వకుళమాలిక కన్ని యడుగుటకై వచ్చినది. గోత్రము పేరులు తెలిసినవి. 109

తథా ఽపి తవ వాక్యేన । వివాహం కర్తు ముత్సహే ।
స రాజ్ఞో వచనం శ్రుత్వా । రాజానాం ప్రత్యభాషత ॥ 110

గురుః —

సఫలం వృక్ష మాశ్రిత్య । జీవన్తి బహవో భువి ।
తథా వయ మ్చ జీవామః । తవ భాగ్యావలమ్బినః ॥ 111

అహం కదాచి దేవా త్ర । సమాగచ్ఛామి భూతలమ్ ।
న జానామి తతస్సమ్యక్ । శుక ఆశ్రితవాన్ సదా ॥ 112

స జానాతి మహారాజ । స్థితి మేతస్య శార్ఙ్గిణః ।
ఉత్రై వో త్తరదిగ్భాగే । పఞ్చక్రోశమితే నృప ! ॥ 113

శుకో ఽస్తి వ్యాసతనయః । శ్రీనివాస పరాయణః ।
తమాహ్వాయ మహారాజ ! । శీఘ్రం తే పృథివీపతే ! ।
స వక్ష్య త్యాత్మనః సౌఖ్యం । వృత్తాన్తం తస్య చాదితః ॥ 114

బృహస్పత్యుక్త్యా వియన్నృపకృత శుకాహ్వానమ్

ఏవముక్తో ఽథ గురుణా । భ్రాతరం బ్రాహ్మణ ప్రియమ్ ।
సన్దిదేశ మహారాజ । శుకాశ్రమ మరిన్దమః ॥ 115

స గత్వా వాయువేగేన । రథేనా దిత్య వర్చసా ।
ధ్యానయోగా దుత్థితం తం । దృష్ట్వా శుక మువాచహ ॥ 116

తొణ్డమాన్ —

శృణు తాపసశార్దూల ! । వచనం రాజభాషితమ్ ।
పద్మావతీ వివాహార్హా । సమ్పన్నా గురుపూజితా ॥ 117

శ్రీనివాసాయ తాం కన్యాం । ప్రదాతుం కాఙ్క్షతే నృపః ।
యుక్తాయుక్తవిచిన్తాయై । గురు మాహూతవా నసి ॥ 118

తదర్థ మేవ చాద్య త్వాం । సమాహ్వయతి భూమిపః ।
యుక్తాయుక్తే విచిన్త్యా త్ర । లేఖితుం శుభపత్రికామ్ ॥ 119

అయినను మీ ఆజ్ఞఅయిన నే వివాహముచేయుట కిష్టపడుదున ' ని సవినయముగ పలుకగా 110

బృహస్పతి —

భూమిపై ననేక ప్రాణులు పండ్లతోగూడిన వృక్షము నాశ్రయించి బ్రతుకుచున్నట్లే మేమును నీ భాగ్యముపై నాధారపడి బ్రతుకువారముకదా ! 111

నే నపుడపుడుగనే భూతలమునకు వచ్చుచున్నాను గాన నాకీ విషయము బాగుగా తెలియదు. శ్రీ శుకయోగీంద్రుడిటనే యుండుటంజేసి యాతడు శ్రీనివాసునిగూర్చి బాగుగా నెఱుంగును. 112

ఇచ్చటనుండి ఉత్తరదిక్కుగా నైదుక్రోశుల దూరమున 113

శ్రీనివాసునియం దమిత భక్తిగలిగి వ్యాసమౌనీంద్రుని పుత్రుడగు శుకుడు నివసించుచున్నాడు. ఆతనిని వెంటనే పిలువనంపుము. ఆతడు నీ శ్రేయస్సును శ్రీనివాసుని వృత్తాంతమునంతను నీకు మొదటినుండియు తెలుపునని పలికెను. 114

## బృహస్పతి చెప్పగా ఆకాశరాజు శ్రీ శుకయోగీంద్రుని పిలచుట

బృహస్పతి మాటలను శిరసావహించి బ్రాహ్మణులయందు గౌరవముగల సోదరుడగు తొండమానును శుకాశ్రమమునకు పంపించెను. 115

ఆతడు సూర్యునివంటి తేజస్సుగల రథముపై వాయువేగముతో నేగి ధ్యానయోగమునుండి లేచియున్న శుకుని సేవించి 116

తొండమానుడు —

మునీంద్రా ! ఆకాశరాజు మీతో చెప్పుమనిన వార్తను వినుము. సజ్జనులచే పూజింపబడు పద్మావతి వివాహమునకు తగిన వయస్సుకలదాయెను. 117

ఆమెను శ్రీనివాసున కొసంగవలెనని రాజభిలషించుచున్నాడు. మంచిపెద్దలనారయుటకు బృహస్పతిని పిలిపించెను. 118

మిమ్ములనుకూడ నందులకే రాజు పిలచుచున్నాడు. మీరు మంచిపెదల నారసి శుభలేఖను వ్రాయవలెను గాన 119

అవలోక ఇచ్ఛ కృత్వా ఒద్య । గచ్ఛ తన్నగరీం ప్రతి ।
ఏవ ముక్తో మహీదేవ । మహీపాలేన భూమిప ॥ 120

స సమ్భ్రమాత్ సముత్థాయ । వ్యభ్రమ ద్విభ్రమ న్నివ ।
భిన్దన్ కమణ్డలుం రాజన్ ! । ఛిన్దన్ కృష్ణమృగత్వచమ్ ॥ 121

విచ్ఛిద్య మణిమాలా శ్చ । ననర్త మహాముని ।
ముహూర్త మిత్థం రాజేన్ద్ర ! । తద్బుద్ధి రవశం గతా ।
ఉవాచ పశ్చా ద్రాజానం । కార్ష్ణద్వైపాయని ర్మునిః ॥ 122

శ్రీశుకః —

పాఖా ఉతం వాక్య ముదారవిక్రమ ! । త్వయా హరే ర్వేఙ్కటశైలవాసినః ।
కన్యాప్రదానం పురుషార్థసాధనం । సమస్తలోకస్య పవిత్రకారకమ్ ॥ 123

ఆకాశరాజధిషణా । శ్రీనివాసకృపాబలాత్ ।
మహాదానపరా విత్థం । భూయాస్తా ఇచ్ఛ దినేదినే ॥ 124

ఇత్యా శిషా ప్రశస్యా థ । పద్మతీర్థే ఒవగాహ్య చ
కృత్వా మాధ్యాహ్నికీం సన్ధ్యాం । త్యక్త్వా జీర్ణోపబర్హణమ్ ॥ 125

స నవాని కుశాగ్రాణి । వికృత్య మునిసత్తమః ।
కిరీటం బన్ధయిత్వా తైః । ఉత్తమాఙ్గవిబన్ధనమ్ ॥ 126

కవచం కల్పయామాస । కుశాగ్రైః కుసుమై స్తదా ।
తులసీమణిమాలాభిః । కణ్ఠకర్ణ విభూషితః ॥ 127

అహాదలమ్బికృష్ణత్వ క్క । వచై ప్పమలఙ్కృతః ।
ఆశ్వయానే ఒధిరోప్యైనం । వినాయ స నృపానుజః ॥ 128

త మాయాన్తం మునిం దృష్ట్వా । చతురఙ్గబలాన్వితః ।
పురోహితం పురస్కృత్య । కుశమూలఫలోదకైః ॥ 129

మీరవకాశమును కల్పించుకొని మా నగరమునకు రావలయున'ని వార్త నందీయగా 120

శ్రీ శుకయోగీంద్రుడు సంభ్రమముతో దిగ్గునలేచి గిరగిర తిరుగనారంభించెను. కమండలమును బ్రద్దలుకొట్టెను. కృష్ణాజినమును చింపివైచెను. 121

మణిమాలికలను త్రెంపివైచుచు నాట్యమొనరించుచు నొక క్షణకాలము తన శరీరమును మరచి తదనంతరము రాజ సోదరునితో — 122

శ్రీ శుకుడు —

మహాబలశాలీ ! నీవు మంచిమాటను తెలిపితివి. శ్రీ వేంకటాచల నివాసియగు శ్రీనివాసునకు నీవు కన్నియ నొసంగుట పురుషార్థప్రదము. సకలలోకములను పవిత్ర మొనరింపజాలియున్నది. 123

శ్రీనివాసుని కృపావిశేషముచే ఆకాశరాజు, బృహస్పతు లిరువురును గొప్ప దాతలై దినదిన ప్రవర్ధమానులై విలసిల్లుదురుగాక ! 124

అని ఆశీర్వదించి పద్మతీర్థమున స్నానమాచరించి మధ్యాహ్న సంధ్యావందనము నొనరించి చినిగిన పైపంచెను వీకి 125

క్రొత్త దర్భలను కోసికొని వాటితో తలపాగను చేసికొని తలపైనిడికొని 126

దర్భలతోను, పూవులతోను కవచమును నిర్మించుకొని, తులసీ పూసల మాలిక లనుగూర్చి కంఠమును చెవులకు అలంకరించుకొని 127

పాదములవరకు వ్రేలాడు కృష్ణాజినము చెట్టుపట్ట మొదలగు కవచములచే విభూషితుడై ప్రయాణమునకు సంసిద్ధుడుకాగా రాజ సోదరుడాతనిని గుఱ్ఱముపై నెక్కించుకొని తీసికొనివెళ్ళెను. 128

వచ్చుచున్న మునిని గాంచి ఆకాశరాజు రథ, గజ, తురగ, పదాతి బలములతో గూడి పురోహితుని ముందిడుకొని కుశమూలఫలములను నీటిని తీసికొని 129

అభియాత స్తదా రాజా । సన్తోషం ప్రాప సా పురీ ।
యానా దుత్తీర్య రాజేన్ద్రః । సాష్టాఙ్గం ప్రణిపత్య తమ్ ।
గజ మారోప్య నగరీం । స పురోహిత ఆనయత్ ॥ 130

నికేతనాన్తర్భవనే నివేశ్య । నిధిం మునీనాం ప్రవరం స రాజా ।
సమ్పూజయామాస విధానవిత్తమో । విద్యాగురుం జ్ఞానగురుఞ్చ నత్వా ॥ 131

రాజా —

తాపసం పరిపప్రచ్ఛ । కన్యార్థం ధిషణాగ్రతః ।
పద్మావతీం ప్రదాస్యామి । భవద్భ్య మనుమోదితః ।
శ్రీనివాసాయ కృష్ణాయ । నిశ్చితో హి మయా వరః ॥ 132

స తద్వచన మాకర్ణ్య । రాజానం రాజసత్తమః ।
శుకో ఽబ్రవీ ద్గిరం పుత్రీ । కారణాత్కరుణాన్వితః ॥ 133

శ్రీశుకః —

మాకురుష్వ మహారాజ । సన్దేహం దానకర్మణి ।
ధన్యో ఽసి త్వం మహీపాల । కులం పావనతాం గతమ్ ॥ 134

పితర స్తు దివం ప్రాప్తాః । నాత్ర కార్యా విచారణా ।
కిం త్వయా ఽఽచరితం పుణ్యం । పూర్వజన్మని భూమిప ॥ 135

భగవా న్నరవిన్దాక్షః । శ్రీనివాసః సతాం గతిః ।
జామాతృత్వం సమాపన్నః । తస్మా న్నాస్తి తవాధికః ॥ 136

విలమ్బో నైవ కర్తవ్యః । శుభం శీఘ్రం విధీయతామ్ ।
వయం ధన్యాః కృతార్థాః స్మః । తవ సఙ్గేన భూమిప ॥ 137

వయ న్తు తపసా ఽఽరాధ్య । కన్దమూల ఫలాశనాః ।
సర్వసఙ్గం పరిత్యజ్య । న పశ్యామో ఽత్ర తం విభుమ్ ॥ 138

సఙ్గతే స్తవ పశ్యామః । శ్రీనివాసం శ్రియాయుతమ్ ।
సఙ్గతి స్తవ భద్రా నో ఽ । భూయా జ్జన్మని జన్మని ॥ 139

ఎదురేగెను. పట్టణవాసులందరును సంతసించిరి. రాజు తన వాహనమునుండి దిగి శుకయోగీంద్రునకు సాష్టాంగముగా నమస్కరించి ఏనుగుపై నెక్కించుకొని తన పట్టణములోనికి తీసికొనివెళ్ళెను. 130

విద్యలకును, విజ్ఞానమునకును గురువును, మునిశ్రేష్ఠుడునగు శ్రీ శుకయోగీంద్రుని తన రాజభవనములోనికి గొనిపోయి యథాశాస్త్రముగా పూజించెను. 131

రాజు —

అనంతరము బృహస్పతి యెదురుగా శ్రీ శుకయోగీంద్రునితో – తామంగీకరించినచో పద్మావతిని శ్రీకృష్ణస్వరూపుడగు శ్రీనివాసున కొసంగెదను. నేను వరుని నిశ్చయించుకొనియే యుంటిన ' ని పలుకగా 132

శ్రీ శుకయోగీంద్రుడు రాజుతో – రాజా! నీవు నీ పుత్రికయందలి వాత్సల్యముతో 133

శ్రీ శుకుడు —

శ్రీనివాసునకు నీ కన్నియ నొసంగు విషయమున సందేహింపవలదు. నీవిటి కృత్యముచే ధన్యుడవైతివి. నీ కులము పవిత్రమైనది. 134

నీ పితృదేవతలు స్వర్గమున కేగెదరు. నీ వీ విషయమున సందేహింపవలదు. నీవు పూర్వజన్మమున నెద్దియో మహా పుణ్యకార్యము నాచరించితివి. 135

పుండరీకాక్షుడగు శ్రీనివాసుడు సత్పురుషులకు ప్రాప్యమైనవాడు. నీ కట్టివాడల్లుడగుటంజేసి నిన్ను మించినవాడు కానరాడు. 136

ఆలసింపక వెంటనే శుభకార్యము నొనరింపుము. నీ స్నేహముచే మేము ధన్యులము, కృతార్థులమైతిమి. 137

మేము కందమూల ఫలముల భుజించుచు, నన్నిటియందు నాశనుపీడి తపమాచరించియు భగవంతుని కానజాలకున్నాము. 138

నీ స్నేహముచే లక్ష్మీదేవితో గూడిన శ్రీనివాసుని గాంచగలుగుచున్నాము. నీ సాంగత్యము మాకన్ని జన్మలయందును మంగళప్రదమై యొప్పునుగాక ! 139

ఏవం త ముక్త్వా రాజర్షిం । తూష్ణీ మాస స తాపసః ।
శుకవాక్యం తతః శ్రుత్వా । స రాజా ఽఽనన్ద నిర్భరః ॥ 140

వైయాసకే ర్వచః శ్రుత్వా । ప్రశశంస ప్రజాపతిః ।
మన్యే కృతార్థ మాత్మానం । వ్యాసపుత్ర నమో ఽస్తు తే ॥ 141

గ్రహాణా ఞ్చ గతి స్తాత । తయో ర్యోగో విచి న్త్యతామ్ ।
ఋక్షయోగం గోత్రయోగం । పశ్య విప్ర బలాబలమ్ ॥ 142

ఇతి రాజ్ఞో వచః శ్రుత్వా । సురాచార్యః ససమ్భ్రమమ్ ।
ఛాయాశాస్త్ర విధానజ్ఞో । వకుళాం వాక్య మబ్రవీత్ ॥ 143

గురుకృత పద్మావతీ శ్రీనివాస వివాహ యోగాద్యానుకూల్య విచారః

బృహస్పతిః —

గోత్రం శ్రీవేఙ్కటేశస్య । తన్నామ ఽఽచక్ష్వ భామిని ! ।
నక్షత్ర ఞ్చ వరారోహే । కథ్యతా మితి చా బ్రవీత్ ।
సా తస్య వచనం శ్రుత్వా । కిఞ్చి త్కోపాన్వితా ఽబ్రవీత్ ॥ 144

వకుళా —

బ్రాహ్మణా స్సత్యసమ్పన్నాః । కలౌ మిథ్యాప్రవాదినః ।
జానన్తో ఽపి మహారాజ ! । న వద న్తి హితాహితమ్ ॥ 145

శ్రీశుకః —

అవిశ్వాస శ్చ విప్రేషు । క్షత్రియాణాం వరాననే ! ।
ధర్మే ఽప్య ధర్మతా మేతి । హ్య ధర్మే ధర్మతాం గతః ॥ 146

తస్మా త్త్వయా మహాభాగే ! । కథనీయం హితాహితమ్ ।

వకుళా —

నక్షత్రం శ్రవణం తస్య । గోత్రం వాసిష్ఠ సంజ్ఞకమ్ ॥ 147

తథాచః పురాతనా మత్స్య । కూర్మకృష్ణాదిరూపిణః ।
గోత్ర మత్రే ర్మహాభాగః । నక్షత్రం మృగశీర్షకమ్ ॥ 148

అని పలికి మిన్నకుండగా రాజు మిక్కిలి సంతసించుచు 140

శ్రీ శుకయోగీంద్రుని స్తుతించుచు మహాత్మా ! నేను కృతార్థుడనైతిని. నీకు నమస్కారము. 141

గ్రహముల సంచారమును, గ్రహయోగమును, నక్షత్రయోగమును, గోత్ర అనుకూల్యతను, గోత్రముల బలాబలములను విచారించుడు. 142

అని పలికినంతనే జ్యోతిశ్శాస్త్రము నెఱింగిన బృహస్పతి తొట్రుపాటుతో వకుళాదేవిని చూచి – 143

## బృహస్పతి పద్మావతీ శ్రీనివాసుల వివాహమునకు అనుకూలతను విచారించుట

బృహస్పతి —

వకుళాదేవీ ! శ్రీ వేంకటేశుని గోత్రమేమి ? ఆతని పేరేమి ? ఆతని నక్షత్రమేమి ? యని యడిగెను. వకుళ యాతని మాటలకు కొంచెము కోపించి 144

వకుళమాలిక —

" కలియుగమున బ్రాహ్మణులు బలాఢ్యులై అసత్యములనే యాడుచుందురు. మంచిచెడ్డల నెఱింగియు మాటలాడర " ని కఠినముగా పలికెను. 145

శ్రీ శుకుడు —

ఆ మాటలకు శుకయోగీంద్రుడు – కలియుగమున రాజులు బ్రాహ్మణులను నమ్మజాలరు. ధర్మ మధర్మముగాను, అధర్మము ధర్మముగను పరిణమించును. 146

కావున నీవు మంచిచెడ్డలను తెలుపవలెను. అనినంతనే వకుళమాలిక – శ్రీనివాసుని నక్షత్రము శ్రవణము, గోత్రము వాసిష్ఠము. 147

శ్రీనివాసుని యవతారముకంటె ముందుముందు మత్స్య కూర్మ కృష్ణావతారము లలో నత్రి గోత్రమును, మృగశిరా నక్షత్రమునై యున్నవని పూర్వులు చెప్పుదురు. 148

సీతా సత్యాదిమాహాయాః । పద్మావత్యా విదు ర్బుధాః ।
ఉభయో ర్వచనం శ్రుత్వా । గురు ర్యోగం విచిన్త్య సః ।
హర్షోద్రిక్తమనా భూత్వా । సత్య మాహ మహామతిః ॥ 149
సర్వం విచార్య భూపాలః । స్వార్థభావం సమాశ్రితః ।
సమ్మన్త్ర్య బన్ధుమిత్రాద్యైః । కన్యాదానం కురుప్రభో ॥ 150
ఏవం గురువచః శ్రుత్వా । విచార్యా ఒథ విచక్షణః ।
భక్త్యా పరమయా రాజా । స్వార్యభావం సమాశ్రితః ॥ 151
జ్ఞాతిబాన్ధవసమ్బన్ధి । సుహృన్మిత్రజనై ర్యుతః ।
మన్త్రం చకార రాజేన్ద్రః । కన్యాదాన నిమిత్తకమ్ ॥ 152
తే సర్వే బన్ధువర్గా శ్చ । రాజానం ప్రత్యపూజయన్ ।
సభా ఞ్చ కారయామాస । రత్నసింహాసనే స్థితః ॥ 153
వాచయిత్వా ఒథ పుణ్యాహం । కన్యానిశ్చయకారణాత్ ।
తామ్బూలం దక్షిణాం చా దాత్ । పూజయిత్వా గణాధిపమ్ ।
భుజ ముద్ధృత్య రాజేన్ద్రః । సభామధ్యే వచో ఒబ్రవీత్ ॥ 154

రాజా —

పద్మావతీం ప్రదాస్యామి । శ్రీనివాసాయ శార్ఙ్గిణే ।
యూయం బన్ధుగణా శ్చా త్ర । దయాం కురుత మాం ప్రతి ॥ 155
ప్రతిజ్ఞా మకరో దిత్థం । కన్యార్థే వేఙ్కటేశితుః ।
వ చోవాచ మహారాజో । గురుం గురుజనప్రియః ॥ 156
కిం కార్యం వద విప్రేన్ద్రః । సఙ్కల్పాన న్తరం మయా ।
రాజాన మబ్రవీ ద్రాజన్ ! అఙ్గిరా దేవతా గురుః ॥ 157

బృహస్పతిః —

విలిఖ్య పత్రికాం రాజన్ । శ్రీనివాసాయ విష్ణవే ।
విప్రం ప్రేషయ రాజేన్ద్రః । తస్యా గమనకారణాత్ ।
ఏవం గురో ర్వాక్య మాకర్ణ్య । రాజా గురు మభాషత ॥ 158

అశ్లేష సీత సత్యభామాది యవతారములను ధరించిన పద్మావతిని గూర్చియు నత్రి గోత్రమును, మృగశిరా నక్షత్రమునే చెప్పుదురు. అని పలుకగనే బృహస్పతి సంతుష్టాంతరంగుడై సత్యమునే వచించుచు 149

రాజా! నీ వంతయును చక్కగా నాలోచించి నీ మంచిచెడుగులను చక్కగా నెఱింగి నీ బంధుమిత్రులతో విచారించి కన్యాదానము నొనరింపుము' ని 150

తెలిపినంతనే రాజు వెంటనే ఆలోచించి మిక్కిలి భక్తిగలవాడై తనకు స్వాభావికమైన సద్భావముతో 151

జ్ఞాతులు, బంధువులు, భిన్నవయస్కులై హితమును కోరువారును, సమవయస్కులై మేలును కోరువారుగను జనులతో గూడి పద్మావతీ కన్యాదానమునకై యాలోచన చేయసాగెను. 152

బంధుజనులందరును రాజును పూజించిరి. రాజు రత్నసింహాసనమున మంత్రి సభచేయించెను. 153

కన్యాదానమును నిశ్చయించు నిమిత్తమై పుణ్యాహవచనమును గావించి గణాధిపతియగు వినాయకుని పూజించి దక్షిణతో గూడ తాంబూలమునొసంగి చేతినెత్తి సభామధ్యమున నిట్లుపల్కెను. 154

రాజు .—

శ్రీమన్నారాయణాంశ సంభూతుడగు శ్రీనివాసునకు పద్మావతి నొసంగెదను. మీరందరును నాయందు దయయుంచుడ' ని 155

శ్రీనివాసునకు కన్యక నొసంగుటకై ప్రతిజ్ఞ నొనరించి బృహస్పతితో పెద్దలకు ప్రియమగు నా యాకాశరాజు — 156

బ్రాహ్మణోత్తమా! ఈ సంకల్పముచేసిన పిమ్మట నే నేమి చేయవలెన' ని యడిగెను. అంత దేవగురువగు బృహస్పతి — 157

బృహస్పతి —

రాజా! విష్ణుస్వరూపుడగు శ్రీనివాసుని వేంచేయమని బ్రాహ్మణునకు శుభలేఖను వ్రాసియిచ్చి పంపుమ' ని చెప్పగా రాజు — 158

రాజా —

కిం లేఖ్యం ప్రాకృతై ర్విద్వన్ । అప్రాకృతశరీరిణః ।
తథా ఽపి లేఖనీయం యత్ । త ద్బ్రూహి గురుసత్తమ ! ॥ 159

ఆకాశరాజవచనం । శ్రుత్వా గీష్పతి రాదరాత్ ।
లిఖిత్వా బోధయామాస । రాజ్ఞ స్తస్య మహాత్మనః ॥ 160

గురూపదిష్టమార్గేణ । విలిలేఖ స పత్రికామ్ ।

### శ్రీనివాసం ప్రతి వియన్నృపలిఖిత వివాహ పత్రికా ప్రకారః

అప్రాకృతాయ నిత్యాయ । సచ్చిదానన్దమూర్తయే ॥ 161

స్వతన్త్రాయా ద్వితీయాయా । స న్తరూపాయ శార్ఙ్గిణే ।
భక్తిప్రియాయ భక్త్యైక । వేద్యోపాదేయరూపిణే ॥ 162

దేవాధిదేవపూజ్యాయ । బ్రహ్మపూజ్యాయ విష్ణవే ।
శ్రీనివాసాయ కృష్ణాయ । వేఙ్కటాచలవాసినే ॥ 163

శాస్త్రైః సర్వై శ్చ వేదాద్యైః । ఆగమైః సపురాణకైః ।
అవేదితానన్తగుణ । కర్మణే శ్రీధరాయ తే ॥ 164

ఆశీర్వాదం కరిష్యామి । బన్ధుత్వా త్తే సురోత్తమ ! ।
త్వత్పాదపద్మసంవీక్ష- । కామ ఆకాశనామకః ॥ 165

త్వదాశ్రయం సమాకాంక్షన్ । లేఖయామ్య ద్య మాధవ ! ।
శ్రీపుత్రభ్రాతృభిః సాకం । సర్వే కుశలినో వయమ్ ॥ 166

త్వదనుగ్రహమాత్రేణ । వసామో ఽత్ర హరేః పురే ।
సర్వేషాం భవతాం క్షేమం । పత్రద్వారా విబోధయ ॥ 167

చైత్రశుక్లత్రయోదశ్యాం । ఏతత్పత్రం విలిఖ్యతే ।
కన్యాం పద్మావతీం తుభ్యం । దాస్యామీ తి మతి ర్మమ ॥ 168

రాజు —

గురువర్యా ! దివ్యశరీరధారియగు శ్రీనివాసునకు నావంటి ప్రాకృత జనులేమని వ్రాయవలెను ? అయినను వ్రాయవలసినదాని నాజ్ఞాపింపుడ ' ని ప్రార్థింపగా 159

ప్రాజ్ఞుడగు బృహస్పతి తాను వ్రాసి రాజునకు తెలుపగా 160

బృహస్పతి యుపదేశానుసార మాకాశరాజు పత్రిక నిట్లు వ్రాసెను — 161

## ఆకాశరాజు శ్రీనివాసునకు లగ్నపత్రికను వ్రాసిన విధమును వర్ణించుట

దివ్యమంగళ విగ్రహస్వరూపుడును, సనాతనుడును, సచ్చిదానందస్వరూపుడును, స్వతంత్రుడును, సాటిలేనివాడును, అనేక రూపములు కలవాడును, శార్ఙ్గమును ధరించినవాడును, భక్తికి వశమగువాడును, భక్తిచే మాత్రమే తెలియదగిన పొందదగిన స్వరూపము గలవాడును, 162

దేవాధిదేవులచేత పూజింపబడువాడును, బ్రహ్మచే పూజింపబడువాడును, సర్వవ్యాపియు, శ్రీనివాసుడును, కృష్ణుడును, శ్రీ వేంకటాచలమున నివసించువాడును, 163

అంగములతో గూడిన సకల వేదాదులచేతను, ఆగమములచేతను, పురాణముల చేతను గూడ తెలియబడని యసంఖ్యాక గుణచేష్టితములు కలవాడును, శ్రియఃపతియగు నీకు

మన బాంధవ్యముచే (తాను మామయు శ్రీనివాసు డల్లుడునగుటచే) నాశీర్వాదము నొనరించుచున్నాను. నీ చరణకమల దర్శనోత్సుకుడనగు నా పేరు ఆకాశరాజందురు. 165

నీ బంధుత్వమును కోరుచు నే నిపుడీ లేఖను వ్రాయుచున్నాను. మేము మా కళత్ర పుత్ర భ్రాతలతో క్షేమముగానున్నాము. 166

నీ యనుగ్రహముచే నీ నారాయణపట్టణమున నివసించుచున్నాము. మీ అందరి క్షేమమును లేఖామూలమున తెలుపగోరెదము 167

చైత్ర శుక్ల త్రయోదశి రోజున నీ లగ్నపత్రికను వ్రాయుచున్నాము. పద్మావతి యను కన్యను నీ కీయవలెనని నా సంకల్పము. 168

తా మఙ్గీకురు గోవిన్ద ! । వివాహవిధిపూర్వకమ్ ।
శుకో వేత్తి సుచ ర్వేత్తి । హృదయం మమ సర్వతః ॥ 169

మా కురుష్వా త్ర సన్దేహం । కన్యార్థం పురుషోత్తమ ! ।
వైశాఖశుక్లదశమీ । భృగువారే శుభే దినే ॥ 170

బన్ధుభిః సహ సమ్ప్రాప్య । మా ముద్ధృత్య గణైః సహ ।
హర్షేణ పాణిగ్రహణం । కర్తవ్యం మే మనోగతమ్ ॥ 171

అధికం లేఖనీయం తే । కి మస్తి పురుషోత్తమ !
శుకో వదతి య త్సత్యం । త త్సర్వం కురు కేశవ ॥ 172

ఇత్యాశిషః సన్తు మహానుభావ ! తే । సమస్త కల్యాణ గుణార్ణవ ! ప్రభో ।
నిత్యాయ సత్యాయ సుఖస్వరూపిణే । సమస్తలోకప్రభవే మహాత్మనే ॥ 173

ఇత్థం లిఖిత్వా వరపత్రికాం శుభాం । ఆకాశరాజో జగదీశసన్నిధిమ్ ।
సమ్ప్రేషయామాస శుకం మహాన్తం । సపుత్రమిత్రః సహ బాన్ధవానుగః 174

క్రోశమాత్ర ముపాగమ్య । శుకం వచన మబ్రవీత్ ।

రాజా —

యేన కేన ప్రకారేణ । తస్య చిత్తం వశీకురు ॥ 175

అయుతం స్వర్ణలక్షం వా । కోటిం వార్బుద మేవ వా ।
దాస్యామి ద్రవ్యనిచయం । నాత్ర కార్యా విచారణా ॥ 176

ఏవ ముక్తో మహీదేవో । గతః శేషాచలం ప్రతి ॥ 177

మర్త్యంగతే దీప్తకరే మహాత్మా । సమాగత స్తత్ర శుక స్సశిష్యః ।
హరే ర్దదర్శా ఉపగతో విరాగీ । తద్దర్శనాహ్లాద గతాధ్వశేషః ॥ 178

అన్యా సమీక్ష్య చా యాన్తీం । వేఙ్కటాద్రి శిఖామణిః ।
మాతా చ నా గతా కస్మా । దితి చిన్తాపరో హరిః ॥ 179

నా కన్యను పరిణయపూర్వకముగా సంగీకరింపుము. నా మనస్సు నన్నివిధ ములుగా శ్రీ శుకయోగీంద్రుడును, బృహస్పతియు తెలియజాలుదురు. 169

కన్నియను గుఱించి సందియమొందవలదు. వైశాఖ శుక్ల దశమీ శుక్రవారమున 170

బంధువులతోను పరివారముతోను నరుదెంచి నన్ను తరింపజేసి సంతోషముతో పద్మావతిని పరిణయమాడి నా యభీష్టమును నెరవేర్పుము. 171

శ్రీనివాసా ! నీ కధికముగా వ్రాయుటకేమున్నది ? శ్రీ శుకయోగీంద్రుడు చెప్పినదానినంత నాదరింపుము. 172

పరమ పూజ్యస్వభావా ! సకల కల్యాణగుణనిధే ! సనాతన పురుషుడవు, సత్య స్వరూపుడవు, సుఖరూపుడవు, సకల చరాచరాత్మక జగత్సృష్టికర్తవు, మహాత్ముడవగు నీ కివియే అనేకములగు నాశీస్సులు. 173

అని యిట్లు లగ్నపత్రికను వ్రాసి పరమపూజ్యుడగు శ్రీ శుకయోగీంద్రుని శ్రీనివాసుని వద్దకు పంపుచు పుత్రులు స్నేహితులు బంధువులతో కూడి 174

క్రోశమాత్ర దూరమువరకేగి శ్రీ శుకునితో " యే విధముననైనను శ్రీనివాసుని మనమును వశపరచుకొనుము. 175

పదివేలు నూరువేలు బంగారమునుకాని కోటి, పదికోట్ల ధనమునుగాని, యీయ గలము, ఈ విషయమున సందేహింపవలద ' ని చెప్పెను. 176

విరాగియగు శ్రీ శుకయోగీంద్రుడు మహాత్ముడగు చండకిరణు డాకాశమధ్య భాగమునకు రాగా (అపరాహ్ణసమయమునకు) శిష్యులతో వేంకటాచలమునకేగి శ్రీనివాసుని జననియగు వకుళాదేవి వెంటరాగా శ్రీనివాసుని గాంచుటచే మార్గాయాస ముపశమింపగా శ్రీనివాసుని చెంతకేతెంచెను. 177, 178

శ్రీనివాసుడును వచ్చుచున్న తన తల్లిరాకను గమనింపక " తల్లియెందువలన రాలేద " ని విచారింపసాగెను. 179

ఏతస్మి న్నేవ కాలే తు । కృష్ణద్వైపాయ నాత్మజమ్ ।
దదర్శ సరిః పాణిం । కృతకార్య వినిశ్చయమ్ ।
శుకం ప్రాహ స్మ భక్త్యై వ । వాసనా దుత్థితో హరిః ॥ 180

శ్రీనివాసః —

కార్యం మదీయం విప్రేన్ద్ర ! పక్వం వాఽపక్వమేవ వా ।
కార్యం తవ కృపాసిన్ధో ! పక్వమేవ న సంశయః ॥ 181

శుభం వాక్య మితి శ్రుత్వా । దణ్డవ త్ప్రణతం భువి ।
సమాలిఙ్గ్య శుకం కృష్ణో ! । భక్త్యా హర్షవశం గతః ॥ 182

అతిచిత్ర చరిత్రాఽత్మా । శుక మాహ మహీపతే ।

శ్రీనివాసః —

వద న్తి లోకా అనృతాన్ సహస్రాన్ । వివాహకామానరజన్మనోయే ।
తేయాన్తి మద్ధామ కిమత్ర వాచ్యం । జగత్కుటుమ్బస్య వివాహకామే ॥ 183

వరో బిభర్తి స్వసుతం । స్వభార్యాం స్వజనం గృహమ్ ।
బ్రహ్మాణ్డం భవనం విద్వన్ । బ్రహ్మా మే నాభిసమ్భవః ॥

యా లక్ష్మీ ర్మమ కల్యాణీ । యే చా న్యే మమ చౌరసాః ॥ 184

చతుర్నవతి లక్షణి । జీవా స్స న్తి హ్యసఙ్ఖ్యకాః ।
ఏతేషాం రక్షణే బద్ధ । దీక్షో ఽహం మునిస త్తమ ॥ 185

మహాకుటుమ్బ యుక్తస్య । మమ కల్యాణ కారణాత్ ।
య న్మిథ్యాభాషితం స్వామిన్ ! । త్వయా ఽద్య మునిస త్తమ ॥ 186

త్వత్కృతస్యో పకారస్య । ప్రతిదాతుం న విద్యతే ।
తథాఽపి తవ దాస్యామి । శరీరాలిఙ్గనం మునే ! ॥ 187

మత్ప్రీత్యా ధ్గరిష్య న్తి । న విజానామి తే శుభమ్ ।
ఏవ ముక్త్వా ఽఙ్గ సఙ్గశ్చ । తస్యాదాత్ పురుషోత్తమః ॥ 188

త్వ త్పుణ్య స్యా వధి ర్నా స్తి । మత్ప్రీత్యై వ పుణ్యతః ।
యథా త్వయా కృతం కర్మ । తథా పూర్వం కపీశ్వరః ॥ 189

ఇదే సమయమున తను వచ్చిన పనిని నిర్వహించుటలో నిశ్చయమును సూచించుచు నటుల శిరమున కరమునిడి వచ్చుచున్న శుకయోగీంద్రుని గాంచి భక్తితో తన పీఠమునుండి లేచి 180

శ్రీనివాసుడు —

బ్రాహ్మణోత్తమా! నా పని సఫలమగునా? కాదా? యని యడిగెను. అంత శ్రీ శుకయోగీంద్రుడు — దయానిధే: నీ పని సఫలమైనది సందియములేద'ని బదులుపలికె

భూమిపై దండమువలె పడియుండి నమస్కరించుచున్న శుకయోగీంద్రుని శుభకరమగు వాక్యమును విని యాతని గట్టిగా ఆలింగన మొనరించుకొని భక్తితో పరమానందము నందెను. 182

మరియు మిక్కిలి విచిత్రమగు చరిత్రగల శ్రీనివాసుడు శ్రీ శుకునితో — లోకమున ప్రపంచమున నొక మనుష్యునకు వివాహమొనరించు కోరికతో వేయికొలది యసత్యములను పలికినను నా పరమపదమును పొందుచున్నారు. అట్టితరి జగత్సృష్టికర్తయగు భగవంతుని వివాహము నాకాంక్షించు విషయమున నసత్యములాడినను నెట్టి దుర్గతియు కలుగజాలదు. 183

మనుజుడు తన పుత్రుని తన భార్యను తన బంధుజనమును, గృహమును మాత్రమే భరించును. నాకు బ్రహ్మాండమే యిల్లు. బ్రహ్మ నా నాభికమలమునుండి పుట్టినవాడు. నాకు శుభప్రదురాలగు లక్ష్మి భార్య. మిగిలిన నా కడుపున పుట్టిన 184

తొంబదినాలుగు లక్షల జీవులు కలరు. అసంఖ్యాకములగు జీవకోటిని రక్షించుటకై నేను దీక్షను పూనియున్నాను. 185

ఇట్లు గొప్ప కుటుంబముతో కూడిన నాకు కల్యాణ మొనరించుటకై నీ విపుడు పలికిన యసత్య భాషణలనాడి 186

ఉపకారమొనర్చితివో దానికి ప్రత్యుపకారమొనర్ప శక్యముకాదు. అయినను నీకు దానికి ప్రతీకారముగా గాఢాలింగనము నొనంగెదను. 187

నా శరీరముకంటె విలువగలిగి నీకు శుభావహమగునదేదియును లేద'ని పలికి శ్రీ శుకయోగీంద్రుని గాఢముగా నాలింగనమొనర్చుకొని 188

" మహాత్మా! నీ పుణ్యము నిరవధికమైనది. నా ఆలింగనము నీకు పుణ్యప్రదము. ఇట్లే యిప్పుడు హనుమంతుడు 189

24

సీతానిమిత్తం యః కర్మ । కృతవాన్ మారుతాత్మజః ।
తస్మై ప్రాదాం మహీదేవ ! । సన్తుష్టః సహభోజనమ్ ॥ 190
సత్యలోకాధిపత్యం చ । సీతావార్తావలమ్బనే ।
తస్మా ద్వరిష్ఠం తే కర్మ । మునే తాపసపుఙ్గవ ! ॥ 191
ఏవ ముక్త్వా సుభద్రాణి । వాక్యాని వివిధాని చ ।
తతః ప్రోవాచ భగవాన్ । కక్షే కిం భాతి భానువత్ ॥ 192

### శ్రీనివాససన్నిధౌ వియన్నృపప్రేషితశుకోక్తవివాహోదన్తః

శ్రీశుకః —

రాజరాజేన లిఖితా । పత్రికా పురుషోత్తమ ! ।
ప్రోక్తం తవ మహాభాగ ! । పూర్వ మేవా స్య కారణమ్ ॥
ఇత్యుక్త స్స రమాకాన్తః । పత్రికాం శిరసా దధౌ ॥ 193

శ్రీనివాసః —

కుశలీ వర్తతే రాజా । భార్యా తస్య పతివ్రతా ।
భ్రాతా తస్య మహాభాగః । పుత్ర స్తస్య విశాంపతేః ॥ 194

శ్రీశుకః —

సర్వ స్తు కుశలం తస్య । భగవన్ ! భూతభావన ॥

### వియన్నృపం ప్రతి శ్రీనివాసవిలిఖిత శుభపత్రికా

ఏవ ముక్తః పపాఠాథ । పత్రికాం పురుషోత్తమః ।
తతన్ హృష్టమనా భూత్వా । వాచ మూచే రమాపతిః ॥ 195
పత్రికా లిఖ్యతే విప్ర ! । మయా ఆకాశ నృపాయ చ ।
త్వద్వాచ మనుష్యైవ । రాజ్ఞః ప్రీతివిధాయితా ॥ 196
తతః స పత్రం పురుషోత్తమోత్తమం । స్వయం లిలేఖాథ మహార్థసంయుతమ్ ।
ఆత్యన్తసంహృష్టమనః ప్రమోదకం । కృష్ణావతారే ప్రతి రుక్మిణీ మివ ॥ 197

సీతాన్వేషణకై చేసిన సహాయమునకై సంతసించి యాతనితో భుజించితివి. 190

సీతాదేవియొక్క శుభవార్త నెఱింగించుటచే నాతనిని సత్యలోకమున కధిపతిని గావించితివి. అంతకంటె నీ వొనరించిన కృత్యముత్కృష్టమైనది 191

అని యిట్లనేక మంగళవచనములను పలికి శుకయోగీంద్రా ! నీ చంకలో సూర్యునివలె ప్రకాశించునదేమి ' యని యడిగెను. 192

## శ్రీనివాసున కాకాశరాజు పంపిన వివాహ వృత్తాంతమును శుకుడు తెలుపుట

శ్రీ శుకుడు —

పురుషోత్తమా ! ఇది రాజేంద్రుడగు నాకాశరాజు పంపిన లగ్నపత్రిక. దీనికి కారణమును ముందే తెలిపితిని ' అని తెలుపగనే శ్రీనివాసుడా పత్రికను శిరస్సుపై నుంచుకొనెను. 193

శ్రీనివాసుడు —

మరియు — ఆకాశరాజు క్షేమముగానున్నాడా ! అతని పతివ్రతయగు భార్య కుశలమేకదా ! ఆ రాజచంద్రుని సోదరుడును, పుత్రుడును సుఖముగనున్నారుకదా ! అని ప్రశ్నించెను. 194

శ్రీ శుకుడు —

జగదీశ్వరా ! అందరును కుశలముగనే యున్నారని శ్రీ శుకుడు బదులిడెను. 195

## శ్రీ శ్రీనివాసు డాకాశరాజునకు శుభలేఖను వ్రాయుట

అంత శ్రీనివాసుడు శుభపత్రికను చదివి సంతుష్టాంతరంగుడై

నే నాకాశరాజునకు లగ్నపత్రికను వ్రాయుచున్నాను. ఈ పత్రిక నీ మాటల ననుసరించియే రాజునకు ప్రీతినొనగూర్చునని పలికి 196

ఇంద్రుని మిత్రుడగు ఆకాశరాజునకు గొప్ప భావయుక్తముగా నొకలేఖను మున్ను కృష్ణావతారమున రుక్మిణీదేవికి వ్రాసినట్లు స్వయముగా తన సంతోషమును సూచించుచు నిట్లు వ్రాసెను. 197

రాజాధిరాజపూజ్యాయ । సుధర్మతనయాయ చ ।
నమో నమో ఽతిభక్త్యైవ । కృతేయం పత్రికా ఽధునా ॥ 198

లిఖ్యతే శ్రీనివాసేన । శుభవిజ్ఞప్తిగర్భిణీ ।
శ్రీమద్రాజాధిరాజేన్ద్ర- । కిరీటాఘృష్టపాదుక ॥ 199

అస్మద్వస్తువరేణా ఢ్య । గుణపూర్ణ । సమృద్ధిమన్ ! ।
సుధర్మతనయాకాశ । నామ్నాఽఽకాశ సుకీర్తిమన్ ॥ 200

నమో నమో ఽస్తు తే రాజన్ । శ్రీనివాసస్య శార్ఙ్గిణః ।
శ్రీనివాసేన బాలేన । విజ్ఞప్తిః క్రియతే త్వియమ్ ॥ 201

భవద్భిర్లిఖితం దృష్ట్వా । సన్తోషో హ్యభవన్మమ ।
వైశాఖశుద్ధదశమీ । భృగువారే మహోత్సవే ॥ 202

అఙ్గీకరోమి రాజేన్ద్ర ! । కన్యాం తవ విశాంపతే ! ।
యథా పురా సాగరో మే । కన్యాదానసుకీర్తిమాన్ ॥ 203

తథా దత్త్వా తు మే కన్యాం । భవేస్త్వం బహుకీర్తిమాన్ ।
యథా వై సాగరాన్ పూర్వాన్ । కపిలేన నిపాతితాన్ ॥ 204

భగీరథో మహారాజో । గఙ్గామాదాయ వై పురా ।
ఉద్ధృత్యకీర్తిమాపేదే । తథా త్వం రాజసత్తమ ! 205

దత్త్వా మే సుభగాం కన్యాం । తవ పూర్వోత్తరం కులమ్ ।
ఉద్ధృత్య బహుళాం కీర్తిం । లభస్వేతరదుర్లభామ్ ॥ 206

లిఖితవ్యం విశేషేణ । కిం త్వేఽస్తి నృపసత్తమ ! ।
విశేషజ్ఞో ఽసి ధర్మాత్మా । వేత్తి సర్వం శుకో మునిః ॥
ఇతి విజ్ఞాపనం జ్ఞేయం । మమ ప్రణతి పూర్వకమ్ ॥ 207

ఇత్థం లిఖిత్వా వరపత్రికాం శుభాం । శేషాద్రినాథో మునినా శుకేన ।
సమ్ప్రేషయామాస సురేన్ద్రపూజ్యం । పురం నృపేన్ద్రస్య వియన్నృపస్య ..

రాజాధిరాజులచే పూజింపబడునట్టియు, సుధర్ముని తనయుడగు నాకాశరాజు
కి భక్తి భావముతో నమస్కరించి 198

శుభమును తెలుపు నీ పత్రికను వ్రాయుచున్నాను. శ్రీ రాజాధిరాజుల కిరీట
ములచే నొరిపిడిచేయబడు పాదపద్మములు కలిగినట్టియు, 199

నా కాత్మబంధువులగు భక్తబృందముతో కూడినట్టియు, సకల కల్యాణ
గుణములతో నిండియున్నట్టియు, సకల సంపన్నుడైనట్టియు, సుధర్ముని పుత్రుడునునగు
"ఆకాశరాజు" అను పేరుతో దిక్కులయందు వ్యాపించిన కీర్తి కలవాడవును నగు 200

నో రాజచంద్రమా! ధనుర్ధారియగు శ్రీనివాసుడు నమస్కరించుచున్నాడు.
వాడగు శ్రీనివాసుడు వ్రాసుకొన్న విన్నపము. 201

తమరు వ్రాసిన పత్రికను చూచి నాకు చాల సంతోషము కలిగినది. వైశాఖ
శుద దశమీ శుక్రవారమున మహోత్సవ సమయమున 202

నీ పుత్రికను పాణిగ్రహణ మొనర్చుట కంగీకరించుచున్నాను. పూర్వము
సముద్రుడు నాకు కన్యాదానము నొనరించి సత్కీర్తి నార్జించినట్లే 203

నీవును నాకు కన్నియ నొసంగి చాల కీర్తిగలవాడవు కాగలవు. కపిలమహర్షిచే
శపింపబడి భస్మముకాబడిన సగర పుత్రులను 204

భగీరథ చక్రవర్తి గంగను తీసికొనివచ్చి తరింపజేసి కీర్తినిపొందెను. అట్లే
నీవును 205

నా కందమగు నీ కన్నియ నొసంగి మీ పూర్వీకుల నందరిని పునీతులనుగావించి
యితరులు పొందలేని గొప్ప కీర్తిని పొందుము. 206

రాజేంద్రా! నీకు విస్తరించి వ్రాయునవసరములేదు. నీవు పెక్కుధర్మముల
నెఱింగినవాడవు. శ్రీ శుకయోగీంద్రుడు సర్వమును నెఱింగిన ధర్మాత్ముడు. ఇట్లు నా
నమస్కారపూర్వకమగు నీ జ్ఞాపనము నెఱుంగునది. 207

ఇట్లు శుభపత్రికను వ్రాసి శ్రీ శుకయోగీంద్రునిచే నింద్రాదులకును, సేవింప
దగినదియు ఆకాశరాజు పట్టణమగు నారాయణపురమునకు పంపించెను. మరియు శ్రీ శుక
యోగీంద్రునితో — 208

శ్రీనివాసః —

అవిదిత్వా కులం గోత్రం । నామ సంస్థాన మన్దిరమ్ ।
కథం దాస్యతి రాజేన్ద్రః । కన్యాం మమ మహీసురః ॥ 209

శ్రీశుకః —

న కులం న చ గోత్రం తే । న జన్మ మరణే హరే ।
న జరా న చ వృద్ధి శ్చ । న చ స్థానం న చాశ్రయః ॥ 210

విడమ్బమాత్రం గోవిన్ద ! । కురుషే పురుషోత్తమ ! ।
న తే ఽపేక్ష్యం కులం గోత్రం । విదితస్య జగత్పతేః ॥ 211

మమ వాక్యా ద్వియ ద్రాజః । కన్యాం తే సమ్ప్రదాస్యతి ।
మమ వాక్యా జ్జగన్నాథ ! । దయాం కృత్వా ఽయన్నృపే ॥
ఇయ ఞ్చ కన్యా గోవిన్ద ! । స్వీకార్యా కృపాయా త్వయా ॥ 212

### శ్రీనివాసాజ్ఞయా శుకస్య వి ముస్నృపనగరం ప్రత్యాగమనమ్

ఇతి స్తుత్వా శుక స్తీవ్రం । విసృష్టో హరిణా పునః ।
హరిసన్దర్శనా ల్లబ్ధ । హర్షో రాజపురం యయౌ ॥ 213

గతే తు మునిశార్దూలే । భగవాన్ ! భక్తవత్సలః ।
మాతరం సందదర్శా థ । మార్గశ్రాన్తాం వయోగతామ్ ॥
వకుళాం ప్రణిపత్యా థ । మాధవో వాక్య మబ్రవీత్ ॥ 214

### శ్రీనివాసాయ వకుళాకథితపద్మావతీ పరిణయోదన్తః

శ్రీనివాసః —

అమ్బ ! కాలవిలమ్బ స్తే । కిమర్థం కమలాననే ।
కాత త్ర వార్తా నగరే । త న్మమా చక్ష్వ భామిని ॥ 215

వకుళా —

సాధితా బహ్వాయత్నేన । కన్యా తే పురుషోత్తమ ! ।
దైవ మేవ పరం మన్యే । పౌరుషం నైవ కారణమ్ ॥ 216

శ్రీనివాసుడు —

మహేంద్రా! నా కులమును, గోత్రమును, పేరును, దేశమును, భవనము నెఱుంగక రాజు నాకు కన్నియ నెట్లొసంగున' ని యడుగగా 209

శ్రీ శుకుడు —

" శ్రీమన్నారాయణా! నీకు కులములేదు. గోత్రములేదు. జన్మమరణములు లేవు ముసలితనము, వృద్ధిక్షయములు లేవు. ఒక నివాసము, ఒకేస్థలమున నివసించుట యనునవి నీకు లేకున్నను 210

శ్రీనివాసా! మనుష్యునివలె నటించుచున్నావు. సుప్రసిద్ధుడవగు నీకు కుల గోత్రము లవసరము లేవు. 211

నేను చెప్పుటచే నాకాశరాజు నీకు కన్నియ నొసంగును. శ్రీనివాసా! నా ప్రార్థనానుసార మాకాశరాజునందు దయయుంచి కన్నియను స్వీకరింపుము' ని 212

## శ్రీనివాసుని యాజ్ఞచే శ్రీ శుకయోగీంద్రుడు ఆకాశరాజ నగరమునకు తిరిగివచ్చుట

స్తుతించి బలవంతపరచి శ్రీనివాసుని యనుమతిని బడసి శ్రీనివాస దర్శనముచే నంతసించుచు రాజనగరమునకు బయలుదేరెను. 213

భక్తులయందధిక వాత్సల్యముగల శ్రీనివాసుడు శ్రీ శుకయోగీంద్రుడు వెడలి నంతనే ప్రయాణముచే నలసియున్న వృద్ధురాలగు తల్లియగు వకుళకు నమస్కరించి 214

## శ్రీనివాసునకు వకుళాదేవి పద్మావతీ కల్యాణ వృత్తాంతము నెఱింగించుట

శ్రీనివాసుడు —

అమ్మా! ఇంత ఆలస్యమగుటకు కారణమేమి? ఆ నగరమునందలి వార్తను నా కెఱింగింపుము' ని యడుగగా 215

వకుళమాలిక —

యాతనితో — శ్రీనివాసా! మిక్కిలి ప్రయాసతో నీకు కన్నియను నిశ్చ యించితివి. ప్రతి కార్యమునకును దైవమే అనుకూలించవలెనేకాని పౌరుషము కారణము కాజాలదు. 216

నారాయణాశ్రమా త్ప్రాప్తా ! ధర్మదేవి ! సమాగతా ।
దైవయోగేన సా భద్రా । సమ్ప్రాప్తా రాజమన్దిరమ్ ॥ 217

ఉవాచ తాం భవద్దాన- । యోగ్యాం కన్యాం నృపాత్మజామ్ ।
కన్యా ఽపి త్వదృతే ఽన్యం సా । నైవా కాఙ్క్షతి లౌకికమ్ ॥ 218

తయో ర్వాక్యం సమాకర్ణ్య । దాతుం తే సో ఽన్వమన్యత ।
ఇమాం దాస్యామహే పుత్రీం । వేఙ్కటాద్రినివాసినే ॥ 219

ఇత్థం సఙ్కల్పయామాస । సభామధ్యే ముదా నృపః ।
త్వయై వ జాత మేతద్ధి । న దైవం భవతః పరమ్ ॥ 220

ఇతి మాతృవచః శ్రుత్వా । కిఞ్చి ద్ధాస్యముఖో హరిః ।
మాతరం ప్రతినన్ద్యా థ । చిన్తయన్ వాక్య మబ్రవీత్ ॥ 221

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే పద్మావతిపరిణయనిశ్చయో నామ నవమో ఽధ్యాయః సమాప్తః

---

# అథ దశమో ఽధ్యాయః

## శ్రీనివాసాజ్ఞయా బ్రహ్మాద్యానయనార్థం శేషగరుడగమనమ్

జనకః —

మాతు ర్వచన మాకర్ణ్య । కృతవాన్ కిం రమాపతిః ।
త న్మమా చక్ష్వ భగవన్ ! సవిస్తారం సతాం ప్రియ ! ॥ 1

శతానన్దః ....

త్వం హరే రపి భక్తేషు । ప్రథమో ఽతిప్రియః సదా ।
తస్మా ద్ధరికథావక్త- । మనా స్తే తు వదామి తత్ ॥ 2

వ్యయ మాపన్నపూర్ణో ఽపి । కర్మభి ర్నరవ ద్ధరిః ।
మాత్రా చోదిత మాకర్ణ్య । తా మూచే మధురం వచః ॥ 3

నారాయణాశ్రమమునుండి ధర్మదేవి అదృష్టవశమున రాజమందిరమునకు వచ్చి 217

ఆ రాజపుత్రిక నీ కొసంగదగినదని తెలిపినది. ఆ కన్నియ నిన్నుతప్ప సామాన్య మానవుని కోరకున్నది. 218

ధర్మదేవి, తన కుమార్తెల మాటలను విని రాజు నీకా కన్నియ నొసంగుటకే తలంచి "ఈనా పుత్రికను వేంకటాచల నివాసునకే యొసంగెదన ' ని 219

సభమధ్యలో నానందముతో సంకల్పించియున్నాడు. ఇదియంతయు నీ సంకల్ప ప్రభావమే. నిన్ను మించిన దైవము లేద ' ని 220

తల్లి చెప్పగా విని శ్రీనివాసుడు మందస్మితవదనారవిందుడై తల్లి నభినందించు సాలోచనగా నిట్లు పలికెను. 221

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున పద్మావతికి కల్యాణము నిశ్చయించుట యనెడు తొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము

---

# పదియవ అధ్యాయము

## శ్రీనివాసుని యాజ్ఞచే బ్రహ్మాదులను తోడ్తెచ్చుటకు శేషుడు, గరుడుడు వెళ్లుట

ఈ చరిత్రమును వినుచున్న జనకుడు శతానందునితో — తల్లిమాటలను విని శ్రీనివాసుడేమి చేసెనో నాకు విస్తరముగా నెఱింగింపుమ ' ని యడిగెను. 1

శతానందుడు ——

ఇట్లు చెప్పుట కారంభించెను — జనకచక్రవర్తీ ! నీవు విష్ణుభక్తులలో నగ్రగణ్యుడవు, భగవంతునకు మిక్కిలి యిష్టుడవు. నీవు విష్ణు కథలయందాసక్తిని కలిగి యుండుటంజేసి నీకా చరితమును తెలిపెదను. 2

భగవంతుడగు శ్రీనివాసుడు చిదానంద స్వరూపుడైనను కర్మఫలము ననుభవించు మనుజునివలె తల్లి మాటలను విని యామెతో — 3

శ్రీనివాసః —

మహోత్సవం విధాతుం హి । మమ బుద్ధి ర్న జాయతే ।
అబన్ధో ర్బన్ధుయుక్తస్య । సమ్బన్ధో న ప్రశస్యతే ॥ 4

యయో రేవ సమం విత్తం । యయో రేవ సమం కులమ్ ।
తయో ర్వివాహో మైత్రీ చ । నోత్తమాధమయోః క్వచిత్ ॥ 5

వివాద శ్చ వివాహ శ్చ । సమయో రేవ శోభతే ।
అహ మేకః సో ఽపి బన్ధు- । సమేతో ధరణీపతిః ॥ 6

కథం నృపస్యా స్య మయో చితః స్యాత్ । అబన్ధునాబన్ధుయుతస్య సఙ్గః ।
ఉభే త్సుఖం నేతి వదన్తి సన్తః । ఇ త్యద్య చిన్తా ఖలు బాధతే మామ్ ॥ 7

బన్ధుహీనస్య మే రాజా । కథం కన్యాం ప్రదాస్యతి ।
వాసుదేవవచః శ్రుత్వా । వకుళా వాక్య మబ్రవీత్ ॥ 8

వకుళా —

త్వాదృశః పురుషో లోకే । నా సత్యం వదతి క్వచిత్ ।
సత్య మేవ ప్రశంసన్తి । మునయో వీతకల్మషాః ॥ 9

శుక స్త్వత్కార్యనిష్ఠ స్తు । దేవానాం గురు రఙ్గిరాః ।
సద్ధర్మిణో మహీశస్య । తస్యా ఽశాం మా వృథా కురు ॥ 10

స్మర బన్ధూన్ సురాన్ సర్వాన్ । బ్రహ్మరుద్రపురోగమాన్ ।
పుత్రాన్ పౌత్రాం స్తథా భ్రాతౄన్ । స్నుషా శ్చ పురుషోత్తమ ! ॥ 11

తదా ఽఽగతి స్తు గోవిన్ద ! । దుర్లభా చ కలౌ యుగే ।
సో ఽపి పశ్య తు రాజర్షిః । త్వత్సమ్బన్ధిజనాని హ ॥ 12

మాతు ర్వచన మాకర్ణ్య । మనసా శేషపక్షిణా ।
సస్మార పృథివీపాలః । శ్రీనివాసః సతాంగతిః ॥ 13

తా వాగతా శేషవియచ్చరా తదా । క్షణేన శేషాచలకల్లభాన్తికమ్ ।
దదర్శ శక్త్యా పురతః స్థితా విభౌ । నిదేశయామాస పురాణపూరుషః ॥ 14

శ్రీనివాసుడు —

అమ్మా ! ఈ కల్యాణోత్సవమును జరుపుకొనుటకు నా మనస్సు సమ్మతించుట లేదు. బంధుజనులతో కూడిన వారి సంబంధము మెచ్చతగినదికాదు. బంధుజనులు లేక యేకాకిగా నుండువారికి 4

సమానమైన సంపదకలవారికి సమానమైనజాతి కలవారికి పరస్పర వివాహములు స్నేహములు రాణించును గాని గొప్పవారితో బీదలకును, బీదలతో గొప్పవారికిని సంబంధ బాంధవ్యములు తగినవి కావు. 5

కలహమైనను, కల్యాణమైనను తమతో సరితూగగల మనుష్యులతోనే ఇంపుగా నుండును. నేను ఒంటరివాడను. ఆకాశరాజు బంధుజనులతో నలరారువాడు. 6

అట్టివానికి నాతో బాంధవ్యమెట్లు తగును. ఇట్లు బంధువులు లేనివానితో బంధువులుకలవానికి బాంధవ్యము వలన సుఖముచేకూరదని సజ్జనులు వక్కాణింతురు. ఈ విచారమే నన్నిపుడు బాధించుచున్నది. 7

బంధువులులేని నాకు రాజు కన్నియ నెట్లొసంగు' నని విచారించు శ్రీనివాసునితో 8

వకుళమాలిక —

శ్రీనివాసా ! నీవంటి పురుషుడు లోకమున వసత్యములాడజాలడు. పాప విదూరులగు మునీంద్రులు సత్యమునే ప్రస్తుతింతురు. 9

శ్రీ శుకయోగీంద్రుడు నీ కల్యాణమొనర్చు కృత్యములో దీక్షనుగొని యున్నాడు. దేవగురువగు బృహస్పతియు నీ కల్యాణమును నెరవేర్ప సంసిద్ధుడైయున్నాడు. మంచి ధర్మశీలుడగు రాజు కోరికను నీవు వ్యర్థపుచ్చవలదు. 10

నీకు పుత్రులు, మనుమలు, సోదరులు, కోడండ్రునగు బ్రహ్మరుద్రాది దేవతా స్వజనములను తలంచుకొనుము. 11

కలియుగమున బంధుజనులు వచ్చుట అరుదు; కాబట్టి నీ బంధుజనులనందరును రాజు చూడనిమ్ము. 12

అని చెప్పినంతనే సజ్జనులకు ప్రాప్యస్థానమగు శ్రీనివాసు డాదిశేషుని, గరుత్మంతుని మనస్సులో సంకల్పించుకొనెను. 13

ఆదిశేషుడును, గరుత్మంతుడును శ్రీనివాసుని సంకల్పమాత్రముననే చిటిక మాత్ర వ్యవధానములో నాతనివద్దకు వచ్చిరి. శ్రీనివాసుడు భక్తితో తన ముందు నిలచిన వారిరువురను గాంచి 14

శ్రీనివాసః —

పక్షిరాట్ గచ్ఛ మే పుత్రం । సత్యలోకేశ్వరం నృప ! ।
గత్వా హి భాషణం శేష ! । మమ పౌత్ర ముమాపతిమ్ ॥ 15

ఇత్యు క్త్వా పత్రికాం తాభ్యాం । విలిఖ్యా దా చ్ఛుభాత్మికామ్ ।
ప్రణిపత్యా థ విశ్వేశం । ఖగమార్గేణ జగ్మతుః ॥ 16

సత్యలోకం తతో గత్వా । బ్రహ్మాణం భాస్కరోపమమ్ ।
దృష్ట్వా నత్వా ఽథ భక్త్యైవ । పక్షిరాట్ పత్రికా మదాత్ ॥
పితామహ స్తు తం దృష్ట్వా । గరుడం ప్రత్యభాషత ॥ 17

బ్రహ్మ —

చిరకాలేన సమ్ప్రాప్తః । పక్షిరాట్ కశ్యపాత్మజ ! ।
క్వ త్వా స్తి శ్రీనివాసః సః । వాసుదేవః పితా మమ ।
పితామహవచః శ్రుత్వా । పక్షిరాట్ వాక్య మబ్రవీత్ ॥ 18

గరుడః —

వాసుదేవో వసత్య ఙ్గ ! । వైకుణ్ఠగిరి మూర్ధని ।
తద్వివాహార్థ మాయా_స్తం । మాంవిద్ధిచతురానన ! ॥ 19

నారాయణేన లిఖితాం । పత్రికా మవలోకయ ।
సపాఠ పత్రికా మిత్థం । చోదితో ఽనేక వై విధిః ॥ 20

" చిరఞ్జీవాయ పుత్రాయ । బ్రహ్మణే నాభిజన్మనే ।
శ్రీవేఙ్కటాద్రినాథస్య । శ్రీనివాసస్య మఙ్గళమ్ ॥ 21

వైదిక్య ఆశిష స్సర్వాః । సర్వదా సన్తు పుష్కలాః ।
కేలా వాకాశరాజో మే । కన్యాదానం కరిష్యతి ॥ 22

పత్రికాదర్శనా దేవ । సపుత్రః సపరిగ్రహః ।
సలోకపాలః సస్త్రీకః । సగన్ధర్వః సహోరగః ॥ 23

శ్రీనివాసుడు —

గరుత్మంతా ! నీవు సత్యలోకాధిపతియు, నా పుత్రుడునగు బ్రహ్మదేవుని వద్ద కేగుము. ఆదిశేషా ! నీవు పన్నగాభరణుడును, నా మనుమడునగు శివునివద్దకు వెళ్లుము.

అని పలికి శుభలేఖను వ్రాసి వారికిచ్చెను. వారిరువురును శ్రీ వేంకటాచలపతికి నమస్కరించి ఆకాశమార్గమున వెడలిరి. 16

గరుత్మంతుడును సత్యలోకమునకు జని సూర్యసమానతేజుడగు బ్రహ్మను దర్శించి భక్తితో నమస్కరించి శుభలేఖ నొసంగెను. బ్రహ్మ ఆ లేఖను గాంచి గరుడునితో — 17

బ్రహ్మ —

కశ్యపపుత్రా ! గరుత్మంతా ! చాలకాలమునకు వచ్చితివి. నా తండ్రియగు శ్రీనివాసుడు చెప్పటనున్నాడ 'ని యడుగగా — గరుడుడా బ్రహ్మ మాట నాలకించి యాతనితో — 18

గరుత్మంతుడు —

శ్రీనివాసుడు శ్రీ వేంకటాచల శిఖరమున నివసించుచున్నాడు. ఆతని వివాహ శుభ సందేశమును నీకు తెల్పుటకై నేను వచ్చితినని యెఱుంగుము. 19

నారాయణుడు వ్రాసిఇచ్చిన శుభలేఖను చూడుము 'ని యొసగగా బ్రహ్మ ఆ శుభలేఖలో నీ క్రింది విధముగా చదివెను. 20

ఉత్కృష్ట నాభిపద్మమునుండి జన్మగల పుత్రుడగు చిరంజీవి బ్రహ్మకు శ్రీ వేంకటాచల నివాసియగు శ్రీనివాసుని యనేక మంగళాశాసనములు. 21

వేదవిహిత మంగళాశాసనము లెల్లప్పుడు విందుగా విలసిల్లుచుగాక ! కలియుగమున నాకాశరాజు నాకు కన్నియ నొసంగును. 22

శుభలేఖను జూచినంతనే పుత్రులతోడను, బంధుజనముతోడను, లోకపాలుర తోను, భార్యతోను, గంధర్వులతోను, నాగలోక నివాసులతోను 23

సమాగత్య తు కల్యాణం । దృష్ట్వా గచ్ఛ యథాసుఖమ్ ।
ప్రతిహార్థ మితి జ్ఞాత్వా । కేశ్చి ద్ధ్యాన ముపాగతః ॥ 24

సన్తోష మతులం లేభే । విధిః కల్యాణకౌతుకీ ।

## శ్రీనివాస వివాహదర్శనార్థం శేషాచలం ప్రతి బ్రహ్మాద్యాగమనమ్

చతుర్ముఖః —

ద్వారపాలాన్ సమాహూయ । చే దం వచన మబ్రవీత్ ॥ 25

భేరీదున్దుభయ శ్చా ద్య । వాద్యన్తాం సర్వతోముఖమ్ ।
భవద్భి ర్మే ఖ్యాపయద్భిః । గమనం ధరణీ తలమ్ ॥ 26

ఇత్యుక్తా ద్వారపాలా స్తే । వాద్యాని సమవాదయన్ ।
బ్రహ్మాణం ప్రణిపత్యాథ । సిదేశజ్ఞో వచో ఽబ్రవీత్ ॥ 27

ప్రయాణభేరీనినదః సుమఙ్గళః । సంశ్రూయతే సర్వజనైః కుతూహలాత్ ।
కం దేశ ముద్దిశ్య పితామహో ద్య । సన్నాద్యతే వాద్యగణో వదా ద్య ॥ 28

భారతే ఽస్మిన్ మహావర్షే । జమ్బూద్వీపస్య దక్షిణే ।
శేషాచలం సముద్దిశ్య । వియుజ్య చతురఙ్గిణీమ్ ॥ 29

సేనాం పరాం మమే త్యుక్త్వా । సేనాపతి మథా బ్రవీత్ ।
స్కన్దా ఽహ్వాయ సురాన్ సర్వాన్ । సర్వాన్ దిక్పాలకా నితి ॥ 30

సత్యలోకజనాన్ సర్వాన్ । స్వయ మాహ పితామహః ।
"భవన్తో రసికాః సర్వే । కల్యాణార్థ కలౌ యుగే ॥ 31

శ్రీనివాసస్య కృష్ణస్య । పితు ర్మే పురుషో త్తమాః ।
సమాగచ్ఛన్తు సర్వే మే । సేనాధీశాః మయా సహ ।
ఇతి బ్రహ్మవచః శ్రుత్వా । సేనానాథా స్త మబ్రువన్ ॥ 32

సేనాపతయః —

విచ్చేసి కల్యాణమును గాంచి సుఖముగా వెళ్లుమ' ని చదువుకొని కొంచెము సేపు ధ్యానించి 24

కల్యాణమును గాంచవలెనను కుతూహలముతో మిక్కిలి సంతసించి 25

## శ్రీనివాసుని వివాహమును గాంచుటకై శ్రీ వేంకటాచలమునకు బ్రహ్మాదులు వచ్చుట

బ్రహ్మ —

ద్వారపాలకులను పిలచి " భేరీదుందుభి వాద్యములను భూలోకమునకు నేను వెళ్లుచుండునట్లు సూచించుటకై గట్టిగా మ్రోగించుడ " ని 26

ఆజ్ఞాపింపగా ద్వారపాలురు వాద్యములను మ్రోగించిరి. అంత నాజ్ఞాపాలుడు వచ్చి బ్రహ్మకు నమస్కరించి — 27

పితామహా ! ప్రయాణసూచకముగా మంగళప్రదమగు భేరీ స్వరమును జను లందరును కుతూహలముగా వినుచున్నారు. ఏదేశమున కేగుట కీ భేరీనాద మొనరింప బడెనో తెలుపుడ ' ని యడిగెను. 28

అంత బ్రహ్మ " ఈ మహాభారత వర్షమున జంబూద్వీపమున దక్షిణదేశమున శేషాద్రికేగుటకై చతురంగబల సమేతమగు నా గొప్ప సేనను సిద్ధపరుపుమ ' ని చెప్పె 29

సేనాపతిని దేవతలనందరను, సకల దిక్పాలకులను పిలువవలసినదిగా నాజ్ఞాపించి 30

సత్యలోక నివాసులనందరను బ్రహ్మాన్వయముగనే పిలచి " రసజ్ఞులగు మీరందరును కలియుగమున జరుగుచున్న 31

నా తండ్రియు శ్రీకృష్ణావతారుడగు శ్రీనివాసుని కల్యాణము నవలోకించు టకై నాతో సేనాధిపతులందరును రావలయున ' ని యాజ్ఞాపింపగా సేనాపతులు ఆ బ్రహ్మ మాటను విని 32

వార్షికం దేహి నో బ్రహ్మన్ : । ఆగచ్ఛామ _స్త్వయా సహ ।
ఏవ ముక్తో ధనం తేషాం । ద_త్తవాన్ స పితామహః ॥
వాహనాని విచిత్రాణి । రథాం శ్చ వివిధాన పి ॥ 33

భూషణాని చ వస్త్రాణి । రత్నాని వివిధాని చ ।
పత్నీః సన్దేశయామాస । వివాహార్థం పితామహః ॥ 34

స్వయ మ_న్తర్గతః శ్రీమాన్ । ఆత్మానం సమభూషయత్ ।
దధార శిరసా శ్రీఘం । కిరీటం పశ్చిమేన తు ॥ 35

అన్యేన శిరసా ధాతా । రక్తోష్ణీష మధారయత్ ।
దక్షిణేనో_త్తమాఙ్గేన । శిరోవేష్టమబన్ధయత్ ॥ 36

కుశకేతుం కుశ_శ్రేష్ఠైః । ధృతవా నన్య మూర్ధని ।
నీలమౌ_క్తికవైడూర్య । యుతే మకరకుణ్డలే ॥
కర్ణయో ర్భూషయామాస । కరౌ కనకకఙ్కణైః ॥ 37

కవచం ధారయామాస । నవరత్న సమాకులమ్ ।
కాఞ్చీదామసమాబద్ధాం । ముక్తామణివిభూషితామ్ ॥
సరస్వతీ ఞ్చ సావిత్రీం । గాయత్రీం వై తతః పరమ్ ॥ 38

పుత్రాన్ పౌత్రాన్ తథా సర్వాన్ । సవాజిరథకుఞ్జరాన్ ।
మనఃపుత్రాన్ వీర్యపుత్రాన్ । సమాహూయ పితామహః ॥ 39

అలఙ్కారయుతాన్ కృత్వా । గమనాభిముఖో ఽభవత్ ।
స్వేవేనాం పురతః కృత్వా । నాభిజో నిర్యయౌ పురాత్ ॥ 40

హంసం చన్ద్రప్రతీకాశం । ఆరురోహ పితామహః ।
విమానాని విచిత్రాణి । వధ్వ ఆరురుహు_స్తథా ॥ 41

ఘణ్టాచామరనిర్ఘోషైః । సహితా నృప! రేజిరే ।
సూతా వీరాసనా ధీరాః । గజాశ్వరథసంస్థితాః ॥ 42

సేనాపతులు —

మాకు సంవత్సర జీతము నొసంగిన మేము నీతో రాగలము ' వి పలికినంతనే వారికి ధనమును, విచిత్రములగు వాహనములను, అనేక రథములను 33

భూషణములను, వస్త్రములను, రత్నముల నొసంగి తన భార్యలకును వివాహ ప్రయాణమునకై సిద్ధముగానుండుడని కబురుపంపి 34

తాను లోనికేగి తనను చక్కగ నలంకరించుకొని వెనుకనుండు తలకు కిరీట మును సింగారించి 35

మరియొక శిరమునకు ఎఱ్ఱని తలపాగను, దక్షిణమునందలి తలకు తలపాగను చుట్టెను. 36

మరియొక తలకు మంచి దర్భలతో కట్టిన ధ్వజము నలంకరించెను. సిం మాణిక్యములతోను ముత్యములతోను వైడూర్యములతో కూడిన మకరకుండలము ల చెవులయందును, బంగరు కంకణములను చేతులయందును ధరించెను. 37

నవరత్నములతో కూడిన కవచమును తొడుగుకొనెను. బంగరు మొలనూలుచే నలంకరింపబడినట్టియు, ముత్యములు, మణులచే నమకూర్చిన భూషణములను ధరించిన సరస్వతి, సావిత్రి, గాయత్రి యను భార్యలను 38

పుత్రులను, మనుమలను అటులనే గుఱ్ఱములతోను, రథములతోను, ఏనుగుల తోను, రథములతోను, కూడిన జనులందరను, మనసునుండి పుట్టినట్టియు, తన స్వంత పుత్రులైనట్టివారిని పిలచి 39

అలంకరించి తన సేనను ముందు నడిపించుకొనుచు గమనాభిముఖుడై బ్రహ్మ బయలుదేరెను. 40

చతుర్ముఖుడు చంద్రునివలె తెల్లని కాంతిగల హంసపై నధిష్ఠించెను. భార్యలు విచిత్రములగు విమానములపై నాసీనులైరి. 41

రాజా ! అందరును ఘంట చామర ధ్వజములచే ప్రకాశించిరి. పరాక్రమశాలురును ధీరులును, ఏనుగులపైనను గుఱ్ఱములపైనను, రథములపైన నధివసించి 42

సముచ్ఛ్రితై ర్ధ్వజై ర్దీర్ఘ- । పతాకైః సమలఙ్కృతాః ।
నానాయుధధరా వీరాః । తేషాం మధ్యే పితామహః ॥ 43

రరాజ చన్ద్రమా రాజన్ ! । తారాభి ర్గగనే యథా ।
శ్వేతచ్ఛత్రం హేమదణ్డం । రత్నకుమ్భయుతం ధృతమ్ ॥ 44

యోజనత్రయవిస్తీర్ణం । దశలక్షజనై ర్వృతమ్ ।
నభః ప్రకాశయామాస । దేవదేవస్య వై తదా ॥ 45

అవాదయన్ మహారాజ ! । వాద్యాని వివిధాని చ ।
భేరీ శ్చ నవసాహస్రం । దున్దుభీనాం శతత్రయమ్ ॥ 46

మృదఙ్గపణవాన్ ఢక్కా- । మడ్డునిస్సాణడిణ్డిమాన్ ।
గోముఖాన్ మురజాన్ వీణాః । తథా వై ఝర్ఝరాదికాన్ ॥ 47

జర్ఝరైః శతశృఙ్గై శ్చ । దీర్ఘశృఙ్గై శ్చ సుస్వరైః ।
సప్తస్వరైః సప్తరాగైః । సర్వాణా మపి మోహకైః ॥ 48

పూత్కారై శ్చ వషట్కారైః । ధ్వనయద్భి శ్చ వారిజాన్ ।
గన్ధర్వైః గాననిపుణైః । సర్వభేదవిచక్షణైః ॥ 49

వీణాదణ్డస్థసూత్రై శ్చ । వాదయద్భిః సుఖావహైః ।
నర్తకై ర్నటకై శ్చైవ । హాహాహూహూముఖై ర్వృతమ్ ॥ 50

స్తూయమానా స్తుమ్బురుణా । సూతమాగధవన్దిభిః ।
సురా ప్పర్వే శ్రీనివాస- । మహోత్సవదిదృక్షవః ॥ 51

అనుజగ్ము ర్మహారాజం । బ్రహ్మాణం యాన్త మగ్రతః ।
సత్యలోకే తపోలోకే । జనో లోకే తతః పరమ్ ॥ 52

మహర్లోకే సువర్లోకే । స్వర్గలోకే మహీతలే ।
ఏవం క్రమా న్మహారాజం । బ్రహ్మాణం దదృశు ర్జనాః ॥ 53

మిక్కిలి పెద్దగు ధ్వజములతోను, పొడవగు పెక్కెములతోను నలంకరింప బడి యనేక ఆయుధములతో వీరులు చుట్టుముట్టియుండ వారి మధ్యలో బ్రహ్మ 43

ఆకాశమున నక్షత్రములతో కూడిన చంద్రునివలె ప్రకాశించెను. బంగారు దండముకలిగి పైన రత్నకుంభము కలిగియున్న తెల్లగొడుగు పట్టబడెను. 44

మూడు యోజనముల వరకు వ్యాపించిన వైశాల్యము గలిగి. పది లక్షల జనులతో గూడి చతుర్ముఖుని పరివారము ఆకాశమున ప్రకాశింపజేసెను. 45

అనేక వాయిద్యములను తొమ్మిది వేల భేరీలను, మూడు వందల దుందుభులను 46

మద్దెలలను, తప్పెటలను, ఢక్కాలను, ఝంజరలను. అనేక చర్మవాద్య విశేషము లను, వాద్య విశేషములను. బూరాలను, మృదంగములను, వీణలను, కయిముడి యు వాద్య విశేషములను వాయించిరి. 47

నూర్లకొలది కొమ్ము బూరలతోను, మంచి స్వరముకల దీర్ఘములగు కొమ్ము బూరలతోను, సప్తస్వరములతోను, పాములను గూడ మోహింపజేయు సప్తరాగములతోను

హూత్కారములతోను, వషట్కారములతోను, మేఘములను ప్రతిధ్వనింప చేయుచు పాడుటయందు నేర్పుగలిగి స్వరములయందు భేదములను చక్కగా నెఱుంగ జాలినట్టియు 49

వీణలయందలి తంత్రులను వీనుల విందుగా మీటుచు నర్తకులతోను, నాట్య మొనరించువారితో హాహా, హూహూ, మొదలగు వారితోగూడి పాడుచున్న గంధర్వుల చేతను 50

తుంబురునిచేతను, స్తోత్రపాఠకులచేతను, భట్రాజులచేతను స్తుతింపబడుచు దేవతలందరును శ్రీనివాసుని ఉత్సవమును జూచు వేడ్కతో 51

ముందేగుచున్న ప్రభువగు బ్రహ్మను వెంబడించి జనుచుండిరి. సత్యలోకమున తపోలోకమున, జనలోకమున 52

మహర్లోకమున, సువర్లోకమున, స్వర్గలోకమున చివరకు భూలోకమున వరుసగా వెడలుచున్న చతుర్ముఖుని జనులు దర్శించిరి. 53

ఋషయ స్సత్త్వసంపన్నాః। తదా ఽత్యద్భుతదర్శనమ్।
వాసుదేవసమాకారం। వైశ్వానరసమాననమ్॥ 54

దదృశుః సర్వలోకేశం। సాక్షా ద్బ్రహ్మాణ మగ్రజమ్।
కేచిన్నారాయణం తం హి। గామ్భీర్యా దబ్రువం స్తతః॥ 55

కేచిన్నారాయణో నా యం। వదనానాం విపర్యయాత్।
ఇత్య బ్రువం స్తత స్సర్వే। మత్వా తం చతురాననమ్॥ 56

హంసస్థం భూషణై ర్యుక్తం। కవచాడమ్బరాన్వితమ్।
అపృచ్ఛం స్తే మహీదేవాః। బ్రహ్మణో ఽనుచరాన్ జనాన్॥ 57

మహీదేవాః —

కం వా దేశం ప్రతి జనాః। కుతో వా గమనం విధేః।

జనాః —

గచ్ఛామో ఽద్య వివాహార్థం। శ్రీనివాసస్య భూతలమ్॥ 58

తేనై వా కారితా స్సర్వే। సత్యలోకా న్మహీసురాః।
త చ్ఛ్రుత్వా వచనం తేషాం। అనుజగ్ము ర్మహర్షయః॥ 59

సాగ్నిహోత్రా స్సపుత్రా శ్చ। సశిష్యాః సపరిగ్రహాః।
ఏవం విభవ మాస్థాయ। బ్రహ్మా ఽగా ద్వేఙ్కటాచలమ్॥ 60

వాదిత్రాణాం స్వనేనైవ। దుందుభీనా ఞ్చ నిస్వనైః।
అపూరితం జగ దిదం। సశైలవనకాననమ్॥ 61

## శ్రీనివాసం ప్రతి చారాదిజ్ఞాపితబ్రహ్మాగమనమ్

ఏతస్మి న్నేవ కాలే తు। భగవాన్ లౌకికై స్సమః।
అదృష్ట్వా ఖగరాజ న్తం। మాతరం వాక్య మబ్రవీత్॥ 62

శ్రీనివాసః —

కిం వా గతో ఽమ్బ! ఖగరాట్। పత్రార్థం ప్రేషితో మయా।
మార్గే నిరోధిత స్తేన। కిం వా స్యాత్ కారణం వద॥ 63

సత్వగుణ సంపన్నులైన మహేంద్రులు ఆశ్చర్యరూపుడును, శ్రీమన్నారాయణుని బోలిన యాకారముకలిగి, యగ్నిహోత్రునివంటి దివ్యతేజముగల ముఖ వర్చస్సుతో గూడిన 54

సకల లోకాధిపతియు, సృష్టికి మూలపురుషుడునునగు ప్రథమోత్పన్నుడైన సాక్షాత్ చతుర్ముఖుని గాంచి కొందరా గాంభీర్యమును జూచి శ్రీమన్నారాయణుడనిరి. 55

ముఖములు నాల్గు కలిగియుండుటచే శ్రీమన్నారాయణుడు కాజాలడని కొందరు వక్కాణించిరి. తుదకాతనిని 56

హంస వాహనముచేతను, భూషణములచేతను, కవచము మొదలగు ఆడంబరములచేతను చతుర్ముఖుడని తలంచి బ్రాహ్మణులు బ్రహ్మను వెంబడించి చనుచున్న జనులను — 57

ఓ ప్రజలారా! చతురాననుడే దేశమున కేగుచున్నాడు? ఎచటనుండి వచ్చుచున్నాడ'ని యడిగిరి. బ్రహ్మ ననుసరించి పోవుచున్న జనులు వారితో — శ్రీనివాసుని వివాహము నవలోకించుటకై భూలోకమున కేగుచున్నాము. శ్రీనివాసుడే సత్యలోకము నుండి రావలసినదిగా మమ్ముల నాహ్వానించెన'ని తెలుపగా వారును 58,59

అగ్నిహోత్రములతోను, పుత్రులతోను, శిష్యులతోను, పరివారములతోను వెంబడించిరి. ఇట్లు బ్రహ్మ గొప్ప వైభవముతో శ్రీ వేంకటాచలమున కేగెను. 60

వాయిద్యముల ధ్వనులతోను, దుందుభిధ్వానములతోను, పర్వత వన విపినములతో కూడిన జగమంతయు నిండిపోయెను. 61

## శ్రీనివాసునకు చారులు బ్రహ్మ రాక నెఱింగించుట

ఈ సమయమున శ్రీనివాసుడు మామూలు మానవునివలె నటించుచు గరుత్మంతుడింతదనుక రాకుండుటచే తల్లియగు వకుళమాలికతో — 62

శ్రీనివాసుడు —

**అమ్మా!** పుత్రుడగు బ్రహ్మ కొఱకు గరుత్మంతుని పంపితినికదా! ఇంతవరకును రాలేదు. దారిలో నెవరితోనైనను కలహించుచుండెనా? కారణమేమైయుండునో'ని

ఏవం వదతి గోవిన్దే । చారో దృష్టిపథం గతః ।
చారం దృష్ట్వా ఽతిసన్తోషం । స లేభే పురుషోత్తమః ॥ 64

క్వ చార! మమ పుత్ర స్తు । కేన వై ప్రేషితో భవాన్ ।

నారః —

ఆగమిష్యతి గోవిన్ద! । గఙ్గాం తరతి తే సుతః! ॥ 65

ఏవం వదతి తచ్చారే । పున రేకో ఽభ్యభాషత ।

ద్వితీయః —

గోదావరీం తరతి తే । పుత్రః పౌరజనై స్సహ ॥ 66

స మాతవచనం శ్రుత్వా । కిఞ్చి ద్ధాస్యముఖో ఽభవత్ ।
తదా ఽఽజగామ గరుడః । పక్షిరాట్ బ్రహ్మచోదితః ॥ 67

ప్రణిపత్య శ్రీనివాసం । ప్రోవాచ చ వచ స్తదా ।

గరుడః —

కృష్ణాం తీర్త్వా తు తే పుత్రః । శ్రీశైల ముపగమ్య చ ॥ 68

అహోబిలం చా ససాద । తత్రా ఽఙ్ఞప్తో ఽహ మాగతః ।
ఇత్యేవ ముచ్యమానే తు । గరుడేన మహాత్మనా ॥ 69

తత్క్షణేనై వ రాజేన్ద్ర! । విష్వక్సేనో ఽభివన్ద్య చ ।
వినీతో వాచ మూచేఽథ । శ్రీనివాసం పరాత్పరమ్ ॥ 70

విష్వక్సేనః —

తుమ్బురో స్తీర్థ మాసాద్య । హరే! తత్రా వగాహతే ।
పుత్ర స్తవ మహారాజః । పరమాత్మా చతుర్ముఖః ॥ 71

పుత్ర స్తవా గచ్ఛతి హ । భవద్ద ర్శనకౌతుకీ ।
సేనాపతౌ వదత్యేవం । భగవా నుద్ధితో ముదా ॥ 72

గరుడస్కన్ధ మారూఢః । ప్రయాణాభిముఖో హరిః ।
ఉత్తరాభిముఖః ప్రాయాత్ । పుత్రస్నేహేన భూమిప! ॥ 73

పలుకుచుండగనే చారుడు కనుపించుటంజేసి మిక్కిలి సంతసించెను. 64

చారుడా ! నా కుమారు డెచ్చటనున్నాడు ? నీ వెవరిచే పంపబడితివి ? ' వి ప్రశ్నింపగా నాతడు శ్రీనివాసునితో — గోవిందా ! నీ పుత్రుడు త్వరలోనే రాగలడు. గంగను దాటుచున్నాడ ' ని 65

చెప్పుచున్నంతలో మరియొకడు వచ్చి — ' స్వామీ ! మీ పుత్రుడు పురజనులతో గూడ గోదావరిని దాటుచున్నాడ ' ని తెలిపెను. 66

శ్రీనివాసుడా మాటలకు కొంచెము సంతోషించుచుండగా గరుత్మంతుడు బ్రహ్మచే ముందుగా పంపబడి వచ్చి 67

గరుత్మంతుడు —

శ్రీనివాసునకు నమస్కరించి " నీ పుత్రుడు కృష్ణానదిని దాటి శ్రీశైలమును సమీపించి 68

అహోబిలమునకు విచ్చేసెను, నేనాతని యజ్ఞచేముందుగా నిచటకు వచ్చితిన " ని తెలుపునంతలో 69

సేనాపతియగు విష్వక్సేనుడు వచ్చి నమస్కరించి వినయముతో — 70

విష్వక్సేనుడు —

మీ పుత్రుడగు చతుర్ముఖుడు తుంబురు తీర్థమున స్నానమొనరించుచున్నాడు, 71

మిమ్ముల దర్శించవలెనను కుతూహలముతో నిచ్చటకు వచ్చుచున్నాడ " ని చెప్పినంతనే శ్రీనివాసుడు సంతసముతో లేచి 72

గరుత్మంతునిపై నెక్కి పుత్రుని చూడవలెనను కోర్కెతో ఉత్తర దిశగా పయనించెను. 73

విష్వక్సేనో ఽతివేగేన । బ్రహ్మాణ ముపగమ్య చ ।
అనమ్య శిరసా భక్త్యా । ప్రోవాచ వచనం విధిమ్ ॥ 74

చతుర్ముఖ శ్రీనివాసయోః పరస్పర ప్రణయావలోకన సంవాదః

విష్వక్సేనః —

భగవా నరవిన్దాక్షః । తవ దర్శనలాలసః ।
గరుడస్కన్ధ మారుహ్య । సమాగచ్ఛతి తే ఽన్తికమ్ ॥ 75

త చ్ఛ్రుత్వా వచనం తస్య । విష్వక్సేనస్య ధీమతః ।
చన్ద్రబిమ్బనిభా ద్ధంసాత్ । అవరుహ్య పితామహః ॥ 76

పాదాభ్యా మాగమ చ్ఛీఘ్రం । యత్రా ఽగచ్ఛతి కేశవః ।
స దదర్శ మహారాజ! । జనకం చతురాననః ॥ 77

దణ్డవ త్ప్రణిపత్యా థ । చా గ్రే బద్ధ్వా కరౌ స్థితః ।
స చా వరుహ్య గరుడాత్ । ఆససాద పితామహమ్ ॥ 78

ఉత్థాప్యా ఽలిఙ్గ్య చా ప్యే నం । ఉవాచ మధుసూదనః ।

శ్రీనివాసః —

ఉత్తిష్ఠ తాత! భద్రం! తే । పశ్య మా మాతురం కృశమ్ ॥ 79

బహుకాలేన తే బుద్ధిః । మమ దర్శనలాలసా ।
త దేవ పరమం మన్యే । త్వద్బుద్ధి ర్మమదర్శనే ॥ 80

కౌతూహలం నో వనితా । కదాచి దపి యేన వై ।
న కశ్చి ద్ధ్రియతే క్వాపి । త్వాం వినా చతురానన! ॥ 81

వదత్యే వం హృషీకేశే । నో వాచ చతురాననః ।
ముహూర్త ద్వయమాత్రం తు । శ్రీనివాసో ఽపి నో చివాన్ ॥ 82

ఆనన్దబాష్పసమ్పూర్ణ- । నయనౌ తౌ పరస్పరమ్ ।
స్నేహా త్ప్ర వుల్లవదనౌ । ముఖం దదృశతు ర్ముదా ॥ 83

విష్వక్సేను డత్యంత వేగముతో బ్రహ్మవద్దకేగి శిరస్సును వంచి భక్తితో నమస్కరించి యాతనితో — 74

## బ్రహ్మ శ్రీనివాసుడు ఒకరినొకరు స్నేహముతో వీక్షించుకొనుట, భాషించుకొనుట

విష్వక్సేనుడు —

పూజ్యుడగు పుండరీకాక్షుడు నిన్ను గాంచవలెనని కుతూహలపడుచున్నాడు. గరుత్మంతునిపై నెక్కి నీ వద్దకు చనుదెంచుచున్నాడ ' ని 75

పూజ్యులగు విష్వక్సేనులు తెలుపగనే చతుర్ముఖుడు చంద్రునివంటి తెల్లని కాంతిని గల హంసనుండి దిగి 76

శ్రీనివాసుడు వచ్చు దారిలో నడచి యెదురేగి తన తండ్రియగు శ్రీనివాసుని గాంచి 77

సాష్టాంగముగ నమస్కరించి లేచి చేతులు జోడించి నిలచెను. శ్రీమన్నారాయణుడును గరుత్మంతుని నుండి దిగి బ్రహ్మవద్దకేగి 78

ఆతనిని లేవదీసి ఆలింగనమొనర్చుకొని నాయనా ! చతుర్ముఖా ! బ్రహ్మా. నీకు శుభమగుగాక ! వ్యాధిగ్రస్తుడవై కృశించుచున్న నన్ను చూడుము. 79

చాలకాలమునకు నీకు నన్ను చూడవలెనను కోర్కె కలుగుటయే నా మహద్భాగ్యముగా తలంతును. 80

నీ చేతనే తప్ప ఒకప్పుడు నెవరిచేతను నాకు సంతోషము కలుగజాలదు. నీవు తప్ప నా ప్రాణాధారమేదియును లేదు. 81

ఇట్లు శ్రీనివాసుడు చెప్పుచుండగా బ్రహ్మ రెండు క్షణములవరకేమియు మాటాడజాలకపోయెను. శ్రీనివాసుడును పలుకజాలకుండెను. 82

వారిరువురును ఆనందాశ్రువులచే కనులునిండి స్నేహముచే వికసించిన మోములు కలిగి యొకరి ముఖము నొకరు సంతసమున నవలోకించుచు 83

పితు ర్ముఖం సుతో ఒపశ్యత్ । సుతవక్త్రం హరి స్తథా ।
తతః సన్తుష్టమనసౌ । లేభాతే పరమాం ముదమ్ ॥ 84

తౌ క్రీడన్తౌ శ్రీనివాస- । బ్రహ్మాణౌ దేవసంసది ।
పితాపుత్రౌ తదా దృష్ట్వా । సత్యలోకనివాసినః ॥ 85

లేభిరే పరమానన్దం । త న్మాయామోహితా స్సురాః ।

దేవాః —

న తేన సదృశః పుత్రో । న తేన జనకో భువి ॥ 86

ఇత్యే వం ప్రశశంసు స్తే । భక్తిస్నేహవశం గతాః ।
తతః సుతం సమాస్వాశ్య । పరిమృజ్యా క్షిజం జలమ్ ॥ 87

బ్రహ్మణః పాణి ముద్ధృత్య । స్వనేత్రజల మున్మృజన్ ।
వల్మీకస్థాన మాశ్రిత్య । పుత్రేణ సహ తస్థివాన్ ।
తత్ర చ శ్రీనివాస స్తం । ఉవాచ పురుషోత్తమః ॥ 88

శ్రీ భగవాన్ —

కచ్చి త్తే కుశలం తాత ! । స్నుషాయా మమ సమ్ప్రతి ।
పుత్రపౌత్రప్రపౌత్రాణాం । క్షేమం ప్రబ్రూహి మే సుత ! ॥ 89

బ్రహ్మ —

సర్వమఙ్గళ మస్మాకం । త్వత్ప్రసాదేన కేశవ ! ।
తాత ! మే వద తే క్షేమం । పురాణపురుషోత్తమ ! ॥ 90

చతుర్ముఖం ప్రతి శ్రీనివాసజ్ఞాపిత స్వపరిణయోద న్తః

శ్రీ భగవాన్ —

ద్వాపరాన్తే కృతం కర్మ । శృణు పుత్ర సమాధినా ।
వైకుణ్ఠే శేషతల్పస్థం । భృగుః పాదతలేవ మామ్ ।
తద్వాదో ఽపి తే మాతుః । అస్పృదే తమలావనః ॥ 91

తదా తే జననీ పుత్ర ! । కరవీరపురం గతా ।
తేన దుఃఖేన స న్తప్తః । త్యక్త్వా వైకుణ్ఠ ముత్తమమ్ ॥ 92

సంతసించిన మనస్సుకలవారై చెప్పనలవిగాని సంతోషమును పొందిరి. 84

దేవతల నడుమ క్రీడించుచున్న శ్రీనివాస చతుర్ముఖులను గాంచి సత్యలోకమున వసించువారందరును 85

శ్రీమన్నారాయణుని మాయచే మోహింపబడిన దేవతలందరును మహదానందము ననుభవించిరి. ఇట్టి పుత్రుడుగాని, యిట్టి తండ్రిగాని భూలోకమున నుండజాల 'ని

భక్తి స్నేహములతో స్తుతింపసాగిరి. అంత శ్రీనివాసుడు బ్రహ్మను నూరడించి కనుల నీరును తుడచి 87

చతుర్ముఖుని చేతినెత్తి తన కంటినీరును తుడుచుకొనుచు తాను మున్ను నివసించిన పుట్టయొద్ద నాతనితో నిలచి ఇట్లనెను. 88

శ్రీ భగవానుడు —

నాయనా ! చతురాననా ! నీవును కోడండ్రును కుశలముగా నున్నారుకదా ! పుత్రులు, మనుమలు, మునిమనుమల క్షేమవార్తను నా కెఱింగింపుము ' ని యడిగెను. 89

బ్రహ్మ —

శ్రీనివాసా : నీ యనుగ్రహముచ్చే మేమందరము క్షేమముగనే యున్నాము. నీ క్షేమమును మాకు తెలియజేయుము ' ని బ్రహ్మ యడిగెను. 90

## చతురాననునకు శ్రీనివాసుడు తన కల్యాణవృత్తాంతము నెఱింగించుట

శ్రీ భగవానుడు —

శ్రీనివాసు డాతనితో — ద్వాపరయుగము ముగియువపుడు జరిగిన కృత్యమును తెలిపెదను. సావధానముగా వినుము. వైకుంఠమున నేను శేషునిపై పవళించియుండగా భృగుమహర్షి వచ్చి నీ తల్లియగు లక్ష్మికి నివాసస్థానమగు నా వక్షస్థలమున తన కాలితో తన్నెను. 91

అపుడు నీ తల్లి కరవీరపురమునకు వెడలిపోయెను. ఆ దుఃఖముతో నేను పీడింపబడుచు వైకుంఠమును వీడి 92

ఇహా గతో వేఙ్కటాద్రిం । నా త్రా పశ్యం నికేతనమ్ ।
అత్ర వల్మీకగం నిత్యం । చోళభృత్యః కుఠారతః ॥ 93

ప్రాహర న్మాం రాజభార్యా । తాడితో ధేనుకోపతః ।
బృహస్పతేః ప్రసాదేన । జీవామి కరుణానిధే ! ॥ 94

అభివాదయ కల్యాణీం । మాతరం మమ నన్దన ! ।
ఇత్యు క్తో వకుళాం బ్రహ్మా । వవన్దే హరిమాతరమ్ ॥ 95

బ్రహ్మా —

జననీ తవ గోవిన్ద ! । కుత్రే యం జనితా పురా ।
ఏత దాఖ్యాహి భగవన్ ! । శ్రోతుం కౌతూహలం హి మే ॥ 96

శ్రీ భగవాన్ —

యశోదా వకుళా భూత్వా । వ ర్తతే వేఙ్కటాచలే ।
రక్షితో ఽహం తయా భద్ర ! । బహుకాలం పితామహ ! ॥ 97

ఆపత్కాలే తు యో రక్షేత్ । తం విద్యా త్పితరం గురుమ్ ।
కదాచి న్మృగయా ఽఽస క్తః । పద్మతీర్థసమీపతః ॥ 98

అగా మహం తత్ర పుష్ప- । వనే కన్యా ఉపాగమన్ ।
తాసాం మధ్యే విరాజ న్తీ । కన్యా కాచి దుపాగమత్ ॥ 99

యా మాకాశప్రభోః పుత్రీం । నామ్నా పద్మావతీం విదుః ।
తా మవేక్ష్యా తిమోహా న్మే । మన స్తా మేవ కాఙ్క్షతే ॥ 100

తా మేవ ఘటయా ఽశు త్వం । పుత్రో ఽపి పరమో మమ ।
వదత్యే వం హృషీకేశే । శుశ్రువే దున్దుభిస్స్వనః ॥ 101

## శ్రీనివాస పరిణయార్థం శేషాచలం ప్రతి రుద్రాద్యాగమనమ్

శ్రీ భగవాన్ —

కస్యై వార్త్య మిదం బ్రహ్మన్ ! । క శ్చ మా ముపగచ్ఛతి ।
వదత్యే వం వరే ధామ్ని । నీలకణ్ఠో ఽన్వపద్యత ॥ 102

వేంకటాచలమునకు వచ్చి ఇచట నాకు నివసించుటకు స్థానమును కనుగొన జాలక ఈ పుట్టయందు నివసించితిని. ఒకతరి చోళరాజుని భృత్యుడు గొడ్డలితో 93

ఆవుపాలకై రాజ భార్య కోపించి తనను కొట్టగా నాకు పాలనొసంగుచున్నదని ఆవుపై కోపించి నన్ను గండ్రగొడ్డలితో కొట్టెను. బృహస్పతి యనుగ్రహముచే బ్రతుకు చున్నాను. 94

నాయనా ! శుభప్రదురాలను, నా తల్లియగు వకుళాదేవికి నమస్కరింపుమనగా బ్రహ్మ యామెకు నమస్కరించి 95

బ్రహ్మ —

శ్రీనివాసా ! నీ తల్లి మున్నెచ్చట జనించినది ? ఆమె జన్మవృత్తాంతము విన కుతూహలమగుచున్నది తెలుపుమ ' ని యడిగెను 96

శ్రీ భగవానుడు —

చతురాననా ! యశోద వకుళాదేవియై వేంకటాచలమున నివసించుచున్నది. చాలకాల మామెచేతనే నేను సంరక్షింపబడితిని. 97

ఆపద సమయమున రక్షించువారే తండ్రి. గురువు నగుచున్నారు. ఒకప్పుడు నేను వేటాడుచు పద్మతీర్థ సమీపమునకు వచ్చితిని. 98

ఆ తీరమునందలి పుష్పోద్యానమునకు కొందరు కన్నియలు వచ్చిరి. వారి మధ్యలో నొక కన్నియ మిక్కిలి ప్రకాశించుచుండెను. 99

ఆమె ఆకాశరాజ పుత్రిక. పేరు పద్మావతి. ఆమెను చూచి మోహించి నా మనస్సామెనే కోరుచున్నది. 100

నీవు త్వరలో నా కామెను చేకూర్చుము. నాకు హితము నొనగూర్చు పుత్రుడవు నీవే ' యని శ్రీనివాసుడు పలుకుచున్నంతలో దుందుభిధ్వని వినవచ్చెను. 101

## శ్రీనివాసుని వివాహమునకై రుద్రుడు శేషాచలమునకు వచ్చుట

శ్రీ భగవానుడు —

శ్రీనివాసుడా శబ్దమును విని పితామహా ! ఈ వాద్య మెవరిది ? నావద్ద కెవరు వచ్చుచున్నార ' ని అడుగుచుండగనే ఈశ్వరుడు వచ్చి 102

పితామహ శ్చ పితరం । వవన్దే వసుధాధిప ! ।
పార్వత్యా షణ్ముఖేనాపి । ప్రమథాధిపసేవకైః ॥ 103

త మాలిఙ్గ్య హృషీకేశః । ప్రాహ శఙ్కర మాగతమ్ ।
"వత్సాత్రా ఽయాహి నికటం । తిష్ఠ భద్ర వరానన ! ॥ 104

ఏవం సమ్భాషమాణే తు । నీలకణ్ఠేన కేశవే ।
తతః సమాగమ త్సద్యః । కుబేరో నరవాహనః ॥ 105

యక్షేన్ద్రైః పుత్రభృత్యై శ్చ । భార్యాబన్ధుభి రన్వితః ।
త మాయాన్త ముపాలక్ష్య । భగవా నాహ భూమిప ॥ 106

ధనాధిప ! మహాప్రాజ్ఞ ! । ధనవాన్ భవ సర్వదా ।
ఇత్యా శిషా ఽఽనన్దయతి । హృషీకేశే ధనేశ్వరమ్ ॥ 107

స్వాహా స్వధాభ్యాం సహితః । ఆరూఢో మేషవాహనమ్ ।
అగ్ని శ్చా గాత్ సపుత్ర శ్చ । సబన్ధుర్వేఙ్కటాచలే ॥ 108

స జాతవేదసం దృష్ట్వా । జాతా ఽహ్లాదో జగత్పతిః ।
త మాలిఙ్గ్య తివేగేన । "తిష్ఠ తిష్ఠే" తి చా బ్రవీత్ ॥ 109

తతః ప్రేతపతి శ్చాపి । స్వదూతై శ్చ స్వభార్యయా ।
స్వవాహనం సమారుహ్య । ప్రాప శేషగిరిం స్వయమ్ ॥ 110

చిత్రగుప్తో మహాప్రాజ్ఞః । సమ్ప్రాప్తో రాజసత్తమమ్ ।
తతో జలపతి శ్చాగాత్ । నక్ర మారుహ్య భక్తిమాన్ ॥ 111

భార్యయా బహురత్నాఢ్యో । నారాయణగిరిం ప్రతి ।
ఆరుహ్య గజరాజం స్వం । ఇన్ద్రః సాక్షా చ్ఛచీపతిః ॥ 112

భోగిరాజగిరిం రాజన్ । సర్వభోగా ఽలయో మహాన్ ।
పౌలోమ్యా సహ పుత్రేణ । సమ్ప్రాప్త స్త్రిదశేశ్వరః ।
యథార్హం శ్రీనివాసేన । సత్కృతో నిషసాద చ ॥ 113

చతురాననునకు, తండ్రియగు శ్రీనివాసునకు పార్వతి, కుమారస్వామి ప్రమథ గణములతో గూడ నమస్కరించెను. 103

శ్రీనివాసుడు శంకరుని కౌగలించుకొని నాయనా! సుందరముఖారవిందా! నా దగ్గరగా రమ్ము. నావద్ద కూర్చుండుము ' ని 104

మాటలాడుచుండగనే మనుష్యుని వాహనముగాజేసికొని కుబేరుడు 105

పుత్రులు, భృత్యులు, భార్య, బంధువులతోగూడ వచ్చెను. అతనిని గాంచి శ్రీనివాసుడు 106

కుబేరా! సకల సంపదలతో విలసిల్లుము ' ని ఆశీర్వాదముతో సంతసింప జేయుచుండగా 107

అగ్నిహోత్రుడు భార్యలగు స్వాహాదేవి, స్వధాదేవులతో పొట్టేలుపై నధిష్ఠించి పుత్ర మిత్ర బంధుసహితుడై వేంకటాచలమునకు విచ్చేసెను. 108

అతనిని జూచినంతనే జగత్ప్రభువగు శ్రీనివాసుడు మిక్కిలి సంతసించి వెంటనే యాతనిని కౌగలించుకొని 'కూర్చుండుము కూర్చుండుము' ని చెప్పుచుండెను. 109

అనంతరము యమధర్మరాజును తన పరివారముతోను, తన భార్యతోను తన వాహనముపై నెక్కి 110

చిత్రగుప్తుడు వెంట చనుదెంచుచుండగా వేంకటాద్రి కేతెంచెను. పిమ్మట భక్తిగల వరుణుడును మొసలి వాహనముపై 111

తన భార్యతో గూడ పెక్కు రత్నములనుగొని నారాయణగిరి కేతెంచెను. శచీదేవి భర్తయగు దేవేంద్రు డైరావతముపై నధిష్ఠించి 112

శచీదేవితోను, పుత్రుడగు జయంతునితోను శేషాద్రి కరుదెంచి శ్రీనివాసునిచే నుచితరీతిని గౌరవింపబడి కూర్చుండెను. 113

ఏణం సమారుహ్యాచ భారతీయుతః । సుగన్ధయుక్తః సముపాయయౌ గిరిమ్ ।
భక్తో ఽథ వాయుః తమిమం జనార్దనః, క్షేమ శ్చ పప్రచ్ఛ తదా ముదా ఽన్వితః॥

" స్థీయతా " మితి రాజేన్ద్ర ! । హరి ర్వాయు మభాషత ।
ఏతస్మి న్నేవ కాలే తు । సమ్ప్రాప్తౌ చన్ద్రభాస్కరౌ ।
మన్మథో ఽప్యాగమ ద్భూప ! । సరతి స్తురగో పరి ॥ 115

మునయ శ్చ మహారాజ ! । సమాజగ్ము ర్మహాగిరిమ్ ।
కశ్యపో ఽత్రి ర్భరద్వాజో । వామదేవ శ్చ గౌతమః ॥ 116

విశ్వామిత్రో వసిష్ఠ శ్చ । వాల్మీకి ర్జమదగ్నిజః ।
పులస్త్య శ్చ దధీచి శ్చ । శున శ్శేఫ శ్చ గాలవః ॥ 117

గార్గ్యః కృష్ణో మహారాజ ! । సపుత్రాః సపరిగ్రహాః ।
గన్ధర్వాప్సరస శ్చైవ । సర్వే సిద్ధాః సహోరగాః ॥ 118

ఏవం మహర్షయో దేవా । రాజాన శ్చ సమాగతాః ।
వివాహార్థం సమాజగ్ముః । సర్వే సమ్ప్రమకాతరాః ॥ 119

సమాశ్వా స్యా థ గోవిన్దో । యథాయోగ్యం తథా నృప ।
" స్థీయతా " మితి చో వాచ । సర్వేషాం పురతో హరిః ॥ 120

## బ్రహ్మాజ్ఞయా విశ్వకర్మకృతపరిణయార్థ పురనిర్మాణక్రమః

తతో ఽభూ ద్వాసుదేవస్య । విశ్వకర్మా ఽక్షిగోచరః ।
త మాలోక్య హృషీకేశః । ఇన్ద్ర మాహ స్మ మన్యమాన్ ॥ 121

ఇన్ద్రా స్య గర్వబాహుళ్యం । పశ్య విశ్వకృతో ఽధునా ।
భ్రాతు ర్వాహుబలా దేష । న జానాతి హితాహితమ్ ॥ 122

యథావ్యావ పశ్యతి సురాన్ । తథా మా మపి పశ్యతి ।
సాధు కాలం సురశ్రేష్ఠ ! । త్యజై న మసమఞ్జసమ్ ॥ 123

వాయుదేవుడును భార్యతోగూడ జింకవాహనము నధిష్ఠించి పరిమళద్రవ్యము లను గొని శేషాద్రికి రాగా శ్రీనివాసు డాతని సంతోషముతో కుశలప్రశ్నల గావించి 114

కూర్చుండుమను నంతలో చంద్ర సూర్యులును, రతీదేవినిగూడి గుఱ్ఱముపై మన్మథుడు చనుదెంచిరి. 115

కశ్యపమహర్షి, అత్రిమహర్షి, భరద్వాజమహర్షి, వామదేవ, గౌతమ, 116

విశ్వామిత్ర, వసిష్ఠ, వాల్మీకి, జమదగ్ని, పులస్త్య, దధీచి, శునశ్శేప, గాలవ 117

గార్గ్య, కృష్ణద్వైపాయనాది మహర్షులును పుత్రులతో, పరిజనులతో, గంధర్వ, అప్సర, సిద్ధ, నాగులును, 118

దేవతలును, మహర్షులును, రాజులును, త్వరాన్వితులై కల్యాణమును చూచు నుత్సుకతతో విచ్చేసిరి. 119

వచ్చినవారి నందరను శ్రీనివాసు డుచితరీతిని గౌరవించి "కూర్చుండుడ" ని పలికెను. 120

## చతుర్ముఖుని యాజ్ఞచే విశ్వకర్మ కల్యాణమునకు యోగ్యమగు పట్టణమును నిర్మించుట

అంతలో శ్రీనివాసుడు విశ్వకర్మను గాంచి కోపగించి దేవేంద్రునితో _ 121

దేవేంద్రా! ఈ విశ్వకర్మ గర్వాధిక్యమును చూడుము. సోదరుడగు మయుని భుజబలము నవలోకించి మంచిచెడ్డల నెఱుంగకున్నాడు. 122

ఇతర దేవతలనువలెనే నన్నును తలంచుచున్నాడు. ఇదియు నొకమంచికే వచ్చినది లెమ్ము. ఈ దుష్టుని వదలివేయుము. 123

అన్యం శాలాకర్మరతం । శుద్ధం మద్భక్తిసంయుతమ్ ।
వియోజయ సురశ్రేష్ఠ ! । దేవతాగృహకర్మణి ॥ 124

ఇత్య ప్రియం వచః శ్రుత్వా । విశ్వకర్మా నరేశ్వర ! ।
ప్రణిపత్యా హ గోవిన్దం । వర్ధకి భయవిహ్వలః ॥ 125

వర్ధకీ —

భగవం స్త్వదభీష్టం యత్ । అజ్ఞానా న్న మయా కృతమ్ ।
క్షమస్వ మమ దౌరాత్మ్యం । భగవన్ కరుణానిధే ! ॥ 126

దేవాదిదేవ ! దేవేశ ! । స్వల్పస్య మమ కారణాత్ ।
ఇయాన్ కోపః కిమర్థం ? । తే సఞ్జాతో భగవన్ ! హరే ! ॥ 127

ఏవం సమ్ప్రార్థితః శక్రం । శ్రీనివాస ఉవాచ హ ।
సభాం కారయ దేవేన్ద్ర ! । దేవార్థం మునికారణాత్ ॥ 128

పఞ్చాశద్యోజనగణ । విశాలాం సుమనోహరామ్ ।
సువిచిత్రా ఞ్చ మహతీం । త్రింశద్యోజనమాయతామ్ ॥ 129

ఇత్యే వం శాపితః శక్రః । తేన వర్ధకినా తదా ।
కారయామాస విపులాం । విచిత్రాం మహతీం సభామ్ ॥ 130

చక్రే శక్రాఽఽజ్ఞయా తత్ర । విశ్వకర్మా మయాగ్రజః ।
అన న్తరం వాక్య మూచే । శతక్రతు మనామయమ్ ॥ 131

శ్రీ భగవాన్ —

ఆకాశరాజనగరం । శీఘ్రం గచ్ఛ శచీపతే ! ।
రాజానం పా స్త్వవచనైః । కార్యే కర్మణి బోధయ ॥ 132

తత్రాప్యేవ కర్తవ్యం । సభాగేహాది కారయ ।
వాసుదేవస్య వాక్యాని । శ్రుత్వా తస్య శచీపతిః ॥ 133

జగామ రాజనగరం । సహితో విశ్వకర్మణా ।
విస్తార్య నగరం రాజః । పరితో బహుయోజనాన్ ॥ 134

భవన నిర్మాణమున నాన క్తికలిగి సచ్చరిత్రుడై నాయందు భక్తిగల మరియొక నిని దేవగృహ నిర్మాణమునకై నియోగింపుము ' ని పలికెను. 124

ఇట్లు విస్తారముగా పలుకగా వజ్రాంగియగు విశ్వకర్మ శ్రీనివాసునికి నమస్కరించి భయభ్రాంతుడై 125

విశ్వకర్మ —

పరమాత్మా ! దయాసముద్రా ! నీ కోరిక నెఱుంగజాలక అజ్ఞానముచే పాలింప జాలకుంటిని. నా దుర్మార్గ కృత్యమును క్షమింపుము. 126

నా చిన్ని అపరాధమున కింత కోపమేల కలిగెను ? 127

ఇట్లు ప్రార్థింపగా శ్రీనివాను డింద్రునితో దేవతల కొరకును, మునీంద్రులకును

అయిదు వందల యోజనముల వైశాల్యము కలిగి మిక్కిలి సుందరమై విచిత్రమై గొప్పదై మూడువందల యోజనముల పొడవు కలిగిన సభాభవనమును నిర్మింప జేయుము ' ని యాజ్ఞాపింపగా దేవేంద్రుడు 129

విశ్వకర్మచే విశాలమై విచిత్రమగు గొప్ప సభను నిర్మింపజేసెను. 130

దేవేంద్రుని యాజ్ఞచే మయుని యన్నగారగు విశ్వకర్మ సభామందిరమును నిర్మించిన పిమ్మట శ్రీనివాసుడు దేవేంద్రుని కుశలప్రశ్నల నడిగి 131

శ్రీ భగవానుడు —

నీ వాకాశరాజ నగరమునకేగి రాజును మధుర భాషణములచే కర్తవ్యోన్ముఖునిగా జేయుము.

ఆ పట్టణమున గూడ సభామండపములను, గృహములను విశ్వకర్మచే చేయించుము ' ని యాజ్ఞాపింపగా 133

దేవేంద్రుడు విశ్వకర్మతో నేగి ఆకాశరాజ నగరమును చాల యోజనముల వరకు వ్యాపింపజేసి 134

పశ్చాద్య చ మహారాజ! । వనాని గిరి గహ్వరాన్ ।
విషమా శ్చ సమాం చక్రే । ధరాం తాం ధరణీపతే! ॥ 135

కల్యాణవేదీం పదదర్శ రత్న । సమ్పూర్ణకక్షైః సుకృతాం విచిత్రామ్ ।
స్తమ్భై ర్యుతాం మౌక్తికరత్ననిర్మితైః । నారాయణస్యై వ నృపేణ నిర్మితామ్॥

వాసుదేవస్య భవనం । వాసవో విశ్వకర్మణా ।
కారయామాస రాజేన్ద్ర! । సరత్న స్తమ్భగోపురమ్ ।
ధనధాన్యసమాకీర్ణం । రత్నతోరణ మణ్డితమ్ ॥ 137

[illegible]పశతం వాజి । గజానాం భవనం తథా ।
వాసవే తు గతే రాజన్! । వాసుదేవో ఒవద త్సురాన్ ॥ 138

## దేవాదికృత పరిణయార్ధ భగవత్ప్రార్థనాభ్యుపగమః

శ్రీ భగవాన్ —

ఆకాశరాజస్య సుతా ఒస్తి యా సురాః! । ఇచ్ఛామి కర్తుం కిల తత్కరగ్రహమ్।
అఙ్గీకృతం చే ద్భవదీయమణ్డలైః । అఙ్గీకరో మ్యద్య తు రాజకన్యకామ్॥ 139

వాసుదేవవచః శ్రుత్వా । వాసుదేవాత్మజాదికాః ।
వాక్య మాహు ర్మహారాజ! । వాసుదేవ పరాయణాః ॥ 140

బ్రహ్మాదిదేవాః —

వయ స్త్వ దాసభావేన । తిష్ఠామః పురుషోత్తమ!
త్వత్ప్రసాదా ద్వయం సర్వే । పశ్యామో ఒత్ర మహోత్సవమ్ ॥ 141

శఙ్కరః —

వినోదభవనం కృష్ణ! । భాషసే ప్రాకృతో యథా ।
మనన స్తే ప్రశస్తం చేత్ । క్రియతా మితి చాబ్రవీత్ ॥ 142

శఙ్కరస్య వచః శ్రుత్వా । ప్రశశంస హసన్ హరిః ।
తత శ్చతుర్ముఖః ప్రాహ । శేషాచలపతిం ప్రతి ॥ 143

వనములను కొండగుహలను ఛేదించి భూమినంతను ఎత్తు పల్లములు లేకుండ సమముగా జేసెను. 135

రత్నములతో నిండిన వాకిళులు కలిగి, విచిత్రమై, ముత్యములు రత్నములచే నిర్మింపబడిన స్తంభములు కలిగి రాజుచే నిర్మింపబడిన నారాయణుని కల్యాణవేదికను గాంచెను. 136

దేవేంద్రుడును విశ్వకర్మచే రత్నములచే కూర్పబడిన స్తంభములు, గోపురము కలిగి ధనధాన్యములతో నిండి, రత్నతోరణములచే నలంకరింపబడిన గృహమును శ్రీనివాసుని విశ్రాంతి భవనముగా నిర్మించెను. 137

నూర్లకొలది దిగుడు బావులను, గుఱ్ఱములకును, ఏనుగులకు భవనములను నిర్మింపజేసెను. దేవేంద్రు డాతనికి వెళ్ళినంతనే శ్రీనివాసుడు దేవతలతో నిట్లు పలికెను.

## దేవతలు శ్రీనివాసుని పరిణయమునకై అంగీకరించుట

శ్రీ భగవానుడు —

దేవతలారా ! ఆకాశరాజ కుమార్తెను పరిణయమాడ సంకల్పించితిని. తామందర కంగీకారమైనచో నిపుడే యా రాజపుత్రి నంగీకరింతున ' ని 139

పలుకగా శ్రీమన్నారాయణునియందు భక్త్యతిశయముగల బ్రహ్మాదులందరును 140

బ్రహ్మాదులు —

పురుషోత్తమా ! మేమందరము నీ దాసులము. నీ యనుగ్రహముచే నిట్టి మహోత్సవమును దర్శింపగలము ' నిరి. 141

శంకరుడు —

కృష్ణా! సాధారణమానవునివలె పరిహాసపు మాటల నేలనాడెదవు? నీ మనస్సునకు తగినదని తోచినచో పరిణమాడుము ' ని తెలుపగా 142

శంకరుని మాటలకు శ్రీనివాసుడు నవ్వుచు పొగడెను. అంత చతురాననుడు శ్రీనివాసునితో — 1

బ్రహ్మ —

సర్వజ్ఞ ! స్త్వం దయాసార ! సత్యసఙ్కల్పవా నసి ।
అష్టవర్గం తతః కార్యం । వివాహా త్పూర్వ మేవ హి ॥ 144

తస్మా దాజ్ఞాం దేహి మమ । పుణ్యాహే పురుషోత్తమ ! ।
స పుత్రవచనం శ్రుత్వా । వసిష్ఠం ముని మానయత్ ॥ 145

వసిష్ఠాదీన్ ప్రతి భగవత్కృత వివాహకార్య నియోజన ప్రకారః

వసిష్ఠ ఞ్చ మహాభాగం । పౌరోహిత్యే న్యయోజయత్ ।
యజుశ్శాఖా మహామన్త్రైః । కర్తవ్యం స్వస్తివాచనమ్ ॥ 146

సర్వేషా మపి దేవానాం । యజమానో భవాని తి
దేవానా ఞ్చ ఋషీణా ఞ్చ । మాననే శఙ్కరం వ్యధాత్ ॥ 147

దేవా ఒహ్వానే కుమార స్తు । ప్రత్యుత్థానే చ మన్మథమ్ ।
దత్వా తేషాం వీటికా స్తు । కృష్ణవర్త్మాన మాహ్వాయత్ ॥ 148

గృహాణ త్వం వీటికాంచ । పాకార్థం హవ్యవాహన !
ఋషీణాం సర్వదేవానాం । తవ పాక స్తు సమ్మతః ॥ 149

తస్మాత్ పాకం కురుష్వ త్వం । స్వధా స్వాహా సమన్వితః ।
ఇతి శిష్టో యజ్ఞమూర్తిః । "తథా ఒస్త్వి" త్యబ్రవీ ద్ధరిమ్ ॥ 150

తతః స ప్రాహ వరుణం । జలార్థం సర్వదేహినామ్ ।
దుష్టానాం దణ్డనే రాజన్ । శిష్టానాం పరిపాలనే ॥ 151

యమం స కల్పయామాస । సుగన్ధే వాయు మాదిశత్ ।
ధనదానే బ్రాహ్మణార్థే । వస్త్రాలఙ్కారదాపనే ॥ 152

కుబేరం యోజయామాస । భగవాన్ నృపసత్తమ !
ప్రదీపధారణే రాజన్ । నిశాకర మయోజయత్ ॥ 153

వసూన్ సన్దేశయామాస । భాణ్డానాం శుద్ధికారణాత్ ।
గ్రహాం శ్చ ద్రోణపాత్రేషు । న్యయోజయ దరిన్దమ ! ॥ 154

బ్రహ్మ —

కరుణానిధే ! నీవు సర్వము నెఱింగినవాడవు. సత్యసంకల్పము కలవాడవు. వివాహమునకు ముందుగనే చేయవలెనుకదా ! 144

కావున పుణ్యాహవచనము నాచరించుటకు నా కనుజ్ఞ నిమ్ము ' ని యడిగినంతనే శ్రీనివాసుడు వసిష్ఠుని రావించి 145

## వసిష్ఠాదులను శ్రీనివాసుడు వివాహ కృత్యములయందు నియోగించుట

యాతనిని పురోహితకృత్యమున నియమించి యజుర్వేద మహామంత్రములచే స్వస్తివాచనమును (పుణ్యాహవచనమును) చేయింపుము. 146

నీవు దేవతలందరకును యజమానుడవ ' ని తెలిపెను. శంకరుని దేవతలను ఋషులను గౌరవించుటలో నియమించెను. 147

కుమారస్వామిని దేవతల నాహ్వానించుటకును, మన్మథుని వచ్చినవారికెదురేగి గారవించుటకును వినియోగించి తాంబూలముల నొసంగి అగ్నిహోత్రుని పిలిపించెను. 148

అగ్నిహోత్రునితో ఋషులకును, దేవతలకును నీ వంటచేసిన మిక్కిలి యభిమతము గాన 149

నీవు నీ భార్యలగు స్వధాదేవి, స్వాహాదేవులతో వంట నొనరింపుమని తాంబూలము నొసంగగా యగ్నిహోత్రు డట్లేయొనర్తునని యంగీకరించెను. 150

వరుణుని ప్రాణులందరకును జలము నొసంగుటకును, దుష్టులను శిక్షించి సజ్జనులను రక్షించుటకు 151

యమధర్మరాజును. పరిమళద్రవ్యముల సమకూర్చుటకై వాయువును, బ్రాహ్మణులకు ధనమును, వస్త్రములను, భూషణముల నొసంగుటకు 152

కుబేరుని దీపములను గ్రహించుటకు, చంద్రుని 153

వంటసామగ్రులను శుద్ధిచేయుటకు వస్తువులను. నీళ్ళపాత్రలను శుద్ధిచేయుటకు నవగ్రహములను వినియోగించెను. 154

ఏవం సంశాసితా స్సర్వే । పురాణ పురుషేణ చ
ఆజ్ఞా మాదాయ తే ఽభూవన్ । సర్వే స్వస్థాః స్వకర్మసు ॥ 155

తతో వాక్య మువాచే దం । బ్రహ్మా లోకపితామహః ।

బ్రహ్మా —

మజ్జనం కురు గోవిన్ద ! । మఙ్గళం మధుసూదన ! ॥ 156

పుణ్యాహ పూర్వకర్మాణి । స్వేష్టదేవ ప్రపూజనమ్ ।
కులదేవ ప్రతిష్ఠా చ్చ । సాఙ్గం కురు రమాపతే ॥ 157

## వివాహార్థం కరవీరపురా ద్రమాహ్వానమ్

స పుత్రవచనం శ్రుత్వా । సస్మార జగదీశ్వరః ।
రమాం రాజీవనయనాం । కరవీరపురాలయామ్ ॥ 158

మత్వా వియోగినీం రాజన్ ! । దుఃఖితః సురసత్తమః ।
రురోద లోకరీత్యై వ । భగవాన్ లౌకికై స్సమః ॥ 159

న శోభతే సభా దివ్యా । తయా విరహితా సుత ! ।
భవా నహం మహాప్రాజ్ఞ ! । దేవా శ్చ సపరిగ్రహాః ॥ 160

న శోభన్తే యథా ఽఽకాశే । తారా స్తారాపతిం వినా ।
అపాదపం యథా ఽరణ్యం । అపక్షా శ్చ విహంగమాః ॥ 161

అఫలా శ్చ యథా వృక్షాః । అధనాః సుహృదో యథా ।
తథా వయం మహాప్రాజ్ఞ ! రహితా రమయా తయా ॥ 162

వాసుదేవవచః శ్రుత్వా । వాసుదేవ మభాషత ।
శఙ్కరః పృథివీపాల ! । సము త్తిష్ఠన్ మహాభుజః ॥ 163

శఙ్కరః —

కిమర్థం రోదనం తాత । కిం తే కార్యం విడమ్బనమ్ ।
అపట్టహ్యా ప్రమేయస్య । చా క్రూరవరదస్య చ ॥ 164

ఇట్లు నియోగింపబడి దేవతలందరును తమ తమ పనులయందు జాగరూకతలో నుండిరి. 155

తదనంతరము జగత్తునకంతకును తాతయగు బ్రహ్మ శ్రీనివాసుని మంగళ స్నానమొనరించి 156

పుణ్యాహవచనముకంటె ముందు మీ యిష్టదేవతలను పూజించుట, కులదేవతలను ప్రతిష్ఠించుట మొదలగు విధులను యథావిధిగా నిర్వర్తింపుమని తెలిపెను. 157

## వివాహమునకై కరవీరపురమునుండి శ్రీ రమాదేవిని పిలపించుట

అంత శ్రీనివాసుడు చతురాననుని పలుకులను విని కరవీరపురమున నివసించు పద్మపత్రనేత్రయగు రమాదేవిని తలంచి 158

తన వియోగముచే దుఃఖించుచుండునుకదా యని చింతించి సాధారణ మానవుని వలె ప్రపంచరీతి ననుసరించి గట్టిగా విలపించెను. 159

చతురాననా ! శ్రీ రమాదేవి లేకుండుటచే నీవు, నేను, పరివారసహితులైన దేవతలును ఉన్నప్పటికిని యీ సభాభవనము శోభించుటలేదు. 160

చంద్రుడులేని నక్షత్రము లాకాశమున వెల వెల బోవునట్లును, వృక్షములులేని యరణ్యము శోభిల్లనట్లును, తెక్కలులేని పక్షులు దీనముగా తోచునట్లును 161

పండ్లులేని వృక్షములు కాంతి తరిగియుండునట్లును, ధనములేని స్నేహితు లుపయోగించనట్లును మనము కాంతిహీనులమైయున్నాము. 162

అని వాపోవుచుండగా ఆజానుబాహువగు శంకరుడులేచి 163

శంకరుడు ——

శ్రీనివాసా ! మీరిట్లేడ్చుటతగునా ? నీవు సాధారణ మానవుల ననుకరించుచున్నావుకదా ! విషయాసక్తిలేనివాడవు. వేదములచేనైనను తెలియశక్యముకానివాడవు. సజ్జనులకు వరముల నొసగినవాడవు. 164

అన్వేషకస్య దేవేశ ! । కిమర్థం రోదనం వృథా ।
స చ తద్వచనం శ్రుత్వా । నీలకణ్ఠ మభాషత ॥ 165

శ్రీ భగవాన్ —

త్వం న జానాసి భోః శమ్భో ! బాలభావేన పౌత్రక ।
యదా బ్రహ్మ ఉవసానే చ । న కిఞ్చిదవశిష్యతే ॥ 166

తదా క్షీరోదకే శమ్భో । నిరాలమ్బే నిరాశ్రయే ।
సా మే శయ్యా సఖీభూత్వా । క్రీడతే హితకారిణీ ॥ 167

ఏతాదృశీం వినా శమ్భో । మమ సౌఖ్యం కథం భవేత్ ।
వదత్యే వం జగన్నాథే । వేధా వాక్య మభాషత ॥ 168

బ్రహ్మ —

నో క్తం త్వయే దం గోవిన్ద ! । పూర్వ మేవ జనార్దన ! ।
అద్య మాం కమలానన్ద ! । రమా ఽఽహ్వానే నియోజయ ॥ 169

భగవదుక్త్యా రమానయనాయ కరవీరపురం ప్రతి సూర్యగమనమ్

సో ఽపి పుత్రవచః శ్రుత్వా । ద్యుమణిం శీఘ్ర మాహ్వయన్ ।
షణ్ముఖేన మహారాజ ! । సో ఽపి తత్ర సమాగతః ॥ 170

ననామ భక్త్యా స్తుత్వా ఽథ । ప్రాఞ్జలిః సమ్ముఖే స్థితః ।
భాస్కరం భక్తినమ్రాఙ్గం । భగవా నాహ హృద్గతమ్ ॥ 171

శ్రీ భగవాన్ —

శృగాలవాసుదేవస్య । నగరం గచ్ఛ భానుమన్ ।
తత్రా ఽస్తే జగతాం మాతా । తా మానయ మమా న్తికమ్ ॥ 172

భారతీం వాసుదేవస్య । శ్రుత్వా పౌత్రో దివాకరః ।
వినయేన సమాయుక్తః । శిరసా ఽఽనమ్య చావదత్ ॥ 173

భానుః —

కథం తాం లోకజననీం । ఆనయిష్యే తవా న్తికమ్ ।
త న్మమాచక్ష్వ గోవిన్ద ! । కథం మాం విశ్వసే ద్రమా ॥ 174

దుఃఖముల నెఱుంగని నీవు విలపింపుట తగునా? అని యడుగగా శ్రీనివాసుడు — 165

శ్రీ భగవానుడు —

శంకరా! నీవు బాలుడవగుటచే నేమియు నెఱుంగవు. బ్రహ్మ ఆయుర్దాయము ముగిసిన పిమ్మట ప్రపంచమున నేదియు మిగిలియుండదు. 166

అట్టి ఆధారరహితమై తోడెవ్వరునులేని సమయమున పాలకడలిలో శ్రీదేవియే నాకు పడక తోడుగను హితమొనర్చునదిగ నుండి నాతో రమించును. 167

అట్టి శ్రీదేవి లేక నాకు సౌఖ్యమెట్లు కలుగును? అని చెప్పుచుండగనే చతుర్ముఖుడు 168

బ్రహ్మ —

శ్రీనివాసా! ఈ వృత్తాంతమును ముందుగనే నాతో నేల చెప్పవైతివి? నీ వాజ్ఞాపించినచో రమాదేవి నాహ్వానించుటకు నేను పోయివచ్చెదన' ని పలుకగా 169

## భగవదాజ్ఞచే రమాదేవిని తోడ్తెచ్చుటకు కరవీరపురమునకు సూర్యుడేగుట

బ్రహ్మ మాటలనాలించి శ్రీనివాసుడు కుమారస్వామిచే సూర్యుని పిలిపించెను. సూర్యుడేతెంచి 170

భక్తితో నమస్కరించి స్తుతించి చేతుల జోడించి నిలువగా నాతనితో శ్రీని వాసుడు తన మనమునందలి సంకల్పము నిట్లు తెల్పెను. 171

శ్రీ భగవానుడు —

సూర్యా! శృగాలవాసుదేవుని నగరమునకు జని అచ్చట నివసించుచున్న లోకజననియగు రమాదేవిని తోడ్కొనిరమ్ము. 172

అని తెలుపగనే సూర్యుడు శ్రీనివాసునకు శిరస్సుతో నమస్కరించి సవినయముగా 173

శ్రీనివాసా! లోకమాతయగు రమాదేవిని నేనెట్లు తోడ్కొని వత్తును? ఆమె నన్నెట్లు విశ్వసించున' ని యడుగగా 174

శ్రీ భగవాన్ —

అస్తి తస్యాః త్వయి స్నేహః । సదా లోకమహోదయే ।
త్వ దాగమనసంహృష్టా । సమాయాతి మమా న్తికమ్ ॥ 175

ఉపాయం ప్రవదిష్యామి । తథాగమనకర్మణి ।
అశ్రుముఞ్చన్ అపమృజన్ । తద్ద్వారి కురు సంస్థితిమ్ ॥ 176

త్వాం తు దృష్ట్వా జగన్మాతా । సా న్త్వయిష్యతి భానుమన్ ! ।
ఏవం వద న్తీ వాక్యం త్వాం । కిఞ్చి ద్దుఃఖసమాకులా ॥ 177

" శాసనం తే హృతం కేన । ధరణ్యాం కథ్యతా " మితి ।
తం సమాచక్ష్వ తాం దేవీం । ఇత్థ మత్య న్తదుఃఖితః ॥ 178

న శాసనం హృతం మే ఽద్య । మాతః ! కేనా పి భూతలే ।
శయనస్తు కృతం తేన । తవ భర్త్రా ఽద్య భూతలే ॥ 179

యేన వై శాసనం దత్తం । మాత ర్మే కృపయే దృశమ్ ।
విశ్చేతనో ఽద్య పతితో । భర్తా జీవతి తే న వా ॥ 180

భర్తా తవ జగన్నాథ । స్త్వశక్తో ఽద్య విభాతి మే ।
" కదా ద్రక్ష్యామి దేవీం తాం । ఇత్యా స్తే ప్రలప న్నితి " ॥ 181

సా తద్వచన మాకర్ణ్య । సమాయాతి న సంశయః ।
ఉపాయ స్తు తతః శ్రుత్వా । కిఞ్చిద్ధాస్యముఖామ్బుజః ॥ 182

బభాషే భ క్తి నమ్రాఙ్గో । భయభ క్తిసమన్వితః ।
సర్వజ్ఞా సర్వలోకేషు । విశ్రుతా కమలాఽలయా ॥ 183

జానాతి హృద్గతం సర్వం । కథం మాం విశ్వసే ద్విభో ! ।
అరోగస్య చ రోగం హి । కథం వక్ష్యామి తే హరే ! ॥ 184

న భాను ర్వచనం శ్రుత్వా । భాను మాహ మనోగతమ్ ।

శ్రీ భగవాన్ —

మన్మాయయా మోహితా సా । భవిష్యతి న సంశయః ॥ 185

శ్రీ భగవానుడు —

శ్రీనివాసుడు. లోకములకు కాంతినొసంగు నీ యందామెకు స్నేహభావమున్నది. నీవు వెళ్లినంతనే సంతసించి నీ వెంట నావద్దకు రాగలదు. 175

ఆమె వచ్చుట కొరకు ఉపాయమును చెప్పెదను, వినుము. నీ వామె నివసించు గృహమునకేగి ద్వారములో కన్నీరు విడచుచు తుడుచుకొనుచు నిలచియుండుము. 176

లోకమాత నిన్నుగాంచి కొంచెము దుఃఖించుచు, నిన్నోదార్చుటకై 177

"భూలోకమున నీ యాజ్ఞ నెవరుల్లంఘించిరి' ని యడుగును. అపుడు నీవు మిక్కిలి దుఃఖించుచు యామెతో 178

"అమ్మా ! భూలోకమున నా శాసనము నెవరును అపహరింపలేదు. నీ భర్త నేడు భూమిపై పరుండియున్నాడు. 179

నాకు దయతో శాసనమొసంగిన నీ భర్త నేడు భూమిపై చైతన్యములేక పరుండియున్నాడు. జీవించియుండునో లేదో తెలియకున్నది. 180

నీ భర్తయగు శ్రీనివాసుడు బాల దుర్భరుడై యున్నాడు. ఆ లక్ష్మీదేవి నెపుడు చూచెదనో యని పలవరించుచున్నాడ'ని 181

తెలిపిన వెంటనే యామె వచ్చి వేయును. శందియము లేదని శ్రీనివాసుడు తెలిపినంతనే సూర్యుడా యుపాయమును విని మందహాస వదనారవిందుడై 182

అత్యంత భక్తియుక్తుడై భయముతో "శ్రీనివాసా ! పద్మనివాసినియగు శ్రీదేవి సకలము నెఱుంగునని ముల్లోకములయందు ప్రసిద్ధి కెక్కినది 183

అందరి మనస్సులయందలి విషయముల నెఱుంగజాలిన లక్ష్మి నన్నెట్లు నమ్మగలదు. ఆరోగ్యవంతుడవగు నిన్నునారోగ్యవంతుడవని ఎట్లు చెప్పుదును ? 184

అని యిట్లు సూర్యుడు పలికినంతనే యాతని యభిప్రాయము నెఱింగి శ్రీనివాసుడు "శ్రీదేవి నా మాయచే మోహింపజేయ బడగలదు. సందియము లేద'ని ధైర్యము చెప్పగా — 185

ఇత్యుక్తః ప్రణిపత్యాథ । వాసుదేవం రథే స్థితః ।
కరవీరపురం గత్వా । యథోక్తం త త్తథాఽకరోత్ ॥ 186

## కరవీరపురా చ్ఛేషాచలం ప్రతి రమాఽఽగమనమ్

సా తద్వచన మాకర్ణ్య । యథాఽఽదేశం తథా రమా ।
రథ మారుహ్య ఖేదేన । భానువాక్యాదరేణ సా ॥ 187

సమ్ప్రాప్తా వాయువేగేన । రవియుక్తా రమా పతిమ్ ।
తదాగమనవార్తాజ్ఞ । శ్రుత్వా తస్మిన్ క్షణే హరిః ॥ 188

జగామ దర్శనాపేక్షీ । హ్యాశక్త ఇవ సమ్ముఖమ్ ।
తాదృశీ మాకృతిం ప్రాప్య । తదద్భుత మివాకరోత్ ॥ 189

దేవానాం పూర్వదేవానాం । మునీనా మూర్ధ్వరేతసామ్ ।
భుజే భుజఙ్గభూషస్య । వామం సంస్థాప్య వై భుజమ్ ॥ 190

తథాఽపరం బ్రహ్మ కణ్ఠే । విధాయాగా ద్భుజం స్వభూః ।
ఏవం భూతం శ్రీనివాసం । దదర్శ కమలాలయా ॥ 191

రథా దుత్తీర్య వేగేన । కిఞ్చి ద్ధాస్యముఖామ్బుజా ।
చామ్పకం పుష్పనిచయం । వికీర్య పదపఙ్కజే ॥ 192

సమాలిఙ్గ్య తిభక్త్యైవ । ముహూర్తద్వయ మాస్థితా ।
తదాలిఙ్గనమాత్రేణ । పుష్టాఙ్గో విష్టరశ్రవాః ॥ 193

కుశలం పరిపప్రచ్ఛ । తస్యాః సాఽపి హరే స్తదా ।
పితరౌ సర్వలోకానాం । రమానారాయణౌ శుభౌ ॥ 194

సమ్ప్రాప్తౌ స్వస్థతాం రాజన్ । సర్వదేవనమస్కృతౌ ।

## రమాయై శ్రీనివాసకథితపద్మావతీపరిణయోదన్తః

మాం మోహయతి గోవిన్దః । తవ మాయా దురత్యయా ॥ 195

సూర్యుడు శ్రీనివాసునకు నమస్కరించి రథముపై నాసీనుడై కరవీరపురమున కేగి శ్రీనివాసుడు చెప్పినట్లే చేసెను. 186

## కరవీరపురమునుండి లక్ష్మి వేంకటాచలమునకు విచ్చేయుట

లక్ష్మియు భాస్కరుని మాటలను విని యాతని మాటలయందుగల గౌరవముతో దుఃఖించుచు రథముపై నధివసించి 187

వాయువువంటి వేగముతో శ్రీనివాసుని సన్నిధానమున కేతెంచెను. ఆమె వచ్చుచున్న వృత్తాంతమును విని వెంటనే 188

శ్రీ దేవిని జూచు వేడ్కతో దుర్వాసునివలె రూపుదాల్చి ఎదురుగా నరు దెంచెను. 189

దేవతలకును, రాక్షసులకును జితేంద్రియులగు మునీంద్రులకు నా యాకార మత్యంతాశ్చర్యకరముగా నుండెను. పన్నగభూషణుడగు నీశ్వరుని భుజముపై యెడమ చేతిని వైచుకొని 190

మరియొక చేతిని బ్రహ్మమెడమై యుంచి వారి యిరువురి మాతగాగొని యాపె కెదురేగెను. అట్టి శ్రీనివాసుని గాంచి 191

మందహాస వదనారవిందయై రథమునుండి దిగి సంపంగి పుష్పములను శ్రీనివాసుని పాదపద్మములయందు జల్లి 192

భక్తితో నాతని నాలింగన మొనర్చుకొని రెండు క్షణములట్లే నిలచెను. ఆమె కౌగలింతచే బిలసిన యవయవములు కలవాడై శ్రీనివాసు 193

డామెను కుశల ప్రశ్న లొనర్చెను. ఆమెయు శ్రీనివాసుని కుశలము నారసెను. ఇట్లు సకల లోకములకు తలిదండ్రులైనట్టియు సకల దేవతలచే నమస్కరింపబడు లక్ష్మీ నారాయణు లిరువురును స్వస్థచిత్తులైరి. 194

## లక్ష్మీదేవితో శ్రీనివాసుడు పద్మావతిని వివాహమాడుచున్న వార్త నెఱింగించుట

గోవిందా! నీ మాయ నన్ను మోహపెట్టుచున్నది. నీ మాయ దాటరానిది. 195

భాసనా మయి గోవిన్ద! । కర్మ చిత్రం త్వయా కృతమ్ ।
త్వన్మాయా మోహితా స్సర్వే । బ్రహ్మేశానాదయ స్సురాః ॥ 196

యదా ఽఽదేశం వాసుదేవ । మమా ద్యా ఽహ్వానకారణమ్ ।
ప రమావచనం శ్రుత్వా । సాక్ష్వీ మాహ మహీపతే! ॥ 197

శ్రీనివాసః —

త్వయా రామావతారే తు । కథితం స్మర భామిని! ।
వేదవత్యా వివాహస్య । సంప్రాప్తః కల ఏష వై ॥ 198

త్వత్సన్నిధౌ వోఽఘ మేనాం । కామయే ఽహం కలౌయుగే ।
వదత్యే వం హృషీకేశే । సా ఽస్మరత్ పూర్వికాం గిరమ్ ॥ 199

శ్రీ రమా —

తా మఙ్గీకురు గోవిన్ద! । వివాహే విధిపూర్వకమ్ ।
ఇతి మే వచనం కృష్ణ! । సఫలం కురు వత్సల! ॥ 200

ఇత్యు క్త్వా శ్రీనివాసం సా । ననామ చ ముదాన్వితా ।
హరి స్తు లోకజననీం । అనన్దయదుదారధీః ॥ 201

స రమాగిర మాకర్ణ్య । పరిపూర్ణమనోరథః ।
పరమానన్దసమ్పూర్ణః । ఉరగాద్రౌ వ్యరాజత ॥ 202

సన్తోషసంసూచకసర్వగాత్రః । ఆనన్దబాష్పేణ సమృద్ధనేత్రః ।
బ్రహ్మాదిదేవై ర్నుతపద్పవిత్రః । తదా బభౌ వేఙ్కటశైలమిత్రః ॥ 203

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే శ్రీనివాసస్య వేదవతీవివాహాయ విమలాద్యాగమనం నామ దశమోఽధ్యాయః

భాస్కరునిచే నా విషయమున నెంత యద్భుతకృత్యము నొనరింప జేసితివి ?
బ్రహ్మరుద్రాది దేవతలందరును నీ మాయచే మోహింపజేయబడిన వారే కదా ! 196

స్వామీ ! నన్ను పిలిపించుటకుగల కారణమును తెలుపుడు. ఆజ్ఞాపింపుడ'ని
శ్రీ దేవి విన్నవించినంతనే శ్రీనివాసుడు 197

లక్ష్మీదేవితో — లక్ష్మీ ! నాతో నీవు రామావతారమున చెప్పిన సంగతిని
తలంచుకొనుము. వేదవతి వివాహ సమయ మేతెంచినది. 198

ఈ కలియుగమున నీ సమక్షముననే పద్మావతిని వివాహమాడ గోరుచున్నాను.
ఇట్లు శ్రీనివాసుడు చెప్పుచుండగనే శ్రీదేవి 199

"శ్రీనివాసా ! వేదవతిని యథాశాస్త్రముగా పరిణయమాడుము"ని తాను మున్ను
పలికిన మాటను తలంచి 'తప్పక నా మాటను సఫలపరచు'మని ప్రార్థించుచు 200

సంతోషముతో శ్రీనివాసునికి నమస్కరించెను. శ్రీమన్నారాయణుడు లోకమాత
యగు శ్రీ దేవిని సంతోషచిత్తుడై ఆనందపరచెను. 201

మరియు శ్రీదేవిసూక్తులచే తన మనోరథ మీడేరగా నమితానందము
నందుచు 202

శరీరము నందంతటను సంతసమును సూచించుచు పులకరించుచుండగా,
కనులయం దానందబాష్పములు చిప్పిలుచుండ, బ్రహ్మాది దేవతలు తన చరితమును
స్తుతించుచుండ వేంకటాచలము ప్రీతితో నివసించెను. 203

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున శ్రీనివాసునకు వేదవతితో
జరుగు వివాహ మహోత్సవమునకై బంధువులు, లక్ష్మీదేవి విచ్చేయుట యనెడు
పదియవ అధ్యాయము సంపూర్ణము

---

# అథ ఏకాదశో ఽధ్యాయః

## భగవతః పద్మాదికారితపరిణయార్హమఙ్గళాభిషేకక్రమః

జనకః —

తతః కిమకరోత్కృష్ణః । శ్రీనివాస స్సతాంగతిః ।
త న్మమాచక్ష్వ భగవన్ ! । విస్తరేణ మహామునే ! ॥ 1

శతానన్దః —

శ్రీలక్ష్మీసహిత శ్శ్రీమాన్ । శ్రీనివాసః పితామహమ్ ।
అబ్రవీ త్ప్రీతమనసా । ప్రయుఞ్జానః ప్రయోజనే ॥ 2

శ్రీనివాసః —

కర్మాణి పుత్ర ! కార్యాణి । కురు శీఘ్ర మతన్ద్రితః ।
స తద్వచన మాకర్ణ్య । ససన్తోషః పితామహః ॥ 3

కటాహభాణ్డనిచయం । ఆనేతుం ప్రేషయ త్సురాన్ ।
గరుడప్రముఖాన్ వీరాన్ । నారాయణపరాయణాన్ ॥ 4

తే తస్య వచనం శ్రుత్వా । క్షణేన గరుడాదయః ।
కటాహాదీన్ గృహీత్వా ఽథ । సమాజగ్ము రనేకథా ॥ 5

ఆపూరయ త్తత స్తేషు । స వాయుస్సలిలాధిపః ।
సుగన్ధం తోయనిచయం । దివ్యతీర్థోద్భవం శుభమ్ ॥ 6

తత స్సర్వా స్సువాసిన్యః । వస్త్రాలఙ్కారమణ్డితాః ।
అరున్ధతీ పురస్కృత్య । కృతమఙ్గళకౌతుకాః ॥ 7

సదీపకలశాన్ రాజన్ । పార్వతీప్రముఖాః స్త్రియః ।
చక్రుః సమస్తా న్మాఙ్గల్యాన్ । స సావిత్రీపురోగమాః ॥ 8

# పదునొకండవ అధ్యాయము

## శ్రీనివాసునకు పద్మావతి మున్నగువారు వివాహమునకు తగిన మంగళ స్నానాది క్రమమును వర్ణించుట

అని యిట్లు శతానందుడు తెలుపగా జనక మహారాజు — "మునిసత్తమా! సత్పురుషులకు శరణ్యుడగు శ్రీనివాసు డేమిచేసెనో విస్తారముగా నా కెఱింగింపుము"అని యడిగెను.

శతానందుడు —.

అంత శతానందుడు చెప్పుటకు ప్రారంభించెను. అంత శ్రీ దేవీ సమేతుడగు శ్రీనివాసుడు చతుర్ముఖుని తన కల్యాణ కార్యకలాపములను సన్నద్ధపరచుటకై నియోగించుచు మనమున సంతసించుచు 2

శ్రీనివాసుడు —

"నాయనా! నీవు శీఘ్రముగా కల్యాణమునకు వలయు కృత్యములను జాగరూకుడవై యొనరింపుము"అని యానతిచ్చెను. 3

ఆజ్ఞను విని కమలాసనుడు మిక్కిలి సంతసించి శ్రీనివాసునియందు భక్తియుక్తులగు దేవతలను గరుడుడు మున్నగు వీరులను మృణ్మయాది మూకుడు మొదలగు భాండవిశేషములను కొనితెచ్చుటకై పంపించెను. 4

వారందరును బ్రహ్మదేవుని యాజ్ఞప్రకారము క్షణములో అనేకరకములైన పాత్రలను తీసికొని వచ్చిరి. 5

వాటియందు వాయువు వరుణుడును దివ్యతీర్థములయందలి సుగంధమును దివ్యతీర్థమును నింపిరి. 6

అనంతరము సుమంగళులగు స్త్రీలందరును వస్త్రములను భూషణముల నలంకరించుకొని అరుంధతిని ముందిడుకొని మంగళార్థమగు పనులను సమకూర్చుకొనిరి. 7

పార్వతి మొదలగు స్త్రీలు దీపములనుంచిన కలశములను తదితర సన్మంగళముల నొనరించిరి సావిత్రి మొదలగువారు మంగళగీతములను పాడుచుండిరి. 8

గాయన్త్యః శుభగానాని । నిరాతఙ్కకృతం తదా ।
కృష్ణావతారవిభవం । గాయన్త్య శ్చ మరాఙ్గనాః ॥ 9

సిద్ధాఙ్గనా శ్చ రాజేన్ద్ర । తస్థు ర్వైఖానసాఙ్గనాః ।
ఏవం ప్రవృత్తే పుణ్యే ఽస్మిన్ । వివాహే వేఙ్కటేశితుః ॥ 10

స్నుషా శ్చ వాసుదేవస్య । జహసు శ్చారులోచనాః ।
శ్వశ్రూ శ్చ పురతః కృత్వా । మాతరం వకుళాం హరేః ॥ 11

ఏవం మహోత్సవ స్తత్ర । సమభూ త్సప్తమీదినే ।
చతుర్దిక్షుచసంస్థాప్య । కలశాన్ జలపూరితాన్ ॥ 12

సూత్రేణ వేష్టయిత్వాతు । తన్మధ్యే రత్నపీఠకమ్ ।
సంస్థాప్య సమ్భ్రమై ర్యుక్తాః । ఇద మాహుః సురాఙ్గనాః ॥ 13

ఉత్తిష్ఠ పురుషశ్రేష్ఠ ! । తిష్ఠ త్వం సూత్రమణ్డలే ।
స ఇత్థ ముక్తో భగవాన్ యోషితాం పురతో హరిః ॥ 14

ప్రోవాచ దీనవదనః । ప్రస్రవన్నేత్రజం జలమ్ ।
పితామహ మహాప్రాజ్ఞ । వివాహవిభవే మమ ॥ 15

కః కరోత్య భిషేక స్తు । తైలేనా శీః క్రమేణ వై ।
యస్య నాస్తి మహారాజ ! । మాతా వా ఽపి పితా తథా ॥ 16

వివాహే చ వివర్తే చ । తస్య ధి గ్జన్మ జీవనమ్ ।
భగిన్యో భ్రాతర శ్చైవం । మాతులా భాగినేయకాః ॥ 17

న మే సన్తి మహాప్రాజ్ఞ ! । కః కరోత్య భిషేచనమ్ ।
మాతాపితృవిహీనానాం । కా గతి ర్వై భవిష్యతి ॥ 18

న చ మాతృసమం మిత్రం । జనకేన సమం సుఖమ్ ।
న భార్యాసదృశం భాగ్యం । న పుత్రేణ సమా గతిః ॥ 19

న హి బ్రాహ్మణసమో బన్ధుః । న విష్ణో ర్దేవతా పరా ।
ఇతి సఞ్చిన్త్య గోవిన్దో । లీలామానుషవిగ్రహః ॥ 20

దేవతాస్త్రీలును, సిద్ధుల భార్యలును వైఖానస స్త్రీలును నిర్విఘ్నముగా జరిగిన శ్రీకృష్ణావతార వైభవమును పాడుచుండిరి. ఈ విధముగా శ్రీ శ్రీనివాసుని శుభావహమగు వివాహము జరుగుచుండగా 9, 10

అందమైన కనులుగల శ్రీకృష్ణుని కోడండ్రందరును శ్రీనివాసుని తల్లియగు వకుళాదేవిని తక్కిన తమ యత్తగాండ్రను ముందుగానుంచుకొని సంతసింపసాగిరి. 11

ఈ విధముగా మహోత్సవము జరుగుచుండగా నేడవదినమున నాల్గుదిక్కుల యందును జలములచే నిండిన కలశములనుంచి 12

దారముతో చుట్టి వాటి మధ్యభాగమున రత్నపీఠమునుంచి మిక్కిలి త్వరపడుచు దేవతాంగనలు శ్రీనివాసునితో — 13

పురుషోత్తమా! నీవు లేచి వారములచే నేర్పరచిన యా మండలమున కూర్చుండు ' మని తెలుపగా వారలముందు 14

లీలామానుషరూపుడగు శ్రీనివాసుడా యంగనామణులముందు చిన్నపోయిన ముఖముతో కనులనుండి బాష్పములు స్రవించుచుండ " చతుర్ముఖా! నా వివాహ వైభవమున నాకు 15

మానె వాశీర్వాదములతో (తలపై) నుంచుచు నెవరభిషేకము నొనర్తురు? వివాహమునందును, ఆపదసమయములయందును తల్లికాని, తండ్రికాని లేనివారి 16

జీవితము వ్యర్థము. నా తక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు, మేనమామలు, మేన అల్లుళ్లు 17

ఎవరును లేరుకదా! నాకెవ రభిషేకమొనర్తురు? తల్లిదండ్రులులేనివారి కెట్టి గతికలుగునో కదా! 18

తల్లితో సమానమగు మిత్రుడును, తండ్రితో సమానమగు సుఖమును, భార్యకు సరియగు భాగ్యమును, పుత్రునితో సమానమగు గతియు 19

సోదరునితో సమానమగు బంధువు, విష్ణువును మించిన పరతత్త్వము నుండ జాలర ' ని పలికి 20

రురోద లోకరీత్యైవ । పశ్యన్ బ్రహ్మాననం హరిః ।
ఉపధార్య హరే ర్వాక్యం । స భవః కఞ్జసమ్భవః ॥ 21

సాన్త్వయన్ వాసుదేవ స్తు । భారతీ మాహ భూపతే ।

బ్రహ్మా —

కిమర్థం మోహయసి నో । మాయాపఞ్జరవాసినః ॥ 22

కో ఽపి నాస్తీతి యత్ప్రోక్తం । త దసత్యం చతుర్భుజ ! ।
పుత్రో ఽహం తవ కల్యాణ ! । పౌత్రః సాక్షా త్త్రిలోచనః ॥ 23

మన్మథో ఽన్యఃపుమాన్ పుత్రః । పౌత్రపుత్రః షడాననః ।
జగత్ప్రాణో జ్యేష్ఠపుత్రః । స్నుషా తే భారతీ హరే ! ॥ 24

సరస్వత్యాదికా స్సర్వాః । స్త్రియః త్వత్పాదసేవికాః ।
త్వం పుమాన్ పరమ స్సాక్షాత్ । జగద్ధాత్రీ తవా ఙ్గనా ॥ 25

క్రీడామాత్ర మిదం మన్యే । త్వత్కృతం పురుషోత్తమ ! ।
ఏవం విభవ మాపన్నః । త్వం నో మోహయసే వృథా ॥ 26

ఇత్థ ముక్త్వా చతుర్వక్త్రో । వాసుదేవం రమాసఖమ్ ।
రమాం సఙ్కేతయామాస । సా రమా వాక్య మబ్రవీత్ ॥ 27

శ్రీ రమా —

విదితం హృదయం దేవ ! । తవ వేఙ్కటవల్లభ ! ।
శైలాభ్యఙ్గాదికర్మాణి । కరిషే పురుషోత్తమ ॥ 28

ఉత్తిష్ఠ త్యజ దుఃఖం తే । సమారోహ వరాసనమ్ । ”
స రమాగిర మాకర్ణ్య । సన్తోషా న్నయానా జ్జలమ్ ॥ 29

ముఞ్చన్ మునివరాన్ రాజన్ ! । నన్దయన్ వరసారథిః ।
కశ్యపాత్రిభరద్వాజ । విశ్వామిత్రపురోగమాన్ ॥ 30

ప్రణిపత్య వసిష్ఠం చ । ఆహ విశ్వం విడమ్బయన్ ।

శ్రీనివాసః —

ఆమజ్ఞాం దేహి మే బ్రహ్మన్ ! । మజ్జనార్థం మహామునే ! ॥ 31

యాతని ముఖమువంక చూచుచు లోకపరిపాటి ననుసరించుచు నేడ్వసాగెను. ఇట్టి శ్రీనివాసుని మాటలను విని చతురాననుడు 21

శ్రీనివాసు నూరడించుచు ఇట్లు పల్కెను. "శ్రీనివాసా ! యామామోహితుల మగు మమ్మెందులకు మోహింపచేయ చూచుచున్నావు ? 22

ఓ చతుర్భుజుడా ! నీ కెవరునులేరని పలికిన పలుకులు యదార్థములుకావు. నేను నీ పుత్రుడను. సాక్షాత్తుగా రుద్రుడు నీ మనుమడు. 23

మన్మథుడు నీకు మరియొక పుత్రుడు. కుమారస్వామి నీకు మునిమనుమడు. వాయువు నీకు పెద్దకొడుకు, సరస్వతి నీ కోడలు. 24

సరస్వతి మొదలగు స్త్రీ లందరును నీ పాదములు నాశ్రయించుకొని యుండు సేవకురాండ్రు. నీవు పరమపురుషుడవు. లోకమాత నీ సహధర్మచారిణి. 25

నీ విపుడు గావించిన దంతయు నీవు విలాసమాత్రముగా నొనరించితివనియే నేను తలంతును. వర్ణించనలవికాని వైభవోపేతుడవగు నీవు మమ్ము వ్యర్థముగా మోహింపచేయుచున్నావ'ని 26

పలికి శ్రీదేవికి సంకేతమును తెలుపగా శ్రీదేవి శ్రీనివాసునితో 27

శ్రీదేవి —

శ్రీ వేంకటాచలపతే ! నీ యభిప్రాయము నెఱింగితిని. నీకు నూనెవంటుట మొదలగు కృత్యములను నే నొనరింతును. 28

నీ దుఃఖమును వీడి ఉన్నతాసనము నధిష్ఠింపుము'ని ప్రార్థింపగా శ్రీదేవి మాటలను విని ఆనందబాష్పములను 29

విడచుచు మునీంద్రుల నందరను సంతసింపజేయుచు కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర 30

వసిష్ఠాదులకు నమస్కరించి ప్రపంచమున తాను మనుష్యమాత్రుడనని నటించుచు వసిష్ఠా ! నా కభిషేకమున కనుజ్ఞనిండని వేడుకొనెను. పురోహితునితోకూడిన వసిష్ఠుడు "అట్లే యొనర్పుము"ని పలికెను. భార్యలతో కూడిన దేవతలనందరను, భార్యలతోగూడిన ఋషీంద్రులను 31

తథా స్త్రీః ప్రత్యబ్రవీ త్కృష్ణం । వసిష్ఠః సపురోహితః ।
సపత్నీకాన్ సురాన్ సర్వాన్ । సభార్యాన్ ఋషిమణ్డలాన్ ॥ 32

అనుజ్ఞాప్యాసనగై స్సార్ధం । ఉపతిష్ఠత్సురో త్తమః ।
వికీర్య కేశయూలాని । పూర్వాశాభిముఖం తతః ॥ 33

ఆరోపయన్ రత్నపీఠే । శ్రీనివాసం సుయోషితః ।
తాసాం మధ్యే సిన్ధుపుత్రీ । రమా కమలలోచనా ॥ 34

రుక్మపాత్రం సమాదాయ తైలపూరిత మాదరాత్ ।
అభ్యఞ్జయ త్తదా దేవీ । స్వాశీర్భి రభినన్ద్య తమ్ ॥ 35

శ్రీ రమా —

దీర్ఘాయు ర్భవ గోవిన్ద । బహుపుత్రో ధనాధిపః ।
చతుర్దశానాం లోకానాం । ఏకచ్ఛత్రాధిపో భవ ॥ 36

ఏవ ముక్త్వా తదా దేవీ । సాఽభ్యస క్తిస్మ మాధవమ్
దేవాఙ్గం మర్దయామాస । తైలేనాతిసుగన్ధినా ॥ 37

తదా దదౌ బ్రహ్మపత్నీ । చన్ద్రికాశ్మీరకర్దమమ్ ।
తేన మార్జాల తైలేన । తథా మృగమదేన చ ॥ 38

హరిద్రాచూర్ణపిష్టేన । విమృజ్య చ వృషాకపిమ్ ।
మమజ్జతై ర్వాద్యఘోషైః । సహ సర్వపరిచ్ఛదైః ॥ 39

సమన్తా త్సర్వవీధీషు । కరికుమ్భై రుపాహృతైః ।
సమన్తాత్ పుణ్యతీర్థస్థ । పుణ్యతీర్థాభిపూరితైః ॥ 40

పరత్నైః కాఞ్చనైః కుమ్భైః । తాపితోదక మిశ్రితైః ।
అభిషేకం తత శ్చక్రే । కమలా జగదీశితుః ॥ 41

అపాదమౌళిపర్యన్తం । సా కృత్వోద్వర్తనం హరేః ।
మేనే కృతార్థ మాత్మానం । సేవయా కేశవస్య తు ॥ 42

సమ్మతింపజేసుకొని శ్రీనివాసు డనుచరులతో లేచి నిలబడెను. సుందరీమణులగు పుణ్యస్త్రీలు శ్రీనివాసుని తలవెండ్రుకలను విప్పి తూర్పుముఖముగా 33

రత్నాసనమున కూర్చుండబెట్టిరి. వారి మధ్యలో సముద్రపుత్రికయు పద్మలోచనయునగు శ్రీదేవి 34

నూనెతో నిండిన బంగారుపాత్రను తీసికొని ఆశీర్వాదములతో నాదరముగ నాతనికి తలంటెను. 35

శ్రీదేవి —

గోవిందా ! దీర్ఘాయుర్దాయముకలిగి పెక్కుమంది పుత్రులుగలిగి ధనవంతుడవై పదునాల్గులోకములకును సాటిలేని పాలకుడవై 36

వర్ధిల్లుదువుగాక యని దీవించుచు మిక్కిలి పరిమళించు నూనెచే శరీరమునంతను మర్దించెను. 37

అంతట సరస్వతి పచ్చకర్పూరము నొసంగెను. ఆ పిల్లినూనెతోను కస్తూరితోను, 38

పసుపుముద్దతో నలుగుబెట్టి మంగళవాయిద్యములతోను, సకలములగు ఉపకరణములతోను, 39

అన్ని వీధులనుండియు ఏనుగు కుంభస్థలములపై నుంచి కొనిరాబడినట్టియు, పుణ్యతీర్థములయందలి పుణ్యోదకముచే నిండిన 40

రత్నములచే కూర్పబడిన బంగారు కుంభములయందలి వేడినీరితో కలిపిన పవిత్రజలముతో శ్రీనివాసున కభిషేకమొనర్చెను. 41

శ్రీనివాసునకు శిరస్సునుండి పాదములవరకు నలుగుబెట్టి యభిషేకము నొనర్చుటచే తనను కృతార్థురాలనుగా తలంచెను. 42

చతస్రస్తు సువాసిన్యః । పాణిభిః కలశా న్నృప
ధృత్వా మౌక్తికతోయైస్తం । అభ్యషిఞ్చన్ సురేశ్వరమ్ ॥ 43
జలైః క్షీరాజయా మాసుః । "పుత్రవాన్ ధనవాన్ భవ ।
ఇత్యాశిషా ఽభినన్దన్త్యః । శ్రీనివాసం సురాఙ్గనాః ॥ 44
గాయన్త్యః శుభగీతాని । కాఙ్క్షైః సలిలైస్తతః ।
ఆరాత్రికాం మాఙ్గలికీం । సర్వాశ్చక్రు స్తథా ఙ్గనాః ॥ 45
తదా దదౌ బ్రహ్మపత్నీ । సావిత్రీ వస్త్ర ముత్తమమ్ ।
తేన వస్త్రేణ సర్వాఙ్గం । మమార్జ విధివ ద్రమా ॥ 46
పార్వతీ ధూప మాదాయ । దదౌ లక్ష్మీకరామ్బుజే ।
ధూపయిత్వా సుధూపేన । వికీర్యో జ్ఝితబన్ధనాన్ ॥ 47
బబన్ధ కమలాదేవీ । మూర్ధజాన్ మధుఘాతినః ।
ఆదర్శం దర్శయామాస । సావిత్రీ స్వర్ణభూషితమ్ ॥ 48
రతిశచ్యౌ చామరే చ । వీజయన్త్యౌ స్థితే తదా ।
ఛత్రం దధార సా దేవీ । భారతీ భక్తిసంయుతా ।
పాదుకే ప్రదదౌ భద్రా । గఙ్గా గఙ్గాపితు స్తదా ॥ 49
విదాయ పాదౌ పరపాదుకాద్వయే।యయౌ ప్రపన్నార్తిహరో హరిః స్వయమ్ ।
యాభ్యాం పురా పావనతాం గతా మునేః।శాపేనచాశ్మత్వ ముపాగతా ఽబలా॥ 50
పాదుకాభ్యాం చరన్ భూమిం । వరానన మగా ద్ధరిః ॥ 51
బ్రహ్మాదయ స్సురశ్రేష్ఠాః । ఇన్ద్రాద్యాః లోకపాలకాః ।
కశ్యపాదిమునిశ్రేష్ఠాః । వసిష్ఠాదితపోధనాః ॥ 52
సనకాద్యా శ్చ యోగీన్ద్రాః । భృగ్వాద్యా శ్చ ఋషీశ్వరాః ।
అర్యమాద్యా శ్చ పితరః । తుమ్బురాద్యా శ్చ గాయకాః ॥ 53
రమ్భాద్యా శ్చైవ నర్తక్యః । సూతమాగధవన్దినః ।
ఉపాసతే ఽనసనే రమ్యే । పశ్యన్తః పురుషోత్తమమ్ ॥ 54

నలుగురు ముత్తైదువలు కలశములను చేతబూని ముత్యముల నీళ్లతో వాసుదేవు నభిషేకించిరి. 43

పుత్రులు కలిగి ధనవంతుడవై వర్ధిల్లుమని యాశీర్వదించుచు స్తుతించుచు పూర్ణ కుంభములతో హారతి నొసంగిరి. 44

మంగళగీతములను పాడుచు కుంకుమపూవు కలిపిన నీటితో మంగళప్రదమగు హారతిని స్త్రీలందరు నొసంగిరి 45

అనంతరము బ్రహ్మభార్య యగు సావిత్రి శ్రేష్ఠమగు వస్త్రము నొసంగగా శ్రీదేవి యథావిధిగా నా వస్త్రముతో నొడలంతయు తడిమొత్తెను. 46

పార్వతి ధూపమును తెచ్చి యొసంగగా రమాదేవి తలవెంట్రుకల చిక్కును విడదీసి ధూపమును వేసి. 47

పిమ్మట తలను ముడివైచెను. సావిత్రి బంగారు చక్రముగల అద్దమును చూపించెను. 48

రతీదేవి శచీదేవి చామరములను వీచుచు నిలచిరి. శాంతీదేవి (గొడుగును) ఛత్రమును భక్తితో పట్టుకొనెను. మంగళరూపిణియగు గంగ, విష్ణుపాదములయందు పుట్టుటచే తనకు తండ్రియగు శ్రీనివాసునకు పాదుకల నొసంగెను. 49

గౌతమమహర్షి శాపముచే శిలారూపమును ధరించిన యహల్య ఏ పాదములచే పవిత్రతనందినదో యట్టి పాదముల రెంటిని పాదుకలయందుంచి ఆశ్రితపరిత్రాతయగు శ్రీనివాసుడు 50

భూమిపై సంచరించుచు తన సింహాసనము నలంకరించెను. 51

బ్రహ్మ మొదలగు దేవతలును, ఇంద్రాదిలోకపాలురును, కశ్యపాదిమునీంద్రులును, వసిష్ఠాది తపోధనులును, 52

సనకాదియోగీంద్రులును, భృగుమహర్షి మున్నగు మౌనీంద్రులును, అర్యముడు మొదలగు పితృదేవతలును, తుంబురాది గాయకులును, 53

రంభాది నాట్యకర్త్రియలును, సూతులు, వంశాదులకీర్తించు మాగధులు, ఇతరులను పొగడి జీవించువారును, 54

స్వామిపుష్కరిణీతీరే । దక్షిణే పక్షివాహనమ్
అష్టమీస్తుకళాకారే । లలాటే దర్పణస్ఫుటే ॥ 55

ఊర్ధ్వపుణ్డ్రం దధా రాథ । శ్రీనివాస స్సతాంగతిః ।
తదాహ కమలాం రాజన్ । వకుళా లోకమాతరమ్ ॥ 56

రేఖాం రచయ కల్యాణి । లలాటే కుఙ్కుమేన తు ।
ఏవ ముక్తా దేవమాత్రా । రమా కుఙ్కుమమాలిఖత్ ॥ 57

తదా ముహూర్తకాలస్తు । దర్శితో దైవచిన్తకైః ।
భూషణాని స్వపుత్రస్య । పౌత్రస్తు జగదీశతుః ॥ 58

యాచయిత్వా మహారాజ । కుబేర మథ సా రమా ।
ఆదాయ తం దదర్శా థ । భగవా నాహ తాం నృప ॥ 59

శ్రీ భగవాన్ —

సమ్భూషయ వరారోహే ! । భూషణై ర్మాం వరాననే ! ।
ఏవ ముక్తా హసన్తీ సా । భూషణై స్త మభూషయత్ ॥ 60

పీతామ్బరం దధారా థ । కటిసూత్ర మనర్ఘ్యకమ్ ।
స్వర్ణై రాభరణై ర్వస్త్రైః । భూషిత స్తు తతో హరిః ॥ 61

కశ్యపా-త్రి-భరద్వాజ । వసిష్ఠాదీన్ మహామునీన్ ।
నమ శ్చక్రే విరిఞ్చేశ । వినుతో ఽపి విడమ్బయన్ ॥ 62

సన్ధ్యా ముపాస్య విధివత్ । కృత్వా తాత్కాలికక్రియాః ।
వసిష్ఠ మాహూ యోవాచ । సన్తోషోద్రిక్తమానసః ॥ 63

శ్రీ భగవాన్ —

మునిశ్రేష్ఠ ! వసిష్ఠ ! త్వం । ఉత్తరం కార్య మాచర ।
వామదేవవచః శ్రుత్వా । వసిష్ఠో వదతాం వరః ॥ 64

విరచయ్య వేదికాం తత్ర । మౌక్తికై శ్చతురశ్రికామ్ ।
శ్రీనివాసం ప్రతిష్ఠాప్య । సఙ్కల్పవిధిపూర్వకమ్ ॥ 65

స్వామి పుష్కరిణీ తీరమున దక్షిణదిక్కున అందమగు రత్నపీఠముపై నాసీనుడై యున్న పురుషోత్తముని గాంచి యుపాసించిరి. శ్రీనివాసు డష్టమి చంద్రకళను బోలి అద్దము వలె నిర్మలముగనున్న లలాటమున 55

ఊర్ధ్వపుండ్రమును ధరించెను. అంత దేవమాతయగు వకుళాదేవి శ్రీదేవితో— 56

శ్రీదేవీ! లలాటమున కుంకుమరేఖ నుంచమని తెలుపగా లక్ష్మీదేవి యట్లే యొనరించెను. 57

అటుపిమ్మట దైవజ్ఞులు ముహూర్తకాలమును తెలిపిరి. 58

లక్ష్మీదేవి కుబేరుని యాచించి తీసికొని వచ్చి శ్రీనివాసునకు చూపగా శ్రీనివాసుడు 59

శ్రీ భగవానుడు —

సుందరీ! వస్త్రాభూషణములచే నలంకరింపుమ'ని యడుగగా నామె నవ్వుచూ నాతని నలంకరించెను. 60

పిమ్మట శ్రీనివాసుడు పీతాంబరమును వెలలేని మొలమాలను ధరించెను. శ్రీనివాసుడు బంగారు భూషణములచే వస్త్రములచే నలంకరింపబడి 61

కశ్యప అత్రి భరద్వాజ వసిష్ఠాది మహామునులను తాను బ్రహ్మాదులచే స్తుతింపబడువాడైనను మనుష్యుల ననుకరించుచు నమస్కరించెను. 62

అనంతరము యథావిధిగ సంధ్యావందన మాచరించి యా సమయమున నొనర్ప తగిన క్రియల నాచరించి సంతోషితాంతరంగుడై వసిష్ఠుని పిలచి 63

శ్రీ భగవానుడు —

మునీంద్రా! తదనంతర మాచరింపవలసినదాని నాచరింపుమ'ని పలుకగా శ్రీనివాసుని మాటలను విని వసిష్ఠమహర్షి — 64

ముత్యములతో నలువలకలగమందు వేదిక నాచరించి సంకల్పవిధానముతో శ్రీనివాసుని అందు కూర్చుండబెట్టి 65

చక్రే పుణ్యాహకర్మా చ । వరయిత్వా ద్విజన్మనః ।
అష్టవర్గం తత శ్చక్రే । సృష్టికర్తా పితామహః ॥ 66

తతో వియు క్తవిధినా । దత్త్వా తామ్బూల దక్షిణాః ।
విప్రాణాం వేదవిదుషాం । తథా మఙ్గళవాదినామ్ ॥ 67

దదు ర్దేవా ధనం వస్త్రం । వాసుదేవస్య యే ప్రియాః ।
తతః సమాప్య కర్మాణి । శాస్త్రోక్తాని యథావిధి ॥ 68

కులదై వ మపృచ్ఛ త్తం । వసిష్ఠో వసుధాధిప ! ।
స తస్య వచనం శ్రుత్వా । భగవా నాహ వై మునిమ్ ॥ 69

### భగవత్కృతపరిణయాఙ్గకులదేవతాప్రతిష్ఠావిధానమ్

శ్రీ భగవాన్ —

వసిష్ఠ మమ కల్యాణీ । కులదేవీ శమీ స్మృతా ।
మమా పి పాణ్డవానా ఞ్చ । నాత్ర కార్యా విచారణా ॥ 70

"క్వ చా స్తి స ద్రుమశ్రేష్ఠః" । ఇత్యుక్తే ఒగస్త్య ఊచవాన్ ।

అగస్త్యః —

అత్రై వో త్తరదిగ్భాగే । తీర్థే కౌమారసంజ్ఞకే ॥ 71

వ ర్తతే వృక్షరాజ శ్చ । తత్ర గత్వా త మానయ ।
అగస్త్య వచనే నైవం । తత్ర గత్వా ఒథ తం ద్రుమమ్ ॥ 72

కృత్వా ప్రదక్షిణం రాజన్ ! । భగవాన్ లౌకికై స్సమః ।
నమశ్చక్రే శమీవృక్షం । కులదైవం వృషాకపిః ॥ 73

శ్రీ భగవాన్ —

శమి పాపం శమయ మే । శమి ! శత్రువినాశిని ।
అర్జునస్య ధనుర్ధాత్రి । రామస్య ప్రియదర్శిని ॥ 74

మాత ర్మే కురు కల్యాణం । అవిఘ్నేన సురప్రియే ।
కలహః సర్వదేవానాం । రాజ్ఞ స్తస్య చ నో భవేత్ ॥ 75

పిమ్మట పుణ్యాహవాచనమునుజేసి బ్రాహ్మణులకు వరుణలొసంగి "అష్టవర్గ" మనబడు వైదిక వివాహాగ్నికర్మ నాచరించెను. 66

అనంతరము యథాశాస్త్రముగా వేదవేత్తలగు బ్రాహ్మణులకును, మంగళపాఠకులకును, దక్షిణతో కూడిన తాంబూలముల నిచ్చిరి. 67

శ్రీనివాసునకి ప్రియమైనవా రందరును ధనమును, వస్త్రముల నొసంగిరి. తదుపరి కృత్యములను యథాశాస్త్రముగా నిర్వహించి 68

శ్రీనివాసా! "మీ కులదైవ మెవర"ని యడుగగా శ్రీనివాసుడు ఆతనితో— 69

## శ్రీనివాసుడు వివాహమున కంగముగా కులదేవతను ప్రతిష్ఠించుట

శ్రీ భగవానుడు —

వసిష్ఠా! మాకును, పాండవులకును శమీవృక్షమే కులదేవత. ఇందాలోచింప వలసిన పనిలేదు. 70

అగస్త్యుడు —

ఆ వృక్షరాజ మెచ్చట నున్నద'నియడుగగా నగస్త్యుడు "ఇచ్చట కుత్తర దిక్కున కుమారతీర్థరాజతీరమున 71

శమీవృక్షమున్నది. అచ్చటకువెళ్లి దానిని తీసికొని రమ్మ'ని చెప్పగా ధర్మవరాహ వ్యూహపుడగు శ్రీనివాసు డచ్చటకేగి 72

సాధారణ మానవునివలె తనకు కులదైవమైన ఆ వృక్షరాజమునకు ప్రదక్షిణ మొనరించి నమస్కరించి 73

శ్రీ భగవానుడు —

ఓ శమీవృక్షమా! నా పాపమును పోద్రోలుము. శత్రువులను నశింపజేయు శమీవృక్షమా! అర్జున ధనుర్బాణ సంరక్షణకరీ! శ్రీరామచంద్రునికి ప్రియమైనదానా! 74

దేవతా సంప్రీతికరీ! నాకు నిరాటంకముగా కల్యాణము నొనగూర్చుము. ఈ కల్యాణసమయమున సకలదేవతలకును ఆకాశరాజునకును కలహము సంభవించ కుండునుగాక! అని యా దేవతలందరిచే పూజింపబడు నా వృక్షమును ప్రార్థించి 75

ఇతి సమ్ప్రార్థ్య దేవేశః । కులదేవీం సురార్చితామ్ ।
అర్చయిత్వా పిధానేన । స్కన్ధ మల్పం మహీపతే ॥ 76

నికృత్య శిరసా ధృత్వా । వాదిత్రాణాం స్వనేన చ ।
పూరయ న్నమ్బరం సర్వం । పునః స్వస్థానమాగతః ॥ 77

శ్రీనివాసః —

"సా కుత్ర స్థాప్యతే బ్రహ్మన్ ! వసిష్ఠ ! కులదేవికా" ।
వద త్వే వం వాసు దేవే । వసిష్ఠం వసుధాధిప ॥ 78

నారద శ్చా న్తికం గత్వా । ప్రోవాచ మధుసూదనమ్ ।

శ్రీనారదః —

వరాహశరణే దేవ । స్థాప్యతాం కులదేవతా ॥ 79

యస్మిన్ స్థానే స్వకం ధామ । తత్ర తాం కృష్ణ ! పూజయేత్ ।
ఏవం విద్వన్మతం పూర్వం । నిర్మితం పరమేష్ఠినా ॥ 80

సనారదవచః శ్రుత్వా । వసిష్ఠ సహితో హరిః ।
వరాహశరణం గత్వా । వచ ఏత త్త మబ్రవీత్ ॥ 81

శ్రీనివాసః —

ప్రసాదా త్తవ గోవిన్ద ! । వివాహం కర్తు ముత్సుకః ।
సహితో ధరయా సార్ధం । త్వ మాగచ్ఛ నృపాలయమ్ ॥ 82

గురు స్త్వం సర్వలోకానాం । కృతకృత్య ఇ్చ మాం కురు ।
శ్రీనివాసవచః శ్రుత్వా । భూధరో వాక్య మబ్రవీత్ ॥ 83

శ్రీ వరాహః —

మమ స్థానే మహారాజ ! । వకుళాం విద్ధి మే సఖీమ్ ।
క్షేత్రం పక్వం మదీయం యత్ । తస్మాన్మాం త్యక్తు మర్హసి ॥ 84

వరాహవచనం శ్రుత్వా । వాసుదేవో ఽభ్యభాషత ।

శ్రీనివాసః —

కులదేవీప్రతిష్ఠా ఇ్చ । కరిష్యే శరణే తవ ॥ 85

యథాశాస్త్రముగా పూజించి చిన్నకొమ్మను విరచి 76

శిరస్సున ధరించి మంగళవాయిద్యధ్వనులతో నాకసమంతయు మార్మోగుచుండ తన ఆవాసమునకు తిరిగి వచ్చి 77

శ్రీనివాసుడు —

వసిష్ఠా! ఈ నా కులదైవమగు వృక్షము నెచ్చట నుంచవలెన'ని యడుగుచుండగా 78

నారదుడు సమీపించి "శ్రీనివాసా! వరాహదేవుని స్థానమున కులదేవతను ప్రతిష్ఠింపుము. 79

దేవి కేది స్వస్థానమో దాని నా స్థానమునందే యుంచి పూజించవలెనని పెద్దల యభిప్రాయముగా బ్రహ్మచే నిర్ణయింపబడినది. 80

అని యిట్లు నారదుడు తెలుపగా శ్రీనివాసుడు వసిష్ఠునితో గూడ వరాహస్వామి యున్న స్థలమునకేగి యాతనితో నిట్లనెను, 81

శ్రీనివాసుడు —.

గోవిందా! నీ యనుగ్రహముచే వివాహము చేసికొనగోరుచున్నాను. నీవు భూదేవితో గూడ ఆకాశరాజ గృహమునకు రావలయును. 82

నీవు సకలలోకముల కాచార్యుడవు. నన్ను కృతకృత్యునిగా నొనరింపుమ'ని వినయముతో పలుకగా 83

వరాహస్వామి —

శ్రీనివాసా! నా బిడ్డగా నా స్నేహితురాలగు వకుళ నీవద్ద నున్నదికదా! నా పొలము వంటవండియున్నదిగాన నన్ను నిర్బంధింపవలద'ని పలికెను. 84

శ్రీనివాసుడు—

అంత శ్రీనివాసుడు "పోపీ! మీ సమీపమునందే మా కులదేవియగు శమీవృక్షమును ప్రతిష్ఠింతున'ని యడుగగా 85

ఇత్యే వం ప్రార్థయ న్తం తం । శ్రీనివాసం పరాత్పరమ్ ।
'తథా స్త్వి త్యబ్రవీ ద్రాజన్ !' । కోలరూపీ హరి స్స్వయమ్ ॥ 86

కలశే స్వర్ణఖచితే । ముక్తారాశిం ప్రపూర్య చ ।
వస్త్రేణ వేష్టయిత్వా ఽథ । పూజాం కృత్వా విధానతః ॥ 87

ప్రతిష్ఠాప్య వరాహస్య । సన్నిధౌ ప్రాకృతో యథా ।
స్వస్థానం పున రాగత్య । శ్రీనివాసః సతాం గతిః ॥ 88

కుబేరాచ్ఛ్రీనివాసకృతస్వపరిణయార్థఋణాదానప్రకారః

అథో జనేన గ న్తవ్యం । నారాయణపురాహ్వయమ్ ।
'ఆకాశరాజనగర' । మితి నిశ్చిత్య చేతసి ॥ 89

బ్రహ్మాణ మబ్రవీ ద్రాజన్ । త్వరయా గమనే రతః ।

శ్రీనివాసః —

విధే ! ఽద్యైవ నియుజ్యేతాం । సేనాం తే చతురఙ్గిణీమ్ ॥ 90

శీఘ్రం గన్తుం చతుర్వక్త్ర ! । నారాయణ పురం ప్రతి ।
మా భూ త్కాలో వృథై వాత్ర । దూరో ఽధ్వా హ్యస్య వ ర్తతే ॥ 91

బలం సర్వం వనే తాత ! । వృద్ధబాలాబలాన్వితమ్ ।
శనైర్గచ్ఛతు రాజేన్ద్ర ! । మునిమణ్డలపూర్వకమ్ ॥ 92

స తస్య వచనం శ్రుత్వా । చక్రపాణే శ్చతుర్ముఖః ।
వచనం వ్యాహర చ్ఛీఘ్రం । పితరం పురుషో త్తమమ్ ॥ 93

బ్రహ్మా —

కృత్వా పుణ్యాహ కర్మాణి । ప్రతిష్ఠాప్య కులేశ్వరీమ్ ।
నోచనా చేన గోవిన్ద ! । గ న్తవ్య మితి మే మతిః ॥ 94

మునయః ఋషిభి స్సర్వే । బాలవృద్ధాదయ స్తథా ।
వద త్యేవం చతుర్వక్త్రే । చక్రపాణి రభాషత ॥ 95

వరాహస్వామి పరాత్పరుడగు శ్రీనివాసునితో వస్లే చేయుమని యందుల కంగీకరించెను. 86

బంగారుచే చెక్కబడిన కలశమున మృత్యములనింపి పైన నూతనవస్త్రమును పట్టి యథాశాస్త్రముగా పూజించి 87

వరాహస్వామి సన్నిధిలో సామాన్య మానవునివలె ప్రతిష్ఠ నొనరించి తిరిగి తన స్థలమునకువచ్చి 88

## శ్రీనివాసుడు కుబేరునివద్ద తన వివాహమునకై ఋణమొనర్చుట

భోజనము నొనర్పకయే నారాయణపుర మను పేరుగల ఆకాశరాజ నగరమున కేగవలెనని మనమున నిశ్చయించుకొని 89

ప్రయాణమునకై త్వరపడుచు చతురాననా। ఇప్పుడే చతురంగబలములతో గూడిన సేనను ప్రయాణమునకై వియోగింపుము. 90

ఆకాశరాజనగరము చాలదూరమున నున్నది ఇచ్చటనే కాలమును వ్యర్థపుచ్చ వలదు. 91

ముసలివారితోను, బాలురతోను, స్త్రీలతోకూడిన సేనయంతయు మునిసంఘము లతో కూడి మెల్లగా వెళ్లునుగాక। 92

అని చెప్పగా చతుర్ముఖు డా నారాయణుని మాటలను విని వెంటనే తన తండ్రి యగు శ్రీనివాసునితో — 93

పుణ్యాహవచనము మొదలగు శుభకార్యముల నిర్వహించి కులదేవతను ప్రతిష్ఠించి ఉపవాసముతో వెడలరాదని నా యభిప్రాయము. 94

బాలురు వృద్ధులు మొదలగు మునులందరు ఆకలిగొనియున్నార'ని తెలుపు చుండగనే 95

శ్రీనివాసః —

వచనాని మహార్హాణి । తవ పుత్ర పితామహః ।
కథం కార్య మకార్యం చ । నైవ జానాసి పుత్రక ॥ 96

దేశకాలా వనాలోచ్య । భాషసే బాలిరో యథా ।
ద్రవ్యాణా మయుతం తాత । గతం మే కాననే గిరౌ ॥ 97

ఏవం వ్యయం సమాపన్నం । కథం పశ్యసి చక్షుషా ।
జ్ఞాత్వా ఒపి రిక్తతాం వాచా । త్వేవ ముక్తే కథం భవేత్ ॥ 98

వదత్యేవం స్వపితరి । బ్రహ్మా లోకపితామహః ।
తూష్ణీ మభూ న్మహారాజః । భగవత్పురత స్తదా ॥ 99

నీలకణ్ఠో ఒబ్రవీ ద్వాక్యం । పితరం స్వపితు స్తతః ।

నీలకణ్ఠః —

శ్రోతవ్యం వచనం తాతః । మమ బాలస్య మాధవ ॥ 100

వివాహకరణే దేవః । తథా భవనకర్మణిః ।
ప్రారబ్ధస్యా న్తపర్యన్తం । యో హి యత్నం సమాచరేత్ ॥ 101

స ఏవ పుణ్యవాన్ లోకే । కీర్తి మేతి న సంశయః ।
సమ్పాద్యాః సర్వసమ్భారాః । శుభకార్యేషు పుష్కలాః ॥ 102

బహులార్థవ్యయే వాపి । తదభావే త్వృణం చరేత్ ।
స శమ్భువచనం శ్రుత్వా । శమ్బరారి పితా ఒబ్రవీత్ ॥ 103

శ్రీ భగవాన్ —

సభాయాం కి మిదం ప్రోక్తం । పౌరుషేణ వచ శ్శివ ।
కో వా ఒద్య ఋణదాతా ఒస్తి । వివాహస్యా స్య పుష్కలమ్ ॥ 104

పురుషః పౌరుషం యత్నం । ఆచరే న్నైవ భావయేత్ ।
ఏవ ముక్త్వా శివం ప్రాహ । కుబేరం పురుషోత్తమః ॥ 105

శ్రీనివాసుడు —

నాయనా ! చతురాననా ! చాలా వింతవగల మాటలనాడుచున్నావు. మంచిచెడ్డల నారయకుంటివేల ? 96

దేశకాలముల నాలోచింపక నజ్ఞానివలె పలుకుచుంటివేల ? అడవియందలి కొండలో నా వేలకొలది ధనము నశించిపోయినది. 97

ఇట్లు ధన మపహరింపబడుట నీవు నీ కన్నులతో గాంచలేదా ? ఇట్లు దారిద్ర్యము నెఱింగియుండియు నిట్లు పలికిన నెట్లగున'ని 98

పలికినంతనే చతుర్ముఖుడు శ్రీనివాసుని యెదుట మాటలాడక నిలచి యుండెను. 99

అంత నీశ్వరుడు పితామహుండగు శ్రీనివాసునితో — శ్రీనివాసా ! బాలుడనగు నామాట లాలకింపుము. 100

వివాహము నొనరించుకొను సమయమునను, గృహనిర్మాణసమయమునను తన మొదలుపెట్టిన కర్మ పూర్తి యగునంతవరకు ప్రయత్నించు పురుషుడే 101

అదృష్టవంతుడై లోకమున ప్రఖ్యాతిని బడయు ననుటలో సందియములేదు. శుభకార్యములయందు సమృద్ధిగా సకల వస్తుసామగ్రిని సమకూర్చుకొనవలెను. 102

ఆ వస్తుసేకరణమున నెంత ధనము వ్యయమయినను లెక్కింపరాదు. ధనము లేకున్నను ఋణమొనరించిన నదియు సమంజసమే" అని పలుకగా శ్రీనివాసుడు 103

రుద్రా ! నీవు సభలో నిట్లు పౌరుషముగా మాట్లాడుచుంటివి. ఇపు డీ వివాహమున కెవరు మనకు వలయునంత ధన మీయనున్నారు ? 104

పురుషుడు తాను ప్రయత్నింపవలయునే కాని ప్రగల్భములు పలుకరాద'ని పలికి కుబేరునితో — 105

నిమిత్తం వర్తతే కిఞ్చి । దిత ఏహి ధనాధిప ! ।
ఇత్యే వ ముక్తో ధనదః । పితామహసమన్వితః ॥ 106

సముత్తస్థౌ సభామధ్యాత్ । త్వరితం శివసంయుతః ।
బ్రహ్మణాసకుబేరేణ । శఙ్కరేణరమాపతిః ॥ 107

ఏకాన్తే స్వామితీర్థ స్య । పశ్చిమే ఒశ్వత్థసన్నిధౌ ।
గత్వో వాచ ధనేశానం । శ్రీనివాసః సతాం గతిః ॥ 108

సాధయస్వ మహాభాగ ! । కల్యాణం మే కలౌ యుగే ।
దత్వా ధనం యావ దిష్టం । పుత్రస్య నరవాహన ! ॥ 109

వాసుదేవవచః శ్రుత్వా । వసుపాలో ఒబ్రవీ ద్ధరిమ్ ।
కుబేరః —
త్వదధీనం దేవ ! సర్వం । జగదేత చ్చరాచరమ్ ॥ 110

బహూనాం జీవరాశీనాం । మధ్యే కో ఒహం జగత్పతే ! ।
నియోజితేన భవతా । రక్షితం త్వద్ధనం మయా ॥ 111

త ద్దానాఒదానయోః శక్తిః । మమ నాస్తి ఖగధ్వజ ।
గ్రహీతా త్వం చ దాతా చ । స్వతన్త్రో ఒత్ర త్వ మేవ హి ॥ 112

బ్రువ త్యేవం ధనపతౌ । శ్రీపతి ర్వాక్య మబ్రవీత్ ।
శ్రీనివాసః —
ఏకస్మిన్ బ్రహ్మదివసే । త్వ వతారా దశ స్మృతాః ॥ 113

మమా వతారసమయే । నా నయామి ధనం గృహాత్ ।
భూగతఞ్చ ధనం రాజన్ ! । నైవ నేష్యామి మద్గృహమ్ ॥ 114

యథాయుగం యథాకాలం । యథాదేశం యథావయః ।
అవతార మహం కుర్వన్ । రమే ఒత్ర రమయానహ ॥ 115

నిమిత్తమాత్ర మపి మే । ధనం త్వం ధనదా ధునా ।
యుగానుసారిణే దేహి ! । దేశకాలానుసారతః ॥ 116

ధనాధిపతే ! నీతో కొంత పనియున్నది. ఇటురమ్మ'ని పలువగా కుబేరుడు తాతగారైన చతుర్ముఖునితో కూడ 106

సభలోనుండి త్వరితముగా లేచెను. శివునితోగూడి లేచి బ్రహ్మ, కుబేర శంకరులతో శ్రీనివాసుడు 107

స్వామి పుష్కరిణికి పడమట దిశగానున్న రావివృక్షమునకు దగ్గరలో రహస్య స్థానమున సజ్జనాధారభూతుడైన శ్రీనివాసుడు— 108

కుబేరా ! చతుర్ముఖునికి వలసినంత ధనము నొసంగి కలియుగమున నా కల్యాణమును పూర్తిగావింపుమ'నెను. 109

కుబేరుడు —

ఆ మాటలకు కుబేరుడు " దేవా ! ఈ చేతనాచేతన ప్రపంచమంతయు నీ యధీనమేకదా ! 110

అనేక ప్రాణికోటులలో నే నెంతటివాడను ! నీచే యాజ్ఞాపింపబడి నీ ధనమును నేను రక్షించుచున్నాను. 1 1

అది నీ కొసంగుటకు గాని నీ నుండి నాదిగా స్వీకరించుటకు గాని నాకు సామర్థ్యములేదు. ఈ ధనవిషయమున స్వీకరించువాడవు, ఇతరులకొసంగు స్వతంత్రత కలవాడవు నీవేకదా ! 112

అని పలికినంతనే శ్రీనివాసు డాతనితో— బ్రహ్మకొకదినమగు సమయములో పది యవతారములు జరిగినవి, 113

నేనవతరించు సమయమున వైకుంఠమునుండి భూలోకమునకు ధనమును గొని వచ్చుటగాని, భూలోకమునుండి ధనమును వైకుంఠమునకు గొనిపోవుటగాని జరుగదు. 114

ఆ యుగమునకు తగినట్లుగా, ఆ కాలానుసారముగా, నా దేశమున కనువగునట్లు, ఆ వయస్సున కుచితమగురీతి నవతరించుచు శ్రీదేవితో నీ భూలోకమున విహరింతును. 115

కుబేరా ! దేశకాలముల ననుసరించి యుగమునకు తగినట్లవతరించిన నాకు ధనమును నీవు కారణభూతుడవై యొసంగుము'ని యడిగెను. 11 6

స తస్య వచనం శ్రుత్వా । కుబేరో వాక్య మబ్రవీత్ ।

కుబేరః —

యుగానుసారిణ స్తే ఒద్య । కథం దాస్యామి చక్రభృత్ ॥ 117

యది దత్తం త్వయా పత్రం । తదా దాస్యామి తే వసు ।
అధనః సధనం లోకే । యథా కాఙ్క్షతి మాధవ ! ॥ 118

తథైవ నరశార్దూల । భగవాన్ లౌకికై స్సమః ।
ఏవం తద్వచనం శ్రుత్వా । హరి ర్బ్రహ్మాణ మబ్రవీత్ ॥ 119

శ్రీనివాసః —

కథం లేఖ్యం మయా పత్రం । ఋణాదానే వదా ద్య మే ।

బ్రహ్మా —

ఋణగ్రాహీ శ్రీనివాసో । ధనదాయీ ధనేశ్వరః ॥ 120

ఆత్మకార్యనిమిత్తం తు । కల్యాణార్థం కలౌ యుగే ।
వైశాఖే శుక్లసప్తమ్యాం । విలమ్బే చైవ వత్సరే ॥ 121

నిష్కాణాం రామముద్రాణాం । లక్షాణి చ చతుర్దశ ।
ద్రవ్యం దత్తం ధనేశేన । వృద్ధిగ్రహణకారణాత్ ॥ 122

స వృద్ధిదిత్సతా మూలం । స్వీకృతం చక్రపాణినా ।
వివాహవర్ష మారభ్య । సహస్రా న్తే ధనం పునః ॥ 123

దాతవ్యం యక్షరాజాయ । శ్రీనివాసేన శార్ఙ్గిణా ।
ఏకః సాక్షీ చతుర్వక్త్రో । ద్వితీయ స్తు త్రిలోచనః ॥ 124

తృతీయోఽశ్వత్థరాజ స్తు । వేత్తి సర్వ మిదం దృఢమ్ ।
ఇత్యేతదృణపత్రమ్ । శ్రీనివాసో ఽలిఖ త్స్వయమ్ ॥ 125

ఏవం పత్రార్థ మాకర్ణ్య । ఋణపత్రం రమాపతిః ।
లిఖిత్వా తత్కరే దత్త్వా । ధనేశం చా బ్రవీ ద్ధరిః ॥ 126

కుబేరు డామాటలకు — చక్రధరా! ఒక యుగమున కొకరీతి నవతరించు నీకు ధన మెట్లీయగలను? 117

దరిద్రుడు కానివాడు ధనవంతుని ఋణమెట్లడుగునో యట్లే నీవును సాధారణ మానవునివలె నాకు పత్రమును వ్రాసి యిచ్చినచో నేను నీకు ధనము నొసంగెదన'ని నంతనే. అట్లనే యంగీకరించి శ్రీనివాసుడు లౌకికులతోపాటు బ్రహ్మదేవునితో నిట్లనియె — 118, 119

శ్రీనివాసుడు చతుర్ముఖునితో "చతురాననా! నేను ఋణమును తీసికొనుట కెట్లు పత్రము వ్రాయవలెన'ని యడుగగా బ్రహ్మ యిట్లు చెప్పదొడంగెను. అప్పు తీసికొను వాడు శ్రీనివాసుడు. ధనము నొసంగువాడు కుబేరుడు. 120

కలియుగమున విలంబినామ సంవత్సరమున వైశాఖమాన శుక్లపక్ష సప్తమి తిథియందు నా కల్యాణమునకై 121

శ్రీరామముద్రగల పదునాల్గులక్షల మాడలరూపముగా ధనము వడ్డీతోకూడ యిచ్చునటుల కుబేరునిచే నీయబడినది. 122

వడ్డీనిచ్చుట కంగీకరించి శ్రీనివాసునిచే నా ధనము స్వీకరింపబడినది. వివాహము జరిగిన సంవత్సరము మొదలుకొని వేయి సంవత్సరముల గడువులో ధనమును తిరిగి 123

శ్రీనివాసుడు కుబేరున కీయవలెను. ఇందుకు బ్రహ్మ, రుద్రుడు 124

మూడవవాడగు రావి వృక్షము సాక్షులుగా నున్నారు. అని యిట్లు బ్రహ్మ చెప్పగా శ్రీనివాసుడంతయును విని ఋణపత్రమును స్వయముగనే వ్రాసి 125

దానిని శ్రీనివాసుడు కుబేరున కొసంగి యాతనితో 126

"ధనం దేహి ధనేశాన! । పత్రే లిఖితమాత్రకమ్ ।
ఏవ ముక్తో వసుపతిః । వాసుదేవేన భూమిప ! ॥ 127

దదౌ ధనం కుబేర స్తు । క్షిప్తసఙ్ఖ్యం వృషాకపేః ।
వృష్ట్వా తద్ధనరాశి స్తు । తత్కరే దదా ద్ధరి ర్నృప ॥ 128

శ్రీనివాసాజ్ఞయా కుబేరకృతవైవాహికపదార్థసజ్జీకరణప్రకారః

కుబేర మబ్రవీ ద్దేవః । సమ్భారానయనం ప్రతి ।

శ్రీ భగవాన్ —

అనిమితాం తణ్డుల ఞ్చ । మితం ప్రష్టై ర్ధనేశ్వర ! ॥ 129

మాషాదిక ఞ్చ ముద్గాదీన్ గోధూమాం శ్చ సమానయ ।
గుడ తైల మధు క్షీర । శర్కరా జ్య దధీని చ ॥ 130

వస్త్రాణి యోగ్యమూల్యాని సోత్తరీయాణి చానయ ।
తిల హిఙ్గు మరీచాది । జీర సపర్ష మేధికాన్ ॥ 131

హరిద్రాక్తాని కుర్విధాః । వస్త్రాణి ద్విజయోషితామ్ ।
కమ్బలా శ్చ ధనాధీశ ! । క్రీయన్తా మితి చా బ్రవీత్ ॥ 132

దేవానా ముత్తరీయ ఞ్చ । దేవస్త్రీణాం దుకూలకమ్ ।
పూగీఫలాని దివ్యాని । నాగవల్లీదలాని చ ॥ 133

ఏలా లవఙ్గ కర్పూర । మృగనాభిరసం తథా ।
మాఙ్గల్యతన్తుం కన్యార్థం । పాదాఙ్గుష్ఠాదిముద్రికామ్ ॥ 134

హస్తాఙ్గులీయకం మే ఽద్య । కుబేర ! కురు శీఘ్రతః ।
ఇతి గోవిన్దవచనం । శ్రుత్వా ఽసౌ నిర్మమే క్షణాత్ ॥ 135

కుబేరః —

త్వత్ప్రసాదేవ గోవిన్ద ! । సర్వం సజ్జీకృతం మయా ।
పాకార్థం పుణ్డరీకాక్ష ! । నియుఙ్క్ష్వాగ్ని మతః పరమ్ ॥ 136

కుబేరా ! పత్రములో వ్రాసినట్లు ధనము నొసంగుమని యడిగెను. 127

అంత కుబేరుడు నిర్ణీతమైన ధనము నీయగా శ్రీనివాసుడా ధనరాశిని కుబేరునకు పరిగ నొసంగి 128

## శ్రీనివాసుని యాజ్ఞాప్రకారముగా కుబేరుడు శ్రీనివాసుని వివాహమునకై పదార్థములను సంసిద్ధపరచుట

కావలసిన పదార్థములను కొలతల ప్రకారము బియ్యమును, 129

మినుములను, పెసలను, గోధుమలను, బెల్లము, నూనె, తేనె, పాలు, చక్కెర, నెయ్యి, పెరుగు మొదలగు సామగ్రులను, 130

మంచి విలువగల ధోవతులను, ఉత్తరీయములను, నువ్వులు, ఇంగువ, మిరియములు, జీలకఱ్ఱ, ఆవాలు, మెంతులను గొనితెమ్ము. 131

బ్రాహ్మణ స్త్రీలకు చీరలను పసుపులో తడిపించుము. కంబళులను కొనితెమ్ము.

దేవతల కుత్తరీయములను, దేవతా స్త్రీలకు పట్టువస్త్రములను, మంచి వక్కలను, తమలపాకులను, 133

ఏలకులను లవంగములను, పచ్చకర్పూరమును, కస్తూరిని, నవవధువునకై మంగళసూత్రములను, కడియములను, అద్దాలను, మట్టెలను 134

వాకు ఉంగరమును శీఘ్రముగా సంసిద్ధ పరుపుమని యాజ్ఞాపించినంతనే కుబేరుడు నిముషములో వన్నీ యొనర్చి 135

శ్రీనివాసా ! నీ దయచే నేనంతయు సిద్ధము చేసితిని. వంటకై యగ్నిహోత్రుని యాజ్ఞాపింపుమని తెలిపెను. 136

## భగవదాజ్ఞయా వహ్నికృతదివ్యాన్నసజ్జీకరణప్రకారః

ఏవ ముక్తః కుబేరేణ । శ్రీనివాసః సతాం గతిః ।
షణ్ముఖం ప్రేషయామాస । వహ్నే రాహ్వాన కారణాత్ ॥ 137

స గత్వా త్వరితం స్కన్దః । శాసనం జ్ఞాపయన్ హరేః ।
సమ్ప్రాప్తో వాయువేగేన । సహితో జాతవేదసా ॥ 138

తతః ప్రోవాచ భగవాన్ । త్వరితం హవ్యవాహనమ్ ।

శ్రీ భగవాన్ —

శీఘ్రా ద్దివ్యాన్నశాకాది । పచ స్వాహా సమన్వితః ॥ 139

ఇతి నారాయణవచః । శ్రుత్వా ఽగ్ని స్త మభాషత ।

అగ్నిః —

పాకార్థం భాజనం కృష్ణ । నా స్త్యే కమపి మే హరే ! ॥ 140

కార్యః పాకో మహారాజ ! । బహూనాం భక్తవత్సల ! ।
ఇతి తస్య వచః శ్రుత్వా । శార్ఙ్గ్య గ్నిం ప్రత్యభాషత ॥ 141

శ్రీ భగవాన్ —

భవతాం భవనే తాత ! । కిఞ్చిజ్జాతే మహోత్సవే ।
భాజనాని మహాభాగ । వర్ధన్తే వటబీజవత్ ॥ 142

మమ కల్యాణసమయే । భాణ్డ మేకం న దృశ్యతే ।
నైవ మేవ పరం మన్యే । సర్వేషాం సర్వసాధనే ॥ 143

ఉపాయం శృణు సప్తాస్య । పాకార్థం భాజనై ర్వినా ।
అన్నం స్వామిసరోమధ్యే । సూపం పాపవినాశనే ॥ 144

వియద్గఙ్గా జలే వహ్నే ! । పరమాన్నం గుడాన్వితమ్ ।
దేవతీర్థే శాక మగ్నే ! । తుమ్బుతీర్థే తు చిత్రకమ్ ॥ 145

కుమారధారికాతీర్థే । భక్ష్యాణి వివిధాని చ ।
కర్తవ్యః । తిన్త్రిణీరస ఉత్తమః ॥ 146

## భగవంతుని యాజ్ఞచే నగ్నిహోత్రుడు దివ్యమగు అన్నమును సిద్ధము చేయుట

అంత శ్రీనివాసు డగ్నిహోత్రుని పిలుచుకొని రమ్మని కుమారస్వామిని పంపించెను. 137

కుమారస్వామియు, శీఘ్రముగా నగ్నిహోత్రుని సమీపించి శ్రీనివాసుని యాదేశము నెఱింగించి వాయువేగముతో నగ్నిహోత్రుని తోడ్తెచ్చెను. 138

శ్రీనివాసు డగ్నిహోత్రునితో — నీవు నీ భార్యయగు స్వాహాదేవి సహాయముతో శీఘ్రముగా వేడివేడి వంటకములను వండవలెన'ని యాజ్ఞాపింపగా 139

అగ్నిహోత్రుడు కృష్ణా! నేను వంటచేయుట కిచ్చట పాత్ర యొకటియులేదు. 140

భక్తప్రియ! శ్రీనివాస! చాలమందికి వంట చేయవలయును గదా! ఇది యెట్లని యడుగగా శ్రీనివాసుడు 141

శ్రీ భగవానుడు—

అగ్నిహోత్రా! మీ యింట నే మహోత్సవము జరిగినను షష్టి వినత్తవముల వలె వంటపాత్రలు సమృద్ధిగా నుండును. 142

నాకు కల్యాణమనిన నొకపాత్రమును కానరాకున్నది. అందర కన్నిపనులకును దైవ మనుకూలించవలెను. 143

ఏడు జిహ్వలుగల యగ్నిహోత్రా! వంటకు సామగ్రులు లేవిచో నన్నమును స్వామి పుష్కరిణియందును, పాపవినాశినీ తీర్థమున పప్పును. 144

ఆకాశగంగా తీర్థమున బెల్లముతోగూడిన పరమాన్నమును, దేవతీర్థమున కూరను తుంబురతీర్థమున పులిహోరను 145

కుమారతీర్థమున పలువిధముల పిండివంటలను, పాండుతీర్థమున మంచి పులుసు (చారును) 146

వ్యఞ్జనా న్యన్యతీర్థేషు । కన్దమూలఫలై స్సహ ।
క్రియతాంలేహ్యపేయాని । తీర్థేష్వన్యేషుపావక ॥ 147

ఇతి దేవస్య వాక్యాని । ప్రశశంసు ర్మహర్షయః ।
తథా చ కృతవాన్ జాత । వేదాః వేదవిశారదః ॥ 148

ఏవం విచిత్రకర్మాణి । హరే ర్వైకుణ్ఠవాసినః ।
యుగానుసారిణ స్తస్య । తదద్భుతవిడమ్బనమ్ ॥ 149

అచిన్త్యం దేవతాకార్యం । అవాఙ్మనసగోచరమ్ ।

అగ్నిః —

దధ్యోదనతిలాన్నే చ । పరమాన్నం మధుస్రవమ్ ॥ 150

మాషాపూపాః గుడాపూపాః । శాకద్వయ మతః పరమ్ ।
సర్వం సుపక్వతాం నీతం । త్వత్ప్రసాదేన కేశవ ః ॥ 151

ఆమన్త్రయద్విజేన్ద్రాంశ్చ । సురా నపి మునీ నపి ।
అగ్నివాణీం సమాకర్ణ్య । శ్రీనివాసో విరామయః ॥ 152

సమ్ప్రేషయ త్సివసుతం । షణ్ముఖం మిధిలేశ్వర ః ।

## శ్రీశేషాద్రౌ కశ్యపాదిభ్యో బ్రహ్మాదికృతఉపచారప్రకారః

సజగామా తివేగేన । జపతో ఽగ్నిపరాయణాన్ ॥ 153

బ్రాహ్మణాన్ వేదవిదుషః । ఆజుహావ జనాధిప ః ।
పాక స్సమ్పూర్ణతాం ప్రాప్తః । ఉత్తిష్ఠత సురద్విజాః ॥ 154

ఇతి తేన సమాహూతాః । కశ్యపాత్రిపురోగమాః ।
దేవా శ్చ నికటం తస్య । పాకస్థానస్య భేజిరే ॥ 155

విభజ్య తత్ర విధివత్ । పాత్రభూతాన్ పృథక్ పృథక్ ।
పఙ్క్తీ శ్చ కారయిత్వా ఽథ । తారతమ్యానుసారతః ॥ 156

మిగిలిన వృష్కరుణులయందు కందమూల ఫలములతోకూడ ఇతర కూరలు మొదలగు వానిని నాలుకతో నాకతగినట్టియు, త్రాగదగినట్టియు పదార్థములను ఇతర తీర్థములయందు వంసిద్ధ మొనర్చుమని 147

యానతీయగా మహర్షులు సంతసించిరి. వేదశాస్త్ర నిష్ణాతులగు అగ్నిహోత్రుడట్లే యొనర్చెను. 48

ఈ విధముగా వైకుంఠలోక నివాసియు, ఆయా యుగములయం దాయా రూపములతో నవతరించు శ్రీనివాసుని మనుష్యాను కరణము. ఆతని విచిత్ర కృత్యము లత్యద్భుతములు. 149

దేవుని కృత్యము లమాహ్యములు. మనస్సునకు వాక్కున కందనివి. అటు పిమ్మట అగ్నిహోత్రుడు, దధ్యోదనము, నువ్వుల పప్పుతోకూడిన చిత్రాన్నము, తేనెను స్రవింపజేయుచున్న పరమాన్నము 150

మినపపప్పుతో చేసిన భక్ష్యములు, బెల్లముతో నేర్పరచిన అప్పములు, రెండు కూరలు, నీ యనుగ్రహముచే చక్కగా వండబడినవి. 151

బ్రాహ్మణోత్తములను, దేవతలను, మునులను పిలువవంపుమ'ని తెలుపగా విశ్రాంతుడై శ్రీనివాసు డందరను పిలుచుటకు 152

ఓ జనకమహారాజా! శివుని కుమారుడగు కుమారస్వామిని పంపించెను.

## శేషాచలమున కశ్యపాదులకు బ్రహ్మ మన్నగువారుపచారముల నొనర్చుట

అతడు మిక్కిలి తొందరతో నేగి, మంత్రములను జపించుచున్నట్టియు' అగ్నిహోత్రముల నాదరముతో గావించుచున్నట్టి 153

వేదశాస్త్రపరాయణులగు బ్రాహ్మణులతో— ద్విజోత్తములారా! అమరులారా! వంట వంసిద్ధమైయున్నది లేచిరండ'ని పిలచెను. 154

పిలచినంతనే కశ్యప అత్రి మొదలగు మునీంద్రులును, దేవతలును, వంటశాల యొద్ద కేతెంచిరి 155

అచ్చట నీశ్వరుడు తగినవారినందరను వేరువేరుగా విభాగమొనర్చి వారివారి యర్హతానుసారము వంక్తులను విభజించి 156

పాత్రాణి వ్యస్తృణో చ్చముఖ్యః । పాత్రాపాత్రవిచక్షణః ।
పాణ్డుతీర్థం సమారభ్య । శ్రీశైలావధి భూసురాః ॥ 157

దేవా శ్చ నిఖిలీభూతాః । తస్మిన్ కృష్ణమహోత్సవే ।
స్థితా దేవద్విజా స్తత్ర । స్వస్వపాత్రా న్తికే పృథక్ ॥ 158

తదా హ భగవాన్ రాజన్ ! । బ్రహ్మాణం చతురాననమ్ ।

శ్రీ భగవాన్ —

అనర్పితం న దాతవ్యం । దేవానా ఞ్చ ద్విజన్మనామ్ ॥ 159

బ్రహ్మ —

సర్వజ్ఞం సర్వభోక్తారం । సర్వలోకేశ్వరేశ్వరమ్ ।
త్వా మేవ వేద్మి గోవిన్ద ! । న త్వత్తుల్యో న చాధికః ॥ 160

కస్మై నివేదయేయం భోః । ప్రశాధి కమలాపతే ! ।
స పుత్రవచనం శ్రుత్వా । పుత్ర మాహ హసన్నివ ॥ 161

శ్రీ భగవాన్ —

అహోబిలనృసింహస్య । పూజాం కృత్వా నివేదయ ।
ఇత్యు క్తో వాసుదేవేన । నృసింహస్యా ర్పణం నృప ॥ 162

బ్రహ్మ చకార సర్వేషాం । మునీనా మపి సమ్మతమ్ ।
గృహారాధనదేవాం శ్చ । మన్త్రై ర్పునర్చ తతఃపరమ్ ॥ 163

అక్షతార్ఘ్యైర్ముఖ్యగన్ధై శ్చ । ధూపదీపానులేపనైః ।
విప్రాణా మర్చనం చక్రే । బ్రహ్మ చ విధిపూర్వకమ్ ॥ 164

సనామా వన్దనపూర్ణో । హరి స్తాన్ లౌకికై స్సమః ।
పరివేషం తత శ్చక్రుః । అష్టౌ దిక్పాలకా స్తదా ॥ 165

పాత్రసంస్కారపూర్వ ఞ్చ । చక్రు స్తే పరివేషణమ్ ।
పరివేష ఞ్చ సమ్పూర్ణం । అకర్ణాశ గ్నిముఖా ద్ద్విజః ॥ 166

పాత్రాపాత్రవిభేదము నెఱుంగు రుద్రుడు భోజనపళ్లెముల నుంచెను. పాండు తీర్థము మొదలుగాని శ్రీశైలమువరకు బ్రాహ్మణులు, 157

దేవతలు సంఘసంఘములుగా వచ్చిరి. దేవతలును, బ్రాహ్మణులును తమతమ పళ్లెములవద్ద వేర్వేరుగా కూర్చుండిరి. 158

ఆ సమయమున శ్రీనివాసుడు చతుర్ముఖునితో— దేవతలకును, బ్రాహ్మణులకును భగవన్నివేదితముకాని యన్నమును పెట్టరాద'ని యనినంతనే చతుర్ముఖ దాతనితో— 159

గోవిందా! సకలము నెఱింగినవాడవు. సకల పదార్థముల ననుభవించువాడవు. సకలలోకములకు నియామకుడవు నీవేకదా! నీకు సమానుడు నీ కంటె యధికుడు నుండునా? 160

ఇక నెవరికి దీని నారగింపొనరింపమందువో యాజ్ఞాపింపుమనగా శ్రీనివాసుడు మందస్మిత మొనరించుచు నా బ్రహ్మతో 161

శ్రీ భగవానుడు —

అహోబిల నరసింహునకు పూజ యొనరించి నివేదన మొనరింపుమని తెలుపగా 162

బ్రహ్మ యట్లే యొనర్చి నిత్యము గృహమున పూజించు దేవతలను కూడ ఆవాహనమొనర్చి మిక్కిలి పూజించెను. మునులందరు సంతసమున సమ్మతించిరి. 163

అక్షతలతోను, అర్ఘ్యముతోను, గంధముతోను, ధూపదీపచందనపూతలతోను, బ్రాహ్మణులను బ్రహ్మ పూజించెను. 164

శ్రీనివాసుడు మానవుల విడంబించుచు సంతసమున వారికి నమస్కరించెను. అష్టదిక్పాలకులును 165

పాత్రలను శుద్ధిపరచుచు వడ్డన గావింపగా నావార్త శ్రీనివాసు దగ్నిహోత్రుని వలన విని 166

ఏకో విష్ణు ర్మహద్భూతం । పృథ గ్భూతా న్యనేకశః ।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా । భుఙ్క్తే విశ్వభు గవ్యయః ॥ 167

ఇత్థం కృష్ణార్పణం చక్రే । శ్రీనృసింహాయ విష్ణవే ।
కశ్యపాద్యాంశ్చ గోవిన్దో । "జుషధ్వ" మితి చాబ్రవీత్ ॥ 168

"భవతాం జ్ఞానపూర్ణానాం । కి మనేనా ద్య పూర్ణతా ।
భవిష్యతి మహాప్రాజ్ఞాః । దయావన్త స్తపోధనాః ॥ 169

దరిద్రం మా ఇచ్ఛ జానన్త । స్త్వన్నం మే సజలం లఘు ।
అనాదృత్య స్వీకురుత । కృపయా నితరా" మితి ॥ 170

ప్రార్థనాం బ్రాహ్మణానా న్తు । కృతవాన్ ప్రాకృతో యథా ।
వాసుదేవవచః శ్రుత్వా । వాక్య మాహు ర్మహీసురాః ॥ 171

ఋషయః —

లివా న్న మమృతప్రఖ్యం । ముక్తిమార్గస్య సాధనమ్ ।
వయం ధన్యాః కృతార్థాః స్మ । కలౌ పాపాకులే హరే ! ॥ 172

అభినన్ద్య త మిత్థం తే । సుసన్తుష్టా అభుఞ్జత ।
భోజనానన్తరం రాజన్ । బ్రాహ్మణానాం యథార్హతః ॥ 173

తామ్బూలం దక్షిణా శ్చైవ । ప్రదదౌ భగవా న్హరిః ।
సవిప్రభోజనస్యాన్తే । స్వయంభోజనమాచరత్ ॥ 174

పుత్రేణ పుత్రపుత్రేణ । భార్యయా బన్ధుభి ర్యుతః ।
సాగ్నిః సలోకపాల శ్చ । స శేషో గరుడాన్వితః ॥ 175

భోజనాన్తే దినాధీశో । రాత్రిస్థాన ముపాగతః ।
శయనం కృతవాన్ కృష్ణః । పర్యఙ్కే రమయా సహ ॥ 176

స్వయం నిద్రావిహీనో ఽపి । రేమే ప్రాకృతవ ద్ధరిః ।
బ్రహ్మాదయ స్సురశ్రేష్ఠాః । కశ్యపాత్రిపురోగమాః ॥ 177

శయనం చక్రిరే రాజన్ ! । కన్దరేషు గృహేషు చ ।
వృక్షమూలేషు శైలానాం । గహ్వరేషు దరీషు చ ॥ 178

"శ్రీ మహావిష్ణువు ఒక్కడై యుండియు వేరువేరుగానుండు అనేక విధములగు భూతములను, మూడులోకములను వ్యాపించి ఆ భూతము లన్నిటికిని అంతరాత్మయై జగములను పాలించుచు తా నేవికారములను చెందక లీలారసము ననుభవించుచున్నాడ"ని 167

శ్రీ యహోబిలనృసింహస్వామికి కృష్ణార్పణ మొనరించి కశ్యపాదిమునీంద్రులతో ప్రీతియుక్తులై భుజింపుడని విన్నవించెను. 168

జ్ఞానాధికులగు మీకు నేడు దీనిచే పరిపూర్ణత యెట్లు కలుగును ? తపోధనులారా ! మీరు దయాళులు — 169

నన్ను దరిద్రునిగా నెఱింగి నీటితోగూడిన యీ యల్పాన్నమును పరమాన్నముగా స్వీకరించి దయతో భుజింపుడ'ని 170

బ్రాహ్మణులను సాధారణ మానవునివలె ప్రార్థించెను. బ్రాహ్మణు లందరును శ్రీనివాసుని ప్రార్థనను విని 171

ఋషులు —

శ్రీమన్నారాయణా ! పాపపరిపూర్ణమగు కలియుగమున నీ వొసంగిన యన్న మమృతముతో సమానమై మోక్షసాధన మగుచున్నది. మేము ధన్యులము కృతార్థులమని ప్రశంసించిరి. 172

యాతనికి తమ సంతోషమును తెలుపుచు భుజించిరి. భోజనమయిన పిమ్మట బ్రాహ్మణులకు యథోచితముగా శ్రీనివాసుఁడు వారికి — 173

తాంబూలమును దక్షిణ నొసంగి 174

పుత్రుడగు బ్రహ్మతోను, మనుమడగు శివునితోను, భార్యయగు లక్ష్మితోను, బంధువులతోను, అగ్నిహోత్రునితోను, లోకపాలురతోను, శేషునితోను, గరుడునితోను తానును భుజించెను. 175

భోజనానంతరము సూర్యుడు రాత్రి స్థానమును సమీపించెను. 176

తాను స్వభావముచే నిద్రలేనివాడయ్యును, లౌకికమానవునివలె లక్ష్మీదేవితో పాన్పునజేరి పవళించెను. బ్రహ్మాదిదేవతలును కశ్యప అత్రి మొదలగువారును, 177

కొండచరియలయందును, గృహములయందును, చెట్లమూలమునను, పర్వత పొదరిండ్లయందును, గుహలయందును, చరియలయందును శయనించిరి. 178

### భగవదాజ్ఞయా బ్రహ్మకృతసైన్యసజ్జీకరణప్రకారః

తతః ప్రభాతే విమలే । శ్రీనివాసః సతాం గతిః ।
గరుడం ప్రేషయామాస । బ్రహ్మాణం ప్రతి భూమిప ॥ 179

స గత్వా వాయువేగేన । బ్రహ్మాణం తల్పసంస్థితమ్ ।
ప్రత్యువాచ మహారాజ । పక్షిరాట్ పరమం వచః ॥ 180

గరుడః —

గచ్ఛ తాతాన్తికం బ్రహ్మన్ । వస్త్రాలఙ్కారభూషితః ।
హంస మారుహ్య చన్ద్రాభం । గన్తుం రాజేన్ద్రపత్తనమ్ ॥ 181

వాద్యన్తాం చ విచిత్రాణి । వాదిత్రాణి మహాన్తి చ ।
గజ మారోప్య మహతీ । భేరీ చాద్యా నువాద్యతామ్ ॥ 182

వాహనాని విచిత్రాణి । రథా ఆన్దోలికా అపి ।
అలఙ్క్రియన్తాం రాజేన్ద్ర । పురీం గన్తుం ససమ్భ్రమమ్ ॥ 183

పక్షిరాడ్వచనం శ్రుత్వా । పక్షివాహననన్దనః ।
నియోజయామాస తదా । బలం దేవగణస్య చ ॥ 184

గజానాఞ్చ హయానాఞ్చ । వృషభాణాఞ్చ మణ్డలమ్ ।
పదాతీనాఞ్చ శూరాణాం । మణ్డలం సమలఙ్కృతమ్ ॥ 185

శూరాశ్చ కృతవిద్యాశ్చ । ధృతశస్త్రాస్త్రపాణయః ।
పితామహం పురస్కృత్య । జగ్ముర్నారాయణాన్తికమ్ ॥ 186

తందృష్ట్వా సర్వదేవేశం । భగవానాహ భూపతే ।

శ్రీనివాసః —

విలమ్బః క్రియతే కస్మాత్ । గమనార్థం పితామహ ॥ 187

నియోజయ బలం సర్వం । రాజధాన్యై నృపస్య చ ।
ఇత్థం హరేర్వచః శ్రుత్వా । వాసుదేవాత్మజో ఽబ్రవీత్ ॥ 188

## శ్రీనివాసుని యాజ్ఞచే బ్రహ్మ సైన్యమును సిద్ధమొనరించుట

సూర్యోదయము యనంతనే శ్రీనివాసుడు బ్రహ్మవద్దకు గరుడుని పంపెను. 179

అత డతిశయమున పక్కపై శయనించియున్న బ్రహ్మను సమీపించి యాతనితో 180

గరుత్మంతుడు —

చతురాననా ! నూతన వస్త్రములను ధరించి అలంకారముల నలంకరించుకొని చంద్రునివంటి తెల్లని కాంతిగల హంస నధిరోహించి యాకాశరాజనగరమున కేగుటకు శ్రీనివాసునివద్ద కేగుము. 181

విచిత్రములగు గొప్ప వాయిద్యములను బ్రయోగించుడు. గొప్ప భేరిని ఏనుగుపై నుంచి బ్రయోగింతురుగాక ! 182

విచిత్రములగు వాహనములను రథములను, పల్లకీలను శీఘ్రముగా నలంకరింపుడని 183

తెలుపగా గరుడవాహనుని పుత్రుడగు బ్రహ్మ - దేవతాసమూహముల సేన వందులకు నియోగించెను. 184

ఏనుగు సముదాయములను, గుఱ్ఱముల గుంపులను, వృషభముల సమూహములను, కాలిబంటుల వీరుల సంఘములను చక్కగా నలంకరించిరి. 185

ధనుర్విద్యలలో నారితేరిన శూరులు ధనుర్బాణముల ధరించి బ్రహ్మను ముందిడుకొని శ్రీనివాసుని సమీపించిరి. 186

సకల దేవనాయకుడగు చతుర్ముఖునితో శ్రీనివాసుడు "పితామహా ! ఇంకను పయనించుట కాలశించుచుంటిరేల ? 187

సైన్యమునంతను ఆకాశరాజనగరమునకు పంసిద్ధమొనర్పుడని ఆజ్ఞాపించగనే బ్రహ్మదేవుడు 188

వశీకృతం బలం సర్వం । ధృతాయుధ మరిన్దమ ।
ఉత్తిష్ఠ పురుషశ్రేష్ఠ ! । సమారోహఖగేశ్వరమ్ ॥

## వియద్రాజపురం ప్రతి సపరికరశ్రీనివాసగమనమ్

స ఇత్థ ముక్తో భగవాన్ । గరుడస్కన్ధ మాస్థితః ।
బ్రహ్మాణ మగ్రతః కృత్వా । రుద్రం కృత్వా తు దక్షిణే ॥ 190

వామే వాయుం తతః కృత్వా । కుమారం పృష్ఠత స్తథా ।
రమా మారోపయామాస । రథం కాఞ్చననిర్మితమ్ ॥ 191

మాతరం వకులాం రాజన్ । విమానం సూర్యసన్నిభమ్ ।
సమారోప్య మహారాజ ! । భగవాన్ భక్తవత్సలః ॥ 192

స్వయ స్తు గరుడారూఢో । జగామ చ సతాం గతిః ।
శేషో దధార రాజేన్ద్ర । శ్వేతచ్ఛత్రం శశిప్రభమ్ ॥ 193

చామరే చన్ద్రసఙ్కాశే । వీజయామాస మారుతః ।
వ్యజనేనవిచిత్రేణ । రత్నదణ్డేనమాధవమ్ ॥ 194

వీజయామాస రాజేన్ద్ర । విష్వక్సేనః ప్రతాపవాన్ ।
భేరీదున్దుభి నిర్ఘోషైః । వాదిత్రాణాం మహాస్వనైః ॥ 195

నర్తకై ర్నటనై శ్చైవ । హాహాహూహూయుతో ఽఞ్జసా ।
యయౌ విభవ మాపన్నః । సర్వాత్మా సర్వతోముఖః ॥ 196

గమనే వాసుదేవస్య । దేవానా మపి భూమిప ! ।
ఋషీణాం పూర్వదేవానాం । గన్ధర్వాణాం తపస్వినామ్ ॥ 197

సమ్మర్దః సమ్భభూవాత్ర । పశూనాం మానుషాత్మనామ్ ।
వనితానా ఞ్చ వృద్ధానాం । బాలానాం రక్షసామ పి ॥ 198

అన్యోన్యం కలహ స్తత్ర । వనితానా మభూ త్తదా ।
ఋషీణాం ఋషికన్యానాం । దేవస్త్రీణా ఞ్చ దైవతైః ॥ 199

శ్రీనివాసా ! బలమంతయు ఆయుధములను ధరించి సిద్ధమొనర్పబడినది. నీవు వేడి గరుత్మంతు నధిరోహింపుమ'ని తెలిపినంతనే 189

## శ్రీనివాసుడు సేనాసమేతుడై ఆకాశరాజనగరమున కేగుట

శ్రీనివాసుడు గరుడు నారోహించి బ్రహ్మను ముందుగా నుంచుకొని రుద్రుని దక్షిణవేపున నిలిపికొని 190

ఎడమభాగమున వాయువును, కుమారస్వామిని వెనుకగ నమర్చికొని శ్రీదేవిని బంగారు రథముపై నాసీనముగావించి 191

తల్లియగు వకుళమాలికను సూర్యునివంటి కాంతిగల విమానమున నెక్కించి భక్తవత్సలుడగు భగవంతుడు గరుడవాహనారూఢుడై 192

బయలుదేరుచుండగా నాదిశేషుడు చందమామవలె తెల్లని కాంతిగల తెల్లని గొడుగును ధరించెను. 193

వాయువు జాబిలివలె ధవళకాంతిగల రెండు చామరములను తీసికొని విసర సాగెను. 94

పరాక్రమవంతుడగు విష్వక్సేనుడు విచిత్రమగు రత్నపుపిడిగల విసనికఱ్ఱతో వీవసాగెను. భేరీదుందుభిధ్వానములతోను, వాయిద్యఘోషలతో, 95

నర్తనముచేయు వారితోను, నాట్యమొనర్చువారలతోను, " హాహాహూహూ " యను గంధర్వగానములతోను సకలవ్యాపియు సర్వద్రష్టయగు శ్రీనివాసుడు వైభవముతో వెడలుచుండగా 196

దేవతలయొక్క, ఋషులయొక్క, రాక్షసులయొక్క, గంధర్వులయొక్క, మౌనీంద్రులయొక్క, 197

పశువులయొక్క, మనుజులయొక్క, స్త్రీలయొక్కయు, ముదుసలులయొక్కయు, బాలురయొక్కయు, రాక్షసులయొక్కయు గుంపులు గుమిగూడెను. 198

స్త్రీలు తమలో తామొనర్చు జగడములతో కలకలము బయలుదేరెను. ఋషులకు, ఋషికన్యలకు, దేవతాస్త్రీలకు దేవతలతో వాదోపవాదములు కలుగుచుండెను. 199

తత్రా ధనా తు గచ్ఛన్తీ । మార్గమధ్యే మహీపతే ! ।
కాచి ద్భర్తార మాలమ్బ్య । పుత్ర మంసే నిధాయ చ ॥ 200

భర మద్ధృత్య శిరసి । పద్భ్యా మేవ స్మ గచ్ఛతి ।
తస్మిన్ కాలే మహారాజ ! । రథస్థాః సురయోషితః ॥ 201

పన్థాన మనురుద్ధన్త్యో । ఒతర్జయం శ్చాధనాన్ కృశాన్ ।
తదా వియోగ మాపన్నా । భర్త్రా సా భారపీడితా ॥ 202

కూజన్తీ " నాథ హా నాథ । వనే న త్యక్తు మర్హసి " ।
ఏవ ముక్త్వా విప్రపత్నీ । సపుత్రా పతితా భువి ॥ 203

రుదితాః శిశవ స్తత్ర । ప్రహృష్టా స్తత్ర కేచన ।
కేచి త్పయః స్మ కాఙ్క్షన్తి । కేచి దన్నం మహీపతే ! ॥ 204

హసన్తి కేచి త్పురుదన్తి కేచిత్ । ప్రయాన్తి కేచిత్పురిలపన్తి కేచిత్ ।
వదన్త మన్యే కరపల్లవేన । సముద్ధరన్తి స్మ హసన్తి కేచన ॥ 205

సురాఙ్గనా శ్చ రాజేన్ద్ర ! । తథా వైఖానసాఙ్గనాః ।
ఋష్యఙ్గనా శ్చ గన్ధర్వ । వనితా శ్చా రులోచనాః ॥ 206

అవారోహన్ గిరే శ్చైవ । శ్రీనివాసపరాయణాః ।
శేషాచలం సమారభ్య । నారాయణపురావధి ॥ 207

తిలమాత్రావకాశః స్మ । మార్గమధ్యే న దృశ్యతే ।
మధ్యే కృత్వా పద్మతీర్థం । గతా సా వాహినీ హరేః ॥ 208

ఋగ్యజుస్సామాథర్వాద్యైః । గీయమానో జగద్గురుః ।
శ్రీపతిః పద్మతీర్థాఖ్యం । మహాతీర్థం మహీపతే ! ॥ 209

ఆససాద జగద్యోనిః । సచ్చిదానన్దవిగ్రహః ।
సమరామరగన్ధర్వ । సిద్ధసాధ్యమరుద్గణః ॥ 210

ఆ సమయమున మార్గమధ్యమున చనుచున్న ఒక దరిద్రవనిత భర్త నూతగా గొని బాలుని భుజముపై నుంచుకొని 200

తలపై బరువును పెట్టుకొని నడచి వెళ్లుచుండెను. ఆ సమయమున రథమునందు కూర్చొనియున్న దేవతాస్త్రీలు 201

మార్గమున నష్టుగా నిలచి నిర్ధనులను, దుర్బలులను బాధింపసాగిరి. ఆ సమయమున భర్తనుండి విడివడినదియు బరువును మోయుచున్న ఆ వనిత బరువును సహింపలేక 'నాథా! నన్నడవిలో వదలకుము'ని పలుకుచు పుత్రునితో భూమిపై పడెను. 202, 203

కొందరుబాలు రేడ్చుచుండిరి. కొందరు సంతసించుచుండిరి, కొందరు పాలను, కొందరన్నము నభిలషించుచుండిరి. 204

కొంద రేడ్చుచుండిరి; కొందరు పరుగెత్తుచుండిరి. కొందరు తారుమారుగ మాట్లాడుచుండిరి. కొందరట్లు మాట్లాడువానిని పైకి లేవనెత్తుచుండిరి. 205

దేవతాస్త్రీలును, వైఖానసలలనామణులును, ఋషిపత్నులును, గంధర్వ కాంతలును, 206

శ్రీనివాసలగ్న చేతస్కులై కొండనుండి దిగిరి. శేషాద్రినుండి మొదలుకొని నారాయణపురమువరకు 207

మార్గమధ్యమున నువ్వుగింజంత స్థలమైనను మనుష్యరహితముగ లేకుండెను. పద్మతీర్థమును చుట్టుముట్టి శ్రీనివాసుని సైన్యము నిలచెను. 208

ఋక్‌యజుస్సామఅథర్వణవేదములచే స్తుతింపబడుచు 209

దేవామర గంధర్వసిద్ధసాధ్య మరుద్గణములతోకూడి సదానంద స్వరూపుడగు శ్రీనివాసుడు పద్మతీర్థమను మహాపుష్కరిణిని సమీపించెను. 210

### భగవన్తం ప్రతి శుకమునికృతకుచారక్రమః

ప్రాప్తం గరుడ మారూఢం । కృష్ణద్వైపాయనాత్మజః ।
సాష్టాంగన్యసనం రాజన్ ! । ప్రణిపత్య శుకో ఽబ్రవీత్ ।
తపశ్చ సఫలం మన్యే । కృతం మే పురుషోత్తమ ॥ 211

యో భవాన్ బ్రహ్మరుద్రాద్యైః । అగమ్యో వేదగోచరః ।
తం భవన్తం ప్రపశ్యామి । నేత్రాభ్యాం పురుషోత్తమ ! ॥ 212

సపుత్రమిత్రాఖిలలోకపాలం । శేషేణ లక్ష్మ్యా చ యుతం యతో ఽహమ్ ।
పశ్యామి భాగ్యోదయశాలిదృగ్భ్యాం । త్వత్పాదపూజా సఫలా తతో మే ॥ 213

విజ్ఞాపనం మే శృణు దేవరాజ ! । ప్రసాదహేతో స్తవ వాసుదేవ ! ।
కృత్వా కృపాం వేఙ్కటశైలనాథ ! । భుక్త్వా మదీయం ఫలకన్దమూలమ్ ॥ 214

ఇత్యుక్తో మునినా తేన । వాసుదేవో ఽభ్యభాషత ।

శ్రీ భగవాన్ —

శృణు తాపసశార్దూల ! । వచనం సాధు సమ్మతమ్ ॥ 215

భవాన్ కృశో విరాగీ చ । బ్రహ్మచారీ దృఢవ్రతః ।
వయం సంసారనిరతాః । బహవశ్చాత్ర భూసుర ! ॥ 216

అద్యైవ నగరీం గత్వా । రాజ్ఞ స్తస్య మహాత్మనః ।
తత్రైవ భోజనం కుర్మ । ఇతి మే వర్తతే మనః ॥ 217

వదత్యేవం హృషీకేశే । వ్యాసపుత్రో ఽభ్యభాషత ।

శ్రీ శుకః —

నిష్కిఞ్చనో ఽహం గోవిన్ద ! । నిష్కిఞ్చనజనప్రియ ॥ 218

త్వయి భుక్తే జగ ద్భుక్తం । నా త్ర కార్యా విచారణా ।
వద త్యేవం శుకే కృష్ణం । వకుళా వాక్య మబ్రవీత్ ॥ 219

వకుళా

## శ్రీనివాసునకు శుకయోగి ఉపచారముల నొనర్చుట

కృష్ణద్వైపాయన పుత్రుడగు శ్రీ శుకయోగీంద్రుడు గరుత్మంతునిపై వచ్చిన శ్రీనివాసునికి సాష్టాంగముగా నమస్కరించి పురుషోత్తమా! నా తపస్సు ఫలించినది. 211

బ్రహ్మరుద్రాదులకు కనుపించనివాడై వేదములకుమాత్రమే ప్రత్యక్షమైనవాడ వగు నిన్ను నా నేత్రములతో గాంచగల్గితిని. 212

పుత్రులతోను, మిత్రులతోను, సేవకులతోను, లక్ష్మితోను కూడియున్న నిన్ను నా అదృష్టముచే కనులార గాంచగల్గుటంజేసి నేను నీ చరణకమలసంసేవనఫలితము నందగల్గితిని. 213

శ్రీనివాసా! నా విన్నపము నాలింపుము. నాయందు దయయుంచి నీదయకొఱకై నే నొసంగిన కందమూలములను భుజింపుము'ని ప్రార్థింపగా 214

శ్రీనివాసు డాతనితో — మునీంద్రా! సజ్జనులచే నంగీకరింపబడు నా మాటను వినుము. 215

నీవు వ్రతాచరణముచే కృశించినవాడవు. భోగవిముఖుడవు. బ్రహ్మచర్యవ్రత నిష్ఠుడవు. శాస్త్రసమ్మతమగు ధర్మాచరణమున పూనికకలవాడవు. మేము సాంసారిక విషయాసక్తులము. 216

పెక్కుమందిగా వచ్చియున్నాము. నేడే ఆకాశరాజనగరమున కేగి యా మహాత్ముని యాతిథ్యము నంగీకరింపవలెనని నా సంకల్పము'ని బదులిడెను. 217

శ్రీనివాసుని మాటలను విని శ్రీ శుకయోగీంద్రుడు నే నేమియు లేనివాడను. నిరాడంబరులగు జనులకే ప్రియమైనవాడవు. 218

నీ వారగించిన జగత్తులోనివా రందరు నారగించినట్లే, నీవు సందియమొంద వలద'ని ప్రార్థింప 219

వకుళాదేవి —

శృణు తద్వచనం కృష్ణ ! త్వద్వివాహే రమాపతే ! ।
యత్నం బహువిధం చక్రే । రాజానం స హి బోధయన్ ॥ 220

ఇతి మాతు ర్వచః శ్రుత్వా । మాధవః శుక మబ్రవీత్ ।

శ్రీనివాసః —

త్వద్వాక్యామృతపానేన । తృప్తి ర్మే ఽభూ న్మునీశ్వర ! ॥ 221

కిమన్యేన ప్రాకృతేన । ఫలేనాల్పరసేన మే ।
తథాఽపి తవ వాక్యేన । కరిష్యే భోజనం మునే ! ॥ 222

సాన్త్వయిత్వా మునివరం । గరుడా దవరుహ్య సః ।
కుటీరం సంప్రవిశ్యా థ । సపుత్రః సపరిగ్రహః ॥ 223

ముక్తైః కృతాసనే రమ్యే । సంస్థితః పరమేశ్వరః ।
శుకః స్నాత్వా పద్మతీర్థే । కృత్వా ఽన్నం భక్తిసంయుతః ॥ 224

అమృతాబీజనిచయం । ముష్టిభిః ప్రవిఘాత్య చ ।
తత్తణ్డులై ర్మహారాజ ! । కృతవా నన్న ముత్తమమ్ ॥ 225

బృహతీఫలసంయుక్తం । తిన్త్రిణీరససంయుతమ్ ।
స్వావస్థస్య య ద్యోగ్యం । పూజాసాధన మేవ చ ॥ 226

తేనైవ బాహ్యమూర్తే స్తు । పూజనం సాధుసమ్మతమ్ ।
ఇతి మత్వా ఽర్థత త్త్వజ్ఞః । కృత్వా పాదావనేజనమ్ ॥ 227

పద్మపత్రాణి చా స్తీర్య । తత్రా న్నం రససంయుతమ్ ।
నినిక్షిప్య విశేషేణ । కృతసాష్టాఙ్గసన్నతిః ॥ 228

భోజనం కురు గోవిన్ద ! । సదా పూర్ణమనోరథ ! ।
ఏవం సమ్ప్రార్థితో దేవః । శుకేన పరమర్షిణా ॥ 229

భక్తిపారవశ్యేన । భగవా నాత్మభూ స్స్వయమ్ ।
ఋషిణా మచితాహారాన్ । బుభుజే సర్వభోజనః ॥ 230

శ్రీనివాసా ! శ్రీశుకయోగీంద్రుని మాటలను వినుము. నీ వివాహమునకై రాజు నంగీకరింపజేయుటకై చాల ప్రయత్నమొనర్చి యున్నారని తెలుపగా 220

శ్రీనివాసుడు —

మునీంద్రా ! నీ యమృతోపమానములగు మాటలను వినుటచేతనే నేనెంతయో తృప్తినొందితినని పలుకుచు 221

శుకా ! నీ వాక్యామృతపానముచేత నేను తృప్తిపొందితిని. ఇక యితరము లెందుకు ? 222

మునీంద్రుని మృదుభాషణములచే సంతసపరచి గరుడునినుండి దిగి తన పుత్ర మిత్ర పరివారముతో నాతని పర్ణశాలలో ప్రవేశించి 223

దర్భాసనమున కూర్చుండెను. శ్రీశుకయోగీంద్రుడు పద్మసరోవరమున స్నాన మొనరించి 224

అమృతధాన్యమును పిడికిళ్లతో దంచి బియ్యమును బయల్పరచి యా బియ్య ముతో నన్నమును భక్తితో వండెను. 225

వాకుడుపండ్లతోను, చింతపండు రసముతోను, భోజనమును సంసిద్ధపరచి తన మనస్సునందలి భగవానుని కేది ప్రీతి నొసగూర్చు ద్రవ్యమో దానిచేతనే 226

తన కనులయెదుట గావించు దివ్యమంగళవిగ్రహుని పూజించు టుచితమను సజ్జనవచనము ననుసరించి శాస్త్రజ్ఞుడగు మౌనీంద్రుడు ఆతనికి కాళ్లు కడుగుకొనుటకు నీళ్లిచ్చి — 227

తామరాకులను పరచి అందు రసముతో గూడిన అన్నమును వడ్డించి సాష్టాంగ ముగా నమస్కరించి 228

" సత్యకామా ! గోవిందా ! దీని నారగింపుమ'ని ప్రార్థింపగా — 229

చరాచరాహారియగు శ్రీనివాసుడు — శ్రీశుకయోగీంద్రుని భక్త్యతిశయమునందలి ప్రీతితో ఋషీంద్రుల కనువగు నా భోజనములను భుజించెను. 230

లక్ష్మి స్త్రస్యా ఉజ్ఞయా మాత్రా, సార్ధం వకుళమాలయా ।
ఋషిదే మునినా దత్తం । తదన్న మమృత ప్రభమ్ ॥ 231

తస్మిన్ భుక్తవతి శ్రీశే । ఋషయః కోపపూరితాః ।
తదా శుకం ఘషయన్తః । నిముక్తస్తు ర్ద్వారాసనాత్ ॥ 232

శాపానుగ్రహసామర్థ్యా । సాధనా శ్చ తపోధనాః ।
తేషాం మత స్తు విజ్ఞాయ । భగవాన్ బహి రాగతః ॥ 233

హూత్కారం కృతవాన్ కృష్ణః । సర్వేషాం తృప్తిహేతవే ।
తస్మాఖా మ్భోజసముద్భూత । వాయునా తృప్తిహేతునా ॥ 234

సురధేన్వా యథా తృప్తాః । తథైవ మునిపుఙ్గవాః ।
శుకం సన్తోషయామాసుః । వచనైః స్తోత్రమిశ్రితైః ॥ 235

## శ్రీనివాసాభిముఖతయా స్వపురాత్సపరికరవియన్నృపాగమనమ్

కృత్వా ఉష్టమ్యాం తత్ర వాసం । నవమ్యాం గురువాసరే ।
ప్రభాతసమయే ప్రాప్తే । శ్రీనివాస స్త్వరాఽన్వితః ॥ 236

పున ర్గరుడ మారుహ్య । గురువారే జగద్గురుః ।
చతురఙ్గబలాధ్యక్షం । బ్రహ్మాణ ఇవ పితామహమ్ ॥ 237

విధాయ పురతో రాజన్ ! । జగామ జగదీశ్వరః ।
అస్తాద్రిం ప్రస్థితే భానౌ । తస్మి న్కాలే మహీపతే ! ॥ 238

అషవర్గం వ్యయం కృత్వా । కృతకౌతుకమఙ్గలః ।
పద్మావతీం స్థాపయిత్వా । గన్ధతైలేన భూమిప ! ॥ 239

అలఙ్కృత్య వరాం కన్యాం । అలఙ్కారై ర్మహీపతిః ।
గజమారోప్య తరసా । పుత్రీంపుత్రీహితే రతః ॥ 240

ఆకాశరాజో ధర్మాత్మా । పుత్రేణ సహ సంయుతః ।
పురోహితేన శక్రేణ । తొండమానేన నిర్యయౌ ॥ 241

అనంతరము శ్రీనివాసు నాజ్ఞచే శ్రీదేవి సకలమాలికతో గూడ అమృతోపమాన మగు అన్నమును భుజించెను. 231

శ్రీనివాసుడు భుజించినంతనే ఋషు లందరును క్రోధావిష్టులై శ్రీశుకుని భయ పెట్టుచు తమ ఆసనములనుండి దిగ్గన లేచిరి. 232

శ్రీనివాసుడు శపించుటకు వనుగ్రహించుటకును సమర్థులగు మౌనీంద్రు లందరి యభిప్రాయము నెఱింగి బయట కేతెంచి 233

అందరును తృప్తిచెందుటకై తాను పూత్కారము ("పూ" అని ఊదుట) నొనర్చెను. అందరకును తృప్తిని కలిగించు ఆతని ముఖపద్మమునుండివచ్చిన గాలిచే 234

కామధేనువు ఆతిథ్యముచే తృప్తిచెందిన ట్లా మునీంద్రు లందరును తృప్తిచెంది స్తోత్రోక్తులతో శ్రీశుకుని సంతోషపరచిరి. 235

## ఆకాశరాజు పరివారముతో తన పట్టణమునుండి శ్రీనివాసున కెదురేగుట

అష్టమిరోజున అచ్చట విశ్రమించి, నవమీ గురువాసరమున (బేస్తవారమున) ఉదయమున శీఘ్రముగా శ్రీనివాసుడు 236

మరల గరుత్మంతునిపై నధిరోహించి చతురంగబలముల కధిపతియగు చతుర్ముఖుని 237

ముందుగా విడికొలిపి పయనించెను. సూర్యు డస్తమించు సమయమున 238

ఆకాశరాజు స్వయముగా అష్టవర్గకర్మ నాచరించిన పద్మావతికి పరిమళించుచున్న మానెతో తలయంటి 239

అలంకారములతో నలంకరించి ఆమెకు మంగళము నపేక్షించి యామెను వెంటనే యేనుగుపై నధిష్ఠింపజేసి 240

తన పుత్రునితోను, పురోహితుడగు దేవేంద్రునితోను, తొండమానునితోను బయలుదేరెను. 241

శ్రీనివాసం జగద్యోనిం । ద్రష్టుకామో రమాపతిమ్ ।
చతురఙ్గబలై స్సర్వైః । గజాశ్వరథసంయుతైః ॥ 242

ధ్వజై శ్చైవ పతాకాభిః । చామరై ర్వ్యజనై రపి ।
భేరీమృదఙ్గనిర్ఘోషైః । వాదిత్రాణాం మహాస్వనైః ॥ 243

నర్తకై ర్నటకై శ్చైవ । సూతమాగధవన్దిభిః ।
స్తూయమానో మహారాజః । సైన్యమధ్యే వ్యరాజత ॥ 244

యథా ఽఽకాశే చన్ద్రబిమ్బం । నక్షత్రగణమణ్డలే ।

శ్రీనివాసవియన్నృపపద్మావతీనాంపరస్పరావలోకనమ్

రాజాదదర్శగోవిన్దం । శక్రేణపరివర్శితమ్ ॥ 245

గరుడస్కన్ధమారూఢం । శ్వేతచ్ఛత్రాదిభి ర్యుతమ్ ।
సుకుమారం యువానఞ్చ । సున్దరం సున్దరాననమ్ ॥ 246

శ్రీనివాసం జగద్యోనిం । సచ్చిదానన్దవిగ్రహమ్ ।
దృష్ట్వా సన్తుష్టమనసా । స రథా దవరుహ్య చ ॥ 247

పద్మావతీం స్వపుత్రీఞ్చ । విధాయ పురతో నృపః ।
పురోహితం పురస్కృత్య । చేదం వచన మబ్రవీత్ ॥ 248

ఆకాశరాజః —

ధన్యో ఽహం కృతకృత్యో ఽహం । స్వర్గమార్గ సమాస్థితః ।
ఏవం వదన్తం తత్కాలే । శ్రీనివాసః సతాం గతిః ॥ 249

దదర్శరాజశార్దూలం । నారదేనప్రదర్శితమ్ ।

నారదః —

దీర్ఘ[illegible] దీర్ఘబాహుం । సర్వదాదీర్ఘదర్శినమ్ ॥ 250

శ్వశురం తవ గోవిన్ద ! । పశ్య మాధవ ! భూమిపమ్ ।

శ్రీనివాసః —

ధన్యం నారద మజ్జన్మ । యదాకాశో ఽద్య బాన్ధవః ॥ 251

జగత్కారణభూతుడగు శ్రీనివాసుని దర్శింపగోరి చతురంగబలములతోను, ఏనుగుల, గుఱ్ఱముల, రథములతో కూడినట్టియు 242

ఖంటాలతోను, చామరములతోను, విసనికఱ్ఱలతోను, భేరీమృదంగముఖ వాద్యముల తోను, మంగళవాయిద్యముల మహాధ్వనులతోను. 243

నర్తకులతోను, నాట్యమొనరించువారితోను, రథము నడుపువారును, వంశావళిని చదువువారును, ఇతరులను స్తోత్రముచేసి జీవించువారునగు స్తోత్రపాఠకులచే స్తుతింపబడుచు సైన్యమధ్యమున ప్రకాశించెను. 244

ఆకాశమున నక్షత్రగుంపున ప్రకాశించు చంద్రబింబమువలెనుండి 245

## శ్రీనివాసుడు, ఆకాశరాజు, పద్మావతి ఒకరు నొకరు సందర్శించుకొనుట

గరుత్మంతునిమూపుపై నెక్కి తెల్లనిగొడుగు, చామరములతో కూడియుండి సుకుమారుడై, యౌవనవంతుడై, చూచినంతనే విభ్రమమొందించు నందముకలవాడై, అందమగు ముఖపద్మముకలిగి, 246

సృష్టికర్తయును సదానందరూపుడునునగు శ్రీనివాసుని పురోహితుడైన దేవేంద్రుడు దర్శింపచేయగా నాకాశరాజుగాంచి మనమున మోదమందుచు, రథమునుండి దిగి 247

పద్మావతిని, తనముందుగా నుంచుకొని పురోహితుని తోడ్కొని శ్రీనివాసుని సమీపించి 248

**ఆకాశరాజు —**

"నేను ధన్యుడనైతిని, కృతకృత్యుడనైతిని. నాకు స్వర్గము లభించినద'ని సంతసముతో పలుకుచుండగా సజ్జనులకు ప్రాప్యుడైన శ్రీనివాసుడు 249

వారదుడు శ్రీనివాసునకు— నిడినగు మీసముకలిగి, పొడవగు భుజములు కలిగి, వెల్లవేళలయందును చక్కగా నాలోచించి కార్యముల నొనరించువాడైన 250

యాతడే నీ మామగారు చూడుమని చూపగా శ్రీనివాసు డాకాశరాజునుగాంచి నారదా! ఇట్టి యాకాశరాజుతో బంధుత్వము సంభవించుటచే నా జన్మ ధన్యమైనది. 251

సమ్మాన స్తైః సమ్ప్రాప్తః । కిం మయాఽచరితం పురా ।
ఏవ ముక్త్వైవ హృషీకేశే । రాజా సత్యపరాక్రమః ॥ 252

ద్వారతోరణ మాసాద్య । శ్రీనివాసం దదర్శ హ ।
పూజయామాస గోవిన్దం । వసనాభరణాదిభిః ॥ 253

గన్ధతైలేన రాజేన్ద్రః । జామాతర మపూజయత్ ।
సా దదర్శ వరారోహా । పతింపరమపావనమ్ ॥ 254

పద్మావతీ విశాలాక్షీ । లజ్జయా పరిమోహితా ।
తాం దదర్శ జగద్యోనిః । కమలాక్షీం మహీపతే ! ॥ 255

పద్మావతీ శ్రీనివాసౌ । వాహనా దవరుహ్య చ ।
అన్యోన్యాలోకనం రాజన్ ! । చక్రాతే సంస్థితౌ తతః ॥ 256

వాసుదేవస్య యే భక్తాః । తే ఽన్యోన్యం పరిరేభిరే ।

శ్రీనివాసస్య పద్మావత్యా సహ దుర్గాదర్శనపూర్వకం పురప్రవేశః

నగరద్వారవిలయాం । దుర్గా మాసాద్య భక్తితః ॥ 257

పద్మావత్యనుగో మాయీ । దేవీం నత్వా విశేషతః ।
వరం యయాచే గోవిన్దః । "కురు భార్యా మిమా" మితి ॥ 258

పద్మావతీ విశాలాక్షీ । సావిత్రీం వర ముత్తమమ్ ।
పతిం కురు రమానాథం । శ్రీనివాసం జగన్మయమ్ ॥ 259

ఇతి కృత్వా చ సా దేవీం । నత్వైవ రావత మాశ్రితా ।
గరుడస్కన్ధమారూఢో । భగవాన్ భక్తవత్సలః ॥ 260

దీపకై స్తైలసంసిక్తైః । సహస్రాయుతసఙ్ఖ్యకైః ।
లాజాన్ పుష్పాణ్య క్షతాం శ్చ । వికిరద్భి రిత స్తతః ॥ 261

స్తువద్భి ర్బ్రాహ్మణై శ్చ । వమాత్యై ర్మాగధై రపి ।
ఆశీర్వాదం ప్రకుర్వద్భి । ర్వేదఘోషపురస్సరమ్ ॥ 262

అతనితో సంబంధము కలుగుటకు పూర్వము నే నొనర్చిన పుణ్యమెట్టిదోకదా! అనుకొనుచునా నాకాశరాజు 252

వారిని సమీపించి వస్త్రాభరణాదులతోను, 253

సుగంధతైలముతోను, అర్ఘ్యాది గౌరవించెను. విశాలనేత్రములుగల పద్మావతియు మిక్కిలి సిగ్గుపడుచు పరమపవిత్రమూర్తియు తనకు భర్త కాబోవుచున్న శ్రీనివాసుని గాంచెను. 254

జగత్కారణభూతుడగు శ్రీనివాసుడు నా పద్మనేత్రయగు పద్మావతిని వీక్షించెను. 255

పద్మావతీ శ్రీనివాసులు తమ తమ వాహనములనుండి దిగి ఒకరి నొకరు వీక్షించుకొనుచుండిరి. 256

ఉభయపక్షములయందలి భగవద్భక్తులు ఒకరినొక రాలింగన మొనరించిరి. 257

## శ్రీనివాసుడు పద్మావతితో దుర్గను దర్శించి నగరమున ప్రవేశించుట

శ్రీనివాసుడు పద్మావతిని వెంబడించుచు నగరద్వారమునయున్న దుర్గను సమీపించి భక్తితో నమస్కరించి, 'ఈ పద్మావతిని నా కర్ధాంగి నొనర్పుము' అని వరమును కోరెను. 258

విశాలనేత్రయగు పద్మావతియు, నా దుర్గను 'జగదంతర్యామియగు శ్రీనివాసుని నాకు పతి నొనర్పుము' అని వరమును కోరి 259

నమస్కరించి యైరావతమను గజముపై నధిరోహించెను. భక్తులయందు వాత్సల్యశీలుడగు శ్రీనివాసుడు గరుడు నధిరోహించెను. 260

మూనెతో తడిపిన అనేక వేలకొలది దీపికలు వెలుగుచుండగ, పేలములను, పుష్పములను, అక్షతలను, రెండువైపులనుండి జల్లుచుండగా 261

స్తోత్రపాఠకులు స్తుతించుచుండగా వేదధ్వనులతో ఆశీర్వదించుచున్న 262

బ్రహ్మాదిభిః సురశ్రేష్ఠైః । భూసురైః శుకపూర్వకైః ।
శ్రీనివాసం ప్రపశ్యద్భిః । పౌరనారీనరైర్వృతః ॥ 263

వీణావేణుమృదఙ్గాంశ్చ । పణవానకదున్దుభీన్ ।
వాదయద్భిర్జనైశ్చాన్యైః । వారనారీగణైస్తథా ॥ 264

గన్ధర్వైర్గానవిపుణైః । సూతామాత్యైశ్చ సంయుతః ।
ఆకాశరాజో ధర్మాత్మా । శ్రీనివాసపరాయణః ॥ 265

పద్మావత్యా సమేతం తం । శ్రీనివాసం ససంభ్రమమ్ ।
సఞ్చారయన్ సమన్తాచ్చ । నారాయణపురే శనైః ॥ 266

రమ్భాస్తమ్భైః ఇక్షుదణ్డైః । పూగీపోతైరలఙ్కృతమ్ ।
రసాలపల్లవయుతైః । పూర్ణకుమ్భైరలఙ్కృతమ్ ॥ 267

ముక్తాజాలావృతైశ్చాన్యైః । పద్మరాగవిరాజితైః ।
వజ్రవైడూర్యఖచితైః । ఇన్ద్రనీలసమప్రభైః ॥ 268

తథా మరకతప్రఖ్యైః । తోరణైరుపశోభితమ్ ।
కుఙ్కుమోదకసమ్పూర్ణ । కనత్కనకభాజనైః ॥ 269

స్త్రీభిర్నీరాజయన్తీభిః । రాజమానచతుష్పథమ్ ।
వేదిత్రయంపరిక్రమ్య । వాసుదేవాలయంయయౌ ॥ 270

ప్రవేశయామాస వరం సుమన్దిరం । శ్రీవేఙ్కటేశం బహురత్నసమ్మితమ్ ।
తద్బన్ధువర్గం మునివర్యగుప్తం । బలం యయౌ నాథనికేతనేషు ॥ 271

## శ్రీనివాసాజ్ఞయాతొణ్డమాన్నృపకృత దివ్యాన్నసజ్జీకరణమ్

రాత్రిస్తు పఞ్చఘటికా । సమభూచ్చ తదా తతః ।
జగామ భవనం రాజన్ ! । స్వకీయం రాజవల్లభః ॥ 272

తదా ఉఒగతో మహారాజ ! । తొణ్డమానో మహీపతే ! ।
తమాహ కరుణం శ్రీమాన్ । శ్రీనివాసః సదా ఉద్ధితః ॥ 273

బ్రహ్మాదిదేవగణములతోను, శ్రీశుకాదిబ్రాహ్మణులైన మహర్షులతోను, శ్రీనివాసుని కమలాకరగాంచుచు పురమునందలి స్త్రీలను పురుషులను గుమిగూడి వచ్చుచుండగా 263

వీణ, పిల్లనగ్రోవి, మృదంగము, తమ్మెటలు, తప్పెటలు, దుందుభులు ప్రయోగించు జనులతోను, వేశ్యాంగనాసమూహములతోను, 264

పాడుటయందు నేర్పరులగు గంధర్వులతోను, సూతులతోను (రథము నడుపువారు) మంత్రులతోనుకూడి శ్రీనివాసునియందు దృఢంబులభక్తిగల పరమాత్ముడగు ఆకాశరాజు 265

పద్మావతితో గూడిన శ్రీనివాసుని నారాయణపురమునందంతట మెమ్మదిగా నూరేగించుచు 266

అరటిచెట్లతోను, చెరకుగడలతోను, పోకమానులతోను, నలంకరింపబడినట్టియు మామిడిచిగురులతో గూడినట్టి పూర్ణకుంభములతో నలంకరింపబడినట్టియు 267

ముత్యాలజాలరులతో ముచ్చటగొలుపుచు, పద్మరాగములతో ప్రకాశించుచు, వజ్రవైఢూర్యములచే చెక్కబడి ఇంద్రనీలమాణిక్యములవంటి కాంతిచే నింపెనగుచు, 268

మరకతమణులచే మలచబడిన తోరణములచే ప్రకాశించునట్టియు, కుంకుమముతో కలిపిన నీటిచే నింపబడి విరాజిల్లు బంగారుపాత్రలతోను, 269

హారతులనొసంగు నంగనామణులతో శోభిల్లు నాల్గువీధులు కలసియుండు మార్గమున మూడు వేదికలను (ప్రాకారములను) ప్రదక్షిణమొనరించి శ్రీనివాసునికై యేర్పరచిన గృహమునకు తీసికొనివెళ్లి 270

అనేక రత్నములచే నలంకరింపబడిన యా గృహమున వరునందు ప్రవేశపెట్టెను. ఆతని బంధుగులనందరను వారివారి కుచితములగు రాజగృహములలో నివసింపజేసెను. 271

## శ్రీనివాసుని యాజ్ఞచే తొండమానుడు దివ్యమగు అన్నమును సిద్ధపరచుట

రాత్రి అయిదు ఘడియలకాలము జరిగినంతనే ఆకాశరాజు తన భవనమునకు వెడలిపోయెను. 272

అప్పుడు తొండమానకుమారుడగు శ్రీనివాసుడు మిక్కిలి యాకలిగొనియుండుటచే దీనముగా నాతనితో— 273

శ్రీనివాసః —

వైవాహిక జనా స్సర్వే । ఉపవాసపరాయణాః ।
అహ ఞ్చ మమ పుత్ర శ్చ । మమ మాతా సురాదయః ॥ 274

భార్యా పతివ్రతా లక్ష్మీః । క్షుధయా పరిమోహితాః ।
తేషా మన్నం మహారాజ ! । భక్ష్యాణి వివిధాని చ ॥ 275

కురు రాజన్ ! సత్వరం స్త్వం । ఋషీణా మూర్ధ్వరేతసామ్ ।
పాక స్త్వత్ర విశేషేణ । కర్తవ్యో జాతవేధసా ॥ 276

మమా పి చ ప్రేషణీయం । పక్వాన్నం రాజసత్తమ ! ।
వాసుదేవవచః శ్రుత్వా । వసుధేశో ఽబ్రవీ ద్ధరిమ్ ॥ 277

తొణ్డమానః —

ఇదం శరీరం జగదీశ ! రాజ్యం । త్వదీయ మేతద్ధి ముకున్దమూర్తే ! ।
నరో యథా లోకగతిం ప్రపన్నః । తథా మమా న్నం ప్రతి ముహ్యసి త్వమ్ ॥

ఏవ ముక్త్వా మహారాజ ! । జగామ భవనం స్వకమ్ ।
క్షణేన కారయా మాస । పాకం రాజా హవిర్భుజా ॥ 279

ఋషీణాం వేదవిదుషాం । సురాణాం సురయోషితామ్ ।
రాజా ఽన్న మర్పయామాస । విప్రాణాం చా న్నకాంక్షిణామ్ ॥ 280

భోజనం కృతవన్త స్తే । భక్ష్యాన్నరససంయుతమ్ ।
వాసుదేవాయ రాజేన్ద్రః । ప్రేషయామాస సాదరః ॥ 281

అన్నం బహువిధం భక్ష్యం । సమాషం మధుసంయుతమ్ ।
స్వయం సమేత్య రాజేన్ద్రో । ఽకల్పయ ద్భోజనం హరేః ॥ 282

బుభుజే పురుషశ్రేష్ఠో । లక్ష్మ్యా చ పరమేష్ఠినా ।
మాత్రా చ సహితో రాజన్ । స శేషో గరుడాన్వితః ॥ 283

దత్త్వా వస్త్రాణి దివ్యాని । జామాతుః శ్రీపతే ర్నృప ।
జగామ భవనం రాజా । వాసుదేవాజ్ఞయా తదా ॥ 284

శ్రీనివాసుడు —

వివాహమునకు వచ్చిన జను లందరు ఉపవాసముతో నున్నారు. నేనును, నా పుత్రుడగు బ్రహ్మయు, నా తల్లియగు వకుళమాలికయు దేవతలు మున్నగువారును 274

నా సహధర్మచారిణియగు లక్ష్మియు ఆకలిచే దప్పియున్నాము. వారి కందరకు నన్నమును, పలువిధముల పిండివంటలను 275

నీవు వెంటనే సిద్ధపరచుము. జితేంద్రియులగు మునీంద్రుల కగ్నిహోత్రుడు చక్కగా వంట నమర్చగలడు. 276

నాకును వండిన అన్నమును వంపవలెను'ని అడిగినంతనే తొండమానుడు శ్రీనివాసునితో — 277

శ్రీనివాసరూపముగా నవతరించిన శ్రీమన్నారాయణా ! నీ పాలనమునమున్న యీ శరీరము నీ యధీనమైనదేకదా ! సామాన్య మానవునివలె నీవును నా అన్నము నభిలషించుచున్నావు. 278

అని పలికి తన గృహమున కేగి యగ్నిహోత్రునిచే వంట చేయించి 279

వేదవేత్తలగు మునీంద్రులకును, దేవతలకును, దేవతాంగనలకును, ఆకలిగొని యన్నమునుగోరు బ్రాహ్మణులకును అన్నమును వడ్డించెను. 280

వా రందరును పిండివంటలతోను, రసములతోను, భుజించిన పిమ్మట శ్రీనివాసునకై 281

మినపపప్పుతో కూడినదద్దియు, తేనెతోకూడిన యనేక విధములగు పదార్థములతో కూడిన యన్నమును తాను వెంటనుండి గొనితెచ్చి యమర్చెను. 282

శ్రీనివాస డద్దానిని లక్ష్మిదేవితోను, చతుర్ముఖునితోను, తల్లియగు వకుళమాలిక తోను, శేషునితోను, గరుడునితోను విందారగించెను. 283

అనంతర మల్లుడగు శ్రీనివాసునకు రాజు నూతన వస్త్రములనిచ్చి యాతని యనుజ్ఞనుబడసి తన గృహమునకు జనెను. 28 4

గతే రాజ్ఞి మహారాజ ! । శ్రీనివాస స్త్వరాన్వితః ।
నిద్రాం చకార విధివత్ । నిర్నిద్రోఽపి సుఖాసనే ॥ 285

ఏవం గతా చ సా రాత్రిః । ప్రభాతసమయోఽభవత్ ।
పూర్వదేవగురో ర్వారః । సమ్ప్రాప్తో దశమీదినే ॥ 286

సముత్థితో వాసుదేవః । కృతమఙ్గలమజ్జనః ।
వసిష్ఠ మబ్రవీ ద్రాజన్ । భగవాన్ వేఙ్కటేశ్వరః ॥ 287

శ్రీ భగవాన్ —

సహైవ భోజనం కార్యం । లక్ష్మ్యా చ పరమేష్ఠినా ।
మాత్రా పురోహితేనాపి । వయం పశ్చా న్నవర్జితాః ॥ 288

రాజ్ఞ స్తు భవనే రాజా । రాజపత్నీ పతివ్రతా ।
కన్యా పురోహితో భ్రాతా । తేఽపి పశ్చా న్నవర్జితాః ॥ 289

ఏవ ముక్త్వా వసిష్ఠ స్తు । పురోహిత ! మరిన్దమ ।
కుబేర మబ్రవీ ద్రాజన్ ! । శ్రీనివాసః సతాం గతిః ॥ 290

శ్రీనివాసః —

గచ్ఛ యక్షగణాధ్యక్ష । రాజానం విప్రకారణాత్ ।
ఇతి తద్వచనం శ్రుత్వా । యక్షరా డ్రాజస త్తమమ్ ॥ 291

గత్వాఽహ భారతీం పుణ్యాం । శ్రీనివాసేన భాషితామ్ ।

కుబేరః —

భోజనం త్వృషిముఖ్యానాం । కర్తవ్యం పూర్వ మేవ హి ॥ 292

ముహూర్తకాలో రాత్రౌ తు । నాడికా స్స్యు స్త్రయోదశ ।
తదా ఽపాద్యం మహారాజ ! । రాత్ర్యాం బ్రాహ్మణభోజనమ్ ॥ 293

ఇతి సమ్బోధ్య రాజానం । కుబేరః పున రాగతః ।
తథా చకార రాజర్షిః । భోజనం బ్రహ్మవాదినామ్ ॥ 294

రాజు వెడలిపోయినంతనే శ్రీనివాసుడు నిద్రలేనివాడయ్యును సామాన్య మానవునివలె నిద్రను నటించుచు మృదుతల్పమున నిద్రించెను. 285

రాత్రి గడచి సుప్రభాతమయి దశమీ తిథి శుక్రవారమాయెను. 286

శ్రీనివాసుడు మేల్కాంచి మంగళస్నాన మాచరించి వసిష్ఠునితో— 287

శ్రీ భగవానుడు —

మునీంద్రా! నేను, లక్ష్మి, చతుర్ముఖుడు, తల్లియగు వకుళమాలిక, పురోహితుడు మే మయిదుగురమును. 288

ఆకాశరాజు, ఆతని సహధర్మచారిణియు, కన్యయగు పద్మావతియు, పురోహితుడును, పెండ్లికుమార్తె సోదరుడును భుజింపరాదుకదా! మే మందర మొకేపర్యాయము భుజింతుమ'ని పలికి సజ్జనాశ్రితుడగు శ్రీనివాసుడు కుబేరునితో 289-290

నీ వాకాశరాజునకు బ్రాహ్మణపుంగవుల విషయమై యీ సందేశమును తెలుపుమ'ని పంపగా కుబేరుడు 291

శ్రీనివాసుని సందేశ మాకాశరాజున కెఱింగించి 'రాజా! ఋషిశ్రేష్ఠులకుమాత్ర మిప్పుడే ముందుగ భోజనము సంసిద్ధమొనర్పుము. 292

వివాహముహూర్తము రాత్రి పదమూడు గడియల కాలమునకే. అందుచే వారికి రాత్రి భోజనము సంభవింపనేరదు అని 293

తెలిపి కుబేరుడు తిరిగి వచ్చెను. రా జట్లే బ్రాహ్మణులకు భోజనము సమర్పెను. 294

దదౌ చ దక్షిణాం నిష్కం । తామ్బూల ఞ్చ ద్విజన్మనామ్ ।

## వివాహార్థం శ్రీనివాసానయనాయ తన్మన్దిరం ప్రతి నృపాగమనమ్

ఏవ మ్ప్రాప్తే మహీపాల ! । కల్యాణదివసే హరేః ॥ 295

శుక్రవారే దశమ్యా ఞ్చ । సాయఙ్కాలే వియన్నృపః ।
చతురఙ్గబలం సర్వం । నిధాయ పురతః నుతమ్ ॥ 296

వసుదానం మహారాజః । తొణ్డమాన ఞ్చ సోదరమ్ ।
పురోహితం పురస్కృత్య । సహ సమ్బన్ధిబాన్ధవైః ॥ 297

ఐరావతం మహానాగం । రత్నకమ్బలభూషితమ్ ।
మేఘరాడ్వర్ణసంయుక్తం । బద్ధఘణ్టాకులాన్వితమ్ ॥ 298

రక్తదన్తం మహారావం । కర్ణబద్ధసుచామరమ్ ।
పురన్దరం పురస్కృత్య । గజ మైరావతం తథా ॥ 299

ఆహ్వానకారణా త్ప్రాప్తః । శ్రీనివాసాలయం తదా ।
తస్మిన్మహాగృహేరాజన్ ! । అయుత స్తమ్భశోభితామ్ ॥ 300

సభాం చకార రత్నాఢ్యాం । విశ్వకర్మా విభోః ప్రియామ్ ।
తత్రా ఽసీనాః మహాభాగాః । బ్రహ్మాద్యాః సర్వదేవతాః ॥ 301

విశ్వామిత్రో భరద్వాజో । వసిష్ఠో గౌతమ స్తథా ।
భృగు రత్రిః పులస్త్య శ్చ । వాల్మీకి ర్మిథిలేశ్వరః ॥ 302

వైఖానస శ్చ దుర్వాసా । మార్కణ్డేయోఽథ గాలవః ।
దధీచి శ్చ్యవనో రాజన్ ! , సనక శ్చ సనన్దనః ॥ 303

ఏతే శ్రేష్ఠతమా లోకే । మునయో వీతకల్మషాః ।
జటామకుటభూషాఙ్గాః । జ్వలత్కృష్ణాజినామ్బరాః ॥ 304

కశ్యప మ్తు పురస్కృత్య । సమాసీనాః సభాన్తరే ।
తన్మధ్యే వాసుదేవ స్తు । రత్నకమ్బలసంయుతః ॥ 305

నూటయెనిమిది మాడలను దక్షిణను, తాంబూలమును సమర్పించెను.

## వివాహమునకై శ్రీనివాసుని గొనితెచ్చుటకు రాజు శ్రీనివాసుని మందిరమున కేగుట

ఇట్లు శ్రీనివాసుని పెండ్లినాడంతయు జరిగినపిమ్మట 295

దశమీ శుక్రవారపు దివసమున సాయంకాలమున చతురంగబలములను ముందుగా తన పుత్రుడగు 296

వసుదానుని, సోదరుడగు తొండమానుని నిలిపి పురోహితునితోను, బంధువులతోను, 297

నీలమేఘమువంటి రంగుగలిగి, గంటలచే నలంకరింపబడి, రత్నకంబళి పైపున పరువబడి 298

ఎర్రని దంతములుకలిగి, పెద్దధ్వనిగలిగి, చెవులకు చక్కని చామరములు కూర్పబడిన యైరావతమను గజేంద్రముతోను, ఇంద్రుడను పురోహితునితోను, 299

శ్రీనివాసుని పిలచుటకై యాతని విడిదికి యేతెంచెను. ఆ భవనమున పదివేల స్తంభములతో కూడి 300

రత్నములచే నలంకరింపబడి శ్రీనివాసునకు ప్రియమగు సభను విశ్వకర్మ నిర్మించెను. ఆ సభాభవనమున బ్రహ్మ మున్నగు సకలదేవతలును, 301

విశ్వామిత్రుడు, భరద్వాజుడు, వసిష్ఠుడు, గౌతముడు, భృగుమహర్షి, అత్రిమహాముని, పులస్త్యుడు, వాల్మీకి, జనకుడు, 302

వైఖానసుడు, దుర్వాసుడు, మార్కండేయుడు, గాలవుడు, దధీచి, చ్యవనుడు, సనకసనందనాదులను 303

పాపపచరిత్రులును, లోకవిఖ్యాతినిగనినవారును, జడలను, శిరోభూషణములు గలవారును, మెరయుచున్న కృష్ణాజినమునే కట్టుపుట్టముగ ధరించినవారును, 304

నగు మునీంద్రులును కశ్యపమహర్షిని తమ కధినేతగా నుంచుకొని సభలో యాసీనులైరి. వారిమధ్యలో శ్రీనివాసుడు రత్నకంబళిపై కూర్చుండెను. 305

కృతాఞ్జలిపుట స్తస్థౌ । బ్రహ్మా లోకపితామహః ।
త స్మి న్ద్వార మాసాద్య । రాజా సత్యపరాక్రమః ॥ 306

పురోహితం పురస్కృత్య । సమ్ప్రాప్తో హరిసన్నిధిమ్ ।
సము త్తస్థౌ వాసుదేవో । దృష్ట్వా రాజాన మాగతమ్ ॥ 307

పరిరమ్భణ మాసాద్య । భగవాన్ వాక్య మబ్రవీత్ ।

శ్రీనివాసః —

భవాన్ శ్రేష్ఠతమో ఽత్యన్తం । వృద్ధో ఽసి నృపస త్తమః ॥ 308
కిమర్థ మాగతో ఽసి త్వం । మద్గృహం రాజస త్తమ ।
వసుదాన స్తు రాజేన్ద్రః । సమాహ్వానే వియోజయ ॥ 309

వద త్యేవం శ్రీనివాసే । పురోహిత మభాషత ।

రాజా —

విలమ్బః క్రియతే కస్మా । త్పూజాం కురు రమాపతేః ।
స రాజవచనం శ్రుత్వా । ధరణీం వాక్య మబ్రవీత్ ॥ 310

## వియన్నృపోక్త్యా వసిష్ఠప్రేరితధరణీకృతశ్రీనివాసోపచారః

వసిష్ఠః —

అరున్ధతీం పురస్కృత్య । కురు పూజాం రమాపతేః ॥ 311

సా సమ్భ్రమా త్సముత్థాయ । బాష్పసందిగ్ధలోచనా ।
ముఖం విలోక్య రాజేన్ద్రః । కృష్ణస్య నృపవల్లభా ॥ 312

మత్వా కృతార్థ మాత్మానం । ఆనన్దపరిపూరితా ।
పలజ్జా పూజయా మాస । సచ్చిదానన్దవిగ్రహమ్ ॥ 313

తాం దృష్ట్వా యోషిత స్సర్వాః । విస్మయాకులమానసాః ।
ప్రోచుః ప్రహృష్టహృదయాః । ధరణీం రాజవల్లభామ్ ॥ 314

యోషితః .

జగత్తున కంతకును పితామహుడగు చతుర్ముఖుడు చేతులు జోడించి పిలచెను. గొప్ప పరాక్రమశాలియగు ఆకాశరాజును ఆ సభాద్వారమువద్దకు 306

పురోహితుని ముందిడుకొనివచ్చి చేరెను. రాజునుగాంచి శ్రీనివాసుడు లేచి నిలచి 307

కౌగిలించుకొని 'రాజేంద్రా! నీవు ముదుసలివైనను చాల ఉత్తముడవు. 308

మా భవనమునకు నీవే రానేల? నీ పుత్రుడగు వసుదానుని మమ్ము పిలుచుటకు పంపవచ్చునుకదా! 309

అని పలుకుచుండగా రాజు పురోహితునితో — "వసిష్ఠా! ఇంకను ఆలసింప నేల? శ్రీమన్నారాయణునకు పూజ నొనర్పుమ"ని సవినయముగ పడిగెను. అంత వసిష్ఠు డాకాశరాజు భార్యయగు ధరణీదేవితో — 310

## ఆకాశరాజడిగినపిమ్మట వసిష్ఠుడు ధరణీదేవిని ప్రేరేపింపగా ధరణీదేవి శ్రీనివాసున కుపచారముల నొనర్చుట

వసిష్ఠుడు —

నీ వరుంధతి సహాయముతో శ్రీనివాసు నర్చింపుమ'ని పలికెను. ఆకాశరాజునకు ప్రియపత్నియగు ధరణీదేవియు తొట్రుపాటుతోలేచి కన్నులలో నీరునింపుచు శ్రీనివాసుని ముఖారవిందము గాంచి 311

తను కృతార్థురాలనుగా తలంచుచు మహదానందమునందుచు సిగ్గుపడుచు నాతనిని పూజించెను. 312

అంగనామణు లందరును ధరణీదేవిని గాంచి యాశ్చర్యాందోళితచిత్తలై మనమున నంతసించుచు నాపెతో — 313

నీ వెన్నిజన్మలయందు యే పుణ్యము నార్జించితివోకదా! శ్రీనివాసు నర్చింపుమని బ్రహ్మచే సృష్టింపబడి 314

కిం త్వయాఽఽచరితం పుణ్యం । సర్వజన్మని హేధరే : ।
వాసుదేవార్చనవిధౌ । నిర్మితా పరమేష్ఠినా ॥ 315

యా త్వ మిత్థం పూజయసి । సాక్షా న్నారాయణం స్వయమ్ ।
ఇ త్యేవం సంస్తుతా దేవీ । ధరణీ రాజవల్లభా ॥ 316

తైలకర్పూరగన్ధేన । చన్దనేన సుగంధినా ।
అర్చయామాస కల్యాణీ । శ్రీనివాసం సురేశ్వరమ్ ॥ 317

వస్త్రైర్నానావిధై రత్నైః । ముక్తానిర్మితభూషణైః ।

దివ్యాలఙ్కారాలఙ్కృతశ్రీనివాసస్య సపరికరనృపమన్దిరప్రవేశః

తతః పురోహితా ఽఽజ్ఞప్తః । పురాణపురుషోత్తమమ్ ॥ 318

గజ మారోపయద్రాజా । జామాతర మనామయమ్ ।
సహితో వాసుదేవ స్తు । బ్రహ్మణా శమ్భునా తథా ॥ 319

కుబేరేణా పిరాజేన । గరుడేనా గ్నినా తథా ।
వాయునా వరుణేనా పి । యమేన మరుతాం గణైః ॥ 320

వసిష్ఠాదిమునిశ్రేష్ఠైః । సదారై స్సుతై స్తథా ।
జగామ రాజభవనం । రత్నతోరణమణ్డితమ్ ॥ 321

నానాజనసమాకీర్ణం । నానాలఙ్కారమణ్డితమ్ ।
మహావాద్యస్వనై ర్యుక్తం । దీపాయుతవిదీపితమ్ ॥ 322

జామాతృసహితో రాజా । ద్వారతోరణసన్నిధౌ ।
చతురఙ్గబలం ముక్త్వా । గృహాంత ర్గంతు ముద్యతః ॥ 323

తత్రాన్తరే శ్రీనివాసం । నీరాజయితు మాగతా ।
తొణ్డమాన్నృపతే ర్భార్యా । కుంకుమోదకభాజనమ్ ॥ 324

సమాదాయా శు కల్యాణీ । వాసుదేవ మపూజయత్ ।
తతః పశ్చా చ్ఛ్రీనివాసః । ప్రావిశ ద్రాజమన్దిరమ్ ॥ 325

సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుని యట్లు పూజించుచున్నావు అని స్తుతించు చుండగా 315

ధరణీదేవి పరిమళతైలము, పచ్చకర్పూరము, సుగంధచందనాదులచేతను, 316

నూతన వస్త్రములతోను, పలువిధములగు రత్నములతోను, ముత్యములచే కూర్పబడిన భూషణములతోను పూజించెను. 317

## శ్రీనివాసుడు దివ్యములగు భూషణముల నలంకరించుకొని తన పరివారముతో నాకాశరాజభవనమున కేగుట

పిమ్మట ఆకాశరాజు పురోహితుని యాజ్ఞనుగొని పురాణపురుషుడును దోషదూరుడగు శ్రీనివాసు నైరావతముపై నధిష్ఠింప జేసెను. శ్రీనివాసుడు బ్రహ్మరుద్రాదులతోను 318-319

కుబేరునితోను, ఆదిశేషునితోను, గరుత్మంతునితోను, అగ్నిహోత్రునితోను, వాయుదేవునితోను, వరుణునితోను, యమునితోను, మరుద్గణములతోను, భార్యాపుత్రులతో కూడిన 320

వసిష్ఠాది మునీంద్రులతోను కూడి రత్నతోరణములచే నలంకరింపబడి 321

పెక్కుమంది జనులచే నిబిడమై, అనేకాలంకార సమలంకృతమై, గొప్ప వాయిద్యధ్వని సమ్మిళితమై, వేలకొలది దీపములచే ప్రజ్వరిల్లుచున్న రాజభవనమును సమీపించెను. 322

రాజల్లుడగు శ్రీనివాసునితో ముఖద్వారమువద్ద చతురంగబలములను విడచి లోని కరుగబోవుచుండగా 323

తొండమానురాజభార్య శ్రీనివాసునకు కుంకుమముతో కలిసిన నీరుకల కలశమును (దృష్టిదోషపరిహారార్థమై) 324

కొని తెచ్చి హారతి నొసంగి శ్రీనివాసుని పూజించెను. అనంతరము పుండరీకదళామలాయతేక్షణుడగు శ్రీనివాసుడు 325

ద్వారాణ్య తీత్య థ బహూని మాధవో । రాజ్ఞా సమేతో భవనం ప్రవిశ్య ।
రత్నాసనే రాజవినిర్మితే హరిః । రరాజ రాజీవసమాననేత్రః ॥ 326

చతుస్తమ్భాం రత్నవేదీం । అధిష్ఠాప్య ఖగధ్వజమ్ ।
పరివార్య చ తస్థు స్తే । మునయో వీతకల్మషాః ॥ 327

బ్రహ్మాణ మగ్రతః కృత్వా । సర్వే దేవా యథాసుఖమ్ ।
స్వర్ణాసనే సమాసీనాః । పశ్యన్తో నయనోత్సవమ్ ॥ 328

తత స్స రాజా ధర్మాత్మా । చక్రే మఙ్గళమజ్జనమ్ ।
సా పి స్నాత్వా మహారాజ ! । తైలేన చ సుగన్ధినా ॥ 329

అలంచకారా లంకారైః । స్వా ఒ త్మానం రాజవల్లభా ।
స్వామిపుష్కరిణీతోయం । హేమకుమ్భప్రపూరితమ్ ॥ 330

వియన్నృపకృతవరపాదామ్బుజక్షాళనమ్

సమానీయ బ్రాహ్మణై శ్చ । హరిపాదావనేజనమ్ ।
సంకల్పం విధివ చ్చక్రే । కన్యాదానస్య సాదరమ్ ॥ 331

తత శ్చకార రాజేన్ద్ర ! । మధుపర్కం పురోహితః ।
పురోహితో క్తమన్త్రేణ । తస్య పాదావనేజనమ్ ॥ 332

'సహస్రశీర్షాపురుష' । ఇతి మన్త్రం సముచ్చరన్ ।
ధరణ్యా స్రావితైః కృత్వా । స్వామితీర్థజలై శ్శుభైః ॥ 333

హరిపాదోదకం పుణ్యం । దధార శిరసా నృపః ।
భార్యాం పుత్రం భ్రాతరం చ । భవనం కోశ మేవ చ ॥ 334

గజా ఒగారం రథా ఒగారం । వస్త్రాఒగారం చ తజ్జలైః ।
మార్జయామాస రాజేన్ద్రః । శ్రీనివాసపరాయణః ॥ 335

రాజా —

అద్య మే సఫలం జన్మ । జీవితం చ సుజీవితమ్ ।
అద్య మే పితర స్తుష్టాః । వాసుదేవపదోదకాత్ ॥ 336

పెక్కుద్వారములను దాటి రాజుతోకూడి రాజభవనమున ప్రవేశించి రాజుచే చతుష్షష్ఠిలో నేర్పరుపబడిన రత్నసింహాసనమున విరాజిల్లెను. (చతుష్షష్ఠి యనగా నాలుగు దిక్కులయందును చతురముగా నేర్పరచబడిన సభాభవనము) 326

పావనచరిత్రులగు మునులందరును నాతనిని చుట్టుముట్టి కూర్చుండిరి. 327

దేవత లందరును బ్రహ్మను ముందుగా కూర్చుండజేసికొని బంగారు సింహాసనములపై కూర్చుండి నేత్రపర్వముగా వీక్షించుచుండిరి. 328

ఆకాశరాజు మంగళస్నాన మాచరించగనే ధరణీదేవియు పరిమళమూనెతో స్నానమాచరించి 329

భూషణములచే తన నలంకరించుకొనెను. బంగారు కలశములతో నింపి స్వామి పుష్కరిణీతీర్థమును బ్రాహ్మణులద్వారా 330

## ఆకాశరాజు పెండ్లికుమారుని పాదపద్మములను కడుగుట

శ్రీనివాసుని చరణక్షాళనమునకై తెప్పించి కన్యాదానసంకల్పమును శాస్త్రమునందు చెప్పినరీతిగా నాచరించెను. 331

పిమ్మట పురోహితుడు మధుపర్కము నాచరించెను. అనంతర మాకాశరాజు పురోహితుడు చెప్పుచున్న మంత్రముతో 332

"సహస్ర శీర్షాపురుష" అను పురుషసూక్తమును పఠించుచు సహధర్మచారిణి యగు ధరణీదేవి నీళ్లుపోయుచుండగా స్వామి పుష్కరిణీజలముతో శ్రీనివాసుని పాదములను కడిగి 333

యా పావనోదకమును శిరస్సున ధరించి భార్యను, పుత్రుని, సోదరుని, భవనమును, ధనాగారమును, 334

గజశాలను, రథశాలను, వస్త్రములశాల నా పవిత్రజలముచే శ్రీనివాసునియం దత్యంత భక్తియుక్తుడై ప్రోక్షించెను. 335

రాజు —

"శ్రీనివాసుని పాదోదకముచే నేటికి నా జీవితము సఫలమైనది. సార్థకమైనది. నేడు నా పితృదేవతలు సంతృప్తులైర"ని 336

ఏవ ముక్త్వా మహారాజః । కన్యాం కమలలోచనామ్ ।
అలంకృతాం విచిత్రై స్తాం । అలంకారై ర్మహీపతే ॥ 337
తత స్తు ఘంటికాఘోషం । కృతవా న్దేవచిన్తకః ।
సుముహూర్తే తదా ప్రాప్తే । మఙ్గళాష్టక మబ్రవీత్ ॥ 338

వరాయ వియన్నృపదత్తవైవాహికభూషణాదికమ్

కన్యాప్రదానసమయే । దక్షిణాం రాజసత్తమః ।
కోటిసంఖ్యా న్నిష్కపుంజాన్ । దత్త్వా న్వేఙ్కటేశితుః ॥ 339
తం దృష్ట్వా ధనరాశిం తం । భగవా నాహ భూమిపమ్ ।
శ్రీనివాసః —
దాతవ్యం కిం త్వయా రాజన్ । పుత్రస్య తవ భూపతే ॥ 340
వివాహకర్మనిపుణో । భవా న్దానపరాయణః ।
వదన్వై భూషణా న్యంగ । బహురత్నాన్వితాని చ ॥ 341
ఇ త్యుక్తో వాసుదేవేన । భూషణాని దదౌ నృపః ।
కిరీటం శతభార స్తు । కంఠికా మపి తావతీమ్ ॥ 342
పున రేకాం తదర్ధం చ । తదర్ధం చైవ కంఠికామ్ ।
పదకాని దదౌ సప్త । నర్ఘ్యా ణ్యథ నృపోత్తమః ॥ 343
మాలికాం మౌక్తికానాం చ । భుజభూషణయుగ్మకమ్ ।
కర్ణభూషామౌక్తికాఢ్యౌ । వంసపర్య న్తలమ్బినౌ ॥ 344
కంకణే రత్నమాణిక్య । వజ్రవైడూర్యనిర్మితే ।
ద్వాత్రింశద్భారసంయుక్తే । అస్మై దత్తవాన్ నృపః ॥ 345
నాగభూషణయుగ్మంచ । బాహుపూరాదికాం స్తథా ।
భూషణా న్యంగుళీయాం శ్చ । దశానాం వీరముద్రికామ్ ॥ 346
కటిసూత్రం స్వర్ణమయం । వరవజ్రసమన్వితమ్ ।
ఏకాదశశతీభారం । బహురత్నసమన్వితమ్ ॥ 347

పిదప తన పుత్రియగు పద్మములవంటి కన్నులుగల పద్మావతిని విచిత్రము లగు నలంకారములతో నలంకరించెను. 337

ఇంతలో జ్యోతిశ్శాస్త్రజ్ఞు డగు పూజారి ఘంటను వాయించగా సుముహూర్త మైనదని తలంచి మంగళాష్టకముల చదివెను. 338

## ఆకాశరాజు పెండ్లికుమారునకు వివాహసమయమున నీయవలసిన భూషణాదుల నొసంగుట

కన్యాదానసమయమున నాకాశరాజు శ్రీనివాసునకు కోటిమాడలను దక్షిణగా నొసంగెను. 339

ఆ ధనరాశినిగాంచి శ్రీనివాసుడు రాజుతో రాజా ! నీ పుత్రుడనగు నా కింకను నీయవలసిన దేమున్నది ? 340

నీవు వివాహకృత్యము నొనర్చుటలో నేర్పరివి. నీవు దానముల నొనర్చుటలో నత్యంతాసక్తి కలవాడవు. నాకు పెక్కు రత్నములతోకూడిన భూషణముల నొసంగుమ' ని 341

పలుకగా నాకాశరాజు నూరుబారువుల కిరీటమును, నూరుబారువుల కంఠాభరణమును, 342

ఏబదిబారువుల అట్లే యిరువదియైదు బారువుల కంఠాభరణములను అమూల్యము లగు యేడు పతాకములను 343

ముత్యాలసరులను, రెండు కేయూరములను, భుజములవరకు వ్రేలాడు ముత్యముల కర్ణాభరణములను, 344

రత్నములతోను, మాణిక్యములతోను, వజ్రవైడూర్యములచేచేయబడిన ముప్పది రెండు బారువుల బరువుకలిగి వెల యింతయని చెప్పశక్యముగాని కంకణములను 345

రెండు భుజములకును, రెండు నాగాభరణములను, దండకడియములను, పది ఉంగరములను, వీరముద్రికను 346

శ్రేష్ఠమైన వజ్రములతో కూడిన బంగారు మొలమాలను, పదునొకండు నూరుల బరువుగలిగి, అనేక రత్నములతో కూడిన 347

పాదుకే చ తతో రాజా । దత్తవా న్మధుఘాతినే ।
దదౌ భోజనపాత్రంచ । షష్టిభారయుతం ప్రభో ॥ 348

లఘుపాత్రసమోపేతం । బృహత్పాత్ర మపాం తథా ।
కంబళానాం చతుష్షష్టిం । దత్తవాన్ రాజసత్తమః ॥ 349

భూషణై ర్భూషితాంగస్య । కన్యాదాన మథా కరోత్ ।
కన్యాప్రవర మూచే ఽథ । గురు స్సాక్షా ద్బృహస్పతిః ॥ 350

## గురువసిష్ఠకథితవధూవరప్రవరాదికమ్

బృహస్పతిః —

అత్రిగోత్రసముద్భూతాం । సువీరస్య ప్రపౌత్రికామ్ ।
సుధర్మణ స్తు పౌత్రీం చ । పుత్రీ మాకాశభూపతేః ॥ 351

త్వ మఙ్గీకురు గోవిన్ద । కన్యాం కమలలోచనామ్ ।
ఏవ ముక్తే మహారాజో । ముదా రత్నాంబరం దదౌ ॥ 352

వసిష్ఠః —

ప్రపౌత్రస్య యయాతే స్తు । పౌత్రస్యా మితతేజసః ।
శూరసేనస్య రాజేన్ద్ర । వసుదేవస్య భూపతేః ॥ 353

పుత్రస్య వేఙ్కటేశస్య । గోత్రే వాసిష్ఠసంజ్ఞకే ।
జాతస్యాత్రికులోత్పన్నాం । కన్యాం కనకభూషితామ్ ॥ 354

గ్రహీష్యామో వయం రాజన్ । తవ పుత్రీం నృపోత్తమ ॥
కన్యావరప్రవరయోః । ఇత్యుచ్చారితయో రథ ॥ 355

ధరణ్యా సహ రాజేన్ద్రః । కన్యాదానపరాయణః ।
ప్రహృష్టహృదయః ప్రాహ । శ్రీనివాసం పరాత్పరమ్ ॥ 356

## శ్రీనివాసస్య వసిష్ఠాదికారితపద్మావతీపాణిగ్రహణోత్సవః

ఆకాశరాజః —

పాదుకలను, అరువది వారువుల బరువుకలిగిన భోజనపాత్రను. 348

చిన్న చెంబుపైన గల పెద్ద మంచినీటికలశమును, అరువదినాల్గు కంబళులను 349

భూషణములచే నలంకరింపబడిన శ్రీనివాసునకు కన్యాదానపూర్వకముగా నొసంగెను. గురువగు బృహస్పతి కన్యాప్రవరము చదివెను. 350

## గురువగు వసిష్ఠుడు వధూవరుల ప్రవరను చదువుట

బృహస్పతి —

అత్రిమహర్షి గోత్రమున పుట్టినదియు, సుధీరుని మునిమనుమరాలును సుధర్ముని మనుమరాలును, ఆకాశరాజు పుత్రికయు నగు 351

ఈ పద్మనేత్రియగు కన్నియను నీ వంగీకరింపుము' అని బృహస్పతి చదివినంతనే ఆకాశరాజు సంతసమున రత్నములను, వస్త్రముల నొసంగెను. 352

వసిష్ఠుడు —

అనంతరము వసిష్ఠమహర్షి యయాతికి మునిమనుమడును, మిక్కిలి తేజోవిరాజితుడగు శూరసేనుని మనుమడును, వసుదేవుని 353

పుత్రుడును, వసిష్ఠగోత్రోద్భవుడును నగు శ్రీనివాసున కత్రికులోత్పన్నయు, సువర్ణాభరణభూషితయు 354

వగు నీ పుత్రికను మేము స్వీకరింతుము అని యిట్లు పెండ్లికుమారునియొక్కయు, పెండ్లికుమార్తెయొక్కయు ప్రవరలను చదివినపిమ్మట 355

ఆకాశరాజు ధరణీదేవితో కూడ కన్యాదానముచేయ మత్సాహము కలవాడై సంతసించిన మనస్సుతో పరాత్పరుడగు శ్రీనివాసునితో— 356

## శ్రీనివాసునకును పద్మావతికిని వసిష్ఠాదులు వివాహ మొనరించుట

ఆకాశరాజు —

కన్యా మిమాం ప్రదాస్యామి । గృహాణ పురుషోత్తమ ॥
ఇత్యుక్త్వా ప్రాక్షిప ద్రాజా । ధరణ్యా స్రావితాం తదా ॥ 357
మంత్రపూతాంస్వామితీర్థ । ధారాంసకనకాంకరే ।
దక్షిణే శ్రీనివాసస్య । పద్మావతీం తతః ॥ 358
విధానం చ తత శ్చక్రే । రాజేన్ద్ర స్సపురోహితః ।
పూజయిత్వా జగన్నాథం । గన్ధవస్త్రానులేపనైః ॥ 359
కంకణం బన్ధయామాస । వాసుదేవకరామ్బుజే ।
పద్మావత్యాః కరామ్భోజే । ఒబంధయ త్కంకణం గురుః ॥ 360
తథా మాఙ్గల్యసూత్రస్య । బన్ధం వైవాహికం తదా ।
శ్రీనివాసేన దేవేన । కారయ త్సపురోహితః ॥ 361

సువాసిన్యః —

సావిత్రీవ చ కల్యాణి । బహుపుత్రవతీ భవ ।
సర్వలోకస్య జననీ । భవ మఙ్గళదాయినీ ॥ 362
ఇత్థం సుమఙ్గలీ స్త్రీషు । గాయన్తీషు శుభాశిషః ।
బ్రాహ్మణానాం కరస్పర్శాత్ । రాజ్ఞశ్చాపిమహాత్మనః ॥ 363
బబంధ పూతం మాఙ్గల్యం । సూత్రం మన్త్రాభిమన్త్రితమ్ ।
కణ్ఠే పద్మావతీదేవ్యా । శ్రీనివాసో జగత్పతిః ॥ 364
మునిభి స్సహ విద్వద్భి । ర్లాజై ర్హోమం పురోహితః ।
వసిష్ఠో ఒకారయ త్పద్మా । వత్యఙ్గల్యార్పితై స్తతః ॥ 365
యజుశ్శాఖాక్రమేణైవ । జుహోవా గ్నౌ యథావిధి ।
సర్వం వైవాహికవిధిం । వసిష్ఠో ఒథ సమాపయత్ ॥ 366
తతః పురోహితో రాజ్ఞ । స్స్వస్తివాచనపూర్వకమ్ ।
మునీనా మంజలిపుటే । నవరత్నాక్షతా న్దదౌ ॥ 367
తే వేదమన్త్రై ర్జగదీశమూర్ధ్ని । రత్నాక్షతా న్వేదవిదః ప్రచిక్షిపుః ।
తదా నృణాం తత్ర మహోత్సవో ఒభూ । దాకాశరాజస్య పురీనివాసినామ్ ॥ 368

'పురుషోత్తమా! ఈ నా కన్నియను నీ కొసంగుచున్నాను. స్వీకరింపుము'ని ధరణీదేవి జలమును పోయుచుండగా తాను 357

మంత్రములచే పవిత్రమగు స్వామి పుష్కరిణి తీర్థమును బంగారముతో గూడ శ్రీనివాసుని కుడిచేతిలోనుంచి పద్మావతిని కూడ సమర్పించెను. 358

పురోహితునితో కూడి శాస్త్రోక్తముగా నంతయు నాచరించిన పిమ్మట చందన వస్త్రమైపూతలతో శ్రీనివాసుని పూజించి 359

యాతని పాణిపద్మమున కంకణమును కట్టెను. పద్మావతి కరకమలమునకు బృహస్పతి కంకణమును కట్టెను. 360

పిమ్మట వివాహమునకు సంబంధించిన మంగళసూత్రమును పురోహితుడు శ్రీనివాసునిచే పద్మావతీ కంఠమున నీ క్రిందివిధముగ కట్టించెను. 361

సువాసినులు —

"సావిత్రివలె నీవును పలువురు పుత్రులనుబడసి సకలలోకములకు తల్లివై మంగళప్రదురాలవై విరాజిల్లుము'ని 362

ఇట్లు ముత్తైదువలు మంగళదాయకములగు నాశీస్సులను కీర్తించుచుండగా బ్రాహ్మణులను, ఆకాశరాజును తమ చేతులతో తాకినపిమ్మట 363

మంత్రములచే పవిత్ర మొనర్చబడిన నా మంగళసూత్రమును పద్మావతీదేవి కంఠమున శ్రీనివాసుడు కట్టెను. 364

పురోహితుడగు వసిష్ఠుడు పండితులగు మునీంద్రులతో కూడి పద్మావతి దోసిలితో నీయబడిన పేలాలను 365

యజుర్వేదానుసార మగ్నిహోత్రమున హోమమును చేయించెను. ఇట్లువసిష్ఠుడు వివాహవిధినంతను పూర్తిచేసినపిమ్మట 366

ఆశీర్వాదమంత్రపూర్వకముగా రాజపురోహితుడగు బృహస్పతి మునీంద్రుల దోసిలిలో నవరత్నములతో కూడిన అక్షతల నొసంగెను. 367

వా రా అక్షతలను వేదమంత్రములతో శ్రీనివాసుని తలపై వేయగా నాకాశరాజ పురవాసు లందరును కనులపండువగా గాంచసాగిరి. 368

తస్మి న్కాలే మహారాజో । దక్షిణాం బ్రహ్మవాదినామ్ ,
దాపయామాస సన్తుష్టో । విప్రై స్తామ్బూలపూర్వకమ్ ॥ 369

గవాం కోటిసహస్రాణి । చా శ్వానామయుతం తథా ।
వస్త్రాణాం విషయం రాజన్ ! । విప్రేభ్యో దత్తవా న్విభుః ॥ 370

ఏవం మహోత్సవ స్తత్ర । సమభూ ద్దశమీ దినే ।
వధూవరౌ ప్రతిష్ఠాప్య । భోజయామాస వై తతః ॥ 371

అన్నం బహువిధం సూప । రసభక్ష్యసమన్వితమ్ ।
పరమాన్నం చ సఘృతమ్ । సక్షీరం శర్కరాయుతమ్ ॥ 372

పురోహితేన సహితో । భోజనం కృతవాన్ హరిః ।
మాత్రా లక్ష్మ్యా చ సహితః । పుత్రేణ సహిత స్తథా ॥ 373

ఆకాశరాజో ధర్మాత్మా । భు క్తవాన్ కృష్ణసన్నిధౌ ।
లక్ష్మ్యా సమేతా ధరణీ । తథా వకుళమాలయా ॥ 374

అభుఙ్క్తా న్నం రసై ర్యుక్తం । పతిపుత్రసమన్వితా ।
తతః ప్రభాతే రాజేన్ద్ర ! । సువాసిన్య స్సురేశితుః ॥ 375

మజ్జనం కారయామాసుః । గన్ధతైలై స్సునిర్మలైః ।
అన్యోన్యమజ్జనం తత్ర । చాన్యోన్యో ద్వ ర్తనం తథా ॥ 376

హరిపద్మావతీదేవ్యో । స్తా స్సహాస మకారయన్ ।
స రాజా విప్రముఖ్యానాం । సురాణాం బహుభోజనమ్ ॥ 377

స్త్రీణాం చ పురుషాణాం చ । బహుమానపురస్సరమ్ ।
యథేష్టం దాపయామాస । హృష్ట ఆకాశభూమిపః ॥ 378

అపూపా న్వివిధాం స్తత్ర । సూపశాకాదికాం స్తథా ।
ఘృతకుల్యాం క్షీరకుల్యాం । దధికుల్యాం తతః పరమ్ ॥ 379

అనంతర మాకాశరాజు వేదవేత్తలం కందరకు తాంబూలముతో గూడిన దక్షిణను సంతోషముతో బ్రాహ్మణులచే యిప్పించెను. 369

వేలకొలంది, కోట్లకొలంది గోవులను, గుఱ్ఱములను, వస్త్రములను బ్రాహ్మణులకు దానమొసంగెను. 370

ఇట్లు దశమిరోజున మహోత్సవము జగిరినపిమ్మట పెండ్లికుమారుడును, పెండ్లి కుమార్తెను కూర్చుండబెట్టి భుజింపజేసెను. 371

పప్పు, రసము, పిండివంటలు, క్షీరాన్నము, నేయి, పాలు, చక్కెరలతోకూడిన భోజనమును 372

పురోహితుడగు వసిష్ఠునితోను, తల్లితోను, శ్రీదేవితోను, పుత్రుడగు చతుర్ముఖునితోను భుజించెను. 373

ధర్మాత్ముడగు నాకాశరాజు శ్రీనివాసుని సన్నిధిని కూర్చుండియు, శ్రీదేవి, వకుళమాలికలచెంత కూర్చుండి ధరణీదేవియు 374

రుచ్యమగు నా భోజనమును తన భర్తతోను, పుత్రునితోను కలసి భుజించెను. రాత్రి తెల్లవారినంతనే దేవరాజకాంత లందరు 375

పరిశుభ్రముగ సిద్ధపరచబడిన సుగంధతైలములను పద్మావతీ శ్రీనివాసు లొకరి కొకరు వ్రాసుకొనుట, నలుగుపెట్టుటలను 376

పరిహాసములాడుచు చేయించిరి రాజు సంతుష్టాంతరంగుడై బ్రాహ్మణోత్తము లకును, దేవతలకు, 377

స్త్రీలకును, పురుషులకును, సగౌరవముగా విష్ణుమూ వచ్చినంత భోజ్యపదార్థముల నిప్పించెను. 378

అనేక రకముల అప్పములను, పప్పు, కూరలను, నేతివడలను, పాలవడలను పెరుగువడల నేర్పాటు చేసెను. 379

తతః ఉద్ధృత్య నిక్షిప్తం । బహిర్భుక్తవతాం నృణామ్ ।
ఉచ్ఛిష్టపత్రజాలం చ । పుష్కలాన్నాదిసంయుతమ్ ॥ 380

సారమేయగణైః కీర్ణం । రాక్షసానాం గణై స్తథా ।
ఏవం కోలాహలం చక్రే । దివసాం శ్చతుర స్తథా ॥ 381

హాస స్తత్ర వినోదేన । నిత్య మాసీ చ్చ మజ్జనమ్ ।
దివసే పఞ్చమే ప్రాప్తే । కృత్వా నాకబలిం తథా ॥ 382

కలశాం శ్చతురో న్యస్య । దీపజ్వాలావిరాజితాన్ ।
వధూవరౌ ప్రతిష్ఠాప్య । రత్నసింహాసనే నృప ! ॥ 383

పూజయామాస గోవిన్దం । జామాతర మనామయమ్ ।
ఆకాశరాజో ధర్మాత్మా । క్షీరపాత్రం కరే ఽదదత్ ॥ 384

మాతరం వాసుదేవస్య । నామ్నా వకుళమాలికామ్ ।
పూజయిత్వా విధానేన । వస్త్రాలఙ్కారభూషణైః ॥ 385

నాభిం క్షీరేణ సమ్మృజ్య । పుత్రీం పద్మావతీం తదా ।
అర్పయామాస దుఃఖేన । బ్రహ్మణ్యో రాజస త్తమః ॥ 386

మహాలక్ష్మ్యా నాభిమూలం । సఘృతక్షీరసేచనమ్ ।
కృత్వా ఽర్పయామాస పుత్రీం । రుదన్ గద్గదకణ్ఠవాన్ ॥ 387

## శ్రీనివాసేన సహ శేషాచలమ్ప్రతి పద్మావతీప్రేషణమ్

శ్రీనివాసస్య కృష్ణస్య । శేషాచలనివాసినః ।
రాజభార్యా మహాభాగా । రుద న్తీ కురరీ వ చ ॥ 388

పుత్రీహస్తం ప్రదాయాథ । హస్తే రాజకులాఙ్గనా ।
క్షీరం సంయోజ్య కృష్ణస్య । నాభిమూలే ఽతిదుఃఖితా ॥ 389

భృశం రుదన్తీ మన్త్రేణ । దుగ్ధసందిగ్ధలోచనా ।
అర్పయామాస కృచ్ఛ్రేణ । పుత్రీం పద్మావతీం తతః ॥ 390

అందరును భుజించినపిమ్మట వారి అన్నము, భక్ష్యములతో కూడిన యెంగిలాకు లను బైట పార వేయించగా 380

కుక్కల గుంపులును, రాక్షసగణములు నచ్చట గుమిగూడుటచే విపరీతమగు కోలాహలము సంభవించెను. ఇట్లు నాల్గురోజులును 381

పరిహాసములతోను, వినోదములతోను, నిత్యమభ్యంగనము జరిగెను. ఐదవ రోజు వచ్చినంతనే నాగవల్లిని పూర్తిచేసి 382

దీపశిఖలతో గూడిన నాల్గుకలశములనుంచి రత్నసింహాసనమున వధూవరుల నుంచి 383

పాలగిన్నెను చేతిలో నుంచుకొని సచ్చిదానందస్వరూపుడగు నల్లుడగు శ్రీనివాసుని ఆకాశరాజు పూజించెను. 384

వసుదేవుని తల్లియగు వకుళమాలికను వస్త్రాలంకార ఆభరణములచే యథావిధిగ పూజించి 385

బొట్టును పాలతో తుడిచి యతికష్టముగా దుఃఖించుచు తన పుత్రికయగు పద్మావతిని నామెకును. 386

శ్రీదేవికి నట్లే నేతితోను పాలతోను బొట్టును తుడచి దుఃఖించుచు దగ్గుత్రికతో నర్పించెను. 387

## పద్మావతిని శ్రీనివాసునితో శేషాచలమున కంపించుట

రాజపత్నియు, పతివ్రతయునగు ధరణీదేవి యాడులేడివలె విలపించుచు 388

తన హస్తములోనికి కుమార్తె చేతిని తీసికొని శ్రీకృష్ణస్వరూపుడగు శ్రీనివాసుని నాభిని పాలతో తుడిచి 389

మిక్కిలి దుఃఖించుచు మంత్రములతో పాలచే కండ్లు తుడచికొని యతికష్టముతో పద్మావతి నప్పగించెను. 390

ప్రోవాచ చ శ్రీనివాసం । రుదన్తీ రాజవల్లభా ।

ధరణీ —

పాలితాం లాలితాం పుత్రీం । నవమాసధృతాం మయా ॥ 391

త్వదధీనాం జగన్నాథ ! । కరిష్యే మమ నన్దినీమ్ ।
ఇత్యేవ మర్పయన్త్యాం తు । ధరణ్యాం రాజసత్తమః ॥ 392

స తస్యా రోదనం దృష్ట్వా । రాజా దుఃఖపరాయణః ।
రురోద దీనవదనః । పుత్రీ మాలిఙ్గ్య భూపతిః ॥ 393

రాజా —

హా పుత్రి ! మన్దభాగ్యో ఽహం । త్వద్వియోగేన కేవలమ్ ।
జీవనం మమ కల్యాణి ! । నస్థిరం చ భవిష్యతి ॥ 394

క్రీడాగృహే రాజపుత్రి ! । తథా భోజనసద్మని ।
భ్రాతా తవ కథం క్రీడాం । భోజనం వా కరిష్యతి ॥ 395

ఏవం రుదన్త మాలోక్య । భ్రాతరం దీనచేతసమ్ ।
తొణ్డమానో నృపశ్రేష్ఠో । దుఃఖితో వాక్య మబ్రవీత్ ॥ 396

తొణ్డమానః —

వయం దరిద్రాః నిర్భాగ్యాః । కృపణాః దీనచేతసః ।
వయం మరణ మాపన్నాః । నా త్ర కార్యా విచారణా ॥ 397

ఏతాదృశీ చ కల్యాణీ । నై వ లబ్ధా కలౌ యుగే ।
ఇత్థం వయం విశ్చినుమో । వియోగభృశదుఃఖితాః ॥ 398

ఏవం తాన్ రుదతో దృష్ట్వా । వసుదానో ఽతిదుఃఖితః ।
భగినీం దీనవదనాం । ఆలిఙ్గ్య హ రుద మ్మహాన్ ॥ 399

వసుదానః —

మాతరం బాలకం త్యక్త్వా । యథా లోకే ధనార్జకః ।
గచ్ఛే త్తథా మాం భగిని ! । త్యక్త్వా త్వం క్షామ గచ్ఛసి ॥ 400

మరియు — జగన్నాథా ! నేను తొమ్మిదిమాసములు గర్భమున ధరించి కని యల్లారుముద్దుగా పెంచబడిన 391

నా పుత్రికను నీ కప్పగించుచున్నాన'ని తెలుపుచు తన కూతు నొప్పగించు చుండగా — 392

రా జామె దుఃఖమునుగాంచి తానును మిక్కిలి దుఃఖించుచు విచారముతో విన్నబోయిన వదనముతో పుత్రికను కౌగలించుకొని 393

రాజు —.

అమ్మా ! నీ వియోగముచే దురద్రుష్టవంతుడనగు నేను జీవించుట యసంభవము. 394

క్రీడామందిరమున నీవు లేక నీ యన్న యెవరితో క్రీడించును ? భోజనమందిరమున నొంటిగా నెట్లు భుజించున'ని 395

దీనమనస్కుడై విలపించుచున్న సోదరుని గని తొండమానుడు తానును దుఃఖించుచు 396

తొండమానుడు —

మనము దరిద్రులము; మందభాగ్యులము. కుత్సితులము. దుఃఖితాంతఃకరణులము. మనకు మృత్యువు సమీపించినది. ఇందు సందియములేదు. 397

ఇట్టి కన్యారత్నము కలియుగమున లభింపజాలదు. ఈమె వియోగముచే మిక్కిలి దుఃఖించుచున్న మే మిట్లు తలంచుచున్నామ'ని 398

పరిపరివిధముల విలపించుచుండగా సోదరుడగు వసుదానుడును మిక్కిలి దుఃఖించుచు చిన్నబోయిన ముఖముతో నిలచియున్న సోదరిని కౌగలించుకొని 399

వసుదానుడు —

ధనమును సంపాదింపగోరువాడు తల్లిని, బాలుని విడచిపోవునట్లు నీవు నన్ను విడచి యెచ్చటి కేగెదవ'ని 400

ఏవం ప్రసఙ్గా త్తత్రా సత్ । దేవానా మపి భూమిప ।
ఋషీణాం కశ్యపాదీనాం । దుఃఖ మత్యన్తదారుణమ్ ॥ 401

రుదన్తం నృపతిం దృష్ట్వా । శ్రీనివాసః సతాం గతిః ।
స్వయం రురోద గోవిన్దో । భగినీం పార్థివల్లభామ్ ॥ 402

స్మృత్వా శ్రీదేవకీపుత్రః । త దద్భుత మివా భవత్ ।
ఇత్థం కృత్వా లోకరీతిం । ఐరావత ముపాస్థితః ॥ 403

పద్మావత్యా తయా సార్ధం । సర్వావాస్యసమన్వితః ।
గ్రామం ప్రదక్షిణీకృత్య । రమయా సహితో హరిః ॥ 404

స్వనివేశగృహం భేజ । పద్మాసనాదివాదకైః ।
తతో హరిః శ్రీనివాసః । స్వస్థానం గన్తు మైహత ॥ 405

గరుడస్కన్ధమారూఢః । పత్నీంపద్మావతీ మపి ।
ఆరోపయన్ వరారోహాం । అన్యోన్యం పరిరభ్య చ ॥ 406

గరుడస్కన్ధ మారూఢో । గన్తుం స్వస్థాన ముత్సుకః ।
హరి రామన్త్రణార్థస్తు । శ్వశ్రూశ్వశురయో స్తదా ॥ 407

పున ర్గృహం సమ్ప్రవిశ్య । గమనేచ్ఛు రభూ దధ ।
శ్వశురౌ పర్యపృచ్ఛ చ్చ । సాష్టాఙ్గం ప్రణిపత్య వై ॥ 408

ఆశీర్వాదం తత శ్చక్రే । స్వజామాతు రనామయమ్ ।
ఆకాశరాజః శ్వశురః । శ్వశ్రూశ్చ ధరయా సహ ॥ 409

ఆకాశరాజః —

దీర్ఘాయు ర్భవ గోవిన్ద । సర్వలోకధురన్ధర ।
ఇత్యాశిషా ఽభినన్ద్యాథ । వాసుదేవ మభాషత ॥ 410

రాజా —

మాపాన్తే గచ్ఛ గోవిన్ద । వధ్వా సహ వయోగతమ్ ।
శ్వశురం మా ఇచ్ఛ తే శ్వశ్రూం । మానయస్వ మహామతే ॥ 411

దుఃఖించుచుండగా నీ ప్రసంగమును విని దేవతలకును, కశ్యపాది మహర్షీంద్రులకు గూడ చాల దుఃఖము కలిగెను. 401

సజ్జనసంరక్షకుడగు శ్రీనివాసు డట్లు దుఃఖించుచున్న రాజునుగాంచి తన సోదరియగు అర్జునుని భార్యయగు సుభద్రను తలంచుకొని తానును దుఃఖించసాగెను. 402

ఆ దృశ్య మత్యద్భుతమాయెను. ఇట్లులోకపరిపాటి ననుసరించినపిమ్మట శ్రీనివాసు డైరావతముపై నధిష్ఠించి 403

పద్మావతితో గూడి సకలవాద్యములు మ్రోగుచుండగా నగరమునకు ప్రదక్షిణ మొనరించి 404

చతుర్ముఖశివాదులతో తన నివాసమున కేతెంచెను. అంత శ్రీనివాసుడు తన నివాసమగు శేషాచలమున కేగుటకై యిచ్ఛగించి 405

గరుడునిపై పద్మావతిని గూడ నెక్కించుకొని యొకరినొక రాలింగన మొనర్చుకొని 406

తన యత్తమామల యనుమతికై 407

మరల వారి గృహమునకేగి వారి కుశలమడిగి సాష్టాంగముగా నమస్కరించి తన ప్రయాణము నెఱింగించెను. 408

మామగారగు ఆకాశరాజును అత్తయగు ధరణీదేవియు నట్లని 409

జనుల నందరను రక్షించు భారమును వహించి నిర్వహించుటలో చతురుడవగు గోవిందా! చిరకాలము జీవింపుమని ఆశీర్వదించి, యాతనితో 410

రాజు —

మునరివారమగు మా మాటపై గౌరవముంచి నీ భార్యయగు పద్మావతితో నొక నెలదినములుండి పిమ్మట వెడలుమని 411

ఇతి తస్య వచః శ్రుత్వా । వాసుదేవో ఽబ్రవీ న్నృపమ్ ।

శ్రీనివాసః —

నృప ! వాక్యం శృణు మమ । కార్యస్య మహతీ త్వరా ॥ 412

తస్మా దాజ్ఞాం చ మే దేహి । రాజం స్తే స్యాత్ కృపా మయి ।

ఇత్యుక్త్వా వాసుదేవ స్తు । గరుడస్కన్ధ మాస్థితః ॥ 413

జగామ భగవాన్ సాక్షాత్ సర్వదేవసమన్వితః ।

ఆకులాః వ్యాకులా స్సర్వే । నగరస్థా జనా స్తదా ।

ప్రాకారగోపురారూఢాః । పశ్యన్త స్సదృశా ఽవదన్ ॥ 414

జనాః —

ధన్యా రాజకులోత్పన్నా । పద్మా కమలలోచనా ।

అనుగచ్ఛతి గోవిన్దం । పశ్యతేతిపరస్పరమ్ ॥ 415

పద్మావతీ శ్రీనివాసయో ర్వియన్నృపప్రేషిత పారిబర్హాదిః

తదా దదౌ మహారాజః । పారిబర్హం శ్రియఃపతేః ।

తణ్డులాన్ శాలిసమ్భూతాన్ । వృషభాణాం రథోపరి ॥ 416

ఆరోప్య ప్రేషయామాస । శతం ఖారీర్వియన్నృపః ।

ముద్గాన్ గోస్వామిసంరూఢాన్ । త్రింశత్ఖారీ ర్దదౌ హరేః ॥ 417

గుడభారం మహాన్త మిక్షు । తిన్త్రిణీభారమేవ చ ।

పయోఘట సహస్రాణి । దధిభాణ్డశతాని చ ॥ 418

సహస్రార్ధం ఘృతాపూర్ణ । చర్మపాత్రాణి సర్షపాన్ ।

మేథికాన్ హిఙ్గు లవణ । తిలపాత్రాణి చైవ హి ॥ 419

తథా శర్కరయాపూర్ణ । ఘటాంస్తు ద్వేశతే తథా ।

వార్తాకం చూత కదలీ । ఫల జమ్బీరకాణి చ ॥ 420

కూష్మాణ్డకన్దమూలాని । మరీచామలకాని చ ।

మధుభాణ్డశతే ద్వే చ । రమ్భాకాష్ఠచయాం స్తథా ॥ 421

యడుగగా, నాతనితో శ్రీనివాసుడు— రాజా ! నామాట నాలింపుము. నాకు చాల తొందరపని యున్నది. 412

మీకు నా యందు దయయున్నచో నా కన్యను నొసంగుమని గరుడునిపై నధిష్ఠించి 413

దేవత లందరితో వెడలిపోయెను. ప్రాకారములపైనను, గోపురములపైన నెక్కి తమ కనులార నీ దృశ్యమును గాంచుచున్న జనులందరును కలతచెందుచు 414

జనులు —

" రాజవంశోద్భవయగు నీ పద్మావతి ధన్యురాలు. శ్రీనివాసునితో నేగుచున్నది. గాంచుడ"ని యొకరికొకరు జూపుకొనుచు భాషింపనారగిరి. 415

## పద్మావతీ శ్రీనివాసుల కాకాశరాజు పెండ్లి బహుమానములను పంపుట

ఆకాశరాజు పెండ్లికుమారునకు రాజయోగ్యమైన పదార్థములగు శాలిధియ్యమును నూరుబారువలు ఎద్దులచే కూర్చిన రథముపై నుంచియు, మూడువందల బారువుల పెసలను బలిష్ఠమైన (ఆబోతు లనదగు) వృషభములపై వేసియు, 416, 417

చాల బారువుల బెల్లమును, బారువులకొలది చింతపండును, వేలకొలది పాల కుండలను, నూర్లకొలది పెరుగుకుండలను, 418

అయిదువందల నేతితో నింపిన చర్మ(తోలు)పాత్రలను, ఆవాలు, మెంతులు, ఇంగువ, ఉప్పు, మవ్వులతో నిండిన పాత్రలను, 419

చక్కెరతో నింపిన రెండువందల కుంభలను, వంకాయలను, మామిడి, అరటి, నిమ్మపండ్లను 420

గుమ్మడి, కంద, మిరప, ఉసిరికలను రెండువందల తేనెకుండలను, అరటి మూపుల పనేకములను, 421

రమ్యాత్వచ శ్చ రాజేన్ద్ర! । పత్రాణాం నిచయం తథా ।
అశ్వానా మయుతం దత్త్వా । గజానాఞ్చ సహస్రకమ్ ॥ 422

ధేనూనాం పఞ్చసాహస్రం । ఆలికానాం శతం తథా ।
దాసీనాం ద్వే శతే రాజన్! । దాసానాం త్రిశతం తథా ॥ 423

వస్త్రాణి వివిధా న్యాశు । పర్యఙ్కం రత్నభూషితమ్ ।
ఉపబర్హం రత్నయుతం । పారిబర్హేణ సంయుతమ్॥ 424

ఏవ మాదీని వస్తూని । గృహీత్వా నృపసత్తమః ।
పుత్రేణ సహితో రాజా । శ్రీనివాస పరాయణః ॥ 435

ఆకాశరాజో ధర్మజ్ఞః । శ్రీనివాసస్య సన్నిధిమ్ ।
ఆగతః శ్వశురం దృష్ట్వా । చో త్తస్థౌ జగదీశ్వరః ॥ 426

### వియన్నృపస్య శ్రీనివాసదత్త స్వభక్తి నైరన్తర్యరూప వరప్రాప్తిః

శ్రీనివాసః —

దూరాధ్వానం మహారాజ! కిమర్థం త్వం సమాగతః ।
దాతవ్యం కిం నృపశ్రేష్ఠ! । తవ పుత్రస్య మే ఽనఘ ॥ 427

కన్యా దత్త్వా సుతః ప్రాప్తః । సుకృతం కిం కృతం త్వయా ।
సన్తోష శ్చాతులః ప్రాప్తో । మమ తాత న సంశయః ॥ 428

కిం తే మనోగతం రాజన్! । త న్మమా చక్ష్వ భూపతే! ।
సన్దేహం మా కురుష్వాత్ర । దానాదానే మహీపతే ।
వాసుదేవ వచః శ్రుత్వా । వాసుదేవ మభాషత ॥ 429

రాజా —

సర్వమఙ్గళ మస్మాకం । త్వత్ప్రసాదేన కేశవ! ।
నా న్య ద్యాచే జగన్నాథ! । తవ పాదసరోరుహే ॥ 430

భక్తిం దేహ్య చలాం కృష్ణ! । సకుటుమ్బస్య మే ఽనఘ ।
త చ్ఛ్రుత్వా వచనం తస్య । శ్వశురస్య మహాత్మనః ॥ 431

ఆరటిపట్టలను, పదివేల అరటియాకులను, పదివేల గుజ్జములను, వేలకొలది యేనగులను, 422

అయిదువేల యావులను, మూర్లకొలది గొఱ్ఱెలమందలను, రెండువందల దాసీలను, మూడువందల పరివారములను, 423

అనేకరకముల వస్త్రములను, రత్నములచే కూర్పబడిన మంచమును, రత్నజటితమగు తలగడను మొదలగు పెండ్లిసమయమున నీయవలసిన కానుకలను 424

తీసికొని తన పుత్రునితో శ్రీనివాస పదపంకజలగ్నచిత్తుడై 425

శ్రీనివాసుని సమీపించెను. మామగారినిగాంచి శ్రీనివాసుడు లేచి నిలచి 426

## శ్రీనివాసు డాకాశరాజునకు తనయందచంచలభక్తి స్థిరముగా నుండునట్టి వరము నొసంగుట

శ్రీనివాసుడు —

రాజా ! నీ వింతదూరమున కేల వచ్చితివి ? నీ పుత్రతుల్యుడవగు నా కింక నేమి యీయవలసి యున్నది ? 427

కన్య నొసంగితివి. పుత్రుని బడసితివి. నీ వెంతో పుణ్యాత్ముడవు. నాకు నీవలన నంతులేని సంతోషము కలిగినది. ఇం దేమియు సంశయములేదు. 428

నీ మనస్సులోని యభిప్రాయమును నా కెఱింగింపుము. ఇప్పటిలోను పుచ్చు కొనుటలోను సందేహించవలద'ని పలుకగా ఆకాశరా జాతనితో— 429

శ్రీనివాసా ! నీ యనుగ్రహముచే మా కన్నియు శుభముగనే యున్నవి. నీ పాదపద్మముల సన్నిధానమున నింకేమియును కోరజాలను. 430

కృష్ణా ! నాకును, నా కుటుంబమునకును నిశ్చలభక్తి నొసంగుమ'ని ప్రార్థించెను. శ్రీనివాసుడు మామగారగు 431

దత్త్వా తస్య సాయుజ్యం । ఆకాశనృపతే స్తదా ।
స్వాలకస్య దదౌ వస్త్రం । స్వాఙ్గస్థం మధుసూదనః ॥ 432

జామాత్రా చ సమాజ్ఞప్తః । పుత్రీభవన మభ్యగాత్ ।
"పుత్రి ! గచ్ఛామి నగరం । విహరస్వ హరిప్రియే ! ॥ 433

శయనే శ్రీనివాసస్య । శయనం కురు మఙ్గళే ! ।
ఇతి రాజా సాన్త్వయిత్వా । పుత్రీం కమల లోచనామ్ ॥ 434

శశాస సా స్వపిత్రోక్తం । శీఘ్రం మాధవ మభ్యగాత్ ।
రుదన్ గద్గదకణ్ఠేన । జగామ నగరం నృపః ॥ 435

## భగవత్కృత షణ్మాసావధి కాగస్త్యాశ్రమవాస ప్రతిజ్ఞా

పద్మావత్యనుగో దేవో । బ్రహ్మరుద్రాదికై ర్వృతః ।
సువర్ణముఖరీం ప్రాప్య । తత్ర వాస మకల్పయత్ ॥ 436

షణ్మాసావధి లక్ష్మీశో । 'దీక్షితో ఽహం మహామతే ! ।
న శైలరాజ మారోహ' । మితి విశ్రుత్య దేవరాట్ ।
అగస్త్యభవనం గత్వా । తత్ర వాస మకల్పయత్ ॥ 437

## స్వావాసం ప్రతి భగవత్కృతదేవాదిప్రేషణమ్

దేవాన్ సమ్ప్రేషయామాస । స్వధామాని వృషాకపిః ।
బ్రహ్మాదీనాం సురాణాఞ్చ । మునీనా మూర్ధ్వరేతసామ్ ॥ 438

దదౌ వస్త్రం యథా యోగ్యం । భగవాన్ భక్తవత్సలః ।
తేనా ఽజ్ఞప్తా జగద్ధాత్రా । జగ్ము ర్లోకం స్వకం సురాః ॥ 439

ఋషయ శ్చ తపో ఽరణ్యం । జగ్ము ర్నారాయణాజ్ఞయా ।
లక్ష్మీ ర్జగామ రాజేన్ద్ర । కరవీరపురం తదా ॥ 440

మహోత్సవం తత్త్వనుభూయ దేవతాః । బ్రహ్మేశపూర్వాః సమహర్షిస[illegible]ః ॥
జగ్ముః స్వకం ధామ మహానుభావాః । రాజేన్ద్రపూజ్యం ప్రశశంసు రాద[illegible] ॥ 441

నాకాశరాజును కల్లే సాయుజ్యము (తనతో సమానభోగానుభవమును) నొసంగి బావమరదికి తన శరీరముపైనున్న పట్టువస్త్రమును బహూకరించెను. 432

ఇట్లల్లునిచే నాజ్ఞాపింపబడి తన కుమార్తెయగు పద్మావతి యంతఃపురమున కరిగి "అమ్మా! నేను నా పురమున కేగుచున్నాను. నీవు శ్రీనివాసునకు ప్రియురాలవై మెలంగుము. 433

శ్రీనివాసునితో సౌఖ్యముపై పవ్వళింపుము"ని ఓదార్చుచు నాజ్ఞాపింపగా 434

నామె తండ్రి యాజ్ఞానుసారము శ్రీనివాసుని సన్నిధానమున కేగెను. ఆకాశరాజు దగ్గుత్తికతో విచారించుచు తన నగరమునకు వెడలిపోయెను. 435

## శ్రీనివాసు డారునెలలవరకు అగస్త్యాశ్రమమున నుండుటకు ప్రతిజ్ఞ చేయుట

శ్రీనివాసుడు పద్మావతితోను, బ్రహ్మరుద్రాదులతోగూడి సువర్ణముఖరీనదిని సమీపించి యచ్చట 436

'తా నారునెలలవరకు శేషాచలము నధిరోహింపన'ని దీక్షబూని అగస్త్యాశ్రమమున నివాసము నేర్పరచుకొనెను. 437

## బ్రహ్మాదిదేవతలను తమ తమ స్థానములకు పంపించుట

శ్రీనివాసు డంతట బ్రహ్మాదిదేవతలకు జితేంద్రియులగు మునీంద్రులకు వారి వారి యర్హతలకు తగినట్లు వస్త్రముల నొసంగి వారివారి నిలయముల కేగుటకై యాజ్ఞ నొసంగగా దేవత లందరును తమ తమ యావాసముల కరిగిరి. 438, 439

ఋషులు నారాయణాజ్ఞను నౌదలదాల్చి తమ తపస్సుల కనుకూలమగు నరణ్యమున కేగిరి. లక్ష్మీకరవీరపురమున కరిగెను. 440

బ్రహ్మరుద్రాదిదేవతలును మౌనీంద్రులును మున్నగు మహాత్ము లందరు నా శ్రీనివాస కల్యాణ మహోత్సవమును నేత్రపర్వముగా ననుభవించి రాజాధిరాజసంపూజితు డగు శ్రీనివాసుని స్తుతించుచు తమ స్థానముల కేగిరి. 441

గతే దేవగణే తత్ర । త్వగ స్త్యనిలయం గతః ।
భుక్త్వానో భోగ మతులం । తత్రా ఽ స్త భగవాన్ హరిః ॥ 442

## వివాహాధ్యాయ ఫలశ్రుతిః

శతానన్దః —

వివాహాధ్యాయమాహాత్మ్యం । యే శృణ్వ న్తి జనేశ్వర !
తేషాం భాగ్యోదయం వక్ష్యే । శృణు రాజన్ సవి స్తరమ్ ॥ 443

కోటికన్యాప్రదానేన । యావ ద్భూమిప్రదానతః ।
య త్ఫలం లభతే దేహీ । త త్ఫలం శ్రవణాదరాత్ ॥ 444

యే ఉత్సవం కారయ న్తి । వై వాహం వేఙ్కటేశితుః ।
తస్యో త్సవో భవే ద్రాజన్ ! । వేఙ్కటేశ ప్రసాదతః ॥ 445

ఇతి తే కథితం రాజన్ ! । వివాహచరితం హరేః ।
శృణుయా చ్ఛ్రావయే ద్వాపి । సర్వాభీష్ట మవాప్నుయాత్ ॥
శుభదం శృణ్వతా ఞ్చైవ । సర్వేషాం మఙ్గళప్రదమ్ ॥ 446

ఇతి శ్రీ భవిష్యో త్తరపురాణే శ్రీ వేఙ్కటాచలమాహాత్మ్యే శ్రీనివాస వివాహవర్ణనం నామ ఏకాదశో ఽధ్యాయః

---

# అథ ద్వాదశో ఽధ్యాయః

## శ్రీనివాసం ప్రతి వియన్నృపోద న్త జ్ఞాపక దూతాగమనమ్

జనకః —

తతః కి మకరో త్కృష్ణో । రాజ్యే ఽస్మిన్ పార్థసారథిః ।
త న్మమా చక్ష్వ విప్రేన్ద్ర ! । య త్కృతం చక్రపాణినా ॥ 1

శతానన్దః —

దేవతలందరు నేగినపిమ్మట శ్రీనివాసు డగస్త్యాశ్రమమున కేగి నిరూపమాన భోగముల ననుభవించుచు నచ్చట నివసించెను. 442

## కల్యాణచరితముగల అధ్యాయమును వినుటవలన కలుగు ఫలితము

శతానందుడు —

రాజా! వివాహ వర్ణనముగల యీ అధ్యాయమును వినినవారికి కలుగు నదృష్ట మును విస్తారముగా తెలిపెదను వినుము. 443

కోటి కన్యాదానములను చేయుటవలనను, భూదానమువలనను లభించు ఫల మీ యధ్యాయ శ్రవణమువలన లభించును. 444

శ్రీనివాసుని కల్యాణము నొనరించువారికా శ్రీనివాసుని యనుగ్రహమువలన కల్యాణములు చేకూరును. 445

రాజా! ఇట్లు నీ కీ యధ్యాయఫలితమును తెలిపితిని శ్రీనివాసుని కల్యాణ అధ్యాయమును వినినను వినిపించినను సకలకోరికలను బడయును. వినువా రందరకు శుభముల నిచ్చును, మంగళముల నొసంగునని శతానందుడు జనకమహారాజున కీ చరితమును తెలిపెను. 446

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున శ్రీనివాస వివాహవర్ణ నము పదునొకండవ అధ్యాయము

---

# పంద్రెండవ అధ్యాయము

## శ్రీనివాసున కాకాశరాజ వృత్తాంతమును తెలుపుటకై దూత వచ్చుట

జనకుడు —

శతానందా! పిమ్మట శ్రీనివాసు డీ రాజ్యమున నేమి యొనరించెనో యా చరితము నెఱింగింపుమ'ని జనకమహారాజు ప్రశ్నించెను. 1

శతానందుడు —

ఏవం కాలే గతే తస్మిన్ । షణ్మాసా శ్చ సమత్యయుః ।
నారాయణపురా ద్దూతః । ఆగతో వేఙ్కటేశ్వరమ్ ॥ 2

దూతం దృష్ట్వా ఒఙ్జాతా సా । సువర్ణముఖరీజలే ।
స్నాతుకామా ఒరవిన్దాక్షీ । దూతం వచన మబ్రవీత్ ॥ 3

పద్మావతీ —

కిమర్థ మాగతో దూత । కేన త్వం ప్రేషిత స్త్విహ ।
తాజ్ఞా వా రాజపుత్రేణ । తొణ్డమానేన వా పునః ॥ 4

ప్రపచ్ఛ కుశల న్త్విచ్ఛ । రాజ్ఞః తస్య పితు స్తథా ।
కుశలీ వర్తతే చార ! । జనకో జననీ మమ ॥ 5

తొణ్డమాన్ రాజశార్దూలః । కుశలీ వర్తతే బలీ ।
రాజ్ఞః ప్రకృతయః సర్వాః । వర్తన్తే క్షేమసంయుతాః ॥ 6

ఏవ ముక్త స్తదా దూతో । దుఃఖసన్దగ్ధలోచనః ।
ఉవాచ దీనయా వాచా । రాజపుత్రీం నిదేశతః ॥ 7

దూతః —

కిం వదిష్యామి హేమాతః ! । పితు స్తే కాల ఆగతః ।
మరణాభిముఖో భూత్వా । కిఞ్చి జ్జీవ సమన్వితః ॥ 8

త్వాం ద్రష్టుకామో రాజేన్ద్రః । శ్రీనివాసం సుహృద్వృతమ్ ।
నయ శీఘ్రం పతిం భద్రే । రాజధానీం పితు స్తు తే ॥ 9

సా ఒపి దూతవచః శ్రుత్వా । పపాత గతచేతనా ।
ఆగ స్త్యభార్యా తాం బాలాం । ఉత్థాప్య కమలాలయామ్ ॥ 10

శ్రీనివాసా న్తికం నిన్యే । రాజపుత్రీం పితృప్రియామ్ ।
తద్వార్తా మవద ద్దేపి । శ్రీనివాసాయ విష్ణవే ॥
త చ్ఛ్రుత్వా వాసుదేవ స్తు । తురోద వరను త్తమః ॥ 11

శ్రీనివాసః —

శతానందు డిట్లు చెప్పుట కారంభించెను. జనకమహారాజా! ఇట్లారుమాసములు గడచినంతనే నారాయణపురమునుండి శ్రీనివాసునివద్ద కొక దూత వచ్చెను— 2

కమలోద్భవియును పద్మనేత్రియునగు పద్మావతి సువర్ణముఖరీనదిలో స్నానము చేయగోరినదై దూతనుగాంచి 3

పద్మావతి —

ఓయీ! నీ వెందులకు వచ్చితివి? నిన్నెవరు పంపిరి? రాజు పంపెనా? రాజపుత్రుడు పంపెనా? తొండమానుడు పంపెనా? 4

నా తండ్రియగు నాకాశరాజు క్షేమమేకదా! నా తల్లియగు ధరణీదేవికి క్షేమమేకదా! 5

పరాక్రమశాలియగు తొండమానుడు క్షేమముగ నున్నాడుకదా! రాజపరివార మంతయు కుశలముగ నున్నారుకదా! 6

యని యడుగగా దూత కనులలో దీనత గోచరింప దైన్యమునుగొలుపు మాట లతో పద్మావతితో— 7

దూత —

అమ్మా! ఏమని తెలుపుదును? నీ తండ్రికి మరణమాసన్నమైనది. మరణ శయ్యపైనుండి కొద్ది ప్రాణముతో 8

స్నేహితులతోగూడ శ్రీనివాసుని, నిన్ను చూడగోరుచున్నాడు. నీ భర్తయగు శ్రీనివాసుని నీ తండ్రిరాజువానికి త్వరితముగా గొనిపోవలయునని తెలుపగా 9

పద్మావతి చేష్టలుడిగి భూమిపై పడిపోయెను. అగస్త్యునిభార్య పద్మావతిని లేవనెత్తి 10

తండ్రియందపారప్రేమగల నా పద్మావతిని శ్రీనివాసునివద్దకు గొంపోయి శ్రీనివాసున కావార్త నెఱింగించెను. శ్రీనివాసు డావార్తను వినినంతనే— 11

శ్రీనివాసుడు —

అహో బత మహ త్కష్టం । సమ్ప్రాప్తం మమ భామిని ! ।
కిం కరోమి క్వ గచ్ఛామి ? । బ్రూహి త్వం పద్మసమ్భవే ! ।
ఇ త్యేవ ముక్త్వా తాం దేవీం । అబ్రవీత్ కుమ్భసమ్భవమ్ ॥ 12

## వియన్నృపవిలోకనాయ అగస్త్యేన సహ శ్రీనివాసగమనమ్

శ్రీ భగవాన్ —

అగస్త్య మునిశార్దూల ! । గచ్ఛామి నగరం ప్రతి ।
పద్మావత్యా సహై వ్యైవ । సార్ధం వకులమాలయా ॥ 13

ఇ త్యుక్త్వా ప్రయయౌ రాజన్ ! । భగవాన్ భక్తవత్సలః ।
అగస్త్యేనా పి సహితః । త్వరయైవ మహర్షిణా ॥ 14

ఆదిత్యే ఽస్తం గతే రాజన్ । నగరద్వార మాగతః ।
ప్రపచ్ఛ ద్వారపాలాం శ్చ । రాజక్షేమం సురేశ్వరః ॥ 15

రాజమార్గే మహరాజ ! । భగవాన్ ప్రియయా సహ ।
అన్తర్నికేతనం ప్రాప్య । రాజానం పృథివీపతే ! ॥ 16

శయానం దర్శయామాస । వినిఃశ్వాస సమన్వితమ్ ।
పపాతా స్య మహారాజ ! । కాయే కమలలోచనః ॥ 17

## మరణోద్యుక్తం వియన్నృప ముద్దిశ్య శ్రీనివాసాదికృత నిర్వేదనమ్

ముఖే ముఖం వినిక్షిప్య । లలాట ఞ్చ లలాటకే ।
ఉదరే చోదరం బద్ధ్వా । నేత్రం నేత్రే సమర్పయత్ ।
ఆలిఙ్గనం దదౌ తస్య । శ్వశురస్య మహాత్మనః ॥ 18

హాతాత: నాథ! క్వగతో ఽసి చ త్వం। న త్యజ్య దేహం స్వసుతం స్వపుత్రీమ్।
స్వభ్రాతరం సూక్ష్మమతిం పరాత్మకం। రాజ్యం త్వదీయం క్వ విసృజ్య గచ్ఛసి।

మాతాపితృవిహీనానాం । అస్మాకం జనకో భవాన్ ।
కథం పశ్యామి నేత్రాభ్యాం । త్వన్ముఖామ్భోజ ముత్తమమ్ ॥ 20

అయ్యో! మన కెంతకష్టము సంభవించినది. ఏమి చేయుదును? ఎటకేగుదును? పద్మావతీ! నీవే తెల్పుమని దుఃఖించుచు నగస్త్యునితో— 12

## శ్రీనివాసు డగస్త్యునితో కూడ నాకాశరాజును చూడబోవుట

శ్రీభగవానుడు —

అగస్త్యమునీంద్రా! పద్మావతిని వకుళమాలను తోడ్కొని నేనిపుడే ఆకాశరాజ నగరమున కేగెదనని 13

పలికి శ్రీనివాసు డతిశయమున నగస్త్యునితో గూడ 14

సూర్యు డస్తాద్రికేగు తరుణమున నాకాశరాజపురద్వారమును సమీపించి ద్వారపాలురను రాజుయొక్క క్షేమసమాచారము నడిగెను. 15

వెంటనే రాజమార్గముగా పద్మావతితో గూడ లోపలిగృహమున కరిగి ఆయాసపడుచు 16

పండుకొనియున్న రాజును గాంచినంతనే యాతనిపైబడి 17

## చనిపోవుటకు సిద్ధముగానున్న ఆకాశరాజును గూర్చి శ్రీనివాసాదులు దుఃఖించుట

ముఖముపై ముఖమునుంచి ఫాలతలముపై తన ఫాలమునుంచి, రాజుగర్భముపై తన గర్భమునుంచి, రాజు కనులతో తన కనులను కలిపి యిట్లు మహాత్ముడగు తన మామ గారికి తన యంగసంశ్లేషమును ప్రసాదించి — 18

నాయనా! రాజా! నీ పుత్రుడవగు వసుదానుని, నీ పుత్రికయగు పద్మావతిని మహాభీశాలి యగు నీ సోదరుని, రాష్ట్రములతో గూడిన రాజ్యమును, నీ శరీరమును విడచి యెచ్చటి కేగుచున్నావు? 19

తల్లిదండ్రులులేని మాకు నీవే తండ్రివి. ఈ నేత్రములతో నీ ముఖపద్మము నిక నెట్లు గాంతుము. 20

ఉత్థాపయ సుతాం రాజన్ ! । రుదంతీం తనయం తథా
వసుదానం శిశుం రాజన్ ! । పితృహీన ఇచ్చ మాం నృప ॥ 21

క స్త్రాతా త్వాం వినా రాజన్ !, అస్మాకస్తు భవిష్యతి ।
అనాథాన్ నాథ నః పాహి । ప్రాజాః పాహి ప్రజాపతే ! ॥ 22

ప్రలపన్ పున రప్యా హ । లోకా నిత్థం విదమ్బయన్ ।
"కలేవరం కథం దాస్యా । మ్య గ్నయే లోకమోహనమ్ ॥ 23

ఏతదర్థం స్వపుత్రీం మే । దత్త్వా మృతి మవాప్స్యసి ।
శ్రీనివాసః న గచ్ఛే తి । పూర్వ మేవ త్వయోదితమ్ ॥ 24

ఉక్తం హితం మయా తాత ! । న శ్రుతం తే మహీపతే ! ।
న తృప్తం నేత్రయుగళం । దృష్ట్వా త్వన్ముఖపఙ్కజమ్ ॥ 25

తొణ్డమాన్ మణ్డలాధీశో , వసుధాయాం మహామతే ! ।
కా గతి ర్మమ రాజేన్ద్ర ! । కా వార్తా క్వ భవిష్యతి ॥ 26

విలోకయ మహారాజ ! । మా ఇచ్ఛ పద్మావతీం తథా ।

ముని: —

"జామాతా ఒయం సమాయాతః । పద్మావత్యా సమన్వితః ॥ 27

బహి ర్గచ్ఛ పురే వ త్వం । సమానయనకారణాత్ ।
భోజనం దీయతాం తస్య : జామాతుః పరితోషకమ్ ॥ 28

గజా నశ్వాన్ మహారాజ ! । వస్త్రాణీ చ్ఛతి తే సుతః ।
తాం దదస్వ మహారాజ ! । ప్రీతయే మధుఘాతినః ॥ 29

ఇత్య గస్త్యేన వై రాజ్ఞి । బోధితే ఒప్య ప్రబోధిని ।
విలలాప మహారాజ ! । భగవాన్ లౌకికై స్సమః ॥ 30

తదద్భుతం కర్మ చకార దేవో । విడమ్బయన్ సర్వజనం జగత్పతిః ।
యథా కురూణాం రణరఙ్గమధ్యే । కర్ణే హతే ధర్మరాజ శ్చకార ॥ 31

రాజా! విలపించుచున్న నీ పుత్రికను, బాలుడగు వసుదానుని, తండ్రిలేని నన్ను లేవనెత్తుము. 21

నీవు తప్ప మాకు సంరక్షకు లెవరు కాగలరు? దిక్కులేని మమ్ములను రక్షింపుము. ప్రజలను కాపాడుము. 22

ఇట్లు పలువిధముల విలపించుచు సామాన్య మానవునివలె లోకుల ననుకరించుచు మరల 'రాజా! సుందరమగు నీ కళేబరము నెట్లు అగ్నిహోత్రున కర్పింతును? 23

నీ విట్లు మరణింతువనియా నీ పుత్రికను నా కప్పగించితివి? "శ్రీనివాసా! నీవు నన్నువదలి వెడలవలద'ని చెప్పినను 24

నీ హితవును నే నాలకింపనైతివి. నీ ముఖపద్మము నెంతచూచినను నా కనులకు తృప్తి కలుగుటలేదు. 25

తొండమానుడే భూమండలమున కధికారి యగును. నా గతియేమి? నా ప్రఖ్యాతి యేమి? 26

మహారాజా! పద్మావతిని నన్నును గాంచుమ'ని బిగ్గగా రోదింప నారంభించెను. అంత నగస్త్యుడును రాజు నుద్దేశించి— "రాజా! పద్మావతితో నీ యల్లుడు వచ్చియున్నాడు. నీవు వారిని తోడ్తెచ్చుటకు 27

నగర బహిర్ద్వారమున కేగవలెను. అతనిని తోడ్కొనివచ్చి యాతనికి ప్రియమగు భోజనమును, కానుకల నీయవలయును. 28

పుత్రతుల్యుడగు నీ యల్లుని ప్రీతికై యాతడు కోరిన విధమున వేనుగులను, గుఱ్ఱములను, వస్త్రముల నొసంగుమ'ని 29

ఇట్లు లేపినను రాజు లేవకుండుటచే శ్రీనివాసుడు సామాన్య మానవునివలె విలపింప సాగెను. 30

కౌరవయుద్ధమున కర్ణుడు చనిపోయినంతనే ధర్మజు డేడ్చినట్లు శ్రీనివాసు డట్లు సామాన్య మానవునివలె నద్భుతముగా నాచరించెను. 31

ఏవం రుదతి గోవిన్దే । రాజా ఽఽకాశ శ్శ్వసన్ నృపః ।
కిఞ్చి త్సంజ్ఞాయుతో భూత్వా । వాసుదేవ మభాషత ॥ 32

పుత్రం సభ్రాతరం త్రాహి । శ్రీనివాస ! నిరామయ !
ఇ త్యుక్త్వా భూపతీ రాజన్ ! । కరే కృష్ణస్య తౌ దదౌ ॥ 33

భార్యాం సన్దేశయామాస । స్వలోకగమనాయ చ ।
ఇత్యా దిశ్య త్యజన్ ప్రాణాన్ । సత్యలోకం జనాధిపః ॥ 34

దివ్యం విమాన మారూఢో । జగామ స నృపోత్తమః ।
సా ఽపి తేన జగామా శు । ధరణీ రాజసత్తమ ! ॥ 35

## మృతాయ వియన్నృపాయ వసుదాన కృత చరమకృత్యక్రమః

తత శ్చితాం సమారోప్య । రాజానం సపరిగ్రహమ్ ।
వసిష్ఠో గౌతమో ఽత్రి శ్చ । భరద్వాజో ఽతివిశ్రుతః ॥ 36

వహన్తో రాజశార్దూల ! । శ్రీనివాసప్రియం నృప ! ।
జుహావు ర్బ్రహ్మ మేధేన । మన్త్రై శ్చ విధిపూర్వకమ్ ॥ 37

తతః కృతాని సర్వాణి । ప్రేతకార్యాణి భూపతేః ।
షోడశే దివసే ప్రాప్తే । మాసికా న్యకరో త్సుతః ॥ 38

విమన్త్రితా శ్చారుపుణ్యాః । బ్రాహ్మణాః వేదపారగాః ।
కశ్యపో ఽత్రి ర్భరద్వాజో । విశ్వామిత్రో ఽథ గౌతమః ॥ 39

వామదేవః పులస్త్యో ఽథ । వాల్మీకి ర్వసుధాధిప ! ।
జమదగ్ని ర్భృగు శ్శ్రీమాన్ । సనన్ద శ్చ పరాశరః ॥ 40

యాజ్ఞవల్క్య శ్చ జాబాలిః । శున శ్శేపో ఽథ కాహలః ।
ఏతే మహర్షయో రాజన్ ! । రాజార్థే బ్రాహ్మణోత్తమాః ॥ 41

అభుఞ్జ తన్నసార ఞ్చ । వసుదానవిమన్త్రితాః ।
సమాప్య సర్వకార్యాణి । హరిః స్వస్థాన మాశ్రితః ॥ 42

ఇట్లు శ్రీనివాసు డేడ్చుచుండగా నాకాశరాజు కొంచె మూపిరిని విడచుచు కొంచెము తెలివితెచ్చుకొని శ్రీనివాసునితో— 32

శ్రీనివాసా! దురితదూరా! నా తమ్మునితోకూడ నా పుత్రుని కాపాడుమని శ్రీనివాసుని చేతిలో నా రిరువుర నప్పగించెను. 33

భార్యయగు ధరణీదేవితో తనతో తాను జనుచున్నలోకమునకు వచ్చుట కాజ్ఞ నొసంగి ప్రాణములను విడచి 34

దివ్యమైన విమానముపై సత్యలోకమున కేగెను. ఆతనితో భార్యయగు ధరణీ దేవియు వెడలిపోయెను. 35

## చనిపోయిన ఆకాశరాజునకు వసుదాను డంత్యక్రియల నొనర్చుట

అనంతరము వసిష్ఠుడు గౌతముడు అత్రిమహాముని, భరద్వాజుడు 36

శ్రీనివాసుని కిష్టుడగు నాకాశరాజ మృతదేహమును మోసికొనిపోయి చితిపై నుంచి బ్రహ్మమేధ సంస్కారముతోను మంత్రములతోను దహన సంస్కారమొనరించిరి.

అటుపిమ్మట ప్రేతకర్మలన్నిటి నాచరించి పదునారవ దినమున వసుదానుడు మాసికముల నొనర్చెను. 38

పవిత్రులును వేదము నాపాంతమభ్యసించిన బ్రాహ్మణులు పిలిపించబడిరి. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, 39

వామదేముడు, పులస్త్యుడు, వాల్మీకి, జమదగ్ని, భృగువు, సనందనుడు, పరాశరుడు, 40

యాజ్ఞవల్క్యుడు జాబాలి శునఃశేపుడు కాహలుడు సను పీమహర్షులనుకూడ శ్రాద్ధభక్తలుగా నాహ్వానించిరి. 41

వారందరును వసుదానునిచే నాహ్వానింపబడి రుచ్యమగు భోజనమును భుజించిరి. శ్రీనివాసుడన్ని పనులను పూర్తిగావించి 42

పద్మావతీం పురస్కృత్య । పురాణపురుషోత్తమః ।
అగస్త్యాలయ మాసాద్య । సుఖ మాస్త సురేశ్వరః ॥ 43

తోణ్డమానవసుదానయోః రాజ్యముద్దిశ్యకలహప్రవృత్తిః

మృతే రాజ్ఞి గతే కృష్ణే । కలహః ప్రత్యపద్యత ।
తోణ్డమానపతే స్తస్య । విష్వక్సేనస్య భూమిప ! ॥ 44

జ్యేష్ఠే మృతే కనిష్ఠస్య । రాజ్య మేత ద్వివదో విదుః ।
పరమ్పరార్జితం హీ తి । తోణ్డమా నబ్రవీ త్సుతమ్ ॥ 45

వసుదానః —

పరాక్రమార్జితం రాజ్యం । పిత్రా మమ నృపోత్తమ ! ।
మమై వ స్యా దిదం హీ తి । తోణ్డమానం సుతో ఽబ్రవీత్ ॥ 46

ఏవం వివాద మాపన్నౌ । తోణ్డమా న్నృపపుత్రకౌ ।
రాజశార్దూలరాజ్యార్థం । ఉభా వపి మహాబలౌ ॥ 47

అ న్తరం కృతవన్తౌ తౌ । యుద్ధే యస్య జయో భవేత్ ।
తస్య రాజ్య మిదం సర్వం । అన్యథా ఽభో వ్రజే ది'తి ॥ 48

కృత్వా సమయ మారబ్ధౌ । సఙ్గరం జయకాంక్షిణౌ !
నానాదేశకిరాతాం శ్చ । క్షత్త్రియాన్ యుద్ధదుర్మదాన్ ॥ 49

ఆవాహయ చ్చ రాజేన్ద్ర ! । తోణ్డమాన్ యుద్ధదుర్మదః ।
అక్షౌహిణీద్వయం తేన । సై న్యం సమ్పాదితం నృప ! ॥ 50

తావ ద్రాజకుమారేణ । మిలితం సైన్య మక్షయమ్ ।
నారాయణపురప్రాన్తే । దక్షిణే రణమేదినీ ॥ 51

సాహాయ్యాశయా శ్రీనివాసం ప్రతి తోణ్డమాన్ వసుదానాగమనమ్

కృత్వా స్వాహాయ్యాశయా రాజన్ ! । తోణ్డమాన్ రాజనన్దనౌ ।
సమ్ప్రాప్తౌ వాసుదేవస్య । చరణౌ శరణం గతౌ ॥ 52

పద్మావతితోగూడ స్వస్థానమగు వనస్త్యాశ్రమమునకేగి సుఖముగా నుండెను. 43

## తొండమానునకును, వసుదానునకును రాజ్యమునకై కలహము సంభవించుట.

రాజు చనిపోయినంతనే "పెద్దవాడు చనిపోయినంతనే చిన్నవానికే రాజ్యము ప్రాప్తించునని రాజ్యమొకరినుండి యొకరికి పరంపరగా సంక్రమింపవలయునని ధర్మజ్ఞులు తెలుపుదురు గాన నాకే యీ రాజ్యము రావలయున'ని తొండమానుడును, 44-45

వసుదానుడు——

"నా తండ్రి తన పరాక్రమముచే శత్రువులను జయించి సంపాదించిన రాజ్యమగుటచే నాకే యీ రాజ్యము సంక్రమింపవలెన"ని వసుదానుడును 46

రాజ్యమునకై బలాఢ్యులగు నా యిరువురును వివాదపడసాగిరి. 47

తుదకెవరు యుద్ధమున జయింతురో వారికే యీ రాజ్యము సంక్రమించుననియు నపజయమును పొందినవారు దాసులు కావలయుననియు షరతు పెట్టుకొని 48

ఇరువురును జయమునే కోరుచు యుద్ధమునకు సన్నద్ధులైరి. అనేక దేశములనుండి కిరాతులను, యుద్ధమునందు దురహంకారముగల, 49

తొండమానుడు పిలిపించెను. తాను స్వయముగా రెండక్షౌహిణుల (ఒక్కొక్క అక్షౌహిణికిని—2,870 రథములు, 21870 ఏనుగులు, 65610 గుఱ్ఱములును, 109350 కాల్బలములును, గల సేనయుండును.) సేనను సమకూర్చుకొనెను. 50

రాజకుమారుడగు వసుదానునకల్లే పెక్కు సైన్యము సమకూరెను. వారాయుణ పురసమీపమున దక్షిణపుదిక్కున రణరంగము. 51

## శ్రీనివాసుని సహాయము కోరుటకై తొండమానుడు వసుదానుడు వచ్చుట.

నేర్పరచుకొని శ్రీనివాసుని తమకు సహాయముగా నుండుమని ప్రార్థించుటకై యిరువురును శ్రీనివాసుని పాదపద్మములయందు శరణుజొచ్చిరి. 52

త వాగతౌ రాజకుమారరాజౌ । దృష్ట్వా ఒతివేగేన స చా లిలిఙ్గ ।
సమ్భాష్య పిత్రా ప్రి ఒపి చ రత్నపీఠం । ప్రీత్యా తిహృష్టో వచనం బభాషే ॥ 53

శ్రీనివాసః —

కిమర్థ మాగమ స్తాత : । త న్మమా చక్ష్వ భూమిప !
శ్రీనివాసవచః శ్రుత్వా । స్యాలక స్త మభాషత ॥ 54

స్యాలకః —

యుద్ధం ప్రసక్తం గోవిన్ద ! । కనిష్ఠజనకేన మే ।
రాజ్యార్థం మమ సాహాయ్యం । కురు వారిజలోచన ! ॥ 55
బాలో ఒస్మి పితృహీనో ఒహం । అసహాయో ఒస్మి దేవరాట్ ! ।
స్యాలకస్య వచః శ్రుత్వా । రాజా తం వాక్య మబ్రవీత్ ॥ 56

రాజా —

శ్రీనివాసా రవిన్దాక్ష ! । కురు కార్యం పురఃస్థితః ।

శ్రీనివాసః —

ఏకో ఒహం తస్య సాహాయ్యం । కరిష్యే నృపసత్తమ ! ।
త మేవ ముక్త్వా భగవాన్ । అన్తర్భవన మభ్యగాత్ ॥ 57

## పద్మావత్యుక్త్యై వసుదానసాహ్యాకరణాయ శ్రీనివాసాగమనమ్

పద్మావతీం విశాలాక్షీం । పద్మనాభో ఒభ్యభాషత ।

శ్రీనివాసః —

కల్యాణి ! కార్య మాపన్నం । మహత్కష్టతరం మమ ॥ 58
తవ భ్రాతా వరారోహే ! । కనిష్ఠజనక స్తవ ।
రాజ్యార్థం కలహం కృత్వా । మమ సాహాయ్య కాఙ్క్షిణౌ ॥ 59
ఛిద్ధి సన్దేహ మధునా । కస్య సాహ్యం విధీయతామ్ ।
వియోజయస్వ మాం దేవి ! । యుక్త మాలోచ్య విస్తరాత్ ॥ 60

పద్మావతీ —

శ్రీనివాసుడు వీరిరువురను గాంచి వెంటనే లేచి యాలింగన మొనర్చుకొని కుశలప్రశ్నలనాచరించి, రత్నసింహాసనముల నొసంగి మిక్కిలి సంతసించుచు 53

శ్రీనివాసుడు —

"నాయనా! వసుదానా! మీరెందులకు వచ్చితిరో నా కెఱింగింపుడ"ని యడిగెను. అంత బావమరదియగు వసుదానుడు 54

"గోవిందా! నా పినతండ్రితో రాజ్యపరిపాలనావిషయమున యుద్ధము సంభవించినది. నాకు నీవు సహాయము నొనరింపవలెను. 55

బాలుడను, తండ్రిలేనివాడను, సహాయము లేనివాడన"ని ప్రార్థింపగా తొండమానుడు 56

రాజు —

శ్రీనివాసా! పద్మపత్రేక్షణా! నాకు సహాయముగా నిలచి నన్ను గెలిపించుమ"ని కోరెను. వారిరువురి ప్రార్థన నాలకించి శ్రీనివాసుడు నేను నంటరివాడనుకదా! నేనెవరికి సహాయపడుగలన"ని పలికి అంతఃపురమున కేగెను. 57

## పద్మావతి కోరికపై వసుదానునకు సహాయమొనరించుటకు శ్రీనివాసుడు వచ్చుట.

అచ్చట పద్మావతిని గాంచి "దేవీ! చాల కష్టసమయ్య వచ్చినది. 58

నీ సోదరుడును, నీ పినతండ్రియు రాజ్యమునకై తగవులాడి నన్ను సహాయము కోరుచున్నారు. 59

నేనెవరికి సహాయమొనరింపవలెనో నీవు దీర్ఘముగా తగునట్లాలోచించి నా సందేహమును బాపి నన్ను నియోగింపుమ"ని యడిగెను. 60

పద్మావతి —

ధర్మాధవౌ మనుష్యాణాం । సర్వదా సంస్థితౌ హరే ।
ధర్మ మేవ ప్రశంసన్తి । సర్వదా బ్రహ్మావాదినః ॥ 61

ధర్మ ఏవ త్వయా కార్యో । ధర్మాధారో భవా నిహ ।
బాలకః పితృహీన శ్చ । మాతృహీనో ఽధనః కృశః ॥ 62

తస్యా పి రక్షణం పుణ్యం । పురాణపురుషోత్తమ ! ।
స రాజా బహువిత్తాఢ్యో । రాజ్యకాఙ్క్షీ పితు ర్మమ ॥ 63

స ఏవ సర్వధర్మజ్ఞః । తొణ్డమాన్ నృపసత్తమః ।
సర్వధర్మస్య వై తత్త్వం । ఆలోచయితు మర్హతి ॥ 64

పద్మావతీవచః శ్రుత్వా । స్యాలకస్యై వ సాహ్యకృత్
తొణ్డమా న్నృపతే ర్దివ్యే । శఙ్ఖచక్రే దదౌ హరిః ॥ 65

ఉచ్చైః శ్రవ స్సమ శ్చా శ్వం । సమారుహ్య ఖగధ్వజః ।
జగామయుద్ధకుశలః । స్యాలకేనా థ సఙ్గతః ॥ 66

## శ్రీనివాసతొణ్డమాన్‌వసుదానయుద్ధప్రకారః

చైత్రశుక్లత్రయోదశ్యాం । యుద్ధం పరమదారుణమ్ ।
కురూణాం పాణ్డవానాఞ్చ । యథా యుద్ధం తథా ఽభవత్ ॥ 67

రణ స్తస్మి న్మహాఘోరే । హతే పశుగణే తతః ।
శూరాణాం రణధీరాణాం । సమ్మర్దస్తు బభౌ తదా ॥ 68

సింహనాదః శంఖనాదః । తథా దుందుభినిఃస్వనః ।
శస్త్రాణా మస్త్రముఖ్యానాం । గజానా ఞ్చ మహాస్వనః ॥ 69

హయానాం వృషభాణా ఞ్చ । రథానా ఞ్చ పరస్పరమ్ ।
పద్మగృధ్రవ్యూహకారీ । తయో ర్మధ్యే జగత్పతిః ॥ 70

రరాజ భగవాన్‌సాక్షాత్ । రణమణ్డల మధ్యగాత్ ।
విష్వక్సేన స్తొణ్డమానం దశభి స్సాయకైః నృప ॥ 71

శ్రీమన్నారాయణా! ధర్మాధర్మములు రెండు నెల్లవేళలయందును మనుష్యుల ననుసరించియే యుండును. ప్రాజ్ఞులందరును ధర్మమునే స్తుతింతురు. 61

నీవు ధర్మమార్గమున కవలంబమైనవాడవు, బాలుడును, తల్లిదండ్రులు లేని వాడును, దుర్బలుడునగు 62

వసుదానుని రక్షించుటయే నీ ధర్మము. రాజగు తొండమానుడు చాల ధనవంతుడైనను నా తండ్రి రాజ్యమును కోరుచున్నాడు. 63

ఆతడే సర్వధర్మముల నెఱింగినవాడు. ఆతడే సకలధర్మముల సారము నాలోచింప సమర్థుడని 64

పద్మావతి తెలుపగా శ్రీనివాసుడు వసుదానునికే సహాయము నొనరింపగోరి తొండమానునకు శంఖచక్రముల నొసంగి 65

ఉచ్చైశ్శ్రవసమును దేవేంద్రుని గుఱ్ఱమువంటి గరుత్మంతునెక్కి భావమరదిని తోడ్కొని యుద్ధమున నేర్పరియై వెడలెను. 66

## శ్రీనివాస తొండమాను వసుదానుల యుద్ధమును వర్ణించుట.

కురుపాండవుల యుద్ధమువలె తొండమాన్ వసుదానుల యుద్ధము చైత్ర శుక్ల త్రయోదశి దినమున మహా భయంకరముగా జరిగెను. 67

అతిభయంకరమగు నా సమరమున గుఱ్ఱములు యేనుగులు మొదలగు పశుజాతి వశింపగా యుద్ధమున ధైర్యసాహసములుగల వీరుల యుద్రేకము హెచ్చెను. 68

సింహనాదము, శంఖధ్వనియు, దుందుభిఘోషలును, ధనుష్టంకారములును, యేనుగుల ఘీంకారములును 69

గుఱ్ఱముల హేషలును, వృషభరాజముల (ఎద్దుల) అంకెలును, రథచక్రచంక్రమణములును మిన్ను ముట్టెను. సేనను పద్మవ్యూహముగను, గరుడ వ్యూహముగను వన్ని ఆ వ్యూహముల మధ్యమున 70

తాను విరాజిల్లుచు శ్రీనివాసుడు యుద్ధరంగమునకు విచ్చేసెను. విష్వక్సేనుడు (వసుదానుడు) తొండమానుని పది బాణములతో నొప్పించెను. 71

తాడయామాస రాజేన్ద్రం । అర్ధచన్ద్రై రజిహ్మగైః ।
శ్రీనివాస స్తాడ్యమానం । రాజపుత్రో ఽతిబాలకః ॥ 72

శరాణాం పఞ్చసాహస్రాా । శ్రీనివాస ఇ్వ వక్షసి ।
తాడయామాస వేగేన । సర్వాన్ విస్మాపయన్ జనాన్ ॥ 73

తొణ్డమానో ఽపి రాజర్షిః । విష్వక్సేన ఇ్వ మాధవమ్ ।
వాసుదేవో రాజపుత్రం । బాణై ర్దశభి రేవ చ ॥ 74

జఘాన తరసా బాలం । తదద్భుత మివా భవత్ ।
చతుర్భి శ్చతురో వాహాన్ । బాణేనై కేన సారధిమ్ ॥
ఛత్రమేకేన రాజేన్ద్రః । రథం పఞ్చభి స్తథా ॥ 75

రథా దవప్లుత్య మహానుభావః । స రాజపుత్ర స్త్రిదశ ఇ్వ చక్రమ్ ।
చిక్షేప కృష్ణే చ యోత్తమే చ । వక్షఃస్థలే వాసవవజ్రకల్పమ్ ॥ 76

## రణరఙ్గేమూర్ఛితం శ్రీనివాసం దృష్ట్వా పద్మావత్యనుశోచనమ్

తేనా తివిద్ధో నిపపాత భూమౌ । చక్రేణ చక్రాఙ్కిత బాహుదణ్డః ।
శేషాచలేశో రణరఙ్గగామీ । మనుష్యభావేన విడమ్బయ ఞ్జనాన్ ॥ 77

మూర్ఛా ముపాగమ్య హయోత్తమా ద్ధరిః । యథా మనుష్యో రణరఙ్గమధ్యతః ।
తథా హ్యసౌ దేవగణస్య మధ్యే । సవిస్మయోత్ఫుల్లవిలోచనస్య ॥ 78

తదా ప్రాకార మారూఢా । రాజపుత్రీ హరిప్రియా ।
అగస్త్య మబ్రవీ ద్రాజన్ । । చక్రపాణే ర్నిపాతనమ్ ॥ 79

పద్మావతీ —

అగస్త్య పశ్య గోవిన్ద । పతితం రణమణ్డలే ।
అవస్థా కి మియం ప్రాప్తా । రణే కృష్ణేన దృశ్యతామ్ ॥ 80

మూర్ఛాం గతో వా కి మయం । మనో వి భ్రమతీవ మే ।
కి మత్ర కార్యం యోగీన్ద్ర । తన్మమా చక్ష్వ కుమ్భజ ॥ 81

శ్రీనివాసుడు సర్పములవంటి యర్ధచంద్రాకృతిగనుండు నూటిగానేగు బాణములతో తొండమానుని నొప్పించెను. 72

తొండమానుని పుత్రు డయిదువేల బాణములతో చూచువా రాశ్చర్యపడునటుల శ్రీనివాసుని వక్షస్థలమున వేసెను. 73

తొండమానుడును విష్వక్సేనుని శ్రీనివాసుని బాణములచే నొప్పించెను. శ్రీనివాసు డంతట పదిబాణములతో రాజపుత్రు 74

నత్యాశ్చర్యము కలుగునట్లు కొట్టెను. నాల్గుబాణములతో నాల్గు గుఱ్ఱములను, ఒక బాణముతో సారధిని, ఒక బాణముతో గొడుగును నైదుబాణములతో రథమును కొట్టెను. 75

అంతట నా తొండమానుడు రథమునుండి దిగి గుఱ్ఱముమీదను, శ్రీనివాసుని వక్షస్థలముననను, దేవేంద్రుని వజ్రమువలె దృఢమైన మూడంచులుగల చక్రమును విసరెను. 76

## యుద్ధరంగమున మూర్ఛను జెందియున్న శ్రీనివాసుని గాంచి పద్మావతి దుఃఖించుట

రంగస్థలమునమున్న శ్రీనివాసుడా చక్రము భుజమూలమున తగిలినంతనే సామాన్య మనుష్యునివలెనే చూచువారికి భ్రమను గొల్పుచు, 77

యుద్ధరంగ మధ్యమునందిన మనుష్య డాయుధముచే నొప్పింపబడి మూర్ఛ నొందునట్లే తానును మూర్ఛనొంది గుఱ్ఱమునుండి భూమిపై నొరగిపోయెను. దేవత లందరు నాశ్చర్యముచే చూడసాగిరి. 78

శ్రీనివాసుని ప్రియురాలగు పద్మావతి ప్రాకారముపైనుండి శ్రీనివాసుడు నేలపై నొరుగుటను గాంచి యగస్త్యునితో 79

పద్మావతి —

"అగస్త్యా ! యుద్ధరంగమున పడియున్న శ్రీనివాసుని గాంచుము. అందరు చూచుచుండగా శ్రీనివాసున కిట్టి యవస్థ కలిగినదికదా ! 80

శ్రీనివాసుడు మూర్ఛ నందెనా ? లేక నాకు భ్రమ కలుగుచున్నదా ? ఈ సమయమున నేనేమి చేయవలెనో దానిన నా కెఱింగింపుమ'ని యడుగగా 81

పద్మావతీవచః శ్రుత్వా । పద్మనాభ ఇవ సంస్మరన్ ।
ఉవాచ వచనం శ్లాఘ్యం । రాజన్ కాలోచితం మునిః ॥ 82

అగస్త్యః —

దేశకాలా వతిక్రమ్య । యః కర్మ కురుతే నరః ।
న స గచ్ఛే త్కర్మఫలం । న సుఖం విన్దతే నరః ॥ 83

సర్వే స్వకార్యే నిపుణాః । పరకార్యే న కశ్చన ।
నాలోకయతి కో వా ఽపి । త్వత్పితిం పతితం రణే ॥ 84

క్షత్త్రియాణాం శరీరాణి । రణరఙ్గగతాని చ ।
వికసత్పఙ్గరోత్సాహ । కౌతుకా న్యుత్తరోత్తరమ్ ॥ 85

జీవన్తి కుసుమాయన్తే । సజీవాని సతాం ప్రియే ।
నిర్జీవాని తు తాన్యేవ । వీక్షతే నైవ కశ్చన ॥ 86

అజీవ మేవ శూరేభ్యః । కార్యం గృహ్యేత రాజభిః ।
తస్మా త్త్వద్వల్లభదశాం । న కో ఽప్యత్రా నుశోచతి ॥ 87

తస్మా త్త్వ మస్య భద్రేచ్ఛుః । నివర్తయ పతిం రణాత్ ।
స్త్రీణా న్తు పరమో ధర్మః । పతిభక్తిః పతిప్రియే ॥ 88

భద్రం తే భ్రాతు రేవ స్యాత్ । కనిష్ఠపితు రేవ వా ।
ఏవం మత్వా మహాభాగే । కురు త్వం త్వత్పతే ర్హితమ్ ॥ 89

తనయో మమ కల్యాణి । సన్ధియత్నః ప్రశస్యతే ।
తౌ పుభౌ రాజ్యకర్తారౌ । పితాపుత్రౌ న సంశయః ॥ 90

ఇత్యుక్తా మునినా తేన । రాజపుత్రీ సముత్థితా ।
ప్రాకారా న్మునినా సార్థం । సఙ్గ్రామధరణీం యయౌ ॥ 91

అన్దోళికాం మహారాజ । హేమదణ్డవిభూషితామ్ ।
ఆరుహ్య రాజతనయా । శ్రీనివాసపరాయణా ॥ 92

నగస్త్యుడు పద్మావతి మాటలను విని శ్రీనివాసుని తలంచి యా సమయమునకు తగినట్లు. 82

అగస్త్యుడు —

దేశమును, కాలమును లక్ష్యపెట్టక పనిచేయు మనుజునకా పని ఫలితము నీయ జాలదు. సుఖమును లభింపదు. 83

ప్రతి మనుజుడును తన పనులను నిర్వహింప జాలియున్నాడు ఇతరుల పను లలో నెవరును నేర్పరులు కాజాలరు. రణరంగమున పడియున్న నీ భర్త నెవరును చూడరు. 84

యుద్ధరంగమున ప్రవేశించిన క్షత్రియుల శరీరము లితోధికముగ యుద్ధోత్సాహ మును కలిగించునదై యుండును. 85

ప్రాణముతోనున్న క్షత్రియుల శరీరములు వికసించిన పుష్పములవలె నాకర్షక ములై యుండును. సజీవములైనచో ప్రియకరములైనవే ప్రాణము పోయినంతనే నా శరీరములే యే మనుజులును కనులతో గాంచజాలనట్లుండును. 86

రాజులు పరాక్రమశాలురు. జీవించి యుండగనే తమ పనులను సాధింప జేసికొనవలెను. కావున నీ పతి పొందిన దశ నెవరును విచారింపకున్నారు. 87

కావున నీవు నీ భర్తకు మేలు కోరుచున్నదానవై యాతనిని యుద్ధరంగము నుండి మళ్ళించుము. స్త్రీలకు భర్తయం దత్యంతభక్తికలిగి యుండుటయే ప్రధానధర్మము.

నీ సోదరునకు మేలైన నగుగాక, నీ పినతండ్రికి మేలైన నగుగాకయని తలంచి నీవు నీ భర్తకు మేలు నొనగూర్చుకొనుము. 88

కల్యాణీ ! నా మనస్సునకు సంధి ప్రయత్నమే మంచిదిగా తోచుచున్నది. ఆ తండ్రీ కొడుకు లిరువురును రాజ్యపాలనమున కర్హులే. ఇందు సంశయము లేదు. 90

అని తెలిపినంతనే పద్మావతిలేచి తన మందిరమునుండి యగస్త్యమునితోగూడ యుద్ధభూమికి 91

బంగారు దండులతో నలంకరింపబడిన పల్లకిలో నెక్కి వెళ్ళి శ్రీనివాసునియందే నక్తచిత్తయై 92

గరుడధ్వజ మాలోక్య । పతితం పృధివీతలే ।
రణాగ్రే స్వపతిం కృష్ణం । శ్రీనివాసం సురేశ్వరమ్ ॥ 93

సఖడ్గం వర్మసహితం । సముత్థాప్య రణాఙ్గణే ।
స శీతలోదకామోదైః । వ్యజనైః సాధ్వమార్జయత్ ॥ 94

## కుపితం శ్రీనివాసం ప్రత్యగస్త్యకృతపద్మావత్యాశయజ్ఞాపనమ్

పద్మావత్య బ్రవీచ్చాపి । శోచన్తీ తం పతివ్రతా ।

పద్మావతీ —

ఉత్తిష్ఠ రణభూమ్యా స్త్వం । త్యక్త్వా మూర్ఛాం ఖగధ్వజ ॥ 95

ఇతి విజ్ఞాపితో దేవ్యా । పద్మావత్యా తదా నృప!
ముహూర్తమాత్రం గోవిన్దో । నరలోకం విడమ్బయన్ ॥ 96

మూర్ఛాం గత ఇవ స్థిత్వా । ప్రబుద్ధ ఇవ చోత్థితః ।
ఉత్థాయ రణభూమ్యాం సః । పశ్యన్ దశదిశో హరిః ॥ 97

దదర్శ స్వప్రియాం రాజన్! । స్థితాం పద్మావతీం విభుః ।
భ్రుకుటీయుతనేత్ర స్తు । గర్హయన్ వాక్య మబ్రవీత్ ॥ 98

శ్రీనివాసః —

అస్మిన్ రణాజిరే ఘోరే । వనితానాం ప్రయోజనమ్ ।
కి మస్తి మునిశార్దూల! । ద్రుత మేషా ఽద్య గచ్ఛతు ॥ 99

ఇత్థ ముక్తో భగవతా । పద్మావత్యా సహాగతః ।
అగస్త్యః శ్రీనివాసం తం । ప్రత్యభాషత తాపసః ॥ 100

అగస్త్యః —

"సన్ధి రత్ర ప్రకర్తవ్యః । శ్రీనివాస సతాం గతే! ।
ఉత్తిష్ఠ స్యాలకం బాలం । సమానయ నృపోత్తమమ్ ॥ 101

తొణ్డమానం మహారాజం । తత్పుత్రం తం మహాబలమ్ ।
శ్రీనివాసాభిదాన ఇచ్ఛ । శవరోషాకరం హరే! ॥ 102

ఒకతోగూడిన ఖడ్గముతో రణస్థలమున భూమిపై పడుండియున్న దేవాది దేవుడగు తన భక్తుడైన శ్రీనివాసుని చూచి 93

ఆ యుద్ధ భూమియందే లేవదీసి చల్లని పరిమళించు నీటితోకూడిన పీవనలతో చక్కగా తుడిచి 94

## శ్రీనివాసుడు కోపింపగా అగస్త్యుడు పద్మావతియొక్క అభిప్రాయము నెఱింగించుట

విచారించుచు శ్రీనివాసునితో—స్వామీ ! మూర్ఛను వదలి యుద్ధభూమినుండి లెమ్ము. 95

అని ప్రార్థింపగా శ్రీనివాసుడు లోకుల నమస్కరించుచు నొక క్షణకాలము 96

మూర్ఛచెందిన వానివలెనుండి మరల మేల్కాంచిన వానివలె లేచి పది దిక్కులను కలయ గాంచుచు 97

పద్మావతినిగాంచి కనుబొమలు ముడివడగా కోపముతో 98

శ్రీనివాసుడు —

ఈ భయంకర యుద్ధరంగమున నాడువారల కేమిపని ? మునీంద్రా ! ఈమెను శీఘ్రముగా వెడలిపొమ్మని తెలపుడని 99

నంతనే పద్మావతితో వచ్చిన అగస్త్యమహర్షి శ్రీనివాసునితో — 100

అగస్త్యుడు —

"శ్రీనివాసా ! ప్రస్తుతము తొండమానునకు వసుదామునకును సంధి చేయించుటయే యావశ్యకము. నీవు లేచి నీ బావమరదిని, రాజును తోడ్కొనిరమ్ము. 101

నీ కావద వాటిల్లినదనియు, తన సోదరుడు చనిపోవునను భయమునను దుఃఖించుచు తొండమానుని, నీ కపరాధ మొనర్చి 102

సమాధానం కర్తుం కామా । సమ్ప్రాప్తైషా రణాఙ్గణే ।
శోచన్తీ తవ దుఃఖేన । భ్రాతుశ్చ మరణం ప్రతి " ॥ 103

అగస్త్యవచనం శ్రుత్వా । కిఞ్చిత్ క్రోధసమన్వితః ।
భర్త్సయన్ పద్మనయనాం । సఙ్గ్రామస్థల మాగతామ్ ॥ 104

అయుక్తం యోషితాం క్షేమన్ ! । సఙ్గ్రామాగమనం మునే ! ।
అథాహం తోణ్డమానస్య । శిరఃకాయా ద్ధరామ్యహమ్ ॥ 105

తత్సుతం తం మహాభాగం । శ్రీనివాసం మహాబలమ్ ।
హత్వా రాజ్యం ప్రదాస్యామి । విష్వక్సేనాయ ధీమతే ॥ 106

వాసుదేవవచః శ్రుత్వా । సాష్టాఙ్గం ప్రణిపత్య సా ।
కృతాఞ్జలిపుటా భూత్వా । దేవం వాక్య మభాషత ॥ 107

పద్మావతీప్రార్థనయా శ్రీనివాసకృతతోణ్డమానవసుదానసన్ధిక్రమః

శ్రీ పద్మావతీ —

స్వామిన్ ! నాథ రవిన్దాక్ష ! । శ్రీనివాస ! కృపానిధే ! ।
దయాం కురు దయాసిన్ధో ! । భక్తానా మభయం కురు ॥ 108

కి మనేన జగన్నాథ ! । లోకనాశనకారిణా ।
ఉభౌ రాజ్యస్య కర్తారౌ । భవతాం రాజసత్తమౌ ॥ 109

విభజ్య రాజ్యం సర్వ ఞ్చ । కోశం దేహి రమాపతే ! ।
స్వస్త్య స్తు సర్వలోకేభ్యః । పిత్రే చా పి కనీయసే ॥ 110

ప్రసాదా త్తవ గోవిన్ద ! । నివర్తస్వ రణాఙ్గణాత్ ।
ఇతి ప్రియావచః శ్రుత్వా । శ్రీనివాస ఉవాచ తామ్ ॥ 111

శ్రీనివాసః —

క్షత్రధర్మం న జానాసి । త్వం గచ్ఛా ద్య రణాఙ్గణాత్ ।
అథా హం తోణ్డమానస్య । వసుపుత్రస్య రణే శిరః ॥ 112

కోపమును తెప్పించిన యాతని పుత్రుడగు శ్రీనివాసుని సమాధాన పరచుటకే యామె యుద్ధభూమి కరుదెంచినదని 103

పలికినంతనే శ్రీనివాసుడు కొంచెము కోపించి యుద్ధభూమికి వచ్చిన పద్మావతిని బెదరించుచు 104

స్త్రీలు రణభూమి కేతెంచుట తగదు. నేను, తొండమానుని శిరమును తెగవ్రేసి 105

బలశాలియగు నాతని పుత్రుడగు శ్రీనివాసుని జంపి బుద్ధిమంతుడగు విష్వక్సేనునకు (వసుదామునకు) రాజ్యము నిచ్చెదనని 106

కఠినముగా పల్కుచుండ విని పద్మావతి యాతనికి సాష్టాంగముగ ప్రణమిల్లి చేతులు జోడించి 107

## పద్మావతి ప్రార్థింపగా శ్రీనివాసుడు తొండమాను వసుదానులకు సంధిని గూర్చుట

పద్మావతి —

స్వామీ! పుండరీకాక్ష! శ్రీనివాసా! కరుణానిధే! దయాసముద్రా! దయచేయుము. భక్తుల కభయము నొసంగుము. 108

శ్రీనివాసా! లోకములను వశింపజేయు నీ యుద్ధముచే నేమి ప్రయోజనమున్నది? తొండమాన వసుదాను లిరువురును రాజ్యమును పాలింపవచ్చును కదా! 109

రాజ్యమును ధనాగారమునంత నిరువురకును పంచియిమ్ము. లోకులు సుఖింతురు గాక! పినతండ్రికిని, సోదరునకును 110

నీ యనుగ్రహముచే శుభము చేకూరునుగాక! నీవు యుద్ధభూమినుండి మరలి రమ్మని ప్రార్థింపగా శ్రీనివాసుడు — 111

శ్రీనివాసుడు —

నీవు క్షత్రియ ధర్మముల నెఱుంగజాలవు. యుద్ధభూమినుండి మరలి పొమ్ము. నేను తొండమానుని యాతని పుత్రుని చంపి 112

పాతయిష్యే మహాసఙ్ఘే । పశ్యతాం సర్వదేహినామ్ ।
స్యాలకార్థం మ్రియే వా పి । నాత్ర కార్యా విచారణా ॥ 113

ఇత్యుక్త్వా సా కమ్పమానా । ముని మాహ కృపానిధిమ్ ।

పద్మావతీ —

వివర్తయ రణా త్త్వం వా । వేఙ్కటేశం మునీశ్వర ॥ 114

ఇతి విజ్ఞాపితో దేవ్యా । లోపాముద్రాపతి స్తదా ।
మునిః ప్రోవాచ రాజేన్ద్ర ! । శ్రీనివాసం రణప్రియమ్ ॥ 115

సాన్త్వయిత్వా శ్రీనివాసం । విష్వక్సేనం మహీపతిమ్ ।
విభక్తం కురు గోవిన్ద ! । రాజ్యం కోశం తయో రితి ॥ 116

అగస్త్యవచనం శ్రుత్వా । తొణ్డమానం నృపాత్మజమ్ ।
సమాహూయా ఽహ వచనం । సన్నికారో జనార్దనః ॥ 117

కిం తే మనోగతం రాజన్ । ఇత్యుక్తో వాక్య మబ్రవీత్ ।

తొణ్డమానః —

త్వ మేవ గతి రస్మాకం । త్వయ్యే వ రమతే మనః ॥ 118

తచ్ఛ్రుత్వా తం సమాహూయ । స్యాలకం వాక్య మబ్రవీత్ ।

శ్రీ భగవాన్ —

భగినీ తవ కల్యాణీ । సన్ధిం స్యాలక ! వాఞ్ఛతి ॥ 119

హృద్గతం తవ య ద్బ్రూహి । సత్యం త త్పృథివీపతే ! ।
వాసుదేవవచః శ్రుత్వా । విష్వక్సేనో ఽభ్యభాషత ॥ 120

రాజపుత్రః —

భావనే తవ గోవిన్ద ! । స్థితో ఽహం సర్వదా హరే ! ।
యథై వే చ్ఛా తవ హరే ! । తథై వ కురు కేశవ ॥ 121

ఇతి విజ్ఞాపిత స్తాభ్యాం । ఉభాభ్యాం వేఙ్కటేశ్వరః ।
సన్ధిం చకార రాజేన్ద్ర ! । శ్రీనివాస స్తయో స్తదా ॥ 122

యందరు చూచుచుండగా పడవేయుదును. నేను నా బావమరది కొఱకు చని పోయినను విచారింపవలసిన పనిలేద'ని పలుకగా 113

పద్మావతి వడంకుచు నగస్త్యునితో మునీంద్రా! మీరైనను శ్రీనివాసుని యుద్ధమునుండి విరమింప జేయుడ'ని వేడ్కొనెను. 114

ఇట్లామెచే ప్రార్థింపబడి అగస్త్యముని యంత యుద్ధమునే కోరుచున్న శ్రీనివాసుని 115

శాంతవచనములతో శాంతపరచి గోవిందా విష్వక్సేనుని, రాజును రావించి రాజ్యమును, ధనాగారమును సమానముగా వారికి పంచియిమ్మ'ని తెలుపగా 116

శ్రీనివాసుడందుల కంగీకరించి పినతండ్రికిని, కుమారునకును సంధిచేయగోరి తొండమానుని పిలిచి 117

రాజా! నీ యభిప్రాయమేమ'ని యడిగెను. తొండమానుడు - జగన్నాథా! నీవే మాకు శరణ్యుడవు. నా మనసు నీ యందే లగ్నమై యున్నద'ని పలికెను. 118

అంత శ్రీనివాసుడు బావమరది పిలువనంపి — బావా! మీ చెల్లెలు మీ కిరువురకును సంధినే కోరుచున్నది. 119

నీ యభిప్రాయమును నిక్కముగా నెఱింగింపుమ'ని యడుగగా నాతడు 120

రాజపుత్రుడు —

గోవిందా! నే నెప్పుడును నీ యాజ్ఞ ననువర్తించువాడనే. నీ యిష్టానుసార మొనర్పు మనెను. 121

ఇట్లిరువురును విన్నవించిన పిమ్మట శ్రీనివాసుడు వారి కిరువురకును సంధి నొనర్చెను. 122

తదా రాజ్యం విభజ్యా థ । హ స్త్యశ్వరథసంయుతమ్ ।
ధనం కోశం తథా గ్రామాన్ । దుర్గాణి నగరాణి చ ॥ 123

వివిచ్య సర్వరాజ్య ఞ్చ । వస్త్ర మా స్తీర్య దేవరాట్ ।
యయాచే షోడశం భాగం । రాజానం రాజనన్దనమ్ ॥ 124

భవద్భి స్తు రణం కృత్వా । వృథా మరణ మిచ్ఛతః ।
దాతవ్యో రాజ్యభాగ స్తు । మమ వా దుహితు స్తువా ॥ 125

ఇత్యే వం శ్రీనివాసేన । పృష్టౌ రాజనృపాత్మజౌ ।
దదతు స్తౌ మహారాజ । గ్రామాన్ ద్వాత్రింశతం హరేః ॥ 126

తొణ్డమానం ప్రతిష్ఠాప్య । తొణ్డరాజ్యే తథా హరిః ।
విష్వక్సేనం ప్రతిష్ఠాప్య । నారాయణపురే నృప ॥ 127

తద్గృహే భోజనం కృత్వా । స్యాలకస్య గృహే తథా ।
భుక్త్వా స్వయం భోజయిత్వా । పద్మావత్యనుగో యయౌ ॥ 128

అగ స్త్య నిలయం రాజన్ ! । శ్రీనివాసః సతాం గతిః ।
ముముదే రమయా సార్ధం । భగవాన్ శుభదర్శనః ॥ 129

య ఇదం పుణ్య మాఖ్యానం । శృణుయాత్ శ్రావయే చ్చ యః ।
శ్రీనివాసప్రసాదాత్ సః । సర్వమఙ్గళవాన్ భవేత్ ॥ 130

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే తొణ్డమానవసుదానయుద్ధ
సంధిప్రశంసనం నామ ద్వాదశోఽధ్యాయః

ఏనుగులు, గుఱ్ఱములు, రథములతోకూడిన రాజ్యమునంతను విభాగముగా చేసి ధనాగారమును, గ్రామములను, దుర్గములను నగరములను 123

రాజ్యమునంతను వారిరువురకును పంచి యిచ్చి రాజతోను, వసుదానుని తోను, 124

మీతో యుద్ధము నొనర్చి మరణింప సంసిద్ధముగానున్న నాకు రాజ్యభాగము నీయవలెన'ని వారి భాగములలో పదునారవవంతు నీయవలెన'ని తన పై వస్త్రమును పరచి వేడుకొనగా 125

వారందుల కంగీకరించి శ్రీనివాసునకు ముప్పదిరెండు గ్రామముల నిచ్చిరి. 126

తొండమానుని తొండరాజ్యమునను, విష్వక్సేనుని నారాయణపురమునను అభి షేకించి 127

రాజగృహమునను తన బావమరది గృహమునను భుజించి తాను వారిని తన యింట భుజింపజేసి పద్మావతితోగూడ 128

అగస్త్యాశ్రమమునకేగి పద్మావతితో సంతసమున విశ్రమించెను. 129

ఈ పుణ్య చరితమును వినువారును, వినుపించువారును శ్రీనివాసుని యను గ్రహమున సకల శుభముల నందుదురు. 130

ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున తొండమాన వసుదాన యుద్ధము, మరల సంధి నొనర్చుకొనుట యనెడు పంద్రెండవ అధ్యాయము సంపూర్ణము.

---

# అథ త్రయోదశో ఽధ్యాయః

## తొణ్డమానకృత దివ్యస్వరూపజ్ఞాపన పూర్వక శ్రీనివాస స్తుతిః

జనకః —

తతః కి మకరో త్కృష్ణః । శతానన్ద ! నృప శ్చ వా ।
త న్మమా చక్ష్వ యోగీన్ద్ర ! । రాజ్ఞ స్తచ్చరితం మహత్ ॥ 1

శతానన్దః —

కదాచి ద్వేఙ్కటేశస్య । దర్శనార్థం నరాధిపః ।
ఏక ఏవాధిగమ్యా థ । ననామ చరణౌ హరేః ॥ 2

తం దృష్ట్వా రాజశార్దూలం । ఆలిఙ్గ్య ఽహ వచో హరిః ।

శ్రీనివాసః —

కి మాగమనకార్యం తే । త న్మమా చక్ష్వ భూపతే ! ॥ 3

స దేవవచనం శ్రుత్వా । వాసుదేవ మభాషత ।
దర్శనా త్తవ గోవిన్ద ! । నా ధికం వ ర్తతే హరే ॥ 4

త్వాం వద న్తి సురాధ్యక్షం । వేదవేద్యం పురాతనమ్ ।
మునయో మనుజశ్రేష్ఠాః ! త చ్ఛ్రుత్వా ఽహ మిహాగతః ॥ 5

స్వామిన్ అచ్యుత గోవిన్ద । పురాణపురుషో త్తమ ! ।
అప్రాకృతశరీరో ఽసి । లీలామానుషవిగ్రహః ॥ 6

త్వా మేవ సృష్టికరణే ! పాలనే హరణే హరే ! ।
కారణం ప్రకృతే ర్యోనిం । వద న్తి చ మనీషిణః ॥ 7

జగ దేకార్ణవం కృత్వా । భవా నేకత్వ మాప్య చ ।
జీవకోటిఘనం దేవ ! । జఠరే పరిపూరయన్ ॥ 8

క్రీడతే రమయాసార్ధం । రమణీయాఙ్గ విగ్రహః ।
సహస్రశీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్ ॥ 9

# పదమూడవ అధ్యాయము

## తొండమానుడు శ్రీనివాసుని దివ్యస్వరూపమును తెలుపుచు నాతనిని స్తుతించుట

జనకుడు —

అనంతరము శ్రీనివాసు డేమొనరించెనో తొండమాను డేమాయెనో యా చరితమును నాకు తెలుపుమని జనకమహారాజు శతానందు నడుగగా శతానందు డిట్లు చెప్ప నారంభించెను. 1

శతానందుడు —

ఒకానొకప్పుడు శ్రీ వేంకటేశుని సేవించుటకై తొండమాను ఒంటిగనే వచ్చి శ్రీనివాసుని పాదారవిందములకు నమస్కరించెను. 2

ఆ రాజేంద్రుని గాంచి శ్రీనివాసు డాతని నాలింగనము చేసికొని "నీ వెందులకు వచ్చితివ" ని యడిగెను. 3

ఆ మాటను విని తొండమాను డాతనితో "శ్రీనివాసా! నీ దర్శనభాగ్యము కంటె నాకేదియు మిన్నయగునదిలేదు. 4

మునీంద్రులును, నరోత్తములును, నిన్ను దేవాధిపతివనియు, వేదములచే నెఱుంగదగినవాడవనియు, అనాదిపురుషుడవనియు స్తుతించుచుండుటను విని నీసన్నిధికేతెంచితిని. 5

స్వామీ! అచ్యుతా! గోవిందా! పురాణపురుషా! నీవు దివ్యమంగళవిగ్రహధారివి! విలాసగా మనుజశరీరము ధరించిన స్వామీ! 6

నిన్నే సృష్టించుటకును, రక్షించుటకును, నశింపజేయుటకును కారణభూతుడ వనియు, మూలప్రకృతికిని మూలకారణుడవని ప్రాజ్ఞులు వచింతురు. 7

నీవు ప్రపంచమునంతను ఒకే సముద్రముగా నావరించి నీవు నొంటరిగనే యుండి ప్రాణికోటిని నీ గర్భమున నుంచుకొని 8

సుందరాంగుడవై శ్రీదేవితో విహరింతువు. వేయి తలలుగల పురుషుడవు. వానికి తగిన కనులను, పాదములను కలవాడవు. 9

ముఖా త్సృష్టా ద్విప్రవిచయో । బాహుభ్యాం క్షత్రమణ్డలమ్ ।
ఊరుభ్యా మభవన్ వైశ్యాః । పద్భ్యాం శూద్రాః ప్రకీర్తితాః ॥ 10

ప్రభు స్త్వం సర్వలోకానాం । దేవానా మపి యోగినామ్ ।
అన్తః సృష్టికర స్త్వం హి । బహిః సృష్టికరో భవాన్ ॥ 11

నమః శ్రీవేఙ్కటేశాయ । నమో బ్రహ్మోదరాయ చ ।
నమో నాథాయ కాన్తాయ । రమాయాః పుణ్యమూ ర్తయే ॥ 12

నమః శాన్తాయ కృష్ణాయ । నమ స్తే ఒద్భుతకర్మణే ।
అప్రాకృతశరీరాయ । శ్రీనివాసాయ తే నమః ॥ 13

అనన్తమూ ర్తయే నిత్యం । అనన్తశిరసే నమః ।
అనన్తబాహవే శ్రీమన్ ! । అనన్తాయ నమో నమః ॥ 14

సరీసృపగిరీశాయ । పరబ్రహ్మన్ ! నమో నమః ।
ఇతి స్తుత్వా శ్రీనివాసం । కమనీయకలేబరమ్ ॥ 15

విరరామ మహారాజ ! । రాజేన్ద్రో రణకోవిదః ।
స్తోత్రేణా నేన సుప్రీతః । తొణ్డమానకృతేన చ ॥ 16

సన్తుష్టః ప్రాహ గోవిన్దః । శ్రీమ న్తం రాజస త్తమమ్ ।

శ్రీనివాసః —

రాజన్ అల మలం స్తోత్రం । కృతం పరమపావనమ్ ॥ 17

అనేన స్తవరాజేన । మా మర్చ న్తి చ యే జనాః ।
తేషాం తు మమ సాలోక్యం । భవిష్యతి న సంశయః ॥ 18

ఆకాశరాజో ధర్మాత్మా । ప్రాప ముక్తిపదం నృప ।
తేన రాజ్ఞా ప్రసిద్ధో ఒహం । భూలోకే భూమిపాలక ! ॥ 19

కృత్వా వివాహవిభవం । దృష్ట్వా మా మాగతం గృహమ్ ।
సన్తోష మతులం లేభే । రాజా పరమధార్మికః ॥ 20

నీ ముఖమునుండి బ్రాహ్మణులును, బాహువులనుండి క్షత్రియులును, తొడల నుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును పుట్టిరని స్తుతించబడుచున్నారు. 10

నీవు సకలలోకములకును ప్రభువవు. దేవతలకును, యోగులకు నధిపతివి. కనులకు గోచరించనివియు, గోచరించునవియగు వానికి సృష్టికర్తవు నీవే. 11

శ్రీ వేంకటాచలపతివగు నీకు నమస్కారము. బ్రహ్మ నాభికమలమున కల నీకు నమస్కారము. లక్ష్మికి మనోహరుడైన భర్తవగు నీకు నమస్కారము. 12

శాంతమూర్తియగు కృష్ణునకు నమస్కారము. ఆశ్చర్యచేష్టితునకు నమస్కారము. దివ్యమంగళవిగ్రహునకు నమస్కారము. 13

అనంతరూపములు గలిగి, పెక్కు శిరములు కలిగి, పెక్కు బాహువులు కలిగిన ఆనందుడవగు నీకు నమస్కారము. 14

శ్రీ శేషాచల నివాసుడగు పరబ్రహ్మ స్వరూపుడవగు నీకు నమస్కారము. ఇట్లు దివ్యమంగళ విగ్రహుడగు శ్రీనివాసుని స్తుతించి 15

రాజు మిన్నకుండిన పిమ్మట శ్రీనివాసుడా స్తోత్రమును విని చాల సంతసించి 16

తొండమానునితో — రాజా : నీ పవిత్రమగు స్తోత్రమిక చాలును. 17

ఈ స్తోత్రరాజముచే నన్ను స్తుతించు జనులకు నా సాయుజ్యము సిద్ధించు నమటలో సందియములేదు. 18

ధర్మాత్ముడగు నాకాశరాజు మోక్షమునందెను. ఆతనివలననే నేను భూలోకమున ప్రసిద్ధికెక్కితిని. 19

ఆ ఆకాశరాజు వైభవముగా వివాహము నొనరించి యింటికివచ్చిన నన్ను గాంచి మిక్కిలి సంతసించెను. 20

చైవ మేవ పరం మన్యే । మమ భాగ్యఫలోదయమ్ ।
కృతం కర్మ సుఖం దుఃఖం । అనుభో క్తవ్య మఞ్జసా ॥ 21

కా గతిః పురతో రాజన్ । వినా రాజ్ఞా మహాత్మనా ।
శ్రీధరస్య వచః శ్రుత్వా । తోణ్డమా నాహ మాధవమ్ ॥ 22

తోణ్డమాన్ —

ప్రారబ్ధకర్మణః పుంసః । కథం సౌఖ్యం భవే ద్ధరే !
కిమర్థం రోదిషి భృశం । హతం బన్ధుం స్మరన్ హరే ! ॥ 23

మా శోకం కురు గోవిన్ద ! । రాజానం స్వర్గగం ప్రతి ।
పశ్య మాం పుణ్డరీకాక్ష ! । విశ్వక్సేన మ్వి బాలకమ్ ॥ 24

సాన్త్వితః స్తేన రాజ్ఞే త్థం । శ్రీనివాస స్స్వతాం గతిః ।
ప్రాహ వాణీం జగన్నాథః । తోణ్డమానం ప్రజాపతిమ్ ॥ 25

## తోణ్డమానం ప్రతి దివ్యాలయకరణాయ శ్రీనివాసచోదనా

శ్రీనివాసః —

కుటుమ్బం స్థాపితం తేన । రాజ్ఞా భ్రాత్రా గరీయసా ।
నా స్తి మే భవనం తాత ! । వాసార్థం దుహితు స్తవ ॥ 26

వియన్నృపస్య జామాతా । వర్తతే పరమన్దిరే ।
ఏషా ఒకీర్తి ర్మమా నన్త ! దుఃఖదా దుఃఖనాశన ! ॥ 27

పారతన్త్ర్యం మహత్కష్టం । మనుష్యాణా న్తు కా కథా ।
తస్మా న్మే భవనం కార్యం । త్వయా రాజకులోద్భవ ! ॥ 28

త్వాం వినా రాజశార్దూల । కీర్తిం స్థాపయితుం స్థిరామ్ ।
కః సమర్థో ధరాపృష్ఠే । నాకే నాగాలయే ఒపి వా ॥ 29

వదత్యేవం వాసుదేవే । "తథా ఒ స్త్వి త్యవద న్నృపః ।
సుముహూర్తే సులగ్నే చ । సునక్షత్రే సుభే తిథౌ ॥ 30

నా యదృష్టము ఫలించుటకు దైవమే గొప్ప సహాయమని తలంతును ఎవరి కైనను తామొనర్చిన పుణ్య పాపకర్మల ఫలితమగు సుఖదుఃఖము లనుభవించియే తీరవలెను. 21

ఆ మహాత్ముడగు నాకాశరాజు లేని నా ముందుగతియేమి ? యని పలుకగా తొండమానుడు శ్రీనివాసునితో — 22

ప్రారబ్ధము ననుభవించుచున్న పురుషునకు సుఖమెట్లు చేకూరును ? చనిపోయిన ఆకాశరాజును తలంచుకొనుచు దుఃఖించెదవేల ? 23

స్వర్గమునందిన రాజును గూర్చి దుఃఖింపకుము. నన్నును, బాలుడగు విష్వక్సేనుని (వసుదానుని) గాంచుము 'ని 24

యిట్లారాజు యూరడించిన పిమ్మట సజ్జనులకు ప్రాప్యుడైన శ్రీనివాసు డాతనితో 25

## శ్రీనివాసుడు తొండమానుని తనకు చక్కని మందిరమును కట్టించమని ప్రేరేపించుట

శ్రీనివాసుడు —

రాజా ! నీ సోదరుడును, మహాత్ముడునగు ఆకాశరాజుచే మా కుటుంబ మేర్పరుపబడినది. కాని నీ కుమార్తెకును, నాకును నివసించుటకు భవనములేదు. 26

దుఃఖనివర్తక తొండమానరాజా ! ఆకాశరాజు నల్లుడు నివసించు భవనములేక యితరుల గృహములలో నివసించుచున్నాడను నపకీర్తి నాకు దుఃఖమును కలిగించుచున్నది.

ఎట్టివారికిని పరాధీనత భరింపరానిదనగా మనుష్యులు భరింపలేరని మరల చెప్పవలెనా ? కావున నో రాజా ! నాకొక భవనమును నిర్మించియిమ్ము. 28

రాజేంద్రా ! నీవుకాక నాకు స్థిరమగు కీర్తిని నిలుపుటకు భూలోకమునగాని స్వర్గలోకమునగాని సమర్థులు లేర 'ని 29

సంభాషించుచుండగా తొండమానుడట్లే యొనర్చెదననెను. అనంతరము మంచి ముహూర్తము, మంచి లగ్నము, మంచి నక్షత్రము, శుభతిథియందు 30

భోగిరాజగిరిం రాజన్ ! । ఆరురోహ ఖగధ్వజః ।
సహితః కమలాదేవ్యా । రాజయుక్తః స దేవరాట్ ॥ 31

వివేశం దర్శయామాస । వరాహానుతేన చ ।
స్వామిపుష్కరిణీ తీరే । దక్షిణే పక్షివాహనః ॥ 32

అత్రైవ కార్యం రాజేన్ద్ర । చైత్యం పూర్వముఖం శుభమ్ ।
గోపురద్వయసంయుక్తం । ప్రాకారత్రయ మవ్యయమ్ ॥ 33

సప్తద్వారవరోపేతం । దేహలీతోరణాన్వితమ్ ।
ధ్వజస్తమ్భవరోపేత । సర్వలక్షణసంయుతమ్ ॥ 34

ఆస్థానమణ్డపం దివ్యం । అద్భుతం యాగమణ్డపమ్ ।
గోశాలాం ధాన్యభవనం । తతో మాలాకరం గృహమ్ ॥ 35

వస్త్రగేహం తైలశాలాం । ఘృతార్థభవనం పృథక్ ।
భక్ష్యశాలాం విశాలాక్ష్య । భూషణానాంగృహంతథా ॥ 36

కర్పూరగన్ధమార్జాల- । తైలకస్తూరికాగృహమ్ ।
కల్పయా ఒశు చ రాజేన్ద్ర । గజాశ్వభవనం పృథక్ ॥ 37

తామ్రపత్రైః సుసమ్బద్ధం । స్వర్ణాలఙ్కారమణ్డితమ్ ।
శ్రీతీర్థ మన్నశాలాగ్రే । భూతీర్థం భూమిపాలక ! ॥ 38

త్వయావివిర్మితంపూర్వం । తొణ్డమానమహీపతే ।
తదద్యకురుశోభాఢ్యం । శిలాబన్ధనపూర్వకమ్ ॥ 39

ఇత్యుక్తో వాసుదేవేన । రాజా వచన మబ్రవీత్ ।

## భగవత్కథిత తొణ్డమానన్నృపపూర్వోదన్తః

**తొణ్డమానః —**

కథం పూర్వం మయా కూపః । కృత స్తేకేన జన్మనా ॥ 40

దేవాదిదేవుడగు శ్రీనివాసుడు పద్మావతితోను, తొండమానునితోను శేషాచలము నధిరోహించెను. 31

శ్రీనివాసుడు వరాహస్వామి యనుమతినిబడసి స్వామిపుష్కరిణికి దక్షిణ తీరమున స్థలమును జూపి 32

రాజా! రెండు గోపురములు కలిగినదియు, మూడు ప్రాకారములు కలిగినదియు సువిస్తృతముగానుండునదియు 33

ఏడు ద్వారములు కలిగి, గడపలకు తోరణములు కలిగి, శ్రేష్ఠములగు ధ్వజ స్తంభములు కలిగి సర్వలక్షణములతో కూడినదియు 34

దివ్యమగు ఆస్థానమంటపమును, ఆశ్చర్యకరమగు యాగమంటపమును, గోశాల, ధాన్యాగారము పుష్పమాలికలను సమకూర్చు గృహమును. 35

వస్త్రములుదాచు గృహమును, నూనెలను జాగ్రత్తపరచు మందిరములను, నేతులను భద్రపరచు గృహమును, పెద్ద భోజనశాలయు, ఆభరణములను సంరక్షించు గృహమును, 36

పచ్చకర్పూరము, చందనము, పునుగు, కస్తూరి మొదలగు పరిమళద్రవ్యములను జాగ్రత్తపరచు గృహమును, ఏనుగుశాలయు, గుఱ్ఱపుశాలయు వేరువేరుగా 37

పాకశాల కెదురుగా రాగిరేకులతో నమర్పబడి బంగారు అలంకారములచే నలంకరింపబడిన పవిత్ర తీర్థముగల భూతీర్థమును (ఊటలేక జలగావచ్చు నీరుగల బావి) నిర్మింపజేయుము. 38

రాజా! అది వెనుక పూర్వజన్మలో నీ వావర్చినదే దానినే యిప్పుడంతకంటె సుందరముగా రాతితో కట్టించుము' ని 39

కోరగా రాజు శ్రీనివాసునితో —

## శ్రీనివాసుడు తొండమానుని పూర్వజన్మ వృత్తాంతమును తెలుపుట

శ్రీనివాసా! నేను పూర్వజన్మమున నెట్టివాడను? నేను నీ కొరకై బావి నేల త్రవ్వించితివి? 40

కో ఒహం పూర్వస్మిన్ కాలే జాతిః । త స్మమా వక్ష్వ వి_స్తరాత్ ।
రాష్ట్రే త్వ్యక్తో ఒప్యపి ద్రాజన్ ! । శ్రీనివాసః సతాం గతిః ॥ 41

శ్రీనివాసః —

పురా వైఖానసో నామ । ఋషి రత్య_న్తశుద్ధధీః ।
ధావి కృష్ణావతారస్య । కథాం శ్రుత్వా పురాతనీమ్ ॥ 42

కాలానాం చర్మణా శ్చైవ । శరీరాణాం చ సంస్థితిః ।
జనానా మితి నిశ్చిత్య । తప _స్తప్తుం ప్రచక్రమే ॥ 43

ద్రావిడే చోళదేశే తు । ప్రకృష్టే కుశవి_స్తృతే ।
కృష్ణరూపం ప్రపశ్యామి । నిరాహారో జితేన్ద్రియః ॥ 44

తపసా దుష్కరేణే ' తి । సుదృఢం కృతనిశ్చయః ।
తపసాతప్యమానస్య । తస్యవైభ క్తవత్సలః ॥ 45

ప్రాదుర్బభూవ భగవాన్ । పురా గోపాలవేషభాక్ ।
ప్రాదుర్భూతం హరిం దృష్ట్వా । తుష్టావ స ముని _స్తదా ॥ 46

శ్రీ వైఖానసః —

పూజాం కరోమి పురుషో_త్తమ ! పుణ్యమూ_ర్తే ।
గోపాలదేవ ! కరుణాకర ! దేవదేవ !
ఇత్థం సమీరిత ఉవాచ మునీశ్వరం తం ।
తస్యో చితం వచన మేష మహానుభావః ॥ 47

శ్రీ కృష్ణః —

త్వయా ధ్యేయః శ్రీనివాసో । నా హం ధ్యేయో మునీశ్వర ! ।
గచ్ఛ శేషగిరిం తత్ర । వల్మీకే వ_ర్తతే శుభా ॥ 48

ప్రతిమా శ్రీనివాసస్య । తత్పూజాం కురు స_న్తతమ్ ।
సఙ్గమిష్యతి తే మార్గే । శూద్రః శ్రీరఙ్గదాసకః ॥ 49

పూజకస్య భవే చ్ఛూద్రః । సేవక _స్తే మహామునే ! ।
ఏవ ముక్తో ఒథ హరిణా । సమ్ప్రాప్తో వేఙ్కటాచలమ్ ॥ 50

పూర్వజన్మమున నేనెవడను. నా జాతియేమి? దానిని నాకు వివరముగా నెఱింగింపుము 'ని యడుగగా శ్రీనివాసుడిట్లు తెలిపెను. 41

పూర్వము వైఖానసుడను మునీంద్రు డత్యంతనిర్మలాంతఃకరణుడై యుండి రాబోవు కృష్ణావతార చరిత్రను విని 42

కాలముయొక్కయు, కర్మలయొక్కయు, శరీరములయొక్కయు, జనుల యొక్కయు నస్థిరత్వమును నిశ్చయించుకొని తపస్సు చేయుటకు ప్రారంభించెను. 43

ద్రవిడదేశము నందలి చోళదేశమునందు కుశలతో నిండియున్న నొక ప్రసిద్ధ స్థలమున ఆహారమును వీడి ఇంద్రియములను జయించి 44

ఆచరింప శక్యముకాని నియమములబూని తపమాచరించి శ్రీకృష్ణపరమాత్మను సందర్శింతునని తపమాచరించుచుండగా — 45

గొల్లపిల్లవాని రూపమున భగవంతుడు ప్రత్యక్షమాయెను. అట్టి భగవంతుని గాంచి వైఖానసముని యిట్లు స్తుతించెను — 46

శ్రీ వైఖానసముని .—.

పురుషోత్తమా! పుణ్యమూర్తీ! గోపాలదేవా! దయానిధే! దేవాదిదేవా! నీకు పూజనొనరింతున 'ని ప్రార్థింప నా మునీంద్రునకు తగునట్లు భగవంతు డాతనితో — 47

శ్రీకృష్ణుడు —

మునీంద్రా! నీవు శ్రీనివాసుని ధ్యానింపుము. ఈ నా రూపమును వలదు. నీవు శేషాచలమునకేగి యచ్చట పుట్టలోనున్న 48

శ్రీనివాసుని ప్రతిమను గొనితెచ్చి దానినెల్లపుడు పూజింపుము. నీవు శ్రీ వేంకటాచలమున కేగునపుడు నీ మార్గములో శూద్రుడగు శ్రీరంగదాసుడు నీతో కలియును. 49

ఆతడు శూద్రుడు. నీకు దేవార్చనమున సేవకుడుగా నుండున 'ని తెలుపగా నా ముని వేంకటాచలమున కేగుచు 50

సఙ్గమ స్తు బభూవా స్య । మునేః శూద్రేణ వర్త్మని ।
తత స్తు తేన సహితో ! గత్వా శ్రీవేఙ్కటాచలమ్ ॥ 51

వల్మీకస్థం హరిం దృష్ట్వా । పూజయామాస వై మునిః ।
పుష్పా ణ్యాహారయామాస । రఙ్గదాసో మహాయశాః ॥ 52

అకస్మా ద్దైవయోగేన । గన్ధర్వః కుణ్డలాహ్వయః ।
స్నానార్థ మగమ చ్ఛీఘ్రం । స్వాభిః స్త్రీభి ర్జలాశయమ్ ॥ 53

వస న్తే విజనే తత్ర । స్వామిపుష్కరిణీజలే ।
జలక్రీడాపరా స్తత్ర । దృష్ట్వా తా రఙ్గదాసకః ॥ 54

ముదోద్రిక్తమనా భూత్వా । రేతో ఉత్స్యక్షీ ద్ధరాతలే ।
పునః స్నాత్వా శుచి ర్భూత్వా । పశ్చాత్తాపేన నిన్దితః ॥ 55

బద్ధం మాలాకులం సర్వం । పరిత్యజ్య పున స్తదా ।
పున రాహృత్య పుష్పాణి । శీఘ్ర మాదాయ పాదజః ॥ 56

దేవాగారం సమాసాద్య । స్థితవా నగ్రతో హరేః ।
రఙ్గదాసం మునిర్ దృష్ట్వా । ఉగర్హయ ద్రజసా ముహుః ॥ 57

పూజాకాలో హ్య తిక్రాన్తః । చక్రపాణే ర్మహాత్మనః ।
కిమర్థం కృతవాన్ బాల ! । విలమ్బం శూద్రనన్దన ॥ 58

విన్దిత్వా మునిశార్దూలే । శూద్రం పూజవిలోపినమ్ ।
తూష్ణీం స్థితే తు విప్రేన్ద్రే । స్థితే తూష్ణీ ఞ్చ పాదజే ॥ 59

శఙ్ఖచక్రధరః శూద్రం । ఉవాచ పరయా గిరా ।

శ్రీభగవానః —

మా భైషీః పుత్ర ! భద్రం తే । రఙ్గదాస మహామతే ! ॥ 60

మాయయా పిహితం విశ్వం । ససురాసురమానుషమ్ ।
తత్రా పి తవ బుద్ధి స్తు । పశ్చా త్తాపేన యోజితా ॥ 61

మార్గములో శూద్రుడగు రంగదాసుని కలిసికొని యాతనితో కూడి శేషా చలమున కేగి 51

పట్టణములోనున్న శ్రీనివాసునిగాంచి పూజించెను. కీర్తిశాలియగు రంగదాసు దిన దినము పూజకు పుష్పములను తెచ్చుచుండెను. 52

ఒకానొక దినమున కుండలుడను గంధర్వుడు తన స్త్రీలతోగూడ 53

వసంత ఋతువులో మనుష్యసంచారములేని సమయమున స్వామి పుష్కరిణిలో స్నానమాచరించుచుండెను. దైవసంకల్పమున తలవని తలంపుగా రంగదాసా గంధర్వుని స్త్రీలనుజూచి 54

మనస్సునందు కామవికారము కలిగి భూమిపై రేతస్సును విడచెను. మరల తన చిత్తవికారమునకు నిందించుకొనుచు పశ్చాత్తాపము నందుచు స్నానమాచరించి నిర్మలుడై

తాను కట్టిన పుష్పమాలికల నన్నిటిని పారవైచి మరల త్వరగా పువ్వులను తెచ్చి 56

దేవాలయమున కేగి శ్రీనివాసుని కెదురుగా నిలచెను. వైఖానసముని రజః ప్రకోపమున నిట్లు కోపించెను. 57

"శ్రీమన్నారాయణుని పూజాసమయము మించిపోయినది. నీ వాలసించుటకు కారణమేమి ? 58

అని యిట్లు పూజకు విఘ్నమొనర్చిన రంగదాసుని మాటిమాటికి నిందించి మౌనము వహించి వంతలో రంగదాసుమ మరుమాటాడక నిలచియుండ 59

శంఖచక్రధారియగు శ్రీమన్నారాయణు డాకాశవాణిగా "పుత్రా ! రంగదాసా ! నీవు భయపడవలదు. 60

నా మాయచే నీ జంగమ స్థావరాత్మక ప్రపంచమంతయు మోహింపబడి యున్నది. అందులో నీవు మానసికముగా చాల పశ్చాత్తాపము నందితివి. 61

తస్మా త్త్వ మధునా వత్స ! । సన్త్యజైతత్ కళేబరమ్ ।
స్వామిపుష్కరిణీతీర్థే । సర్వపాపనివారిణే ॥ 62

మరణా త్పుణ్యదేశే ఽస్మిన్ । శుద్ధో జన్మాన్తరే పునః ।
సుధర్మతనయో భూత్వా । తొణ్డదేశాధిపో భవ ॥ 63

‘తొణ్డమాని’ తి విఖ్యాతో । లోకే కీర్తిం గమిష్యసి ।
శతస్త్రీవల్లభో భూత్వా । మమ భక్త శ్చ కేవలమ్ ॥ 64

తత స్త్వం సార్వభౌమ స్సన్ । రాజ్యభోగ ముపైష్యసి ।
కన్యాదానప్రసఙ్గ శ్చ । భవిష్యతి న సంశయః ॥ 65

తస్మా ద్దేహం త్యజా త్రైవ । నిరాహారో ఽతినిర్మలః ।
సుధర్మరాజతనయో । రాజా ఽఽకాశానుజో భవ ॥ 66

ఇత్యుక్తో వాసుదేవేన । తనుం తత్రైవ సో ఽత్యజత్ ।
సత్వ మద్యా కాశరాజా నుజో ఽభూ ద్ధార్మికో నృపః ॥ 67

తదా త్వయా కృత స్త్వేషః । కూప ఆరామకారణాత్ ।
ఇతి తే కథితం పూర్వ । జన్మకర్మసముచ్చయమ్ ॥ 68

### తొణ్డమాననృపప్రార్థనయాభగవత్కృతనవీనమన్దిరప్రవేశః

గోవిన్దవచనం శ్రుత్వా । తొణ్డమాన్ రాజసత్తమః ।
కూపం సంశోధయామాస । స్వకృతం పూర్వజన్మని ॥ 69

విమానం కారయామాస । రత్నచిత్రం మహోన్నతమ్ ।
చతుర్మూర్తివరోపేతం । వైనతేయవిభూషితమ్ ॥ 70

కలశేన సమోపేతం । సౌవర్ణేనా ద్భుతేన వై ।
ఆగతానాం జనానాం చ । సమారోహావరోహయోః ॥ 71

మార్గం యోజనవిస్తీర్ణం । ససోపానం చకార హ ।
మధ్యే మధ్యే మణ్డపాని । ప్రపాకూపాం శ్చకారచ ॥ 72

నీవు నీ చిత్తవికారమువలన నపవిత్రమగు శరీరమును సకలకల్మషహారమగు స్వామి పుష్కరిణిలో విడచి వేయుము. 62

ఈ పవిత్ర ప్రదేశమున చనిపోవుటవలన మరియొక జన్మలో పవిత్రుడవై సుధర్ముని పుత్రుడవై తొండదేశమునకు రాజు వగుదువు 63

అప్పుడు నీవు "తొండమానుడ" ను పేరుతో ప్రఖ్యాతిని గాంచగలవు. మార్గురు త్రీలకు ప్రియుడవై నా తనన్య భక్తుడవై 64

ఏకచ్ఛత్రాధిపతివై రాజ్యభోగముల ననుభవింతువు. ఆ జన్మమున నీకు కన్యాదానమునకూడ కొంత స్థానము లభించును. సందియములేదు. 65

కావున నీ వాహారమును నీటి నియమములచే పరిశుద్ధుడవై యిచ్చటనే దేహమునువీడి మరుజన్మమున సుధర్మరాజపుత్రుడవు. ఆకాశరాజసోదరుడవై విరాజిల్లుము. 66

అని యాజ్ఞాపించినంతనే రంగదా నచ్చటనే శరీరమును విడచెను. ఆ జన్మమున రంగదాసుడవగు నీవే యీ జన్మమున నాకాశరాజ సోదరుడవు. ధర్మపరిపాలకుడగు రాజువైతివి. 67

ఆ జన్మమున మద్యానవనపోషణమునకై నీ వీ బావిని నిర్మించితివి. ఇదియే నీ పూర్వజన్మచరితము. 68

## తొండమానుడు ప్రార్థింపగా శ్రీనివాసుడు నూతన భవనమున ప్రవేశించుట

అని యిట్లు శ్రీనివాసుడు తన పూర్వజన్మ చరితమును తెలుపగా తొండమానుడు తాను పూర్వజన్మమున నిర్మించిన బావిని శుభ్రపరచెను. 69

మరియు రత్నములతో చెక్కబడి కూర్చబడి విచిత్రముగాను మిక్కిలి యెత్తుగా నుండి, నాలుగు చక్కని విగ్రహములు కలిగి గరుత్మంతునిచే నింపొందుచుమండు విమానమును నిర్మింపజేసెను. 70

అద్భుతమగు బంగరు కలశముచే కూడినదై, కొండకువచ్చు జనుల రాకపోకల కనువగునట్లు 71

ఒక యోజనదూరము వెడల్పు కలిగిన మార్గమున మెట్లు కట్టించెను, మధ్య మధ్య మండపములను, చలివేంద్రములను, బావులను నిర్మింపజేసిన పిమ్మట 72

శ్రీనివాసం సమాగమ్య । తొణ్డమా నబ్రవీ త్తతః ।

రాజా —

త్వయా నియమితం దేవ ! । సర్వం సమ్పూర్ణతాం గతమ్ ॥ 73

ఆగచ్ఛా ద్య జగన్నాథ ! । చైత్యం తవ జనార్దన ! ।
ఇతి రాజవచః శ్రుత్వా । భగవా నాహ భూపతిమ్ ॥ 74

అవశ్య మనుగచ్ఛామి । తవ భక్త్యా ప్రతోషితః ।
ఇత్యు క్త్వా ప్రస్థితం దేవం । దేవై శ్చ బ్రహ్మపురోగమైః ॥ 75

వైఖానసఋషిశ్రేష్ఠైః । బ్రాహ్మణైః బ్రహ్మవిత్తమైః ।
ఋక్సామగాయకై శ్చైవ । మన్త్రై శ్చ విధిపూర్వకమ్ ॥ 76

వాదిత్రై ర్వాద్యమానై శ్చ । ఘోషయద్భి ర్దిశోదశ ।
దేవై ర్బ్రహ్మపురోగై శ్చ । స్తువద్భి స్తుతిభి ర్హరిమ్ ॥ 77

ప్రవేశయామాస పరం సుమన్దిరం । శ్రీశ్రీనివాసం పురుషం పురాణమ్ ।
పద్మావతీ ఞ్చా పి ముదా మహీపతిః । సమస్తలోకై ర్మునిభి ర్మహోత్సవైః ॥

పుష్పాణ్య వర్షం శ్చ సురాసురాద్యాః । సయక్షగన్ధర్వనరోరగా శ్చ ।
దేవస్య మూర్ధ్న్యే శు విమానవర్యే।తం పూజయ న్త స్త్వృషయ శ్చ హర్షాత్॥

తత ఆనన్దనిలయే । తొణ్డమా న్నృపనిర్మితే ।
విమానాగ్ర్యే శ్రీనివాసో । రరాజ భగవాన్ హరిః ॥ 80

ఆనన్దజనకత్వా త్తం । ఆనన్దనిలయం విదుః ।
వరపద్మాసనే మస్థాం । విధాయ కమలాలయామ్ ॥ 81

పద్మావతీం విశాలాక్షీం । భగవా నాత్మవక్షసి ।
అరిశఙ్ఖవిహీనో ఽసౌ । కటిన్య స్తకరో త్తమః ॥ 82

దర్శయన్ పాణినై కేన । దక్షిణేన వృషాకపిః ।
పదపద్మంమరారాధ్యం । గతి ఞ్చ పరమాం నృణామ్ ॥ 83

శ్రీనివాసుడాదరము వచ్చి "దేవా! నీ వాజ్ఞాపించినట్లే యంతయు పూర్తి అయినది" 73

శ్రీనివాసా! నేడు నీవు నీ దివ్యమందిరమునకు విచ్చేయుమని ప్రార్థింపగా శ్రీనివాసుడు రాజుతో - 74

నీ భక్తికి సంతసించితిని. తప్పక రాగలనని బయలుదేరిన శ్రీనివాసుని పద్మావతీ సమేతునిజేసి యింద్రాది దేవతలతోను, 75

వైఖానసాది మునీంద్రులతోను. వేదశాస్త్ర పారంగతులగు బ్రాహ్మణులతోను, ఋగ్వేదమును, సామవేదము నధ్యయనము చేయువారితోను, శాస్త్రవిహిత మంత్రములతోను, 76

మంగళ వాయిద్యములు, పది దిక్కులయందును ప్రతిధ్వనింపుచుండ బ్రహ్మాది దేవతలు స్తుతించు స్తోత్రపాఠములతోను, 77

సకలలోక నివాసులొనరించు యుత్సవములతో సంతసమున నూతన గృహమున పద్మావతితో శ్రీనివాసుని తొండమానురాజు ప్రవేశింపజేసెను. 78

యక్ష, గంధర్వ, మనుజ, నాగలోక నివాసులతో దేవదానవులందరును శ్రీనివాసుని తలపై పుష్పవర్షమును కురిపించిరి. ఋషీంద్రులును విమానోత్తమమున నున్న శ్రీనివాసుని సంతసమున పూజించి పుష్పవర్షమును కురిపించిరి. 79

తొండమానుడు నిర్మించిన ఆనందనిలయమునందలి విమానరాజమున శ్రీనివాసుడు విరాజిల్లెను. 80

ఆ భవనమానందము నిచ్చునదగుటచే దాని కానందనిలయమను పేరుకలిగెను. లక్ష్మీదేవిని పద్మాసనమున చక్కగా నిలిపి 81

తామరరేకులవంటి కనులుగల పద్మావతిని తన వక్షస్థలమున నుంచుకొని శత్రుభయములేనివాడై, నడుమునం దెడమచేతినుంచుకొని, 82

కుడిచేతితో దేవతలకు తన పాదపద్మములు పూజింపతగినవియు, మనుజుల కుత్కృష్టగతియునని తెలుపుచు, 83

కటిన్యస్తకరేణా పి । నిజపాదాబ్జగామినామ్ ।
నృణాం భవపయోరాశిం । కటిదఘ్నం ప్రదర్శయన్ ॥ 84

విరాజతే వేఙ్కటేశః । సమ్ప్రత్య పి రమాపతిః ।
ఇతితే కథితం రాజన్ ! । మాహాత్మ్యం వేఙ్కటేశితుః ।
పవిత్రం పరమం పుణ్యం । మఙ్గళానా ఞ్చ మఙ్గళమ్ ॥ 85

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటచలమాహాత్మ్యే శ్రీభగవత్కృతతొణ్డమాన్నృప
నిర్మితనవీనమన్దిరప్రవేశవర్ణనం నామ త్రయోదశోఽధ్యాయః

---

# అథ చతుర్దశోఽధ్యాయః

## బ్రహ్మకారితదీపారోపణభగవదుత్సవప్రశంసా

శతానన్దః —

సర్వాభ్యుదయకామో ఽథ । భూతానాం హితకామ్యయా ।
తదా వై భగవాన్ బ్రహ్మా । దీపద్వయ మకల్పయత్ ॥ 1

ప్రార్థయామాస గోవిన్దం । వర మేక మనామయమ్ ।
యావ త్కలియుగం తిష్ఠేత్ । తావ ద్దీపో ఽభివర్ధతామ్ ॥ 2

యదా విమానపతనం । యదా దీపవినాశనమ్ ।
తదా ఽవతారః సంపూర్ణః । ఇది మే నిశ్చితో ఽవధిః ॥ 3

ఇతి తస్మై వరం దత్వా । బ్రహ్మాణ మవద ద్ధరిః ।

శ్రీనివాసః —

శ్రూయతాం వచనం తాత ! । భుజ ముద్ధృత్య చోచ్యతే ॥ 4

ఉత్సవం కురు మే పుణ్యం । బ్రహ్మన్ లోకపితామహ ।
ధ్వజారోహణ మారభ్య । రథా న్త ఞ్చ సవాహనమ్ ॥ 5

నడుమన నుంచుకొనిన చేతితో తన పాదారవిందముల నాశ్రయించిన మనుజులకు సంసారసముద్రము మొలబంటిలోతుగా మాత్రమే యుండునని చూపును 84

నేటికిని శ్రీనివాసుడు ప్రకాశించుచున్నాడు. జనకమహారాజా! ఇట్లు పవిత్రమును మిక్కిలి పుణ్యప్రదమును, మంగళవస్తువులకును మంగళమొసంగునట్టి శ్రీ శ్రీనివాసుని మాహాత్మ్యమును నీకు తెలిపితి 'నని శతానందుడు పలికెను. 85

ఇది శ్రీ భవిష్యోత్తరపురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున శ్రీనివాసుడు తొండమానుచే నిర్మింపబడిన నూతన భవనమున ప్రవేశించుట యనెడు పదమూడవ అధ్యాయము సంపూర్ణము

---

# పదునాల్గవ అధ్యాయము

## బ్రహ్మయొనరించిన దీపారోపణమును శ్రీనివాసోత్సవమును వర్ణించుట

**శతానందుడు —**

మరల శతానందుడు చెప్పనారంభించెను. మునులారా! చతుర్ముఖుడు జనులందరి యభివృద్ధిని కోరుచున్నవాడై ప్రాణికోటికి మేలును కాంక్షించుచు రెండు దీపముల వేర్పరచి 1

" కలియుగమున్నంతవరకీ దీపమభివృద్ధి చెందవలె "నని శ్రీనివాసుని ప్రార్థించుచు వరమును వేడెను. 2

నా విమానము పడిపోయినపుడు, నాకు నీవుంచిన దీపమారిపోయినపుడు నా అవతారము ముగిసినదని నేను నా యవతారమున కవధిని 3

నిశ్చయించితి 'నని శ్రీనివాసుడు చతుర్ముఖునకు వరమునొసంగి యాతనితో — నాయనా! నేను చేతినెత్తి (ప్రమాణమునుచేసి) దృఢముగా చెప్పుచున్నాను. వినుము. 4

చతురాననా! కొడినెత్తుట (జండాను ఎత్తుట) మొదలుకొని రథోత్సవము వరకు దినమున కొకవిధమగు వాహనముపై నన్ను మారేగించుటయను పవిత్రమగు మహోత్సవమును నా కొనరింపుము. 5

నైవేద్యం బహువిచిత్ర ఞ్చ । బ్రాహ్మణై ర్వేదపారగైః
కర్తవ్యం మమ కల్యాణం । త్రికాలే భయభక్తితః ॥ 6

ఇతి దేవ ద్వచనం శ్రుత్వా పితుః స చ పితామహః ।
తొణ్డమానం సమాహూయ । వచనం వ్యాహర త్తదా ॥ 7

బ్రహ్మా —

వాహనాని విచిత్రాణి కురు శీఘ్రం రమాపతేః ।
రథో దారుమయ స్తాత ! । బహుచిత్రవిచిత్రతః ॥ 8

అతస్త్రేణ మహీపాల ! । న ర్తవ్యో విశ్వకర్మణా ।
ఛత్రాణి చామరే పుణ్యే । వ్యజనం రాజసత్తమ ॥ 9

ఇత్యుక్త్వా విశ్వకర్మాణం ఆహూయ నృపతే ర్వశమ్ ।
విధాతా విదధే సోఽపి । యథా రాజానుశాసనమ్ ॥ 10

వాహనాని రథచ్ఛత్ర । చామరవ్యజనాని చ ।
కృతవాన్ క్షణమాత్రేణ । ప్రీతయే మధుఘాతినః ॥ 11

## మహోత్సవార్థం వేఙ్కటాద్రిం ప్రతి నానాదేశీయనృపాగమనమ్

ఉవాచ వచనం దేవో । రాజానం సపితామహమ్ ।
సర్వదేశజనాకీర్ణం । ఉత్సవం చో త్తమం విదుః ॥ 12

ఆనయస్వ నృపాన్ సర్వాన్ । నానాదేశాగతా నితి ।
శాసితో వాసుదేవేన । భృత్యాన్ సంప్రేషయ న్నృపః ॥ 13

అఙ్గవఙ్గకళిఙ్గాద్యాః । పౌగణ్డాః కాశికా స్తథా ।
కామ్భోజాః కేరళద్వీపా । విరాటకురుజాఙ్గలాః ॥ 14

బర్బరాః పాణ్డ్యదేశీయాః । చైద్యా మాత్స్యాః ససైన్ధవాః ।
ఆగతా స్తే మహీపాలాః । సకుటుమ్బాః సవాహనాః ॥ 15

వేదశాస్త్రముల నాపాంతముగ నధ్యయన మొనరించిన బ్రాహ్మణులచే ననేక రకములైన వాద్యము మూడువేళల వాయింపజేయుము. మూడు సమయములయందును భయభక్తులతో నా కల్యాణము చేయింపవలెను. 6

ఇట్లు శ్రీనివాసు డాజ్ఞాపించినంతనే చతుర్ముఖుడు తొండమాన్‌రాజును పిలిచి 7

బ్రహ్మ —

నీవు శ్రీనివాసునకు క్రమముగా ననేక విచిత్రములగు వాహనములను, అనేక చిత్రవిచిత్రములతో చెక్కబడిన వజ్రముచే చేయబడిన రథమును, 8

చక్కని ఛత్రములను, చామరములను, విసనికఱ్ఱను, విశ్వకర్మచే జాగరూకతతో చేయింపుము" అని తెలిపె 9

విశ్వకర్మను రావించి రాజున కప్పగించెను. విశ్వకర్మయు తొండమానుని యాజ్ఞానుసారము 10

వాహనములను, రథమును, ఛత్రమును, చామరములను, విసనికఱ్ఱలను శ్రీనివాసునికి సంతోషము కలుగునట్లొక్క క్షణములో నిర్మించెను. 11

## శ్రీనివాసుని మహోత్సవమును సేవించుటకై వేంకటాచలమున కనేక దేశములనుండి రాజులు వచ్చుట

శ్రీనివాసుడు చతుర్ముఖునితో గూడిన రాజునుగాంచి "నానా దేశములనుండి వచ్చిన జనులతో నిండిన యుత్సవమే గొప్ప యుత్సవముగా భావింపబడుచున్నది. 12

కావున నీవు దేశదేశములనుండి రాజులనందరను రప్పింపుము" అని యాజ్ఞాపింపగా రాజు తన సేవకులను పంపించెను. 13

అంగదేశీయులు, వంగదేశీయులు, కళింగాదిదేశీయులు, కాశీదేశీయులు, కాంభోజులు, కేరళదేశీయులు, విరాట, కురు, జాంగలదేశీయులను, (పౌగండులనగా అవకృష్ణులుగా లెక్కింపబడువారు అనగా కిరాతులు మొదలగువారు) 14

బర్బర, పాండ్య, చేది, మత్స్య, సింధు దేశీయులగు రాజులు కుటుంబములతో, వాహనములతో విచ్చేసిరి. 15

కేచి ద్యానగతాః కేచిత్ । గజస్థాః కేచి దశ్వగాః ।
కేచి చ్ఛ శిబికారూఢాః । కేచి త్పద్భ్యాం సమాయయుః ॥ 16

ఛత్త్రైః సచామరై ర్దివ్యైః । మయూరశుకపిఞ్ఛకైః ।
ఆరాధనం ప్రకుర్వాణా । విప్రాణా శ్చైవ భోజనైః ॥ 17

బ్రహ్మక్షత్రియవిట్శూద్రాః । యే చా న్యే నవజాతిజాః ।
చణ్డాలయవనాం స్త్యక్త్వా । సర్వ ఏవ సమాగతాః ॥ 18

సమాగమే మార్గమధ్యే । సఙ్కీర్ణజనమణ్డలే ।
అశ్నన్తః కేచి దాయాన్తి । కేచి దన్నవివర్జితాః ॥ 19

కేచిత్ క్షీరప్రపానా శ్చ । కేచి ద్ధారణపారణైః ।
సర్వే ఒభవన్ హరే ర్భక్తాః । శ్రీనివాసస్య భూమిప ! ॥ 20

ధనాని వస్త్రాణి చ భూషణాని । కాయా న్స్వజీవాంశ్చ సుఖాని సర్వే ।
శ్రీవేఙ్కటేశస్య పదార్పితాని । చక్రు ర్జనా భాగవతాః కలౌ యుగే ॥ 21

తత్రా ఒహూయ మునీన్ సర్వాన్ । మహీపాలాన్ యథాక్రమమ్ ।
కన్యామాసం గతే భానౌ । ద్వితీయాయాం జగత్పతేః ॥ 22

ధ్వజారోహణ మాదాయ । సాఙ్కురార్పణ మేవ చ ।
వైఖానసమునిశ్రేష్ఠైః । పూజామన్త్రైః ప్రకల్పితా ॥ 23

వరయానం రత్నమయం । విధాయ పురతో హరేః ।
వాసుదేవం బభాషే ఒథ । బ్రహ్మా లోకపితామహః ॥ 24

" వరయానం సమారుహ్య । కురు చైత్యప్రదక్షిణమ్ " ।
ఏవ ముక్తః ప్రత్యువాచ । శ్రీనివాసః పితామహమ్ ॥ 25

## భగవదాజ్ఞయా బ్రహ్మకృతభగవన్మూర్తిచతుష్టయనిర్మాణప్రకారః

**శ్రీనివాసః —**

కొందరు వాహనములపైనను, కొందరేనుగులపైనను, కొందరు గుఱ్ఱముల పైనను, కొందరు పల్లకీలలోను, కొందరు నడచుచును, 16

మరికొందరు ఛత్రములతోను, కొందరు నెమళ్ల చిలుకల మొదలగువాని పింఛ ములతో చేయబడిన చామరములతోను మధ్యేమార్గమున బ్రాహ్మణుల కన్నసంతర్పణము లచే వారి నారాధించుచు 17

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు మొదలగు చండాలురు, తురకలును తక్క తక్కిన తొమ్మిది జాతులవారు నరుదెంచిరి. 18

జనులందరును కలసి గుంపులుగాచేరిన మధ్యమార్గములో కొందరన్నమును తినుచును, కొందరన్నమును విడచియు, 19

కొందరు పాలను త్రాగుచును, కొందరు భగవధ్యానముతోను, కొందరుపవసించి మరుసటి దినమున భుజించుటలతోను, శ్రీనివాస చరణారవింద లగ్నచిత్తులై విలసిల్లిరి. 20

కలియుగమున జనులందరు తమ ధనములను, వస్త్రములను, భూషణములను శరీరములను ఆత్మలను సుఖములనన్నిటిని శ్రీశ్రీనివాస చరణకమలములయం దర్పించివైచిరి.

సూర్యుడు కన్యారాశియందు ప్రవేశించియుండగా (భాద్రపద మాసమున నుండగా) విదియ రోజున శ్రీనివాసునకు 22

ధ్వజారోహణము అంకురార్పణము మొదలగు మత్సవములకు ముందుగా నారంభింపజేసి 23

రత్నములచే కూర్పబడిన మనుజుల భుజములచే మోయబడు వాహనమును శ్రీనివాసున కెదురుగానుంచి బ్రహ్మ శ్రీనివాసునితో — 24

స్వామీ! ఈ వాహనముపై నధిష్ఠించి యీ మందిరము చుట్టును ప్రదక్షిణ మాచరింపుమ 'ని ప్రార్థింపగా శ్రీనివాసు డాతనితో — 25

## శ్రీనివాసుని యాజ్ఞచే చతుర్ముఖుడు భగవద్విగ్రహములను నాలిగింటిని నిర్మించుట

శ్రీనివాసుడు —

భో పుత్ర ! బాలభావో ఽసి । శాసితో వేదనిర్ణయః ।
స చాప్య విస్మృత స్తాత ! । పరీక్షా దీయతాం మమ ॥ 26

స తద్వచన మాకర్ణ్య । కిఞ్చి చ్చిన్తాసమాకులః ।
పరీక్షాం ప్రదదౌ విష్ణోః । వేదానాం వేదవిత్తమః ॥ 27

స్ఖాలిత్య మభవ త్కిఞ్చిత్ । పరీక్షాయాం విధే స్తదా ।
తతో ఽవబోధితః సమ్యక్ । వేధాః వేదానుశాసనమ్ ॥ 28

నిర్మమే క్షణమాత్రేణ । శ్రీనివాసాత్మికాః శుభాః ।
మూర్తీ ర్బ్రహ్మా సో మన్త్రై స్తు । చతుర్వేదసముద్భవైః ॥ 29

పృథఙ్నామాని తాసాం వై । చకార స మహామతిః ।
ఉత్సవః శ్రీనివాసాఖ్యా । త్వాద్యా ఽన్యా చోగ్రనామికా ॥ 30

సర్వాధికసమాఖ్యా ఽన్యా । లేఖకాఖ్యా తథా ఽపరా ।
మూలమూర్తి రభూ త్తాసాం । మూర్తీనాం చతురాత్మనామ్ ॥ 31

స్వయం శ్రీవేఙ్కటాధీశః । సర్వాత్మా జగదీశ్వరః ।
దేవానాం కల్పయామాస । తత్తన్మూర్త్యభిమానినామ్ ॥ 32

చతుర్ముఖేషు చతురో । మనస్యేకం విధి స్తతః ।
అనువధ్యా తదా తేన । సర్వకర్మమహోత్సవే ॥ 33

ఉత్సవే శ్రీనివాసస్య । యాత్రాకర్మణి దీక్షితః ।
తేన నిర్వర్తయామాస । యాత్రా కర్మోత్సవం విధిః ॥ 34

నైవేద్యం బహుధా చిత్రం । చక్రే బ్రహ్మోత్సవే శుభే ।
గుడౌదనం తిలాన్నఞ్చ । పరమాన్నం పయః శ్రుతమ్ ॥ 35

ముద్గాన్నం మాషకాన్నఞ్చ । దధ్యోదన మతః పరమ్ ।
షడ్విధాన్నఞ్చసాపూపం । సపాయసముశర్కరమ్ ॥ 36

గుడాపూపాం స్తిలాపూపాన్ । మాషాపూపాన్ మనోహరాన్ ।
మోదకాంశ్చ శతచ్ఛిద్ర । ప్రముఖాన్ కారయన్ విధిః ॥ 37

నాయనా! చతుర్ముఖా! నీకు నేను వేదములను ప్రసాదించినపుడు నీవు బాల్యమునందుంటివి. ఆ వేదముల విధులిప్పుడు విస్తారముగ పెరిగినవి. నీవు ముందుగా నాకు పరీక్షనిమ్ము' అని పల్కెను. 26

ఆ మాటలకు వేదవిజ్ఞుడైన బ్రహ్మ కొంచెము చింతించి శ్రీనివాసునకు వేదములలో పరీక్షనిచ్చెను. 27

ఆ పరీక్షలో చతుర్ముఖునకు కొంచెము ప్రమాదము సంభవింపగా పరం శ్రీనివాసునిచే తెలుపుడుజేయబడి వేదవిధిని 28

క్షణమాత్రముననే చక్కబరచి శ్రీనివాసుని యంశములతో నాలుగు మూర్తులను చతుర్వేదముల యందలి మంత్రములతో నిర్మించెను. 29

ఆ విగ్రహములలో ఉత్సవవిగ్రహమునకు శ్రీనివాసులను పేరుండుటంజేసి రెండవ విగ్రహమునకు భోగమనియు. 30

మూడవ విగ్రహమునకు "సర్వాధికారము" యనియు నాల్గవదానికి 'లేఖకా' యనియు వేరు వేరు నామముల నుంచెను. ఆ నాల్గు విగ్రహములకు 31

సర్వవ్యాపియు జగదీశ్వరుడునునగు శ్రీ వేంకటాచలపతి మూల విగ్రహముగా నుండెను. యేయే దేవత లేయే విగ్రహముల నభిమానింతురో వారి కాయా విగ్రహములను కల్పించెను. 32

నాల్గు ముఖములయందును నేర్పుగల బ్రహ్మ తన మనమున నొక విగ్రహమును ధ్యానించి యనేక విధములుగ నొనరించు శ్రీనివాసమహోత్సవము 33

నందలి యూరేగింపు విషయమున నొనరించు దీక్షను వహించి యత్రాయుత్సవమును ఆ విగ్రహముతో నిర్వహించెను. 34

ఆ బ్రహ్మోత్సవమున ననేకవిధములుగ నైవేద్యముల నర్పించెను. బెల్లముతో తయారుచేసిన యన్నమును, నువ్వుల యన్నమును (పులిహోరము) పాలతో వుడికిన క్షీరాన్నమును. 35

పెసరపప్పుతో వండిన పులగమును, మినపపప్పుతోకూడిన యన్నమును, పెరుగన్నమును (దధ్యోదనం) అప్పములతోగూడి యారురుచుల కలిగిన యన్నమును మంచి చక్కెరచేర్చి వండిన పరమాన్నమును. 36

బెల్లముతో వండిన యప్పములను నువ్వుల పప్పుతోకూడిన యప్పములను (అరిసెలను), (కక్కరముల) మిక్కిలి రుచిగల మినపగారెలను, మైసూరపాకము; మొదలగు వానిని చేయించుచు 37

బ్రహ్మకారిత శ్రీనివాస మహోత్సవ వైభవ ప్రకార వర్ణనమ్.

అర్పయామాస దేవాయ । శ్రీనివాసాయ విష్ణవే ।
ఉత్సవం శ్రీనివాసస్య । విధి ర్యాత్రాం మహోత్సవే ॥ 38

కారయామాస వై వేధాః । ధ్వజారోహణ పూర్వకమ్ ।
సాయఙ్కాలేచ పూర్వేద్యుః । ధ్వజారోహణ వాసరాత్ ॥ 39

అనన్తగరుడాద్యాశ్చ । బ్రహ్మాద్యాశ్చతథాఽమరాః ।
సర్వేచాన్యేమహర్ష్యాద్యాః । విష్వక్సేనపురస్సరాః ॥ 40

వల్మీకాదిభవాం మృత్స్నాం । పవిత్రాం నగరా ద్బహిః ।
ఖాదితాంవిధివన్మన్త్రైః । హస్తిమస్తకరోపితామ్ ॥ 41

సర్వమఙ్గళవాద్యైశ్చ । సహ సర్వపరిచ్ఛదైః ।
సన్త్రమ్యమం సమానీయ । ప్రాదక్షిణ్యేన వీధిషు ॥ 42

అఙ్కురార్పణ మాతేనుః । సహర్ష పులకాఙ్కురాః ।
తతోఽపరేద్యు రుషసి । ధ్వజారోహమహోత్సవమ్ ॥ 43

ఆరభ్యా వభృథాన్త ఞ్చ । పుష్పయాగాన్త మేవ చ ।
ఉత్సవం శ్రీనివాసస్య । చకార విధివ ద్విధిః ॥ 44

తస్మిన్ మహోత్సవే విష్ణోః । ధ్వజారోహణవాసరే ।
ప్రథమే ప్రథమం యానం । మనుష్యాన్దోళికా ఽభవత్ ॥ 45

ద్వితీయ ఞ్చ తథా రాత్రౌ । అభవ చ్ఛేషవాహనమ్ ।
శేషే శయనశీలస్య । శేషాచలనివాసినః ॥ 46

సదా శేషప్రియస్యా స్య । శ్రీనివాసస్య శార్ఙ్గిణః ।
ద్వితీయదివసే చా ద్యం । భూయోఽ భూ చ్ఛేషవాహనమ్ ॥ 47

ద్వితీయ ఞ్చ తథా రాత్రౌ । అభవ ద్ధంసవాహనమ్ ।
తృతీయదివసే చా ద్యం । అభవ త్సింహవాహనమ్ ॥ 48

## బ్రహ్మచే నొనరింపబడిన శ్రీనివాసమహోత్సవ విశేషములను వర్ణించుట

శ్రీమన్నారాయణావతారుడగు శ్రీనివాసునకు నివేదించెను మరియు నా బ్రహ్మో
త్సవములో బ్రహ్మ ఊరేగింపు ఉత్సవము నేర్పాటు గావించెను. 38

ధ్వజమునెత్తు రోజునకు ముందురోజున సాయంకాలమున 39

శేష గరుడులును, బ్రహ్మాదిదేవతలును, సకల మునీంద్రులును, విష్వక్సే
నాదులును, 40

పట్టణమునకు వెలుపల అంకురార్పణకై పుట్టలోనున్న పవిత్రమగు మట్టిని
మంత్రములను పఠించుచు యథాశాస్త్రముగా త్రవ్వి యేనుగు తలపై నుంచి 41

సర్వమంగళ వాద్యములతోను, సకలోపకరణములతోను, వీధులలో ప్రదక్షి
ణముల నొనరించుచు త్వరితముగా గొనివచ్చి 42

సంతోషాతిశయమున నొడలు పులకరించుచుండ నంకురార్పణము నొనరించిరి.
ఆ మరునాటిదినమున ప్రాతఃకాలమున కొడినెత్తు మహోత్సవము 43

మొదలుకొని యవభృథ స్నానమువరకు శ్రీ పుష్పయాగ మాఖరువరకును
యథావిధిగా శ్రీనివాసున కుత్సవమును బ్రహ్మ చేయించెను. 44

ఆ మహోత్సవ సమయమున ధ్వజారోహణము రోజున మనుష్యులచే మోయ
బడు పల్లకి మొదటి వాహన మయ్యెను. (చలవ చప్పరము) 45

రెండవ దినమున రాత్రి శేషవాహనము. అనవరతము శేషునిపై వసించి
యుండి శేషాద్రియందే నివసించియుండి 46

శేషునియందే ప్రీతికలిగిన శ్రీనివాసునకు రెండవ దినమున తిరిగి మొదటి
శేషవాహన మాయెను. 47

ఆ దినముననే రాత్రియందు హంసవాహనము రెండవదాయెను. మూడవ
రోజున సింహవాహనము మొదటిదియు 48

ద్వితీయ ఇ్చ తథా యానం । రాత్రౌ మౌక్తిక మణ్డపమ్ ।
చతుర్థదివసే యానం । ఆదిమం కల్పభూరుహః ॥ 49

ద్వితీయ మభవ ద్రాత్రౌ । సర్వభూపాలవాహనమ్ ।
పఞ్చమే దివసే చాద్యం । యాన మాన్దోళికా ఽభవత్ ॥ 50

హరే రమృతసన్దాయి । మోహినీవేషధారిణః ।
ద్వితీయం రజనౌయానం । వేదవేద్యస్యవై హరేః ॥ 51

బభూవచస్వయంసాక్షాత్ । ఛన్దోమూర్తిఃఖగేశ్వరః ।
ఆద్యం యానం షష్ఠదినే । హనుమా నభవ ద్ధరేః ॥ 52

ద్వితీయం మఙ్గళగిరిః । సాయం యాన మభూ ద్ధరేః ।
మహిషీసంయుతస్యా స్య । వసన్తోత్సవరాగిణః ॥ 53

తృతీయం రజనౌ యానం । ఆసీ దైరావతో గజః ।
సప్తమే ఽభూ ద్దినే యానం । ఆద్యం భాస్కరమణ్డలమ్ ॥ 54

ద్వితీయంమఙ్గళగిరిః । సాయమాసీద్రమాపతేః ।
రమణీయతమోద్యాన । విహారోత్సవరాగిణః ॥ 55

కుసుమాపచయవ్యగ్ర । మహిషీజనశాలినః ।
తృతీయం రజనౌ యానం । అభవ చ్చన్ద్రమణ్డలమ్ ॥ 56

అష్టమే దివసే చాద్యం । అభవ ద్వాహనం హరేః ।
నానావిధై రలఙ్కారైః । మణ్డితః సుమహాన్ రథః ॥ 57

ద్వితీయం రజనౌ యానం । అభూ దుచ్చైఃశ్రవాహయః ।
నవమే దివసే చాద్యం । యాన మాన్దోళికా ఽభవత్ ॥ 58

ద్వితీయం మఙ్గళగిరిః । యాన మాసీ ద్రమాపతేః ।
హారిద్రైః పిఙ్గళై శ్చూర్ణైః । అభిషిక్తస్య మఙ్గళైః ॥ 59

సముద్యుక్తస్యా వభృథ । స్నానమాఙ్గలికోత్సవే ।
స ఇత్థం మఙ్గళై శ్చూర్ణైః । హారిద్రై రభిషేచితః ॥ 60

ముత్యాల పల్లకి రెండవ వాహనము నాయెను. నాల్గవరోజున మొదటి వాహనము కల్పవృక్షమును 49

సర్వభూపాల వాహనము రెండవదిగా నమరెను. ఐదవ రోజున మొదటిది పల్లకి వాహనము. 50

అందు శ్రీనివాసున కమృతమును పంచియిచ్చు మోహినీ యలంకార మమర్చి యుంచెను. రాత్రి రెండవ వాహనము ఆ వేదవేద్యుడగు శ్రీనివాసునకు 51

వేదస్వరూపుడగు గరుత్మంతవాహనము చక్కగా నమరెను. ఆరవ దినమున మొదటి వాహనము హనుమద్వాహనము 52

రెండవది మంగళగిరి వాహనము. తన భార్యలగు రమాదేవి పద్మావతులతో వసంతోత్సవమున ప్రీతిగల శ్రీనివాసునకు 53

మూడవది ఐరావతమను పేరుగల యేనుగు వాహనము. ఏడవ దినమున మొదటిది సూర్యప్రభయు 54

సాయంకాలము రెండవవాహనము మంగళగిరి వాహనమాయెను. సుందరోద్యానమున విహరణ శీలియు 55

పుష్పములను కోయుటయందు దానశక్తి గలిగిన తన భార్యలతో కూడియుండు శ్రీనివాసునకు మూడవ రాత్రి వాహనము చంద్రప్రభయు 56

ఎనిమిదవ రోజున ననేక విధములగు నలంకారములచే నలంకరింపబడిన గొప్ప రథము మొదటి వాహనమును, 57

రెండవ వాహన ముచ్చైశ్రవమను గుఱ్ఱపువాహనమును తొమ్మిదవ దినమున మొదటి వాహనము పల్లకియు 58

రెండవవాహనము మంగళగిరియు నయ్యెను. 59

దీక్షానంతర స్నానమాచరించు మంగళోత్సవమున వసుపురంగు, గోరోచన వర్ణముగల పరిమళచూర్ణములతో నభిషేకింపబడి 60

సున్దరం మఙ్గళగిరిం । సమారుహ్య సతాంగతిః ।
చైత్యం ప్రదక్షిణీకృత్య । సహ సర్వైర్మహాజనైః ॥ 61

జపద్భి ర్వైదికాన్ మన్త్రాన్ । సహిత శ్చ ద్విజోత్తమైః ।
చకారా వభృథస్నానం । భగవా నాదిపూరుషః ॥ 62

స్వామిపుష్కరిణీతీర్థే । సర్వలోకైకపావనే ।
అవతారదినే తస్మిన్ । నక్షత్రే శ్రవణే ప్రగే ॥ 62

తృతీయం మఙ్గళగిరిః । యానం రాత్రా వభూ త్తతః ।
ధ్వజావరోహణాభిఖ్యః । ఉత్సవో ఒభూ త్తదా హరేః ॥ 64

తతో ఒపరేద్యు రభవత్ । పుష్పయాగ మహోత్సవః ।
దేశా న్తరా దాగతానాం । సపర్యా ఒసీ త్తతో నృణామ్ ॥ 65

దేవాజగ్ముః స్వకం ధామ । రాజానో రాజసత్తమ ।
జగ్ముఃస్వనగరందివ్యం । దృష్ట్వాదేవమహోత్సవమ్ ॥ 66

బ్రహ్మా జగామ స్వం లోకం । నత్వా వేఙ్కటవల్లభమ్ ।
సమాప్య చోత్సవం సర్వం । స రాజా తొణ్డమాన్ నృపః ॥ 67

వాసుదేవం నమస్కృత్య । చా ఒజ్ఞా మాదాయ మౌలినా ।
స్వపురం ప్రాప్య ధర్మాత్మా । కృత్వా ఒర్చాం వేఙ్కటేశితుః ॥ 68

సంస్థాప్య పూజయామాస । స్వపురే విజమన్దిరే ।
రాజ్యం చకార ధర్మాత్మా । సత్యేన పృథివీపతిః ॥ 69

గోబ్రాహ్మణహితార్థాయ । చా తిథీనాం హితాయ చ ।
సద్ధర్మనిరత శ్శాన్తో । జితమన్యు ర్జితేన్ద్రియః ॥ 70

నిత్య మారాధయన్ కృష్ణం । బిలమార్గేణ చాగతః ।
ఇత్థం కుర్వతి రాజేన్ద్రే । రాజరాజకులోద్భవే ॥ 71

అందమగు మంగళగిరి వాహనముపై వధిష్ఠించి మహాత్ములందరితోగూడ యా దివ్యమందిరమునకు ప్రదక్షిణ మాచరించి 61

వేదమంత్రములను జపించుచున్న బ్రాహ్మణోత్తములతోగూడి 62

సకలలోక పావనియగు స్వామి పుష్కరిణీతీర్థమున తన జన్మదినమున శ్రవణా నక్షత్రమున నుషఃకాలమున నాది పురుషుడగు శ్రీనివాసు డవభృథస్నానము నాచరించెను.

ఆ రాత్రి మూడవ వాహనము మంగళగిరి వాహనము అనంతరము కొడిని దించుట యనెడు నుత్సవము జరిగెను. 63

ఆ మరునటి దినమున పుష్పయాగ మహోత్సవము చక్కగా నిర్వహింప బడెను. అటు పిమ్మట నితరదేశములనుండి వచ్చిన మనుజులు శ్రీనివాసుని కర్చన లొన రించిరి. 64

వచ్చిన దేవతలును, రాజులును, శ్రీనివాసుని మహోత్సవమును సేవించి తమ తమ నివాసముల కేగిరి. 66

చతుర్ముఖుడును శ్రీ వేంకటాచలపతికి నమస్కరించి యుత్సవమునంతను ముగింపజేసి తన లోకమున కేగెను. తొండమాన్ రాజును 67

శ్రీనివాసునకు నమస్కరించి యాతని యాజ్ఞను శిరసావహించి తన నగరమున కేగి శ్రీ వేంకటాచలపతి కర్చన మొనరించి 68

యా విగ్రహమును తన మందిరమున ప్రతిష్ఠించుకొని పూజించుచుండెను. 69

గోవులకును, బ్రాహ్మణులకును మేలునుకోరి తన గృహమున కేతెంచు నతిథుల మేలును కోరుచు, సత్కర్మలయం దాసక్తి కలిగి శాంతముకలవాడై, కోపమునువీడి యింద్రియములను జయించి, 70

చక్కగా సత్యముతో రాజ్యపాలనము నొనర్చుచు వైరంగమార్గమున వచ్చి శ్రీనివాసు నారాధించుచుండెను. 71

### గఙ్గాస్నానగన్తృకూర్మాఖ్యద్విజవృత్తాన్తః

కార్తికే మాసి సమ్ప్రాప్తే । దైవయోగేన భూపతే ।
సమాయయౌ ద్విజశ్రేష్ఠః । కూర్మో వాసిష్ఠగోత్రజః ॥ 72

పితు రస్థి సమాగృహ్య । గఙ్గాస్నానసముత్సుకః ।
ఆకస్మా ద్రాజనగరం । విప్రక్షత్రియసఙ్కులమ్ ॥ 73

సమన్తతః సమాకర్ణ్య । తొణ్డమాన్కీర్తిసమ్భ్రమమ్ ।
రాఘవాఖ్యసుతేనైవ । మహాలక్ష్మ్యాఖ్యభార్యయా ॥ 74

పురా ద్గృహే ద్వినిక్షిప్య । భార్యాం పుత్ర ఞ్చ సద్విజః ।
సమాసద ద్రాజగృహం । రాజదర్శనలాలసః ॥

సింహాసనగతం కాన్తం । విద్వన్మణ్డలమణ్డితమ్ ।
త మాశీర్భి ర్విశేషేణ । సంస్తుత్య పృథివీపతిమ్ ॥ 76

రాజాన మబ్రవీ ద్విప్రః । కూర్మో వేదాన్తపారగః ।

కూర్మః —

శ్రుతా బహుముఖాత్ కీర్తిః । తవ భూప! విశాంపతే ॥ 77

త చ్ఛ్రుత్వాఽద్య సమీపం తే । సమ్ప్రాప్తోఽహం నృపోత్తమ! ।
ఇతి విప్రవచః శ్రుత్వా । పూజయామాస సద్విజమ్ ॥ 78

తొణ్డమానః —

కి మాగమనకార్యం తే । త న్మమా చక్ష్వ భో ద్విజ! ।
ఇత్థ ముక్తో ఽబ్రవీ ద్రాజన్! । కూర్మో వేదవిదాం వరః ॥ 79

కూర్మః —

మత్పితా ప్రేతతాం ప్రాప్తః । కాలేన పృథివీపతే! ।
తస్యా స్థిచయం నీత్వా । గఙ్గా మజ్జనహేతవే ॥ 80

కాశీం గచ్ఛామి రాజేన్ద్ర! । మనసా కృతనిశ్చయః ।
తదైవా చ్ఛ గర్భిణీ జాతా । మమ భార్యా పతివ్రతా ॥ 81

గంగాస్నానమున కరుగు కూర్మద్విజుని వృత్తాంతము

కార్తికమాసము సమీపింపగా సదృష్టవశమున వసిష్ఠగోత్ర సంజాతుడగు కూర్మద్విజుడు 72

తండ్రిగారి అస్తికలను తీసికొని గంగాస్నానమును చేయు వేడుకతో బ్రాహ్మణ క్షత్రియులతో కూడిన రాజధానికి వచ్చి 73

తొండమానుని కీర్తివంతుడను విని రాఘవుడను పుత్రునితోను మహాలక్ష్మి యను భార్యతోను వచ్చి 74

నగరమునకు వెలుపలనే భార్యాపుత్రులనుంచి తానొంటరిగ రాజాను జూడ వలయుననెడు కోరికతో రాజగృహమును సమీపించెను. 75

పండిత ప్రకాండులతో నలంకరింపబడి సింహాసనమున కూర్చుండియున్న రాజా నాశీర్వాదములతో నధికముగ స్తుతించి 76

కూర్మద్విజుడు —

రాజా! నీ కీర్తి ననేకులవలన విని నీ వద్దకు నే దేతెంచితిన'ని పలుకగా రాజా తనిసి పూజించి 77

78

తొండమానుడు —

' బ్రాహ్మణోత్తమా! మీ రాకకుగల కారణమేమియో తెలుపుడ'ని యడిగెను. అంత బ్రాహ్మణుడు 79

కూర్మద్విజుడు —

తండ్రి సమయానుసారముగ మరణించెను. అతని అస్థికలను తీసికొని గంగలో వ... లెననె 80

...మున విశ్రయించుకొని కాశికి పోవుచున్నాను. కాని దైవానుగ్రహమున పతివ్రతయగు నా భార్య గర్భవతియై యున్నది. 81

పఞ్చవర్ష శ్చ మే పుత్రో । న శక్తో గన్తు మాత్మనా ।
తస్మా త్త్వయా మహారాజ ! । రక్షణీయౌ చ తా వుభౌ ॥ 82

అశక్తో ఽహం తయా గన్తుం । గర్భిణ్యా తు ద్విజప్రియ ! ।
స్త్రీణాం పత్యు ర్గృహే వాసో । నియత శ్చోదితో ఽన్యథా ॥ 83

పిత్రోః సమీపే వా సన్తు । తదభావే స్వసు ర్గృహే ।
అథవా మాతులగృహే । త్వ థవా రాజమన్దిరే ॥ 84

షడే తే పితరః స్త్రీణాం । ఇతి జానామి తత్స్థితిమ్ ।
తస్మా త్త్వం రక్ష రాజేన్ద్ర । సుతం భార్యా శ్చ గర్భిణీమ్ ॥ 85

ఇత్యేవ ముక్తో విప్రేణ । కూర్మసంజ్ఞేన తొణ్డమాన్ ।
"బాఢ" మిత్యుక్తవాన్ రాజన్ ! తస్య దత్వా ధనం బహు ॥ 86

తత్ర సంస్థాప్య తౌ విప్రో । బాష్పసందిగ్ధలోచనః ।
అబ్రవీ త్ససుతాం పత్నీం బాష్పపర్యాకులేక్షణామ్ ॥ 87

"గచ్ఛామ్య హం వరారోహే ! । గఙ్గాం భాగీరథీం ప్రియే ! ।
మారోదీ స్త్వం వరారోహే । పశ్య పుత్రం భయాఽఽకులమ్ ॥ 88

ఇత్యే వ ముక్త్వా సా విప్ర । పత్నీ భర్తార మబ్రవీత్ ।
నిజనాథస్య వదనం । పశ్యన్తీ దుఃఖభాగినీ ॥ 89

శీఘ్ర మాగచ్ఛ భోః స్వామిన్ ! । కృత్వా గఙ్గావగాహనమ్ ।
పుత్రో ఽపి తే మహాప్రాజ్ఞః । త్వా మేవ మనుమన్యతే ॥ 90

ఇత్థం వద న్తీం స్వాం భార్యాం । పశ్య న్నాలిఙ్గ్య చాత్మజమ్ ।
జగామ విప్రో రాజేన్ద్ర । పశ్య న్నైవ పృష్ఠతః పునః ॥ 91

సా జగా మ గృహం రాజ్ఞః । పశ్య న్తీ పతి మాత్మనః ।
పరిమృజ్యా క్షిజం తోయం । సా న్త్వయిత్వా సుతం తథా ॥ 92

రాజపత్నీం సమాసాద్య । పుత్రేణ సహ సా స్థితా ।
గతే విప్రే స రాజర్షిః । తస్య భార్యా శ్చ సున్దరీమ్ ॥ 93

అయిదు సంవత్సరములుగల నా పుత్రుడు నా వెంట రాజాలడు. కావున వారి విరుపురను కాపాడవలెను. 82

నేను గర్భిణియగు నా భార్యను తోడ్కొని పోజాలను. స్త్రీలకు భర్తవెంట నుండుట భాగ్యము. లేకున్నచో 83

పుట్టినింటగాని అదిలేకున్న అత్తవారింటగాని లేక మేనమామల యింటగాని లేకున్న రాజమందిరమునకాని యుండుట భాగ్యమైయున్నది. 84

తల్లిదండ్రులు, అత్తమామలు, మేనమామ, రాజు వీరాగ్గురును స్త్రీలకు సమానముగా గౌరవింపతగినవారు. కావున నీవు నా పుత్రుని, గర్భిణియగు భార్యను కాపాడుమ'ని

ప్రార్థింపగా రాజు బ్రాహ్మణునకు చాల ధనము నొసంగి యంగీకరించెను. 86

అంత నా బ్రాహ్మణుడు భార్యాపుత్రుల నచ్చటనే యుంచి తాను కన్నుల నీరు నింపుకొనుచు దుఃఖించుచున్న భార్యను గాంచి 87

సుందరీ! నేను భగీరథునిచే కొనిరాబడి భాగీరథియని పేరుగాంచిన గంగలో స్నానముచేయ నేగుచున్నాను. నీవు దుఃఖింపవలదు. భయభ్రాంతుడగు పుత్రుని గాంచుమ'ని

యూరడించెను. ఆమెయు దుఃఖించుచు భర్త ముఖమునుగాంచి 89

స్వామీ! గంగలో స్నానమాచరించి త్వరలో వచ్చివేయుడు. మీ బుద్ధిశాలి యగు పుత్రుడును మిమ్ముల నిట్లే నమ్మతించుచున్నాడ'ని 90

పలుకగా నిట్లు మాటాడుచున్న భార్యను, పుత్రుని కౌగలించుకొని మరల మరల వెనుకకు తిరిగి జూచుచు వెడలిపోయెను. 91

ఆమెయు తన భర్తను వెనుదిరిగి చూచుచునే రాజమందిరమునకేగి కండ్లనీరును తుడిచికొని పిల్లవాని నోదార్చి 92

రాణివద్దకేగి పిల్లవానితో కూడ నిలచెను. తొండమానుడు బ్రాహ్మణుడు వెడలి నంతనే యాతని భార్యను ఆమె సౌందర్యమునుగాంచి 93

దృష్ట్వా చిన్తాకులో భూత్వా । మనసీ త్థ మచిన్తయత్ ।
త్రివిధాః పురుషాః ప్రోక్తాః । ధియ స్తేషాం పృథ గ్విధాః ॥ 94

తస్మా న్మయా ఽతియత్నేన । స్థాపనీయా ద్విజప్రియా ।
ఇతి సఞ్చిన్త్య ధర్మాత్మా । తొణ్డమాన్ రాజస త్తమః ॥ 95

ఏకాన్తే భవనం కృత్వా । స్థాపయామాస తత్ర తామ్ ।
అన్నం షణ్మాసపర్యాప్తం । సకృ త్సోపస్కరం దదౌ ॥ 96

తణ్డులాద్యై శ్చ కాష్ఠాద్యైః । సర్వోపకరణై స్సమమ్ ।
తద్గృహం శృఙ్ఖలై ర్బద్ధ్వా । స రాజా తొణ్డమా న్నృపః ॥ 97

దూతాన్ విధాయ పై దూరే । చా ర్ధక్రోశాయతే నిజే ।
గృహ ఏవ క్వచి త్కోణే । నిగూఢం తాం దదా వ్యధాత్ ॥ 98

దూర్తానా న్తు యథా సే యం । న గచ్ఛే ద్గోచరం దృశామ్ ।
తతో రాజ్యే సమాసక్తో । రాజా కార్యవశం గతః ॥ 99

రాజ్యభారేణ రాజేన్ద్ర! । వ్యస్మర ద్బ్రాహ్మణప్రియామ్ ।
ద్వివత్సరా న్తే విప్రేన్ద్రః । కృత్వా గఙ్గావగాహనమ్ ॥ 100

గయాం గత్వా గయాశ్రాద్ధం । కృత్వా నిజపితు స్తథా ।
గఙ్గాయా వివధం చో ఢ్వా । స్కన్ధదేశే ద్విజో త్తమః ॥ 101

తొణ్డమానపురం ప్రాప్య । ప్రవివేశ నృపాలయమ్ ।
రాజాన మబ్రవీ ద్రాజన్! । ఆశీర్భి రభినన్ద్య చ ॥ 102

దీర్ఘాయు ర్భవ రాజేన్ద్ర! । పుత్రవాన్ జ్ఞానవాన్ భవ ।
త్వత్ప్రసాదేన రాజేన్ద్ర! కృతం గఙ్గావగాహనమ్ ॥ 103

గఙ్గావగాహనం రాజన్! । కురుష్వైవ తజ్జలైః శుభైః ।
ఏవ ముక్త స్స రాజర్షిః । విస్మృతాం బ్రాహ్మణీం స్మరన్ ॥ 104

వత్యో బభూవ చా కస్మాత్ । దణ్డాహతఇవోరగః ।
పద్మవ్యూహే షడ్రథికైః । ద్రోణకర్ణపురోగమైః ॥ 105

కలతచెందుచు తన మనమున నిట్లు తలపోయసాగెను. "పురుషులుత్తమ మధ్యమాధములని మూడు విధములుగా నుందురు. వారి బుద్ధులును వారి వారి శ్రేణుల ననుసరించియే యుండును. 94

కావున నే నతిజాగరూకతతో నీ బ్రాహ్మణ పత్నిని కాపాడవలయును". ఇట్లు తలంచి యా ధర్మప్రవర్తనుడగు తొండమాను 95

ఒక రహస్య స్థలమున గృహమును నిర్మించి యందు దారు మానములవరకు సంభారములతో భోజనసామగ్రి నేర్పరచి 96

బియ్యము మొదలు కర్పూరమువరకు ఇతరపరికరములను ఒసంగి యా గృహ ద్వారము నినుప గొలుసులతో బంధించి 97

తన గృహముననే యొక మూలనొక మైలదూరమున తన సేవకులను కాపుదలగా నుంచి యందా విప్రపత్నిని కుమారునితో గూడ 98

దుర్మార్గుల కంటబడకుండునట్లు రహస్యముగా నుంచెను. పిమ్మట రాజు తన రాజ్యపరిపాలనా ధర్మమునసక్తుడై యుండి 99

విప్రపత్నినే మరచెను. రెండు సంవత్సరములు గడచిన పిమ్మట బ్రాహ్మణుడు గంగాస్నానము నాచరించి 100

గయకేగి తన తండ్రికి గయాశ్రాద్ధము నాచరించి గంగకావడిని భుజమున నుంచుకొని మోయుచు 101

తొండమానుని నగరములో రాజమందిరమునకేగి 102

రాజును 'దీర్ఘాయుష్మంతుడవగుము. సంతానవంతుడవగుము. జ్ఞానము వర్ధిల్లును'ని దీవించి రాజా! నీ యనుగ్రహముచే గంగాస్నానము నాచరించితిని. 1‹ 3

ఈ నీ గంగాజలముతో గంగాస్నానము నాచరించిన ఫలితమునందుము'ని పలికినంతనే తొండమానుడు తాను మరచిన బ్రాహ్మణుని భార్యను హఠాత్తుగా తలంచుకొని 104

కొట్టిన పామువలెను, పద్మవ్యూహమున ద్రోణ, కర్ణ మొదలగు మహారథికుల 105

విరుద్ధానాం సైంధవేన । బాల మజ్జుననన్దనమ్ ।
విహతం పశ్యతాం రాజన్ । పాణ్డవానాం మహాత్మనామ్ ॥ 106

వాసుదేవముఖా చ్ఛ్రుత్వా । చా ర్జునస్య మనో యథా ।
రామబాణేన విద్ధస్య । రావణస్య మనో యథా ॥ 107

తథైవ తొణ్డమానస్య । హృదయం పర్యకమ్పత ।
ధైర్యేణ మనసః స్వాస్థ్యం । ప్రాప్తవాన్ సః ప్రజాపతిః ॥ 108

తదాఽహ భారతీం విప్రః । కిఞ్చిత్ దుఃఖసమన్వితః ।
రాజానం రాజశార్దూలం । పప్రచ్ఛ కుశలం తదా ॥ 109

"భార్యా మే గర్భిణీ పూర్వం । ప్రసూతా కిం సుతం సుతామ్ ।
న శ్రూయతే తయో ర్వార్తా । మమ చిత్తప్రతోషిణీ ॥ 110

పుత్రో మే నిర్గుణో రాజన్ ! । సర్వదా క్రీడనే రతః ।
తటాకే పుష్కరిణ్యాం వా । కూపే వా విపులామ్భసి ॥ 111

తస్మా న్మే మనసో దుఃఖం । సదా భావి విశాంపతే ।
భార్యా మే రాజశార్దూల । మమ దర్శనకారణాత్ ॥ 112

న చా ఽగతా వరారోహ । కుతో మే భ్రమతే మనః ।
సుతం భార్యాం చిన్తయామి । దివా నక్త మ్చ గర్భిణీమ్ ॥ 113

తస్య విప్రస్య స శ్రుత్వా । రాజా ధైర్యేణ భారతీమ్ ।
వ్యాహర త్తొణ్డమానో ఽపి । యథా ధీరో హ్యవర్తత ॥ 114

తొణ్డమానః —

భో భూమరకులోత్పన్న ! । మా భైషీః పుత్రకారణాత్ ।
క్షేమం ప్రసూతా తే భార్యా । పుత్ర్యా పుత్రేణ తిష్ఠతి ॥ 115

బహవో యోషితో విప్ర మమా దృష్టా ఇతః పురా ।
న మతో న చ తే భార్యా । మమ దృష్టిపథం గతా ॥ 116

పాండవుల లోనికి చొరకుండునట్లు సైంధవుడడ్డినంతనే వారందరు చూచు చుండగా బాలుడగు నభిమన్యుడు చంపబడినట్లు 106

శ్రీకృష్ణుని వలన విని చింతాక్రాంతుడయిన యర్జునునివలెను, శ్రీరామచంద్రుని బాణముచే గాయపరుపబడిన రావణుని మనస్సువలెను 107

తొండమానుని మనము భయాందోళనచే చలించెను. కాని ధైర్యముచే మనస్సును స్థిమితపరచుకొనెను. 108

బ్రాహ్మణుడు కొంచెము దుఃఖించుచు రాజును కుశలమడిగిన పిమ్మట మాట లాడుటయందాసక్తి కలిగియుండును. 109

నేను కాశికిపోవు సమయమున నా భార్య గర్భవతిగా నుండెనుకదా! ఆమె కిప్పుడు పుత్రుడు కలిగెనో, పుత్రిక కలిగెనో? వారి సంగతి తెలియకుండుటంచేసియు 110

నా పుత్రుడు తెలివిలేనివాడు. ఎల్లవేళలయందు నాటలతోనే పొద్దుపుచ్చును. చెరువులోగాని, పుష్కరిణిలోగాని, నీటితోనిండియున్న నూతిలోగాని 111

ప్రమాదమేమైన జరుగునేమోయనియు నా మనమాలోచనమున కలతచెందు చున్నది. నా భార్య నన్ను చూడవలయునని 112

ఇంకను రాకుండుటవలన నా మనసు భ్రాంతినొందుచున్నది. రాత్రి పవలు గర్భవతియగు భార్యాపుత్రుల విచారముతోనే గడచుచున్నవి. 113

అని పలుకగా రాజు ధీరపురుషునివలె ధైర్యము నవలంబించి 114

తొండమానుడు —

బ్రాహ్మణవంశ వంజాతా! పుత్రుని గురించిన దుఃఖమువలదు. నీ భార్య సుఖ ముగా ప్రసవించి పుత్రికతోను, పుత్రునితోను సుఖముగానున్నది. 115

చాలమంది స్త్రీలనింతకుమున్ను గాంచితినిగాని నీ పుత్రునిగాని, నీ భార్యను గాని నేనెన్నడును గాంచలేదు. 116

అథ తద్వృత్త మఖిలం । శ్రూయతాం భూసురోత్తమ ।
పూర్వదేవగురో ర్వారః । సమ్ప్రాప్త స్తు గతే దినే ॥ 117

తద్దినే వేఙ్కటేశస్య । ప్రసక్త మభిషేచనమ్ ।
తద్దర్శనార్థం మే కన్యాః । సర్వా జగ్ము ర్మహీసుర ! ॥ 118

తాభిః సమేతా తే భార్యా । పుత్రీ పుత్రసమన్వితా ।
జగామ వేఙ్కటం శైలం । దేవదర్శనకారణాత్ ॥ 119

అద్య శ్వో వా పరశ్వోవా । సా ఽఽగమిష్యతి తే ఽన్తికమ్ ।
ఇతి తం సాన్త్వయిత్వా సః । గూఢం పుత్ర మభాషత ॥ 120

గచ్ఛా ద్య పుత్ర ! భవనం । విప్రపత్న్యా స్తు శోభనమ్ ।
అవ్యగ్రః శృఙ్ఖలాం ఛిత్త్వా । ప్రవిశ్యా న్తర్గృహం పునః ॥ 121

తాం దృష్ట్వా పుత్రసహితాం । శీఘ్ర మానయ భూసురీమ్ ।
స చ గత్వా ఽతివేగేన । కృతవాన్ జనకేరితమ్ ॥ 122

దదర్శ తత్రా స్థిమాత్రం । రుదన్ దదద్గకణ్ఠవాన్ ।
ధ్రువం నో వంశనాల స్తు । ఛిన్నమూలం భవిష్యతి ॥ 123

ఇతి సఞ్చిన్తయ న్నేత్య । పితరం వాక్య మబ్రవీత్ ।
భోస్తాత ! రాజవంశస్య । నాశకాలః సమాగతః ॥ 124

యతః సా బ్రాహ్మణీ పూర్ణ । గర్భా సహసుతా మృతా ।
అస్థిభూతా నిజే గేహే । తదన్నాద్యవిచారణాత్ ॥ 125

ఇత్యు క్తో విప్రవర్యాయ । పాకార్థం తణ్డులాదికమ్ ।
దదౌ ధైర్యేణ రాజేన్ద్ర ! । స జగామ జలా న్తికమ్ ॥ 126

తస్మిన్ గతే విప్రముఖ్యే । రాజా శేషాచలం యయౌ ।
పుత్రేణ సహితో రాజా । శరణార్థం రమాపతేః ॥ 127

వారి చరిత్రనంతను తెలిపెదను. వినుము. భృగువాసరము (శుక్రవారము) నకు ముందటి దినమున (లక్ష్మివారమున) పగలంతయు గడచిన పిమ్మట 117

శ్రీ వెంకటాచలపతి కభిషేకము జరుగును. దానిని సేవించుటకై నా పుత్రు లందరును వెళ్లియుండగా 118

వారితో నీ భార్యయు తన యిరువురు బిడ్డలను తోడ్కొని దేవదర్శనమునకై వేంకటాచలమున కేగినది. 119

నేడుగాని రేపుగాని ఎల్లుండిగాని నీ వద్దకు రాగలదని యాతని నోదార్చి తన పుత్రునితో రహస్యముగా 120

శ్రీనివాసా ! నీవిప్పుడే బ్రాహ్మణుని భార్యనుంచిన గృహమునకు జని ముందు వెనుక లాలోచింపక గొలుసులను ఛేదించి లోన ప్రవేశించి 121

బిడ్డలతోనున్న యా బ్రాహ్మణుని భార్యను తోడ్కొనిరమ్మ'ని యాజ్ఞాపించెను. అతడట్లే తండ్రి యాజ్ఞప్రకారము జని 122

అచ్చట యస్థికలను మాత్రముండుటనుగని దుఃఖించుచు వణకుచున్న కంఠ స్వరముతో 'మా వంశము నేటితో సమూలముగా నశించున'ని 123

విచారించుచు తండ్రివద్దకేగుదెంచి 'నాయనా ! రాజవంశము నశించిపోవు సమయము వచ్చినది. 124

ఆ బ్రాహ్మణుని భార్య పూర్ణగర్భవతియై బాలునితోగూడ మృతినందినది. వారికి అన్నపానాదులున్నది లేనిది మనము తెలిసికొనకుండుటవలన నా గృహముననే మృతి నొంది యస్థికలు మాత్రము మిగిలినవ'ని తెలిపెను. 125

రాజు బ్రాహ్మణోత్తమునకు వంటచేసికొనుటకై బియ్యము మొదలగువానిని ధైర్యముతో నొసంగెను. ఆ బ్రాహ్మణుడు వంటచేసికొనుటకై తటాకమువద్ద కేగెను. 126

ఆ బ్రాహ్మణుడు వెడలినంతనే రాజు శేషాద్రికి తన పుత్రునితోగూడ శ్రీనివాసుని శరణువేడుటకై వెడలెను. 127

పాదద్వయం ప్రపన్న స్తు । రుద న్నాసీ న్మహీపతిః ।
రుద న్త మ్చ నృపం దృష్ట్వా । శ్రీనివాస స్తదా ఽబ్రవీత్ ॥ 128

లొణ్డమాన ప్రార్థనయా భగవత్కృత కూర్మద్విజపుత్రాద్యుజ్జీవనక్రమః

శ్రీ భగవాన్ —

అకాలే చ కిమర్థం త్వం । ఆగతో నృపస త్తమ ! ।
రాజరాజ ! కిమర్థం త్వం । రోదనం కురుషే ఽధునా ॥ 129

ధీరశ్చ మ్చ ధనుష్మ త్త్వం । ప్రసిద్ధం భూతలే తవ ।
అద్య కిం కారణం తాత ! । రోదనే వద త న్మమ ॥ 1·0

ఇత్యు క్త శ్రీనివాసేన । నా బ్రవీత్ స చ కిఞ్చన ।
విదిత్వా హృదయం తస్య । జగాద వచనం తతః ॥ 131

విదితం హృదయం రాజన్ ! । ఆతురస్య తవా ధునా ।
త్వయా కృత మిదం పాపం । మయైవా చరితం నృప ! ॥ 132

నివ ర్తస్వ చ పాపాత్మన్ ! । కిం కరోమి నృపాత్మజ ! ।
అకార్యం కర్మ భూపాల ! । త్వయా కృత మరిన్దమ ॥ 133

అహం పాపో దురాచారో । నిత్యదుఃఖసమన్వితః ।
హా ఽకాలే కాల మేష్యామి । కౄరం వా నరకం నృప ! ॥ 134

అదాతవ్యం హి దౌర్భాగ్యం । స్వభ క్తస్య దురాత్మనః ।
దరిద్రత్వం తథా భ క్త । న్యై వం ధర్మవిదో విదుః ॥ 135

మయి తే భ క్తిభావే చ । లోపో నై వ త్వయా కృతః
కిం కరోమి క్వ గచ్ఛామి । క్రూరం పాపం త్వయాకృతమ్ ॥ 136

తథాఽపి తవ సౌహార్దాత్ । కరిష్యే జీవితాన్ మృతాన్ ।
కలౌ వేఙ్కటనాథేన । నృపస్యా స్య విమోక్షణమ్ ॥ 137

కృతం మహాపాతకినః । ఇతి కీ ర్తి ర్భవిష్యతి ।
పుత్రం ప్రేషయ భూపాల ! । శాపభీరు మరిన్దమ ! ॥ 138

అచట శ్రీనివాసుని పాదపద్మముల నాశ్రయించి బిగ్గరగా నేడ్చుచుండెను. అట్లు విలపించుచున్న రాజునుగాంచి శ్రీనివాసుడు 128

## తొండమానుడు ప్రార్థింపగా శ్రీనివాసుడు కూర్మద్విజుని సంతానమును భార్యను బ్రతికించిన విధము

శ్రీ భగవానుడు —

రాజరాజా! నీ వెందులకు వేళకానివేళ వచ్చితివి? నీ వెందుల కిట్లు విలపించుచున్నావు? 129

భూలోకమున నీవు ధీరుడవనియు గొప్ప విలుకాడవనియు ఖ్యాతినార్జించితివి నీ విపు డిట్లేడ్చుట కేమి హేతువని 130

యడిగినను రాజు ప్రత్యుత్తర మీయకుండుటచే నాతని మనస్సును తెలిసికొని 131

రాజా! విచారగ్రస్తుడవగు నీ చిత్తము నెఱింగితిని. నీవు చేసిన యీ పాపము నే నాచరించినట్లే. 132

పాపాత్ముడా! మరలిపొమ్ము. నేనేమి చేయుదును! చేయరాని దుష్కృత్యము నొనరించితివి. 133

పాపాత్ముడను, దుర్మార్గప్రవర్తకుడను, అన్ని సమయములయందు దుఃఖార్తుడనగు నేను నయము మళ్ళకమున్నే చనిపోవుటయో, ఘోరనరకము నొందుటయో తప్పదు.

నా భక్తు డెంత దురాత్ముడైనను దురదృష్టమునుకాని, దరిద్రమునుకాని, యాతని కొనంగరాదని ధర్మశాస్త్రము నెఱింగినవారు వచింతురు. 135

నా యందు నీకుగల భక్తిలో నెన్నటికిని లోపములేదు. నేనేమి చేయుదును? ఎచటి కేగుదును? నీవు చేయరాని పాపము నాచరించితివి. 136

కాని నీ యందలి స్నేహభావముచే చనిపోయిన వీరిని బ్రతికింతును. కలియుగమున శ్రీ వేంకటాచలపతిచే 137

మహాపాపాత్ముడైన తొండమానుని ఘోరపాపము నశింపజేయ బడెన'ను కీర్తి నాకు కలుగగలదు. శాపమువలన భయపడుచున్న నీ పుత్రుని 138

తేషాం మృతానా మానేతుం । సర్వాణ్యస్థీని సమ్ప్రతి ।
ఇతి శ్రీవేఙ్కటపతేః । వాక్యం శ్రుత్వా స చా ఒతురః ॥ 139

ప్రేషయామాస పుత్రం తా । న్యస్థీ న్యానేతు మాత్మనః ।
స జగామా తివేగేన । మృతానాం భవనం నృప ॥ 140

బద్ధ్వా తదస్థినిచయం । వస్త్రేణా చ్ఛాద్య భూపతే ! ।
నరయానే వినిక్షిప్య । స్వాచ్ఛాద్య నృపనన్దనః ॥ 141

తదా శేషగిరిం ప్రాప్య । పితరం వాక్య మబ్రవీత్ ।
"త దస్థి మణ్డలం తాత ! । సమ్ప్రాప్తం విద్ధి భూపతే ॥ 142

శ్రీనివాసాయ శాన్తాయ । తదా ఒఒనీతం వదా ధునా" ।
స పుత్రవచనం శ్రుత్వా । శ్రీనివాస మభాషత ॥ 143

రాజా —

సమానీతః పుత్రకేణ । మృతాస్థినిచయో హరే ! ।
యథా తే జీవితం కృష్ణ ! । ప్రాప్నువన్తి తథా కురు ॥ 144

ఏవ ముక్తః శ్రీనివాసః । తదస్థినిచయం నృప ।
కరాభ్యాం ప్రతిగృహ్యై ధ । స్వోత్తరీయే బబన్ధ హ ॥ 145

స్వామిపుష్కరిణీ యత్ర । తస్య పూర్వదిశి స్థితమ్ ।
పాణ్డుతీర్థం సమాసాద్య । తస్య తీర ముపాగతః ॥ 146

తత్ర కిఞ్చి ద్దేవఖాతం । ఆసాద్య మధుసూదనః ।
తొణ్డమాన ఇచ్ఛ తత్పుత్రం । త్యక్త్వా తీర్థ ముపాగతః ॥ 147

ఆకణ్ఠజలమధ్యే చ । నిమమజ్జ్య జనార్దనః ।
అస్థీని తత్ర నిక్షిప్య । శిలాయాం తీర్థసన్నిధౌ ॥ 148

ప్రక్షాల్య విష్ణుః పస్పర్శ । స్వాఞ్జలిక్షిప్తవారిణా ।
జీవనం సన్నిపతితం । తదస్థినిచయే తదా ॥ 149

ఆ చనిపోయినవారి యస్థికలను గొనితెచ్చుటకు పంపించుమ'ని యాజ్ఞాపింపగా వ్యాధిగ్రస్తుడవలెనున్నరాజు 139

యస్తికలను గొనితెచ్చుటకై తన పుత్రుని పంపించెను. ఆతడా బ్రాహ్మణ పత్ని పుత్రుల చనిపోయిన గృహమున కేగి 140

ఆ యస్థికలను మూటకట్టి పైన కనబడకుండునటుల వస్త్రముతో కప్పి పల్లకిలో నుంచుకొని పల్లకి చుట్టును బట్టను కప్పి 141

శేషాద్రిని సమీపించి తండ్రితో 'నాయనా ! అస్థికల నన్నిటిని గొని తెచ్చితిని. 142

శ్రీనివాసుని కీ వార్త నెఱింగింపు'మని తెలుపగా పుత్రుని పలుకు లాలకించి రాజు శ్రీనివాసునితో — 143

రాజు —

శ్రీనివాసా ! నా పుత్రుడు చనిపోయినవారి అస్థికలను తెచ్చి యున్నాడు. వారిని బ్రతికింపుమ'ని 144

ప్రార్థింపగనే శ్రీనివాసుడా యస్థికలను తన చేతులతో తీసికొని తన పైబట్టలో ముడివేసి 145

స్వామిపుష్కరిణికి తూర్పునమన్న పాండుతీర్థమును సమీపించి దాని తీరము నందలి ఒక పుణ్య తీర్థస్థానమునకు 146

దేవతలచే త్రవ్వబడిన పుణ్యతీర్థమునకు తొండమాన్ రాజును ఆతని కుమారుని విడిచి వెళ్ళి 147

తీరమునందలి రాతిపై యస్థికలనుంచి కంఠమువరకు లోతుగా నీళ్ళలోదిగి స్నానమాచరించి 148

తన దోసిటిలోనున్న యుదకముతో వాటిని చక్కగా కడిగినంతనే యా యస్థికలకు ప్రాణము వచ్చెను. 149

ఇతి తే జీవితా విష్ణోః । పాణిస్పర్శప్రభావతః ।
వవృషుః పుష్పవర్షాణి । తత్రైత్య వాసవాదయః ॥ 150

విస్మేరచిత్తాః సర్వే ఽపి । దృష్టతత్తీర్థవైభవాః ।
యదా తీర్థప్రభావేణ । జీవితా మృతకాశ్చ తే ॥ 151

తదా సర్వే సురా రాజన్ ! । బ్రహ్మరుద్రేన్ద్రపూర్వకాః ।
"అస్థితీర్థ మితి ఖ్యాతం । తస్య నాను దదు ర్ముదా ॥ 152

"యేషా మత్రాస్థి నిపతేత్ । నరకే వసతా మపి ।
తే సర్వే స్వర్గ మృచ్ఛన్తు । సద్య" ఇత్యపి తే ఽవదన్ ॥ 153

ఉజ్జీవయన్ సో ఽథ మృతాం సపుత్రాం । తాం కూర్మభార్యాం నిజగర్భవాసితామ్ ।
దదౌ నృపాయాతి విమూఢచేతసే । దత్త్వా ఽథ తం పార్థివ మాబభాషే ॥ 154

శ్రీ భగవాన్ —

కృతోపకారస్య కృతా హ్యు ప్రక్రియా । శతాధికా తే నృపతే మయా ఽధునా ।
తవా గ్రజస్యాప్తతయా కృతా మయా । హ్యుప్రక్రియే యా ధరణీపతే ! తవ ॥

ఇతః పరం మౌన మహం ప్రపద్యే । నాత్యన్త మేకాన్తజనా త్పరేణ ।
కేనా పి కుర్వే సహ వాగ్విలాసం । సాక్షాత్ కలా వన్యముఖా ద్ధిభాషే ॥ 156

గచ్ఛ త్వదీయం పుర మద్య రాజన్ । తస్మై మ్ద్విజాయా ఖిలలోకసాక్షిణీమ్ ।
భార్యాం సపుత్రా మతిభక్తియుక్తాం । ప్రదాయ రాజ్యం త్వ మకణ్టకం కురు ॥

తొణ్డమానాజ్ఞయా స్వావాసం ప్రతి సకుటుమ్బకూర్మద్విజాగమనమ్.

ఇత్యుక్తో వాసుదేవేన । తత్పత్నీసహితో నృపః ।
గత్వా చ నగరం పుత్ర । సహితః కూర్మ మబ్రవీత్ ॥ 158

భూదేవ ! తవ భార్యే యం । సుపుత్రీ పుత్రసంయుతా ।
పత్న్యాప్తా దైవయోగేన । తాం గృహ్ణీష్వ ద్విజోత్తమ ॥ 159

ఇట్లు బ్రాహ్మణపత్నియు, పుత్రుడును, పుత్రికయు శ్రీనివాసుడు చేతితో స్పృశించినంతనే పునర్జీవితులైరి. ఆ తీర్థమున దేవేంద్రాదులు పుష్పవర్షమును కురిపించిరి.

దేవతలందరు నాశ్చర్యచకిత మానసులై యా తీర్థవైభవమును గాంచి తీర్థ ప్రభావముచే చనిపోయినవా రుజ్జీవించుటంజేసి 151

దీని "కపిలతీర్థ" మని బ్రహ్మరుద్రేంద్రాది దేవత లందరును పేరుంచిరి. 152

మరియు బ్రహ్మాదిదేవత లందరును "నరకములో నివసించువారి యస్థికలిందు పడినను వా రందరు వెంటనే స్వర్గమునే పొందుదురు"నియు పలికిరి 153

అంత శ్రీనివాసుడు చనిపోయి తన గర్భమునన్న బ్రాహ్మణ పత్నిని సంతానముతో సజ్జీవింపజేసి దిక్కుతోచక వెంగగొనియున్న రాజును కప్పగించి యాతనితో 154

రాజా ! నీ వలన చాల నుపకారమును పొందియున్నవాడ నగుటచే నే నిపుడు నీకు నూరురెట్లధికముగా నుపకార మొనర్చియున్నాను. నీ యన్నయగు నాకాశరాజా నాకు అప్తదగుటంజేసి నీ కీ యుపకారము నొనరించితిని. 155

నే నీ నాటినుండియు మౌనమును వహించి నా కత్యంత ప్రియతములగు జను నితో తప్ప నితరులెవ్వరితోడను సాక్షాత్తుగా మాట్లాడజాలను. కలియుగమున నితరులవల ననే ఒకరియం దావేశించి నా యభిప్రాయము నెఱింగింతును. 156

రాజా ! నీవు నీ నగరమునకేగి పతిభక్తిగల యా బ్రాహ్మణపత్నిని సంతాన ముతోగూడ నెల్లరు జూచుచుండ బ్రాహ్మణున కర్పించి నీవు రాజ్యమును నిరాటంకముగ పాలింపుమని యానతిచ్చెను. 157

## తొండమానుని యాజ్ఞనుగొని కూర్మద్విజుడు సకుటుంబముగా తన నివాసమున కరుగుట

అంత రాజు బ్రాహ్మణుని భార్యను వెంట నిడికొని తన పుత్రునితో తన పుర మున కరిగి బ్రాహ్మణునితో - 158

కూర్మద్విజా ! అదృష్టవశమున లభించిన నీ భార్యను పుత్ర, పుత్రికల సంతానముతో గ్రహింపుమని పలికి 159

ఇత్యు క్త్వా స సుతాం పత్నీం । స విప్రాయ న్యవేదయత్ ।
వృత్తా న్త మఖిలం జ్ఞాత్వా । పత్న్యై రాజముఖా ద్ద్విజః ॥ 160
రాజ్ఞః సమక్షం పప్రచ్ఛ । పత్నీం శిశుసమన్వితామ్ ।
క్వ గతా ఽసి మహాభద్రే ! । యథావ త్కథ్యతా మితి " ॥ 161

మహాలక్ష్మీః —

కిం వదిష్యామి హే స్వామిన్ ! । దేవమాయాం దురత్యయామ్ ।
శిశో్యదరే మయా దృష్టో । విచిత్రో లోకవి స్తరః ॥ 162
లోకాలోకా మయా దృష్టా । దృష్టా బ్రహ్మముఖా స్సురాః ।
సాత్త్వికా రాజసా శ్చైవ । తమః ప్రకృతయ స్తథా ॥ 163

రాఘవః —

తాతా ద్భుతం మయా దృష్టం । త్రినేత్రాణాం గణా స్తథా " ।

శిశుః —

సాగరాః స ప్త మే తాత ! । దృష్టిమార్గముపాగతాః ॥ 164
గుహాగిర్యటవీవృక్షాః । దేవదానవరాక్షసాః ।
ఇత్యు క్తో లజ్జితో ఽవాదీత్ । పత్నీసుతశిశూన్ ద్విజః ॥ 165
ధి జ్మే జన్మ తపో ఘోరం । ధి గ్వేదాధ్యయనం తథా ॥ 166
నారాయణస్యా ఖిలలోకధామ్నాం । నివాసభూతస్య చరాచరాణామ్ ।
దృష్టం భవద్భి ర్జఠరే విచిత్రం । భూగోళముఖ్యాఖిలలోకజాలమ్ ।
త్రినేత్రముఖ్యైః సహ చీర్ణపూర్ణ । పుణ్యై రపీ దం మనుజై ర్న లభ్యమ్॥ 167
ఇత్యే వం సంస్తువన్ స్వీయాన్ । పత్నీసుతశిశూన్ ద్విజః ।
రాజానం చాపి సంస్తుత్య । దేశం గన్తుం ప్రచక్రమే ॥ 168

రాజా —

అహో భాగ్య మహో భాగ్యం । త్వత్పత్నీసుతయోః శిశోః ।
యు ద్దృష్టం శ్రీనివాసస్య । జఠరే సర్వమద్భుతమ్ ॥ 169

సంతానముతో నామెను బ్రాహ్మణున కప్పగించెను. జరిగిన తన భార్యయొక్క వృత్తాంతమునంతను రాజువలన విని 160

రాజునకెదురుగనే బ్రాహ్మణుడు బిడ్డలతోకూడియున్న భార్యను "కల్యాణీ! నీవెచట కేగితివో నిజముగా తెలుపుము"ని యడిగెను. 161

మహాలక్ష్మి —

ఆ మాటలకామె "స్వామీ! దాటశక్యముగాని దేవమాయ నేమని వర్ణింతును. ఆ భగవంతుని గర్భమున విచిత్రమగు విస్తరించిన లోకమునంతను గాంచితిని. 162

లోకాలోకపర్వతములను గాంచితిని. బ్రహ్మాదిదేవతలను గంటిని. సత్వగుణ స్వభావము కలవారిని, రజోగుణ స్వాభావికులను, తమోగుణ ప్రధానులగువారిని సాక్షాత్కరించితిన'ని తెలిపెను. 163

రాఘవుడు —

పుత్రుడగు రాఘవుడు—నాయనా! నేను శ్రీనివాసుని గర్భమున సూర్యనేత్రుని గణములను గాంచితిననియు, చంటిపాప 'తండ్రీ! సముద్రముల నేడింటిని 164

గుహలను, పర్వతములను, విపినములను, వృక్షములను, దేవ, దానవ, రాక్షసులను శ్రీనివాసుని గర్భమున వీక్షించితిన'ని తెలిపిరి. ఆ వృత్తాంతమును విని బ్రాహ్మణుడు మిక్కిలి సిగ్గుచెంది వారితో— 165

నా జన్మ వ్యర్థము. నా ఘోరతపము వ్యర్థము. వేదాధ్యయనము నిష్ఫలము. 166

సకల చరాచరముల కాశ్రయమైనవాడును సమస్త లోకములకాధారమైన శ్రీమన్నారాయణుని గర్భమున మీరు భూగోళమాదిగా సకలలోకములను గాంచగలిగితిరి. ఎన్ని పుణ్యముల నాచరించినను పరిపూర్ణ పుణ్యశాలియైన మనుజునికైనను, రుద్రాది దేవతలకైన నిట్టి దర్శన మలభ్యముకదా! 167

అని తన భార్యాపుత్ర పుత్రికల యదృష్టమును స్తుతించుచు రాజును కీర్తించి తన దేశమునకు వెడల నుద్యుక్తుడాయెను. 168

రాజు —

రాజాతనితో - బ్రాహ్మణోత్తమా! నీ భార్యాపుత్ర పుత్రికల యదృష్టమే యదృష్టము. శ్రీనివాసుని గర్భమున సకలాశ్చర్యములు గాంచగలిగినవారి యదృష్టమపారమని 169

ఇత్యుక్తో నృపవర్యేణ । సహభార్యః సుతాన్వితః ।
జగామ విప్రముఖ్యో ఽసౌ । రఙ్గక్షేత్రం స్వకాశ్రమమ్ ॥ 170

శ్రీనివాసప్రసాదేన । తొణ్డమాన్ భక్తిసమ్భృమాత్ ।
సవిప్రః సహితః పుత్ర । భార్యాభ్యాం భవనం యయౌ ॥ 171

విసృజ్య విప్రం భూపాలః । సకుటుమ్బం సపుత్రకమ్ ।
దధ్యౌ చిత్రం హరేః కర్మ । విగ్రహం తస్య చాత్మని ॥ 172

వ్యచిన్తయ ద్వేఙ్కటనాథవైభవం । తీర్థానుభావం ద్విజదేవభక్తః ।
కరోమి కిం వేఙ్కటనాథ తుష్టయే । దాస్యామి కిం తస్య హరేః ప్రపత్తయే॥ 173

## అఙ్గిరసోక్త్యా శ్రీనివాసాయ తులసీ మర్పయన్తం తొణ్డమానం ప్రతి భగవదుక్తిః

ఇతి చిన్తాపరారో భూత్వా । విప్రాన్ వేదవిదో ఽబ్రవీత్ ।

తొణ్డమానః —

భూదేవః దేవతుష్ట్యర్థే । క ఉపాయో హ్యనామయః ।
కథం తుష్యతి గోవిన్దో । వద మే గురుసత్తమ ॥ 174

రాజ్ఞ స్తు వచనం శ్రుత్వా । నృప మాఙ్గిరసో గురుః ।
అబ్రవీ చ్ఛ్రీనివాసస్య । విగ్రహో ద్భుత మాతురమ్ ॥ 175

గురుః —

తదనుగ్రహసిద్ధ్యర్థం । తత్పూజాం కురు భోనృప ।
సహస్రనామభి ర్దివ్యైః । సహస్రై స్తులసీ దళైః ॥ 176

తత్ప్రీతిహేతు స్తులసీ । తస్మా త్త్వం పూజయా చ్యుతమ్ ।
తేనా పరోక్ష మాయాతి । తవ వేఙ్కటవల్లభః ॥ 177

తత స్తద్వచనం శ్రుత్వా । త చ్చకార తథా నృపః ।
తులసీదళసాహస్రం । స్వర్ణరత్నంవినిర్మితమ్ ॥ 178

పంతుమండగా తన భార్యాపుత్రులను వెంట నిడుకొని తన యాశ్రమమున్న శ్రీరంగక్షేత్రమునకు బ్రాహ్మణుడు వెడలిపోయెను. 170

తొండమానుని భక్తి తాత్పర్యమునను శ్రీనివాసుని యనుగ్రహమునను ఆ బ్రాహ్మణుడు తన భార్యాబిడ్డంతో తన నివాసమున కరిగినంతనే 171

తొండమానుడు బ్రాహ్మణుని కుటుంబముతో పంపి శ్రీమన్నారాయణుని విచిత్ర కృత్యమును, తనయం దాతనికిగల కోపమును తలంచి 172

బ్రాహ్మణులయందును, దైవమునందును భక్తిగల రాజు శ్రీ వెంకటాచలపతి వైభవమును పాండుతీర్థ మాహాత్మ్యమును తలంచుకొనుచు శ్రీ వెంకటాచలపతికి తన యం దనుగ్రహము కలుగుట కేమి చేయుదును ? ఏ మెవరంగుదునని 173

## అంగిరస మహర్షి చెప్పగా శ్రీనివాసునకు తులసీ దళముల నర్పించు చున్న తొండమానునితో శ్రీనివాసుడు మాట్లాడుట

విచారించుచు వేదవేత్తలగు బ్రాహ్మణులను రప్పించి "బ్రాహ్మణోత్తమా ! ఆచార్యవర్యా ! శ్రీనివాసుని సంతసింపజేయుట కుపాయమేమి ? గోవిందు డెట్లనుగ్రహించునో తెలుపుడని ప్రార్థించెను. 174

శ్రీనివాసునికి తనపైగల కోపమును తలంచుకొని భయపడుచు దైన్యతనొంది యున్న రాజును గాంచి గురుడగు నంగిరసుడు — 175

గురువు —

శ్రీనివాసుని యనుగ్రహము లభింపవలెననిన ఆయనయొక్క దివ్యమైన సహస్రనామముల నను సంధించుచు సహస్ర (వేయి) తులసీ దళములచే నాతని నర్చింపుము. 176

శ్రీనివాసునకు తులసి ప్రియమైనది. కావున నీవు దానితో నాతనిని పూజింపుము. దానిచే శ్రీనివాసుడు నీకు ప్రత్యక్షమగు 177

నని తెలుపగా రాజప్పుడని రత్నఖచితమైన వేయి బంగరు తులసీ దళములను చేయించి 178

వేఙ్కటేశాత్మకై ర్నామ । సహస్రై స్తత్పదే ఽర్పయన్ ।
క్రమేణ మాసత్రితయం । పూజాం తస్య చకార సః ॥ 179

ఏవం పూజాం కృతవతి । భూపాలే భూరివిక్రమే ।
త్యక్తవాన్ న చ వైముఖ్యం । నారాయణగిరీశ్వరః ॥ 180

తదా స రాజా దుఃఖేన । స్వజ్ఞం వాక్య మబ్రవీత్ ।

తొణ్డమానః —

భక్తానా మపరాధాన్ న । గణయన్తి గుణాధికాః ॥ 181

క్షమస్వ మమ దౌరాత్మ్యం । భక్తస్య పురుషోత్తమ ! ।
వరదానే వాసుదేవః । భవాన్ శ్రేష్ఠతమో మతః ॥ 182

దయాం కురు దయాసిన్ధో ! । భక్తోపరి భయాపహ !
ఇత్యుక్త స్తొణ్డమానేన । భగవాన్ వేఙ్కటేశ్వరః ॥ 183

తదా ఽహ భారతీం రాజన్ ! । ఆకాశపథ మాశ్రితః ।
భక్తా శ్చ బహవః సన్తి । నాస్తి త్వత్సదృశో భువి ॥ 184

కర్మ కృత్వా సుఘోర న్తు । బ్రహ్మస్త్రీపుత్రఘాతుకమ్ ।
ప్రప్తిత్వసి కథం పారం । దుఃఖా ద్రాజకుమారక ! ॥ 185

తవా గ్రజోపకారేణ । జీవిత న్తు మయా కృతమ్ ।
ఏవ మాకాశగాం వాణీం । శ్రుతవాన్ రాజసత్తమః ॥ 186

తదా ఽఽహ దేవదేవేశం । రాజా మోహవశం గతః ।

రాజా —

కృతోపకారాః పురుషాః । న వదన్తి కృతం హరే ! ॥ 187

కో వదే ద్ధి కృతాం సేవాం । మూఢో ఽపి గుణవర్జితః ।
త్వాం వినా న హి తే భక్తః త్రిషు లోకేషు విద్యతే । 188

కో వా పుణ్యపురుష ! । త్వయ్యేకాన్తరతః సదా ।
భక్తానా మగ్రణీ శ్చాహం । దయాళూనాం త్వ మగ్రణీః ॥ 189

శ్రీ వెంకటేశుని వేయి నామములతో నాతని పాదపద్మములయందు దర్పించుచు మూడు మాసములట్లు పూజించెను. 179

ఇట్లు ప్రబల ప్రతాపవంతుడగు తొండమానుడు పూజించినను శ్రీనివాసుడాతని యందు కోపమును వీడకుండెను. 180

అపుడు రాజతిదుఃఖముతో సకల మనోగతముల వెళింగిన శ్రీనివాసునితో - ప్రభూ! గుణవంతులు భక్తుల యపరాధముల లెక్కింపరు. 181

పురుషోత్తమా! —

నా దుర్మార్గ ప్రవర్తనమును క్షమింపుము. నీ భక్తుడను. వరము లిచ్చుటలో నీవు చాల గొప్పవాడవు. 182

కరుణాసముద్రా! భయహరా! నీ భక్తుడనగు నాపై దయజూపుమని ప్రార్థింపగా శ్రీ వెంకటాచలపతి — 183

ఆశరీరవాణితో — 'రాజా! భూలోకమున నా భక్తులు చాలమంది కలరు. కాని నీ వంటివారు లేరు. 184

బ్రాహ్మణ స్త్రీ పుత్రుల చంపిన మహాఘోరపాపము నాచరించి యా దుఃఖము నుండి విముక్తి నెట్లు కోరుచున్నావు? 185

నీ యన్నయగు యాకాశరాజొనర్చిన యుపకారమును తలంచి వారిని ప్రతీకించితివ'ని పలుకగా నా మాటలను విని 186

తొండమానుడు మూర్ఛనొంది మరల శ్రీనివాసునితో ఉపకారము నొనరించిన సజ్జనులు తా మొనర్చిన యుపకారమును చెప్పుకొనరు. 187

గుణములులేని మూర్ఖులును తా నొనర్చిన మేలును తెలుపుకొనరు. ముల్లోకములయందును సన్మానించిన భక్తుడు నీకు లేడు. 188

నీ యందే యెల్లప్పుడును నిశ్చల భక్తియుక్తు డెవడు? నేను నీ భక్తులలో ముఖ్యుడను. దయగలవారలలో నీవు ముఖ్యమైనవాడవని 189

ఏవం గర్వోక్తి మాకర్ణ్య । తూష్ణీ మాసీ ద్రమాపతిః ।
తతో భూయో ఽతిభక్త్యాఽయం । పూజయామాసమాధవమ్ ।
సౌవర్ణ రత్నఖచిత । తుళసీకుసుమవ్రజైః ॥ 190

కుర్వగ్రామస్థభీమాఖ్యకులాలోదన్తః

తతః కదాచి ద్రాక్షీత్ । తొణ్డమాన్ నృపసత్తమః ।
సౌవర్ణరత్నఖచిత । తుళసీకుసుమోపరి ॥ 191

సంస్థితాం మృణ్మయీం శ్యామాం । తుళసీకుసుమావళిమ్ ।
తతః కదాచి న్నృపతిః । విరస్తా ఇ్చ సుదూరతః ॥ 192

సౌవర్ణరత్నఖచిత । తుళసీకుసుమావళిమ్ ।
దదర్శ మృణ్మయీ శ్చైవ । సులగ్నం హరిపాదయోః ॥ 193

శ్యామాం సురుచిరా మార్ద్రాం తుళసీకుసుమావళిమ్ ।
దృష్ట్వైవ శ్రీపతే స్వస్మిన్ । విగ్రహం చిన్తయ న్నృపః ॥ 194

ముక్తకణ్ఠ రుద న్నూచే । తొణ్డమాన్ భృశదుఃఖితః ।
భగవన్ ! క్రూరపాపం మాం । అనాథం కి ముపేక్షసే ॥ 195

కేన భక్తాగ్రగణ్యేన । స్వీకరోషి సమర్పితమ్ ।
మృణ్మయీ మేవ సప్రీత్యా । తుళసీకుసుమావళిమ్ ॥ 196

ఇత్యే వ ముక్తో భగవాన్ । తొణ్డమానేన వై హరిః ।
రాజానం రమణీయాఙ్గం । ప్రత్యభాషత భూపతే ! ॥ 197

తొణ్డమానం ప్రతి భగవత్ జ్ఞాపితభీమాఖ్యకులాలోదన్తః

భగవాన్ —

భక్తా శ్చ బహవ స్సన్తి । త్రిగుణా స్త్రివిధాత్మకాః ।
తేషాం మధ్యే దరిద్రో ఽస్తి । కులాలో భీమనామకః ॥ 198

గర్వముగా పలికిన రాజా మాటల నాలకించి శ్రీనివాసుడు మిన్నకుండెను. మరల తొండమాను డత్యంత భక్తిభావముతో రత్నములచే చెక్కబడిన బంగారు తులసీ దళము లనేకములచే శ్రీనివాసు నర్చించెను. 190

## కుర్వ గ్రామముననున్న భీముడను కుమ్మరి వృత్తాంతము

అంత కొంతకాలము పిమ్మట తొండమానుడు రత్నములచే చెక్కబడిన బంగారు తులసీ పుష్పములపై 19

మట్టితో చేయబడి నల్లనిగానున్న తులసీపుష్పము లుండుటను గాంచెను. మరియు నింక కొంది దినముల తరువాత 192

రత్నఖచిత బంగారు తులసీ దళములను దూరముగా త్రోసివేసి మట్టితో చేయ బడిన తులసీదళములే శ్రీమన్నారాయణుని పాదారవిందములయందు చక్కగా నమరి యుండుటను తిలకించెను. 193

నల్లగను, చాల అందముగను, తరిగనున్న తులసీ దళముల నన్నిటిని గాంచి వంతనే తనయందు శ్రీనివాసునకుగల కోపమును తలంచుచు 194

మిక్కిలి దుఃఖించుచు మహైశ్వర్యమున నేడ్చుచు శ్రీనివాసా ! ఘోరపాపము నొనర్చిన దీనుడనగు నన్ను నా పాపమునకే వదలిపైతువా ? 195

ఏ భక్తశ్రేష్ఠ డర్పించిన మట్టితో చేసిన తులసీ దళములనే నీవు సంతోషముతో స్వీకరించుచున్నావని 196

ప్రార్థింపగా సుందరుడగు తొండమానునితో శ్రీనివాసుడు — 197

## శ్రీనివాసుడు తొండమానునకు భీముడను కుమ్మరి వృత్తాంతము నెఱింగించుట

శ్రీ భగవానుడు —

రాజా ! సత్వరజస్తమోగుణములచే వేరువేరు బుద్ధులుగల భక్తులు నాకు చాల మంది కలరు. వారిలో నతి దరిద్రుడగు భీముడను కుమ్మరివా 198

అత్రై వోత్తర దిగ్భాగే । రాజన్ ! యోజనదూరతః ।
స కులాలో ఽతిభక్త్యై వ । భిత్తికాబిలమధ్యతః ॥ 199

దారుభూత ఇవ మాం శూద్రః । ప్రత్యహం పూజయత్య సౌ ।
వ్యస్థః శాన్తః స్వకృత్య ఇచ్ఛ । ప్రసమాప్య హరిప్రియః ॥ 200

స్నాత్వా విధివ దాత్మజ్ఞో । మృణ్మయై స్తులసీ సుమైః ।
తద్భక్త్యా పరితుష్టేన । తదఙ్గీక్రియతే మయా ॥ 201

తత్ర గత్వా ప్రతిదినం తం దృష్ట్వా తత్ప్రియాం తథా ।
రాజన్ బహువిధా స్సన్తి । మద్భక్తా శ్చ విరాగిణః ॥ 202

యదుక్త మ్త్వయా పూర్వం । ఏకో ఽహం భక్తిమా నితి ।
తద్వచ స్త్వదహఙ్కార । మహో ఛ్చాయవిజృమ్భితమ్ ॥ 203

తదుక్త మాకర్ణ్య వినమ్రమ స్తకః । స న్త్యజ్య చైత్యం తదను ప్రజాపతిః ।
పద్భ్యాం జగామో జ్ఝితరాజగౌరవః।తదా వ్య మార్గం ప్రణమన్ ముహు ర్ముహుః

## భీమాఖ్యకులాలనగరం ప్రతి తొణ్డమానగమనమ్

తం చక్రవర్తినం దృష్ట్వా । పద్భ్యాం ధావ న్త మాతురమ్ ।
పృచ్ఛన్తం తస్య భవనం । పరితో ఘటకారిణః ॥ 205

ప్రోచు స్తం భగవద్భక్తం । కులాలం మార్గవర్తినః ।
వసత్య త్రైవ రాజన్ ! స । కులాలో భీమనామకః ॥ 206

భక్తి ర్యస్య హరౌ కృష్ణే । సేవాం నిత్యం కరోతి యః ।
ఏవ ముక్త స్సలోకై శ్చ । పథికైః పృథివీపతిః ॥ 207

జగామ తస్య భవనం । తొణ్డమాన్ రాజసత్తమః ।
తద్గృహే ద్వహి రాస్థాయ । స్తుతవా న్తద్గృహం నృపః ॥ 208

ద్వారతోరణ మాసాద్య । పపాత గతవిభ్రమః ।
తతః కులాలో భ్రమితో । జనై ర్విజ్ఞాపిత స్తతః ।
దదర్శ రాజశార్దూలం । పతితం ప్రాఙ్గణే తదా ॥ 209

నిష్టాటినుండి యుత్తరదిశలో నొక యోజనమాత్ర దూరమున నున్నాడు. అత డతి భక్తితో గోవయుండున్న సారంగ ద్వారమున వచ్చి 199

మట్టితో చేసిన నా విగ్రహమును ప్రతిదినము పూజించును. నిర్మలమైన మనస్సు కలిగి శాంతము కలవాడై తన పూజను యథావిధిగా నిర్వహించి 200

యథాశాస్త్రముగా స్నానమాచరించి యాత్మజ్ఞానముకలవాడై. మట్టితో నిర్మించిన తులసీదళములతో నన్నర్చించును. అతని భక్తికి సంతసించి యా పూజను నే నంగీకరించుచున్నాను. 201

ప్రతిదిన మచ్చటికేగి యాతనిని, యాతని భార్యనుగాంచి వచ్చెదను. రాజా! నాకు వైరాగ్య భవసంపన్నులగు చాలమంది భక్తులు కలరు. 202

నీవు మున్ను 'నే నొకడనే నీ భక్తుడ' నని పేర్కొంటివి. ఆ మాట నీ మహదహంకార గర్వభూయిష్ఠమైనద'ని పలికెను. 203

ఆ మాటలను విని తొండమానుడు వినయముతో తలవంచి యా శేషాద్రిని వీడి. రాజమర్యాదలను వీడి యా కులాల గ్రామ మార్గమునకు మాటి మాటికి నమస్కరించుచు నడచిపోయెను. 204

## భీముడను కుమ్మరివాని పురమునకు తొండమానుడు వెళ్ళుట

కాళ్ళతో పరుగులిడుచు చూడవలెనను నాతురతతో వచ్చుచున్నట్టియు, భీముని గృహమును గూర్చి చుట్టుమున్న కుమ్మరివారి నడుగుచున్న చక్రవర్తిని గాంచి 205

" రాజా! భీముడను నా కుమ్మరిచ్చటనే యున్నాడు. అతడు శ్రీమన్నారాయణుని కత్యంత భక్తుడు. నిత్యము శ్రీమన్నారాయణ పూజానిరతుడ'ని వారిలోని జనులందరు తెలుపుచుండగా 206

207

రా జాతని గృహమునకు జని యాతని యింటిబయటనే యుండి యాతని గృహమును స్తోత్ర మొనరించి 208

ద్వారమువద్ద కేగి చైతన్యరహితుడై పడిపోయెను. అంత జనులందరును చెప్పగా కులాలు డతిసంభ్రమమున వచ్చి తన ముంగిలి వాకిలిలో పడియున్న రాజును గాంచెను. 209

కి మిదం భోః మహత్కష్టం । రాజా ఽసౌ పతితః కుతః ।
మమా పరాధో నా స్త్య త్ర । తథా ఽపి యమదణ్డనే ॥ 210

శక్తో ఽసౌ రాజశార్దూలః । సజ్జో ఽహం తస్య కర్మణి ।
నై వేద్యార్థం హరే స్తస్య । ఘటానాం శతకం మమ ॥ 211

కథితం తేన భూపేన । త దద్య ప్రదదామి తాన్ ।
ఏవం శూద్రే చో క్తవతి । రాజా సంజ్ఞా ముపేయివాన్ ॥ 212

కో ఽసౌ భీమో హరే ర్భక్తః । కులాలః కృష్ణతోషణః
తత్పాదయుగళం వన్దే । సతతం సాధు సమ్మతమ్ ॥ 213

ఏవం వదతి రాజర్షౌ । భగవాన్ భక్తవత్సలః ।
ఆవిర్బభూవ పురతః । కులాలస్య మహాత్మనః ॥ 214

ఆవిర్భూతం హరిం దృష్ట్వా । కులాలో భక్తిసంయుతః ।
తుష్టావ హర్షపుష్టాఙ్గః । శ్రీనివాసం నిరామయమ్ ॥ 215

## స్వపురస్తాత్ ప్రాదుర్భూతం భగవన్తం ప్రతి కులాలస్తుతిః

త్వద్ధామ వైకుణ్ఠపురం మహాత్మన్ । త్వద్వల్లభా సాగరనన్దినీ చ ।
త్వన్నాభిజాతో హి పితామహో ఽపి । కిం త్వాం స్మరామీశ ! కులాలజన్మా ॥

శ్వత్పాదసమ్భవా దేవీ । సాక్షా ద్భాగీరథీ శుభా ।
తవ పుత్రీం వదతి తాం । చతుర్వేదమయో విధిః ॥ 217

తవా సనం సదా దేవాః । వద న్తి ఫణినం విభో ।
సహస్రవదనం శేషం । సువర్ణం వాహనం విదుః ॥ 218

నక్షత్రమాలా తవ ద న్తప క్తిః । విద్యుత్ప్రకాశ స్తవ దేహకా న్తిః ।
మహీధరా మేరుహిమాద్రిముఖ్యాః । త్వదస్థిభూతాః పురుషో త్తమా ద్య । ॥
తవా క్షిణీ భానువిధూ చ విష్ణో ! । విరాట్పదం త్వాం శరణం ప్రపద్యే ॥ 219

అయ్యో! ఈ కష్టమేల ప్రాప్తించినది? ఈ రాజిట్లు పడిపోవనేల? నన్ను యమధర్మరాజు దండించుటలో నా యపరాధము లేదుకదా! 210

ఈ రాజా శక్తిమంతుడయినచో నే నాతడు నియమించిన పనిచేయుటకు సిద్ధముగా నున్నాను. శ్రీమన్నారాయణునకు నైవేద్యమొనరించు వంటకములకై యీ రాజా నన్ను మారు కుండల నిమ్మ' ని 211

యడిగియున్నాడు. వాటినిప్పు డొసంగగలన' ని శూద్రుడగు భీముడు పలుకు చుండగా రాజు చైతన్యమునొంది 212

విష్ణుభక్తుడు, శ్రీమన్నారాయణుని యనుగ్రహపాత్రుడు, కుమ్మరివాడునగు భీముడనువాడెవరు? సజ్జన పూజితములగు వానిని పాదద్వయమును నేను నమస్కరించు చున్నాన' ని 213

రాజు పలుకుచుండగనే భక్తులయందు వాత్సల్యముగల శ్రీనివాసుడు సజ్జనుడగు కులాలుని యెదుట ప్రత్యక్షమాయెను. 214

అట్లు సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణుని గాంచి కుమ్మరివాడగు భీముడత్యంత భక్తియుక్తుడై సంతోషముతో బలిసిన యవయవములుకలవాడై తేజోమూర్తి యగు శ్రీనివాసుని — 215

## కుమ్మరి తన యెదుట సాక్షాత్కరించిన శ్రీనివాసుని స్తుతించుట

"మహాత్మా! నీ స్థానము వైకుంఠనగరము. నీ భార్య సముద్రుని ముద్దుల పుత్రిక. బ్రహ్మ నీ నాభికమలమునుండి పుట్టినవాడు. కుమ్మరి కులమున పుట్టిన నే నేమని నిన్ను తలంచగలను? 216

గంగానది నీ పాదపద్మములయందు పుట్టినదగుటచే నామెను నీ పుత్రికయని వాగ్గ్వేదముల చక్కగా నెఱింగిన బ్రహ్మ తెలుపుచున్నాడు. 217

వేయిపడగలుగల ఆదిశేషుడు నీ పాన్పని దేవతలు చెప్పుచున్నారు. గరుత్మంతుని నీ వాహనమని చెప్పుదురు. 218

నక్షత్రపంక్తులే నీ పలువరసలు. మెరపులకాంతియే నీ శరీరకాంతి. మేరుపర్వతము, హిమవత్పర్వతము మున్నగు పర్వతరాజములే నీ యెముకలు. చంద్ర సూర్యులు నీ నేత్రములు. ఇట్టి విరాట్పురుషుడవగు (విశ్వరూపుడవగు) నిన్ను శరణువేడుచున్నాన' ని స్తుతించెను. 219

ఏవం స్తువతి శూద్రే తం । ప్రపన్నా కమలాలయా ।
జగద్ధాత్రీ జగాద్దైవం । పురుషం పరమేశ్వరమ్ ॥ 220

క్వాయం కులాలః పురుషోత్తమాస్య । కథం బభూవ త్వయి భక్తి రీదృక్ ।
కా జాతి రస్య క్వ చ సద్గుణా స్తే । కి మద్భుతం భోః కరుణామ్బురాశే ! ॥ 221

ఇత్యుక్త స్తు జగద్ధాత్ర్యా । గరుడం ప్రత్య భాషత ।

శ్రీ భగవాన్ —

వ మానయా తివేగేన । మత్సమీపం కులాలజమ్ ।
ఇత్యుక్తో గరుడో వేగా । దానినాయ చ శూద్రజమ్ ॥ 222

'ఇత ఏహీ' తి సమ్భాష్య । సమీపం పరమాత్మనః ।
స నత్వా శిరసా దేవం । ప్రత్యభాషత మాధవమ్ ॥ 223

కులాలః —

కి మర్థ మాగమో దేవ ! । గృహం మే శూద్రజన్మనః ।
న చా హం విదురో దేవో । న చా హం శబరీ ప్రభో ॥ 224

న చా హం గజరాజేన్ద్రో । న చోద్ధవ విభీషణౌ ।
కిం దేయ మస్తి మద్గేహే । త్వదర్థం పురుషోత్తమ ॥ 225

వదత్యే వం కులాలే తు । తస్య పత్నీ తమాలినీ ।
ప్రాసాద యచ్చ గోవిన్దం । ద్రౌపదీ వ జనార్దనమ్ ॥ 226

తమాలినీ —

అనాథనాథ గోవిన్ద ! । బుద్ధి స్త్వయ్యే వ వర్తతే ।
నజానేమ స్త్రిమార్గ స్తు । న జానే కర్మవిర్ణయమ్ ॥ 227

అశౌచకులజాతానాం । కుతో వేదః కుత స్తపః ।
భక్త్యా మేపరితుష్టః సన్ । మద్భర్తు శ్చ విశేషతః ॥ 228

మయా పాచిత మన్న ఞ్చ । యావనాలకులోద్భవమ్ ।
యథేష్టం భుఙ్క్ష్వ మద్దత్తం । సహా మోదరసాదరమ్ ॥ 229

ఇట్లు కుమ్మరి భక్తుడు శ్రీనివాసుని స్తుతించినంతనే లోకజననియగు శ్రీదేవి యనుగ్రహించినదై శ్రీనివాసునితో 220

పురుషోత్తమా ! దయాసముద్రా ! ఈ కుమ్మరి యెవ్వడు ! ఈతనికి నీ యందిట్టి భక్తి యెట్లు కుదిరినది ? ఈతని జాతియేమి ? ఈ మంచి గుణము లీతనికెట్లబ్బినవి. ఏమి యీ యాశ్చర్యము'ని 221

సంతసించుచుండ, శ్రీనివాసుడు గరుడునితో — ఆ కుమ్మరివాని నతిరయమున నావద్దకు గొనిరమ్ము'ని తెలుపగా గరుత్మంతు డాతనిని గొనివచ్చెను. 222

శ్రీనివాసు డాతని నిటురమ్ము'ని ప్రేమతో పిలిచినంతనే కులాలుడు శ్రీనివాసునకు తలనువంచి నమస్కరించి 223

కులాలుడు —

దేవా ! శూద్రుడనగు నా యింటికేల చనుదెంచితిరి ? నేను విదురుడను కాను. శబరిని నంతకంటె కాజాలను. 224

నేను గజేంద్రుడను కాను. ఉద్ధవ, విభీషణులకు సాటి రాజాలను. నాయింట మీ కిడుటకేమున్నది ? 225

అని వాపోవుచుండ యాతని భార్య తమాలిని ద్రౌపది కృష్ణుని యనుగ్రహింప జేసికొనినట్లు 226

తమాలిని —

దీనజనావనా ! నా బుద్ధి నీయందే లగ్నమైయున్నది. మంత్రములుచ్చరింపజాలని దానను. నీకు ప్రీతిని కలిగించు కర్మలనెఱుంగను. 227

శూద్రకులమున పుట్టినవారికి వేదములెట్లు వచ్చును ? స్తోత్రములెట్లు నేర్తురు ? మా దంపతుల ముఖ్యముగా నా భర్త భక్తికి సంతసించి 228

నేను వండిన జొన్నన్నమును నాచే సంతసమున నీయబడిన దానిని నీ యిష్టానుసారము భుజింపుము. 229

## భగవత్కృతభీమాఖ్య భక్తోపచారాభ్యుపగమః

ఇత్థ ముక్తో జగద్యోనిః । తయా భక్త్యా తమాలయా ।
కమలాముఖ మాలోక్య । జహాస జగదీశ్వరః ॥ 230

సుప్రసన్నో ఽథ భగవాన్ । తా మువాచ తమాలినీమ్ ।
అవశ్య మన్నం భోజ్యం తే భక్త్యా దత్తం తమాలినీ ॥ 231

రమాసమేతో రమణీయవిగ్రహః । కులాలవర్యేణ కులాఙ్గజాయయా ।
అభుజ్త దత్త ఇచ్ఛ తదన్న ముత్తమం । భుక్త్వా తయోశ్చ ప్రదదౌపదంస్వకమ్॥

ఏత త్కౌతుక మాలోక్య । బ్రహ్మేశానపురోగమాః ।
తుష్టువు ర్హృష్టమనసః । స్రష్టారం సర్వదేహినామ్ ॥ 233

దేవదున్దుభయో నేదుః । ఖా త్పేతుః పుష్పవృష్టయః ।
ఏతస్మి న్నేవ సమయే । విమానం ప్రాప్త ముత్తమమ్ ॥ 234

విమానం ప్రాప్త మాలోక్య । శ్రీనివాసః సతాం గతిః ।
స్వకిరీటం దదౌ తస్య । శఙ్ఖచక్రే చ కౌస్తుభమ్ ॥
పీతామ్బర మలఙ్కారం । కులాలస్య మహాత్మనః ॥ 235

## భగవదనుగ్రహేణ కులాలదమ్పత్యోః సారూప్యప్రాప్తిః

రమాయా భూషణం తావత్ । తమాలాయా శ్చ సన్దదౌ ।
దివ్యం విమానమారూఢౌ । విష్ణునా దత్తవైభవౌ ॥ 236

కులాలదమ్పతీ భక్తౌ । పశ్యత స్సస్య భూపతేః ।
జగ్మతు ర్విష్ణుభవనం । సాయుజ్యపదవీం గతౌ ॥ 237

కులాలపదవీం దృష్ట్వా । తొణ్డమాన్ నృపసత్తమః ।
వ్రీడితః పుణ్డరీకాక్షం । శ్రీనివాస మభాషత ॥ 238

## భీముడను భక్తుడు శ్రీనివాసున కుపచారముల నొనరించుట

ఇట్లు తమాలిని ప్రార్థింపగనే జగత్కారణుడగు శ్రీమన్నారాయణుడు శ్రీదేవి ముఖమును గాంచి నవ్వి 230

తమాల దంపతులం యం దనుగ్రహించినవారై "తమాలినీ! తప్పక నీవు భక్తితో నొసంగిన యన్నమును భుజింతున'ని తెలిపి 231

శ్రీదేవితో గూడ ఆ కుమ్మరిదంపతు లొసంగిన పవిత్రాన్నము నారగించి వారికి తన స్థానమగు పరమపదము నొసంగెను. 232

ఈ కుతూహలమును కలిగించు కార్యమును జూచి చతుర్ముఖాది దేవతలందరు చరాచరాత్మక ప్రకృతికర్తయగు శ్రీమన్నారాయణుని సంతోషచిత్తులై ప్రస్తుతించిరి. 233

దేవదుందుభులు మ్రోగెను. ఆకాశమునుండి పుష్పవర్షము కురిసెను. ఈ సమయముననే గొప్ప విమానము రాగా 234

శ్రీనివాసు డా భీముడను కుమ్మరివానికి తన కిరీటమును, శంఖచక్రములను, కౌస్తుభమణిని, పీతాంబరమను పట్టువస్త్రమును, తన భూషణముల నొసంగెను. 235

## భగవంతుని యనుగ్రహమున కుమ్మరిదంపతులకు సారూప్యము సిద్ధించుట

అట్లే శ్రీదేవి యాభరణములను తమాలిని కొసంగెను. ఇట్లు శ్రీమన్నారాయణునిచే దివ్యవిభూతి నొందినవారై దివ్యమగు విమానము నధిరోహించి. 236

కుమ్మరిదంపతు లా తొండమాన్‌రాజు చూచుచుండగా పరమపదమున కేగి శ్రీమన్నారాయణుని సాయుజ్యము నందిరి. 237

కుమ్మరివారట్లు మోక్షసామ్రాజ్యము నలంకరించుటను గాంచి తొండమానుడు సిగ్గుజెంది శ్రీనివాసుని 238

తొణ్డమానస్య భగవదత్తసామాప్య ప్రాప్తిప్రకార

మద్రాష్ట్రగతశూద్రస్య । సర్వదా పాపకారిణః ।
సద్గతి స్తు త్వయా తత్తా । కా గతి ర్మమ బాన్ధవ ! । 239

శ్రీనివాసః —

ఏత ద్దేహం పరిత్యజ్య । చా న్యం దేహ ముపాశ్రయ ।
తత్రా రాధ్య హృషీకేశం । గచ్ఛ సారూప్య ముత్తమమ్ ॥ 340

శతానన్దః —

ఇత్యు క్తో నృపతి స్సద్యః । స్నాత్వా స్వామిసరోజలే ।
కలేవరం పరిత్యజ్య । పున ర్దేహా న్తరం గతః ॥ 241

తత్రా ఽరాధ్య హృషీకేశం । శ్రీనివాసం నిరామయమ్
సారూప్యం గతవాన్ రాజా । స్వామినా పూర్వకల్పితమ్ ॥ 242

ఏవం హరి స్తత్ర చరిత్ర మద్భుతం । కుర్వన్ జగన్మాతృసమన్వితో గిరౌ ।
ఆ స్తే జగత్యా ఇచ్ఛ సురౌఘపూజితో । దద ద్యథేష్ట ఇచ్ఛ మనోరథా న్స్సతామ్॥243

ఇత్యే వం కథితం రాజన్ ! । మాహాత్మ్యం వేఙ్కటేశితుః
యః శృణోతీ ద మాఖ్యానం । మనో రథఫలప్రదమ్ ।
ఇహ లోకే సుఖం భుక్త్వా ! సో ఽథ యాతి హరేః పదమ్ ॥ 264

ఇతి శ్రీ భవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే కులాలప్రశంసనం నామ చతుర్దశో ఽధ్యాయః

## శ్రీమన్నారాయణుడు తొండమానునకుము సారూప్యము నొసంగుట

నా రాష్ట్రమునందుండి సర్వకాలములయందు పాపచరితులగు కులాలునకు మోక్షము నొసంగితివి. నా గతి యేమి ప్రభూ' యని ప్రార్థించెను. 239

శ్రీనివాసుడు —

అంత శ్రీనివాసుడు — రాజా! నీ వీ దేహమును విడచి మరియొక దేహమును పొంది యా జన్మమున శ్రీమన్నారాయణు నారాధించి యాతని సారూప్యము నందగలవ'ని వరమొసంగెను. 240

శతానందుడు —

జనక మహారాజా! ఇట్లు శ్రీనివాసునివలన వరమునొంది తొండమానుడు వెంటనే స్వామిపుష్కరిణిలో స్నానమొనరించి శరీరమును విడచి మరియొక శరీరమును ధరించి 241

ఆ జన్మమున చిదానందస్వరూపుడగు శ్రీనివాసుని ధ్యానించి యాతని యనుగ్రహముచే క్రిందటి జన్మమునందే నిశ్చయింపబడిన శ్రీమన్నారాయణ సారూప్యమును పొందెను. 242

ఇట్లు శ్రీనివాసు డద్భుతకార్యముల నాచరించుచు శ్రీదేవితో నా వెంకటాచలమున విహరించుచు దేవతలచే పూజింపబడుచు సజ్జనులకు కామితార్థముల నొసంగుచు భూలోకమున విరాజిల్లుచుండెను. 243

రాజా! ఇట్లు నీకు శ్రీ వేంకటాచలపతి మాహాత్మ్యమును తెలిపితిని. దీనిని వినినవారికి కామితార్థము లీడేరును. ఈ లోకమున సుఖముల ననుభవించి పిమ్మట పరమపదము నందగలరు. అని శతానందుడు జనకమహారాజున కీ చరిత్రమును వివరించెను.

**ఇది శ్రీ భవిష్యోత్తర పురాణమున శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున కుమ్మరివానిని స్తుతించుట యనెడు పదునాల్గవ అధ్యాయము.**

---

# అశీతితమో ఽధ్యాయః

## శ్రీభవిష్యోత్తర పురాణాన్తర్గత రహస్యాఽధ్యాయః.

శ్రీసూతః —

శృణుధ్వం మునయ స్సర్వే । శౌనకాద్యా స్తపోధనాః ।
తద్విష్ణో ర్వేఙ్కటేశస్య । రహస్యానుభవం పరమ్ ॥ 1

బ్రహ్మాణ్డే యాని తీర్థాని । స్వయం వ్యక్తాని యాని చ ।
చిరన్తనాని క్షేత్రాణి । పుణ్యారణ్యాని పర్వతాః ॥ 2

పూర్వం శ్రుతాని సర్వాణి । పురాణాని ద్విజోత్తమాః ।
సామాన్యాని చ ముఖ్యాని । రహస్యం ముఖ్య ముత్తమమ్ ॥ 3

అష్టాదశపురాణానాం । సార జ్ఞాత్వా త్వే మయా శ్రుతమ్ ।
వ్యాసప్రసాదా త్కారుణ్యాత్ । పరిప్రశ్నేన సేవయా ॥ 4

వైకుణ్ఠపదసాయుజ్యం । పరమానన్దదం పరమ్ ।
భవిష్యోత్తరసారాంశః । సర్వవేదాన్తసఙ్గ్రహః ॥ 5

తత్రాపి చోత్తరే ఖణ్డే । సాక్షి త్సంసారమోచకః ।
ఉమామహేశసంవాదే । రహస్యానుభవో ద్విజాః ॥ 6

ఆనన్దనిలయస్యైవ । క్షేత్రమాహాత్మ్య ముత్తమమ్ ।
మన్త్రాణాం మన్త్రరత్నే ద్వే । ద్వివిధం ధ్యాన ముత్తమమ్ ॥ 7

శృణుధ్వం పరమానన్ద- । పదావాప్త్యై చ దుర్లభమ్ ।
దేవానా మపి సిద్ధానాం । మహతాం యోగినాం నృణామ్ ॥ 8

అచికిత్స్యగ్రహగ్రస్త- । వికలాఙ్గవిరూపిణామ్ ।
రోగిణా మచికిత్స్యానాం । దుష్కర్మపరిపాకినామ్ ॥ 9

# ఎనుబదియవ అధ్యాయము

## శ్రీ భవిష్యోత్తర పురాణము నందలి రహస్యాధ్యాయము

శ్రీ సూతుడు —

శౌనకాది మునీంద్రులారా! శ్రీమన్నారాయణావతారుడగు శ్రీ వెంకటేశ్వరుని గొప్పదగు రహస్యానుభవమును వినుడు. 1

బ్రహ్మాండమునందున్న తీర్థములను గురించియు స్వయముగా నావిర్భవించిన అనాదిక్షేత్రములు, పవిత్ర అరణ్యములు, పర్వతముల చరిత్రమును 2

సాధారణ, అతిముఖ్యములగు పురాణముల నన్నిటిని వినియున్నారు. మిక్కిలి ప్రధానరహస్యమును 3

పదునెనిమిది పురాణముల సారమును, నగు యీ రహస్యము వ్యాసుని యను గ్రహమున వాత్సల్యమువలన. అడుగడుగున తెలిసికొనవలెనను కోర్కెతో సవినయముగ నొనరించు ప్రశ్నలవలన, శుశ్రూషవలన నేను వింటిని. 4

మోక్షసామ్రాజ్యము లభించుట మిక్కిలి యానందదాయకము. భవిష్యోత్తర పురాణ సారాంశమైనదియు, సకల వేదాంత విషయములను క్రోడీకరించినదియు 5

నుత్తర ఖండమునందలి పార్వతీ పరమేశ్వర సంవాదమునందలి యీ రహస్యానుభవము సంసారబంధమును తొలగించును. 6

ఆనందనిలయ క్షేత్రమాహాత్మ్య మత్యుత్కృష్టమైనది. మంత్రములలో ముఖ్య మంత్రములు రెండు. వాటిని ధ్యానించు విధములు రెండు. 7

దేవతలకును, సిద్ధులకును, గొప్ప యోగీంద్రులకును, మనుజులకును పొంద శక్యముగానిదియు, నిత్యానంద స్థానమగు పరమపదమును పొందించునదియునగు రహస్యానుభవమును వినుడు. 8

ఇది మందులచేగాని, మంత్రములచేగాని, శస్త్రచికిత్సలచేగాని నివారింపబడని గ్రహములు పట్టుకొనుట, అవయవములు శిథిలములగుట, అంగలోపముచే కురూపులగు వారికిని, మందులకు శస్త్రములకు లొంగని రోగములకును, ఘోరపాపాత్ములకును, 9

ఆపద్భి రనివార్యాభి । ఆవృతానా ఞ్చ దుఃఖినామ్ ।
మహాపాతకసమ్భూత । కుష్ఠరోగకురూపిణామ్ ॥ 10

కాణాన్ధబధిరాణా ఞ్చ । మూకానాం పఙ్గుకుబ్జయోః ।
ప్రాయశ్చిత్త విహీనానాం । పాపినాం దుఃఖమఃణినామ్ ॥ 11

క్వా ప్యవిర్గతికానా ఞ్చ । సర్వదా క్రూరకర్మణామ్ ।
భవే త్ప్రతివిధిః సద్యః । ప్రత్యక్షో వేఙ్కటాచలాత్ ॥ 12

భక్తానాం భవతిప్తానాం । గతిశ్చాన్య త్ర నాస్తి భోః ।
న పరః సర్వలోకానాం । సర్వవ్యాధీన్ కృపానిధిః ॥ 13

వికృత న్నస్తి చక్రేణ । యత్ర తస్మా ద్ధి వేఙ్కటాత్ ।
తస్మా త్స ఏవ గన్తవ్యో । భోగమోక్షరతై ర్జనైః ॥ 14

విశేషతః క్రూరకలౌ నరాణాం । పాపాకర్మాణాం పరిపీడితానామ్ ।
భూగోళమధ్యే ద్రవిడే చ పుణ్యే । శ్రీవేఙ్కటాద్రి ర్గతి రేవ నాన్యా ॥ 15

కలౌ యుగే మనుష్యాణాం । సఙ్కీర్ణానాం చ రక్షితా ।
శ్రీవేఙ్కటేశా న్నా న్యో ఽ స్తి । సర్వానిష్టనివారణాత్ ॥ 16

యం దృష్ట్వా నా పరం స్థానం । యం దృష్ట్వా నా పరో గిరిః ।
యం దృష్ట్వా నా పరం తీర్థం । యం దృష్ట్వా నాపరం తపః ॥ 17

యం దృష్ట్వా నా పరో దేవో । యం దృష్ట్వా నా పరో మనుః ।
యం దృష్ట్వా నా పరా భక్తిః । యం దృష్ట్వా నా పరా గతిః ॥ 18

యం దృష్ట్వా నా పరం జ్ఞానం । యం దృష్ట్వా నా పరం పదమ్ ।
యం దృష్ట్వా నా పరో లాభో । యం దృష్ట్వా నా పరః ప్రియః ॥ 19

యం దృష్ట్వా నా పరం ధామ । సాక్షా దానన్దసాన్ద్రికమ్ ।
యం దృష్ట్వా నా పరం ధ్యానం । సమాధి రపి నా పరః ॥ 20

యం దృష్ట్వా నా పరా ముక్తిః । సర్వేన్ద్రియమనోహరా ।
యం దృష్ట్వా నా పరో విశ్వో । యస్య కాలభయం న హి ॥ 21

అష్టకొనుటకు శక్యముకాని యాపదలచే చుట్టుకొని దుఃఖించువారికిని, ఘోర పాపములచే కలిగిన కుష్ఠురోగముచే వికృతరూపము నందినవారికిని 10

ఒంటికంటివారు, గ్రుడ్డి, చెవిటి, మూగ, కుంటి, గూనివారికిని, ప్రాయశ్చిత్తము లేని కర్మలనుచేసిన పాపాత్ములకును, కష్టములచే దుఃఖించువారికిని 11

ఎచ్చటను గతిలేనివారికిని, ఎల్లప్పుడు పాతక కృత్యముల నాచరించినవారికిని శ్రీ వేంకటాచలమునుండి వెంటనే బాధానివారకము నుపాయము గోచరించును. 12

సంసారసాగరమున తపించు భక్తులకు వేరుపాయ మెచ్చటను కానరాదు. సకల లోకములకు నా శ్రీనివాసుడే పరాత్పరుడై వెలసిల్లుచున్నాడు. కరుణాసముద్రుడై 13

తన చక్రముచే సకల వ్యాధులను ఛేదించుచుండుటంజేసి ఇహ, పరలోకసుఖా సక్తులగు జను లా శ్రీనివాసునే శరణుకొనవలెను. 14

ముఖ్యముగా నీ భయంకరమగు కలియుగమున పాపాత్ములకును, పాపకర్మలచే పీడింపబడుచున్నవారికిని. ఈ ప్రపంచములో పవిత్ర దక్షిణదేశమున శ్రీ వేంకటాచలమే శరణ్యముతక్క వేరెద్దియును లేదు. 15

కలియుగమున వర్ణసంకరము నందినవారిని వివిధములగు నాపదలనుండి బ్రోచు దైవము శ్రీ వేంకటాచలపతియే కాని ఇతర దైవమెవరును లేరు. 16

వెంకటాచల క్షేత్రముకంటె నుత్కృష్ట క్షేత్రమును, వెంకటాద్రికంటె శ్రేష్ఠ పర్వతమును, స్వామి పుష్కరిణికంటె తీర్థరాజమును, శ్రీ వెంకటేశుని ధ్యానముకంటె మిన్నయగు తపమును, 17

శ్రీ శ్రీనివాసుని మించిన దైవమును, శ్రీ వెంకటేశమంత్రమును మించిన మంత్రమును, శ్రీనివాస దర్శనముకంటె భక్తియు, శ్రీనివాసుని పొందుటకంటె నుత్తమ గతియు 18

శ్రీనివాసుని గుణించిన జ్ఞానముకంటె జ్ఞానమును, శ్రీ వెంకటాద్రికి మిన్నయగు స్థానమును శ్రీనివాస సందర్శనముకంటె లాభమును, శ్రీనివాస సంసేవనము కంటె ప్రియమైనది. 19

శ్రీ వెంకటాద్రికంటె సాక్షాత్తుగా నానందప్రదమగు స్థానమును, శ్రీనివాసుని గురించిన ధ్యానమును మించిన ధ్యానమును, యోగమును 20

శ్రీనివాసుని దర్శనమును మించిన సకలేంద్రియములకు నాహ్లాదకరమగు మోక్షమును, శ్రీనివాసుని దర్శనమునకు మించిన మృత్యుభయమును పారద్రోలు నిత్యవస్తువును

యం దృష్ట్వా నా పరో విష్ణుః । భక్త్యా సర్వజగన్మయః ।
యం దృష్ట్వా త్రివిధం కృత్యం । కృతవాన్ నా త్ర సంశయః ॥ 22

యం దృష్ట్వా నాప రో దాతా । రమేశా న్నా స్తి కామదః ।
యందృష్ట్వానాపరంబ్రహ్మ । సచ్చిదానన్దవిగ్రహాత్ ॥ 23

యం దృష్ట్వా నా పరో యోగః । సాష్టాఙ్గః సర్వసిద్ధదాత్ ।
యం దృష్ట్వా నా పరః పూర్ణః । సర్వగో వేఙ్కటేశ్వరాత్ ॥ 24

న వేదాన్తా త్పరం శాస్త్రం । న దేవో వేఙ్కటేశ్వరాత్ ।
న వైకుణ్ఠా త్పరం ధామ । న గిరి ర్వేఙ్కటాత్పరః ॥ 25

సత్యం సత్యం పున స్సత్యం । న దేవో వేఙ్కటేశ్వరాత్ ।
బ్రహ్మాణ్డే నా స్తి య త్కిఞ్చిత్ । న భూతం న భవిష్యతి ॥ 26

వేఙ్కటేశసమో దేవో । నే తి వేదా న్తనిర్ణయః ।
తద్రహస్యమసంవాదం । శ్వచి త్తస్థ ముమేశయోః ॥ 27

శృణుధ్వ మవధానేన । సిద్ధాన్త మునిపుఙ్గవాః ।

శ్రీసూతః —

కైలాసే ఒన న్తశిఖరే । పర్వతే నిర్మలోజ్జ్వలే ॥ 28

జ్ఞాననిర్మలచిత్తాఢ్య । యోగిమణ్డలసేవితమ్ ।
సుఖాసీనం మహాదేవం । రత్నసింహాసనో త్తమే ॥ 29

ప్రణిపత్య కృపాసిన్ధుం । పార్వతీ పృచ్ఛత ।

పార్వతీ —

దేవదేవ ! విరూపాక్ష । త్రైలోక్యతిమిరాపహ ॥ 30
తవా న్తఃకరణా నన్ద । రహస్యానుభవం పరమ్ ।
ముక్తిక్షేత్రేషు సిద్ధానాం । ముక్తానాం । కర్మబన్ధనాత్ ॥ 31

తేషా మానన్దసాన్ద్రాబ్ధేః । అవాప్తి ర్యత్ర శఙ్కర ।
త ద్ధామ గోప్యం త్వద్ధ్యాన । వైభవానన్దమీశ్వర ! ॥ 32

శ్రీనివాసునకు భిన్నయగు ప్రాణికోటి లన్నిటియందు వ్యాపించిన దైవమును లేదు. శ్రీనివాసుని సందర్శన భాగ్యమున మనోవాక్కాయములతో చేయవలసినవి చేసి నెరవేర్చిన వారమటలో సందియములేదు. 22

శ్రీనివాసునికంటె యభీష్టముల నొసంగు దాతలేడు. సచ్చిదానంద స్వరూపు డగు శ్రీనివాసునికంటె పరబ్రహ్మ కానరాడు. 23

శ్రీనివాసుని దర్శనముకంటె సకలసిద్ధుల నొసంగునదియు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, యోగ, సమాధులనెడు యెనిమిది యంగము లతో కూడిన యోగములేదు. శ్రీనివాసునికంటె పూర్ణుడు లేడు. 24

వేదాంతమును మించిన శాస్త్రముకాని, శ్రీ వెంకటేశ్వరునికంటె దైవముగాని, వైకుంఠముకంటె ఉత్కృష్ట పదవిగాని, శ్రీ వెంకటాద్రికంటె భిన్నయగు పర్వతమును లేదు. 25

శ్రీ వెంకటేశ్వరుని మించిన దైవ మీ ప్రపంచమున భూత భవిష్యత్కాలముల యందు లేనేలేదు. ఇది ముమ్మాటికిని సత్యము. 26

శ్రీ వెంకటాచలపతిని మించిన దైవము లేదని వేదాంతములచే నిర్ణయింప బడినది. పార్వతీ పరమేశ్వరుల మనస్సునందున్న రహస్య సంవాదము నా మనస్సున నున్నది. 27

ఆ సిద్ధాంతమును మునిశ్రేష్ఠులగు మీరు సావధానముగా వినుడు. అనేక శిఖ రములు కలిగి నిర్మలమై ప్రకాశించు కైలాసపర్వతమున 28

జ్ఞానముచే నిర్మల మనస్కులైన యోగీంద్రుల సమూహములచే సేవింపబడుచు రత్నసింహాసనమున సుఖముగా కూర్చునియున్న 29

కరుణా సముద్రుడగు నీశ్వరునకు నమస్కరించి పార్వతి "దేవాది దేవా! ఫాలలోచనా! మల్లోకముల యంధకారమును పోగొట్టుస్వామీ! 30

నీ మనస్సున కానందమును చేకూర్చు రహస్యానుభవమైనదియు, ముక్తులకు మోక్షము నొసంగు పుణ్యక్షేత్రములలో కర్మబంధమునుండి విముక్తులకు సిద్ధులకు 31

అత్యధికానంద మెచ్చట లభించునో యా స్థానము రహస్యమైనదై నీ ధ్యాన వైభవమున కానందము నొనగూర్చునదై యున్నదో 32

పూర్ణానన్దకృపా దృష్టిః । అస్తి చే త్తవ మే వద ।

ఈశ్వరః —

సాధు పృష్టం త్వయా దేవి ! । భక్తానాం హితకామ్యయా ॥ 33

ప్రియా త్ప్రియతరం మే ఽస్తి । త ద్రహస్యం వదామి తే ।
బ్రహ్మాణ్డమణ్డలే పుణ్యే । ద్రవిడే వేఙ్కటాచలే ॥ 34

రహస్యం సర్వలోకానాం । పావనం పరమాద్భుతమ్ ।
స్వామిపుష్కరిణీతీర్థం । భక్తిజ్ఞానసుఖప్రదమ్ ॥ 35

దర్శనా త్సర్వజన్తూనాం । ఆశ్చర్యం భువి రాజతే ।
ఆజన్మ సఞ్చితం పాపం । దర్శనా దేవ నశ్యతి ॥ 36

తత్క్షణాత్ జ్ఞానసమ్పన్నాః । ముక్తాః సంసారబన్ధనాత్ ।
పరానన్దపదే స్థిత్వా । మోదన్తే వేఙ్కటాచలే ॥ 37

స్నానపానస్పర్శనై స్తు । కిము వక్తవ్య మీశ్వరి ! ।
స్వామిపుష్కరిణీతీర్థ । మహిమా కేన వర్ణ్యతే ॥ 38

మయా వక్తుం విరిఞ్చాద్యైః । న శక్యో లోకదుర్లభః ।
కిం పునఃసిద్ధయోగీన్ద్రైః । సమురాసురమానవైః ॥ 39

సార్ధత్రికోటీతీర్థానాం । పాతకఘ్నీసుపావనీ ।
వేఙ్కటేశ్వరసద్ధామ్నః । సమన్తా ద్యోజనత్రయమ్ ॥ 40

ముక్తిభూమి శ్చిదానన్ద । ఘన సన్దోహమణ్డలమ్ ।
తత్ర స్థితానాం జన్తూనాం । భాగ్యంభాగ్య మహోనృణామ్ ॥ 41

య ద్దర్శనం సదో హ్లాది । సచ్చిదానన్దసమ్భృతమ్ ।
అహో చిత్ర మహో చిత్రం । అస్మిన్ వైకుణ్ఠమణ్డలే ॥ 42

విద్యానమ్రాతిసమ్పత్తిః । వివాహః కేవలం తపః ।
కృతకృత్య మభూ జ్జన్మ । శేషాచలనివాసినః ॥ 43

నీకు నా యందు పరిపూర్ణ కరుణా కటాక్షమున్నచో దానిని నాకు తెలుపుమని ప్రార్థించెను. ఆ ప్రార్థనను విని యీశ్వరుడు - దేవీ! నీవు భక్తులకు హితము నొనరించు కోరికతో చక్కగా నడిగితివి. అది నా కత్యంత ప్రియమైనది. 33

ఆ రహస్యమును నీకు తెలిపెదను. వినుము. ఈ చరాచర ప్రపంచమున పవిత్ర ద్రావిడదేశమున శ్రీ వెంకటాద్రియందు 34

సకల లోకములను పవిత్ర మొనరించు పరమాశ్చర్యకరమై తనను సేవించిన మాత్రముననే సర్వప్రాణులకు నొసంగు స్వామి పుష్కరిణి 35

భూలోకమున నాశ్చర్యకరమైనదై ప్రకాశించుచున్నది. ఎన్నిజన్మములనుండియో ఆర్జించిన పాపమంతయు నీ స్వామి పుష్కరిణీ సందర్శనమున నశించి పోవుచున్నది. 36

ఈ పుష్కరిణీ సందర్శనముననే జనులు జ్ఞానమునుపొంది సంసారబంధమునుండి విడివడినవారై యుత్కృష్టానంద పదవియగు శ్రీ వెంకటాచలమున నానందమనుభ వింతురు. 37

స్వామిపుష్కరిణీ దర్శనభాగ్యమే యింత యుత్కృష్ట ఫలప్రదమైయుండ స్వామిపుష్కరిణీ తీర్థమున స్నానముచేసిన, ఆ తీర్థమును త్రావిన, ఆ తీర్థమును స్పృశిం చిన దానివలన లభించు మహిమ వర్ణింప నెవరితరము? 38

నేను కాని, బ్రహ్మాదులుకాని దీనిని వర్ణింపజాలరు. ఇక సిద్ధులు, యోగీశ్వ రులు, దేవతలు, రాక్షసులు, మానవులు వర్ణింపజాలుదురా? ఇది లోకులకు దుర్లభమైనది.

మూడున్నరకోట్ల తీర్థములు - పాపములను పోగొట్టి, పవిత్ర మొనరించునది యునై స్వామిపుష్కరిణి విలసిల్లుచున్నది. శ్రీ వెంకటాచలమున కన్నిప్రక్కలయందు మూడు యోజనముల వరకున్న ప్రదేశము 40

ముక్తి నొసంగునది. ఆనందజ్ఞానానంద సముదాయపుంజము. అచ్చట నివసించు జంతువుల, మానవుల యదృష్టమే యదృష్టము. 41

శ్రీ వేంకటాల దర్శనము మనోహరమైనది. పరమానంద సంధాయకమైనది. ఈ పర్వత మెంత యాశ్చర్యకరమైనదో కదా! ఈ వైకుంఠమున 42

నిద్రించుట - సమాధిసంపదయనియే చెప్పవచ్చును. నివసించుట - కేవలము తపమొనరించుటయే శేషాద్రియందు నివసించువారి జన్మ సఫలమైనది. 43

ప్రార్థయామో వయం నిత్యం । తం నివాసం నృణాం కిము ।
తథాఽపి భక్తిసంయుక్తం । కర్మాచారవ్రతాదికమ్ ॥ 44

మనః ప్రసాదనం శక్త్యా । స్వామిప్రీతికరం చరేత్ ।
అన్నదానం మహాపూజో- । త్సవవైభవముత్తమమ్ ॥ 45

స్వామిప్రసాదకైంకర్యం । అనన్త్యాయో పకల్ప్యతే ।
యత్కిఞ్చి త్స్వర్ణదానాన్న- । పితృశ్రాద్ధాదికర్మ చ ॥ 46

అత్ర స్థానే కృతం సర్వం । అనన్తఫలదం స్మృతమ్ ।
జ్ఞానినో ఽజ్ఞానినో వా పి । సమానం భక్తిపూర్వకమ్ ॥ 47

కాలక్షేపార్థ ముత్సాహే । కర్మణా బన్ధనం న హి ।
చిరన్తనేషు క్షేత్రేషు । ముక్తిస్త్వత్ర ముదాహృతమ్ ॥ 48

సాయుజ్యముక్తి రానన్ద । ప్రాప్తిః శ్రీశైలమస్తకే ।
ముక్తిక్షేత్రేషుముక్తానాం । స్వానన్దానుభవాగమః ॥ 49

తద్విష్ణో ర్వేఙ్కటేశస్య । పరానన్దపదే స్థితిః ।
ఏత ద్విచిత్ర మత్రైవ । వేఙ్కటేశ్వరమణ్డలే ॥ 50

వస్తుస్వభావవైచిత్ర్యాత్ । పరమానన్దకారణమ్ ।
ముక్తానాంయోగినాంమధ్యే । కశ్చిత్పరమయోగిరాట్ ॥ 51

ఏత త్పరం రహస్య న్తు । లోకే జానాతి నా పరః ।
సర్వవేదాన్తసిద్ధాన్త । సారస్యానుభవం ప్రియే ॥ 52

బ్రహ్మానన్దపదప్రాప్తి । కారణత్వాత్ మమ ప్రియమ్ ।
నైత ద్రహస్య మాఖ్యానం । వక్తవ్యం యస్య కస్య చిత్ ॥ 53

భక్తియుక్తాయ శాన్తాయ । వక్తవ్యం వేఙ్కటేశ్వరే : ।
సచ్చిదానన్దసన్మూర్తేః । కల్యాణగుణవారిధేః ॥ 54

మేము ప్రతిదినము వెంకటాద్రియందు నివసించు భాగ్యమునకై ప్రార్థించుచుందుము. మనుజుల మాట చెప్పనేల? ఆయినను భక్తితో కర్మలను, ఆచారములను, వ్రతములను 44

మనస్సును యథాశక్తిగ నిర్మలముగా నుంచుకొని శ్రీమన్నారాయణునికి ప్రీతి కలుగునట్లొనరింపవలెను. అన్నదానము, మహోత్కృష్ట పూజలనొనరించు నుత్సవ వైభవము 45

శ్రీనివాసునకు ప్రసాదములను చేయుట కైంకర్యమొనరించుట యనునవి యనేక రెట్లు ఫలప్రదములై యున్నవి. ఏ కొంచెము బంగారమును కాని, అన్నమును కాని దానమొనరించినను, పితృశ్రాద్ధాది కర్మలను భక్తితో నొనరించినవారు 46

జ్ఞానులైనను, అజ్ఞానులైనను ఒకే విధముగ ఈ స్థలవిశేషమున నవి యత్యధికఫలితము నిచ్చునవై యుండును. 47

ఇచ్చట నే కర్మలను గాని కాలక్షేపము కొఱకాచరించినను, వేడుకకై చేసినను నవి బంధహేతువులు కానేరవు. ప్రాచీన క్షేత్రములలో నిది మోక్షము నొసంగునదిగా జెప్పబడినది. 48

తిరుపతికొండపైన సాయుజ్య ముక్తియు, ఆనందలాభమును సిద్ధించును. మోక్షమునిచ్చు పుణ్యదేశములలో మరణించి ముక్తిని చెందువారికి స్వస్వరూపానందము సిద్ధించును. కాని శ్రీనివాసుని కొండపై మరణించువారికి నిరతిమానంద స్థానమగు పరమ పదమున శాశ్వతవాసమే సిద్ధించును. ఇదియే యీ క్షేత్రమునకు వైలక్షణ్యము. 49, 50

ఇట్టి వైలక్షణ్యమునకు ముఖ్యకారణము వస్తువుయొక్క స్వాభావికమైన మాహాత్మ్యమే. అదియే సర్వోత్కృష్టమైన ఆనందమూలము. మోక్షేచ్ఛగల యోగులలో నొక మహాయోగి మాత్రమే. 51

ఈ పరమ రహస్యము నెఱుంగజాలియున్నాడు. ఇతరులెఱుంగజాలరు. సకల వేదాంతములచే స్థిరీకరింపబడిన యీ రహస్యానుభవము 52

బ్రహ్మానంద పదవి నొసంగునదగుటచే నాకు మిక్కిలి యిష్టమైనది. ఈ రహస్య చరిత మెవరికి చెప్పరాదు. 53

శ్రీ వేంకటేశ్వరునియందు భక్తికలిగి శాంతుడైయున్న వానికే నీ రహస్యము చెప్పదగియున్నది. ఆనందస్వరూపుడును, కల్యాణగుణ సమృద్ధుడునగు 54

వేఙ్కటేశహరే ర్ధ్యాన । వైభవం శృణు పార్వతి ।
అనన్తకల్పసఞ్జాత । పాపరాశివినాశనమ్ ॥ 55

వాఙ్మనః శ్రవణానన్ద । మకరన్దఫలప్రదమ్ ।
ధ్యానశ్రవణమాత్రేణ । బ్రహ్మానన్దపదప్రదమ్ ॥ 56

న శక్యతే మయా వక్తుం । తద్ధామధ్యానజం ఫలమ్ ।
తద్ధామ స్వామిన శ్చిత్రం । అవాఙ్మనసగోచరమ్ ॥ 57

కిము గీర్వాణసిద్ధేన్ద్రైః । బ్రహ్మాద్యై ర్మునిమణ్డలైః ।
అత ఏవ రహస్యాద్ధ్యో । ధ్యానానుభవఉత్తమః ॥ 58

క్షేత్రే చాదివరాహస్య । సాక్షాత్ జ్ఞానమయే శుభే ।
స్వామిపుష్కరిణీతీరే । నిర్మలాత్మభి రీడితే ॥ 59

సార్థత్రికోటిసంస్థానైః । పుణ్యతీర్థైః సమావృతే ।
పుణ్యవృక్షలసత్పుష్ప । శ్రీగన్ధతరువాసితే ॥ 60

పారిజాతవనోద్యాన । రత్నమణ్డలమణ్డితే ।
నానాద్రుమలతారామ । పుష్పవాటీభిరావృతే ॥ 61

నిర్ఝరీదేవతాపక్షి । మృగాణాం ధ్వనిపూరితే ।
సమస్తదేవతాసిద్ధ । యోగిమణ్డలసేవితే ॥ 62

రమ్యే మనోహరానన్దే । భక్తిసారమహోత్సవే ।
వైకుణ్ఠేవిరజానద్యాః । తటేబాధావివర్జితే ॥ 63

నవరత్నమయోద్భూత । సహస్రస్తమ్భమణ్డపే ।
జామ్బూనదభరాక్లృప్త । రత్నప్రాకారభాస్వరే ॥ 64

రత్నప్రభాలసద్ధేమ । వైచిత్ర్యవివిధోజ్జ్వలే ।
చతుర్దిక్షుచతుర్ధామ । చతుర్ముక్తిఫలప్రదమ్ ॥ 65

శ్రీ వేంకటాచలపతిని ధ్యానము యొక్క వైభవమును చెప్పెదను వినుము. శ్రీ వేంకటేశ్వరుని ధ్యానించిన ననేక కల్పములనుండి పుట్టిన పాపరాశిని నశింపజేయును.

వాక్కునకు, మనస్సునకు, చెవులకు నానందమాధుర్య ఫలము నొసంగును. ధ్యానమువలనను, వీనులవిందుగ వినుటవలనను బ్రహ్మానందము లభించును. 56

ఆ స్థానమును ధ్యానించుటవలన కలుగు ఫలితమును చెప్పుటకు నాకు శక్తి చాలదు. శ్రీ వేంకటేశ్వరుని యా స్థానము 57

దేవతలకైనను, పరమసిద్ధులకైనను, బ్రహ్మాదులకైనను, మునీంద్రులకైనను మనస్సునకు వాక్కునకు గోచరించనిది. అందువలననే యీ పరమరహస్యమగు ధ్యానానుభవము మిక్కిలి యుత్కృష్టమైయున్నది. 58

జ్ఞానస్వరూపమును, మంగళకరమును, నిర్మలమగు మనస్సుకలవారలచే స్తుతింపబడునదియునగు స్వామిపుష్కరిణీతీర్థము వంకలి యాదివరాహస్వామి క్షేత్రమున 59

మూడున్నర కోట్ల పుణ్యతీర్థములతో నాదరింపబడునట్టియు పవిత్రములగు వృక్షములయందు ప్రకాశించు పుష్పములు కలిగినట్టియు, చందన వృక్షములచే పరిమళించుచున్నట్టియు 60

పారిజాతవృక్షములు కల ఉద్యానవనములలో రత్నపుంజములచే నలంకరింపబడినట్టియు, అనేక రకములైన చెట్లు, తీగెలు, తోటలు, పుష్పవాటికలచే నావరింపబడియున్నట్టియు, 61

సెలయేళ్ళ, దేవతల, పక్షుల, మృగముల ధ్వనులచే నిండినట్టియు, సకల దేవతలచేతను, సిద్ధులచేతను, యోగులచేత సేవింపబడునట్టియు 62

సుందరమగు, మనస్సున కాహ్లాదకరమగు నానందమును కలిగించు భక్తికి ఫలమగు మహదానందప్రదమైన వైకుంఠమున బాధారహితమగు విరజానదీతీరమున 63

నవరత్నములచే కూర్చబడిన వేయిస్తంభములుకల మంటపమున బంగారుమయమగు రత్నప్రాకారములచే ప్రకాశించుచున్నట్టియు 64

రత్నకాంతులచే ప్రకాశించు బంగారు కాంతులు పలువిధములై విరాజిల్లుచుండ నాల్గు దిక్కులయందలి ప్రదేశము ధర్మార్థకామమోక్షముల నిచ్చునదై 65

అనన్తార్కతటిచ్చన్ద్రం । మణ్డలోపరిమణ్డలమ్ ।
దుర్నిరీక్షం దురాధర్షం । దుఃస్సహందేవతాదృశామ్ ॥ 66

అచిన్త్యంతేజసావ్యాప్తం । అప్రమేయ మగోచరమ్ ।
ఛాదితంమాయయావిష్ణోః । జ్వలితంసర్వతోముఖమ్ ॥ 67

మధ్యేతురీయబ్రహ్మాఖ్యం । స్వప్రకాశం తదేవసత్ ।
స్వశక్తిగుణవైచిత్ర్యాత్ । వ్యసృజద్విశ్వ మవ్యయమ్ ॥ 68

ఉపాదానంనిమిత్తఞ్చ । కారణం జగతః సతః ।
ఊర్ణనాభే స్తన్తునేవ । విస్తార స్తస్య మాయయా ॥ 69

మూల ప్రకృతి సఙ్గాత్ తత్ । కార్యత్వేనాపి సఙ్గతమ్ ।
తత్తద్వారా బహిర్వ్యక్తం । తత స్త్రివిధం కృతమ్ ॥ 70

తత్తత్కర్మానుగుణ్యేన । భాతిస్థూలం మహత్కృశమ్ ।
విషయగ్రహణే పూర్వం । దృశ్యతేహి తదేవ సత్ ॥ 71

విదుషా మహో ముల్లేఖ । పరామర్శావభాసకమ్ ।
తదుపాదిభి రచ్ఛిన్నం । మహత్స్థూలం తథాకృశమ్ ॥ 72

స్థూలసూక్ష్మక్షుద్రఘటాత్ । యథోద్గచ్ఛతి దీపభాః ।
తథైవబ్రహ్మణ స్తేజో । భాతి భిన్నముపాదిభిః ॥ 73

ఉపాధిత్రయమేతత్తు । ఛిత్త్వా భక్తిమతాం నృణామ్ ।
ఏకమేవాద్వితీయం తత్ । త్రిశూన్యం భాతి జృమ్భితమ్ ॥ 74

మేఘచ్ఛిద్రాణి సఞ్ఛిద్య । భాను తేజ ఇవో త్థితమ్ ।
నానాత్వకల్పనాయుక్తం । విశ్వప్రకృతి వర్జితమ్ ॥ 75

అంతములేని సూర్య విద్యుత్ చంద్రమండలముపై నున్నదియు, చూడ శక్యముకానిదియు, ఎదుర్కొన శక్యముకానిదియు, దేవతలకైనను సహింపరాని ప్రభావము కలదియు 66

ఊహింప శక్యముకానిదియు, తేజస్సుచే వ్యాపింపబడినదియు, ప్రమాణములచే తెలియరానిదియు, మనస్సునకు వాక్కునకు గోచరము కానిదియు, విష్ణుమాయచే నావరింప బడినదియు, అంతటను ప్రకాశించునదియు 67

మధ్యభాగమున విరాజిల్లుచున్న స్వప్రకాశస్వరూపముగల పరంబ్రహ్మ తన స్వాభావికశక్తి కల్యాణగుణముల విచిత్రములతో నీ ప్రవాహనిత్యమైన ప్రపంచమును సృజించెను. 68

కంటికి గోచరించు నీ సమస్త ప్రపంచమునకు సాలిపురుగు తన గూడునకువలె ఉపాదాన కారణమున్ను, నిమిత్త కారణమున్ను ఆ నారాయణుడే. ఆతని సంకల్పము చేతనే యీ ప్రపంచమింతగ వ్యాపించియున్నది. 69

ఆతడు నిత్యమైనను తనకు శరీరమువలె పరతంత్రమైన మూల ప్రకృతి సంసర్గమువలన ప్రపంచరూపముగా వ్యాపించుచున్నాడు. అందువలనే ప్రపంచమొక్కరీతిగ నుండక సత్త్వరజస్తమోగుణ కార్యములగు ప్రకాశప్రవృత్తి మోహములతో గోచరించుచున్నది. 70

చేతనులు చేసుకొనిన పుణ్య పాప కర్మలచే స్థూలసూక్ష్మాది పరిణామ విశేషములను పొందుచున్నది ఇంద్రియములచే విషయములను గ్రహించునపుడు మనముందా వికారజితమే గాన్పించుచున్నది. 71

కాని పండితులు (ఆత్మ పరమాత్మ వివేకముకలవారు) 'అహం' అను శబ్ద ప్రయోగమును స్థూల సూక్ష్మ ఉపాధులతో కూడిన పరమాత్మపరముగనే గావింతురు. 72

పెద్ద చిన్న మిక్కిలి చిన్న కుండలనుండి దీపపుకాంతి బయటకు వచ్చునట్లే వివిధరూపముల ప్రకాశించుచున్నది. 73

పరిపిష్పన్న భక్తియోగులకీ యుపాధులను విడిచి సత్వరజస్తమోవికార విదూరమైన పరంబ్రహ్మము స్వచ్ఛముగా గోచరించును. 74

సూర్యుడెట్లు మేఘఖండముల మధ్యనుండి వానిని భేదించుకొని బయటకు ప్రకాశించునో అట్లే నారాయణుడు భిన్నభిన్న ఆకారములతోనున్న ప్రాకృతిక పదార్థములను తొలగించి భక్తులకు తన స్వాభావిక తేజస్సుతో గోచరించును. 75

నేతి నేతీతి చ శ్రుత్యా । బోధితం యత్పరం పదమ్ ।
పరిచ్ఛేత్తు మశక్యత్వాత్ । స్వప్రకాశం తదేవ సత్ ॥ 76

సత్య జ్ఞానమనాద్యన్తం । ఆనన్ద మమృతోత్థితమ్ ।
నిత్య శుద్ధ ప్రబుద్ధాత్మ । స్వరూపం వాగగోచరమ్ ॥ 77

సర్వతో వ్యాప్త మాత్మానం । నిర్మలం నిష్కలం శివమ్ ।
శూన్యా శ్శూన్య ఫలం హిత్వా । ప్రజ్ఞానం బ్రహ్మ జృమ్భితమ్॥ ॥ 78

భావాభావ వినిర్ముక్తం । ద్వైతాద్వైత వివర్జితమ్ ।
సచ్చిదానన్ద సాన్ద్రార్ద్ధి । పరిపూర్ణమనామయమ్ ॥ 79

సత్యచిద్ఘనసూక్ష్మాగ్ర్యం । అఖణ్డ మకుతో భయమ్ ।
కైవల్య పదసాయుజ్య । పరానన్ద పద ప్రదమ్ ॥ 80

నిర్గుణం చేన్ద్రియాతీతం । నిరాకారం నిరఞ్జనమ్ ।
స్వభక్తదర్శనార్థాయ । లోకానాం రక్షణాయ చ ॥ 81

కృపయా సర్వదేవానాం : సిద్ధానాం యోగినాం హితమ్ ।
కాలప్రవాహ గమ్భీర : మాయావర్త భవామ్బుధే ॥ 82

తారణాయ వరం దాతుం । భక్తి జ్ఞానపురస్సరమ్ ।
భజతాం వాఞ్ఛతాం సమ్ప । దాయురారోగ్య వర్ధనమ్ ॥ 83

అణిమాద్యష్ట సిద్ధి శ్చ । యోగసిద్ధిశ్చ సన్నిశత్ ।
అష్టాఙ్గయుక్తాం సద్విద్యా । సిద్ధిశ్చ విజయాన్వితమ్ ॥ 84

మన్త్రయన్త్రమహాతన్త్ర । దేవతాసిద్ధి కారణమ్ ।
స్వాంశావతార మూర్తీనాం । సర్వశక్తి ఫలప్రదమ్ ॥ 85

త్రికాలయోగ్యం రక్షార్థం । స్వప్రసిద్ధ్యర్థ కారణమ్ ।
స్వీకుర్వత్స్వగుణం బ్రహ్మ । మూర్తి మత్తదనామయమ్ ॥ 86

పరమాత్మను బోధించు శ్రుతి 'పరమాత్మ ఇది కాదు అది కాద'ని చెప్పుట యూ పరిదృశ్యమాన పదార్థములవలె పరిచ్ఛిన్నముగ నెఱుంగరాని అఖండ స్వప్రకాశ స్వరూపమని తెలుపుటకే. 76

సత్యస్వరూపమును, జ్ఞానస్వరూపమును ఆద్యంతము లేనిదియును, ఆనంద స్వరూపమైనదియు, అమృతరూపమైనదియు నగు నిత్యశుద్ధాత్మ స్వరూపము వాక్కుల కందనిది. 77

పరంబ్రహ్మ కర్మసంబంధరహితము, ఇంద్రియ శూన్యము, మంగళావహము ఇట్టి స్వాభావిక రూపముతోనే యంతటను వ్యాపించియుండును. నశ్వరమైనట్టియు, అంత కంటెను కొంత స్థిరమైనట్టియు ఫలస్వరూపమైనదికాదు. కేవలజ్ఞానఘనమైనది మాత్రమే.

ప్రాపంచిక పదార్థములవలె నొకప్పుడుండుట, ఒకప్పుడు లేకుండుట, ఒకప్పు డొక్కటివలెనే గోచరించుట (మట్టిముద్ద మొ॥ వానివలె) మఱియొకప్పుడు నానారూపములు (కుండమూకుడు) గ గోచరించుటనేనిది. నిరంతరము స్వాభావిక సత్, చిత్, ఆనందము లతో నాశరహితమై పరిపూర్ణముగా ప్రకాశించుచుండును. 79

సత్యమైనది, జ్ఞానమయమైనది, అన్నిటిలోను ప్రవేశించునంత సూక్ష్మమైనది, శ్రేష్ఠమైనది. దేనివలనను మార్పుచెందనిది. కొందరకు కైవల్యమును, కొందరకు సాయుజ్య మును, మరికొందరకు పరమానందమగు పరమపదమును ప్రసాదించునది. 80

హేయగుణరహితమును, ఇంద్రియములకు గోచరముకానిదియు, తన భక్తులకు గోచరించుటకును లోకములను రక్షించుటకును 81

సకల దేవతలకును సిద్ధులకును యోగులకును హితము నొనగూర్పవలెనను దయతోడను, కాలమను ప్రవాహముచే గంభీరమై మాయయను సుడిగుండములచే నిండి యున్న సంసారసముద్రమునుండి 82

తరించు వరము నొసంగుటకు భక్తి జ్ఞాన పూర్వకముగా భజించువారిని కోరు వారికి సంపదలను, ఆయురారోగ్యములను వృద్ధిపొందించునదియు 83

అణిమాది సిద్ధుల నెనిమిదింటి నొసంగునదియు (అణిమా, మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము) అష్టాంగములతో గూడిన సద్విద్య నొసంగునదియు 84

మంత్ర, యంత్ర, మహాతంత్ర, దేవత్వములను సిద్ధింపజేయునదియు, తనఅంశ మువమందిన విగ్రహములకు సకలవిధ శక్తులనొసంగి ఫలము నొసంగునట్లు చేయుటకును,

భూతభవిష్యద్వర్తమానములలో రక్షించుటకు తగినదియు, తన ప్రఖ్యాతికి తానే కారణమైనదియు (స్వాభావికఖ్యాతికలది) ఎచ్చటనున్నను తన స్వరూప రూపగుణములతోనే యుండునదియు, నానా రూపములను ధరించునదియు, నశ్వరము కానిదియు నై యున్నది.

వైకుణ్ఠేన సహాగతం పరమిదం శ్రీవేఙ్కటాద్రిస్థలం ।
పూర్వం జ్ఞానవరాహమూర్తి హరిణాభూమ్యాసహాధిష్ఠితమ్ ।
లక్ష్మ్యాఽఽలిఙ్గితరూపమద్య సుగుణం కల్యాణ మత్తేదధత్ ।
శుద్ధంబ్రహ్మ తదేవవిశ్వ జననస్థేమ వ్యయానాం ప్రభుమ్ ॥ 87

సర్వాధ్యక్షం మహావిష్ణుం । సర్వలోకైక నాయకమ్ ।
కారుణ్యానన్ద బహుళ్యాత్ । సర్వాశ్చర్య మయం విభుమ్ ॥ 88

ఆనన్దమూర్తిమానన్దం । అచిన్త్యైశ్వర్యసంయుతమ్ ।
కోటి బాలార్క సఙ్కాశం । తడిత్కోటిసమప్రభమ్ ॥ 89

చన్ద్రికోటిప్రభం రత్న । జామ్బూనదపరిష్కృతమ్ ।
విమానదేవతామూర్తి । తేజోమణ్డలసంయుతమ్ ॥ 90

దివ్యంవిమానమారూఢం । స్థితంపరమశోభనమ్ ।
సర్వోత్తమం మహాప్రఖ్యం । సర్వాలఙ్కారభూషితమ్ ॥ 91

నీలజీమూతసఙ్కాశం । పీతామ్బరతటిద్వృతమ్ ।
రత్నతోరణవిద్యోతమాన । ద్వారప్రభాన్వితమ్ ॥ 92

పఞ్చాయుధవరైర్దివ్యైః । మూర్తిమద్భిరుపాసితమ్ ।
చణ్డప్రచణ్డప్రముఖైః । ద్వారపాలైరభిష్టుతమ్ ॥ 93

సునన్దనన్దప్రముఖైః । పారిషద్యైః సమన్వితమ్ ।
రవికోటిప్రకాశాఢ్యం । చన్ద్రికోటిసుశీతలమ్ ॥ 94

అనర్ఘరత్నఖచిత । దివ్యాభరణభూషితమ్ ।
అచ్యుతానన్తగోవిన్ద । ప్రముఖానన్తవిగ్రహమ్ ॥ 95

పూర్ణబ్రహ్మతమప్రఖ్య । కృష్ణరామావతారకమ్ ।
ఆద్యన్తరహితంసత్య । జ్ఞానవిజ్ఞానవిగ్రహమ్ ॥ 96

నిఖిలోపనిషత్సారఘన । సంవేద్యవిగ్రహమ్ ।
శ్రీభూమిసహితంశ్యామం । సున్దరం వేఙ్కటేశ్వరమ్ ॥ 97

శ్రేష్ఠమగు శ్రీ వేంకటాచలము వైకుంఠముతో నహా ఈ భూలోకమునకు వచ్చినది. పూర్వము జ్ఞానవరాహమూర్తి భూదేవతతో నవతరించియుండెను నేను లక్ష్మీ దేవితో కూడిన రూపము శుభకరమైయున్నది. శుద్ధబ్రహ్మ స్వరూపమే లోకమున సృష్టి స్థితి సంహారకారణమైయున్నది. 87

సకల జగమున కధిదేవతయు, సర్వవ్యాపియు, సకల ప్రపంచ నాయకుడును దయ, ఆనందముల యాధిక్యతచే నందర కాశ్చర్యభూతుడును, సర్వవ్యాపియు 88

ఆనందరూపుడును, ఊహించశక్యముగాని యైశ్వర్యోపేతుడును, కోటి లేత సూర్యుల బోలినవాడును, కోటి విద్యుత్కాంతులను బోలినవాడును, 89

కోటి చంద్రులవంటి కాంతిగలవాడును, రత్నములతోను, బంగారముతోను మలచబడి తేజఃపుంజమగు 90

దివ్యమగు విమానమున వధిష్ఠించియున్నట్టియు, అందరిలో నుత్తముడును, గొప్ప ప్రఖ్యాతిగలవాడును, సర్వవిధాలంకారభూషితుడును, 91

నల్లని మేఘమునుబోలి పీతాంబరముచే నలంకరింపబడినవాడును, రత్నతోరణములతో ప్రకాశించు ద్వారకాంతులచే విలసిల్లువాడును, 92

శరీరధారులగు పంచాయుధములచే పూజింపబడువాడును, చండ, ప్రచండ మొదలగు ద్వారపాలురచే స్తుతింపబడువాడును, 93

సునందనందాది ప్రమధులతో కూడినవాడును, కోటి సూర్యులవలె ప్రకాశించువాడును, కోటి చంద్రులవలె చల్లనగువాడును, 94

అమూల్యములగు రత్నములచే చెక్కబడిన దివ్యములగు నాభరణములచే నలంకరింపబడినవాడును, అచ్యుత, అనంత, గోవింద మొదలగు నామములచే ప్రకాశించు శరీరము కలవాడును, 95

పూర్ణబ్రహ్మయను శరీరముతో ప్రసిద్ధిని గనిన కృష్ణ, రామావతారములను ధరించినవాడును, ఆది అంతములు లేనివాడును, సత్య, జ్ఞాన, విజ్ఞానరూపుడును, 96

సకలోపనిషత్తులకు సారమగు శరీరము కలవాడును, శ్రీ భూదేవులతో కూడినవాడును, సుందరుడును, 97

అనేకకోటికందర్ప । లావణ్యమథనోత్థితమ్ ।
జగన్మోహనగోపాల । లీలావైచిత్ర్యకారణమ్ ॥ 98

నానాగమరసాభిజ్ఞైః । వైఖానసమహర్షిభిః ।
బ్రహ్మాగస్త్యభరద్వాజ । సనకవ్యాసనన్దనైః ॥ 99

వామదేవశతానన్ద । భృగ్వాద్యైశ్చ ప్రపూజితమ్ ।
జనకాద్యైర్నృపశ్రేష్ఠైః । అర్చితంపురుషోత్తమమ్ ॥ 100

మయాప్యఙ్గిరసాదేవి । లోకపాలైః సమర్చితమ్ ।
బహువర్షసహస్రాణి । స్వామిపుష్కరిణీతటే ॥ 101

మత్కుమారతపోధ్యాన । సమాధికుసుమార్చితమ్ ।
కుమారంపరమానన్ద । పరం విత్యాభిషేచితమ్ ॥ 102

మామన్తః కరుణానన్ద । స్వానుభూతిరసాలయమ్ ।
శఙ్ఖచక్రాభయోద్యుక్త । నితమ్బస్థచతుర్భుజమ్ ॥ 103

దర్శనీయతమం లోకే । ప్రసన్నవదనామ్బుజమ్ ।
ఆకర్ణాన్తవిశాలాక్షి । కటాక్షాబ్ధితరఙ్గిణమ్ ॥ 104

మన్దస్మితంసునాసాగ్రం । సుభ్రువంఫాలశోభితమ్ ।
జామ్బూనదేన్దుకస్తూరీ । కుఙ్కుమామ్యార్ధ్వపుణ్డ్రికమ్ ॥ 105

పాదనూపురమారభ్య । కిరీటాన్తైస్సమర్చితమ్ ।
వజ్రాఙ్కుశధ్వజాబ్జాది । రేఖపాదతలాఢ్యయోః ॥ 106

నఖమణ్డలచన్ద్రిణాం । జ్యోత్స్నయా జితమాయయోః ।
విలసత్కుచకాఠిన్య । కుఙ్కుమాఙ్కితరేఖయోః ॥
కమలాకరకాఠిన్య । భావిమ్రదిమశాలినోః ॥ 107

భజతాం పరమానన్ద । మకరన్ద వదాన్యయోః ।
అనర్ఘమాణిక్యమఞ్జీర । విద్యుత్పుఞ్జ ప్రభాయుతైః ॥ 108

మణికిఙ్కిణికాజాల । ఘోషైః వేదాన్తరూపిభిః ।
పాదారవిన్ద సౌందర్య । యోగ్యానర్ఘ సుభూషణైః ॥ 109

చారుజానూరులావణ్య ప్రభారఞ్జిత భూషణైః ।
వితమ్బవిలసత్పీత । కౌశేయామ్బర మేఖలైః ॥ 1 0

అనర్ఘరత్నఖచితైః । జామ్బూనద పరిష్కృతైః
విచిత్రతేజసాం పుఞ్జైః । కాఞ్చీవైడూర్యమణ్డలైః ॥ 111

నాభీపుటలసత్పీత । పద్మకోశ శ్రియోజ్జ్వలైః ।
ఊర్ధ్వరోమావళీభాభిః । జితేన్ద్రమణి కాన్తిభిః ॥ 112

ముక్తాదామలసద్వక్షః । స్థలపద్మాతడిత్కరైః ।
జ్యోతిర్మయైర్బ్రహ్మసూత్రైః । తపనీయమయోజ్జ్వలైః ॥ 113

కమ్బుగ్రీవాలసత్కణ్ఠ । మాలారత్న ప్రభాఙ్కురైః ।
పదకేషు లసన్నానా । మణిదీపావళీవరైః ॥ 114

సురత్నాఙ్గదకేయూర । కఙ్కణై రఙ్గుళీయకైః ।
ఇన్ద్రనీలమణిశ్యామ । రమణీయాహి భూషణైః ॥ 115

శఙ్ఖచక్రాభయాది । శ్రీభూషితైశ్చ భుజోత్తమైః ।
సుచారుచుబుకోల్లాసి । పల్లవాధర పాటలైః ॥ 116

వజ్రపఙ్క్తిలసద్దన్త । కాన్తిచన్ద్రితపస్మితైః ।
పూర్ణచన్ద్రముఖామ్భోజ । రమ్యనాసానమోన్నతైః ॥ 117

సువర్ణమకరప్రఖ్య । కుణ్డలాభ్యాం కపోలయోః ।
జితబాలార్కబిమ్బాభ్యాం । సౌన్దర్యాకరసీమయోః ॥ 118

దయామ్బుధి సుధాస్నాన । కమలాక్షిద్వయోత్సవైః ।
మణిచాపలతాచారు । భ్రూల్లసద్భాలపట్టకైః ॥ 119

వేదాంతస్వరూపములై మణులచే గ్రుచ్చబడిన చిరుగంటల శబ్దములు కలవియు, పాదారవిందముల సౌందర్యమునకు తగిన వెలలేని యాభరణములు కలవాడును. 109

అందమగు మోకాళ్లు తొడలయందలి లావణ్యముచే ప్రకాశించు నాభరణములు కలవాడును, మొలయందు ప్రకాశించుచున్న పట్టు వస్త్రమును, మొలనూలు కలవాడును,

వెలలేని రత్నములచే చెక్కబడి, బంగారముచే సంశోధింపబడినట్టియు, విచిత్రమగు తేజోరాశులుగల మొలనూలునందలి వైడూర్యములు కలిగినట్టియు, 111

బొడ్డునందు ప్రకాశించుచున్న పచ్చని పద్మగర్భమునందలి కాంతులచే ప్రకాశించుచున్నట్టియు, ఇంద్రనీలమాణిక్యములను మించిన నూగరుచే విలసిల్లువాడును, 112

ముత్యాలహారములచే ప్రకాశించు వక్షస్థలమున మెరపుతీగలవలె కాంతివంతములై బంగారువలె రాజిల్లు యజ్ఞోపవీతములు కలవాడును, 113

శంఖమువంటి మెడయందు ప్రకాశించు కంఠమాలయందలి రత్నకాంతులును, ఆ హారములయందు వ్రేలాడు పతకములయందలి దీపములవంటి మణులు కలవాడును 114

మేలు రత్నములచే జటితములగు భుజకీర్తులును, దండకడియములు, కంకణములు, ఉంగరములు కలవాడును, ఇంద్రనీలమణులవలె నల్లనగు సుందర సర్పములచేతను, 115

శంఖము, చక్రము, అభయముద్ర కాంతులచే నలంకరింపబడిన భుజములు కలవాడును, మిక్కిలి అందమగు గడ్డము కలిగి ప్రకాశించు లేతచిగురువంటి పెదవులు కలవాడును, 116

వజ్రముల వరుసలవలె కాంతివంతములగు దంతకాంతులచే వెన్నెలలవంటి చిరునవ్వు లొలికించువాడును, పూర్ణచంద్రునివంటి ముఖపద్మమునందలి సుందరమై యెత్తగు ముక్కు గలవాడును, 117

బంగారు మకరకుండలములు కలిగి లేత చంద్రబింబమువలెనుండి సౌందర్యమునకు హద్దువలెనున్న గండస్థలములు కలవాడును, 118

కృపయనెడు యమృతసాగరమున స్నానమొనరించు శ్రీదేవి కటాక్షముకలిగి, మణుల కదలికచే నందమగు కనుబొమ్మలపై ప్రకాశించు ఫాలప్రదేశము కలవాడును, 119

ఆనీలచికురాన్తస్థై । ర్ముక్తారాజివిరాజితైః
రమణీయసుకర్ణాక్షి । విటలాలక కున్తలైః ॥ 120

రాజత్కిరీట సౌన్దర్య జితకన్దర్పకోటిభిః ।
త్రితేజోఽధిక సఙ్కాశై ః । నానారత్నైర్మహాశ్రయైః ॥ 121

తప్తహాటకసంలగ్నైః । నానావైచిత్ర్యరశ్మిభిః ।
అలఙ్కృతం కిరీటేన । స్కన్దదత్తేన తేన చ ॥ 122

రాజమానందయామ్భోధిం । సుధాధారాభివర్షిణమ్ ।
సర్వాఙ్గభూషణైస్సర్వై । జగన్మోహనవిగ్రహమ్ ।
రూపలావణ్యసర్వాఙ్గ । భూషణాద్యైరతిప్రియమ్ ॥ 123

ఆపాదకేశవిలసన్మణిమన్మహార్హ । నేపథ్యజాలమణికాన్తితడిత్కలానామ్ ।
జామ్బూనదాగ్ర్యఖచితామలరమ్యభాసాం । సోపానపాలిభిరతీవ భృశాభిరామమ్॥

తారాగణేన్దురవిమణ్డలమణ్డితోఽద్య । త్సౌదామినీత్రిపథగాగ్రహరాశియుక్తమ్ ॥
తార్క్ష్యోదయాద్రికనకాచలశృఙ్గనిష్ఠం । కాలాభ్రబృన్దమివ కాన్తికులాభిరామమ్ ॥

శ్రీవేఙ్కటేశమతిసున్దరమోహనాఙ్గం । శ్రీభూమికాన్తమరవిన్దదలాయతాక్షమ్ ।
ప్రాణప్రియం ప్రవిలసత్కరుణామ్బురాశిం । బ్రహ్మేశవన్ద్యమమృతం వరదం భజామి ॥ 126

సతతం హృదయామ్భోజ । మధ్యే శ్రీవేఙ్కటేశ్వరమ్ ।
ప్రణవార్ధస్వరూపం తం । త్రిమణ్డలసుసంస్థితమ్ ॥ 127

చన్ద్రసూర్యాగ్నిబిమ్బానాం । ప్రకాశకరమచ్యుతమ్ ।
ధ్యానస్వరూపం దేవేశం । సర్వదానన్దదం మమ ॥ 128

ఆపాదమస్తకాన్తం వై । శ్రీమద్భూషణభూషితమ్ ।
చన్దనాగరుకర్పూర । కస్తూరీమృగలాఞ్ఛనైః ॥ 129

మిక్కిలి నల్లనగు ముంగురుల క్రింద దాగియున్న ముత్యములచే ప్రకాశించుచు. సుందరమగు చెవులు, నేత్రములు, ఫాలప్రదేశమునందలి ముంగురులు కలవాడును, 120

ప్రకాశించు కిరీట సౌందర్యముచే కోటి మన్మథులను జయింపజాలినవాడును, చంద్రసూర్యాగ్నులను మించిన కాంతిగలిగినట్టియు, గొప్ప ఆకరములలో (గనులలో) బుట్టిన అనేక విధములగు రత్నములతో 121

మేలిమి బంగారమునందలి విచిత్రకాంతులు కలిగి కుమారస్వామిచే నీయబడిన కిరీటముచే నలంకరింపబడి 122

ప్రకాశించువాడును, దయాసముద్రుడును, అమృతధారలను కురిపించువాడును, సకలాంగములయందలి భూషణములచే సకల జగన్మోహనరూపుడైనవాడును రూప, లావణ్యము, అన్ని యవయవములయందలి భూషణములచే మిక్కిలి ప్రియమైనవాడును, 123

పాదములనుండి తలవరకును నమూల్యములగు మణిమయ వస్త్రాద్యలంకారముల కాంతి మెరపులు కలిగి, మంచి బంగారు చెక్కడములయందలి కాంతులుకలిగిన మిక్కిలి సుందరుడును, 124

నక్షత్రసముదాయము, సూర్యమండలములచే నలంకరింపబడినవాడును, మెరపులు, గంగ, గ్రహరాశులచే కూడినవాడును, గరుడ, ఉదయాచలము, మేరుపర్వత శిఖరమున నుండువాడును, నీలిమేఘమువంటి కాంతిచే సుందరమైనవాడును, 125

మిక్కిలి మనోహరమగు శరీరముగలవాడును, శ్రీ భూదేవుల ప్రాణనాథుడును, తామరరేకులవలె విశాలమగు నేత్రములు కలవాడును, ప్రాణములకంటె ప్రియమైనవాడును, దయారసముచే ప్రకాశించువాడును, బ్రహ్మరుద్రాదులచే నమస్కరింపబడువాడును, అమృతస్వరూపుడును, కామితార్థప్రదాయుడునగు శ్రీ వేంకటాచలపతిని సేవించుచున్నాను. 126

ఓంకారార్థమగు స్వరూపముగలవాడును, సూర్యయోగి హృదయ పరమపదములయందు స్థిరముగ నుండునట్టియు భక్తుల హృదయ పుండరీకమధ్య విరాజిల్లు శ్రీ వేంకటేశ్వరుడును, 127

చంద్ర, సూర్య, అగ్నులను ప్రకాశింపజేయువాడును, ధ్యానమునకు తగిన స్వరూపముగలవాడును, దేవతలకు ప్రభువును, ఎల్లపుడు నానందమొసంగువాడును, 128

పాదములనుండి శిరమువరకు కాంతివంతములగు భూషణములచే నలంకరింపబడినవాడును, చందన, అగరు, కర్పూరము, కస్తూరి, పునుగు, 129

కుంకుమైర్ఘనసౌరభ్య । సువాసితదిగన్తరైః ।
మిశ్రితైర్దివ్యగన్ధైశ్చ । సులిప్తాఙ్గం మనోహరైః ॥ 130

నానావర్ణలసత్పుష్ప । దివ్యసౌరభ్యమాలయా ।
హిమామ్బుసిక్తయాదివ్య । వైజయన్త్యా విరాజితమ్ ॥ 131

కుమారస్వామినా నిత్యం । భక్త్యా నిర్మలచేతసా ।
దివ్యోత్సవైర్దివ్యరస । ప్రవాహామృతపాయసైః ॥ 132

దధిక్షీరఘృతైర్దివ్య । సూపాన్నమధుశర్కరైః ।
దివ్యసౌరభనైవేద్యైః । షడ్రసామృతపాయసైః ॥ 133

దివ్యోపచారైః కల్యాణ । వైభవైః షోడశాభిధైః ।
దివ్యసౌరభతామ్బూలైః । ముక్తాచూర్ణవిమిశ్రితైః ॥ 134

కర్పూరవీటికాభిశ్చ । దివ్యభోగైః సుపూజితమ్ ।
సర్వాఙ్గభూషణాధిక్య । లసత్కమలయా సహ ॥ 135

ధూపదీపమహాదీప । రాజన్నీరాజనోత్తమైః ।
సున్దరైశ్చామరైశ్ఛత్త్రైః । వ్యజనైర్దర్పణోత్తమైః ॥ 136

గీతవాదిత్రనృత్యైశ్చ । మృదఙ్గపటహానకైః ।
వీణావేణుసుతాలాద్యైః । గోముఖస్వరమణ్డలైః ॥ 137

తూర్యభేరీమశఙ్ఖద్వని । దివ్యఘోషైర్దివౌకసామ్ ।
సిద్ధకిన్నరగన్ధర్వా । ప్సరఃకిమ్పురుషవ్రజైః ॥ 138

సతుమ్బురుహాహామా । హూ, నారదాదిసురర్షిభిః ।
గరుడోరగయక్షాణాం । విద్యాధరవినోదినామ్ ॥ 139

సఙ్గీతమధురాలాపైః । స్కన్దస్తోత్త్రైః సతోషితమ్ ।
శుద్ధసత్త్వమయాకారం । అపి స్వామిసరస్తటే ॥ 140

కుంకుమల పరిమళాధిక్యముచే పరిమళించుచున్న దిక్కుల చివరలకలిగి యన్ని పరిమళములతో కలసిన దివ్యగంధమును సర్వాంగములయందలందినవాడును, 13

అనేక రంగుల పుష్పముల పరిమళముచే పరిమళించుచు, మంచుపీటితో తడసిన దివ్య వైజయంతీమాలతో ప్రకాశించువాడును, 131

నిర్మలమైన మనస్సుగల కుమారస్వామిచే భక్తితో సేవింపబడువాడును, దివ్యోత్సవములతోను, దివ్యరుచులుగల అమృతమువంటి పాయసము 132

పెరుగు, పాలు, నేయి మొదలగువాటితో పప్పన్నము, తేనె, చక్కెరలతో నొవరించిన ఆరు రుచులుగల (తీపి, పులుపు, ఉప్పు, కారము, వగరు, చేదు) వంటకములతోను 133

కల్యాణ వైభవములతోను పదునారు విధములగు నుపచారములతోను, మిక్కిలి పరిమళించు తాంబూలమును, ముత్యపుపొడితో కలసిన 134

కర్పూర తాంబూలముతోను, దివ్యభోగములతోను చక్కగా పూజింపబడువాడును, అవయవము లన్నిటియందలి భూషణములచే ప్రకాశించు లక్ష్మీదేవితో 135

ధూపదీప మహాదీపముతో నొప్పు హారతులతోను, సుందరములగు చామరముల తోను, గొడుగులతోను, వినవికఱ్ఱలతోను, అద్దములతోను, 136

పాటలు, వాయిద్యములు, నృత్యములతోను, మృదంగ, వీణ, పిల్లనగ్రోవి, తాళములు, బూరాలు మొదలగు వాయిద్యములతోను, 137

దేవతల వాయిద్యవిశేషము, భేరీ, మంచి శంఖముల దివ్యధ్వనులతోను, సిద్ధ కిన్నర, గంధర్వ, అప్సర, కింపురుష సమూహములతోను 138

తుమ్బుర, గంధర్వ, నారదాది దేవతాశ్రేష్ఠులతోను, గరుడ, శేష, యక్షులకును విద్యాధరులకును వినోదమును కలిగించు 139

సంగీత మధురగానములతోను, కుమారస్వామి స్తోత్రములతో సంతోషపెట్టబడినవాడును, శుద్ధ సత్వగుణ సంపూర్ణుడును 140

రమన్తం రమయాసార్థం । ఆనన్దకరమానసమ్ ।
వసన్తమమలానన్దం । ఆత్మారామం ముదాన్వితమ్ ॥ 141

సమస్తదేవతావన్ద్యం। సార్వభౌమశిఖామణిమ్ ।
కర్తారం సృష్టికాలే చ । భర్తారం పాలనే జగత్ ॥ 142

హర్తారం ప్రళయే కాలే । వేఙ్కటేశ్వరమవ్యయమ్ ।
సర్వదేవనియన్తారం । సర్వదేవేశ్వరేశ్వరమ్ ॥ 143

చరాచరాత్మకం విశ్వం । రక్షితారం కృపానిధిమ్ ।
కిరీటాఙ్గదసంరాజ । ద్దీర్ఘబాహుమరిన్దమమ్ ॥ 144

సర్వాఙ్గలక్షణానన్దం । దర్శయన్తం పదామ్బుజమ్ ।
సత్యం విశుద్ధవిజ్ఞానం । ఘనప్రజ్ఞాప్రదం హరిమ్ ॥ 145

కారుణ్యవిగ్రహం దేవం । సర్వజీవదయాపరమ్ ।
ఉపాస్మహే వయం నిత్యం । హృదయేఽష్టదళామ్బుజే ॥ 146

అష్టాక్షరపదానన్దం । రమేశం కర్ణికోపరి ।
ఏవం ధ్యేయం పురస్కృత్య । పశ్చాద్ధ్యానమిదం వదేత్ ॥ 147

యన్నామశ్రుతిసారసాన్ద్రజలధిస్థానే లసత్కౌస్తుభం ।
స్వాజ్ఞానాన్ధతమిస్రదుఃఖహరణం మత్యుప్రసఞ్జీవనమ్ ।
విశ్వాభీష్టవరప్రదానఫలదం భోగీన్ద్రసద్భూషణం ।
సర్వైశ్వర్యనిదానమాత్మవరదం శ్రీవేఙ్కటేశం భజే ॥ 148

సన్త్యేషో మమ వేఙ్కటేశనికటే శ్రీస్వర్ణముఖ్యాస్తటే ।
స్వావాసో భవతీతి దివ్యసరితః స్వర్గాపవర్గప్రదే ।
కైలాసే విధికుమ్భసమ్భవనుతే శ్రీకాళహస్తిస్థలే ।
కైవల్యే వపతామనన్తమహిమా యోగీశ్వరో దుర్లభః ॥ 149

శ్రీదేవితో స్వామిపుష్కరిణీ తీరమున విహరించువాడును, ఆనందము నొన గూర్చు మనస్సుకలవాడును, నిర్మలానంద స్వరూపుడును, తన స్వరూపమే తనకు ఉద్యాన వనమున నానందించువాడును, ఆనందస్వరూపుడును, 141

సకల దేవతలచే నమస్కరింపబడువాడును చక్రవర్తులలో నగ్రగణ్యుడును, సృష్టికాలమున సృష్టించువాడును, పాలించుకాలమున భరించువాడును 142

ప్రళయకాలమున సంహరించువాడును, నాశరహితుడును, సకల దేవతలను నియమించువాడును, సకల దేవతలకు ప్రభువును 143

ఇటునటు సంచరింపజాలు మనుష్య మృగ పక్షి జాతులను, నంచరింపజాలని కొండలు, వృక్షములు, రాయి, రప్ప మొదలగు ప్రపంచమును రక్షించువాడును, కరుణా సముద్రుడును, కిరీటము, భుజకీర్తులతో ప్రకాశించు సొగసగు చేతులుకలవాడును, 144

సర్వావయవములయందు చక్కని లక్షణములచే నానందమైనవాడును, తన పాదపద్మములే శరణమని చూపుచున్నవాడును, సత్యస్వరూపుడును, శుద్ధ సత్వగుణో పేతుడును, జ్ఞానరూపుడును, గొప్ప జ్ఞానము నొసంగువాడును, కరుణాస్వరూపుడును, సకల జీవులను దయతో చూచువాడును, 145, 146

'ఓం నమో వేఙ్కటేశాయ' యను నెనిమిది అక్షరములుగల పదముచే వెలుగు శ్రీ వేంకటేశ్వరుని మనస్సునందలి యష్టదళకమలములోని మధ్యభాగముపై నుంచుకొని నిత్యము నుపాసించుచున్నాము. ధ్యానము నిట్లు చేసిన తరువాత ధ్యానము నిట్లొనర్పవలయును. 147

పార్వతీ : ఎవని పేరుసంపత్తులసారమను నగాధసముద్రమున మెరయుచున్న కౌస్తుభరత్నమో, అజ్ఞానమను నంధతామిస్ర నరకరూపదుఃఖమును పోగొట్టునదియో, ఏ నామము నా పుత్రుని బ్రతికించినదో, ఏ నామము ప్రపంచమున నందరకు కామితార్థముల నొసంగునదియో, ఎవడాదిశేషునకు భూషణమువంటివాడో, సకలైశ్వర్యము లెవనిదయచే సిద్ధించుచున్నవో, నాకు వరముల నెవడొసంగునో యట్టి శ్రీ వేంకటేశుని సేవింతును. 148

నాకు శ్రీ వేంకటేశ్వరుని సన్నిధానమున నుండుటయు, స్వర్ణముఖీనదీతీర నివాసమును, స్వర్గమోక్షముల నొసంగు స్వామిపుష్కరిణీ తీరమున నునికియు, కైలాస మునను, బ్రహ్మ, అగస్త్యులచే స్తుతింపబడు శాళహస్తి క్షేత్రమున నిత్యనివాసమును, నాకు ప్రీతికరములు, కైవల్యమున నిపసించువారికిని గొప్ప మహిమగల శ్రీ వేంకటేశ్వరుడు పొందశక్యముకానివాడు. 14

తారం నతిం సముద్ధృత్య । శ్రీపూర్వం మన్త్రముచ్చరేత్ ।
నవాక్షరమిదం దేవి । సర్వగోప్యం హృది స్థితమ్ ।
త్వయి స్నేహాత్సమాఖ్యాతం । పరానన్దపదప్రదమ్ ॥ 150

నమః శ్రీవేఙ్కటేశాయ । శుద్ధజ్ఞానస్వరూపిణే ।
వాసుదేవాయ శాన్తాయ । శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥ 151

మన్త్రధ్యానమిదం కృత్వా । పశ్చాన్మన్త్రమిదం వదేత్ ।
నమః శ్రీవేఙ్కటేశాయ । నమోఽన్తం వా సముచ్చరేత్ ॥ 152

అష్టాక్షరమిదం ఖ్యాతం । భుక్తిముక్తిఫలప్రదమ్ ।
రహస్యం సర్వమన్త్రాణాం । గోపనీయం ప్రయత్నతః ॥ 153

స్వామిపుష్కరిణీస్నానం । వేఙ్కటేశ్వరదర్శనమ్ ।
మహాప్రసాదస్వీకారః । త్రయం త్రైలోక్యదుర్లభమ్ ॥ 154

సర్వత్ర కీర్తయేత్ప్రాజ్ఞః । స్వామిపుష్కరిణీం పరామ్ ।
సువర్ణముఖరీం దివ్యాం । వేఙ్కటేశ్వరమవ్యయమ్ ॥ 155

అజ్ఞానాన్ధతమఃసూర్యం । పాపినాన్తు న రోచతే ।
ఏతత్సూక్ష్మతరం పుణ్యం । యోగినామపి దుర్లభమ్ ॥ 166

స్వామిపుష్కరిణీం గఙ్గాం । సువర్ణముఖరీం పరామ్ ।
వేఙ్కటేశం హరిం వేతుం । సర్వతీర్థేషు సంస్మరన్ ॥ 157

మహాపాతకసఙ్ఘేభ్యో । ముక్తః ప్రజ్ఞానవాన్ భవేత్ ।
ఏతత్ స్థానం మహాపుణ్యం । పాపినాన్తు న రోచతే ॥ 158

స్వామిపుష్కరిణీతీర్థం । దివ్యౌషధరసాయనమ్ ।
వైద్యః శ్రీవేఙ్కటేశోఽయం । మృత్యురోగనికృన్తనః ॥ 159

"ఓం" అను అక్షరమును, "నమః" అను అక్షరములనుజేర్చి శ్రీకారపూర్వకముగా మంత్రము నుచ్చరించవలెను. ఇది తొమ్మిది యక్షరముల మంత్రము. అతి రహస్యముగా నా మనమున నుంచుకొనబడినది. ఇది మహానందస్థానమగు మోక్షము నొసంగునది. నీ యందలి ప్రీతిచే నీకు తెలిపితిని. 150

నిర్మల జ్ఞానస్వరూపుడగు శ్రీ వేంకటేశ్వరునకు నమస్కారము. సర్వ వ్యాపియు, శాన్తస్వరూపుడగు శ్రీనివాసునకు మంగళమగుగాక! 151

అని మంత్రమును ధ్యానించి పిమ్మట "నమః శ్రీ వేఙ్కటేశాయ" యని కాని "శ్రీ వేఙ్కటేశాయ నమః" యని కాని మంత్రము నుచ్చరించవలెను. 152

ఈ అష్టాక్షరి మంత్ర మిహలోకమున నున్నంతకాలము ముక్తిని, చనిపోయిన పిమ్మట మోక్షము నొసంగును. ఇది సకల మంత్రములలో రహస్యమైనది. అతి ప్రయత్నమునవైనను రహస్యముగా నుంచతగినది. 153

స్వామిపుష్కరిణిలో స్నానమును, శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటయు, శ్రీ వేంకటేశ్వరుని ప్రసాదమును భుజించుటయను నీ మూడును ముల్లోకములయందు పొంద శక్యముకానివి. 154

బుద్ధిమంతుడగువాడు గొప్పదగు స్వామిపుష్కరిణిని దివ్యమగు సువర్ణముఖరీ నదిని నాశరహితుడును 1 5

అజ్ఞానమను నంధకారమునకు సూర్యునివంటివాడునగు శ్రీ వేంకటేశ్వరు నన్నిస్థలములయందును స్తుతించుచుండవలెను. పాపాత్ములు దీని కిష్టపడరు. మిక్కిలి సులభమగు నీ పుణ్యము యోగీంద్రులకైనను పొందశక్యముకానిది. 156

స్వామిపుష్కరిణిని, గంగను, గొప్పదగు సువర్ణముఖరిని, వేంకటేశ్వరుని, శ్రీమన్నారాయణుని, సేతువును, సకల తీర్థములయందును తలంచుకొనువాడు 157

ఘోరపాప సంఘములనుండి విడివడి జ్ఞానవంతుడగును. ఈ సుస్పష్టముగానుండు మహాపుణ్యము పాపాత్ములకు మాత్రము రుచింపదు. 158

స్వామిపుష్కరిణీ తీర్థము దివ్యమగు నౌషధవిశేషము. వైద్యుడు శ్రీ శ్రీనివాసుడు మృత్యువనెడు రోగమును ఛేదించువాడు. 158

యావద్వేఙ్కటనాయకస్య శిఖరప్రాప్తిర్న వై యోగినామ్ ।
తావజ్జన్మజరాదిదుఃఖనిలయః సంసారకోలాహలః ।
బ్రహ్మాణ్డాన్తపరిభ్రమత్కృతమహాపుణ్యౌఘచన్ద్రోదయే ।
సత్సఙ్గామృతసేవనాద్ధరిమయే ప్రీతిర్భవేద్వేఙ్కటే ॥ 160

యావన్నాస్తి సమస్తలోకరమణః శ్రీవేఙ్కటేశాభిధః ।
స్వానన్దానుభవస్థిరోఽమలధియాం యోగీశ్వరాణాం నృణామ్ ।

నానాయోనిషు గర్భవాసమసుఖం విణ్మూత్రశోకాకులం ।
సమ్ప్రాప్యాఽఖువినాశదుఃఖనరకాంస్తావద్భవాబ్ధౌ స్థితిః ॥ 161

ఆఖ్యానం దేవతాగోప్యం । బ్రహ్మగోప్యం సమాసతః ।
ఇదమేవ మమానన్దం । ధ్యానం హృదయగోచరమ్ ॥ 162

అస్య శ్రీవేఙ్కటేశస్య । సీమాయాం యాత్రికే జనే ।
వాఙ్మనఃకాయవర్గేణ । యే కుర్వన్తి నరాధమాః ॥ 463

ఉపద్రవఞ్చ ఘాతఞ్చ । దివ్యఞ్చాపహరన్తి తే ।
రౌరవాదిషు సర్వేషు । నరకేషు చ దారుణమ్ ॥ 164

బ్రహ్మకల్పసహస్రాన్తం । పచ్యన్తే నాత్ర సంశయః ।
భక్త్యా శ్రీవేఙ్కటేశస్య । సీమారక్షాం కరోతి యః ॥ 165

స ఏవ రాజ్యకర్తా స్యాత్ । దేహాన్తే ముక్తిమాప్నుయాత్ ।
పరమానన్దదం ధ్యానం । కృత్వాఽన్నం భుజ్యతే మయా ॥ 166

త్వయా సమో నైవ నైవ । ధ్యేయో బ్రహ్మాణ్డగోలకే ।
సత్యం శ్రీవేఙ్కటేశస్య । నమః కాలత్రయేఽపి వా ॥ 167

ఏతం రహస్యమధ్యాయం । శ్రీవేఙ్కటపతేః ప్రియమ్ ।
జపిత్వా భుజ్యతే యేన । ప్రత్యహం పరమాత్మనః ॥ 168

శ్రీ వేంకటేశ్వరుని నివాసమగు వేంకటాచల శిఖరమును చూడనంతవరకు రోగులకైనను జన్మ, మువలితనము మొదలగు దుఃఖముల కాలవాలమగు సంసార ఘోష తప్పదు. ప్రపంచ పర్యటనలో కావించిన గొప్ప పుణ్యరాశియను చంద్రోదయమున సజ్జనసాంగత్యమను సముద్రమును సేవించిన శ్రీమన్నారాయణుని నివాసమగు శ్రీ వేంకటాచలమున ప్రీతి సంభవించును. 160

నిర్మలాంతఃకరణులగు యోగీంద్రులకును, మనుజులకును సకలలోక సంతోష కరుడగు శ్రీ వేంకటేశ్వరు డెంతకాలము యానందానుభవమున స్థిరముగామండడో అంత వరకును మలమూత్ర కష్టములచే కలుషితమగు గర్భవాస దుఃఖమనేకజన్మలవరకును పొంది నశించుట, దుఃఖించుట మొదలగు నరకములను పొందుచు సంసారసాగరమున పడియుందురు. 161

ఈ చరిత్ర దేవతలకును, తుదకు బ్రహ్మకైనను చెప్పక రహస్యముగా నుంచ దగినది. ఇదియే నా మనస్సునందలి యానందధ్యానము. 162

ఈ శ్రీ వేంకటేశుని నివాసమునకు హద్దుగానుండు స్థలమున యాత్రలకైవచ్చు జనుల విషయమై వాక్కుతోగాని, శరీరముతోగాని 163

విప్లవమునుకాని, హత్యనుకాని, ధనమును దొంగిలించుటనుగాని యొనరించిన నీచ మానవులు రౌరవాది మహానరకములయందు 164

వేయి బ్రహ్మకల్పముల చివరవరకు యాతనల ననుభవింతురు. భక్తితో శ్రీ వేంకటేశ్వరుని నివాసమునకు హద్దుగానుండు స్థలమును కాపాడునో 165

అతడే రాజ్యమున కధిపతియై శరీరాంతమున ముక్తినిపొందెను. పరమానందము నొసంగు శ్రీ వేంకటేశుని ధ్యానముచేసిన తరువాతనే నేను నీతో నన్నమును భుజించుచున్నాను. 166

శ్రీ వేంకటేశునితో సరిపోల్పదగిన దైవమే ప్రపంచమున లేనేలేదు. శ్రీ వేంకటేశునకు భూతభవిష్యత్ వర్తమాన కాలములయందు నమస్కారము. 167

ఈ రహస్యాధ్యాయము శ్రీ వేంకటాచలపతికి మిక్కిలి ప్రియమైనది. ప్రతి దినము దీనిని జపించి భుజించువారికి 168

నృత్యన్తి పితరః సర్వే । సన్తుష్టాస్తస్య వంశజాః ।
దేవాశ్చ ఋషయస్తృప్తాః । ప్రయాన్తి పరమం పదమ్ ॥ 169

ఋషయః —

ఆశ్చర్యమతులం శ్రుత్వా । పరమానన్దనిర్వృతాః ।
అనన్దాశ్రుపరిక్లిన్నా । రోమాఞ్చితవపుర్ధరాః ॥ 170

విస్మితాః శౌనకాద్యాస్తు । భక్త్యాఽఽనన్దంపునర్గతాః ।
పునర్ధ్యానం సమాసాద్య । పునర్గద్గదయా గిరా ॥ 171

ఊచుః శనైర్మహాత్మానం । సూతం పౌరాణికోత్తమమ్ ।
వ్యాసశిష్యం మహాభాగం । శాస్త్రసిద్ధాన్తకోవిదమ్ ॥ 172

అద్య శ్రుతం శ్రుతం ముఖ్యం । అద్యానన్దం గతా వయమ్ ।
అద్యైవ జన్మ సఫలం । సాక్షాత్సంసారమోచకమ్ ॥ 173

త్వత్ప్రసాదాద్గమిష్యామో । వయం శేషాచలం ప్రతి ।

శ్రీసూతః —

అష్టాదశపురాణేతి । హాసానాముపధర్మినామ్ ॥ 174

పురాణానాం స్మృతీనాఞ్చ । సర్వేషాం శ్రుతిసారిణామ్ ।
అఖిలోపనిషత్సార । వేదాన్తానాం మునీశ్వరాః ॥ 175

శ్రవణైశ్చ కృతైర్యోగైః । భక్తిజ్ఞానవిరాగదైః ।
యజ్ఞదానతపఃకర్మ । వ్రతమన్త్రజపార్చనైః ॥ 176

ఆజన్మ నైమిశారణ్య । కృతపుణ్యైరనేకశః ।
భవతామాగతం హస్తే । సాక్షాత్సంసారమోచకమ్ ॥ 177

వైకుణ్ఠస్థానశేషాద్రి । ప్రాప్తిరూపం మహత్ఫలమ్ ।
అహం గోప్యమిదం వేద్మి । శుకో వేత్తి న చాపరః ॥ 178

మద్గురోః కృపయాఽధీతం । ఉక్తఞ్చ భవతాం ద్విజాః ।
గచ్ఛధ్వం మునయః సర్వే । సస్త్రీవృద్ధాః సబాలకాః ॥ 179

పింశమున షష్టిన పితృదేవతలందరును, సంతోషముతో నాట్యమొనరింతురు. దేవతలును ఋషులును తృప్తులై పరమపదము నందుదురు. 169

ఋషులు —

ఇట్లు సూతుడీ చరిత్రమును చెప్పగా విని అపరిమితానందము ననుభవించిన వారై ఆశ్చర్యమును చెందుచు కనులలో యానందాశ్రువులు నిండియుండ పులకితగాత్రులై

భక్తితో పరవశులై మరల ధ్యానమునుపొంది వణకుచున్న మాటలతో 171

మహాత్ముడును, పురాణమును చెప్పువారలలో నుత్తముడును, వ్యాసుని శిష్యుడును, పూజ్యుడునగు సూతునితో 17

నేడు ముఖ్యముగా వినవలసినదానిని వింటిమి. మాకు చాలనానందము కలిగినది. నేడే మా జన్మ సఫలమైనది. మా కిపుడే సంసారబంధము వీడిపోయినది. 173

నీ యనుగ్రహమువలన మేము శేషాద్రికేగెదము"ని పలికినంతనే సూతుడు వారితో — పదునెనిమిది పురాణములను రామాయణ భారత యితిహాసములను, ధర్మశాస్త్రములను, 174

ఉపపురాణములను, వేదసారములన్నిటిని, ఉపనిషత్సారములగు వేదాంతములను 175

వినుటవలన, యోగసాధనములవలన, భక్తి, జ్ఞాన, వైరాగ్యముల నొసంగు యజ్ఞ, దాన, తప, కర్మ, వ్రత, మంత్ర, జప, అర్చనల వలన 176

బ్రతికియున్నంతకాలము నైమిశారణ్యమున నొనర్చిన అనేక విధములగు పుణ్యములచేతను, సాక్షాత్తుగా సంసారము బంధమును పారద్రోలు 177

రెండవ వైకుంఠమనదగు శేషాచలమును పొందగలుటయను గొప్ప ఫలము మీకు కైవశమైనది (లభించినది). నేనే దీని నతి రహస్యముగా నెంచుచున్నాను. శుక యోగీంద్రుడు తప్ప అన్యు లీరహస్యము నెఱుంగరు. 178

మునీంద్రులారా! నా గురువగు వ్యాసుని దయచే నధ్యయనము చేయబడినది మీకు తెలుపబడినది. మీరు వెళ్ళి స్త్రీలతోను, వృద్ధులతోను, బాలురతోను 179

సమాప్య సత్రం సకలం । విలమ్బా మాస్తు శీఘ్రతః ।
తత్ర గత్వోపవాసేన । స్నాత్వా స్వామిసరోవరే ॥ 180

నత్వాఽద్యం భూమివారోహం । జ్ఞానక్షేత్రనివాసినమ్ ।
దివ్యం విమానమాశ్చర్యం । నత్వా శ్రీవేఙ్కటేశ్వరమ్ ॥ 181

ప్రదక్షిణనమస్కారైః । స్తుత్వా స్తోత్రైః ప్రణమ్య చ ।
నైవేద్యదానధర్మైశ్చ । పూజాం కృత్వా చ భక్తితః ॥ 182

మౌనవ్రతమథ త్యక్త్వా । క్షమాపూర్వం వరప్రదమ్ ।
సమ్ప్రార్థ్య నివసామోఽత్ర । భూయాత్తేఽనుగ్రహో మహాన్ ॥ 183

ఇత్యేవం కాయవాక్చిత్తైః । నివాసం సత్యమీరితమ్ ।
కురుధ్వం త్వరయా భక్త్యా । యూయం వైకుణ్ఠవేఙ్కటే ॥ 184

పరమానన్దసాన్ద్రాబ్ధౌ । క్రీడధ్వం మునిపుఙ్గవాః ।
సమస్తదేవతాసిద్ధ । సన్నిధావాత్మవేఙ్కటే ॥ 185

స్వామినా క్షేత్రపాలేన । సుప్రసన్నేన రక్షితే ।
ఖిఘాసమపి నిర్విఘ్నం । కురుధ్వమవిశఙ్కయా ॥ 186

తయోరనుగ్రహాచ్చైవ । వైకుణ్ఠక్షేత్రపాలయోః ।
భద్రం వో వసతాం నిత్యం । శాశ్వతం భవతి ద్విజాః ॥ 187

అస్మిన్ క్షేత్రే కృతానాఞ్చ మహతాం పాపకర్మణామ్ ।
క్షేత్రపాలస్య శూలాగ్రే । యాతనా చక్రవద్భవేత్ ॥ 188

యుగాన్తం క్షణమాత్రేణ । తేషాం కాలస్తు గచ్ఛతి ।
పాపాన్తే ముక్తిరస్త్యేవ । వేఙ్కటాద్రౌ న సంశయః ॥ 189

సత్యం సత్యం పునః సత్యం । మద్గురోర్వచనం ద్విజాః ।
భవితాం పుణ్యశీలానాం । నైమిశారణ్యవాసినామ్ ॥ 190

యాగమునంతయు పూర్తిగావింతురు. ఆలసింపవలదు. శేషాచలమునకేగి యచట స్నానముతో స్వామిపుష్కరిణిలో స్నానమొనరించి 180

జ్ఞానక్షేత్రమునయున్న ఆదివరాహస్వామిని సేవించి, ఆశ్చర్యకరమగు నా దివ్య విమానమునకు నమస్కరించి శ్రీ వేంకటేశ్వరుని 181

ప్రదక్షిణ నమస్కారములతోను, స్తోత్రములతోను నుతించి, నమస్కరించి భక్తితో నైవేద్యమును, దాన, ధర్మముల నొనరించి పూజించి 182

మౌనవ్రతమును వీడి వరప్రదుడగు శ్రీనివాసుని మిమ్ములను క్షమింపుమని ప్రార్థించుచు " స్వామీ ! నేమిచ్చట నివసించెదము. నీ యనమానానుగ్రహము మాకు కలుగునగాక' యని 183

మనోవాక్కాయములచే వేడుకొని యచ్చట నివసింపుడు. నేను నిజమునే చెప్పు చున్నాను. మీరు శీఘ్రముగా భక్తితో శ్రీ వేంకటాద్రియను 184

మహానందసాగరమున క్రీడింతురు. సకల దేవతలకును సిద్ధులకును నివాసమై, 185

నిర్మలానుగ్రహముగల క్షేత్ర సంరక్షకుడగు స్వామిచే సంరక్షింపబడుచున్న శేషాద్రియందు శత్రుభయములేక సందేహింపక స్వేచ్ఛగా నివసింపుడు. 186

శ్రీనివాసుని, క్షేత్రపాలుర యనుగ్రహముచే నచ్చట నివసించు మీకు స్థిరమగు సంరక్షణ జరుగగలదు. 187

ఈ క్షేత్రమున నొనరించిన గొప్పపాపాత్ములకు క్షేత్రరక్షకుని శూలపుకొనలో యమబాధలు ఛిన్నాభిన్నములై పోవునట్లు నశించును. 188

శ్రీ వేంకటాచలమున నివసించువారికి యుగముకూడ క్షణములో గడచిపోవును' పాపముల నశింపించిన పిమ్మట శ్రీ వేంకటాచలమున నివసించువారికి మోక్షము తప్పక సిద్ధించును. 189

మునిపుంగవులారా ! నా గురువు మాటలు ముమ్మాటికిని సత్యము. నైమిశారణ్యమున నివసించు పుణ్యాత్ములగు 190

కృపయాఽనుగ్రహం । లబ్ధ్వా । కాశీం గత్వా ప్రణమ్య చ ।
మద్గురోః పాదమూలఞ్చ । వ్యాసస్యామిత తేజసః ॥ 191

అనుజ్ఞయా గమిష్యామిం । వేఙ్కటాద్రిం ద్విజోత్తమాః ।
సూతవాక్యం తదా శ్రుత్వాం । శౌనకాద్యా ఋషీశ్వరాః ॥ 192

సమాప్య సత్రమాగత్య । వేఙ్కటాద్రిమనూష్య చ ।
సూతవాక్యప్రమాణేన । తత్రానన్దపదామ్బుధౌ ॥ 193

దేహాన్తం ప్రాప్య మోదన్తే । ససూతాః శౌనకాదయః ।
ఇమం పవిత్రమధ్యాయం । సాక్షాత్సంసారమోచకమ్ ॥ 194

సర్వవేదాన్తసిద్ధాన్తం । యః శ్రావయతి నిత్యశః ।
వేఙ్కటేశ్వరభక్తేభ్యో । బ్రాహ్మణేభ్యశ్చ యోగినామ్ ॥ 195

యః శృణోతి సదా భక్త్యా । రహస్యానుభవోత్తమమ్ ।
యః స్థాపయతి లోకేఽస్మిన్ । సిద్ధాన్తమిమమద్భుతమ్ ॥ 196

విద్యార్థీ లభతే విద్యాం । ధనార్థీ లభతే ధనమ్ ।
పుత్రార్థీ లభతే పుత్రాన్ । కన్యార్థీ లభతే వధూమ్ ॥ 197

వశ్యార్థీ వశ్యమాప్నోతి । జయార్థీ జయమాప్నుయాత్ ।
మోక్షార్థీ మోక్షమాప్నోతి । జ్ఞానార్థీ జ్ఞానమాప్నుయాత్ ॥ 198

యాం యాం కామయతే సిద్ధిం । తాం తామాప్నోతి స ద్విజః ।
వేఙ్కటేశే పరాం ప్రీతిం । లభతే సోఽతిభక్తిమాన్ ॥ 199

ఇతి శ్రీభవిష్యోత్తరపురాణే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే ఉమామహేశ్వర సంవాదే
సకలోపనిషత్సిద్ధాన్త శ్రీవేఙ్కటేశ్వర రహస్యానుభవోనామ
అశీతితమోఽధ్యాయస్సమ్పూర్ణః

---

మీ దయచే నను గ్రహింపబడి కాశికేగి నాకు గురువును నపరిమిత తేజశ్శాలి యగు వ్యాసమహర్షి పాదపద్మములకు నమస్కరించి 191

వారి అనుగ్రహముచే వేంకటాచలమున కేగెదనని తెలుపగా శౌనకాది మహర్షులు 192

యాగమును పూర్తిచేసి శ్రీ వేంకటాచలమున నివసించి సూతుడు చెప్పిన ప్రకారము వేంకటాచలమను ఆనందసాగరమున 193

శరీరములను విడచి సంతసించిరి. ఈ పవిత్రమగు అధ్యాయము తప్పక సంసార బంధమును నిర్మూలింపజేయును. 194

సకల వేదాంతములచే స్థిరీకరింపబడిన యీ చరిత్ర నెవరు ప్రతిదినము శ్రీ వేంకటాచలపతి భక్తులగు బ్రాహ్మణులకును, యోగీంద్రులకును వినిపించునో వాతడును 195

ఎవడీ రహస్యానుభవమును భక్తితో నెల్లపుడు వినుచుండునో, ఎవడీ లోకమున నీ యాశ్చర్యకరమగు సిద్ధాంతమును వ్యాపింపజేయునో యాతడు సంసారబంధమును వీడి పరమపదమునందును. 196

విద్యార్థి యీ యధ్యాయమును వినిపించుట, వినుట, సిద్ధాంతమును వ్యాపింప జేయుట నొనరించిన విద్యను పొందును. ధనము కోరినవాడు ధనమును బడయును. పుత్రులను కోరువారు పుత్రులను, భార్యను కోరువారు భార్యను 197

ఇతరులను వశపరచుకొన గోరువారు వానిని, జయమును కోరువారు జయమును మోక్షేచ్ఛగలవారు మోక్షమును, జ్ఞానాభిలాషులు జ్ఞానమును పొందగలరు. 198

బ్రాహ్మణుడు తానెట్టి కోరికతో నీ యధ్యాయమును పఠించిన నా కోరికల నందగలుగును. అత డత్యధిక భక్తికలవాడై శ్రీ వేంకటాచలపతియందు మిక్కిలి ప్రీతి కలవాడు కాగలడు. 199

ఇది శ్రీ భవిష్యోత్తరపురాణమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున పార్వతీపరమేశ్వర సంవాదమున నుపనిషత్తుల సిద్ధాంతమగు శ్రీ వేంకటేశ్వర రహస్యానుభవమను ఎనుబదియవ అధ్యాయము సంపూర్ణము

# చతుర్వింశో ఽధ్యాయః

## మేరుశిఖరా చ్ఛక్రబ్రహ్మర్షేః వేఙ్కటాచలాగమనమ్

దేవలః —

దేవదర్శన ! దేవర్షే ! । బ్రహ్మభూయకరం పరమ్ ।
దుఃఖఘ్నానన్దనం బ్రూహి । ధర్మ కర్మవిమోచనమ్ ॥ 1

దేవదర్శనః —

సాధు దేవల భూదేవ ! । యత్పృష్టోఽహ మిహ త్వయా ।
శృణు విద్వన్ । విశేషేణ । వక్ష్యామి తవ సువ్రత ॥ 2

ఇతిహాస మిమం పుణ్యం । చతుర్వర్గఫలప్రదమ్ ।
యశస్కరం రఞ్జనకం । ఆయురారోగ్యభూతిదమ్ ॥ 3

పురా సుమేరుశిఖరే । నానారత్నవిచిత్రితే ।
ఖచితానేకమాణిక్యే । సౌవర్ణే కుట్టిమస్థలే ॥ 4

అనుస్యూతస్రవద్దేవ- । స్రవన్తీ నిర్ఝరాప్లుతే ।
మయూఖోద్దామరత్నౌఘ । ఖణ్డితధ్వాన్తకుఞ్జకే ॥ 5

సాన్ద్రస్నిగ్ధ తరుచ్ఛాయ । సురద్రుమవనోదరే ।
మకరన్దం స్రవన్తీభిః । స్రగ్భిస్తు పరిలమ్బితే ॥ 6

మాణిక్యస్తమ్భమహితే । మకరాసన తోరణే ।
విచిత్రరత్న ప్రత్యుప్త । స్వర్ణస్తమ్భచతుష్కకే ॥ 7

సింహాసనే మహారత్న । విచిత్రాంశువిరాజితే ।
సావిత్ర్యా చ సరస్వత్యా । సదా ఽఽసీనః పితామహః ॥ 8

గన్ధర్వై ర్గర్వనిర్వాహైః । గానవిద్యావిచక్షణైః ।
గాయద్భిః కిన్నరగణైః । గీయమాన శ్చ వీణయా ॥ 9

# ఇరువదినాల్గవ అధ్యాయము

## మేరుశిఖరమునుండి శుకయోగీంద్రుడు వేంకటాచలమునకు వచ్చుట

దేవలుడు —

దేవదర్శనా ! దేవర్షీ ! బ్రహ్మతో సమానమగు రూపమును లభింపజేయునదియు శుభకరమును, శ్రీమన్నారాయణునకు ప్రీతినొసంగునదియు, ప్రారబ్ధకర్మమును పారద్రోలునదియునగు ధర్మమును తెలుపుమని దేవలుడు దేవదర్శను నడిగెను. 1

దేవదర్శనుడు —

దేవలా ! బ్రాహ్మణోత్తమా ! చక్కగా నడిగితివి. నీకు దానిని విస్తారముగా తెలిపెదను. వినుము. 2

చతుర్విధ పురుషార్థముల నొసంగునదియు, కీర్తిదాయకమును, మనోహరమును, ఆయురారోగ్యైశ్వర్యప్రదమును నగు నీ పవిత్ర చరిత్రము 3

పూర్వము వివిధ రత్నాలంకృతమును, అనేక మాణిక్యఖచితమును, బంగరు చదునైన స్థలమున 4

అవిచ్ఛిన్నముగ ప్రవహించు గంగానదీనుండి ప్రవహించు సెలయేరులచే తడుపబడుచున్నదియు, సూర్యకాంతమణి సముదాయములచే వెలుగొందుచున్న పొదరిండ్లను కలిగినట్టియు 5

దట్టమగు చల్లని వృక్షచ్ఛాయలుగల కల్పవృక్షములు కలదియు, మకరందమును స్రవించుచున్న పూదీవియలు వ్రేలాడుచున్నదియు 6

మాణిక్య స్తంభములచే సుశోభితమును, మకరతోరణము కలదియు, విచిత్ర రత్నగుంభిత బంగరు స్తంభములు వాగ్గి కలదియు 7

మహారత్నముల విచిత్రకాంతులచే ప్రకాశించునదియునగు సింహాసనమున సావిత్రీ సరస్వతులతో కూడి బ్రహ్మ ఆసీనుడై 8

దర్పోద్ధతులును గాన విద్యాపారంగతులగు గంధర్వులచేత నుతింపబడుచు, కిన్నరగణముల వీణలచే పాడబడుచు 9

స్తూయమాన స్తుమ్బురుణా । హాహాహూహూత్తతేజసా ।
సేవ్యమానః సహస్రాక్ష । ప్రముఖైః సురసత్తమైః ॥ 10

బ్రాహ్మీభిః శక్తిభి ర్బ్రహ్మ । భాషాభూషాభి రాత్మభూ ।
అంశుకాభరణాలేపా । కల్పహస్తాభి రన్తికే ॥ 11

వసిష్ఠప్రముఖైః బ్రహ్మ । మునిభి సిద్ధచారణైః ।
మార్కండేయమరీచ్యత్రి । భృగుపూర్వై ర్మహర్షిభిః ॥ 12

శాపానుగ్రహసామర్థ్య । సాధనై శ్చ తపోధనైః ।
మాహాత్మ్యం పుణ్యదేశానాం । ఊచివద్భిః పరస్పరమ్ ॥ 13

సమన్తతః సేవ్యమానః । సేవారసవిశారదైః ।
నిషద్గణైః ఉపనిషద్గణైః । శ్రుతిగణై రపి ॥ 14

సాఙ్గైః సంశిక్షితమనా । విశ్వసర్గవిలాసభూః ।
ఆస్తే సమాలపన్ బ్రహ్మ । స్వపదాహ్లాదనిర్భరః ॥ 15

కథాప్రసఙ్గా దత్రైవ । నారాయణగిరే ర్మహత్ ।
మాహాత్మ్య మావిర్భావఞ్చ । శ్రీనివాసస్య శార్ఙ్గిణః ॥ 16

శ్రుత్వా శుకః పరమ ఋషిః । సభాయాం సముపస్థితః ।
స దేశం తం దిదృక్షు స్సన్ । కౌతూహల సమన్వితః ॥ 17

విజ్ఞాపయన్ బ్రహ్మణే తం । నమస్కృత్య చ సర్వతః ।
జగామ తస్మా ద్దేశా ద్ద్వై । దక్షిణాభిముఖః సుధీః ॥ 18

వాసుదేవే వహన్ భక్తిం । పురాణ పురుషోత్తమే ।
తత్కథాఽఽలాప కుతుకః । స్మయమాన ముఖో మునిః ।
దదర్శ నారాయణాద్రిం । తత్ర నారాయణాశ్రమమ్ ॥ 19

హాహా హూహూ యను గానముచేయు గంధర్వులచేతను, తుంబురునిచేతను స్తుతింపబడుచు దేవేంద్రాది దేవతా ప్రముఖులచే సేవింపబడుచు 10

దేవభాషయే ఆధారముగాగలిగి వస్త్రములు, ఆభరణములు, చందనాదులు మొదలగు అలంకార ద్రవ్యములను చేతులలో ధరించియున్న బ్రహ్మ సంబంధమైన శక్తి యనబడు స్త్రీలచే (సేవింపబడుచున్న చతుర్ముఖబ్రహ్మ) 11

వసిష్ఠుడు మున్నగు బ్రహ్మర్షులచేతను, సిద్ధ చారణులచేతను, మార్కండేయ, మరీచి, అత్రి, భృగువు మొదలగు యోగిపుంగవులచేతను, 12

శపించుటకును, శాపములను పోగొట్టి యనుగ్రహించుటకును సామర్థ్యమునకు వలయు సాధనములు కలిగినట్టియు, పుణ్యదేశముల మాహాత్మ్యము నొండొరులతో భాషించుకొనునట్టి కైంకర్య రసమును బాగుగ నెఱింగిన మునీంద్రులచే సంతతము సేవింపబడుచు,

అంగములతో కూడియున్న శాస్త్రసముదాయములు, ఉపనిషత్తులు వేదాంతముల చేత లెస్సగా శిక్షింపబడిన మనస్సుగలవాడై ప్రపంచ సృష్టియను లీలకు కారణభూతుడైన (బ్రహ్మ) తన పదవివలన కలిగిన యానందముచే పరిపూర్ణుడగుచు యా మునీంద్రులతో భాషించుచుండ 14, 15

సంభాషణ మధ్యమున నారాయణపర్వతము యొక్కయు, శార్ఙమను ధనువును ధరించిన శ్రీనివాసుని మాహాత్మ్యము, అవతారమును గురించి 16

సభలోనున్న మహాయోగియగు శ్రీ శుకుడు విని యా నారాయణాద్రిని చూచు వేడ్కతో కూడినవారై 17

బ్రహ్మకు నమస్కరించి తన కోర్కెను విజ్ఞాపన మొనరించి యచ్చటనుండి నుండి దక్షిణ దిక్కున కేగెను. 18

ఆదిమధ్యాంతరహితుడును, పురుషోత్తముడునగు శ్రీమన్నారాయణునియందు భక్తికలిగి యాతని కథలను కీర్తించుటయందే కుతూహలము కలిగి మందస్మితవదనారవిందుడై శుకమహర్షి నారాయణాద్రిని యచ్చటి నారాయణాశ్రమమును గాంచెను. 19

## శ్రీవేఙ్కటాచల వర్ణనమ్

నీల జీమూత ముదిత । నీలకణ్ఠ విడమ్బనమ్ ।
శృఙ్గకోటి రవి క్రాన్త । వాలఖిల్య కులాకులమ్ ॥ 20

తిగ్మాంశ్వశ్వఖురక్షుణ్ణ । శృఙ్గమాణిక్యమణ్డలమ్ ।
అమృతాంశు కరస్పర్శ । నిర్యదిన్దుదృషద్ద్రవమ్ ॥ 21

తుఙ్గ శృఙ్గ స్ఫురద్రత్న । తరళీకృత తారకమ్ ।
మాణిక్య కుణ్డల మహో । మాద్యద్ద్యు మణి మణ్డలమ్ । 22

వియల్లిహోత్తుఙ్గశృఙ్గ । విశఙ్కట విటఙ్క కమ్ ।
చన్ద్రికాన్తస్రవాస్వాది । చకోరకులసఙ్కులమ్ ॥ 23

స్ఫాటికాశ్మదరీశృఙ్గ । నిర్యన్నిర్మల నిర్ఝరమ్ ।
అధిత్యకారూఢపుల్ల । లోధ్ర సింహవిడమ్బనమ్ ॥ 24

మాకన్ద కుసుమా మన్ద । మకరన్ద సముక్షితమ్ ।
దన్తావల ఘటాఘాత । దగ్దుర ప్రస్థ కన్దరమ్ ॥ 25

వ్యత్క్రమక్రమణాక్రాన్త । శరభప్రస్థదు స్థలమ్ ।
మహాన్ధకారమహిమ । దుర్నిరీక్ష్యమహార్షభమ్ ॥ 26

ఆఘ్రాతవ్యాకులప్రాణి । వ్యాఘ్రభీమభృగుస్థలమ్ ।
నిర్ఝరాపాతపర్యన్త । గ్రస్తముస్తార్థసూకరమ్ ॥ 27

యమవాహన దుర్దర్శ । నినదన్మహిషాకులమ్ ।
శాఖా శిఖాక్ర మచ్ఛాఖా । మృగసాను మహీరుహమ్ ॥ 28

వికీర్ణ శ్వాపదానీకా । ధిత్యకోపత్యకాత్యఘమ్ ।
అభ్రఙ్కషాగ్రవివిధ । విటపాటవిపాటనమ్ ॥ 29

## శ్రీ వేంకటాచలమును వర్ణించుట

జలగర్భితమైన నల్లని మేఘమును చూచి యానందించు నెమలివలె మన్నట్టియు శిఖరాగ్రములయందు విశ్రమించిన వాలఖిల్యాది ఋషి సంఘములచే నిండినదియు 20

సూర్యుని రథ గుఱ్ఱములయొక్క డెక్కలచే నలగగొట్టబడిన శిఖరముల యందలి మణులరాసులు కలిగినట్టియు, చంద్రకిరణముల తాకుడుచే కారుచున్న చంద్రకాంతమణుల ద్రవము కలిగినట్టియు, 21

ఎత్తగు శిఖరములయందు ప్రకాశించు రత్నములచే కనులను మిరుమిట్లు గొలుపుచున్నట్టియు, మాణిక్యకుండలముల కాంతులచే ఇనుమడింపబడిన సూర్యమండలమును కలిగినట్టియు, 22

ఆకాశమును చుంబించుచున్న ఎత్తైన శిఖరములయందు విశాలమైన సమప్రదేశములు కలిగియున్నట్టియు, చంద్రుని కిరణములుపడి కరుగుచున్న చంద్రకాంతరాళ్ళ ద్రవమును త్రాగుచున్న చకోరగుంపులచే నిబిడమైనట్టియు 23

స్ఫటికమణి శిలామయ చరియలనుండియు శిఖరములనుండియు స్రవించుచున్న నిర్మల సెలయేరులు కలిగియున్నట్టియు, కొండ పైభాగమునందంతటను మొలచి సింహముల వమకరించు పూచిన లొద్దుగవృక్షములు కలిగినట్టియు, 24

మామిడిపూతల యందలి చిక్కటమగు తేనెచే తడుపబడినదియు, మదగజ యూథముల దెబ్బలచే ఘూర్ణిల్లిన పర్వతచరియలు కలదియు, 25

తలక్రిందుగా నెక్కుచు నాక్రమించిన శరభ మృగములుగల చరియలచే సంచారయోగ్యము కాని ప్రదేశములు కలిగియున్నట్టియు, 26

వాసన తగిలినంతనే ప్రాణులను కలతనొందింపజేయు పెద్దపులులచే భయంకరమగు చరియలు కలిగినట్టియు, సెలయేళ్లు పైనుండి క్రిందికిపడుటచే తడసిన ప్రాంత దేశములయందు మొలచిన తుంగముస్తలను భక్షించు నడవిపందులు కలిగినట్టియు, 27

యమధర్మరాజు యొక్క వాహనమువలె చూడశక్యముకానివై అంకెలువేయుచున్న మన్నుపోతులు కలదియు, కొమ్మలచివరల నాక్రమించియున్న కోతులుగల వృక్షములు చరియలయందు కలిగినట్టియు, 28

యథేష్టముగా తిరుగుచున్న అడవిమృగముల గుంపులుగల పర్వతోర్ధ్వసమీప భూభాగములు కలిగినట్టియు, ఆకసమును వరయునట్టి కొనలుగల నానావిధ వృక్షములుగల అడవులచే నలంకరింపబడినట్టియు, 29

ధాతుప్రస్థస్థలీనిర్యద్వహో । ప్రస్రవణాకులమ్ ।
అన్తకాన్యప్రతీకాశ । గుహాగేహోషితార్ణకమ్ ॥ 30

ఝిల్లికానాదబధిరీ । భూతదిక్చక్రవాలకమ్ ।
దివ్యం విభూత్యుపాదానం । గాయద్భిరుషితాన్తరమ్ ॥ 31

నానామణిమయూఖౌఘ । మహేన్ద్రాయుధ వర్చసమ్ ।
కృష్ణసారవరోద్రిక్త । హరిణీకులసఙ్కులమ్ ॥ 32

విధున్వద్వాల విమల । చమరీచక్రమోత్కటమ్ ।
లాఙ్గూలవేల్లితల స । ద్గోలాఙ్గా కులాకులమ్ ॥ 33

ప్రవాలకాణ్డ ప్రస్తార । మణ్డితాన్తరకన్దరమ్ ।
ఇత స్తత స్తపస్యద్భిః । ఋషిభిః నిర్ఝరాన్తికే ॥ 34

ఆస్థాతవ్య ప్రస్థదేశం । బ్రహ్మధ్యాన పరాయణైః ।
ఆశ్రితార్తిహరచ్ఛాయ । విశాలవనపాదపమ్ ।
తస్యసానుమత స్సాఽపి । పాదానాశ్రిత్య సత్వరః ॥ 35

## శుకస్య శ్రీవేఙ్కటాచలస్థ పుణ్యతీర్థావగాహనమ్

నిర్ఝరేష్వ ప్లవం కుర్వన్ । విమలోదే ష్వనన్యధీః ।
హ్రదేషు దేవఖాతేషు । నదీ ప్రస్రవణీషు చ ॥ 36

అన్యేష్వ మలతీర్థేషు । త్రివృద్బ్రహ్మ జపన్ మునిః ।
సంసారమోచినీం బ్రహ్మ । విద్యాం విద్యా విజృమ్భణీమ్ ॥ 37

జపమ్నుపాంశు మనసాఽ । వద్యావిద్యావిబర్హిణీమ్ ।
నివసన్ రజనీ మేకాం । తత్ర తత్ర సమాహితః ॥ 38

గైరికాది ధాతుమయ శిలాప్రదేశములనుండి ప్రవహించు సెలయేళ్ళచే నిండి యున్నట్టియు, మృత్యువు ముఖమువలె భయంకరమైన గుహలనెడు యిండ్లలో నివసయున్న సీరు కలిగినట్టియు, 30

కీచురాళ్ల ధ్వనులచే చెవిటివిగావయిన దిక్కులు కలదియు, జగత్తున కుపాదాన కారణభూతుడగు దివ్యుడగు భగవంతుని గూర్చి పాడుచున్న గాయకులలోపల ప్రాంతమువ గలదియు. 31

అనేక మణికిరణజాలములచే ఇంద్రధనువును బోలిన కాంతిగలదియు. శ్రేష్ఠము లగు జింకలచే మత్తేజితములగు లేళ్లగుంపులచే నిండినదియు. 32

ఊపుచున్న తోకలుగల తెల్లనైన చమరీమృగముల సంచారముచే గొప్పదైవటు వంటివి, తోకలనాడించుచు సంచరించుచున్న కొండముచ్చుల గుంపులచే నిండి యున్నట్టియు, 33

పొగడముల కొమ్మలు వ్యాపించుటచే నలంకరింపబడిన లోపలిభాగములు కల చరియలు కలదియు. సెలయేరుల సమీపమున నిటు నటు మన్న స్థలములయందు తపమాచ రించుచున్న ఋషులు కలదియు, 34

బ్రహ్మధ్యానము నాచరించుటయందాసక్తిగల మునీంద్రులకు నివాసయోగ్యమైన ప్రక్కప్రదేశములు కలదియు, ఆశ్రయించినవారి యలసటను పారద్రోలు నీడలుకల విశాల వనములు వృక్షములుకల చరియలుగల నా వేంకటాచలము యొక్క చరియల నాశ్రయించి శుకయోగీంద్రుడు త్వరపడుచు 35

## శ్రీ శుకమహర్షి తిరుపతికొండపైనున్న పుణ్యనదులలో స్నానమాచరించుట

పవిత్రతోయములు కల సెలయేరులలో విశ్చలమానసుడై స్నానము నాచరించుచు, దేవతలచే త్రవ్వబడిన (సహజములైన) చిన్న చిన్న మడుగులయందు, నదులనుండి వచ్చిన ప్రవాహములయందు 36

ఇతర నిర్మలోదకములయందు మూడావృత్తులు గాయత్రీ మంత్రమును జపించుచు, సంసారబంధమును బాపునట్టియు, పరమాత్మను పొందుటకు సాధనములగు విద్యలను వృద్ధిపరచునట్టియు, నీచమైన యవిద్యను తలనెత్తనీయనట్టియు 37

బ్రహ్మవిద్యను మనస్సులలో పైకి వినిపించనటుల జపించుచు, ఆ యా ప్రదేశములలో నొక్కొక్క రాత్రి స్వస్థచిత్తుడై నివసించుచు 38

అతన్ద్రితోఽఞ్జనగిరిం । ప్రాప విప్రోపవేశనమ్ ।
తత్ర తత్ర గుహాగేహే । ష్వాసీనై ర్మునిపుఙ్గవైః ।
యోగిభి స్సిద్ధసఙ్ఘైశ్చ । విశుద్ధజ్ఞానశాలిభిః ।
వైఖానసై శ్చ మునిభిః । కృతాతిథ్యసపర్యకమ్ ॥

శిలాతలేషు నివసన్ । విపులేషు శనైః శనైః ।
కుమారధారాం ధారాల । చ్యవమానామలోదకామ్ ।
అపసదా ప్లవం చాత్ర । చక్రే వ్యాసారసో మునిః ॥

స్కన్దస్య కుమారధారాస్నానేన శక్త్యాయుధప్రాప్తిః

అస్యా మాహాత్మ్య మతులం । తులితానన్యతీర్థకమ్ ।
శక్తిప్రదం శక్తిపాణేః । శరణ్యం శరణార్థినామ్ ॥

పురా ఒమరైః ప్రార్థితేన । శఙ్కరేణ పురారిణా ।
ఔమాపత్యో బాహులేయః । సైనాపత్యే నియోజితః ।
తదోద్వోఢు మనహన్ సో ఒపి । సైన్యాపత్యే ఒనివిష్టధీః ॥

అనేకా పాయసదనం । ఉపాయరహితో గుహః ।
దైత్యారేః ప్రాప్తుకామ స్సన్ । తత్ర్పతీకార మాప్తవాన్ ॥

త్రిసన్ధ్య మాప్లవం కుర్వన్ । త్రివృద్బ్రహ్మ జపన్ సుధీః ॥
త్రిసన్ధ్య మర్చయన్ విష్ణుం । దివ్యైః పుష్పై రనన్యధీః ॥

అస్యా విర్ఘురధారాయాః । తప స్తేపే సమీపతః ।
తపసా తస్య సన్తుష్టో । భగవాన్ విష్టరశ్రవా ॥

ఆవిర్భూయ దదౌ శక్తిం । తస్మై స ఒపి తిరోదధే ।
కుమార స్తం ప్రణమ్యాథ । దేవం స్వర్గం జగామ సః ॥

జాగరూకతతో బ్రాహ్మణులు నివసించునట్టి అంజనగిరిని సమీపించెను. అచ్చట చ్చట గృహములవంటి గుహలలో కూర్చునియున్నట్టి ముని శ్రేష్ఠులచేతను 39

యోగులచేతను. సిద్ధసంఘములచేతను నిర్మల జ్ఞానశీలురగు వైఖానస వ్రత శీలురైన మునులచేత సరిఖిమర్యాదలు శుశ్రూషలు చేయబడినవాడై 40

విశాలములగు బండరాళ్ళపై మెల్లమెల్లగా కూర్చొనుచు వేగముగా ప్రవహించు నిర్మలోదకముగల కుమారధారను సమీపించి యందు శ్రీశుకుడు స్నానమాచరించెను. 41

## కుమారస్వామికి కుమారధారలో స్నానమాచరించుటచే శక్తియను ఆయుధము లభించుట

కుమారధార యొక్క మాహాత్మ్యము సాటిలేనిది. దీనితో సాటియగు తీర్థములు లేనిది. కుమారస్వామికి శక్తియను నాయుధము నొసంగినది. శరణు కోరినవారికి శరణము నిచ్చునది. 42

పూర్వము దేవతలచే ప్రార్థింపబడి త్రిపురసంహారియగు శంకరుడు పార్వతీ పుత్రుడగు కుమారస్వామిని సేనాపతిగా నియమించగా నాతడు దానిని వహించక సేనాధ్యక్ష పదవియందు మనస్సులేనివాడై 43

అనేక అపాయములకు స్థానమగు సేనాధ్యక్ష పదవిని నిర్వహింపజాలక ఉపా యముతోచని కుమారస్వామి శ్రీమన్నారాయణునుండి యుపాయమును పొందగోరి దానికి తగిన (ప్రతిక్రియ) ఉపాయమును బడసెను. 44

మూడు సంధ్యాసమయములందు స్నానము నాచరించుచు ముమ్మారు మంత్ర మును జపించుచు శ్రీమన్నారాయణుని మూడు సంధ్యలయందు దివ్యపుష్పములచే నితర తలంపులులేని మనస్సుకలవాడై పూజించుచు 45

కుమారధారా సమీపమున తపము నొనరించెను. శ్రీమన్నారాయణు డాతని తప మునకు సంతసించి 46

ప్రత్యక్షమై యాతనికి శక్త్యాయుధము నొసంగి యంతర్ధానము నొందెను. కుమారస్వామియు శ్రీమన్నారాయణునకు నమస్కరించి స్వర్గమునకేగెను. 47

తస్మా త్కు మారధారే తి । విఖ్యాతా విమలోదకా ।
ప్రశమాన ప్రశంసా ఒభూత్ । అప్రమేయఫలప్రదా ॥ 48

## ఇన్ద్రస్య పాపనాశనస్నానేన వృత్రవధజనిత పాపనిర్ముక్తిః

తతో గతః పాపనాశం । కృత్వా స్నానాదికం వశీ ।
ఉవాస త్రిదినం తస్య । తీర్థస్య నికటే తటే ॥ 49

యత్ర తీర్థే సకృత్ స్నాత్వా మఘవా వృత్రహా పురా ।
బ్రహ్మహత్యా విముక్తః సః । ప్రాప చైన్ద్రం పునః పదమ్ ॥ 50

పాపనాశః స విఖ్యాతో । నిర్ఝరో జర్ఝరైనసామ్ ।
దేవతిర్యఙ్మనుష్యాణాం । అవగాహా న్మలాపహామ్ ॥ 51

## ఆకాశగఙ్గా మాహాత్మ్యమ్

ఆకాశగఙ్గా మన్వాస్య । సమస్తఫలదాయికామ్ ।
అసాద్యా స్యా మాప్లవ ఇచ్ఛ । చకార నిరుపప్లవః ॥ 52

యస్యాః సంసారార్ణవస్య । కర్ణధారే ఒమలే ఒమ్భసి ।
దేవస్త్రియో నాగకన్యాః । గన్ధర్వ్యః కిన్నరాఙ్గనాః ॥ 53

సిద్ధాఙ్గనా శ్చ కుర్వన్తి । స్నానం వైఖానసాఙ్గనాః ।
నారాయణగిరేః శౌరేః । తదీశస్య ప్రభావకమ్ ।
ప్రథయన్ మనసా ఒతీవ । స్మయమానో మహామునిః ॥ 54

## ప్రవతతీవర్తనీతీర్థస్నానకాలేశుకబ్రహ్మర్షింప్రతిఅశరీరోక్తిః

ప్రవతతీవర్తనీతీర్థ । మాససాద మహామునిః ।
తత్రా ఘమర్షణం చక్రే । సూక్తం వైష్ణావ ముచ్చరన్ ॥ 55

కావున నిర్మలోదకములుకల యా ధార కుమారధారయని ప్రసిద్ధికెక్కినదై యూహింపనలవికాని ఫలముల నొసంగునదై శ్లాఘింపబడుచుండెను. 48

## ఇంద్రునకు పాపనాశనియందు స్నానమాచరించుటచే వృత్రాసురుని చంపిన పాపముపోవుట

అనంతరము శుకయోగీంద్రుడు పాపనాశనికేగి యింద్రియ నిగ్రహముకలిగిన వాడై స్నానాదికముల నాచరించి యా తీర్థసమీపమునయున్న తీరమున మూడు దినములు నివసించెను. 49

పూర్వము వృత్రాసురుని వధించిన యింద్రుడీ తీర్థమున నొకమారు స్నాన మాచరించిన మాత్రముననే బ్రహ్మహత్య పాపమునుండి విడువడి తిరిగి యింద్రపదవి నందెనో 50

యిట్టి పాపములను నశింపజేయు నా ప్రవాహము పాపనాశనియని ప్రసిద్ధి కెక్కినది. ఆ నది శిధిలపాపులగు దేవతలకును, పశుపక్ష్యాదులకును, మనుష్యులకును స్నానము నాచరించుటచే పాపమును హరించునదై యున్నది. 51

## ఆకాశగంగ మాహాత్మ్యము

సకల ఫలముల నొసంగు నాకాశగంగను సమీపించి 52

ఏ యాకాశగంగానది యొక్క తీర్థము సంసారసాగరమునకు చుక్కానివంటిదో యే నిర్మలోదకమున దేవతాస్త్రీలు నాగకన్యలు గంధర్వ కిన్నరాంగనలు 53

సిద్ధులయొక్క స్త్రీలు, వైఖానసుల కులపత్నులు స్నానమాడుదురో యట్టి గంగా నదియం దుపద్రవములు లేనివాడై స్నానము నాచరించి నారాయణాద్రి యొక్కయు నా పర్వతమున వధిష్ఠించియున్న శ్రీమన్నారాయణుని ప్రభావమును మనమున మిక్కిలి కీర్తించుచు నాశ్చర్యమును చెందుచు 54

## ప్రతతీవర్తనీతీర్థమున స్నానమాచరించునపుడు బ్రహ్మర్షినిగూర్చి యశరీరవాణి పలుకుట

ప్రతతీవర్తనీ తీర్థమును సమీపించి విష్ణుసూక్తమును జపించుచు పాపపరిహారము నొనరించు స్నానము నాచరించెను. 55

స్మరన్ భగవతో విష్ణోః । జిష్ణోః ద్వైపాయనాత్మజః ।
జలే మగ్నతనో స్తస్య । ఉదభూ ద్వా గశరీరిణీ ॥ 56

అమృతోదన్వదుత్తుఙ్గ । తరఙ్గమహిమావలీ ।
శ్రీవత్సవక్షా నిత్యశ్రీ । అవ్యశ్య శ్చ మలాత్మనామ్ ॥ 57

అనన్తభోగాయతనో౽ । నన్తో౽నన్తఫలప్రదః ।
అతో౽స్మా దగ్నిదిగ్భాగే । సార్ధయోజనమాత్రకే ॥ 58

అస్య సానుమతః పాద । మూలే కూలఙ్కషద్రుమే ।
నద్యాః సర్వో౽ఘనాశిన్యాః । స్వర్ణముఖ్యా స్తటే శుభే ॥ 59

పద్మ మిత్యుత్తరే ఖ్యాతం । పవిత్రం పరమం సరః ।
తస్య గత్వా తటే తూర్ణం । అత్యుగ్రం తప ఆచర ॥ 60

పశ్చా దచఞ్చలత్వం తే । మనీషాయా భవిష్యతి ।
తదా స్యా ద్భగవాన్ విష్ణుః । ప్రత్యక్షః సర్వసాక్షిభూః ॥
ఏవం సాదర ముక్త్వా వాక్ । జనానాం శృణ్వతా మపి ॥ 61

## అశరీరోక్త్యా శుకస్య పద్మసరోవర గమనమ్.

ప్రక్షాలయన్తీ శమలం । మునే న్యాతా౽శరీరిణీ ।
ఏవ మేతాం నశమ్యా సౌ । జలా దుత్తీర్య తీర్థతః ॥ 62

అతిస్నేహా ద్విస్మిత శ్చ । వైయాసిః మని రత్వరః ।
ఏవ మాలోచయన్ బుద్ధ్యా । శరీరాత్మవిశోధనీమ్ ॥ 63

ప్రసాదసూచినీం విష్ణోః । ప్రభవిష్ణోః ప్రశంసినీమ్ ।
జగామ వేగా త్తం దేశం । యత్ర పద్మసరోవరః ॥ 64

## పద్మసరోవర వర్ణనమ్.

ప్రసన్నం సన్మన ఇవ । వైడూర్యవిమలోదకమ్ ।
ఉత్ఫుల్లైః పుణ్డరీకై శ్చ । కల్హారైః కనకామ్బుజైః ॥ 65

జయశీలుడును సకల కల్యాణసుధైక నిధియునగు శ్రీమన్నారాయణుని ధ్యానించుచు నీటియందు మునిగిన శరీరముగల శుకయోగీంద్రునకీ క్రిందివిధమైన అశరీరవాక్కు వినఁబడెను, 56

క్షీరసాగరతరంగనీ కరాపారముల మహిమాన్వితుడున, శ్రీవత్సము వక్షస్థలమున కలవాడును, నిత్యము శ్రీతో నుండువాడును, పాపాత్ములకు కనరానివాడును, 57

శేషశాయియు, అంతములేని కోరికలనొసంగు శ్రీమన్నారాయణుడు వసించు పర్వతమున కాగ్నేయదిశలో వంద్రెండు మైళ్ల సూత్రమే దూరముగల 58

చరియలుగల యీ యంజనాద్రి క్రిందిభాగమున తీరము నొరయుచున్న వృక్షములు కలిగినట్టియు, వెంటనే పాపహరమునునగు శుభమగు స్వర్ణముఖీ నదీతీరమున 59

కుత్తర భాగమున పద్మసరమని ప్రసిద్ధికెక్కిన పవిత్రమగు గొప్ప సరస్సు కలదు. శీఘ్రముగా దాని తీరమునకేగి మిక్కిలి ఘోరతపము నాచరింపుము. 60

అటుపై నీకు స్థిరబుద్ధి కలుగగలదు. అపుడు నీకు సర్వప్రాణి సాక్షిభూతుడగు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షముకాగలడు" ఇట్లశరీరవాణి జనులందరుకూడ వినుచుండగా సాదరముగా పలికి 61

## అశరీరవాణి చెప్పగా శుకయోగీంద్రుడు పద్మసరోవరమున కేగుట

శుకయోగీంద్రుని కల్మషమును కడిగివేయుచు వెడలిపోయెను. ఈ యశరీరవాక్కును విని శుకయోగీంద్రుడు నదీజలమునుండి లేచి 62

ప్రాణులయందు మిక్కిలి ప్రేమకలవాడగు శ్రీ శుకుడు ఆశ్చర్యపడుచు దేహమును ఆత్మను పవిత్రమొనరించు నట్టియు 63

సమర్థుడగు శ్రీమన్నారాయణుని యనుగ్రహమును సూచించునదియు శ్లాఘ్యమునైన అశరీరవాణిని సావకాశముగా తలంచుకొనుచు పద్మసరస్సున్న ప్రదేశమునకు త్వరగా నేగెను. 64

## పద్మసరోవర వర్ణనము

సత్పురుషుల మనస్సువలె నిర్మలమైనదియు, వైడూర్యమువలె స్వచ్ఛమగు నీరు కలదియు, చక్కగా వికసించిన పద్మములతోను, ఎరుపును తెలుపును కలిగి మిక్కిలి పరిమళించు కలువలతోను, బంగారు పద్మములతోను 65

నీలోత్పలైః కువలయైః । రక్తాబ్జై రఞ్చితాన్తరమ్ ।
మకరన్దమదోన్మత్త । మధురాలికులోజ్జ్వలమ్ ॥ 66

కారణ్డవైః కలరవైః । వాచాటితదిగన్తరమ్ ।
భ్రమద్భ్రమరబృన్దైశ్చ । మధుపానమదోద్ధతైః ॥ 67

గృహీతగ్రాహఘర్ఘ్రాహం । వలమానసుమీనకమ్ ।
వరాహసఙ్ఘైరభితో । గ్రస్తమస్త్రైరలఙ్కృతమ్ ॥ 68

మృణాలకవలాఽఽకీర్ణ । కరైః కరికదమ్బకైః ।
ఏణైః సశాబై రేణీభిః । ఉపాన్తే పరితో వృతమ్ ॥ 69

మదోన్మత్తైఃవనచరైః । పయోధి రభితో వృతమ్ ।
తపస్యత్తాపసక్లేశ- । హరణం రమణం హరేః ॥
శ్రీమదేతత్ పద్మతీర్థం । మహాతర్థం శుకో మునిః ॥ 70

## శుకస్య పద్మసరసి శ్రీనివాసధ్యాన పూర్వక స్నానాదికమ్

దదర్శ స గతక్లేశః । స్నానపాననిషేవణైః ।
స్మరన్ నారాయణం విష్ణుం । అభూత్ నిశ్చలచేతనః ॥ 71

ముహూర్తం తత్ర విశ్రమ్య । సంయమీ నియమస్థితః ।
వన్యై రపాకైః పక్వైశ్చ । ఫలైః స్వపతితై రపి ॥ 72

దినస్య పఞ్చకాలే వై । కృతాహారో ఽభవ న్మునిః ।
శిష్యే చ దర్భశయ్యాయాం । స నివర్త్యా ఽహ్నికీం క్రియామ్ ॥ 73

బ్రాహ్మే ముహూర్తే చా న్యేద్యుః । ఉత్థాయ ప్రయతో వశీ ।
చిన్తయన్ పుణ్డరీకాక్షం । శఙ్ఖచక్రగదాధరమ్ ॥ 74

నల్ల కలువలతోను, తెల్ల కలువలతోను, ఎఱ్ఱని పద్మములతోను ప్రకాశించు మధ్యభాగము కలిగినట్టియు, తేనెను గ్రోలిన మదముచే మత్తెక్కిన తుమ్మెదపంక్తులతో ప్రకాశించునట్టియు, 66

అవ్యక్త మధురముగా కూయుచున్న నీటిపక్షుల ధ్వనులచే ప్రతిధ్వనించుచున్న దిక్కుల మధ్యభాగములు కలదియు, తేనెను త్రాగి మత్తిలి తిరుగుచున్న తుమ్మెదల గుంపులు కలిగినట్టియు 67

మొసళ్ళచే నాక్రమింపబడి దిగుట కశక్యమైనదియు, పరిభ్రమించు శుద్ధ చేపలు కలదియు, ముస్తెదుంపలను తినుచున్న పందులగుంపులచే నలంకరింపబడినదియు 68

తామరతూడుల గ్రాసముచే నిండియున్న తొండములుకల యేనుగు గుంపుల చేతను, పిల్లలతోను ఆడ లేళ్ళతోను కూడిన లేళ్ళతో దగ్గరగా చుట్టుప్రక్కల నంతయు వ్యాపింపబడినట్టియు 69

మదముచే మదించిన కిరాతకులచేతను నీటిచేతను నంతటను వ్యాపింపబడి నట్టియు, తపము నాచరించుచున్న మునిపుంగవుల శ్రమను పోగొట్టునదియు, శ్రీ మహా విష్ణునకు ప్రీతిపాత్రమైనదియు, మహాతీర్థమగు నీ శోభశాలి పద్మతీర్థమును శ్రీ శుక యోగీంద్రుడు 70

## శుకుడు పద్మసరోవరమున శ్రీనివాసుని ధ్యానించుటద్వారా స్నానాదుల నొనరించుట

గాంచి స్నానము, పానము, సేవలచే పోగొట్టబడిన శ్రమకలవాడై శ్రీమన్నా రాయణుని ధ్యానించుచు చలించని మనస్సు కలవాడాయెను. 71

క్షణకాలమచ్చట విశ్రమించి యింద్రియవిగ్రహము కలిగి నియమముతోగూడిన వ్యాపారములు కలవాడై, పండిన కందమూలాదులు యచటనియందలి యాహారములను పండి, తమంతట తామే రాలిన ఫలములను 72

రోజాలో నైరవకాలమున (రాత్రి సమయమున) భుజించుచుండెను. పగటి నిత్య విధులన్నిటిని నిర్వహించి కుశశయ్యపై పరుండెను. 73

మరునాటి దినమున విజ్ఞానియగు శుకుడు బ్రాహ్మీముహూర్తమున లేచి నిర్మలుడై యింద్రియ నిగ్రహము కలవాడై శంఖచక్రగదలను ధరించినట్టియు 74

కరుణారసకల్లోల । తరఙ్గితకటాక్షకమ్ ।
శరత్పూర్ణేన్దువక్త్రాభం । పీతకౌశేయవాససమ్ ॥ 75

మహోరస్క ముదారాఙ్గం । శ్రీనివాసం మహామతిః ।
సన్ధ్యా ముపాస్య విధివత్ । స్నానపూర్వం సమాహితః ॥ 76

## పద్మసరోవర తీరస్థ దివ్యారామ వర్ణనమ్.

దదర్శ సరస స్తస్య । తీరే త్వభినవమ్ వనమ్ ।
పున్నాగనాగపనస । పాటలాశోకకింశుకైః ॥ 77

కున్దమన్దారమాకన్ద । హరిచన్దనచన్దనైః ।
తాలచమ్పక హిన్తాల । హరితాలతమాలకైః ॥ 78

నక్తమాలై శ్చ సరలైః । నారికేళై శ్చ కేసరైః ।
పనసైః కేతకైః సాలైః । పాలాశైః పిప్పలైః వటైః ॥ 79

ఖర్జూరైః ఖాదిరైః ప్లక్షైః । రుద్రాక్షైరసనై ర్ధవైః ।
సఙ్కీర్ణ మభితః సాన్ద్రం । మహేన్ద్రోపవనోపమమ్ ॥ 80

మాధవీమల్లికాయూథీ । వనయూథీసుజాతిభిః ।
శతపత్రిభి రాకీర్ణం । సుమనోభిః సుగన్ధిభిః ॥ 81

దమనీమరుశాఖాభిః । తులసీభిః విజృమ్భితమ్ ।
కున్ద మల్లికయోపేతం । కుశకాశప్రకాశితమ్ ॥
విశ్వామిత్రైః పవిత్రైశ్చ । ముఞ్జైరప్యభిజృమ్భితమ్ ॥ 82

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల దేవదర్శన
సంవాదే సుమేరుశిఖరాత్ శుకస్య శ్రీవేఙ్కటాచలగమన పదచనరః
ప్రాప్త్యాదివర్ణనం నామ చతుర్వింశో ఽధ్యాయః

కృపారసము తరంగించుచున్న క్రీగంటి ప్రవాహము కలవాడును, శరత్కాలము నందలి పూర్ణచంద్రునిబోలు ముఖకాంతి కలిగినట్టియు, పచ్చని పట్టుబట్టను ధరించినవాడును

విశాల వక్షస్థలము కలిగినట్టియు, శరీరసౌష్ఠవము కలిగినట్టియు, తామరరేకుల వంటి నేత్రములుగల శ్రీనివాసుని స్వస్థచిత్తుడై ధ్యానించుచు స్నానము నాచరించి యథా శాస్త్రముగ సంధ్యావందనము నాచరించి 76

## పద్మసరోవర తీరముననున్న సుందరోద్యానమును వర్ణించుట

ఆ సరోవర తీరముననున్న సురపొన్న చెట్లతోను, పొన్నచెట్లతోను, పనస వృక్షములతోను, పాటలీ తరువులతోను, అశోక, మోదుగ వృక్షములతోను, 77

మల్లి, మందార, మామిడి, రక్తచందనము, పసుపుపచ్చ చందన వృక్షముల తోను, తాటి, సంపెంగి, గిలకతాడి, అరిదళ, చీకటిచెట్లతోను, 78

కామకచెట్లు, సరళదేవదారు, కొబ్బరి, పొన్న, పనస, మొగలి, మోదుగ, రావి, మఱ్ఱిచెట్లతోను, 79

ఖర్జూర, చంద్ర, రావి, రుద్రాక్ష, పన్నరాష్ట్రి, ధవ వృక్షములతో దట్టమై వ్యాప్తమై దేవేంద్రుని ఉద్యానమువలె నున్నట్టియు, 80

మాధవీ, మల్లె, మొల్ల, అడవిమొల్ల (గోపీచందన) మొదలగు మంచి జాతి లతలతోను, నూరు రేకులుగల తామర పుష్పములతోను, అందమగు, పరిమళముగల 81

దమనము, మరువము, తులసీ శాఖలచే వ్యాపింపబడినదియు, మల్లె, బొడ్డుమల్లె లతో కూడినదియు, దర్భ, రెల్లుపువ్వులతో ప్రకాశించునదియు, ఒక విధమగు దర్భలు, ముంజగడ్డితో నేపుగా పెరిగినదియు నగు క్రొత్తదగు ఉద్యానవనమును గాంచెను, 82

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శనుల సంభాషణమున సుమేరుశిఖరమునుండి శ్రీ శుకయోగీంద్రుడు వేంకటాచలమును, పద్మసరోవరమును గాంచుటను వర్ణించుట యనెడు ఇరువదినాల్గవ అధ్యాయము.

---

# పఞ్చవింశో ఽధ్యాయః

## దివ్యారామే శుకబ్రహ్మర్షేః మహానియమపూర్వక తపోఽనుష్ఠానమ్

దేవదర్శనః —

తతః శ్రీపద్మతీర్థస్య : పద్మవాటీపటీయసః ।
పటాటవీజటాఽఽటోప । విశఙ్కటవియత్తటే ॥ 1

అధీతవేదవేదాన్త । తాపసౌఘనిషేవితే ।
అనూదితబ్రహ్మఘోషైః । అన్వితే వయసాం గణైః ॥ 2

పతఙ్గాఽధ్యాపితాఽఽమ్నాయ । ప్రమోదర్షికుమారకే
హుతవైతానవహ్న్యుత్థ । హవిర్గన్ధసుమోదితే ॥ 3

మృగశావవిలూనాగ్ర । కుశగుల్మవిజృమ్భితే ।
మనఃసన్తోషకరణే । సర్వోపకరణాన్వితే ॥ 4

విచిత్రవివిధాఽఽమోదే । వనే చైత్రరథోపమే ।
తపః కరిష్యన్ దిష్ట్యా తు । సమాహితమనా మునిః ॥ 5

విచిన్తయన్ వియద్వాక్యం । విమలాత్మా వ్యతిష్ఠత ।
స్వాధ్యాయం సమధీయానో । విష్ణుమేవాగ్రతో యజన్ ॥ 6

పర్ణాశనో హితాచార । నియతో నియమస్థితః ।
మితభాషీ మితాహారః । శాన్తో దాన్తో గురుప్రియః ॥ 7

సాత్త్వికః సత్త్వసమ్పన్నో । విష్ణుభక్తో బభూవ హ ।
శ్రీనివాసమనారాధ్య । కిఞ్చిన్నాశ్నాతి నిత్యశః ॥ 8

క్షుదాక్షామో ఽప్యనైవేద్యం । నో పజీవతి చైకదా ।
విష్ణుపాదోదకాదన్యత్ । తృష్ణార్తో ఽపి న చాపిబత్ ॥ 9

# ఇరువదియైదవ అధ్యాయము

## దివ్యోద్యానమున శుకమహర్షి గొప్ప నియమముతో తపము నాచరించుట

దేవదర్శనుడు —.

తామరపుష్పంబు తోటలతో దృఢమగునట్టియు, మఱ్ఱివృక్షముల యతవియందలి వృక్షములాదల విస్తారముచే గొప్పదియగు యాకాశము కలిగినట్టియు 1

వేదములను, వేదాంతములను వళ్యసించిన తపోనిష్ఠుల గుంపులచే సేవింపబడు నట్టియు, వేదాధ్యయనము ననుసరించు పక్షులగుంపులతో కూడియున్నట్టియు 2

చిలుకలచే వేదములను చదివించి సంతసించు ఋషి కుమారులు కలిగినట్టియు, హోమముచేయబడిన వైతానికాగ్నిహోత్రమునుండి లేచిన హవిస్సుయొక్క పరిమళముచే పరిమళించుచున్నట్టియు 3

లేడిపిల్లలచే కొరుకబడిన మొదళ్ళుగల దర్భపొదలచే వ్యాపింపబడినట్టియు, మనస్సునకు సంతోషమును కూర్చునట్టి సమస్త సాధనములతో కూడినట్టియు 4

విచిత్రములును, ఆనందజనకములునగు అనేక పదార్థముల పరిమళములతో కూడి కుబేరుని యుద్యానవనమును బోలిన వనములో నిశ్చలమగు మనస్సుకలిగి శుక యోగీంద్రుడు దైవవశమున తపము నాచరించుచు 5

నిర్మలాంతఃకరణుడై యశరీరవాక్కులనే తలంచుచు వేదాధ్యయనమును చక్కగా నాచరించుచు యెదురుగా శ్రీమన్నారాయణునే పూజించుచు 6

ఆకులను మాత్రమే భుజించుచు శాస్త్రములచే హితముగ చెప్పబడిన యాచారములయందు నియమముగా ప్రవర్తించువాడై, మితముగా మాట్లాడుచు, మితముగా భుజించుచు, నంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహముకలిగి పూజ్యులకిష్టుడై 7

సత్ప్రవర్తనకలిగి, శుద్ధ సత్వ గుణముతో కూడినవాడై విష్ణుభక్తుడై యుండెను, ప్రతిదినమును శ్రీనివాసు నారాధించక యేకొంచెమైనను భుజించకుండెను, 8

ఒకప్పుడును మిక్కిలి యాకలిచే కృశించినను శ్రీమన్నారాయణునకు నివేదింపబడని దానిని భుజింపకుండెను. దాహముకొనియున్నను శ్రీమన్నారాయణుని చరణ తీర్థమునతప్ప మరియొక నీటిని త్రాగకుండెను. 9

నిర్ద్వన్ద్వో నిరహఙ్కారో । ధీరో విగతమత్సరః ।
కుశేశయా సనాసీనః । కుశా స్తరణభూతలే ॥ 10

కుశాగ్రబుద్ధి రచలః । కుశహ స్తపవిత్రకః ।
కృష్ణాజినో త్తరాసఙ్గః । కృష్ణవ ర్త్మశిఖాజటః ॥ 11

కృష్ణాజినామ్బరధరః । కృష్ణద్వై ్వపాయనాత్మజః ।
అక్షమాలాధరకరో । విజితాక్ష క్షమాక్షమః ॥ 12

నాసాగ్రన్య స్తనయనః । ఆర్జవోర్జితకాయకః ।
దన్తై రపంస్పృశన్ దన్తాన్ । జిహ్వాగూహితతాలుకః ॥ 13

ధారణధ్యానసమ్పన్నః । ప్రాణాయామవిశుద్ధధీః ।
ఉపాంశుమానసజప । గూఢోష్ఠస్ఫురణాననః ॥ 14

వైకుణ్ఠే ఒకుణ్ఠితమతిః । గాయత్రీం వైష్ణవీం జపన్ ।
వర్షాసు జలమధ్యస్థో । గ్రీష్మే పఞ్చాగ్నిమధ్యగః ॥ 15

అర్ధ్యర్కాద్యు క్సమద్వన్ద్వో । పద్రవో వీతనిద్రకః ।
కాలానలప్రతిభట । కాయః కమలలోచనః ॥ 16

## శుకమునితపోఽగ్ని జ్వాలాభిర్లోకో పద్రవోత్పత్తిః.

ఏవం ప్రవృత్తో ఘోర ఞ్చ । తప శ్చర్తుం తపోధనః ।
తపసా తస్య స న్తప్తా । చచాల చ వసున్ధరా ॥ 17

మార్తణ్డ శ్చణ్డకిరణో । న తతాప నభోఽన్తరే ।
అబ్ధయః క్షుభితా స్సర్వే । వవర్షు ర్న బలాహకాః ॥ 18

జాతవేదా న జజ్వాల । విమానాని దివౌకసామ్ ।
నభో మధ్యే న చేరు శ్చ । బభూవే శ్రీ శ్చ శఙ్కితః ॥ 19

శీతోష్ణాది ద్వంద్వములను లెక్కింపక అహంకారమును వీడి శాస్త్రవిహిత కర్మముల నాచరించుటయందు స్థైర్యముకలవాడై, అసూయలేక దర్భలుపరచిన భూమిపై పద్మాసనమున కూర్చుండి 10

వజ్రమువలె తీక్ష్ణమగు బుద్ధికలవాడై, చలింపనివాడై, దర్భలను పవిత్రములను చేతియందు ధరించి, లేడిచర్మము నుత్తరీయముగా ధరించి, నిప్పువలె ఎర్రనైన జడలుకలవాడై 11

లేడిచర్మమునే వస్త్రముగా కట్టుకొని, జపమాలను చేతిలోనుంచుకొని, ఇంద్రియములను జయించినవాడై భూమివలె ఓర్పుకలవాడై 12

ముక్కుయొక్క అగ్రభాగమున చూపును నిలిపి సదాచారసంపదచే ప్రకాశించు శరీరముకలవాడై, పండ్లతో పండ్లను స్పృశింపక నాలుకచే దవడలను మూసికొనుచున్న వాడై 13

ధారణమను యోగముతోకూడిన ధ్యానసంపదకలవాడై ప్రాణాయామముచే నిర్మలమగు బుద్ధికలవాడై పైకి వినబడకుండ ఏకాంతముగా మనస్సులో జపించు యదరుచున్న ముఖముకలవాడై 14

శ్రీమన్నారాయణునియందు దృఢమగు మనస్సుకలవాడై విష్ణుగాయత్రిని జపించుచు వర్షములు కురియుచుండగా నీటి మధ్యలోను, ఎండకాలమున పంచాగ్నిహోత్రముల మధ్యలోను 15

సూర్యునివైపు దృష్టిని ప్రసరింపజేసి శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములచే కలుగు బాధలయందు సమదృష్టికలవాడై (మరుకుతపము కలవాడై) నిద్రనువీడి ప్రళయ కాలాగ్నితో సమానమగు శరీరముకలవాడై, పద్మపత్రములవలె విశాలములగు నేత్రములు కలవాడై 16

## శుకమహర్షియొక్క తపోగ్నిజ్వాలలచే లోకమున కుపద్రవము కలుగుట

తపస్సేధనముగా గల శుకయోగీంద్రుడు ఘోరమగు తపము నాచరించుట కారంభించగా నాతని తపస్సుచే తపింపజేయబడి భూమి వణకెను. 17

తీక్ష్ణములగు కిరణములుగల సూర్యుడాకాశమధ్యమున ప్రజ్వరిల్లకుండెను. సముద్రములు క్షోభించెను. మేఘములు వర్షించకుండెను. 18

అగ్నిహోత్రుడు మండలేదు. దేవతల విమానము లంతరిక్షమున విహరించ లేదు. ఇంద్రుడు సంశయగ్రస్తమానసుడాయెను. 19

వృత్రవైరీ మహేన్ద్రో ఽపి । కింకర్తవ్యవిమూఢధీః ।
చిన్తయ న్నస్య తపసో । విఘ్న మప్సరస స్తదా ।
సమాహూయా ఽఽహ వచనం । సాదరం సాన్త్వపూర్వకమ్ ॥ 20

## శుకతపోభఙ్గాయమహేన్ద్రోక్తరమ్భాదిసాన్త్వవచనాని

విసృష్టా వేధసా యూయం । నిసర్గాత్ జగతో హితే ।
రూపయౌవనలావణ్య । శాలిన్యః పద్మలోచనాః ।
మత్తమాతఙ్గగామిన్యో । మన్దమన్థరగీతయః ॥ 21

సుభ్రువ శ్చ సుకేశాన్తాః । ఘనపీనపయోధరాః ।
శుచిస్మితాః పక్వబిమ్బాధ । రోష్ఠా మదలాలసాః ॥ 22

యుష్మాభి ర్మోహితం విశ్వం । ససురాసురమానుషమ్ ।
వీక్షణాద్యై ర్విలాసై స్తు । నిర్జితాః మమశత్రవః ॥ 23

కామినీః పురతో దృష్ట్వా । కః సమాధౌ ప్రవర్తతే ।
వియాతి మానసం తస్మాత్ । కార్ముకాత్ సాయకో యథా ॥ 24

యూయ మాపది సర్వత్ర । బల మస్మాక మేవ హి ।
నా శక్య మస్తి వః కిఞ్చిత్ । సర్వేషు భువనేష్వ పి ॥ 25

ఉపస్థిత మిదానీం నః । సకలానర్థకం భువి ।
కర్తవ్యః ప్రశమ స్తస్య । భవతీభిః ఝటి త్యపి ॥ 26

వాసవే నైవ ముక్తానాం । ప్రథానాప్సరసాం వరా ।
ప్రణమ్య ప్రాఞ్జలిః ప్రాహ । రమ్భా మధురభాషిణీ ॥ 27

## మహేన్ద్రనికటే రమ్భాదికృతప్రతిజ్ఞా

య చ్చాపసి సురేశానః । త దద్య విదధీమహి ।
భవత్కృతే జీవితం నః । త్రిదశాధ్యక్ష ! కేవలమ్ ॥ 28

వృత్రాసురుని సంహరించిన దేవేంద్రుడు కూడ నేమిచేయుటకును తోచని మనస్సుగలవాడై శుకయోగీంద్రుని తపస్సును భంగముచేయుట కాలోచించుచు నప్సరస లను పిలిచి సాదరముగా నోదార్చుచో 20

## శుకయోగీంద్రుని తపోవిఘ్నమునకై రంభాదులతో దేవేంద్రుడారటతో పలుకుట

అప్సరసలారా! మీరు (సహజముగ) లోకమునకు శుభము నొనరించుటకై బ్రహ్మచే సృష్టింపబడితిరి. రూపము, యౌవనము, లావణ్యము కలిగి తామరపుష్పముల వంటి నేత్రములుకలిగి మదించిన యేనుగు గున్నవలె నడచుచు మెల్లగ వీణ పాటలను పాడుచున్నవారై 21

చక్కని కనుబొమలుకలిగి, అందమగు శిరోజములుకలిగి, దృఢమగు బలసిన స్తనములు కలవారై, చిరునవ్వు తళుకులొత్తుచుండ, పండిన దొండపండువంటి పెదిమలు కలిగి, మదనుచే వేడుక నొనగూర్చువారైన 22

మీచే దేవరాక్షసమనుష్యులతో గూడిన ప్రపంచము మోహింపబడినది. శ్రీగంటి ప్రసాదాది మీ విలాస చేష్టితములచే నా శత్రువులు జయింపబడిరి. 23

స్త్రీల నెదురుగా గాంచిన పురుషుడెవ్వడు ధ్యానమున ప్రవర్తింపగలడు? ధనువునుండి బాణమువలె నిశ్చలధ్యానమునుండి పురుషుని మనము వెడలిపోవును. 24

మాకు సంభవించిన ప్రతి యాపదలలోను బలము మీరే కదా! మీకు సకల లోకములయందును, చేయజాలనిదెద్దియును లేదు. 25

ఇపుడు భూలోకమున మనకందరి కన్నివిధముల ఆపద సంభవించినది. దానిని మీరే వెంటనే యరికట్టవలెను. 26

అని తెలుపగా నప్సరసస్త్రీలలో ప్రధానురాలును, శ్రేష్ఠురాలునగు రంభ యింద్రు నకు నమస్కరించి చేతులుజోడించి మధుర వచనములతో — 27

## దేవేంద్రుని సన్నిధానమున రంభాదు లొనరించిన ప్రతిజ్ఞ

" దేవేంద్రా! మీ యాజ్ఞానుసార మిపుడే చేయుదుము. సురలోకనాథా! మా జీవితము మీ కొలకుమాత్రమే యైయున్నది. 28

శ్వేతద్వీపం బ్రహ్మలోకం । కైలాసం వా ఽన్య మూర్జితమ్ ।
ప్రవేక్ష్యామో వయం దేశం । వర్తన్తే యత్ర తే ఽరయః ॥ 29

మోహితా శ్చ భవిష్యన్తి । తే ఽస్మ ద్వీక్షణవీక్షితాః ।
ఏకాకినః సదై కాన్త । భావాః సాత్త్వికసత్తమాః ॥ 30

ప్రణమన్తి స్మన నః పాదాన్ । శరోభిః మోహితాః స్వయమ్ ।
ఏవ ముక్త స్తు దేవేశః । తయా మధురభాషయా ॥ 31

ఏవ మాహ న సన్తుష్టో । రమ్భాం అప్సరసాం వరామ్ ।
సత్య ముక్తం త్వయా రమ్భే । మునిమోహనరూపయా ॥ 32

భూమౌ కశ్చి న్మునివరః । "శుక" ఇత్యేవ నామతః ।
సువర్ణముఖరీ తీరే । తప శ్చరతి దుశ్చరమ్ ॥ 33

తత్ర గత్వా మునిశ్రేష్ఠం । మోహయధ్వం వరాఙ్గనాః ।
ఇత్యు క్తా దేవరాజేన । ప్రేషితాః సాదరం కిల ।
దేవస్త్రియః తం ప్రణమ్య । జగ్ము ర్యత్ర తపోధనః ॥ 34

## శుకతపోవనం ప్రత్యా గతానాం రమ్భాదీనాం శృఙ్గారలీలాః

మునేః సమీపతో గత్వా । తాః స్త్రియో మధురం జగుః ।
మదోద్ధతా శ్చ ననృతుః । వేణువీణారవాన్వితమ్ ॥ 35

కన్దర్పదర్పకలితాః । కథయ న్త్యః కథా మిథః ।
వదన్తి స్మ హసన్తిస్మ । క్ష్వేలయన్తి మదాలసాః ॥ 36

స్థిత్వా పురస్తాత్ తస్యై త్థం । మదాఢ్యాః సురయోషితః ।
శృఙ్గారచేష్టాః చక్రు శ్చ । వివిధాః చాటుపూర్వకమ్ ॥ 37

[illegible] ప్రబోధిత స్తత్ర । తపనో [illegible] చ ।
వాయుః కల్హారసురభిః । వవౌ మన్దః సుఖావహః ॥ 38

శ్వేతద్వీపమునకావి, బ్రహ్మలోకమునకావి, కైలాసమునగావి, గొప్పదగు మరి యే యితర ప్రదేశములనుగావి నీ శత్రువులందు నే దేశమునైనను మేము ప్రవేశింతుము. 29

మేము కన్నెత్తిగాంచిన నొంటరివారై యెల్లవేళలయందు వవిచ్ఛిన్నమగు భగవధ్యానము చేయువారై, సత్వగుణసంపన్నులలో 30

శ్రేష్ఠులైనను మోహావిష్టులై తమ శిరస్సులతో మా పాదములకు నమస్కరింతురు" వి మధురమైన మాటలతో పలుకగా 31

ఇంద్రుడు మిక్కిలి సంతసించి అప్సరసలలో శ్రేష్ఠురాలగు రంభతో "రంభా: మునులను మోహింపజేయు సౌందర్యముగల నీవు నిజమును పలికితివి. 32

భూలోకమున "శుకు" డను పేరుగల మునీంద్రుడొకడు సువర్ణముఖరీ నదీ తీరమున మిక్కిలి కష్టమగు తపము నాచరించుచున్నాడు. 33

స్త్రీ రత్నములగు మీ రచ్చటికేగి యా మునీంద్రుని మోహింపజేయుడ"ని పలికి ఆదరముతో వారిని పంపగా దేవతాంగనలు దేవేంద్రునకు నమస్కరించి తపశ్శాలి యగు శుకయోగీంద్రుని చెంతకేగిరి. 34

## శ్రీ శుకయోగీంద్రుని తపోవనమునకు వచ్చి రంభాదులు విలాసచేష్టల నొనరించుట

రంభాదులా మునీంద్రుని సన్నిధానమునకేగి మధురముగా గానముచేసిరి. మిక్కిలి మత్తిలినవారై పిల్లనగ్రోవి, వీణావాద్యములతో నృత్యము నొనరించిరి. 35

మన్మథమదోద్రేకులై యొండొరులతో సంలపించుచు, నేవియో మాటలనాడ దొడంగిరి; నవ్వసాగిరి; క్రీడింపసాగిరి. 36

ఇట్లా ఒడలెఱుంగని మదములో మగ్నమైన దేవాంగనలా మునిచంద్రుని యెదుట ననేక విధములగు ప్రియోక్తులతో ననేక శృంగారచేష్టల నొనరించిరి. 37

దేవేంద్రుని యాజ్ఞచే నచట సూర్యుడు ప్రజ్వరిల్లకుండెను. వాయువు కలువల సుగంధముతో మెల్లగా సుఖముకలుగువట్లుగా వీచెను. 38

సుధానిధి శ్చ వవృధే । మదయన్ సురసున్దరీః ।
కాలః సర్వ స్తుకుసుమో । పేత స్తత్ర బభూవ హ ॥ 39

ఏవం విధే మధూద్యోగ । మహితే ఽస్మిం స్తపోవనే ।
ఇత స్తతః శమ్బరారిః । విశఙ్కో విచచార హ ॥ 40

అత శ్చా నఙ్గవివశాః । చేష్టయన్తో ఽమరాఙ్గనాః ।
తా న శేకు స్తస్య నేత్రే । నివ ర్తయితు మగ్రతః ॥ 41

## శ్రీనివాసధ్యానేన జితకామం శుకం ప్రతి రమ్భాదిహాస్యో క్తిః

సో ఽపి ధ్యాయన్ శ్రీనివాసం । శఙ్ఖాద్యబ్జగదాధరమ్ ।
వాసుదేవం హృషీకేశం । జగతాం కారణం వరమ్ ॥ 42

సమాశ్రితా ర్తిహరణం । సుహృదం సర్వదేహినామ్ ।
నా చి న్తయ చ్చాన్తికస్థాః । తాః స్త్రియ స్తపసై ధితః ॥ 43

సమీక్ష్య తా స్తం దుర్ధర్షం । ఊచు రప్సరస స్తదా ।
లజ్జాక్రోధసమావిష్టా । శ్చైవ మూచుః పరస్పరమ్ ॥ 44

" కోవా హ్యే స్తే ఽత్ర దుర్బుద్ధిః । పూష్ణి నిక్షి ప్త వీక్షణః ।
ఉపస్థిత ముపేక్ష్యే మం । గణ మప్సరసాం స్వయమ్ ॥ 45

సమీపస్థ మనన్వ్రేక్ష్య । సర్వస్య తపసః ఫలమ్ ।
దురాత్మనాఽతిమూఢేన । అముత్ర కిం చి న్త్యతే ఽధునా ॥ 46

దృష్ట్వా ముఖా న్యప్సరసాం । సహస్రాక్షః శచీపతిః ।
సురాధీశః సహస్రాక్ష్ణాం । సాఫల్యం సమ్య గశ్నుతే ॥ 47

యాగాదికాః క్రియాస్సర్వాః । కుర్వ న్త్యస్మత్కృతేనరాః ।
దదుశ్చ ధనధాన్యాని । తప్య న్తిస్మ తపాంసి చ ॥ 48

దేవతాంగనలను మత్తుల నొనరించుచు చంద్రుడభివృద్ధిని గాంచెను. ప్రతియొక ఋతువునను ప్రత్యేక ప్రత్యేకముగ పుష్పించు పుష్పములతోడే పర్యాయము వికసించుటచే కాలమాహ్లాదకరముగ నుండెను. 39

ఇట్టి వసంతర్తు విజృంభణముచే మనోహరమగు తపోవనమున మన్మథుడు నిరాటంకముగా సంచరించెను. 40

మదనాతురలై సురాంగన లనేకవిధములగు శృంగారచేష్టల నొనరించుచును శ్రీ శుకయోగీంద్రుని కనులను తమవైపు మరల్చుకొనజాలకపోయిరి. 41

## శ్రీనివాసుని ధ్యానముచే కాముని జయించిన శ్రీ శుకుని రంభాదులు పరిహసించుట

శ్రీ శుకయోగీంద్రుడును శంఖము, చక్రము, పద్మము, గదాదులను ధరించినట్టియు, జితేంద్రియుడును, జగత్తునకు ప్రధాన కారణమైనవాడును, 42

తన నాశ్రయించినవారి దుఃఖములను పోగొట్టువాడును, సకల ప్రాణులకు స్నేహితునివలె హితమును కోరువాడునునగు శ్రీమన్నారాయణుని ధ్యానించుచు తపోనిష్ఠాగరిష్ఠుడై తన సమీపమున నున్న సురాంగనలను గూర్చి యాలోచించకుండెను. 43

అట్లు మిక్కిలి దుర్జయుడై యున్న శ్రీ శుకుని గాంచి యా దేవకాంతలు సిగ్గు కోపము ముప్పిరిగొనగా తమలోతాము — 44

సూర్యభగవానునియందే దృష్టిని నిల్పియుంచి యిటనున్న యీ మందబుద్ధి యెవడోకదా! తన పరిసరములకు స్వయముగా నేతెంచినట్టియు 45

తపస్సునకంతకు ఫలమైనట్టి యీ యప్సరసమూహమును లెక్కింపక వీక్షింపక దుష్టబుద్ధికలిగి మిక్కిలి మూఢుడగు నీతడెద్దానిని గురించి యిపుడిచ్చట ధ్యానించుచుండెనోగదా? 46

వేయి కన్నులుకలిగి దేవతల కధిపతియై శచీదేవికి భర్తయగు దేవేంద్రుడప్సరసల ముఖసందర్శనమువనే కదా తన వేయి కనులవలన ఫలితమును చక్కగా బడయుచున్నాడు. 47

భూలోకమున మనుజులందరును మా కొఱకేగదా యజ్ఞయాగాదుల నొనర్చుచున్నారు. ధనము ధాన్యము మొదలగు దానముల నొసంగుచున్నారు. తపస్సుల నొనరించుచున్నారు 48

య స్త్వస్మాకం ప్రియాలాపాన్ । న శృణోతి మనోరమాన్ ।
అచేతనో వృథా జీవీ । స వ త్యల్పమతి స్సహి ॥ 49

విద్యానా మార్జనం బాల్యే । యౌవనే విషయైషితా ।
వృద్ధత్వే తపసాం వృత్తిః । ఇ త్యూశన్తి మనీషిణః ॥ 50

సుకుమారో యువా ఉత్య న్త । సుభగ స్తపసి స్థితః ।
శృఙ్గారిణీనాం శృఙ్గారః । సున్దరీజనసున్దరః ॥ 51

దేశకాలా వతిక్రమ్య । యత్కర్మ కురుతే నరః ।
త త్తస్య నిష్ఫల మితి । ప్రవద న్తి మనీషిణః ॥ 52

స్వధర్మాచారనిరతా । వేదశాస్త్రవిశారదాః ।
కరస్థం రత్న ముత్సృజ్య । మూఢధీః అన్య దిచ్ఛతి ॥ 53

దివ్యాఙ్గనాః పూజనీయాః మనుష్యాణాం విశేషతః ।
అయ మస్మాన్ అనాదృత్య । తిష్ఠత్య త్యన్తదుర్మతిః ॥ 54

పూజ్యపూజావిపర్యాసః । శ్రేయో హ న్తీ త్యుశ న్తి హి ।
తా స్విత్థం జల్పమానాసు । సురయోషిత్సు సువ్రతః ॥ 55

## రమ్భాదీనాందుర్వ్యాపారాన్‌విలోక్యశ్రీశుకబ్రహ్మర్ష్యనుతాపః

తపః కృశతరాకారః । కృష్ణద్వైపాయనాత్మజః ।
నా చి న్తయత్ నమస్తా స్తాః । ఘుష్య న్తీ రివ గర్దభీః ॥ 56

ఉపస్థితం తపోవిఘ్నం । చి న్తయామాస చ స్థిరః ।
కే నేమాః ప్రేషితాః హ్య స్మత్ । తపోభఙ్గచికీర్షుణా ॥ 57

అవ్యాజవైరిణా కశ్చిత్ । లోభోపహతచేతసా ।
నిదానం పాపచేష్టానాం । పాపీయస్యః స్వతః స్త్రియః ॥ 58

మనస్సునకాహ్లాదము నొనగూర్చు మన ప్రియభాషణముల వినని మూఢుడు చేష్టలుడిగి జడమై వ్యర్థముగ జీవించువాడే కదా! 49

బాల్యమున విద్యా నార్జించుటయు యౌవనమున విషయసుఖముల ననుభవించుటయు వృద్ధాప్యమున తపము నొనరించుటయు కర్తవ్యములని పండితులు వక్కాణింతురు.

సుకుమారుడును, యౌవనవంతుడును, మిక్కిలి యందగాడును, సింగారవతులకు సింగారమును, సుందరాంగనలను పైతము మైమరపింపజాలు సుందరుడగు 51

నీతడు తపము నాచరించుచున్నాడు. మనుష్యుడు దేశకాలముల ననుసరింపక పనుల నొనరించినచో నాతని పనులు వ్యర్థములని పండితులు ప్రబోధించుచున్నారు కదా!

తన వర్ణమునకు తగిన యాచారమునందాసక్తి కలిగి, వేదశాస్త్రములయందు చక్కని ప్రావీణ్యముకలిగియు చేతనున్న రత్నమును జారవిడచి యజ్ఞానియై యితర వస్తువుల నాశించుచున్నాడు. 53

మనుష్యులకు ముఖ్యముగా దేవతాంగనలు పూజింపదగినవారు. ఈతడు మిక్కిలి దుష్టబుద్ధి కలిగి మనల ననాదరించుచున్నాడు. 54

పూజింపతగినవారిని పూజింపకుండుట, పూజింపతగనివారిని పూజించుట యనర్థ హేతువని పెద్దలు వక్కాణింతురని యా దేవాంగన లిట్లు భాషించుకొనుచుండగా సదాచార సంపన్నుడును, 55

## రంభాదుల దుష్టచేష్టితములను చూచి శ్రీ శుకయోగీంద్రుడు పరితపించుట

తపస్సుచే మిక్కిలి కృశించిన శరీరము కలిగినట్టియు, శ్రీ వ్యాసమహర్షి పుత్రుడువగు శ్రీ శుకయోగీంద్రుడు ఓంకారపెట్టుచున్న యాడగాడిదలవలె పలువిధములుగ సంభాషించుచున్న యా దేవకాంతలను లక్ష్యపెట్టకుండెను. 56

మరియు తనకు తపోభంగము దాపురించెనుగదా! యని చింతించుచు స్థిరచిత్తముకలిగి "నా తపస్సును విఘ్నము చేయగోరుచున్నట్టియు 57

దురాశా మలినమానసుడు కారణములేకయే శత్రుత్వమును సాధించు నెవని చేతనో యీ సురలోక వేశ్యకాంతలు పంపబడియున్నారు. స్త్రీలు పాపకృత్యములకు మూలకందములు. స్వభావముగనే పాపపరివృతజన్మచేష్టలు కలవారు. 58

అనేకానర్థసార్థా స్తాః । వ్యక్తముక్తామనీషిభిః ।
వ్రీడా విజ్ఞాన మాస్తిక్యం । పౌరుషం శ్రుతి రున్నతిః ॥ 59

దర్శనా దేవ నశ్యన్తి । స్త్రీణా మేతాని సర్వశః ।
ధైర్యపారంగతః సర్వ । ధర్మశాస్త్రవిశారదః ॥ 60

యోషిద్దర్శనమాత్రేణ । ముహ్యతి క్షుభ్యతి స్వయమ్ ।
స్త్రియో హి నరకద్వారం । నిర్మితం పరమేష్ఠినా ॥ 61

తస్మా త్తద్దర్శనం పాపం । నరాణా న్తు తపస్వినామ్ ।
స్త్రీపుంవిభాగో జగతాం । భూత్యై ధాత్రా వినిర్మితః ॥ 62

తేన ప్రవర్తతే లోకః । పురుషార్థాత్మకేన తు
అజ్ఞానినో నరా ముహ్య । న్త్యన్యోన్యప్రణయా దిహ ॥ 63

పురుషా శ్చ స్త్రియో దృష్ట్వా । తాం శ్చ దృష్ట్వా చ తా స్తథా ।
తితీర్షు స్తపసా ఽజ్ఞాన । మయం సంసారసాగరమ్ ॥ 64

నివృత్తవిషయోఽత్రైవ । స్థితోఽస్మిన్ విజనేవనే ।
విధినా ఽఽపాదిత శ్చైవ । స్తరాయ స్తపసో మమ ॥ 65

స్త్రియ స్తపోవిఘ్నకర్యః । పరిహార్యాః ప్రయత్నతః ।
తి తీర్షుం దు స్తరం ఘోరం । మహాసంసారసాగరమ్ ॥ 66

గృహ్ణాతి విషయగ్రాహో । మధ్యే పురుష మిత్యత ।
తపోలోభభయా దిత్థం । చిన్తయన్ సహసా మునిః ॥ 67

సమదర్శీ తు సర్వత్ర । జితక్రోధో జితేన్ద్రియః ।
కన్దర్పసాయకాన్ ఘోరాన్ । జిత్వా ఽక్షోభ్యో హి నిర్మమః ।
శ్రీనివాసం హృషీకేశం । సహసా శరణం యయౌ ॥ 68

కమలవిలసవలోకనై రసజ్ఞాభినవ । విభూతివిభాగభాగధేయైః ।
అపరిమమునిమానసాపహాపైః । అవమతి మాకలయన్ విలోకనై శ్చ ॥ 69

పలువిధ అహంకారభూతులాంద్రవి పండితులు సుస్పష్టముగా పలుకుచుందురు. సిగ్గు, మంచిచెడుల నెఱుంగు జ్ఞానము, భగవంతుని యందలి విశ్వాసబుద్ధి, పౌరుషము, వేదాధ్యయనము, సద్వంశసంజాతులమనెడి యౌన్నత్యము 59

మొదలగునవి యన్నియును స్త్రీలను గాంచినంతనే నశించుచున్నవి. ధైర్యమున పరాకాష్ఠనందినవాడైనను, ధర్మశాస్త్రముల నామూలాగ్రముగ నధ్యయనముచేసినవాడైనను 60

స్త్రీల నవలోకించినంతనే మోహమును చెందుచున్నారు. తనంతట తానే కలత నొందుచున్నారు. విధాతచే స్త్రీలు నరకమునకేగు మార్గముగా నిర్మింపబడియున్నారు. 61

కావున తపశ్శాలురగు మనుష్యులకు స్త్రీలను వీక్షించుటయే పాపహేతువగుచున్నది. బ్రహ్మచే స్త్రీలవియు, పురుషులనెడు విభజన జగదభివృద్ధికై నిర్మింపబడినది. 62

ధర్మార్థకామమోక్షరూప పురుషార్థముల సాధించుటకై లోకము ప్రవర్తించుచుండ అజ్ఞానులగు మనుష్యులు తుచ్ఛ కామవాంఛచే పరస్పర ప్రేమవలనను, 63

పురుషులును, స్త్రీలును పరస్పరావలోకనములచేతను మోహము నందుచున్నారు. కావున నజ్ఞానముచే వ్యాపింపబడిన యీ సంసారసముద్రమును తపస్సుచే దాటగోరి 64

విషయసుఖములను వీడి, జనులు సంచరించని యీ యరణ్యమున నివసించుచున్న నా తపస్సునకు బ్రహ్మచే విఘ్నమాపాదింపబడెను. 65

తపస్సునకు విఘ్నము నొనరించు నీ స్త్రీలను ఏ ప్రయత్నముననైనను దూరముగ పారద్రోలవలెను. దాటశక్యముగాని ఘోర సంసారసముద్రమును దాటగోరు 66

పురుషుని మధ్యగా విషయములనెడు మొసలి గట్టిగా బంధించుచున్నది. నేను వీరిని శపింతమనిన నా తపము తరగిపోవునుకదా ! యను భయముతో నిట్లు విచారించుచు 67

ప్రాణులన్నిటియందును సమదృష్టికలిగినట్టియు, కోపమును జయించినట్టి శుకయోగీంద్రుడు భయంకర మన్మథబాణములను జయించి కలతచెందని మనస్సుకలవాడై మమకారములేక ఇంద్రియముల నియమించు ప్రభువగు శ్రీనివాసుని వెంటనే శరణువేడెను.

పద్మముల సంపదనుకూడ లోభింపజేయునట్టియు, మన్మథుని నూతనైశ్వర్య సంపదలో యమునట్లున్నట్టియు, మునీశ్వరుల నిశ్చల ధ్యానసంపదలను రూపుమాపునట్టి విలాస చూపులతో తపస్విపై దనాదరమును బుట్టించుచును, 69

శిఖరదశనదీధితి ప్రతానప్రసభ । నిరస్తతమశ్చయైః ప్రహాసైః ।
నటనవికటవిభ్రమైః చికీర్షన్ । నయనవిలాసభరైః తపో ఽన్తరాయమ్ ॥ 70

ఇతి విబుధవిలాసినీగణ స్తం । ముని మభితః పరివార్య చావతస్థే ।
వ్యవసితమతి రచ్యుతప్రపత్తౌ । స చ న శశాప తపోవినాశభీరుః ॥ 71

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవల దేవదర్శన సంవాదే పాద్మనరస్త్రీరత్నదివ్యారామే శుకబ్రహ్మర్షేః మహానియమపూర్వక తపఃకరణాదివర్ణనం నామ పఞ్చవింశో ఽధ్యాయః

---

# షడ్వింశో ఽధ్యాయః

## శ్రీనివాసముద్దిశ్యరమ్భాద్యప్సరసస్సఙ్ఖీభీతశుకస్తుతిః

అథవిబుధవిలాసినీషు విష్వక్ । ముని మభితః పరివార్య తస్థుషీషు ।
మదనవికృతివికత్థనప్రలాపా స్వ । వమతినిర్మితనైజచాపలాసు ॥

త్రిభువనముదముద్యతాసుకర్తుం । మధుసహసాఽగతిగర్వనిర్వహాసు ।
మధురసభరితాఖిలాత్మభావా । స్వగణితభీతిషుశాపతఃశుకస్య ॥ 2

అతివిమలమతి ర్మహానుభావో । ముని రపి శాన్తమనాః నిజాత్మగుప్త్యై ।
అఖిలభువనరక్షకస్య విష్ణోః । స్తుతి మథ కర్తుమనా మనాక్ బభూవ ॥ 3

శ్రియః శ్రియం షడ్గుణపూరపూర్ణం । శ్రీవత్సచిహ్నం పురుషం పురాణమ్ ।
శ్రీకణ్ఠపూర్వామరబృన్దవన్ద్యం । శ్రియః పతిం తం శరణం ప్రపద్యే ॥ 4

విభుం హృదిస్థం భువనేశ మీడ్యం । నిరాశ్రయం నిర్మలచిత్తచిన్త్యమ్ ।
పరాత్పరం పార మపారమేనం । ఉపేన్ద్రమూర్తిం శరణం ప్రపద్యే ॥ 5

చంద్రకాంతిపుంజ ప్రసారములచే చీకటులను మాటుపరచు మందహాసములతోను, నేత్రవిలాసములతో నిండియున్న నాట్యములోచూపు శృంగారచేష్టా విశేషముల చేతను, అతని తపస్సును చెరపగోరుచున్న 70

సురలోక వేశ్యాంగనాసముదాయ మా శుకయోగీంద్రుని నలువైపుల చుట్టుముట్టియుండెను. తపోభంగము కలుగునను భయమునుచెందుచు వారిని శపించక శుకయోగీంద్రుడు శ్రీమన్నారాయణుని శరణువేడుటయందే సుస్థిరమానసుడై యుండెను. 71

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవశర్మల సంభాషణమున పద్మసరోవర తీరమునందలి దివ్యోద్యానమున శ్రీ శుకయోగీంద్రుడు మహానియమముతో తపము నొనరించుట యనెడు ఇరువదియైదవ యధ్యాయము.

---

# ఇరువదియారవ అధ్యాయము

## రంభాది అప్సరస సమూహమువలన భయపడిన శ్రీ శుకయోగీంద్రుడు శ్రీనివాసుని గురించి యొనరించిన స్తోత్రము

అనంతరము మన్మథవికారముచే గర్వముచేనిండిన వాక్యములను పలుకుచున్నట్టియు, దుష్టబుద్ధిచే చేయబడిన స్వభావసిద్ధమగు చాపల్యము కలిగినట్టియు, 1

ముల్లోకముల కానందము నొనగూర్చుటలో ప్రయత్నించుచున్నట్టియు, తేనె వలె మధురమగు రసముతోనిండిన మనోభావములు కలిగినట్టియు, శుకమహర్షి శాపము వలన భయమును లక్ష్యముచేయనట్టియు నప్సరాంగనలు శ్రీ శుకయోగీంద్రుని నాల్గువైపులనుండి చుట్టుముట్టి నిలువగా 2

మిక్కిలి నిర్మలచిత్తము కలవాడును, గొప్ప మాహాత్మ్యముకలవాడుననగు శ్రీ శుకయోగీంద్రుడు శాంతితోగూడిన మనస్సుకలవాడై తన ఆత్మను కాపాడుటకై సకలలోక పరిత్రాతయగు శ్రీమన్నారాయణుని స్తోత్రముచేయ సంకల్పించెను. 3

అందరిచే సేవింపబడు లక్ష్మికిని సేవింపదగినవాడును, జ్ఞానశక్త్యాది ఆరు ప్రధానగుణములతో నిండియున్నవాడును, శ్రీవత్సమను పుట్టుమచ్చ గుర్తుగాగలవాడును, ఆదిపురుషుడును, శంకరుడు మొదలగు దేవతాగణములచే నమస్కరింపబడువాడును, లక్ష్మీదేవి భర్తయగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 4

అంతటను వ్యాపించియుండువాడును, సర్వప్రాణుల హృదయకుహరముల నున్నవాడును, తన కితరాశ్రయములులేనివాడును, శాంతమగు మనస్సుతో ధ్యానింపతగినవాడును, పరాత్పరుడును, సంసారమున కావలిగట్టు అయినవాడును, అంతులేనివాడును అగు ఆ వామనమూర్తిని శరణుజొచ్చుచున్నాను. 5

స్మేరాతసీసూనసమానకాన్తిం । సురక్తపద్మప్రభపాదహస్తమ్ ।
ఉన్నిద్రపఙ్కేరుహచారునేత్రం । పవిత్రపాణిం శరణం ప్రపద్యే ॥ 6

సహస్రఫానుప్రతిమోపలౌఘ । స్ఫురత్కిరీటప్రవరోత్తమాఙ్గమ్ ।
ప్రవాలముక్తానవరత్నతార । హారం హరిం తం శరణం ప్రపద్యే ॥ 7

తత్ర తత్కృత దశావతారస్తోత్రమ్

పురా రజోదుష్టధియో విధాతుః । అపాకృతాన్ యో మధుకైటభాభ్యామ్ ।
వేదానుపాదాయ దదౌ చ తస్మై । తం మత్స్యరూపం శరణం ప్రపద్యే ॥ 8

పయోధిమధ్యే పృథుమన్దరాద్రిం । ధర్తుం చ యః కూర్మవపు ర్బభూవ ।
సుధాం సురాణా మవనార్థమిచ్ఛన్ । త మాదిదేవం శరణం ప్రపద్యే ॥ 9

వసున్ధరాం దుర్ధరదైత్యపీడితాం । రసాతలా న్తర్వివరాభివిష్టామ్ ।
ఉద్ధారణార్థ శ్చ వరాహ ఆసీత్ । చతుర్భుజం తం శరణం ప్రపద్యే ॥ 10

నఖై రురస్తీక్ష్ణముఖై ర్హిరణ్యం । అరాతి మామర్దితసర్వసత్త్వమ్ ।
విదారయామాస హి యో నృసింహో । హిరణ్యగర్భం శరణం ప్రపద్యే ॥ 11

యో యజ్ఞవాట మభిగమ్య పూర్వం । బలే ర్యయాచే త్రిపదీం భువశ్చ ।
పశ్చా ద్దదౌ త త్పద మేవ తస్మై । శ్రీవామనం తం శరణం ప్రపద్యే ॥ 12

త్రిస్సప్తకృత్వః క్షితిపాలలోకం । పరశ్వధేనా పి నిహత్య పిత్రే ।
దదౌ నివాపం తదసృగ్జలౌఘైః । తం భార్గవం రామ మహం ప్రపద్యే ॥ 13

దశాననం దాశరథి ర్బభూయః । ఛిత్త్వా శిరాం స్యేకశరేణ వీరః ।
లఙ్కాం దదౌ యశ్చ విభీషణాయ । తం రామచన్ద్రం శరణం ప్రపద్యే ॥ 14

వికసించిన శిరీషపుష్పముతో సమానమగు కాంతికలిగినట్టియు, మిక్కిలి యెఱ్ఱనగు తామరపుష్పమును బోలిన పాదములు, చేతులు కలిగినట్టియు, చక్కగా వికసించిన తామరపుష్పమును బోలిన సుందరములగు కనులు కలిగినట్టియు, చేతిలో పవిత్రమును (వజ్రమును) ధరించిన శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను 6

వేయి సూర్యసమాన కాంతిగల మణిసముదాయముచే ప్రకాశించుచున్న మేలి కిరీటమును శిరస్సున ధరించినవాడును, పగడములు ముత్యములు నవరత్నములు గూర్చిన నక్షత్ర హారములు కలిగినట్టి శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నానని స్తుతించెను. 7

## శ్రీ శుకమహర్షి యొనరించిన దశావతార స్తోత్రము

మున్ను రజోగుణకృత్యమగు నహంకారముచే మందబుద్ధియగు చతుర్ముఖుని వేదములను మధుకైటభులు హరింపగా వారినుండి వేదములను గొనితెచ్చి బ్రహ్మకొసంగుటకై మత్స్యరూపమును ధరించిన శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 8

పాలసముద్రమధ్యము నందలి మంధరపర్వతమును తేలికగా ధరించుటకును దేవతలకమృతము నొసంగి కాపాడుటకును కూర్మావతారమును ధరించిన పురాణపురుషుడగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 9

రాక్షసులచే భరింపనలవికాని విధముగా పీడింపబడుచున్నట్టియు, పాతాళలోక గుహయందుంచబడినట్టి భూదేవిని లేవనెత్తగోరి వరాహరూపమును ధరించిన నాల్గు భుజములు కల శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 10

సకల ప్రాణులను హింసించుచున్నట్టియు, తనకు శత్రువగు హిరణ్యకశిపుని వాడిగోళ్ళచే చీల్చివేసిన నృసింహరూపియు, చతుర్ముఖున కంతర్యామియై సృష్టినినెరపు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 11

మున్ను బలిచక్రవర్తియొక్క యాగశాలను ప్రవేశించి మూడడుగుల భూమిని యాచించి మరల బలిచక్రవర్తి శిరముపై మూడవ యడుగునుంచిన వామనరూపియగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 12

(ఒక రాజు తన తండ్రిని చంపెనను కోపముతో) గండ్రగొడ్డలిచే రాజవంశముల నిరువదియొక్క మార్లు వధించి తన తండ్రికి వారి రక్తమునే జలతర్పణముగా నొసంగిన పరశురామావతారుడగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 13

దశరథుని పుత్రుడుగా నవతరించి యొకే బాణముచే రావణుని శిరములను ద్రుంచిన పరాక్రమశాలియై విభీషణునకు రాజ్యము నొసంగిన శ్రీరామావతారుడగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 14

హలాయుధో యో యదువంశదీపః । ప్రలమ్బపూర్వామరవైరిహన్తా ।
అభూ ద్వ్రజానో్య బలభద్రరామో । విరాట్పరం తం శరణం ప్రపద్యే ॥ 15

వృష్ణ్యన్వవాయప్రభవం ధరిత్రీ । భారాపహారప్రథితప్రభావమ్ ।
కృష్ణం పరం పాణ్డవభాగధేయం । యోగీన్ద్రవన్ద్యం శరణం ప్రపద్యే ॥ 16

కలిం స్వతః కల్మషదుష్ప్రధర్షం । కలానువిద్ధం వికరాలవేషమ్ ।
సంహర్తుకామో భవితా చ కల్కి । య స్తం ముకున్దం శరణం ప్రపద్యే ॥ 17

అహం మహత్త్వేన్ద్రియపఞ్చభూత । తన్మాత్రమాత్రాప్రకృతేః పురాణీ ।
యతః ప్రసూతా పురుషః తదాత్మా । త మాత్మనాథం శరణం ప్రపద్యే ॥ 18

పురా య ఏత త్సకలం బభూవ । యేనా పి త ద్యత్ర చ లీన మేతత్ ।
ఆస్తాం యతో ఽనుగ్రహనిగ్రహౌ చ । తం శ్రీనివాసం శరణం ప్రపద్యే ॥ 19

నిరామయం నిశ్చలనీరరాశి । నికాశ సద్ధ్రూపమయం మహ స్తత్ ।
నియన్తృ నిర్మాతృ విహన్తృ నిత్యం । విద్రాణ మేకం శరణం ప్రపద్యే ॥ 20

జగ న్తి యః స్థావరజఙ్గమాని । సంహృత్య సర్వాణ్యు దరే శయాని ।
ఏకార్ణవా న్తర్వటపత్రతల్పే । స్వపిత్య న న్తం శరణం ప్రపద్యే ॥ 21

వీత న్తదుఃఖౌఘ మతీన్ద్రియం తం । విష్కారణం నిష్కల మప్రమేయమ్ ।
అణోరణీయాంసమన న్త మ న్తః । ఆత్మానుభావం శరణం ప్రపద్యే ॥ 22

చేతిలో నాగలినే యాయుధముగా ధరించినట్టియు, యాదవకులమున నావిర్భవించి నట్టియు, ప్రలంబుడు మొదలగు రాక్షసులను సంహరించినట్టియు, ఉదారపురుషుడును, శ్రేష్ఠమైన విరాడ్రూపుడునునగు బలరామావతారుడగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను.

యదువంశోద్భవుడును, భూభారమును తీర్చుటలో ప్రఖ్యాతివిగాంచిన ప్రభావము కలవాడును, పాండవులొనరించిన పుణ్యఫలరూపుడును, మునీశ్వరులచే నమస్కరింపబడు వాడును శ్రీకృష్ణావతారుడునగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 16

స్వభావముచేతనే పాపముల విధ్వంస మొనరించువాడును, షోడశకళాపరిపూర్ణుడును, భయంకరరూపుడును, జనులను సంహరింపగోరి కలికావతారుడు కాబోవునట్టి శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 17

ప్రకృతియు దానియొక్క వికారములగు మహత్తత్వము, అహంకారము, పదునొకండు యింద్రియములు, పంచతన్మాత్రలు, పంచభూతములు యివియన్నియు యెవ్వని నుండి పుట్టి ప్రవర్తించుచున్నవో పురుషుడెవ్వనికి పరతంత్రుడై ప్రవర్తించుచున్నాడో అట్టి సకలాత్మస్వరూపుడును, అనన్యాధిపతియునగు నారాయణుని దిక్కుని నమ్ముచున్నాను.

పూర్వము సృష్టియంతయు నెవనిచే సృజింపబడెనో, యెవనియందు లీనమా యెనో కవికరము, కోప మెవని యధీనమునమండినవో యట్టి శ్రీనివాసుని శరణువేడు చున్నాను. 19

ఎట్టి యుపద్రవములులేనివాడును, చలించని నీలిసముద్రమును బోలిన చక్కని రంగుకలిగినవాడును, తేజోవిరాజితుడును, సర్వమును నియమించువాడును, సృష్టించు వాడును, సంహరించువాడును, నెల్లపుడును యోగనిద్రలోనుండు శ్రీమన్నారాయణునే శరణువేడుచున్నాను. 20

చరాచరాత్మకమగు ప్రాణిసమూహమును సంహరించి దానినంతను తన గర్భమున నిడుకొని పండుకొనియుండువాడును, ఒకే జలమయమగు సముద్రమున మర్రియాకుపై నిద్రించుచుండు పురాణపురుషుడగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 21

దుఃఖసముదాయమును పోగొట్టువాడును, ఇంద్రియములకు గోచరింపనివాడును, తనకు మరియొక కారణములేనివాడును, ఇంద్రియముల అవసరములేకయే వాని కార్యములను చేయువాడును, ప్రమాణములచే నూహింపతగనివాడును, అణువుకంటె నణువును, ఆదిమధ్యాంతరహితుడును, స్వాధీనమైన మహిమకలవాడునునగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 22

సప్తామ్బుజీరక్షాకరాజహంసం । సప్తార్ణవీసంసృతికర్ణధారమ్ ।
సప్తాశ్వబిమ్బస్థహిరణ్మయం తం । సప్తార్చిరఙ్గం శరణం ప్రపద్యే ॥ 23

నిరాగసం నిర్మలపూర్ణబిమ్బ । నిశీథినీనాథనిభాననాభమ్ ।
నిర్ణీతనీతిం నిగమాన్తనిత్య । నిశ్రేయసం తం శరణం ప్రపద్యే ॥ 24

ద్వితీయహీనం రచితాజడాత్మ । నిజాన్తరారోపితవిశ్వవిశ్వమ్ ।
నిస్సీమకల్యాణగుణాత్మభూతమ్ । విధిం విధీనాం శరణం ప్రపద్యే ॥ 25

## శ్రీనివాసముద్దిశ్య శుకబ్రహ్మర్షి ప్రార్థనా.

త్వక్చర్మమాంసాస్థ్యసృగశ్రుమూత్ర । శ్లేష్మాశ్రువిట్శుక్రసముచ్చయేషు ।
దేహేష్వసారేషు న మే స్పృహైషు । ధ్రువం ధ్రువం త్వం భగవన్ ప్రసీద ॥ 26

కారుణ్యపాథోనిధివల్గదూర్మి । మాలాలసచ్చైవలకజ్జలాక్తైః ।
రాజీవరాజీరమణైరపాఙ్గై । రనాథ మానన్దయ నాకనాథ ! ॥ 27

భక్తిః క్వ మే త్వచ్చరణారవిన్ద । మధూదమాద్యన్మహిమా ఉప్యనన్యా ।
బుద్ధిః క్వ దుష్టేన్ద్రియవాజిరూఢా । నైకత్రతేజస్తిమిరస్థితిర్హి ॥ 28

న విద్యతే త్వత్పదపద్మపీఠ । నిషేవిణాం క్వాప్యశుభం నరాణామ్ ।
ఉపస్థితం మే భయ ముత్పలాక్షి । విలోకనైర్లోపయ లోకనాథ ! ॥ 29

సప్తద్వీపాత్మక భూమండలమునంతను రంజింపజేయు రాజహంసయైనట్టియు, సప్తసముద్రావృతమైన సంసారసాగరమును దాటించు చుక్కానివాడైనట్టియు. సూర్య మండలాంతర్వర్తియగు స్పృహణీయ దివ్యమంగళ విగ్రహవిశిష్టుడైనట్టియు, అగ్ని రంతర్యామిగానున్నట్టి శ్రీమన్నారాయణుని దిక్కుని నమ్ముచున్నాను. 23

దోషములులేనివాడును, నిర్మలమగు పూర్ణచంద్రునిబోలిన ముఖకాంతికల వాడును, ధర్మనిర్ణయము నొనరించువాడును. వేదాంతబోధితమై నిత్యమగు మోక్షము నొసంగువాడునగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 24

సాటిలేనివాడును, జీవులకంతరాత్మగానున్న తనలో నిముడ్చుకొని ప్రపంచము నంతను సృష్టించినవాడును. హద్దులేని కల్యాణగుణములు స్వరూపముగా కలవాడును, విధు లకు విధియైనగు శ్రీమన్నారాయణుని శరణువేడుచున్నాను. 25

## శ్రీనివాసునిగూర్చి శుకమహర్షి యొనరించిన ప్రార్థన

శరీరము, చర్మము, మాంసము, ఎముకలు, రక్తము, కొవ్వు, మూత్రము, శ్లేష్మము, మలము, శుక్రము మొదలగువాటిచే కూడిన సారములేని దేహములయందు నాకు కోరికలేదు. హే దేవా! ఇది నిశ్చయము. నిశ్చయము. నీవు నన్ననుగ్రహింపుము. 26

స్వర్లోకాధిపా! దయాసముద్రమున తరంగించుచున్న కెరటములచేనొప్పు నాచు యను కాటుకచే పూయబడిన తామరపుష్పములవలె మనోహరములగు క్రీగంటి ప్రసార ములచే దీనుడనగు నన్నానందింపజేయుము. 27

స్వామీ! నీ పాదారవిందములనుండి స్రవించునట్టి మకరంద రసాస్వాదనముచే మైమరపింపజేయు వైభవముగల నిశ్చలభక్తి, అవిధేయములై దుర్విషయములవైపు లాగునట్టి దుష్టేంద్రియములనబడు గుఱ్ఱములచే పీడ్వబడుచున్న బుద్ధిగల నాకెట్లు ఘటిం చును. చీకటియున్నచోట వెలుగుండునా? 28

సకల లోకములకు ప్రభువైనవాడా! నీ పాదపద్మములను సేవించు మనుజుల కళుభములే యుండవుకదా? నాకు స్త్రీజన కటాక్షవీక్షణములచే భయము సంభవించినది. దానిని పోగొట్టుము. 29

సమాధిభఙ్గో ఒయ మిహ ప్రవృత్తో । దురాత్మనా కేన దురన్తచిన్త । ।
త్వ మేవ మాం రక్ష భయాదముష్మాత్ । త్వదన్యతో నాస్తి గతి ర్మమాస్మిన్ ॥

అనాథనాథ । ధిషణా । మమ త్వయ్యేవ వర్తతే ।
సర్వథా సర్వకాలేషు । తదా ఒఒస్తాం త్వత్ప్రసాదతః ॥ 31

ప్రసన్నే త్వయి గోవిన్దే । లభ్యం సర్వత్ర కిం ప్రభో ।
స్వర్గాపవర్గౌ భగవన్ । త్వద్భక్తానామదుర్లభౌ ॥ 32

భవతా వీక్ష్యతే య స్తు । తస్య త్వద్భక్తి రూర్జితా ।
ఉపేక్ష్యతే తు య స్తస్య । భోగేచ్ఛా చాభిజాయతే ॥ 33

అతః శృఙ్గారయోగ్యస్త్రీ । భయవిహ్వల మత్ర మామ్ ।
రక్ష త్వ మేవ శరణం । అనన్యశరణో గతః ॥ 34

నమః సకలకల్యాణ । కాననే కరుణాత్మనే ।
శ్రీవత్సవక్షసే తస్మై । లక్ష్మీనారాయణాత్మనే ॥ 35

## రమ్భాదీనాం స్వలావణ్యనిన్దాపూర్వకం యథాగతం గమనమ్.

పారాశరే బ్రహ్మమునౌ పురాణం । పుమాంస మిత్థం శరణం ప్రపన్నే ।
దేవస్త్రియః కామశరేణ విద్ధా । యథాగతమ్ క్షీణధియః ప్రతీయుః ॥ 36

అథ సురవనితాభి రీక్షణాద్యైః । విజవికృతై రగృహీతచిత్తవృత్తిః ।
విధు రివ తమసా గృహీతముక్తో । ముని రపి నిశ్చలధీః తపః ప్రపన్నః ॥ 37

ముకుందా ! ఎవరో దుష్టబుద్ధికలవాడై నా తపోభంగము నొనరించుటకు పూను
కొనియున్నాడు. మిక్కిలి విచారముగానున్నది. ఈ భయమునుండి నీవే నన్ను కాపాడ
వలెను. నీకంటె వేరొండు దిక్కులేదు. 30

దీనబంధో ! నా బుద్ధి యెల్లప్పుడు నీయందే యుండును. అన్నివిధముల, అన్ని
కాలములయందు బుద్ధి యట్లే నీ యనుగ్రహమున నిలుచునుగాక ! 31

ప్రభూ ! గోవిందా ! నీ వనుగ్రహించిన పొందరానిదేదియు నుండదుకదా !
స్వర్గము, మోక్షము నీ భక్తులకు సుకరముగా పొందదగినవి. 32

నీ కటాక్షపాత్రుడగు వానికి నీయందు గొప్ప భక్తి కలుగుచున్నది. నీ వెవ్వని
విషయమున నుపేక్షింతువో వానికి విషయసుఖములయందాసక్తి కలుగుచున్నది. 33

కావున కేవల శృంగారరసమునకే తగిన స్త్రీలవలన భయముచే క్రుంగుచున్న
నన్ను రక్షింపుము. నీవే శరణు. ఇతర దిక్కులేనివాడను. 34

సమస్త శుభముల నొనగూర్చువాడును, దయాస్వభావుడును, శ్రీవత్సమను
పుట్టుమచ్చ గుర్తుగాగలవాడును అగు లక్ష్మీనారాయణునకు నమస్కారము. 35

## రంభాదులు తమ సౌందర్యమును నిందించుకొనుచు వచ్చిన దారినే వెడలిపోవుట

పరాశరుని మనుమడగు శ్రీ శుకయోగీంద్రుడు ఆదిపురుషు నిట్లు శరణు
పొందగా సురకాంతలు మన్మథబాణపీడితులై మతిలేనివారై వచ్చినదారినే వెడలిపోయిరి. 36

దేవకాంతల క్రీగంటి ప్రసారములచేతను, శృంగారచేష్టలచేతను తన మనో
వ్యాపారములను చలింపనీక చీకటిచే కప్పబడి విడువబడిన చంద్రునివలె శ్రీ శుకయోగీం
ద్రుడు నిశ్చల మనస్సుకలిగి తపమొనరించుకొనసాగెను. 37

పలాన్మలభమానాసు । తపోభఙ్గే మహామునేః ।
రూపవేషాభ్యసూయాసు । నిర్గతాస్వప్సరస్స్వ తః ॥ 38

భగవత్కృపయా శుకకృతదృఢతర భక్తిపూర్వకభగవదుపాసనమ్.

తతః స్మరన్ భగవతో । హృషీకేశస్య శార్ఙ్గిణః ।
ఇన్ద్రియగ్రామ మఖిలం । సంయమ్యా స్మై సమర్పయన్ ॥ 39

పరాం కాష్ఠాం సమాకాఙ్క్షన్ । కాష్ఠాశ్మసమకాయకః ।
అతితాపసచారిత్రం । కుర్వ న్నజ్ఞష్మభూమిగః ॥ 40

భక్తార్తిభఞ్జనపరం । భక్త వత్సల మవ్యయమ్ ।
హృత్పుణ్డరీకనిలయం । చిన్తయన్ పుష్కరేక్షణమ్ ॥ 41

విజ్ఞానవైరాగ్యనిధిః । కార్ష్ణద్వైపాయని ర్మునిః ।
అతిఘోరతరం క్రూరం । చకార సుమహ త్తపః ।
తపసా తస్య సర్వాత్మా । సన్తుష్టః పద్మలోచనః ॥ 42

శుకమునిం ప్రతి తపస్తుష్టశ్రీనివాసాగమన్.

సంహర్తా రక్షితా స్రష్టా । భువనాని చతుర్దశ ।
అనుగ్రహీతా ఽన్తర్యామీ । నిగ్రహీతా నిర న్తరః ॥ 43

శఙ్ఖచక్రగదామ్భోజ । రాజత్కరచతుష్టయః ।
ముక్తాతపత్రితానన్త । సహస్రఫణమణ్డలః ॥ 44

వసై రభినవాకల్పైః । తపనీయమయాంశుకైః ।
సుమనోభిః దివ్యగన్ధైః । దివ్యాలేపనచన్దనైః ॥ 45

మహాయోగీంద్రుడగు శ్రీ శుకుని తపోవిఘ్నమున ఫలితము నొందనివారై తమ సౌందర్యమును, వేషమును నిందించుకొనుచు దేవకాంతలచ్చటినుండి వెడలినంతనే

## భగవంతుని దయచే శుకముని యొనరించిన గొప్పదగు భక్తితోగూడిన భగవదుపాసనము

ఇంద్రియములకు నియంతయగు శ్రీమన్నారాయణుని ధ్యానించుచు తన యింద్రియములన్నిటిని నియమించి శ్రీమన్నారాయణునియందే సమర్పించుచు 39

భగవదుపాసనలో చివరి యనుభవమును కోరుచు, కఱ్ఱతోను, రాయితోను సమానమగు శరీరముకలవాడై మిక్కిలి కఠినమగు తపశ్చర్యలను మించి కాలిబొటన వ్రేలిపై భూమిమీద నిలచి 40

భక్తుల బాధలను పోగొట్టుటలో నాసక్తికలవాడును, భక్తులయందు వాత్సల్యము కలిగినవాడును, నాశరహితుడును, సజ్జనుల మనస్సనెడు పద్మము నివాసముగా కలవాడును నగు తామరపద్మ పత్రములనుబోలిన నేత్రములుకల శ్రీమన్నారాయణుని ధ్యానించుచు 41

భగవదనుభవజనిత జ్ఞానముచే వైరాగ్యము మిక్కుటముగా కలిగినవాడై, (పరాశర పుత్రుడైన) వ్యాసుని కుమారుడగు శ్రీ శుకయోగీంద్రుడు మిక్కిలి భయంకరమును, తీక్ష్ణమునగు తపమునాచరించెను. చేతనాచేతనముల యం దంతర్యామిగనుండు పుండరీకాక్షదాతని తపముచే సంతసించి 42

## శుకయోగీంద్రుని వద్దకు తపస్సుచే సంతసించిన శ్రీనివాసు డరుదెంచుట

పదునాలుగు భువనములను సంహరించువాడు, రక్షించువాడు, సృజించువాడును, సజ్జనులను దయచూచువాడును, ప్రాణులందరియందు ప్రవేశించియుండువాడును, దుష్టుల శిక్షించువాడును, నిత్యమైనవాడును 43

శంఖము, చక్రము, గద, పద్మములచే ప్రకాశించు నాల్గు చేతులు కలవాడును, ముత్యముల గొడుగువలెనున్న యాదిశేషుని వేయి పడగలక్రింద నున్నవాడును, 44

అప్పటికప్పుడు వికసించినవియు క్రొత్తవియు, బంగరుమయమైన కాంతులు కలిగిన కింజల్కములు కలిగినవియు, మంచి పరిమళముగల పుష్పములతోను, దివ్యమగు అంగరాగములగు మంచిగంధముతోను 45

ఆలఙ్కృతాఙ్గమహిమా । స్మయమానముఖామ్బుజః ।
మకరన్దస్రవత్పద్మ । ప్రభావగుణవీక్షణః ॥ 46

ఆపాదచూడమాధుర్య । మహిమా మహతో మహాన్ ।
సేవావిశారదై స్సార్ధం । గణై స్తు కుముదాదిభిః ॥ 47

విచిత్రహేతిహస్తేన । విష్వక్సేనేన సేవితః ।
పఞ్చాయుధై ర్మూర్తిమద్భిః । పరీక్షితసమేక్షణః ॥ 48

మహర్షిభిః మరీచ్యత్రి । భృగుపూర్వైః మహాత్మభిః ।
ఇన్ద్రాదిభిః లోకపాలైః । సేవానుగుణభూతిభిః ॥ 49

త్రయస్త్రింశత్కోటిభి శ్చ । దేవబృన్దైరభిష్టుతః ।
పక్షాత్మనః సుపర్ణస్య । పక్షోపవిషదాత్మనః ॥ 50

పఞ్చవక్త్రప్రతికృతేః । పఞ్చాధర్వాఙ్గసమ్పదః ।
ఋగ్యజుస్సామవపుషో । నాగాభరణభూషిణః ॥ 51

అప్రమేయప్రభావస్య । స్కన్ధపీఠ మధిష్ఠితః ।
అహం ప్రథమపూర్వాభిః । ద్వాత్రింశత్కోటిశక్తిభిః ॥ 52

వైష్ణవీభి స్సేవ్యమానో । దేవః పద్మసరస్తటే ।
శ్రీభూమినీలాసహితః । ప్రాదురాసీ త్పరఃపుమాన్ ॥ 53

### భగవన్తం విలోక్య శుకమునికృతనతినాదికమ్.

[illegible] ముక్తః పరమపావనః ।
[illegible] మధిష్ఠితమ్ ॥
పురుహూతానుజం పూతం । పురుషం తం పురాతనమ్ ॥ 54

అలంకరింపబడిన శరీరసౌందర్యము కలిగినట్టియు, చిరునవ్వు చిందులిడుచున్న పద్మమువంటి ముఖము కలిగినవాడును, తేనెలొలుకుచున్న పద్మమునుబోలిన నేత్రములు కలవాడును 46

పాదముల నుండి శిరమువరకు మధురమగు మహిమచే గొప్పవాడై పూజనీయుడై యున్నవాడును, తనకు కైంకర్యము నొనరించుటలో నేర్పరులగు కుముదుడు మొదలగు గణనాయకులతో కూడినవాడును 47

మిక్కిలి చిత్రముగానుండు ఆయుధమును చేతధరించిన విష్వక్సేనుచే సేవింపబడుచు, శరీరధారులగు శంఖచక్రాది పంచాయుధములచే శ్రద్ధాభక్తులతో సేవింపబడుచు 48

మరీచి అత్రి భృగువు మొదలగు మహాత్ములగు లోకపాలురతోను, తనను సేవించుటకు తగిన యైశ్వర్యముకల 49

ముప్పది కోట్ల దేవతా సమూహములచే స్తుతింపబడుచు, పంచాత్ముడును పంచోపనిషత్స్వరూపుడును 50

ఈశానము, తత్పురుషము, వామదేవము, సద్యోజాతము, అఘోరము అను నైదు ముఖములుగల శివునకు మాఱు రూపగువాడును, పంచాధర్వాంగ సంపదకలిగినట్టియు, ఋగ్వేద యజుర్వేద సామవేద శరీరుడును, సాముల నాభరణముగా ధరించినవాడును, 51

ఏ ప్రమాణములచేతను నూహింపశక్యముగాని ప్రభావముకలవాడును నగు గరుత్మంతుని బాహువుల మూలమున కూర్చునియుండువాడును, నేను ముందర, నేను ముందరయని విచ్చేయు ముప్పదిరెండు కోట్ల విష్ణుసంబంధ శక్తులచే 52

సేవింపబడును పరాత్పరుడగు శ్రీమన్నారాయణుడు పద్మసరోవరతీరమున శ్రీ భూనీలాది దేవేరులతో ప్రత్యక్షమాయెను. 53

## శ్రీమన్నారాయణుని గాంచి శుకముని యొనరించిన నటనము మొదలగునవి

తపసుచే కృశించిన శరీరము కలవాడును, ముక్తతుల్యుడును, మిక్కిలి పవిత్రుడును, వ్యాసమహర్షి పుత్రుడును, పరమ మౌనీంద్రుడును, తపస్సుచే నశించిన పాపములుకలవాడునగు శుకయోగీంద్రుడు గొప్పదగు ఆసనమున నాసీనుడును. దేవేంద్రుని తమ్ముడగు ఉపేంద్రుడును (వామనమూర్తియు), పరమపవిత్రుడును, ఆదిపురుషుడును 54

కటాక్షవీక్షావిధ్వస్త । శ్రితక్లేశభరం పరమ్ ।
ప్రసన్నవదనం దృష్ట్వా । విష్టరశ్రవసం విభుమ్ ॥ 55

వైయాసి ర్మునిశార్దూలః । తపోవిగతకల్మషః ।
ససంభ్రమం సముత్థాయ । నివిష్టః కుశవిష్టరాత్ ॥ 56

రోమాఞ్చకఞ్చుకతనుః । హర్షోత్ఫుల్లవిలోచనః ।
స హసన్ ఉత్తరాసఙ్గం । ఛిన్దన్ కృష్ణమృగత్వచమ్ ॥ 57

విక్షిపన్ అక్షమాలాఞ్చ । తూర్ణం భిన్దన్ కమణ్డలుమ్ ।
ఆనన్దాశ్రుపరీతాక్షో । గద్గదగ్గళకన్ధరః ॥ 58

తత శ్చ నర్తనం కర్తుం । వికర్తన విభాస్వరః ।
నివృత్తిధర్మనిష్ణాతో । మునిః ప్రవవృతేముదా ॥ 59

మతఙ్గజక్రమభ్రమో భ్రమన్మతఙ్గజభ్రమః ।
సుధాభిలాషదేవభూః అమన్దమన్దవిక్రమః ।
వివాతదీపనిశ్చలః చలత్కరరవస్ఫుటత్ ।
దిగన్తరాశమణ్డలో ననర్త నన్దయన్ విభుమ్ ॥ 60

పరిభ్రమన్ అదక్షిణం ప్రదక్షిణం పరిభ్రమన్ ।
విభావయన్ విలోకయన్ అభావయన్ ఆలోకయన్ ।
శనైః శనై రసఞ్చరన్ సుసఞ్చరన్ శనైః శనైః ।
ముదావిలావలోకనో మదావిలావలోకనః ॥ 61

తతస్తుతోటకంవృత్తం । కరతాడనపూర్వకమ్ ।
రచయన్దణ్డమాదాయ । కరాభ్యామవలమ్బయన్ ॥ 62

ఆస్ఫోటయన్క్ష్వేలయంశ్చ । న్యపతచ్ఛ్రీమస్తకః ।
ననర్త పరమానన్దో । వాచయన్వామశార్ఙ్గిణః । 63

తన క్రీగంటి ప్రసారముచే తనను శరణుజొచ్చినవారి కష్టములను నశింప జేయువాడును, పరాత్పరుడును, అనుగ్రహపూర్ణమైన ముఖముకలవాడును, దర్భముడి ఆకారముగల వెంట్రుకల ముడి చెవియందుండుటచే విష్టరశ్రవుడనబడు సర్వవ్యాపియగు శ్రీమన్నారాయణుని తపస్సుచే పాపరహితుడగు వ్యాసుని పుత్రుడగు శ్రీ శుకుడను నా మునివర్యుడు గాంచి తొందరపాటుతో దర్భాసనమునుండి లేచి నిలచి 55, 56

గగుర్పాటుచే గప్పబడిన శరీరముకలవాడై సంతోషముచే మిక్కిలి వికసించిన నేత్రములుకలవాడై నవ్వుచు పైబట్టగా ధరించిన లేడిచర్మము నెగురవేయుచు 57

జపమాలను పైకెగురవేయుచు. కమండలమును శీఘ్రముగా పగులగొట్టుచు ఆనందబాష్పములతో నిండిన నేత్రములుకలవాడై, ఆనందముచే తొట్రుపడుచున్న గొంతుకలవాడై 58

సూర్యునితో సమానమగు కాంతికలిగి మోక్షధర్మమునందారితేరినవాడై సంతసమున నాట్యమొనరింపసాగెను. 59

ఏనుగు నడకవలె నడచువాడును, తిరుగుచున్న గజమోయను భ్రమను కలిగించువాడును, అమృతమును గోరు దేవతల కాలవాలమగువాడును, ఒకప్పుడతివేగముగను, మరియొకప్పు డతిమందముగను సంచరించువాడును, గాలిలేనిచోట నున్న దీపమువలె చలించనివాడును, కదల్చుచున్న చేతులచప్పుడుచే తుత్తునియలగుచున్న దిక్కులను విదిక్కులను కలవాడును 60

పిచ్చివానివలె తిరుగుచున్నవాడై భగవంతునకు ప్రదక్షిణముగా తిరుగుచు, భగవంతునే ధ్యానించుచు, భగవంతునే దర్శించుచు, ఇతరములను చింతించక చూడక, ఒకప్పుడు వేగముగా నడచుచును, వేరొకప్పుడు మెల్లమెల్లగా మందముగా నడుచుచును. సంతోషముతో కలుషితమైన చూపుకలవాడును, గర్వముచే కలుషితమైన (ఎర్రనైన) కన్నులుకలవాడును 61

తప్పెటలతో తోటకవృత్తమును గానమొనరించుచు, దండమును రెండు చేతులతో పట్టుకొని 62

భుజములను కొట్టుచు, పెడబొబ్బలిడుచు, తన శిరమును తన కాళ్ళకు తగులునట్లుగా వంగుచు, మిక్కిలి సంతసించుచు శ్రీమన్నారాయణుని నామములనే యుచ్చరించుచు 63

చరణం చటులం కలయన్ కలయన్ । కమలా రసికం సరసం రమయన్ ।
నటనం ఘటయన్ సుపదం సువదన్ । హరినామమునిః శుభదాయిశుకః ॥ 64

అరుణారుణపఙ్కజపోదరదృక్ । కరుణారిణామికటాక్షచణమ్ ।
రథనేమిలసత్కరనీరరుహం । రమయ న్నతసీకుసుమాగ్రరుచిమ్ ॥ 65

సరసం విచరన్ పురతః పరితో । విలస న్నసకృత్ మురవైరివిభోః ।
కరపఙ్కజతాడనతాలలసత్ । గమనం విగమా న్తవిలాసభువః ॥ 66

భుజబద్ధజటః కరయుగ్మభృతా । ఞ్జలికో మృగయూథపదృప్తవపుః ।
మృగయ న్నివ యూథపతిం పరితః । పున రప్య సకృత్ వికృతః సుకృతః ॥ 67

అతికుణ్డలితాఙ్గభుజఙ్గసమో । నటనస్ఫుటకుట్టితకుట్టిమభూః ।
రజనీముఖతాణ్డవకుణ్డలిత । త్రిపురా న్తకరీతిపురశ్చరణః ॥ 68

ఇతి దృఢకృతభక్తిః వాసుదేవే పరస్మిన్ ।
అకలసకలమిశ్రశ్రేయసి శ్రీనివాసే ।
విగతకలిలకాయో ఉపాయశూన్యాత్మభూతిః ।
విమలధిషణభూతః సంయమీ వ్యాససూనుః ॥ 69

హృదయకమలమధ్యాధ్యాసితం పఙ్కజాక్షం ।
పరిజనపరిబర్హా భూషణాస్త్రాది సేవ్యమ్ ।
బహి రివ పురత స్తం వీక్ష్య చక్షుఃపదస్థం ।
వియమితవిగమా న్తః పూర్ణకామో బభూవ ॥ 70

## శ్రీనివాసకృపయా శుకబ్రహ్మర్షే ర్ముక్తిః.

ఈదృశం తాదృశం మృషిం । భక్తివిహ్వలచేతసమ్ ।
భక్తార్తిభఞ్జనకరో । భగవాం స్తార్క్ష్యవాహనః ॥ 71

అడుగుల సందముగా నుంచుచు, రమావల్లభుని సరసముగా రంజింపచేయుచు నటనమును సల్పుచు, శ్రీమన్నారాయణుని చక్కని పదములుగల నామములను చక్కగా నుచ్చరించుచు 64

మిక్కిలి యెర్రనగు పద్మమువంటి నేత్రములుకలిగి, దయతో వీక్షించుచున్న క్రీగంటి ప్రసారములలో నేర్పుకలిగినట్టియు, చక్రముచే ప్రకాశించుచున్న పద్మమువంటి చేయి కలిగినట్టియు, దిరిశెనపుష్పమువంటి శరీరసౌందర్యము గల శ్రీమన్నారాయణుని సంతసపరచుచు 65

ముర యను రాక్షసుని సంహరించినట్టియు, వేదాంతములకు విహారస్థానమైనట్టి శ్రీమన్నారాయణుని యెదుటను, చుట్టును పద్మములవంటి చేతులను తట్టుటచే కలిగిన తాళముచే ప్రకాశించు గమనము కలుగునట్లుగా చక్కగా సంచరించుచు మాటిమాటికి 66

ఉత్సహించుచు బాహువులయందు వ్రేలాడుచున్న జడలుకలవాడై రెండు చేతులను జోడించినవాడై మృగరాజువంటి అప్రధృష్యమైన శరీరమునుకలవాడై అపుణ్యశీలుడు మృగనాథుని యన్వేషించుచున్నాడో యనునట్లంతటను మాటిమాటికిని వికారమునుచెందుచు

మిక్కిలి చుట్టలుగా చుట్టుకొనబడిన నాగుపాముపలె నర్తనమొనరించుచు, నటనకే గట్టిగా త్రొక్కబడిన రాతికట్టడపు భూప్రదేశము కలవాడగుచు, రుద్రుడు సంధ్యాసమయమున నొనరించు నాట్యము నప్రధానమొనరించు తాండవ పద్ధతికలవాడై నిర్మలమైన శరీరము కలవాడును 68

నిరపాయమగు నాత్మైశ్వర్యము గలిగినట్టియు, నిర్మల జ్ఞానస్వరూపుడును, జితేంద్రియుడును నగు నా శ్రీ శుకమహర్షి ఒక్కటియు తక్కువకాని సమస్త శ్రేయోస్వరూపుడగు పరవాసుదేవుడగు శ్రీనివాసునియందీ విధమగు భక్తికలవాడై 69

తన మనస్సనెడు కమలము మధ్యమున నివసించియున్నట్టియు, పద్మములవంటి నేత్రములు కలిగినట్టియు, సేవకబృందముతోను, రాజులకు తగిన భూషణములతోను, అస్త్రములతోను సేవించబడుచున్నట్టియు, తనకెదురుగా నయనములకు గోచరించుచున్న శ్రీమన్నారాయణుని గాంచి స్వాధీనమైన వేదాంతార్థములుగల శ్రీ శుకమహర్షి కోర్కెలు పరిపూర్ణముగా పొందినవాడాయెను. 70

## శ్రీనివాసానుగ్రహమున శుకయోగీంద్రునకు మోక్షము సిద్ధించుట

ఇప్పుడిట్లు నృత్యము నొనరించుచు మున్న భగవద్ధ్యానైకనిష్ఠుడై, భక్తిచే మోహమునందుచున్న మనస్సుకల శుకయోగీంద్రుని భక్తుల కష్టములను పారద్రోలువాడును, గరుత్మంతు నధిష్ఠించినవాడు నగు శ్రీమన్నారాయణుడు 71

దయామితామ్భోభితుఙ్గ । లోలకల్లోలకేశినా ।
సమీక్ష్యకమలాభోగ । భాగధేయేనచక్షుషా ॥ 72

శబ్దబ్రహ్మమహాగర్భం । సంస్కారత్రయసముద్యతః ।
స్నేహగర్భేణవచసా । బభాషేప్లావయన్హరిః ॥ 73

శ్రీభగవాన్ —

మునే! తాపసశార్దూల । తప స్తప్తం సుదుశ్చరమ్ ।
ఆనన్దకన్దసద్గర్భ । నిశ్శ్రేయసకరం పరమ్ ॥ 74

ముక్తి ర్దత్తా ముదాకారా । సశరీరా ఽపి నశ్వరీ ।
కల్పక్షయే చ సాయుజ్య । మస్మన్మన్త్రాఙ్గసమ్భవమ్ ॥ 75

ఇత్యుక్త్వా భగవా న్విష్ణుః । కృష్ణద్వైపాయనాత్మజమ్ ।
భక్తప్రతారితో భక్తైః । తత్రైవా న్తర్దధే స్వతః ॥ 76

ముక్త శ్శుకో ముని రపి । ముకున్దగతచేతనః ।
అప్రాకృతాఙ్గఃప్రథయన్ । ప్రకృత్యా ప్రకృతిప్రభామ్ ॥ 77

ప్రణమ్య దణ్డవ ద్భూమౌ । సాష్టాఙ్గం తత్ర సత్వరః ।
అవాప్తాభీష్టకామ స్సన్ । తత్రా ఽస్తే సుఖ మాశ్రమే ॥ 78

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే శ్రీనివాస ముద్దిశ్య రమ్భాద్యప్సరసఙ్ఘభీతశుక స్తుత్యాదివర్ణనం నామ షడ్వింశో ఽధ్యాయః.

దయ యనెడు సముద్రమున నెత్తుగా తరంగించుచున్న తరంగములనుబోలిన శ్రీదేవి కానందకరమగు సద్భాష్షనహితమగు కటాక్షముతో వీక్షించి 72

ప్రేమ నిర్భరమైన శ్రీసూక్తితో శ్రీశుకు నానందపరచుచు శ్రీహరి యిట్లు పల్కెను. 73

శ్రీమన్నారాయణుడు —

మునీంద్రా ! శ్రీ శుకా ! మహదానందరూపమగు మోక్షమునొసగు గొప్పదగు దుష్కరమైన తపము నాచరించితివి. 74

సంతోషరూపమును, అప్రాకృత పంచోపనిషన్మయమగు శరీరముతోగూడిన పునరావృత్తిరహితమగు మోక్షము నీ కొసంగబడినది. ప్రళయకాలమున నా మంత్ర శరీరము వలన కలుగునట్టి సాయుజ్యమును మదయగలవు. 75

అని యిట్లు శ్రీమన్నారాయణుడు శ్రీ శుకయోగీంద్రునితో పలికి భక్తుల భక్తికి పశంవదుడగుచు నచ్చటనే యంతర్ధానము నందెను. 76

శుకయోగీంద్రుడును భగవదనుగ్రహముచే ప్రాప్తమైన ముక్తికలవాడై నారాయణునే ధ్యానించుచు అప్రాకృతమైన శరీరముకలవాడై యుండియు స్వాభావికమైన ప్రాకృతిక శోభను జూపుచు 77

వెంటనే తొందరతో నచ్చట భూమియందు సాష్టాంగవందనము నాచరించి, సకల కోరికలను బడసి యాశ్రమమున సుఖముగా నుండెను. 78

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాదమున శ్రీనివాసునితో రంభ మొదలగు అప్సరస సముదాయమువలన భయపడిన శుకయోగీంద్రు డొనరించిన స్తోత్రము మొదలగునవి వర్ణించుట యనెడు యిరువదియారవ అధ్యాయము.

—

# సప్తవింశో ఽధ్యాయః

## శుకమునికృత శుకపురాష్టోత్తరశత విప్రగృహ నిర్మాణాని.

దేవదర్శనః —

తత్ర శ్రీపద్మతీర్థస్య । తీరేఽస్మిన్ నివసన్ శుకః ।
ధ్యానయోగపరో ఽధ్యాత్మ । బ్రహ్మవిద్యావిశుద్ధధీః ॥ 1

ఏకాన్తభావ మాతిష్ఠన్ । ఏకాయనవిదాం వరః ।
సాఙ్ఖ్యయోగపరో నిత్యం । సద్ధ్యానాధ్యయనాన్వితః ॥ 2

ద్వాదశాక్షరశిక్షకః । ప్రత్యక్షరనిరీక్షకః ।
పరాశరాత్మజసుతః । సుతరాం పరమో మునిః ॥ 3

ఉవాస సుచిరం కాలం । శ్రీనివాసపరాయణః ।
స్వామిపుష్కరిణీతీర్థ । ముపగన్తుమనా స్తతః ॥ 4

చక్రే స్వనామ్నా ఽగ్రహార । మష్టోత్తరశతం ద్విజాన్ ।
నిత్యత్రయీకాన్ త్రయ్యన్త । ముఖాన్ మఖముఖక్రియాన్ ॥ 5

సువృత్తాన్ శుభ్రమనసో । వివృత్తావైదికక్రియాన్ ।
నానాగోత్రా నబ్జదళైః । నిర్మమే నను సాదరాన్ ॥ 6

## శుకపురే బలభద్రసహకృతకృష్ణప్రతిష్ఠా,

బలభద్రేణ బలినా । మాయయా సహ మాయినమ్ ।
దేవక్యా వసుదేవస్య । యశోదానన్దగోపయోః ॥ 7

# ఇరువదియేడవ అధ్యాయము

## శుకయోగీంద్రుడు శుకపురమునందు నూటయెనిమిది బ్రాహ్మణ గృహములను నిర్మించుట

దేవదర్శనుడు —

శ్రీ శుకయోగీంద్రుడు పద్మసరోవరముయొక్క గట్టున నివసించుచు, ధ్యాన యోగమున నిష్ఠకలిగి బ్రహ్మకు సంబంధించిన యధ్యాత్మవిద్యచే పరిశుద్ధమగు మనస్సు కలవాడై 1

ఏకాగ్రచిత్తులలో శ్రేష్ఠుడై, అనన్యపరులలో నగ్రేసరుడై, జ్ఞానయోగమున నిష్ఠకలవాడై చక్కని భగవద్ధ్యానము వేదాధ్యయనము నొనరించుచు 2

వాసుదేవద్వాదశాక్షరీ మహామంత్రనిష్ఠాతయు, అందలి ప్రతి యక్షరమును విమర్శగా పరిశీలించువాడును నగు పరాశరమహర్షి మనుమడగు శుకుడు మునులలో శిరోమణియై 3

శ్రీమన్నారాయణ చరణారవింద సంసక్తమానసుడై చాలకాలమచట నివసించి స్వామిపుష్కరిణీ తీర్థమునకేగుటకు సంకల్పించి 4

ఆ పద్మతీర్థ తీరమున తన పేరుతో నొక అగ్రహారమును నిర్మించెను. అందు ప్రతిదినము వేదపారాయణము నొనరించువారును, ఉపనిషత్తు ననుసంధించువారును, యజ్ఞయాగాది వైదికకర్మనిరతులును నగు నూటయెనిమిది బ్రాహ్మణ కుటుంబములను నెలకొల్పెను. 5

వారు మంచి నడవడికలవారును, నిర్మలమగు మనస్సుకలవారును. వేదముచే విధింపబడని కర్మలనెన్నడును చేయనివారును, అనేక గోత్రములయందు పుట్టినవారు గను మండిరి. 6

## శ్రీ శుకులు నిర్మించిన పట్టణమున బలరామునితో కృష్ణుని ప్రతిష్ఠించుట

పరాశర పుత్రుడైన వ్యాసుని కుమారుడైన శ్రీ శుకుడు బలాఢ్యుడగు బల రామునితో ఆశ్చర్య శక్తితో కూడిన మాయను తన యధీనమున నుంచుకొనుటచే మాయ యనబడునట్టియు, దేవకీ వసుదేవ నంద యశోదలకు

ఆనన్దవర్ధకం కృష్ణం । భద్రం భువనహర్షకమ్ ।
భూభారం హర్తుకామ ఇచ్చ । కామరూపిణ మవ్యయమ్ ॥ 8

కుహనాగోపవపుషం । మేఘశ్యామం పురాతనమ్ ।
పారాశరిః పరమర్షిః । ప్రతిష్ఠాప్యే హ భూతలే ॥ 9

వ్యజిజ్ఞపత్ సన్నిధానం । అత్ర బ్రహ్మమునిః శుకః ।
వైకుణ్ఠే తు యథా వాసః । క్షీరామ్భోధౌ యథా విభో ॥ 10

వాసో యథా ఒన్తరాదిత్యే । యోగినాం హృదయే యథా ।
తథా సదా కురుష్వాత్ర । సన్నిధిం కమలేక్షణ ! ॥ 11

ఇతి విజ్ఞాప్య దేవేశం । దణ్డవత్ప్రణిపత్య చ ।
స్నిహ్యతా మనసా ధ్యాయన్ । వీక్షమాణః స్వచక్షుషా ॥ 12

## శుకస్య స్వపురా చ్ఛేషాచలగమనమ్

ఆజగామ ప్రసన్నాత్మా । స్వామిపుష్కరిణీం ప్రతి ।
ఉపాన్తే చో క్షశైలస్యో । పేత్య నిర్మలనిర్ఝరమ్ ॥ 13

తత్ర త్రిషవణస్నానం । కృత్వా వ్యాసౌరసో మునిః ।
ఉపత్యకాయా మాసీనం । ఉదయాదిత్యవర్చసమ్ । 14

ఉపాంసుమానసజపం । ఉదారం దారసంయుతమ్ ।
మహోత్పలవిభం ప్రత్యక్షం ।మహో పనిషదఙ్గకమ్ ॥ 15

అగ్నిజ్వాలాజటాజాల । లసద్గణ్డేమ్బభోగినమ్ ।
వ్యాఘ్రభూజినో త్తరాపజ । వాసవం కృత్తివాససమ్ ॥ 16

ఆనందము నభివృద్ధి నొనరించువాడును, మంగళరూపుడును, లోకములను సంతసపరచువాడును, భూభారమును తీర్చువాడును, కోరిన రూపమును ధరించువాడును, నాశరహితుడును 8

కపటముగా ధరించిన గొల్ల శరీరము కలవాడును, మేఘమువలె మిక్కిలి నల్లనగు శరీరముకలవాడును, పురాణపురుషుడునునగు శ్రీకృష్ణుని, పరాశరమనుమడగు శ్రీ శుకమహర్షి భూలోకమున ప్రతిష్ఠింపజేసి 9

బ్రహ్మర్షియగు శ్రీ శుకయోగి యాతని సన్నిధానమున నిట్లు విన్నపము నొనరించెను. స్వామీ ! పుండరీకాక్షా ! తాము వైకుంఠమున నెట్లు నివసింతురో, పాలకడలిలో నెట్లు పవ్వళింతురో 10

సూర్యమండలమున నెట్లధివసింతురో మునీంద్రుల మానసములలో నెట్లావాసము నొనరింతురో యట్లే యీ పురమునను వేంచేసియుండుడ' ని 11

దేవతలకును ప్రభువగు శ్రీమన్నారాయణునికి విజ్ఞాపన మొనరించి, సాష్టాంగ వందనమాచరించి స్నేహార్ద్రమగు మనస్సుతో ధ్యానించుచు తన నేత్రములతో స్వామిని దర్శించుచు 12

## శ్రీ శుకయోగీంద్రుడు తన పురమునుండి శేషాచలమున కేగుట

నిర్మలాంతఃకరణుడై స్వామిపుష్కరిణి కేతెంచెను. వృషభాద్రి సమీపమునమందు నిర్మలమగు సెలయేరుల సమీపించి 13

శ్రీ శుకమహర్షి అందు మూడు వేళలయందును మూడు స్నానముల నాచరించి కొండచరియయందు కూర్చుండియున్నట్టియు, బాలభానునివంటి తేజోమూర్తియు 14

రహస్యముగా మనస్సులో జపము నొనర్చుకొనుచున్నట్టియు, గొప్పవాడును, భార్య యగు పార్వతితో కూడియున్నవాడును, మంచి నీలకలువవంటి రంగుకలవాడును, మూడు నేత్రములు కలవాడును, గొప్ప ఉపవిషత్తులే శరీరముగా కలవాడును 15

అగ్నివలె యెఱ్ఱగా ప్రకాశించుచున్న జడలతో విరాజిల్లెడు గంగ, చంద్రకళ, సర్పములు కలవాడును, పులిచర్మమును పైబట్టగా ధరించియున్నట్టియు 16

కాలకూటస్ఫురత్కణ్ఠ । నాశం సణీసవక్త్రకమ్ ।
సమీక్ష్య హృష్టమనసా । నమస్కృత్య చ తం హరమ్ ॥ 17

ఉషిత్వా త్రిదినం తత్రో । పాసకః పూర్ణమానసః ।
ద్రష్టుకామో ఽఖిలాశ్చర్యమ్ । పున రప్య ఞనాచలే ॥ 18

సిద్ధై ర్విద్యాధరై స్సార్థం । యోగిభిః కన్దరస్థితైః ।
శనై శ్శనైః సఞ్చరం శ్చ । నిర్ఝ రేషు కృతాఽప్లవః ॥ 19

ధ్యాయన్ బ్రహ్మసభావృత్తం । వృత్తాన్తం తస్య వై గిరేః ।
స్వామిపుష్కరిణీతీర । మాససాద సుఖాస్పదమ్ ॥ 20

## స్వామిపుష్కరిణీతీర వర్ణనమ్.

సుగన్ధపుష్పవల్లీభిః । వేల్లితై ర్వకుళై ర్యుతమ్ ।
ఖర్జూరైః నారికేళై శ్చ । కేతకైః స్వర్ణకేతకైః ॥ 21

వటీరపాటలాశోక । కింశుకాసనచమ్పకైః ।
నక్తమాలై శ్చ పనసైః । మధూకైః సరళైః ధవైః ॥ 22

పున్నాగసురపున్నాగ । శిశుపున్నాగపూగకైః ।
కదళీకృష్ణకదళీ । మహాకదళికాగణైః ॥ 23

హరిద్రాభిః శృఙ్గబేరైః । కస్తూరీరజనీకులైః ।
మల్లికామాలతీభి శ్చ । మాధవీభిః మధూత్కటైః ॥ 24

యూథిభిః శతపత్రీభిః । జాతిభిః వనజాతిభిః ।
నన్ద్యావర్తాదిసుమనః । కక్షైః కుక్షిపదఙ్గతైః ॥ 25

భయంకర విషముచే ప్రకాశించుచున్న కంఠనాళములు కలిగినట్టియు, పద్మము వంటి ముఖము కలిగినట్టియు, ఈశ్వరునిగాంచి సంతోషించిన మనస్సుకలవాడై యాతనికి నమస్కరించి 17

మూడు దినము లచ్చటనుండి ధ్యానమొనరించుకొనుచు పరిపూర్ణమగు మనస్సు కలవాడై యచ్చటి వింతల నన్నిటిని చూడగోరువాడై మరల యంజనాద్రియందు 18

సిద్ధ, విద్యాధరులతోను, గుహయందు నివసించుచున్న మునీంద్రులతోను సంచరించుచు సెలయేరులలో స్నానము నాచరించుచు 19

బ్రహ్మ సభయందు జరిగిన యంజనాద్రి వృత్తాంతమును తలంచుకొనుచు శుభములకు నిలయమగు స్వామిపుష్కరిణీ తీరమును చేరెను. 20

## స్వామిపుష్కరిణీ తీరమును వర్ణించుట

చక్కగా పరిమళించుచున్న పువ్వుల తీగలతో చుట్టుకొనబడిన, పగడ చెట్లతో కూడినట్టియు, ఖర్జూరములతోను, కొబ్బరి వృక్షములతోను మొగలి పొదలతోను, స్వర్ణ మొగలి పొదలతోను 21

చందన వృక్షములు, పున్నాగ వృక్షములు, అశోకములు, మోదుగలు, వేగిన చెట్లు, సంపంగి, తాపింఛ వృక్షములు, పనసలు, ఇప్పచెట్లు, దేవదారు, నారింజ వృక్షములు

కొండమల్లె, కొండమల్లెలో మరియొక జాతికిచెందిన వృక్షములును, శిశుపున్నాగ చెట్లు, పోకవృక్షములును, అరటి. వల్లి అరటి, చక్కెరకేళి అరటిచెట్ల సమూహములతోను

పసుపువనము, అల్లపు మళ్ళు, కస్తూరి అశ్మయోని వృక్షములు, మల్లెలు, మాలతీ, తేనెలను స్రవింపజేయు మాధవీ లతలతోను 24

అడవి మొల్లలతోను, పద్మములతోను, అనేక శ్రేష్ఠ అడవిజాతి పుష్పవృక్షములతోను, పుష్పవిశేషములతోను, మధ్య భాగమునందున్న జాజి పొదలతోను 25

సమన్తతః సమాకీర్ణం । సాన్ద్రచ్ఛాయాసమఞ్జసైః ।
సౌగన్ధికై ర్సుగన్ధాఢ్యై । తులసీభిః సుమోదితమ్ ॥ 26

పయసీభిః పుష్పగన్ధ । గర్భపుష్పలతాశతైః ।
అతిమృష్టామోదపుష్పా । మోదితాశావకాశకమ్ ॥ 27

తాపసైః తరుణాదిత్య । వర్చోభిః అభితో వృతమ్ ।
వరాహసింహశార్దూల । మాతఙ్గకులసఙ్కులమ్ ॥ 28

సితాసితైః సారమేయ । గణైః దుర్వారగర్వకైః ।
సేవితో నా తిభీమేన । క్షేత్రపాలేన పాలితమ్ ॥ 29

విచర న్నత్ర విపినే । మునిః విగతతృట్ శుచిః ।
పరమాం ముద మాపన్నో । ముకున్దానన్దకన్దధీః ॥ 30

## స్వామిపుష్కరిణీ వర్ణనమ్.

స్వామిపుష్కరిణీం పుణ్యాం । దదర్శ విమలోదకామ్ ।
కాఞ్చనామ్బుజకల్హార । కమలైః శ్వేతపఙ్కజైః ॥ 31

నీలోత్పలైః ఉత్పలైశ్చ । ఫుల్లైః కువలయై రపి ।
కైరవై రపి కీర్ణాన్తాం । ఉద్గిరత్పుణ్యగన్ధకైః ॥ 32

తరఙ్గాన్తరసఞ్చారైః । మత్స్యైః కారణ్డవై రపి ।
శారాళిశ్చ తరన్తీభిః । అన్యైః జలపతత్రిభిః ॥ 33

కలహంసకలాలాపైః । వాచాలితదిగన్తరామ్ ।
తస్యా స్తీరసముల్లాసి । సమగ్రాభీష్టసన్తతేః ॥ 34

పట్టపగు సీతలపానంగును సుందరముగానుండి చక్కని పరిమళము కలిగి యున్న మామంచి చెట్లతోను, తమ పరిమళమును నలుదిక్కుల ప్రసరింపజేయు గొప్ప పరిమళముగల తులసి వృక్షములతో పరిమళించుచున్నట్టియు 26

పుష్పపరిమళముచే నిండిన మధ్య భాగములుగల అనేక పువ్వుల తీగలచే నిండినదియు, మిక్కిలి మధురముగా పరిమళించు పుష్పములచే పరిమళించుచున్న దిగంతములు కలదియు 27

బాల సూర్యునివలె ప్రజ్వరిల్లు కాంతులుకల యోగీంద్రులచే వంతట నావరింపబడినదియు, అడవిపందులు, సింహములు, పెద్దపులులు, యేనుగుల గుంపులతో కూడినదియు 28

తెల్లని నల్లని రంగుకలిగి అడ్డుపెట్ట శక్యముగాని గర్వముగల కుక్కల గుంపులచే సేవింపబడుచు, అంత భయంకరుడుకాని తోటమాలిచే సంరక్షింపబడుచున్నట్టి 29

యడవియందు శ్రీ శుకయోగీంద్రు డాకలిదప్పులు లేక గొప్ప ఆనందము ననుభవించుచు, సంచరించుచు శ్రీమన్నారాయణ ధ్యానరసానందమునకు మూలమగు బుద్ధికలవాడై 30

## స్వామిపుష్కరిణీ వర్ణనము

నిర్మలమగు నీరుకలిగి పవిత్రమైనదియు, బంగారు పద్మములచేతను, ఎర్ర తామరలచేతను, తెల్ల కలువలచేతను 31

నల్లకలువలచేతను, కలువలచేతను, వికసించిన నల్ల కలువలచేతను, తెల్ల కలువలచేతను వ్యాపింపబడిన భాగము కలదియు, వానియొక్క మంచి పరిమళమును వెదజల్లుచున్నదియు 32

ఆ నదియందలి కెరటములలో సంచరించుచు మదించిన హంసలు కలదియు, నీటియందు తరంగించుచున్నటు లున్న నక్షత్రములు కలదియు, ఇతర జలపక్షులు కలదియు 33

కలహంసల యవ్యక్త మధురకూజితములచే మారుమ్రోగుచున్న దిక్కుల యంతర్భాగములు కలదియు, తీరమున ప్రకాశించుచున్న పరిపూర్ణమగు కావలసిన సమస్త పదార్థములుగల 34

తీర్థం తోయ ముపస్పృశ్య । లక్ష్మ్యా సఞ్చిన్తయన్ విభుమ్ ।
ప్రసన్నమానసోల్లాసః । చక్రే తత్రా ఘమర్షణమ్ ॥ 35

బద్ధపద్మాసనాసీనో । ఽభితటం యోగ మేయివాన్ ।
పరమైకాన్తిభి స్సార్థం । బ్రహ్మవిత్ బ్రహ్మదర్శనః ॥ 36

తత్రైవ సుచిరం కాలం । ఉవాస పరమర్షిభిః ।
రహస్యనోన్యన్యసల్లాప । స్స్వాన్తాన్తేవాసిసన్తతైః ॥ 37

## శ్రీనివాసావిర్భావః.

కదాచి ద్భగవాన్ విష్ణుః । కారుణ్యాగణ్యపుణ్యభూః ।
దర్శయన్ సకలాం ల్లోకాన్ । సాక్షా దక్షిపథం గతః ॥ 38

దివ్యానన్దమయాకారైః । గరుత్మచ్ఛేషసైనికైః ।
పశ్చాదాయుధైః పరికరైః । గణైస్తుకుముదాదిభిః ॥ 39

పరిబర్హాభూషణాన్య । జిన వస్త్రాంశుకాని చ ।
ఆయుధా న్యప్రమేయాని । దధానైః బ్రహ్మశక్తిభిః ॥ 40

శక్తిభిః శాఙ్కరీభి శ్చ । సేవ్యమానో ముదాన్వితః ।
శ్రీభూమినీలాపూర్వాభిః । అపూర్వాకల్పభూతిభిః ॥ 41

మహిషీభిః ముదా నన్దం । ఆవహన్తీభి రీశితుః ।
ముమోద స హి సర్వాత్మా । క్రీడాడమ్బరడామ్బికః ॥ 42

లీలావిభూతివిహిత । వివిధానన్ద వేషభాక్ ।
కాలకాదమ్బినీకాన్తా । కుఞ్చితాలకబన్ధనః ॥ 43

ఉద్యద్ద్యుమణిబిమ్బశ్రీః । శిఖామణిమహామహః ।
అష్టమీన్దుకళాకార । లలాటస్థోర్ధ్వపుణ్డ్రికః ॥ 44

స్వామిపుష్కరిణీ తీర్థమును ఆచమించి లక్ష్మీదేవితో గూడిన శ్రీమన్నారాయణుని ధ్యానించుచు నిర్మలమైన మానసికానందముకలవాడై పాపములను నశింపజేయు స్నానము నాచరించెను. 35

అనంతరము తీరమునందు పద్మాసనములో కూర్చుండి, ధ్యానములో మగ్నుడాయెను. బ్రహ్మజ్ఞానియు పరబ్రహ్మము సాక్షత్కరించుకొను సామర్థ్యశాలియునగు శ్రీ శుకయోగీంద్రు డచ్చటనే మహామహేంద్రులతోడను, రహస్యముగా నొకరితో నొకరు భాషించుకొను తన శిష్యగణములతో కూడ చాలకాలమచ్చటనే యుండెను 36, 37

## శ్రీనివాసుని యవతారము

ఒకానొకప్పు డింతింతయనరాని దయచే పవిత్రమగు బుద్ధిశాలియునగు శ్రీనివాసుడు శ్రీ శుకయోగీంద్రున కన్నిలోకములను చూపించుచు ప్రత్యక్షమయ్యెను 38

ఆ శ్రీనివాసుడు దివ్యమగు నానందస్వరూపములతోను, గరుడ, ఆదిశేషాది సైనికులతోను, పరికరములగు శంఖచక్రాది పంచాయుధములతోను, పద్మము మొదలగు గణములతోను 39

రాజ చిహ్నలైన శ్వేతచ్ఛత్రము మొదలగు యోగ్యవస్తువులను, ఆభరణములు కృష్ణాజినము పీతాంబరములను, ఊహించుటకైనను నశక్యములగు నాయుధములను ధరించిన బ్రహ్మ శక్తులచేతను, శంకరునికి సంబంధించిన శక్తులతోను సేవింపబడుచు 40

రుద్రశక్తులచే సేవింపబడుచు సంతోషించుచున్నవాడై, నూతనాలంకార శోభాయుక్తులైన శ్రీదేవి, భూదేవి, నీళాదేవి మొదలగు 41

పట్టపురాణులు తన కానందమును కలుగజేయుచుండ విలాసార్థము క్రీడల నాచరించుచు కపటవేషముల ధరించువాడును, సమస్త చేతనాచేతనముల కంతరాత్మయగు వాడును (ఆ శ్రీయఃపతి సంతోషించెనని ముందు అన్వయము) 42

లీలావిభూతిలో ననేకములగు నానందకరములగు వేషముల దాల్చినవాడును, నీలమేఘ పంక్తులవంటి అందముగా కూర్పబడిన ముంగురులు కలవాడును 43

ఉదయించు సూర్యబింబమువంటి కాంతిగలవాడును, అష్టమి చంద్రకళవంటి ఫాలభాగమున నూర్ధ్వపుండ్రములను ధరించినవాడును 44

సౌవర్ణపద్మకల్హార । పుష్పకర్ణావతంసకః ।
వేణాన్తరరసాశాసి । శార్ఙ్గభ్రూమణ్డలద్వయ ॥ 45

అతిసూక్ష్మస్ఫురత్తారా । కర్ణపూర్ణారుణేక్షణః ।
కరుణాబ్ధిసముద్భూత । లోలపద్మవిలోచనః ॥ 46

తిలపుష్పసమాకార । నాసాకాణ్డపుటద్వయః ।
పక్వబిమ్బఫలాకార । రమణీయోష్ఠయుగ్మకః ॥ 47

ప్రభావిసారిశిఖరి । దశనావలివక్త్రకః ।
ఖాకారకర్ణపాశాత్త । ముక్తామాణిక్యకర్ణికః ॥ 48

శరన్నిర్మలపూర్ణేన్దు । మణ్డలాననమణ్డలః ।
కమ్బుతణ్ఠో వృషస్కన్ధో । భోగిభోగోల్లసద్భుజః ॥ 49

శార్ఙ్గజ్యాహతికార్కశ్య । రమణీయప్రకోష్ఠకః ।
విశాలవక్షోవిలస । చ్ఛ్రీవత్సః కౌస్తుభోజ్వలః ॥ 50

శఙ్ఖచక్రగదాపద్మ । పరిష్కృతచతుర్భుజః ।
విమ్ననాభిసముల్లాసి । మాణిక్యోదరబన్ధనః ॥ 51

మేఖలాలఙ్కృతకటీ । తటీచ్ఛురికయోద్భటః ।
హస్తిహస్తసదృక్షోరు । జానుమణ్డలమణ్డితః ॥ 52

క్రమవృత్తాయతాభోగ । జఙ్ఘాకాణ్డసుపార్ష్ణికః ।
కూర్మపృష్ఠప్రపదకః । కిఙ్కిణీహంసకాఙ్ఘ్రికః ॥ 53

శిఞ్జన్మాణిక్యమఞ్జీర । ప్రభాసితపదామ్బుజః ।
నానావేషారవోద్భాసి । చన్ద్రబిమ్బనఖావలిః ॥ 54

బంగరు మెట్ట తామరపుష్పముచే నలంకరింపబడిన చెవులు కలవాడును. కైంకర్యమునందభిరుచిని కలిగించుచు (వాజ్ఞాపించు) ధనువువంటి రెండు కనుబొమలు కలిగినవాడును 45

మిక్కిలి మెల్లగా కదలుచున్న కంటిపాపలచే కూడి చెవులవరకు వ్యాపించిన మెట్టని నేత్రములు కలవాడును, దయాసముద్రమునుండి పుట్టెనో యనునటులుండి చలించుచున్న పద్మమువంటి నేత్రములు కలవాడును 46

నూగుపూవువలె నుండు ముక్కురంధ్రములు కలవాడును, పండిన దొండపండువలె యెఱ్ఱనగు చక్కని యధరములు కలవాడును 47

కాంతివి వెదజల్లు కొనలుగల పలువరసకల నోరుకలవాడును, శ్రీకారమువలెనుండు చెవుల చివరలయందు వ్రేలాడు ముత్యముల మాణిక్యముల దుద్దులు కలవాడును 48

శరత్కాలమునందలి నిర్మలముగా ప్రకాశించు పూర్ణచంద్రుమండలమువంటి సుంద్రని ముఖము కలవాడును, శంఖమువంటి కంఠమును, ఎద్దు మూపువంటి భుజమూలములను, పాము పడగలవలె విశాలములగు భుజములను 49

శార్ఙ్గ మనెడు ధనుస్సుయొక్క వారి దెబ్బలచే మొద్దుబారిన అందమగు మణికట్టు కలిగినవాడును, విశాలమగు వక్షస్థలమున ప్రకాశించు శ్రీవత్సము, కౌస్తుభములచే ప్రకాశించువాడును 50

శంఖము చక్రము గద పద్మములచే నలంకరింపబడిన నాల్గు భుజములు కలవాడును, లోతైన బొడ్డుక్రింద ప్రకాశించు మాణిక్యములచే కూర్చిన మొలత్రాడు కలవాడును

మొలనూలుకు నలంకరింపబడిన నడుమునందు వ్రేలాడు కత్తికలవాడును, ఏనుగు తొండమువంటి తొడ మీగాళ్ళచే ప్రకాశించువాడును 52

క్రమమగు సుంద్రము దీర్ఘము విశాలమగు పిక్కలును వాటిక్రింది భాగములు కలవాడును తాబేలు వీపువంటి ఎత్తగు అగ్రపాదములు కలవాడును, మువ్వలు అందెలుగల పాదములు కలవాడును 53

ధ్వనించుచున్న మాణిక్యములుకల నూపురములచే ప్రకాశించు పాదపద్మములు కలవాడును, అనేక విధములగు కైంకర్యముల గావించవలెనను కోరికలను పుట్టించు చంద్రబింబమువలె ప్రకాశించు 54

సుధాసూతిస్మితోద్దామ । స్ఫురదఙ్గుష్ఠసౌష్ఠవః
పఙ్కజశ్రీపరిచితాన్యోన్య । తుల్యాఙ్ఘ్రిపఙ్కజః ॥ 55

అతసీకుసుమజ్యోతిః । ప్రఖ్యవిఖ్యాతవిగ్రహః ।
సంవీతవివిధాశ్చర్య । తప్తచామీకరామ్బరః ॥ 56

అంసా దాప్రపదాలమ్బి । వనమాలావిరాజితః ।
విచిత్రరత్నఖచిత । తపనీయకిరీటకః ॥ 57

హారకేయూర కటక । కఙ్కణాఙ్గదభూషితః ।
మణికుణ్డలతాటఙ్క । వీరపట్టాఙ్గుళీయకః ॥ 58

అంసలమ్బిసమాయుక్త । సౌవర్ణబ్రహ్మసూత్రకః ।
త్రిపఙ్చసప్తసరిభిః । ముక్తాదామభి రఞ్చితః ॥ 59

సర్వాభరణసంయుక్తః । సర్వగన్ధానులేపనః ।
సర్వర్తుకాలోత్థపుష్ప । దామోద్దామధుస్తరః ॥ 60

భక్తానుకమ్పాసహితః । శ్రీనివాసః పరః పుమాన్ ।
ఆవిర్బభూవ భగవాన్ । స్వామిపుష్కరిణీతటే ॥ 61

వ్యాసాత్మజో ముని ర్ముక్తః । తం దృష్ట్వా హృష్టమానసః ।
ప్రణమ్య దణ్డవద్భూమౌ । అవాఙ్మనసగోచరమ్ ॥
తుష్టావ చ హృషీకేశం । కేశవం క్లేశనాశనమ్ ॥ 62

## శుకబ్రహ్మర్షికృత శ్రీనివాసస్తుతిః.

జితం తే పుణ్డరీకాక్ష ! । వాసుదేవా మితద్యుతే !
రాగాదిదోషవిర్ముక్త । సమగ్రగుణమూర్తయే ॥ 63

నాథ ! జ్ఞానబలైశ్వర్య ! । నమ స్తే విశ్వభావన ! ।
వేఙ్కటేశ ! విశాలాక్ష ! । సర్వజ్ఞ । పరమేశ్వర ! । 64

గోళ్లుకలవాడును, అమృతమునకు పుట్టినిల్లై మిక్కిలి ప్రకాశించు బొటనవ్రేలితో నొప్పువాడును, పద్మముల శోభతో సమానమగు పాదపద్మములు కలవాడును 55

సిరిసెనపూవువలె మృదువగు కాంతికలిగి, మిక్కిలి ప్రసిద్ధికెక్కిన శరీరము కలవాడును, అనేకాశ్చర్యములతో కూడిన పుటముపెట్టిన బంగరువలె మెరయు పట్టు వస్త్రము కలవాడును 56

భుజములనుండి పాదములవరకు వ్రేలాడుచుండెడి వనమాలికచే ప్రకాశించు వాడును, అనేక విధములగు రత్నములచే చెక్కబడిన బంగారు కిరీటముకలవాడును 57

మూలలు భుజకీర్తులు, మురుగులు కంకణములు, భుజకీర్తులచే నలంకరింపబడిన వాడును, మణులచే చేయబడిన కుండనములు, బంగారపు మెఱుగు కమ్మలు, పేరుదవి తెలియజేయు పట్టము, ఉంగరములు కలవాడును 58

భుజమునందు వ్రేలాడుచున్న బంగారు యజ్ఞోపవీతము కలవాడును, మూడు, అయిదు, ఏడు పేటలుగల ముత్యాలహారములచే విరాజిల్లువాడును 59

అనేకాభరణములతో నలంకరింపబడినవాడును, అనేక విధములగు చందనపు మైపూతలు గలవాడును అన్ని ఋతువులయందు పుష్పించెడు పుష్పముల మాలికలచే ప్రకాశించు వక్షస్థలము కలవాడును 60

భక్తులను దయచూచుటయే స్వభావముగా కలవాడును, పరమపురుషుడును నగు శ్రీనివాసుడు స్వామిపుష్కరిణీ తీరమున శ్రీ శుకయోగీంద్రున కన్నిలోకములను చూపించుచు ప్రత్యక్షమాయెను. 61

ముక్తపురుషుని బోలిన శ్రీ శుకయోగీంద్రుడు శ్రీనివాసుని దర్శించి సంతోషించిన మనస్సుకలవాడై సామాన్యులకు వాక్కునకు, మనస్సునకును కూడ ప్రత్యక్షముకాని యాతనికి సాష్టాంగవందన మాచరించి యింద్రియములను నియమించువాడును, కష్టముల పారద్రోలువాడును నగు నాతని నిట్లు స్తుతించెను. 62

## శ్రీ శుకయోగీంద్రు డొనర్చిన శ్రీనివాసుని స్తోత్రము

పద్మనేత్రా। వామదేవా। మహాతేజోరూపా। విషయములయం దభిమానము మొదలగు దోషములులేక సకలగుణ పరిపూర్ణుడవగు నీకు జయము. 63

ప్రభో। జ్ఞానము, బలములచే సర్వాధికుడా। ప్రపంచములోని సర్వప్రాణులకు ధారకపోషక భోగ్యంబులనిచ్చి వృద్ధిగావించువాడా। సంకర్షణా। విశాలనేత్రములు కల వాడా। సకలము నెఱింగినవాడా। మహాప్రభూ। నమస్కారము. 64

నమ స్తే ఒస్తు హృషీకేశ : । సర్వేశ్వర : జగన్మయ ।
దేవ : ఐశ్వర్యవీర్యాత్మన్ : । ప్రద్యుమ్న : జగతాం : పతే : ॥ 65

స్థిత్యుత్పత్తిలయత్రాణ । హేతవే శక్తితేజసే ।
జయా నిరుద్ధభగవన్ : । మహాపురుషపూర్వజ : ॥ 66

శ్రీనివాస ! జగన్నాథ ! । నారాయణ ! దయానిధే ! ।
కృతార్థో ఒహం కృతార్థో ఒహం । కృతార్థాః సర్వే జనాస్తవః ॥ 67

ప్రసీద భగవన్ ! విష్ణో ! । ప్రసీద పురుషోత్తమ : ।
ప్రసీద : పుణ్డరీకాక్ష : । ప్రసాదా దాత్మసాత్కురు ॥ 68

ఇతి స్తువన్త మాగత్య । మహర్షిం ఫుల్లలోచనమ్ ।
ఆనన్దనిర్భరాపూర్ణ । మానసం శ్రీశుకం మునిమ్ ॥ 69

సమీక్ష్య సుప్రసన్నం తం । ప్రసాద ప్రణయాన్వితః ।
దివ్యైః పరిజనై స్సార్ధం । శ్రీనివాసః తిరోదధే ॥ 70

మునిః పునః ప్రణమ్యా త్ర । దణ్డవ చ్ఛ ముహు ర్ముహుః ।
పరమైకాన్తిభిః యోగి । వర్యైః ఆర్యైః సహః పరైః ॥ 71

అర్చావతారవిభవ । పరవ్యూహా న్తరాదికాన్ ।
ఆవిర్భావాన్ స్మరన్ విష్ణోః । యయౌ మేరుగిరిం ప్రతి ॥ 72

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే
శుకమునికృతశుకపురాణాష్టోత్తరశత విప్రగృహనిర్మాణాదివర్ణనం
నామ సప్తవింశో ఒధ్యాయః.

ఇంద్రియములను నియమించువాడా! సకలప్రాణులకు నియామకమైనవాడా! జగత్తునంతటను వ్యాపించువాడా! దేవా! ఐశ్వర్యము, పరాక్రమస్వభావా! ప్రద్యుమ్నా! జగత్ప్రభో! నీకు నమస్కారము. 65

స్థితి, సృష్టి, నాశన రక్షణములకు కారణమైనవాడా! శక్తి, తేజోపేతుడా! అనిరుద్ధా! సకల కల్యాణగుణనిధే! పరాత్పరా! ఆదిపురుషా! నీకు జయమగుగాక! 66

శ్రీనివాసా! జగన్నాథా! నారాయణా! దయాసముద్రా! నేను కృతార్థుడను. నా జన్మ తరించినది. సకల ప్రాణులు ధన్యమైనవి. 67

కల్యాణగుణ పరిపూర్ణా! సర్వవ్యాపీ! పురుషోత్తమా! అనుగ్రహింపుము. పద్మపత్రనేత్రా! అనుగ్రహింపుము. అనుగ్రహముచే నన్ను నీ దానినిగా జేసికొనుము.

అని యిట్లు స్తుతించుచు విశాల నేత్రములుకలవాడై సంతోషముచే మిక్కిలి నిండిన మనస్సుకలిగి, ప్రసన్నుడగు శ్రీ శుకయోగీంద్రుని 69

గాంచి సమీపించి యనుగ్రహము స్నేహములచే నిండినవాడై దివ్యులగు సేవకులతో గూడ నంతర్హితుడాయెను. 70

శ్రీ శుకయోగీంద్రుడు మరల నమస్కరించి మాటిమాటికి సాష్టాంగముగ నమస్కరించుచు పరమైకాన్తులగు (అనగా భగవంతుని మోక్షమునైన నపేక్షించని) మునీంద్రులతోను, యితర పూజ్యులతోను 71

శ్రీమన్నారాయణుని అర్చావతారము, విభవ, పర, వ్యూహ, అంతర్యామి యను పంచ విధావతారములను తలంచుకొనుచు మేరుపర్వతమున కేగెను. 72

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శనుల సంభాషణమున శుకముని యొనరించిన పురాణములు మాటయేనిమిది బ్రాహ్మణ గృహనిర్మాణములను వర్ణించుట యనెడు యిరువదియేడవ యధ్యాయము

---

# అష్టావింశో ఽధ్యాయః

## శ్రీవరాహావిర్భావవృత్తాన్తః.

దేవలః —

సింహాసానుమతః కుక్షౌ । స్వామిపుష్కరిణీతటే ।
శ్వేతస్య పోత్రిపోతస్య । ప్రాదుర్భావః కథం విభో ! ॥ 1

దేవదర్శనః —

చరాచరగురో రస్య । చారిత్రం చారు పోత్రిణః ।
శృణు విద్వన్ విశేషేణ । వ్యాచక్షే ఽహం విచక్షణ ! ॥ 2

### అసురోపద్రవ మసహమానాయా ధరాయాః పాతాలగమనమ్.

పురా ధర్మచ్ఛిదో దృప్తా । దైత్యాః స్వేచ్ఛావిహారిణః ।
ఛాయాం స్వకీయా మపి చ । హన్తుకామా మదోద్ధతా ॥ 3

మునిభిః గౌతమాద్యైః యే । శప్తా భూమిం గతా ఇతి ।
తే ఽభిజాతే కులే జాతా । రాజ్ఞా మాజ్ఞావిలఙ్ఘినః ॥ 4

పాపిష్ఠా హ్యసురశ్రేష్ఠా ! । నృపశ్రేష్ఠవపుర్ధరాః ।
నక్తం దివం హి బాధన్తే । త్రిలోకీ ధూమకేతవః ॥ 5

క్షోభం మహీక్షితా మేవం । దుర్దర్పబలశాలినామ్ ।
సర్వంసహా ఽసహమానా । విమమజ్జ రసాతలే ॥ 6

### పాతాళగతభూమ్యుద్ధరణోద్యుక్తవరాహవర్ణనమ్.

భూతధాత్ర్యాంవిమగ్నాయాం । అధోభువనసద్మని ।
సంరక్షకః సర్వసాక్షీ । కరుణావాన్ అధోక్షజః ॥ 7

# ఇరువదియెనిమిదవ అధ్యాయము

## శ్రీ వరాహస్వామి యవతారము

దేవలుడు —

సింహములు నివసించు చరియలయొక్క మధ్యభాగములు కల స్వామిపుష్కరిణీ తీరమున శ్రీమన్నారాయణుడు శ్వేతవరాహముగా నెందుల కవతరించెనని దేవలుడు ప్రశ్నించెను. 1

దేవదర్శనుడు —

పండితశ్రేష్ఠా ! చేతనాచేతనములకు గురువగు నీ సుందర వరాహస్వామి యొక్క చరిత్రను విస్తారముగా చెప్పెదను, వినుము. 2

### రాక్షసులొనరించు బాధలను సహింపజాలక భూదేవి పాతాళమున కేగుట

పూర్వ మొకప్పుడు ధర్మము నశించగా రాక్షసులు గర్వించి యథేష్టముగా విహరించుచు మదముచే విజృంభించినవారై తమ పీడను సైతము సంహరింప నుద్యుక్తులై యుండి 3

గౌతముడు మున్నగు మహర్షులచే శపింపబడి భూలోకమున గొప్ప వంశమున పుట్టి రాజుల యాజ్ఞల నుల్లంఘించుచు (అతిక్రమించుచు) 4

పరమదుర్మార్గులై రాజేంద్రులవలె శరీరముల ధరించి ముల్లోకములకు శోక చక్కులవలె రాత్రింబవళ్లు జనుల బాధించుచున్నారు. 5

ఇట్లు వారింపశక్యముకాని గర్వము బలముకలిగిన రాజేంద్రులొనరించు బాధలను సైపజాలక సమస్తము నోర్వజాలినదైనను భూదేవి పాతాళమున మునిగిపోయెను.

### పాతాళములో మునిగిపోయిన భూమినుద్ధరించుటకు ప్రయత్నించు వరాహస్వామి వర్ణనము

ఈ విధముగా భూదేవి పాతాళలోకమున మునిగిపోగా సకల లోకముల చక్కగా రక్షించువాడును, ప్రాణులొనరించు కృత్యముల కన్నిటికి సాక్షీభూతుడును, దయాశీలుడును పరాత్పరుడువగు శ్రీమన్నారాయణుడు 7

సముద్ధర్తుమనా స్తూర్ణం । తాపాళనిలయాం ధ్రువమ్ ।
మహావరాహో భగవాన్ । బభూవ పరమః పుమాన్ ॥ 8

యత్కిరీటస్థరత్నాని । సత్యలోకనివాసినః ।
అకాణ్డోదితమార్తణ్డ । ప్రచణ్డామలమణ్డలమ్ ॥ 9

పశ్యోపనిషదాత్మనః । సిద్ధా ముక్తా శ్చ మేనిరే ।
యస్య శ్రోత్రైకదేశస్థం । స్వపదంశబ్దమాత్రకమ్ ॥ 10

తేజాంసి నిమమజ్జు శ్చ । నేత్రయోః వినరాన్తరే ।
నాసాగ్రే చ సమాయుక్తో । మాతరిశ్వా బభూవ హ ॥ 11

బభూవ పారావారోదో । పాదపఙ్కజపఙ్కదః ।
ఖురోదరే కణకణాః । సురాద్రి శ్చ కులాద్రయః ॥ 12

దశోత్తరై రావరణైః । లోకాలోకాచలః స్థితః ।
బభూవ బాహ్యావయవ । భావనాశేషవేషభాక్ ॥ 13

పోత్రిపాదైకరోమాన్త । ర్వివరస్థాం వసున్ధరామ్ ।
సపత్నీం పద్మవాసిన్యాః । సర్వభూతనివాసినీమ్ ॥ 14

ముస్తాభిః పూర్ణపఙ్కాఙ్కాం । మార్గమాణో బభూవ హ ।

పాతాళగత ధరణీ వరాహయో నర్మ వ్యాపారాదిః.

తాం దృష్ట్వా వేపమానాఙ్గీం । లజ్జాలోలవిలోచనామ్ ॥ 15

ఘోత్రిరోమాన్తరాసీనాం । పావనీం పరమేశ్వరీమ్ ।
వైకుణ్ఠో ఒకుణ్ఠితోద న్తః । కణ్ఠమూల మధోక్షజః ॥ 16

పాతాళమునందలి భూమిని వెంటనే ఉద్ధరింపగోరి గొప్ప వరాహరూపమును ధరించెను. 8

పరమేష్ఠిపుమానిత్యావ్యక్తప్రాకృత పంచభూతములనబడు పంచోపనిషత్తులమయమైన శరీరము కలిగినట్టియు, సత్యలోకమున నివసించుయే వరాహరూపధారియగు శ్రీమన్నారాయణుని కిరీటమునందలి రత్నములు కారణములేకయే హఠాత్తుగా నుదయించిన సూర్యుని తీవ్రమగు స్వచ్ఛమగు మండలమని 9

సిద్ధులను ముక్తులను తలంచిరో, శబ్దగుణకమగు నాకాశమును యే వరాహమూర్తియొక్క చెవిలో నొకమూల నణగియున్నదో 10

ఎవని కనుగుంటలలో సమస్త తేజస్సులు మునింగియున్నవో, ముక్కుచివరి భాగమున వాయుమండలమంతయును దాగియుండెనో 11

సముద్రోదకమెవ్వని పాదపద్మములకు మాత్రమే బురదనొసంగునవో, హిమవత్పర్వతము, కులపర్వతములే వరాహస్వామి డెక్కల మధ్యభాగమునకు లగ్నమైన రేణుమాత్రములుగానున్నవో 12

ఒకదానికంటె నొకటి పది పది రెట్లధికముగానున్న ఆవరణములచే నావరింపబడియున్న లోకాలోక పర్వతము సంకల్పమాత్రముచే ననేక రూపములను ధరించు శ్రియఃపతికి బయటనున్న శరీరభాగమువలె నుండెనో 13

అట్టి వరాహమూర్తియొక్క పాదమునందలియొక్క వెంట్రుకకు మొదటియందలి రంధ్రము నందున్నట్టియు, శ్రీదేవికి సవతియైనట్టియు 14

సకల ప్రాణులకాధారమైనట్టియు, తుంగముస్త నెత్తుటచే బాగుగా బురదగావింపబడి యుండినవాడై భూదేవిని వెదకుచుండెను. 15

## పాతాళమునందలి భూదేవి వరాహస్వాముల కేళీవిలాసములు

వడంకుచున్న శరీరము కలిగినట్టియు, సిగ్గుచే చలించుచున్న కనులు కలిగినట్టియు, వరాహస్వామి రోమములయందు కూర్చునియున్నట్టియు, పవిత్రురాలును, పరదేవతయు నగు భూదేవిని గాంచి (మొక్కవోని వ్యాపారములుగల) మిక్కిలి ప్రతిభాశాలియు 16

రహస్యస్యాఽసమామ్రాయ । వరాహవపురాత్మభూః ।
గాఢాఙ్గపాలికబలీ । భూతగూఢాఙ్గపాలికామ్ ॥ 17

సత్యసన్ధోహి ముముదే । నవోఢాం చ వధూ మివ ।
శరత్ప్రత్యగ్రపఙ్కజా । భినవా భోగలీలయా ॥ 18

స్నేహకామనయా దృష్ట్వా । అభివీక్ష్య గతజ్వరః ।
తాం బభాషే సురసయా । సుధాకల్లోలలీలయా ॥ 19

నర్మభావనయా వాచా । శ్రీమాన్నళినలోచనః ।
వసుధే! దేవి! భద్రం తే । భద్రే భద్రాణి పశ్యసి ॥ 20

స్థాపయా ఖిలభూతాని । స్వస్థా స్వస్థాన మాస్థితా ।
ఏవంవరాహవపుషా । పుంసాభూమిఃసుభాషితా ॥ 21

స్నేహసాగరపూర్ణేన । వ్రీడాలోలవిలోకినా ।
నేత్రాఞ్చలేన స్వపతిం । వీక్ష్య కోలాననం విభుమ్ ॥ 22

స్నేహసన్దర్భగర్భేణ । మాధురీమహితాత్మనా ।
త్రిస్థానస్థేన వచసా । ధర్మశ్రవణతత్పరా ॥ 23

వరాహం ప్రతి ధరణ్యుక్తిః

బభాషే పురుషశ్రేష్ఠం । పోత్రివక్త్రం పురాతనమ్ ।
భగవన్! దేవ! దేవేశ! । దైత్యామిత్ర! దయానిధే! ॥ 24

దైత్యదానవదుర్ధర్ష । భారాత్ మగ్నాం రసాతలే ।
రక్ష మాం పక్షిరాడ్వాహ! । సర్వభారక్షమ క్షమామ్ ॥ 25

ఆధారశక్తయే తుభ్యం । అనన్తశిరసే నమః ।
అవ్యాజసుహృదే భూయో । నమో ఽనన్తవిభూతయే ॥ 26

సత్యవ్రతుడును వరాహరూపధారియగు శ్రీమన్నారాయణుడు కంఠము మొదలు
నెపుడు చూచుచుండు దానిని చూచి గాఢమగు నామె వక్షస్థలమును కప్పివేయునటుల గాఢ
ముగ నాలింగనమును గావించి 17

నూతనముగా వివాహమొనరించుకొనిన పెండ్లికూతురువలె (గాంచి) సంత
సించెను. మరియు శరద్రుతువునందు క్రొత్తగా వికసించిన తామరపుష్పమువలె నూతన
మగు పరిపూర్తిగల విలాసమును 18

స్నేహమును కోరు దృష్టితో నామెను తిలకించి బాధయుపశమిల్లినవాడై మంచి
రసవంతమును, అమృతవీచికలవలెను నుండు 19

పరిహాసముతో గూడిన వాక్కుతో — భూదేవీ! నీకు మంగళమౌగాక!
మంగళరూపీ! నీవు శుభములను గాంచగలవు. 20

నీవు నీ స్థానమునజేరి స్వస్థతనుచెంది ప్రాణుల నుద్ధరింపుమ'ని వరాహ
శరీరధారియగు శ్రీ మహావిష్ణువుచే నా భూదేవి చక్కగ పలుకబడెను. 21

అపారమైన స్నేహముచే నిండినట్టియు, సిగ్గుచే చలించు చూపులుకలదై
క్రీగంటితో వరాహావదనుడగు తన భర్తనుగాంచి 22

స్నేహరస సమేతమును, మిక్కిలి మధురమును నగు ఉరఃకణ్ఠతాల్వాది
స్థానములనుండి బుట్టిన వాక్కుతో ధర్మములను వినుటయందాసక్తి కలదై 23

## వరాహస్వామితో భూదేవి సంభాషణము

వరాహరూపియును, పరాత్పరుడగు శ్రీమన్నారాయణునితో — కల్యాణగుణ
పరిపూర్ణా! దేవాధిదేవా! రాక్షస సంహారకా! దయాసముద్రా! 24

రక్కసుల, రాక్షసులవలన కలిగిన భరింపరాని భారముచే పాతాళమున మునింగి
సహింపజాలని నన్ను గరుడవాహనా! సమస్త భారముల సహింపగల స్వామీ!
రక్షింపుము. 25

సకల ప్రాణులను ధరించు శక్తికలిగినట్టియు, అనేక శిరస్సులు గల నీకు
నమస్కారము. కారణము లేకయే స్నేహశాలివగువాడవును, లెక్కలేని విభూతులుకల
నీకు మరల నమస్కారము. 26

ఏవం వసుధయా దేవ్యా । వేపమానాఖిలాఙ్గయా ।
విజ్ఞాపితో విశ్వరక్షా । దీక్షితః ప్రత్యువాచ తామ్ ॥ 27

సాధు దేవి ! త్వయా పృష్టం । శృణు వక్ష్యే వసున్ధరే ! ।
సర్వం సహా విశ్రుతా త్వం । తథ్యనామా భవ ప్రియే ॥ 28

ధరణ్యా సాకం పాతాళా ద్వరాహస్య శేషాచలాగమనమ్.

వరాహరూపీ భగవాన్ । ఏవ ముక్త్వా వసున్ధరామ్ ।
దేవీః మశిక్షయ ద్ధర్మం । స్వభారభరణక్షమమ్ ॥ 29

శిక్షితా వసుధా దేవీ । తేన శుద్ధమనా ధరా ।
బభూవ మహితా తేన । స్వభారభరణక్షమా ॥ 30

తదా ప్రభృతి దేవేశో । వరాహవపు ఊర్జితః ।
పాతాళలోకాత్ లోకే ఽస్మిన్ । కౌతూహలసమాకులః ॥ 31

స్వామిపుష్కరిణీకూలే । పశ్చిమే ఽస్మిన్ ధరాతలే ।
వల్మీకబిల మాసాద్య ః దద్వారా విజిహీర్షయా ॥ 32

గమనాగమనం కుర్వన్ । తదధో భువనం ప్రతి ।
భూత్వా శ్వేతఃపోత్రిపోతః । సఞ్చరన్ ఆత్మనాయకః ॥ 33

దివ్యై ర్గణైః సేవ్యమానః । కదాచి దనపాయిభిః ।
భూషణైః పారిబర్హైః స్వైః । ఆయుధైః చేతనాత్మభిః ॥ 34

అవ్యాజమిత్రో ఽత్ర పోత్రీ । వర్తతే దివ్యగాత్రభృత్ ।
హ్లాదయన్ ఆత్మన స్సర్వాన్ । జ్ఞానానన్దమయాన్ సురాన్ ॥ 35

పరావరాణాం భూతానాం । అన్తర్యామిణి శార్ఙ్గిణి ।
ఏవం హి వర్తమానే ఽత్ర । పవిత్రే చిత్రపోత్రిణి ॥ 36

కదాచిత్ స్వాఽఽశ్రమే పుణ్యే । దుర్వాసాః కోపనో మునిః ।
క్రీడన్తౌ కామమోహేన । దృష్ట్వా కిన్నరదమ్పతీ ॥ 37

ఇట్లు శరీరమంతయు గజగజ వణకుచును భూదేవి విన్నవించుకొనగా ప్రపంచమును రక్షింపనమకట్టిన శ్రీమన్నారాయణు డామెతో 27

దేవీ : నీవు చక్కగా నడిగితివి. చెప్పెదను వినుము. ప్రియురాలా ! నీవు "సమస్తమును ధరించునది" అను ఖ్యాతిని బడసి సార్థక నామధేయురాలవు కాగలవు. 28

## భూదేవితో పాతాళమునుండి వరాహస్వామి శేషాద్రి కేతెంచుట

వరాహరూపమును ధరించిన స్వామి యిట్లు భూదేవితో పలికి తన భారమును ధరింపజాలునట్టి ధర్మము నాదేవికి బోధించెను. 29

ఇట్లు భూదేవి నేర్పబడినదై నిర్మల మనస్కురాలై తన భారమును ధరింప జాలినదై పూజ్యురాలాయెను. 30

అప్పటినుండి దేవాధిదేవుడగు శ్రీమన్నారాయణుడు వరాహరూపమును ధరించి కాంతియుక్తుడై యీ లోకమును చూచు కోర్కెతో పాతాళలోకమునుండి 31

స్వామిపుష్కరిణీ తీరమున నీ పర్వత పశ్చిమ భాగమున నొక పుట్టలోజేరి దానిగుండా విహరించవలెనను కోరికతో వల్మీకమునుండి పాతాళలోకమునకా తెల్లని వరాహ స్వామి స్వతంత్రుడై రాకపోకలను గావించుచు 32, 33

నిత్యములైన దివ్యగణములతో సేవింపబడుచు, రాజోచితములగు తన యలంకారములతోను, చేతన స్వరూపములైన (జ్ఞానముగల) ఆయుధములతోను సేవింపబడుచు

కారణములేకయే స్నేహశీలుడై దివ్యమగు శరీరమును ధరించి జ్ఞానానంద స్వరూపులగు తనవారగు దేవతలనందరను సంతసింపజేయుచు నివసించుచుండెను. 35

ఉత్కృష్టానికృష్ట ప్రాణికోటి కంతర్యామియగు శ్రీమన్నారాయణు డిట్లు విచిత్రమైన పావనమైన వరాహరూపియై సంచరించుచుండ 36

ఒకానొకప్పుడు కోపిష్ఠియు, మహామౌనియు నగు దుర్వాసుడు తన పవిత్రమగునా శ్రమమున కామముచే మోహింపబడి క్రీడించుచున్న కిన్నరదంపతులను గాంచి 37

శచాప నిర్ఝరే పుణ్యే । సింహనామ్ని మహీధరే ।
కైరాతం మిథునం స్యాతం । వన్యా ఉహారౌ యువా మితి ॥ 38

దుర్వాససః శాపాత్ కిన్నరదమ్పత్యోః కైరాతరూపప్రాప్తిః.

తతః కిన్నరదమ్పత్యోః । నిర్విణ్ణమనసోః సతోః ।
శాపమోచన మాచఖ్యౌ । కృపయా స చ తాపసః ॥ 39

తత్ర స్వామిసరస్తీరే । సఞ్చరన్ శ్వేతసూకరః ।
శాపాత్ మదీర్ష్యావిహితాత్ । మోచయిష్యతి తౌ యువామ్ ॥ 40

తథే తి దీనమనసౌ । ఉక్త్వా కిన్నరదమ్పతీ ।
తూర్ణం తం దేశ మాగత్య । జజ్ఞాతే వ్యాధదమ్పతీ ॥ 41

కైరాతదమ్పత్యోః శేషాచలే పుత్రప్రాప్తి ప్రియఙ్గుకృషి కరణాదీని.

శాకమూలఫలాహారైః । దుష్టసత్త్వనిబర్హణౌ ।
ఆసాతే సుచిరం కాలం । అస్మిన్ సింహశిలోచ్చయే ॥ 42

ఋక్ష శార్దూలశరభ । సింహేభవ్యాలదుర్గమే ।
అరణ్యేఽగణ్యపుణ్యౌఘే । భీషణే రోమహర్షణే ॥ 43

వసత్కిరాతమిథునం । పుష్పాసవమదోద్ధతమ్ ।
అసూతపుత్రం చిత్రాఙ్గం । చిరకాలసమీప్సితమ్ ॥ 44

ప్రసూతం తం సమీక్ష్యా థ । సుకుమారం సుతం తదా ।
శబరః శబరీ చైతౌ । ఆస్తాం సమ్పూర్ణమానసౌ ॥ 45

స్తన్యైః వన్యరసైః రస్యైః । త మాపఞ్చషవర్షకమ్ ।
తా వవర్ధయతాం పుత్రం । చిత్రావయవ మర్భకమ్ ॥ 46

సింహహస్తనఖత్రోటీ । విశాతశతధారతః ।
విభిన్నమత్తమాతఙ్గ । కుమ్భోద్భిన్నోరుమౌక్తికైః ॥ 47

పుణ్యనది గల సింహాద్రియందు మీ రిరువురును కిరాతదంపతులై వనమునందలి కందమూలముల భుజించుచుండుడని శపించెను. 38

## దుర్వాసుని శాపమువలన కిన్నరదంపతులకు కిరాతరూపము కలుగుట

ఆ శాపమును విని కిన్నర మిథునము దుఃఖించుచుండ దుర్వాసుడు దయతో వారికి శాపవిమోచనము నిట్లనుగ్రహించెను. 39

అచ్చట స్వామిపుష్కరిణీ తీరమున శ్వేతవరాహము సంచరించుచు నేను కోపముగా విధించిన శాపమునుండి మిమ్ము విడిపించునని పలికెను. 40

ఆ కిన్నరమిథునము దుఃఖాక్రాంత మనస్కులై యట్లేయని పలికి వెంటనే యా ప్రదేశమునకు వచ్చి కిరాతదంపతులై పుట్టిరి. 41

## కిరాతదంపతులకు శేషాద్రియందు పుత్రులుకలుగుట, ప్రియంగు ధాన్యమును పండించుట మొదలగునవి

కూరలను, దుంపలను, ఫలములను భుజించుచు దుష్టమృగముల శిక్షించుచు, నీ సింహాద్రియందు చాలకాలముండిరి. 42

ఎలుగుగొడ్డులు, పెద్దపులులు, శరభమృగములు, సింహములు, ఏనుగులు పాములచే నిండి ప్రవేశింప శక్యముకానిదియు, లెక్కింపతరముగాని పుణ్యప్రదమైనదియు, భయంకరమును, గగుర్పాటును కలిగించునదియు నగు 43

నరణ్యమున పుష్పములయందలి కల్లుత్రాగి మదించియున్న నా కిరాతదంపతులు ఎంతోకాలమునుండియు నాశించుచున్న చిత్రాంగుడను పుత్రుని బడసిరి. 44

సుకుమారుడగు నా పుత్రునిగాంచి కిరాతదంపతులు విందు మనస్కులవారై యుండిరి. 45

చిత్రమగు నవయవములుకలిగిన కుమారు నైదుసంవత్సరములవరకు నా దంపతులు స్తన్యపానముతోను, అడవియందలి యితర రసములతోను పెంచిరి. 46

సింహముయొక్క పంజాయందలి వజ్రాయుధమువంటి వాడియగు గోళ్ళచే బ్రద్దలుకొట్టబడిన మదించిన యేనుగు కుంభస్థలమునుండి బయటకువచ్చిన గొప్ప ముత్యములచేతను 47

దణ్డశేఖరవాసోభిః । బర్హైః బర్హిపతత్రిణామ్ ।
త్రిమదోద్రిక్తమాతఙ్గ । మదపఙ్కద్రవై రపి ॥ 48

శ్రేయసః పరసాం స్వామి । సరసః శ్వేతమృత్స్నయా ।
అలఞ్చక్రతు రన్యోన్యం । పితరౌ సుతరాం సుతమ్ ॥ 49

కదాచి త్పర్యటం స్తత్ర । విపినే స వనేచరః ।
కస్యచి ద్వటవృక్షస్య । సమీక్ష్య స్కన్ధకోటరే ॥ 50

పక్వం కార్తస్వరనిభం । ప్రియఙ్గుప్రియదర్శనమ్ ।
గృహీత్వా శబర స్సర్వం । గృహిణ్యై త త్సమర్పయత్ ॥ 51

సా ఒపి ప్రైయఙ్గవం ధాన్య । ఉచ్ఛోష్య చ సమాచినోత్ ।
తతః సస్యం చక్రతు శ్చ । ప్రైయఙ్గవ మతన్ద్రితౌ ॥ 52

వృత్తిభిః గోపయన్తౌ తౌ । శుశ్రూషాభిః సమన్తతః ।
అపక్వఫల మాకాఙ్క్షన్ । మిథునం తద్బభూవ హ ॥ 53

గోపనార్థం హి తస్యై వ । పుత్రం ప్రేషితవాన్ స్వయమ్ ।
తుష్టో బభూవ చ క్షేత్రం । వీక్ష్య పక్వఫలోద్ధతమ్ ॥ 54

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే శ్రీవరాహావిర్భావవృత్తాన్తవర్ణనం నామ అష్టావింశో ఒధ్యాయః.

---

# ఏకోనత్రింశో ఒధ్యాయః

## ప్రియఙ్గుగోప్తృ కిరాతసమీపం ప్రతి వరాహాగమనమ్.

దేవదర్శనః —

ప్రియఙ్గౌ ఫలితో గుప్తే । వాఘ్రాభిః వృత్తి భి స్తతః ।
తప్త చామీకరాభోరు । పక్వధాన్యభరానతే ॥ 1

నారబట్టలతోను, నెమళ్ల మెడలగు పక్షులయొక్క పింఛములతోను, మూడు స్థలములనుండి కారునట్టి మదముచే గర్వించిన యేనుగుల మదములచేతను 48

సరస్సులన్నిటిలోను భక్తులకు మంగళప్రదమగు సరస్సులలో నుత్తమోత్తమ మైన స్వామిపుష్కరిణియందలి తెల్లమన్నుతో నా పుత్రుని యా కిరాతదంపతులు మిక్కిలి యలంకరించిరి. 49

ఒకానొకప్పుడా కిరాతుడు వనములో విహరించుచు నొక మర్రిచెట్టుయొక్క మానునందలి తొఱ్ఱలో 50

బంగారు రంగుకలిగి చక్కగా పండి చూచుటకింపుగానున్న కొఱ్ఱలను ధాన్య మును తెచ్చి భార్యకొసంగెను. 51

ఆమె యా కొఱ్ఱలను చక్కగా నారబెట్టి పోగుచేసెను. అతిబాగరూకతతో కొఱ్ఱధాన్యముల చేలను చేసిరి. 52

కంచెలచే నంతటను రక్షణలను చేయుచును అంతకును చేయవలసిన దోహ దములను చేయుచు చేను పండవలెనని కోరుచు నా దంపతులుండిరి. 53

ఆ పొలమును సంరక్షించుటకై తమ పుత్రుని పంపించిరి. ఒకనాడు పండి వెన్నులతోనిండిన పొలమునుగాంచి యా కిరాతుడు చాల సంతసించెను. 54

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాదమున శ్రీ వరాహస్వామి యవతరించుటను వర్ణించుట యనెడు యిరువదియెనిమిదవ అధ్యాయము

---

# ముప్పదితొమ్మిదవ అధ్యాయము

## కొఱ్ఱధాన్యమును సంరక్షించుచున్న కిరాతునివద్దకు వరాహస్వామి వచ్చుట

దేవదర్శనుడు —

మేలిమిబంగారు రంగుగల ఘనమైన పండిన కొఱ్ఱధాన్య భారముచే వంగిన కొఱ్ఱచేను వాద్రలనబడు కంచెలచే కాపాడబడుచుండగా 1

శబర స్తం సమీక్ష్యా థ । మధ్యే కృత్వా తు మఞ్చికామ్ ।
త ద్రక్షణార్థం తత్త్రైవ । అతిష్ఠ న్నక్త న్దివం స్వయమ్ ॥ 2

కదాచిత్ భగవాన్ శ్వేతః । పోత్రిపోతో బుభుక్షయా ।
వల్మీకరన్ధ్రాత్ నిర్గత్య । క్షేత్రమధ్యం వివేశ హ ॥ 3

తం దృష్ట్వా బహుశః సో ఽపి । శబరో విస్మయం యయౌ ।
తత స్తన్మణ్డలేశాయ । రాజ్ఞే విజ్ఞాపితుం ద్రుతమ్ ॥ 4

రాజధానీం ప్రవిశ్యా స్యై ఽ । వేదయ చ్చక్రవర్తినః ।
త చ్ఛ్రుత్వా సార్వభౌమ స్తు । రాజా కౌతూహలాన్వితః ॥ 5

## శ్రీవరాహదర్శనార్థం శేషాచలం ప్రతి నృపాగమనమ్

మృగయా వేషభృత్ భూత్వా । పదాతిః ఉపనిష్క్రమన్ ।
ఏకాకీ తేన సార్ధం హి । జగామ జగతాం హితః ॥ 6

స్వామిపుష్కరిణీం పుణ్యాం । విగాహ్య విగతక్లమః ।
దణ్డవ త్తాం ప్రణమ్యా థ । వ్యాధవాక్యవిచిత్రతామ్ ॥ 7

మనసా ఽఽలోచయన్ సమ్యక్ । స త్త్వ క్రాన్యపరాక్రమః ।
ప్రియఙ్గోః క్షేత్ర మాసాద్య । ప్రియఙ్గుప్రియదర్శనః ॥ 8

చతు స్తమ్భసమాయు క్తాం । చతురశ్రాం సముచ్ఛ్రితామ్ ।
మృదుపల్లవసం స్తీర్ణాం । ఉపా స్తీర్ణమృదుత్వచమ్ ॥ 9

ఆదాయ సశరం చాపం । తుఙ్గశృఙ్గవినిర్మితామ్ ।
మఞ్చికా మారురోహై తాం । తే న సార్ధం నరాధిపః ॥ 10

శబరః సార్వభౌమ శ్చ । జాగ్రతౌ నిశ్యతిష్ఠతామ్ ॥
వల్మీకవివరా చ్ఛ్రిత । సూకరో నిర్జగామ హ ॥ 11

బోయవాడు గాంచి యా చేను మధ్య మంచము నిర్మించుకొని దానిని కాపాడుటకై రాత్రింబవళ్ళచ్చటనే స్వయముగ నివసించుచుండెను. 2

ఒకనాడు తెల్లని పందిపిల్ల రూపముననున్న భగవంతుడు ఆకలిచే పుట్టకన్నము నుండి బయటకువచ్చి పొలముమధ్య ప్రవేశించెను. 3

ఆ బోయవాడా పందిపిల్ల ననేకమారులు గాంచి మిక్కిలి యాశ్చర్యపడెను. వెంటనే ఆ మండలాధిపతియైన రాజునకా వృత్తాంతము నెఱింగించుటకై 4

యాతని రాజధానికేగి యా చక్రవర్తి కెఱింగించెను. దానిని విని యా చక్రవర్తి దానిని జూచు కుతూహలముకలవాడై 5

## వరాహ దర్శనమునకై రాజు శేషాచలమున కేగుట

వేటకాని వేషమును ధరించి లోకహితకరుడగు నా రాజచంద్రుడు ఒంటరిగా బోయవానితో కూడ కాలినడక నా చేనువద్ద కేగుచు 6

పవిత్రమైన వరాహపుష్కరిణిలో స్నానమొనరించి మార్గాయాసము మందగించగా, పుష్కరిణికి నమస్కరించి బోయని మాటలలోని వైచిత్రిని 7

మనస్సుతో లెస్సగ నాలోచించుచు తన పరాక్రమమును సంకోచపరచుకొని కొఱ్ఱచేను దాపునకు చేరి దానిని చూచుటలో మిక్కిలి వేడుకగలవాడు గాన 8

నాలుగు స్తంభములపై యెత్తుగ వేయబడినదై వలువలకళ ఆకారముగలదై లేతని చిగుళ్ళుపరచబడి, దానిపై మెత్తని చర్మము పరచబడియున్న 9

ఎత్తైన గుట్టపై కట్టబడిన మంచము ఆ బోయవానితో శరచాపధారియై యెక్కెను.

వారిద్దరు నా రాత్రియంతయు మేల్కొనియే యుండిరి. విచిత్రమైన నా పంది పిల్ల ఒక పుట్టకన్నమునుండి బయటకు వచ్చెను. 11

## నృపస్య వల్మీకవివరాగతవరాహ దర్శనమ్.

వృతిం విలఙ్ఘ్య వాద్రాభిః । పాశై రప్యతిదుర్గమామ్ ।
క్షేత్రమధ్యం చ ధావ న్తం । సూకరం సుభగాఙ్గకమ్ ॥ 12

ఆత్తాభిలాష మాహారే । దంష్ట్రాదీధితిసఞ్చయైః ।
ధ్వా న్తం శకలయ న్త ఞ్చ । ఖస్వ ద్దివ్యాఙ్గసఙ్గతైః ॥ 13

రాజా తం వీక్ష్య సహసా । విస్మయం పరమం గతః ।
సజ్యే ధనుషి సన్ధాయ । సాయకం సాధు విక్రమః ॥ 14

పూర్ణ మాకర్ణ మాకృష్య । చలలక్ష్యప్రవేధినమ్ ।
గ్రహీతుకామోనృపతిః । తేనసార్ధంతమన్వగాత్ ॥ 5

సూకరో వీక్ష్య ధావ న్తం । చాపహ స్తం మహీపతిమ్ ।
ఝటితి క్షణమాత్రేణ । వల్మీకవివరం యయౌ ॥ 18

వ్యర్థప్రతిజ్ఞో నృపతిః । ప్రాజ్ఞః ప్రఖ్యాతపక్రమః ।
వల్మీకమూల మాగత్య । ద్రష్టు సూకరమత్వరః ॥ 17

శిశ్యే చ దర్భశయ్యాయాం । స్వప్నం కాఙ్క్షన్ క్షితీశ్వరః ।
ప్రబుద్ధః ప్రాకృతః ప్రాతః । అదృష్ట్వా స్వప్నదర్శనమ్ । 18

కిం క ర్తవ్యత్వమూన్యాత్మా । చి న్తయన్ కాయశోధనమ్ ।
మహ దాశ్చర్య మాహ ర్తుం । స్నాత్వా స్వామిసరోజలే ॥ 19

తపోవేషం సమాస్థాయ । ధ్యాయన్ సూకర మీశ్వరమ్ ।
కర్తుం ప్రవవృతే వీరః । తతః ప్రాయోపవేశనమ్ ॥ 20

నిర్ద్వన్ద్వో ఽవన్ధ్యనిష్ఠ శ్చ । నిష్ఠావాన్ అస్య దర్శనే ।
ఏవం హి వ ర్తమానే ఽస్మిన్ । నృపతౌ నియతాత్మని ॥ 21

శబరేణ శబర్యా చ । పరిష్కృతసపర్యకే ।
వృ త్తం విష్ణుపదే వాక్యం । విశుద్ధ మమృతోపమమ్ ॥ 22

## రాజు పుట్టకన్నమునుండి వెలువడిన వరాహమును చూచుట

పాశము యుండుటచే ప్రవేశించుటకు శక్యముకాని కంచెను దాటి సుందరమైన అవయవములుగలదై ఆహారమునందలి యభిలాషకలదై కోరల కాంతిపుంజములచేత చీకటిని చీల్చిచెండాడుచు చేనుమధ్య పరిగిడుచున్న 12, 13

ఆ వరాహమును జూచి యా రాజు మిక్కిలి యాశ్చర్యపడినవాడై వెంట నారి బిగించియున్న ధనస్సునకు పరిగిడు లక్ష్యమును పడగొట్టునట్టి బాణమును సంధించి మంచి పరాక్రమశాలి గాన 14

తత్క్షణము చెవివరకు లాగి దాని నెట్లైనను పట్టవలెనను కోరికకలవాడై యా బోయనితో నా వరాహమును వెంబడించెను. 15

చేతిలో చాపమును ధరించి తనవెంట పరుగిడి వచ్చుచున్న నా రాజు నా వరాహము గాంచి వెంటనే కనుమూసి తెరచునంతలో పుట్టకన్నములో దూరిపోయెను. 16

పేరెక్కిన పరాక్రమవంతుడును, బుద్ధిమంతుడును నగు నా రాజు రిత్తపోయిన ప్రతిజ్ఞకలవాడై పుట్టమొదటికి వచ్చి వరాహమును చూచుటకై మిక్కిలి త్వరకలవాడగుచు

కలలోనైనను కనబడునోయను నాశకలవాడై దర్భలతో పడకనేర్పరచుకొని యచ్చటనే పరుండెను. భక్తిలేని సామాన్య మానవుడగుటచే కలలోనైనను గానలేక ఉదయముకాగానే మేల్కొన్నవాడై 18

ఏమి చేయుటకును తోచక తపస్సుచే శరీరమును కృశింపజేసుకొనియైనను మిక్కిలి యాశ్చర్యకరమైన నా వరాహమును పట్టుటకై సంకల్పించి స్వామిపుష్కరిణీ తీర్థమున స్నానమునుజేసి 19

తపోవేషమును ధరించి వరాహరూపధారియైన సర్వేశ్వరుని ధ్యానించుచు ప్రాయోపవేశమును చేయుట కుద్యుక్తుడయ్యెను. 20

ఆతని దర్శన విషయమైచేయు తపస్సులో శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములను పాటింపక సార్థకమగు నిష్ఠలో నారితేరినవాడై యా రాజు నిశ్చలచిత్తుడై 21

బోయదంపతులచే నుపచరింపబడుచుండగా నాకసమున నీ క్రింది విధముగ పరిశుద్ధమై అమృతమువలె భోగ్యమైన నొక మాట వినబడెను. 22

నృపం ప్రత్యశరీర్యుక్తిః.

ద్రష్టుకామో యది భవాన్ । సాధు వృత్త మహీపతే ! ।
తపసా ఽలం సగర్వేణ । సూకరార్భకదర్శనే ॥ 23

యతస్వ వృత్తం త చ్ఛ్రుత్వం । య ద్వక్ష్యామి చ సువ్రత ।
పవత్సాఽసితగోక్షీర । ధారాభిః అభిషేచయ ॥ 24

అచ్ఛిన్నసన్తతాభి శ్చ । వల్మీకస్థం వరాహకమ్ ।
ఏవం సిక్తః స భగవాన్ । ప్రోత్రివక్త్రః పురాతనః ॥ 25

ప్రాదుర్భవిష్యతి తతో । వల్మీకవివరాత్ విభుః ।
ఏవ ముక్త్వా తు వాక్యం తత్ । పున ర్నో వాచ కిఞ్చన ॥ 26

నృపతిః తం నిశమ్యా ఽథ । విస్మయో విస్మయం గతః ।
తం ప్రయత్నం ప్రవవృతే । ప్రయతో ఽప్రాకృతాత్మనః ॥ 27

అస్యనారాయణగిరేః । లక్ష్మీనారాయణేశితుః ।
వసతేర్దక్షిణేభాగే । ద్వియోజననియోజితే ॥ 28

తీరే స్వర్ణముఖర్యా శ్చ । దక్షిణే దక్షిణక్రమే ।
ప్రాగ్భాగే గణ్డశైలస్య । సర్వోపకరణాన్వితే ॥ 29

గ్రామే సఙ్గ్రామవిజయీ । సమాహితమనా స్తతః ।
సంచిన్త్య సర్వాన్ సమ్భారాన్ । తస్మా దాహృత్య సత్వరః ॥ 30

తం వరాహఞ్చ వల్మీక । మభిషేక్తుమనా మనాక్ ।
విశుద్ధవాసానిష్ణాతో । వైష్ణవః పూర్ణమానసః ॥ 31

నిష్ణాతః తత్సపర్యాయాం । బభూవ వసుధాధిపః ।
సావధానఃసహామాత్యః । సాపత్యఃశబరాన్వితః ॥ 32

అతన్ద్రితః సాధు సాన్ద్రం । అశరీరివచః స్మరన్ ।
గోక్షీరైః హేమకుమ్భస్థైః । వల్మీకవివరోదరమ్ ॥ 33

## రాజు వినిన ఆకాశవాణి

ఓ సదాచార సంపన్నుడవగువో రాజా! నీవు ఆ పందిపిల్లను చూడగోరెదవేని యీ గర్వముతో చేయు తపస్సును విరమింపుము. 23

సుదృఢాధ్యవసాయశాలీ! నేను చెప్పునట్టి యీ యాచారము నాచరింపుము. మూడతోనున్న కపిల గోక్షీరధారల 24

నెడతెగక ప్రవహింపజేయుచు పుట్టలోనున్న వరాహశిశువు నభిషేకింపుము. 25

ఇట్లు వరాహ ముఖముతోనున్న నా యాదిదేవు డభిషిక్తుడై వెంటనే పుట్ట కన్నమునుండి బయటపడును. అని చెప్పి విరమించెను. 26

ఆ మాట నా రాజు విని మిక్కిలి యాశ్చర్యపడెను. జితేంద్రియుడై వెంటనే ఆ ప్రయత్నమునకు గడంగెను. 27

అప్రాకృతమైన ఆ నారాయణ పర్వతమున నారాయణుడు వేంచేసియున్న స్థానమునకు దక్షిణమున రెండు యోజనముల దూరమున 28

స్వర్ణముఖీనదీ తీరమువందున్న గండపర్వతమునకు తూర్పు భాగమువందు సకల పరికరములతో కూడియున్న 29

గ్రామమునుండి యుద్ధవిజేతయగు నా రాజు స్వస్థచిత్తుడై యాలోచించి సమస్త పరికరములనంతటినుండియు తెచ్చియుంచుకొని 30

ఆ వరాహమును అడియున్న నా పుట్టను అభిషేకము గావింపవలెనను సంకల్పమొకింతకలవాడై శుద్ధవస్త్రములను ధరించి 31

ఆ వరాహమూర్తియొక్క పూజయందాసక్తిరి యుండెను. మంత్రులతోను, తన సంతానముతోను, ఆ బోయవారితోను కూడియుండి 32

పరాకొకింతయును లేక ఆ యాకాశవాణిని చక్కగ విద్యుక్తముగ తలంచుకొనుచు బంగరు కుండలలో నింపబడియున్న కపిల గోక్షీరములతో నెడతెగని ధారధారలుగా 33

అనుస్యూతా చ్ఛిన్నధారైః । అభిషేక్తుం ప్రచక్రమే ।
క్రియమాణే ఽభిషేకే తు । వల్మీకవివరాన్తరాత్ ॥ 34

## క్షీరాభిషేకాద్వరాహస్య వల్మీకాదావిర్భావః.

ఆవిర్బభూవ భగవాన్ । వరాహవపు రీశ్వరః ।
కోటీరకోటివిలస । న్మణిమణ్డలమణ్డితః ॥ 35

అమృతాంశుకళాకల్ప । దంష్ట్రాదన్తురపోత్రకః ।
లలాటపట్టఘటిత । వేణుపత్రోర్ధ్వపుణ్డ్రికః ॥ 36

కమ్బుబిమ్బసదృక్కణ్ఠో । మాంసలస్కన్ధమణ్డలః ।
సుపారిజాతవిటప । విడమ్బితచతుర్భుజః ॥ 37

శఙ్ఖచక్రధరో వామ । ఊరుపీఠేస్థితాం మహీమ్ ।
దేవీం త్రపాగోపితాఙ్గీం । లోలావిలవిలోచనామ్ ॥ 38

సర్వాత్మసమ్భృతదయా । కాయినీం హర్ష దాయినీమ్ ।
గాఢం గాఢం సమాలిఙ్గన్ । అస్యా అఙ్గం పదద్వయమ్ ॥ 39

గృహ్ణానః సాన్ద్రహర్షేణా । లోకయన్ వక్త్రపఙ్కజమ్ ।
విశాలవక్షః శ్రీవత్స । కౌస్తుభాభ్యా ఇచ్ఛ లాఞ్ఛితః ॥ 40

యజ్ఞోపవీతో త్తరీయ । దృఢబన్ధనబన్ధురః ।
హారకేయూరకటక । రమ్యహీరాఙ్గులీయభృత్ ॥ 41

సమభ్యుత్థితవామాఙ్ఘ్రి । శిఞ్జన్మఞ్జీరహంసకః ।
నవరత్నాన్తరప్రోత । ముక్తాహారభుజాన్తరః ॥ 42

అప్రమేయై రభినవై । రకల్పైః ఆత్మహారిభిః ।
తపనీయై శ్చిత్రవస్త్రైః । చిత్రై శ్చీనాంశుకైరపి ॥ 43

నా పుట్టయొక్క లోభాగమును అభిషేకముతో తడుపుట కారంభించెను. ఇట్లభిషేకము జరుగుచుండగా నా పుట్ట మధ్యనుండి 34

## పాల స్నానముచే వరాహమూర్తి పుట్టనుండి యావిర్భవించుట

ఆ వరాహరూపుడగు భగవంతుడు జటాసటల అగ్రభాగమున ప్రకాశించు మాణిక్యపుంజములతో నలంకరింపబడినట్టియు 35

చంద్రకళవంటి కోరలచే నిబిడమగు మూతిని కలిగినట్టియు, తిరుముఖమండలమున తగులుకొనిన వెదురాకు ఊర్ధ్వపుండ్రమువలె ప్రకాశించుచున్నట్టియు 36

శంఖాకారమైన కంఠమును కలిగినట్టియు, బలసియున్న భుజ శిరములు కలిగియున్నట్టియు, దేవ తరువగు పారిజాత శాఖలవంటి నాలుగు భుజములను కలిగియున్నట్టియు 37

శంఖచక్రములను ధరించియున్నట్టియు, తన యెడమ తొడపై పెంచేసియుండి సిగ్గుతో నవయవముల నాచ్ఛాదింమకొని చలించుచున్న నేత్రములుకలదై 38

సకల ప్రాణులయందును గల ప్రేమమూర్తీభవించియున్నదో యనునట్లుండి భగవంతున కానందము నినుమడించుచున్నట్టి భూదేవిని గట్టిగ నాలింగనమొనరించి యామె శ్రోణి భాగమును, పాదద్వంద్వమును 39

తన తొడపై నిడుకొని యామె ముఖకమలమును మిక్కిలి యానందముతో చూచుచు విశాలమైన వక్షస్థలమున ప్రకాశించు శ్రీవత్సముతోను, కౌస్తుభముతోను విరాజిల్లుచు 40

యజ్ఞోపవీతమును ధరించి, పైబట్టను గట్టిగ కట్టుకొని, మెడలో హారములను, భుజముల దండకడియములను, చేతులకు మురుగులను, వ్రేళ్ళకు వజ్రములు పొదిగిన సుందరమైన ఉంగరమును ధరించి 41

యెత్తబడిన యెడమ కాలియందు హంసధ్వనివలె శబ్దించు నూపురములను కలిగియుండి, మధ్య మధ్య నవరత్నములు గ్రుచ్చబడిన ముత్యాలహారము ఉరమున వ్రేలుచుండ 42

ఇంతింతనరానట్టియు, నూతనమైనట్టియు, మనోహరములైనట్టియు, సువర్ణ వికారమైనట్టి యాభరణములతోనున్న విచిత్రవర్ణములు గల చీనిచీనాంబరములచేతనున్న 43

మాలాభి రమలామోద । మాలాభిః మధుసూతిభిః ।
అష్టాత్మగర్భసన్దర్భైః । అపామైశ్చ పరిష్కృతః ॥ 44

అజాను చావిర్భవతి । పురుషే సూకరాత్మని ।
విచ్ఛిన్నా క్షీరధారా ఽభూత్ । ధారాలా తు ప్రమాదతః ॥ 45

తావాన్ ప్రత్యక్షదృష్టః । స తదధో నహ్యదృశ్యత ।
పశ్చా దనేకవిధయా । రాజా ఽపి ద్రష్టు మక్షమః ॥ 46

ప్రయత్నా దప్రతీకారోఽ । తిష్ఠత్ తూష్ణీం సతృష్ణధీః ।
శుష్కజిహ్వాకణ్ఠసృక్వి । జ్యోష్ఠః సోష్ణం వినిశ్వసన్ ॥ 47

విదీర్ణమానసో మానీ । వికీర్ణాఙ్గో విఘూర్ణిరః ।
ఏవం వృత్తే రాజ్ఞి తదా । భగవాన్ భూతభావనః ॥ 48

వరాహరూపవిభవః । పురాణపురుషోత్తమః ।
ఉవాచవచనంశ్రీమాన్ । కరుణాపరిణామభూః ॥ 49

## రాజానం ప్రతి భగవదుక్తిః.

రాజన్ అల మలం వ్యర్థ । ప్రయత్నేనాతిభూయసా ।
ఏతావాం స్తవ దృశ్యో ఽహం । త దధో న నృపాధిప ॥ 50

ఏత ద్రూపం ప్రతిష్ఠాప్య । శుద్ధయా శిలయా నృప ! ।
తస్మై దేహ్యఖిలాన్ భోగాన్ । పూర్ణో భూత్వా సుపుష్కలాన్ ॥ 51

అప్రాకృతాఙ్గో విరజాః । సాత్త్వికో ఽయ మితి స్మరన్ ।
వైఖానసై ర్మహర్షిభిః । అర్చయ త్వం నరాధిప ! ॥ 52

పశ్చా న్మా మాప్నుయాః గచ్ఛ । సాధు శాధి వసున్ధరామ్ ।
ఏవ ముక్త్వా కోలవపుః । రాజ్ఞో ఽమూం కాలయాపనామ్ ॥ 53

తేనెలు కారుచున్న తెల్లనై సుగంధములతో తరంగించుచున్న మాలికలచేతను, లెక్కకు మిక్కుటమగు సౌవర్ణాభరణములతోను, మోకాళ్ళవరకు నలంకరించుకొన్నట్టియు వరాహాకారముతోనున్న దివ్యపురుషుడు శిరస్సునుండి పిక్కలవరకు ఆవిర్భవించగా 44

నాతనిని సేవించు వరాకులో నిరంతరముగ ప్రవహించుచున్న పాలధార హఠాత్తుగ ప్రమాదవశమున నిలచిపోయెను. 45

అంతవరకును కంటికి గాన్పించుచున్న నా వరాహమూర్తి యంతకు క్రింద గోచరించలేదు. 46

అంత నా రాజచంద్రుడును ఇంకను సేవించవలెనను ఆశతో చేసిన అనేక యత్నములకు ఫలమును గాంచక నిశ్శబ్దముగ నిలచిపోయెను. వేడినిట్టూర్పుల విగిడించుచుండెను. దానిచే నాలుక, కంఠము, ఓష్ఠపార్శ్వము, పెదవులు యెండిపోయెను. 47

మిక్కిలి యభిమానవంతుడగు నా రాజు ప్రశిథిలమనస్కుడై శిథిలబంధనుగల అవయవములు గలవాడై మిక్కిలి చలింపదొడంగెను. 48

షడ్గుణపూర్ణుడును, సకల ప్రాణుల సృష్టిస్థితిలయకారకుడునునగు రాజీయవస్థలో నుండగా కరుణావరుణాలయుడును వరాహరూపధారియగు పురుషోత్తముడు శోభాయమానుడై యా రాజుతో నిట్లు పలికెను, 49

## రాజునకు భగవంతుని శ్రీసూక్తి

రాజా ! నిష్ప్రయోజనమైన నీ యపారప్రయత్నము నిక చాలింపుము. నేను నీ కింతమాత్రమే నా దర్శనము. ఇక క్రిందిభాగము నీకు లభించదు. 50

ఓ రాజా ! పవిత్రమగు రీతితో నీ విధమగు విగ్రహమును చేయించి ప్రతిష్ఠించి నీవు ఏలోటును లేనివాడవై ఆ విగ్రహమునకు సమస్త భోగముల నర్పింపుము. 51

ఆ విగ్రహమును రాయి యని భావించక నది యప్రాకృత మనియు రజోగుణ తమోగుణ సంపర్కమొక్కింతయు నా విగ్రహమునకు లేదని తలంచి వాన ప్రస్థులతోను, మహర్షులతోను నా విగ్రహము నారాధింపుము. 52

ఆ పిమ్మట నన్ను దర్శింతువుగాక ! పొమ్ము. భూమండలమును సావధానముగా పాలింపుమని రాజునకు వరాహస్వామి కాలక్షేప పద్ధతి నుపదేశించెను. 53

## శ్రీవరాహకృత కిన్నరమిధునస్య కిరాతత్వవినిర్ముక్తిః.

కిరాతవపుషౌ వీక్ష్య । విష్ణుః కిన్నరదమ్పతీ ।
మునిశాపా న్మోచయిత్వా । దదౌ తాభ్యాం స్వకం పదమ్ ॥ 54

## నృపస్య శ్రీవరాహప్రతిష్ఠాపూర్వకం స్వపురగమనమ్

తత శ్చాన్తర్దధే దేవో । వరాహవపు రత్ర వై ।
తతః పూర్ణమనా రాజా । దివ్యం త్వష్టార మాహ్వయత్ ॥ 55

దేవం నిర్మాపయామాస । మనసా విశ్వకర్మణా ।
భూవరాహాకృతిం పూర్ణం । రాజానం నాకవాసినామ్ ॥ 56

వారాహవపుషం శౌరిం । దణ్డవ త్ప్రణిపత్య చ ।
శిర స్య ఞ్జలి మాబధ్నన్ । స్మర న్నాశ్చర్య మీదృశమ్ ॥ 57

జితేన్ద్రియో జితక్రోధో । జితప్రకృతిసం స్తరః ।
జితామిత్రో జితాశేషో । రాజర్షిః స్వాం పురీం యయౌ ॥ 58

తదాప్రభృతి దేవేశో । వరాహవపు రాత్మభూః ।
అన న్తాచలశృఙ్గే ఽ న్తః । నిక్షిప్తాఙ్ఘ్రిసరోరుహః ॥ 59

దేవ్యా వసుధయా సార్థం । స్వామిపుష్కరిణీతటే ।
సుఖ మా స్తే సురేశానః । సుఖీ రహసి సున్దరః ॥ 60

## శ్రీనివాసస్య స్వామితీర్థదక్షిణతీర వాసవర్ణనమ్.

శ్రీనివాసో ఽపి శేషాద్రౌ । తత స్స్వామిసర స్తటే ।
నివస న్నాత్మనః కుర్వన్ । అర్వాచీనాన్ సుఖాత్మనః ॥ 61

సచ్చిదా నన్దసన్దోహో । వృద్ధిక్షయవివర్జితః ।
కారుణ్యపుణ్యపదవీ । కమలాకాముకః కవిః ॥ 62

## శ్రీ వరాహస్వామి కిన్నరదంపతులకు కిరాతత్వమును బాపుట

శ్రీ మహావిష్ణువా కిరాతవేషములతో నున్న కిన్నరదంపతులను జూచి వారి మునీశ్వరుని శాపమును బాపి వారికి తన స్థానమగు వైకుంఠము నొసంగెను. 54

## రాజు వరాహమూర్తిని ప్రతిష్ఠించి తన నగరమునకేగుట

వరాహరూపధారియగు నా దేవదేవు డచ్చటనే అంతర్ధానమయ్యెను. అంతట బిందుమనస్సుగల నా రాజు విశ్వకర్మను పిలిపించెను. 55

ఆ విశ్వకర్మచే సంకల్పమాత్రముచేతనే స్వర్గవాసులకందరకు రాజైన వరి పూర్ణుడగు భూవరాహ బిడ్డను నిర్మింపజేసెను. 56

వరాహరూపియగు నా భగవంతునకు సాష్టాంగవందన మాచరించి శిరమున కరములు మోడ్చి యిట్టి యీ యాశ్చర్య సంఘటనను తలంచుకొనుచు 57

ఆ రాజర్షి ఇంద్రియములను తన యధీనమునందుంచుకొని క్రోధమును జయించి ప్రకృతిసంబంధమును విరసించి శత్రువులను పారద్రోలి సమస్త దుర్వర్గమును జయించి తన నగరమున కేగెను. 58

అది మొదలు స్వయంభువుడను దేవాధిదేవుడైన శ్రియఃపతి వరాహరూప ధారియై శేషాచలాగ్రభాగమున లోన పాదపద్మములనుంచి 59

భూదేవితో కూడ కల్యాణ పుష్కరిణీ తీరమున సుందరాకారుడై దేవదేవుడై రహస్యముగ (నెవ్వరికిని కాన్పించకుండగ) సుఖముగ నివసించెను. 60

## శ్రీనివాసుడా స్వామిపుష్కరిణికి దక్షిణతీరమున నివసించుటను వర్ణించుట

అటుపిమ్మట శ్రీనివాసుడును (వెంకటేశ్వరుడును) శేషాద్రిపై స్వామిపుష్కరిణీ తీరమున సనాతనులైన ఆత్మవర్గములను సుఖవంతులను గావించుచు నివసించుచుండెను.

సత్ చిత్ ఆనందపూర్ణస్వరూపుడును, పెరుగు తరుగులు లేనివాడును, దయకు పవిత్రమైన మార్గమును లక్ష్మీదేవిని ప్రేమించువాడును, భూతభవిష్యద్వర్తమానముల నెఱుంగువాడును 62

అభూమి రాపదాం భూమిః । సంపదాం సంవిదుద్గమః ।
సమస్తసామసఙ్గీత । సచ్చరిత్రః పవిత్రహృత్ ॥ 63

పురాణపురుషో ధాజా । పురుషః తమసః పరః ।
వైకుణ్ఠపూర్వవసతిం । త్యక్త్వే దానీం హి తిష్ఠతి ॥ 64

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శనసంవాదే ప్రియఙ్గుగోత్రకిరాతసమీపం ప్రతి వరాహగమన శ్రీవరాహవిర్భావాదివర్ణనం నామైకోనత్రింశోఽధ్యాయః.

---

# త్రింశోఽధ్యాయః

## శ్రీనృసింహాచలస్థ నీలకణ్ఠతపఃక్షేత్ర వర్ణనమ్

దేవలః —

నఙ్చన్కరే సపర్యాం క్వ । నీలకణ్ఠో మహేశ్వరః ।
వైకుణ్ఠస్యా ముత్రగోత్రే । నరకణ్ఠీరవాకృతేః ॥ 1

దేవదర్శనః —

శృణు విప్ర! సమాచక్షే । పురారాతేః పురావిదః ।
చరితం చరితార్థానాం । యోగినాం భోగసాధనమ్ ॥ 2

అభీష్టఫలదం రమ్యం । చతుర్వర్గఫలప్రదమ్ ।
వరకేసరిణో విష్ణోః । పరబ్రహ్మస్వరూపిణః ॥ 3

ప్రసాదప్రసవప్రాప్తి । హేతు బద్ధనిబన్ధన్ ।
ఇత ఉత్తరభాగేతు । త్రింశద్యోజనసమ్మితే ॥ 4

ఆపదలకు నెలవుకానట్టియు, సంపదలకావాసస్థానమైనట్టియు, జ్ఞానమునకాకరు డైనట్టియు, సకల సామగానములచే కీర్తింపబడు పవిత్ర చరిత్ర కలిగినట్టియు, పవిత్ర మగు మనస్సును కలిగియున్నట్టియు 63

నిత్యనూతనుడును, ఎచ్చటనున్నను ప్రకాశించువాడును, పూర్ణుడును, రజ స్తమోగుణదూరుడును నగు నారాయణుడు పూర్వముండునట్టి వైకుంఠవాసమును విడిచి యిప్పుడీ పర్వతమునందున్నాడు. 64

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శనుల సంవాదాన్తర్గతమగు కొణ్ణచేనును గాపాడు కిరాతునియొద్దకు వరాహస్వామి వెంచేయుట శ్రీ వరాహస్వామి ఆవిర్భవించుటను వర్ణించునట్టి యిరువదితొమ్మిదవ అధ్యాయము

---

# ముప్పయవ అధ్యాయము

## నృసింహాద్రియందు నీలకంఠుడు తపంబొనరించిన క్షేత్ర వర్ణనము

దేవలుడు —

మహేశ్వరుడగు రుద్రుడు నరసింహాకృతి ధరించిన నారాయణుని యీ పర్వతమున నే భాగమున పూజనుగావించెనో తెలుపుము (అని దేవదర్శను నడిగెను) 1

దేవదర్శనుడు —

ఓ బ్రాహ్మణోత్తముడవగు దేవలా! త్రికాలజ్ఞుడైన రుద్రునియొక్క చరిత్రను చెప్పెదను. వినుము. ఈ చరిత్ర కృతకృత్యులైన యోగులకు సకల భోగములకును సాధనమైనది. 2

సమస్త కోరికల నొసంగునది. నిమలకంపైనది. ధర్మార్థకామమోక్షములలో దేనిని కోరినవారికి దాని నొసంగునది. 3

పరాత్పరుడైనట్టియు నృసింహావతారుడగునట్టి శ్రీ మహావిష్ణువుయొక్క అను గ్రహమును బడయుటకు ముఖ్యకారణమైనది. సంసారబంధమును బాపునది. ఇక్కడకు ఉత్తరమున ముప్పదియోజనముల దూరములో 4

ప్రదేశే భీషణే రోమ । హర్షణే భూతభీషణే ।
కశ్చిత్క్షితిధరః పుంసి । కక్షక్షితిరుహో ఽక్షయః ॥ 5

త్ర్యక్షాశ్రమః పక్షియూథ । వాసస్థక్షౌకకోటరః ।
విశఙ్కటతటారూఢ । వృక్షగుల్మగుహాతమాః ॥ 6

శృఙ్గక్రోడగుహావాస । వైఖానసవనే చరః ।
తుఙ్గశృఙ్గవకీనిర్య । దోషనిర్మలనిర్ఝరః ॥ 7

నిర్ఝరాపాతపర్యన్త । స్నిగ్ధానోకహవాటికః ।
తప్తహాటకసఙ్కాశ । గైరికాకీర్ణకన్దరః ॥ 8

భానూపలముఖోత్కీర్ణ । చిత్రభానుశిఖాశతః ।
చన్ద్రిప్రభాభిన్నముఖ । చన్ద్రికాన్తసుధాద్రవః ॥ 9

కణ్ఠీరవనఖత్రుట్యత్ । కుఞ్జరీకుమ్భమౌక్తికః ।
గలితైః మౌక్తికైః విష్వక్ । ఆకీర్ణప్రస్థదుఃస్థలః ॥ 10

మాణిక్యధామన్యగ్భూత । రవిమణ్డలచణ్డరుక్ ।
నానావిధమణివ్రాత । మయూఖోద్ద్యోతఖస్థలః ॥ 11

విద్రుమప్రవతతివ్రాత । సంవృతాన్తరకన్దరః ।
వికీర్ణపద్మపాషాణ । పాటలస్థలకుట్టిమః ॥ 12

శృఙ్గకోటీరసఙ్గీత । సంవివాద్యప్సరోగణః ।
లతాకుసుమసంకౢప్త । లీలాలయవివాసిభిః ॥ 13

మిథునైః కిన్నరాణాం హి । తాలశ్రుతివికల్పనైః ।
దివ్యావిర్భావచరితం । సఙ్గాయద్భిరిత స్తతః ॥ 14

సకల ప్రాణులకును భయమును గొలుపునట్టియు, ఒడలంతయు గగుర్పాటును బుట్టించునట్టియు, సకల ప్రాణులకును అతి భయంకరమగు నొకచోట మధ్య భాగమునందును, ఇరుప్రక్కలయందును గొప్పవృక్షములుకలిగి తరుగులేక పెరుగుచున్న నొక పర్వతము కలదు. అది యీ రుద్రుని యాశ్రమము. అయ్యది మొదలైన తొర్రలు గలిగి పక్షులగుంపులకు నివాసమైయుండు రావిచెట్టు కలదియు, విశాలమగు చరియల యందు మొలచియున్న చెట్లు, తుప్పలు, గుహలచే నంధకారావృతమైనదియు 5, 6

పర్వతశిఖరముల మధ్యభాగమున నున్న గుహలలో నివసించు వానప్రస్థులను వనచరులను కలిగినట్టియు, ఎత్తైన శిఖరములు గల పర్వతచరియలనుండి స్రవించు ధారలు గల నిర్మలమైన సెలయేరులు కలిగినట్టియు 7

కొండయేరు పారుటచే యిరుగుపొరుగున తడసిన చెట్లుగల పూదోటలు కలిగినట్టియు, కరగిన బంగారురంగు గల ధాతువులతోనిండిన గుహలు కలిగినట్టియు 8

సూర్యకాంతరాళ్ళ యొక్క తాకుడులచే పైభాగములనుండి కుప్పతిప్పలగుచున్న సూర్యకిరణ జ్వాలలచే నిబిడమైనట్టియు చంద్రకిరణములు సోకుటచే కరగిన పై భాగములుగల చంద్రకాంతరాళ్ళనుండి స్రవించుచున్న అమృతరసభరితమైనట్టియు 9

సింహముల గోళ్ళనుండి జారిపడునట్టి యేనుగుల కుంభస్థలముల యందలి ముత్యములు కలిగినట్టియు, అట్లు జారిన ముత్యములంతటను చిమ్మబడి పడియుండుటచే దుశ్శక్యమైన సంచారముగల పర్వత సమతలములు కలిగినట్టియు 10

సూర్యుని తీక్ష్ణకాంతులను తృణీకరించుచున్న మాణిక్యకాంతులుకలిగియున్నట్టియు, అనేక విధములైన మణి సముదాయములయొక్క కిరణములచే వెలుగొందింపబడిన ఆకస భాగముకలిగినట్టియు 11

పగడముల రాళులచే నావరింపబడిన గర్భభాగములుగల గుహలు కలిగినట్టియు రాళ్ళచే శ్వేతర క్తవర్ణముకలిగి వ్యాపించియున్న పద్మరాగ మణులచే పాటలవర్ణము (ఎరుపు తెలుపు) గల యెత్తైన చదును భూములు కలిగినట్టియు 12

శిఖరములయొక్క చివరభాగములయందు సంగీతకళలో పోటీలు పడుచున్న అప్సరస సమూహములు కలిగియున్నట్టియు, పువ్వులతో నిండియున్న తీగెలతో నిర్మింపబడిన క్రీడాగృహములయందు నివసించుచున్నట్టియు, 13

తాళములు రాగమునకు తగిన శ్రుతులను మార్చి మార్చి భగవదవతార చరితములనంతటను చక్కగ పాడుచున్న కిన్నర దంపతులచే 14

అధిష్ఠితభృగుప్రాన్తః । ప్రస్థగుఞ్జాభి రఞ్జితః ।
గన్ధర్వైః గర్వవిభవైః గీతవాద్యవిశారదైః ॥ 15

మన్ద్రిమధ్యోష్ఠమహితైః । మహితానేకకన్దరః ।
మార్తణ్డమణ్డలక్షిప్త । స్ఫురన్మయనమణ్డనైః ॥ 16

పుణ్డరీకసుహృచ్ఛణ్ణ । మయూఖమణ్డలాదిభిః ।
తాపనైశ్ఛణ్ణతేజోభిః । మణ్డితోచ్ఛృఙ్గకన్దరః ॥ 17

క్వచి ద్డమరుకోద్ఘూర్ణత్ । కరై రుగ్రోర్ధ్వకేశకైః ।
విఘూర్ణమానసయనైః । మదస్ఖలితకాయకైః ॥ 18

భైరవైః భైరవీభి శ్చ । నిబిడాడమ్బరై ర్యుతః ।
దేవానాం పూర్వదేవానాం । సిద్ధానాం యోగినా మపి ॥ 19

భూతానాంయోగినీనాఞ్చ । మాతౄణాం యక్షరక్షసామ్ ।
అన్యేషాం దేవయోనీనాం । ఆవాసో పత్యకాశ్రయః ॥ 20

ధ్యాయద్భి శ్చ పరం బ్రహ్మ । క్వచి ద్యోగాసనస్థితైః ।
యోగివర్యైః ఆర్యభావైః । యోగాభ్యాసవిచక్షణైః ॥ 21

ఏకాయనై ర్యేకభావైః । అలక్షితగుహాశయః ।
కృష్ణసారపురోయాయి । హరిణీకుల సఙ్కులః ॥ 22

పరస్పరపరిత్యక్త । వైరైః భీమై ర్మృగైఃవృతః ।
అప్రమేయప్రభావో యః । ప్రసిద్ధః పర్వతోత్తమః ॥ 23

తస్య పర్వతవర్యస్య । పుణ్యారణ్యసమీపతః ।
ప్రత్యగ్రపల్లవైః కీర్ణ । సుబిల్వవనవాటికైః ॥ 24

ప్లక్షైఃరుద్రాక్షవృక్షై శ్చ । శ్లక్ష్ణైః సుశ్లక్ష్ణ పర్ణకైః ।
అభ్రంలిహోర్ధ్వశాఖాగ్రైః । అజ్ఞాతజ్ఞాతసంజ్ఞకైః ॥ 25

నధిష్ఠింపబడిన పర్వతచరియ భూములు కలిగియున్నట్టియు, పర్వతములకు పైనున్న సమతలములలో బుట్టిన గురివిందపొదలచే నందమైనట్టియు, గానవిద్యచే గర్వించియున్నట్టియు, సంగీత కళయందును వాద్యకళయందును ఆరితేరినట్టియు 15

ఆదరించదగిన మంద మధ్య ఉచ్చైస్స్వరములతో సన్మానింపబడిన పెక్కు గుహావాసులు కలిగినట్టియు, సూర్యమండల లగ్నదృష్టులైన 16

తాపసుల ప్రచండమైన కాంతులతోను, పద్మములను వికసింపజేయు సూర్య కాంతులతోను నలంకరింపబడుచున్న ఉన్నతమైన శిఖరములయందలి గుహలు కలిగియున్నట్టియు 17

ఒకానొకచోట పెద్దవైన ఢక్కాలను మ్రోగించుటలో నతి చంచలమైన చేతులు కలిగి భయంకరముగ పైకి యెత్తిబెట్టుకొనియున్న జుత్తుకలిగి గిరగిర తిరుగుచున్న గుడ్లుకలిగి, మదముచే నటించుచున్న దేహములుకలిగి 18

ఆడంబరములతో నిండియున్న భైరవులకును రుద్రకింకర దంపతులతో కూడియున్నట్టియు దేవతలకు, రాక్షసులకు, సిద్ధులకు, యోగులకు 19

భూతములకు, యోగినులకు, బ్రాహ్మీమాహేశ్వరీత్యాది పేరులుగల సప్త మాతృగణములకు, యక్షులకు, రాక్షసులకు, ఇతర దేవజాతుల కన్నిటికిని నివాసస్థానమైన పర్వతప్రాంతమున చేరియున్నట్టియు 20

ఒకానొకచోట యోగాసనములయందుండి పరమాత్మను ధ్యానించుచున్న సహృదయులగు యోగాభ్యాస పరినిష్ణాతులైన యోగిపుంగవులచేతను 21

ఏకభావముకల ఏకాయనులచే కల్పించుకొనబడిన గుహావాసములు కలిగినట్టియు, వల్లయిట్టియనబడు నొక జింక ముందుపోవుచుండగా దానినంటి పోవుచున్న ఆడజింకలచే నిబిడమైనట్టియు 22

మిక్కిలి భయంకరమైన సింహశార్దూలఖడ్గమృగాదులు కూడ తమలో తమకు గల విరోధములను విడిచి వర్తించుచున్నట్టియు, ఇంతంతనరాని మహిమగల సుప్రసిద్ధమైన పర్వత శ్రేష్ఠమొందు కలదు. 23

ఆ పర్వతరాజము యొక్క పావనమైన నొక యటవీప్రాంతమున నూతనమైన చిగుళ్ళచే చిందించుచున్న అందమైన శ్రేష్ఠ బిల్వ వనభాగములచేతను 24

జువ్విచెట్లచేతను, రుద్రాక్ష వృక్షములచేతను, ఇంకను కోమలమైనట్టియు మనోహరమైనట్టియు ఆకులుగల ఆకసమువంటు కొమ్మల చిగుళ్ళుగల కొన్నిటి పేర్లు ప్రసిద్ధమై కొన్నిటి పేర్లు అప్రసిద్ధమైయున్న చెట్లతోను 25

యజ్ఞశాఖిభి రాకీర్ణం । సఙ్కీర్ణం యజ్ఞవాటకైః ।
అనోకహైరవిరళైః । సరళైస్సర్వతోవృతమ్ ॥ 26

సమాశ్రితార్తిహరణ । సానుచ్ఛాయం సమన్తతః ।
అహిర్బుధ్న్యతపఃక్షేత్రం । క్షేత్రక్షేత్రజ్ఞబన్ధహృత్ ॥ 27

నరకణ్ఠీరవస్థానం । కణ్ఠీరవరవోద్ధతమ్ ।
భైరవాభైరవాశ్చర్యం । భూరిభీషణభీషణమ్ ॥ 28

## నీలకణ్ఠాశ్రమస్థపుణ్యపుష్కరిణీ వర్ణనమ్

పవిత్ర మత్ర విపినే । వైడూర్యవిమలోదకా ।
కాఞ్చనామ్బుజకల్హార । కమలేన్దీవరోత్కటా ॥ 29

ప్లవమానప్లవా మీన । మకరగ్రాహమణ్డితా ।
మరాళమల్లమహితా । కారణ్డవకులాకులా ॥ 30

తారాతరళకల్లోల । మాలాలోలాన్తరాళకా ।
ఉత్ఫుల్లకైరవాపుల్ల । పుణ్డరీకపురస్కృతా ॥ 31

మకరన్దరసాస్వాద । మాద్యద్భ్రమరయోగణా ।
త్రిమదోన్మత్తమాతఙ్గ । మదవార్యావిలాஉమలా ॥ 32

దేవర్షిభి స్తపస్యద్భిః । రాజర్ష్యైశ్చైః మహాత్మభిః ।
ఉపాన్తపర్యన్తభువి । వివసద్భి స్సమన్తతః ॥ 33

తపోవిమలచిత్తాఢ్యైః । విశఙ్కటితటోత్కటా ।
మన్త్రం షణ్ణవతీభేదం । జపద్భిర్నారసింహకమ్ ॥ 34

మర్రిచెట్లతోను నిండియున్నట్టియు, యజ్ఞమంటపములతో నావరింపబడి యున్నట్టియు, దట్టముగా క్రిక్కిరిసియున్న దేవదారుచెట్లతో నావరింపబడియున్నట్టియు 26

అంతటను ఆశ్రయించినవారి తాపములను తీర్చు పీడలుగల చరియలు కలిగి నట్టియు, అహర్నిశలు తపంబొనరించునట్టియు, జీవుల శరీరబంధములను బాపునట్టియు

సింహముల గర్జనలచే భయంకరమైనట్టియు, మిక్కిలి భయమును గొల్పువాని కిని భయజనకమైనట్టియు, ఆనందజనకమైనట్టిదగుటచే నాశ్చర్యమును గొల్పునట్టియు, మిక్కిలి భయంకర పదార్థములచే భయమును గొల్పునట్టి పావనమైన నరసింహక్షేత్ర మొకటి యీ యరణ్యమున కలదు. 28

## నీలకంఠాశ్రమమందున్న పుణ్యపుష్కరిణీ వర్ణనము

అదే యరణ్యమున పవిత్రమైన నొక పుష్కరిణి కలదు. అది వైఢూర్యముల వలె నిర్మలమైన నీరుకలదియు, సువర్ణచ్ఛాయగల తామరపువ్వులు కొంచెమెర్రనై మిక్కిలి పరిమళించు కలువలు, తామరపుష్పములు, నల్లకలువలతో నిబిడమైనదియు 29

తేలియాడుచున్న పడవలుకలదియు, చేపలు మొసళ్ళు (చొరమీనులు, మరియొక లతాకార మత్స్య విశేషము) మొదలగువానిచే నలంకృతమైనదియు, కన్నెలేడు పిట్టలనబడు నీటిపక్షుల సంఘములతో కలతపడుచుండునట్టిదియు 30

కనుగ్రుడ్లవలె సతతము చలించుచున్న తరంగముల సముదాయములతో చలిం చుచున్న గర్భభాగముకలదియు. వికసించిన తెల్లకలువలతోను, తెల్లతామర పుష్పములతోను నిండియున్నదియు 31

పూదేనెల త్రావి మదించి సంచరించుచున్న వడవిపక్షుల పంక్తులుకలదియు, మూడుస్థానములనుండి కారుచున్న మదముతో మదించియున్న యేనుగుల మదజలములచే కలుషితమైనను పైకి నిర్మలముగ గాన్పించునట్టిదియు 32

తపంబొనరించుచున్న మహాత్ములగు దేవర్షులు, రాజర్షులుయొక్క సమూహ ములచే నిటునటు సంచరించుచున్న ప్రాంతభూములుకలదియు 33

తొంబదియారు భేదములచే భిన్నమైన నరసింహ మంత్రమును జపించుచు తపంబొనరించుటచే నిర్మలమైన సకలావయవములుగల వారిచే నధిష్ఠింపబడిన విశాలమైన ఒడ్లచే మహత్తరమైనదియు 34

నిష్కలం సకలం మిశ్ర । మాశ్రితావనవిశ్రుతమ్ ।
శ్రీవత్సాఙ్కం నారసింహ । గర్భాగర్భకమద్భుతమ్ ॥ 35

జ్ఞానానన్దమయం జ్ఞాన । గమ్యం వైరాగ్యభోగ్యకమ్ ।
ధ్యాయద్భి స్తత్పరం బ్రహ్మ । తీన్ద్రియం విజితేన్ద్రియైః ॥ 36

బ్రహ్మర్షిభి స్సేవ్యమానా । బ్రహ్మభూయఙ్గతై స్సదా ।
పురుజిచ్చరణస్పర్శ । పూతాపురుషపావనీ ॥ 37

పురాణపుణ్యభవనం । పురుషోత్తమపూర్తిదా ।
పూర్వసేవాపురస్కారి । పుంమణ్డలపురస్కృతా ॥ 38

పుణ్యపుష్కరిణీ స్వామి । పుష్కరిణ్యాత్మభూమికా ।
దర్శనాత్ స్పర్శనా త్స్నానాత్ । సర్వేషాం సర్వకామదా ॥ 39

## అశ్మన్యగ్రోధమూలస్థ నీలకణ్ఠాశ్రమ వర్ణనమ్

తస్యా స్తీరే మహానశ్మ । న్యగ్రోధో గిరికన్దరే ।
శాఖాశతైః పరిచ్ఛన్న । దశాశా చక్రవాలకైః ॥ 40

సంవర్ధితాన్ధతమసా । స్వాన్తధ్వాన్తమలాపహః ।
తాపత్రయార్తమనసాం । జన్తూనాం ఆర్తిహారకః ॥ 41

కల్పవృక్షప్రతినిధిః । నిధి ర్నిగమవర్చసామ్ ।
నరాణా మాశ్రితవతాం । మహాపాతకనాశనః ॥ 42

తస్యో పల్లవటాఖ్యస్య । మూలే శూలిన ఆశ్రమమ్ ।
హరితై ర్హరిణీభి శ్చ । నారసింహవివర్ధితైః ॥ 43

(ఉపదేశగమ్యము) 35

జ్ఞానానంద స్వరూపుడై నట్టియు, జ్ఞానముచే నెఱుంగదగినట్టియు, వీతరాగులకు మిక్కిలి రుచికరమగునట్టియు, బాహ్యేంద్రియములకు దుర్గ్రాహమగునట్టియు, స్వాధీనమైన యింద్రియములుకల పరబ్రహ్మను ధ్యానించువారిచే నధిష్ఠింపబడిన తటప్రాంతములు కలిగినట్టియు 36

బ్రహ్మభావమును బడసిన బ్రహ్మర్షులచే సదా సేవింపబడునట్టియు, శ్రీ మహావిష్ణు పాదస్పర్శచే పవిత్రులై పూజనీయులగు పురుషులచే పవిత్రమైనదియు 37

ప్రాచీనమై సకల పుణ్యములకును నిలయమై పురుషోత్తమసామ్యము నొసంగు నదియగునట్టియు, జన్మాంతర పుణ్యరాశిగల పురుషపుంగవులకు మాత్రమే పురస్కరింప దగినదియు 38

అపర స్వామిపుష్కరిణియో యనునట్లుండి తనను చూచుటచేతను, తాకుట చేతను, త్రాగుటచేతను అందరకు నన్నికోరికల నొసంగు పావనమైన పుష్కరిణి యొకటి కలదు. 39

## అశ్మన్యగ్రోధ (ఒక జాతి మఱ్ఱివృక్షము) మూలమునందున్న నీలకంఠుని ఆశ్రమ వర్ణనము

ఆ పుష్కరిణి యొద్దున నొక పర్వత గుహయందు పుట్టి యనేక కొమ్మలచే నావరింపబడిన దశదిశలుగల నొకజాతి మఱ్ఱివృక్షము కలదు. 40

అది గాఢాంధకారముతోనే పెరుగుచున్నట్లున్నది. తాపత్రయములచే పీడితులైన మనస్సుగల ప్రాణులకు ఆర్తిని హరించి లోపలనుండు చీకటివంటి అజ్ఞానమనెడు మలమును హరించునది. 41

కల్పవృక్షమువలె కోరికల నొసంగునది. వేదవేదాంత విజ్ఞులకు నిధివంటిది. దాని దరిజేరిన మానవుల మహాపాతకములను హరించునది. 42

ఆ యశ్మన్యగ్రోధ వృక్షముక్రిందనే శంకరుని యాశ్రమము కలదు. నరసింహస్వామిచే పెంచబడిన మగలేళ్లు ఆడలేళ్ళచే నధిష్ఠితబడిన సమీపతర భూభాగము కలది.

సమాధ్యాసితపర్య న్త । భూతలం వృషమూ ర్తిభిః ।
చణ్డక్రమైః పుణ్డరీకైః । మణ్డితాశా న్తమణ్డలైః ॥ 44

వై శ్వామిత్రైః కుశైః ముఞ్జైః । కాశై శ్చా పి సమావృతమ్ ।
మన్దారకున్దమాకన్ద । హరిచన్దనచన్దనైః ॥ 45

పాటలాశోకతిలక । కృతమాలతమాల కైః ।
వక్త్రమాలైః నారికేరైః । పనసై రసనై ర్ధవైః ॥ 46

పున్నాగపూగరుద్రాక్ష । వకులాక్షహరీత కైః ।
సమ వ్తతప్పమచ్ఛాయం । వన్యైర్వన్యైరనోకహైః ॥ 47

వన్ద్యావ ర్తైః జాతియూధీ । కరవీరాతివీరకైః ।
శతపత్రైః దమనక । మాధవీమాలతీన్దుభిః ॥ 48

తులసీభి ర్గన్ధలతా । జాతిభిః పరితో వృతమ్ ।
పఞ్చభిః పారిజాతాది । పాదపై శ్చ పరిష్కృతమ్ ॥ 49

పవిత్రే ఒస్మిన్ హరిక్షేత్రే । హరిం నరహరిం హరః ।
అభ్యర్చితుమనాః స్థాణుః । ఆజగామ జగన్మయః ॥ 50

## నీలకణ్ఠకృతనృసింహారాధన సఙ్కల్పః

స్నాత్వా ఒస్యాం పుణ్యపూర్వాయాం । పుష్కరిణ్యాం పురా న్తకః ।
హరో దివ్యామ్బరధరో । హరిచన్దనచర్చితః ॥ 51

పర్వ ర్తుకాలోత్థఫల । మాలాశతపరిష్కృతః ।
దివ్యై ర్యా భరణై ర్ముక్తా । ఫలరత్నప్రవాళకైః ॥ 52

సమలఙ్కృతసర్వాఙ్గః । తుఙ్గమఙ్గళసంయుతః ।
కల్యాణవేషకలితైః । నన్దిప్రముఖకైర్గణైః ॥ 53

భయంకరముగ నుద్ధతమై సంచరించు పెద్దపులులచే నలంకరింపబడిన దిగంతములు కలది. విశ్వామిత్రములు, కుశలు, ముంజి, కాశ అను వివిధమైన దర్భవిశేషములచే నావరింపబడినట్టియు, మందార మల్లికలను పూలచెట్లచేతను, మామిడి వేలుపు చందనచెట్లచేతను

(ఇది ఇంద్రునకు ప్రియము). 45

కలిగొట్టుచెట్లు అశోకములు, బొట్టుగుచెట్లు, మవర్ణక వృక్షములు, తాపింఛ వృక్షములు, కానుగుచెట్లు. కొబ్బరిచెట్లు, పనసచెట్లు. వేగిసచెట్లు, చంద్రచెట్లుచేతను 46

సురపొన్నచెట్లు, పోకచెట్లు, రుద్రాక్షవృక్షములు. పగడచెట్లు. తాడిచెట్లు. కరకచెట్లు మొదలగు వింకను నడవులయందుండునట్టి యనేక విధముల చెట్లచే నావరింపబడుటచే నంతట నొకేరీతిగ నీడలుగలిగినట్టియు 47

నందివర్ధన వృక్షములు, ఉసిరికచెట్లు, అడవిమొల్లలు, గన్నేరు, తామరపువ్వులు దమనము, పూలగురిగింజ. జాజి, నల్లతుమ్మకిచెట్లచేతను 48

తులసిచెట్లు, ఇంకను అనేక పరిమళములుగల తీగజాతి వృక్షములచేతను. అంతట నలదుకొనబడినట్టియు 49

పరమపావనమైన నీవిష్ణుక్షేత్రమునందు లోకమున పూజ్యుడుగా ప్రసిద్ధిని జెందిన రుద్రుడు శ్రీ మహావిష్ణ్వవతారభూతుడగు నారసింహుని యారాధించుటకై యేతెంచెను. 50

## నరసింహస్వామి నారాధించుటకు రుద్రుడుగావించిన సంకల్పము

త్రిపురములను సంహరించిన రుద్రుడు యీ పుణ్యపుష్కరిణిలో స్నానమొనరించి దివ్యమైన బట్టలను కట్టుకొని హరిచన్దనమును తన శరీరమునందలందుకొని 51

అన్ని ఋతువులయందును ఫలములను చేబూని అట్టి పువ్వులతో గ్రుచ్చబడిన అనేక మాలలతోను ముత్యములు, రత్నములు, పగడములతో కూర్చబడిన దివ్యమైన నగలతోను 52

తన యవయవములన్నిటిని యలంకరించుకొని ఉత్కృష్ట మంగళములచే సంస్కరింపబడినవారై మంగళ వేషధారులగు నందిమొదలైన గణములచేతను 53

సేవితో భూతతతిభిః । సేవారసవిశారదైః ।
సితాసితైః స్వారమేయైః । దుర్వారైః ప్రమదైః స్పృహ ॥ 54

నరసింహసపర్యాయాః । ప్రత్యూహప్రతిఘాతినా ।
సేవితః క్షేత్రపాలేన । సుప్రసన్నో మహేశ్వరమ్ ॥ 55

పరావరాణాం భూతానాం । స్రష్టారం పరమేశ్వరమ్ ।
సంహర్తారం చ పాపానాం । నిగ్రహీతార మచ్యుతమ్ ॥ 56

అనుగ్రహీతార మీశం । ఈశానస్య తపః ఫలమ్ ।
సకలం నిష్కలం మిశ్రం । పరస్మాత్పర మవ్యయమ్ ॥ 57

లక్ష్మీనృసింహం సంహార । నృసింహం దివ్యసింహకమ్ ।
అఖిలార్తిహరం వీర । ముగ్రం ప్రత్యగ్రవిగ్రహమ్ ॥ 58

శబ్దబ్రహ్మమయం శబ్దా । తీతం శబ్దవిజృమ్భణమ్ ।
అర్థబ్రహ్మవపుః పూతం । పురాణం పుణ్యపూరణమ్ ॥ 59

అవ్యాజమిత్రం శత్రుఘ్నం । శరణ్యం శరణాత్మకమ్ ।
భక్తార్తిభఞ్జనపరం । ఆత్మనామ భయప్రదమ్ ॥ 60

సచ్చిదానన్దసన్దోహం । వృద్ధిక్షయవివర్జితమ్ ।
పూర్ణషాడ్గుణ్యవిభవం । త్రైగుణ్యవిభవాస్పదమ్ ॥ 61

శ్రీవత్సలక్షణం సర్వం । సర్వలక్షణలక్షితమ్ ।
అప్రపఞ్చం ప్రపఞ్చాత్మ । ప్రపఞ్చితపరాక్రమమ్ ॥ 62

విశ్వేశం తత్పరం బ్రహ్మ । ధ్యాయ న్నేకాగ్రమానసః ।
వసానః కృత్తివసనం । పౌణ్డరీకోత్తరచ్ఛదః ॥ 63

కైంకర్య రసజ్ఞశిరోమణులైన భూతసంఘములచేతను సేవింపబడుచున్నవాడై నల్లని తెల్లని కుక్కలు వెన్నంటియున్న అప్రతిహతగతులగు ప్రమథగణములతోను 54

నృసింహభగవానుని సేవకు కలుగు ఆటంకములను పారద్రోల సమర్థుడగు క్షేత్రపాలకునితోను సేవింపబడుచున్నవాడై మహానందభరితుడైన శంకరుడు 55

ఉచ్చ నీచస్థితిగల సకల ప్రాణులను సృష్టించువాడును, నిరవధిక నియన్తయును, పాపములను పోగొట్టువాడును, ఆశ్రితులను విడువనివాడును, శత్రువులను నిగ్రహించుటలోను 56

భక్తులను అనుగ్రహించుటలోను సమర్థుడును, సర్వనియంతయైనవాడును, రుద్రుని తపస్సునకు ఫలమోయనునట్లున్నవాడును, సర్వజ్ఞుడును, గొప్పవారికన్న గొప్పవాడును, నాశనములేనివాడును 57

కాంతియుతమగు నరుని రూపముతో కలసిన సింహరూపుడును, భక్తుల శత్రువులను సంహరించువాడును, దివ్యమగు పరాక్రమసంపన్నుడును, భక్తుల సకల దుఃఖమును పారద్రోలువాడును, పరాక్రమశాలియు, భయంకరుడును, అపూర్వ శరీరధారియును 58

సకల శాస్త్రప్రవర్తకుడును, వాక్కునకందనివాడును, వేదమును విస్తరింపజేయువాడును, సకల పదార్థములను తనకు శరీరముగాకలవాడును, పావనుడును, అనాదియైనవాడును, పుణ్యమునకు పరమావధియైనవాడును 59

నిర్హేతుకరక్షాదీక్షితుడును, భక్తుల శత్రువులను నాశనమొనర్చువాడును, రక్షించుటలో నిపుణుడును, తానే భక్తులకాధారమైనవాడును, భక్తుల దుఃఖములను బాపువాడును, ఆశ్రయించిన సకల ప్రాణులకు అభయము నొసంగువాడును 60

సత్ చిత్ ఆనందములకు రాశియైనట్టియు, పెరుగు తరుగులు లేనట్టియు, జ్ఞానశక్త్యాది షడ్గుణసంపదతో నలరారునట్టియు, సత్వరజస్తమోగుణ ప్రచురులగు ప్రాణులకాస్పదమైనట్టివాడును 61

శ్రీవత్సమే చిహ్నగాగలవాడును, అన్నిటిని తన యధీనమందే కలవాడును, సకల సల్లక్షణములతో కూడియున్నవాడును, ప్రాకృత ప్రపంచ దోషములంటనివాడును, సకల లోకముల కంతరాత్మగానుండి తన వైభవమును విస్తరింపజేయువాడును 62

ప్రపంచమునంతను తన యధీనములో నుంచుకొనువాడును నగు నా పరబ్రహ్మస్వరూపుడగు నరసింహుని చర్మమునే బట్టగా గట్టుకొని, పులిచర్మమును ఉత్తరీయముగా ధరించి, ఏకాగ్రమనస్కుడై ధ్యానించుచు (శివుడు కర్త) 63

పాఞ్చరాత్ర విధానేన । పఞ్చకాలపరాయణః ।
తస్యో పలవటస్యా ధో । నరకేసరిణః స్వయమ్ ॥ 64

సర్వలోకహితార్థాయ । సర్వావాసస్య శార్ఙ్గిణః ।
సపర్యాం సుకృతీ కర్తుం । అగ్నిరేతాః ప్రచక్రమే ॥ 65

**ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శనసంవాదే శ్రీనృసింహాచలస్థనీలకణ్ఠతపః క్షేత్రాదివర్ణనం నామ త్రింశో ఽధ్యాయః.**

---

# ఏకత్రింశో ఽధ్యాయః

## నీలకణ్ఠకృత నృసింహారాధన విధిః

శ్రీకణ్ఠః శఙ్కర శ్శాన్తో । నరకణ్ఠీరవం మహః ।
వైకుణ్ఠం వైజయన్త్యాఢ్యం । అకుణ్ఠితమనా స్స్మరన్ ॥ 1

సర్వలోకహితాకాఙ్క్షీ । స్థాణు స్స్వస్థాత్మమానసః ।
అస్మిన్ న్యగ్రోధమూలస్య । మూలే వైయాఘ్రచర్మణి ॥ 2

అగర్భసాగ్రదర్భాగ్ర్య । సన్దర్భక్షితనిర్మితే ।
పద్మాసనే సమాసీనః । సంయమీ సమదర్శనః ॥ 3

కారుణ్యార్ణవకల్లోల । లోలలీలాకులేక్షయా ।
శ్రీశణ్యా వీక్షయన్ విష్వక్ । త్రిలోకీం త్రిపాదాఙ్కితామ్ ॥ 4

తరుణాదిత్యకిరణ । సహోదరజటాపటః ।
నీలకణ్ఠః పశుపతిః । శ్రీకణ్ఠః పరమేశ్వరః ॥ 5

కపర్దజూటకలిత । కమలారికలాలయః ।
విలయోద్యత్తవీరశ్రీః । ఇన్దువర్కాగ్నిత్రిలోచనః ॥ 6

ఆ నరసింహ భగవానుడు వేంచేసియున్న మఱ్ఱిచెట్టుక్రింద పూర్వాది పాంచ రాత్రానములో చెప్పిన రీతిగ ప్రాతస్సంగవమధ్యాహ్నాదికాల విభాగక కృత్యములను పాలించుచు 64

లోకకల్యాణమునకై సర్వవ్యాపియగు సర్వేశ్వరుని పూజించుటకై పుణ్యాత్ము డగు శివుడు ప్రారంభించెను. 65

శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవఃర్మనుల సంవాదమున శ్రీ నారసింహాచలమందు రుద్రుడు తపస్సును గావించిన క్షేత్రమును వర్ణించుట యనెడు ముప్పదియవ అధ్యాయము

---

# ముప్పదిఒకటవ అధ్యాయము

## రుద్రుడుచేసిన నరసింహస్వామి ఆరాధన పద్ధతి

శోభాయమాన కంఠముగల రుద్రుడు ఇంద్రియ నిగ్రహముకలవాడై వైకుంఠ వాసియును వైజయంతీమాలను ధరించునట్టి నారాయణుడైన నృసింహుడను తేజస్సును నిరంతరమనస్కుడై ధ్యానించుచు 1

సమస్తలోక కల్యాణమును గోరినవాడై చలించక నిర్వికారుడై తన మనస్సును తన వశమునందుంచుకొని అదే మఱ్ఱిచెట్టు మొదటియందు పులిచర్మముపై 2

కణుపులు పొరలులేని కొనలుగల దర్భలతో నేర్పుతో చక్కగ కూర్చబడిన ఆసనముపై పద్మాసనముతో కూర్చున్నవాడై ఇంద్రియములను జయించి సర్వభూతముల యందును సమదృష్టికలవాడై 3

దయ యను సముద్రమునందలి తరంగములనదగు చలించు చూపులుగల నేత్ర త్రయముచే త్రివిక్రముని మూడడుగులచే చిహ్నితమైన లోకత్రయమును గాంచుచు 4

బాలసూర్యుని కిరణములవలె బంగరు రంగుగల జడలరాజిల్లి కాంతియుత కంఠముగలట్టియు, పరమేశ్వరు డనబడునట్టియు, నల్లని కంఠముగల రుద్రుడు 5

తన జటాజూటమున కూర్చబడిన చంద్రకళను కలవాడై, ప్రళయంకర పరాక్రమ విరాజితుడై చంద్ర సూర్యాగ్నులనబడు మూడు నేత్రములుకలవాడై 6

జటాటవీలసద్గఙ్గా । శిరోమాలాభిమణ్డనః ।
అష్టమూర్తి రనన్తాత్మా । విశిష్టవిభవేష్టభూః ॥ 7

శరన్నిర్మలపూర్ణేన్దు । మణ్డలాననమణ్డలః ।
ఉద్యత్సంవర్తమార్తాణ్డ । చణ్డరుద్వ్యఙ్గమణ్డనః ॥ 8

పవిత్రితాఙ్గోఽహిర్బుధ్న్యః । చికీర్షన్ విశ్వరక్షణమ్ ।
దక్షిణామూర్తి రవ్యగ్రః । సమగ్రద్రవ్యసాధనః ॥ 9

శత్రువిధ్వంసకం బ్రహ్మ । నృకేసరికిశోరకమ్ ।
నిష్కలం సకలీకృత్య । నిత్యాభ్యర్చనకాముకః ॥ 10

కారుణ్యపుణ్యపదవీ । మృడః కాత్యాయనీసఖః ।
చరాచరాణాం సర్వేషాం । అమీషాం మిత్ర మాత్మనామ్ ॥ 11

ఆనన్దకన్దమహిమా । బభూవ భువనేశ్వరః ।

## నీలకణ్ఠప్రతిష్ఠిత శ్రీనృసింహవర్ణనమ్

నృసింహగర్భం సకలం । శత్రుసాదకరం పరమ్ ॥ 12

త్రీక్షణీకోణసన్నిర్యత్ । కృష్ణవర్త్మశిఖాజటమ్ ।
దంష్ట్రాకోటివికటాఙ్కాగ్ర । విస్సరద్వహ్నికీలకమ్ ॥ 13

ఊరూపరిసముత్తాన । నిపాతితహిరణ్యకమ్ ।
నఖత్రుటితదైత్యేన్ద్ర । వక్షోవివరగహ్వరమ్ ॥ 14

అమరాసృక్కణ్ఠశిరో । లుణ్టాకానేకబాహుకమ్ ।
అనేకశస్త్రాస్త్రధరా । నేకబాహుసహస్రకమ్ ॥ 15

ఘోరాట్టహాసనినద । విపాటితవియత్తటమ్ ।
భవద్భృత్యాత్మకం బ్రహ్మ । భాసకం భక్తవత్సలమ్ ॥ 16

జడలనెడు అరణ్యమున విలసిల్లు గంగను శిరస్సున మాలికాలంకారముగ ధరించినవాడై పంచభూతములు చంద్ర సూర్యులు మొదలగు ఎనిమిదింటిని శరీరముగా గలవాడై, భక్తులకంతరాత్మగానుండి వారి కభీష్టముల నొసంగుచుండువాడై 7

శరదృతువునందలి పున్నమచంద్రునివలె గుండ్రమైన ముఖముకలవాడై, ప్రళయకాలమున నుదయించు సూర్యునివలె ప్రకాశించు దేహాభరణభూషితుడై 8

విష్ణుపాదోద్భవియగు గంగచే పవిత్రమైన శరీరముగల శంకరుడు ప్రపంచ రక్షణమును చేయగోరి విదానముగ నా సమర్థగాత్రుడగు రుద్రుడు కావలసిన సాధన సామగ్రినంతను కూర్చుకొనినవాడై 9

శత్రుసంహారకుడును, సాక్షాత్పరంబ్రహ్మయునగు నా బాలనృసింహుని తన సత్వస్వమునుగా భావించి నిత్యమును పూజించు వాశకలవాడై 10

భగవన్నిర్హేతుక కృపయనెడు పదవిని స్వాయత్త మొనరించుకొనిన పార్వతీ పతియగు శంకరుడు చరస్థిర రూపములతోనున్న సమస్తాత్మలకును మిత్రుడై 11

సకలలోకేశ్వరుడగుచు ఆనందనిధియై యలరారెను.

## శివునిచే ప్రతిష్ఠింపబడిన నరసింహుని వర్ణనము

మానవ మృగ సంకలన రూపమైనట్టియు, కళాపూర్ణమైనట్టియు, సర్వోత్కృష్టమై శత్రునాశకరమైనట్టియు 12

ఫాలనేత్రాంచలమునుండి బయలువెడలు అగ్నిజ్వాలవంటి జూలుకలిగినట్టియు, కోరల అగ్రభాగమునుండి బయలువెడలు నిప్పుకణములు కలిగినట్టియు 13

తన తొడలపై వెల్లకిల నిడుకొనిన హిరణ్యకశ్యపుడు కలిగినట్టియు, వాని బలసిన బొమ్మనకు లోపలనున్న గుండెలను గోళ్ళతో చీల్చిచెండాడినట్టియు 14

రాక్షసాగ్రణియగు హిరణ్యకశపుని రక్తమును కంఠమును శిరస్సును అనాయాసముగ హరించునట్టియు, పెక్కు శస్త్రములను, అస్త్రములను ధరించు లెక్కలేని చేతులు కలిగియున్నట్టియు 15

భయంకరమైన గర్జనలచే నాకసమువంతను వ్రక్కలుగచేయునట్టియు, భక్తుల దోషములను భోగ్యముగా గ్రహించునట్టియు 16

నవరత్నాన్తరప్రోత । మౌక్తికత్రిసరాన్వితమ్ ।
పఞ్చసప్తసరీభిశ్చ । మణ్డితోరుభుజాన్తరమ్ ॥ 19

స్ఫురత్కటకకేయూర । కఙ్కణాఙ్గుళిభూషణమ్ ।
ఉత్తరీయబ్రహ్మసూత్రో । దరబన్ధనబన్ధురమ్ ॥ 20

ఘణ్టానినాదలుణ్టాక । ఘణ్టికాదామనాదకమ్ ।
ప్రపదప్రస్ఫురద్రోచి । ర్మణిమఞ్జీరహంసకమ్ ॥ 21

ఛిన్నవీయత్సమాయుక్త । కిఙ్కిణీనాదశోభితమ్ ।
ప్రత్యగ్రోత్ఫుల్లరక్తాబ్జ । ప్రతిమాఙ్ఘ్రికరస్థలమ్ ॥ 22

విచిత్రరత్నఖచిత । పీతకౌశేయవాససమ్ ।
సర్వర్తుకామోదయుక్త । ప్రసూనస్రగలఙ్కృతమ్ ॥ 23

దివ్యసద్గన్ధసన్దర్భ । గర్భారుణవిలేపనమ్ ।
అనేకచీనాంశుకస్ర । గాలేపాలఙ్కృతాఙ్గకమ్ ॥ 24

సేవ్యమానం సురశ్రేష్ఠ । పురుహూతపురోగమైః ।
బృన్దారకైశ్చ మన్దార । పుష్పాఞ్జలిలసత్కరైః ॥ 25

సమన్తత స్సేవ్యమానం । సనన్దసనకాదిభిః ।
పత్తతస్త్రీనాదగర్భా । థర్వశ్రుతివిలాసినా ॥ 26

ఉపవీణయతానన్తా । సనానం భక్తితో మయా ।
సంస్తూయమానంగన్ధర్వైః । తుమ్బురుప్రముఖైర్ముదా ॥ 27

సకలైశ్వర్యప్రదమగునట్టియు, సృష్టి స్థితి లయములు లీలగాగల్గియు, తన భక్తులకు తన విభవముచే నానందపరచునట్టియు, దేవతలకును దానవులకును సాధారణమైన దేవుడైనట్టియు 17

రత్నముల కాంతుల నీనుచున్న కిరీటమకుటములను ధరించుటచే సూర్యునివలె వెలుగుచున్నట్టియు, ఇద్దరు సూర్యులో యనునట్లు కనులమిరుమిట్లు గొలుపు కాంతిగల కుండలములచే నలంకరింపబడినట్టియు 18

నవవిధ రత్నములను, మార్చి మార్చి కూర్చిన ముప్పేట ముత్యాలహారముతో నలంకరింపబడినట్టియు, ఐదేదుపేటల ముత్యాలహారములు వ్రేలు వక్షస్థలము కలిగియున్నట్టియు 19

ప్రకాశించుచున్న మురుగులు, బాహుబిందులు, కంకణములు, ఉంగరములనెడు అలంకారములు కలిగియున్నట్టియు, పైపంచ, జందెము, కాశికోకనడుమునకు బిగించి కట్టినట్టియు 20

పెద్దగంటల ధ్వనిని కూడ వినబడకుండునట్లుచేయు చిన్న చిన్న గంటల మాలలను మ్రోగింపజేయునట్టియు, పాదాగ్రమున ప్రకాశించు కాంతియుత మాణిక్యఖచితమై హంసవలె శబ్దించు అందెలు గలిగియున్నట్టియు 21

అల్లిబిల్లిగా నల్లుకొనిన పొదలను చీల్చుకొని బయటపడినదో యన్నట్లున్నట్టియు చిన్నమువ్వల మనోహరధ్వనితో నలరారునట్టియు, అప్పటికప్పుడు విడచిన యెర్రతామరను పోలిన పాదతల కరతలములు కలిగియున్నట్టియు 22

రంగు విరంగుల రత్నముల కాంతులతో నలందుకొనియున్న పట్టుపీతాంబరమును ధరించినట్టియు, అన్ని ఋతువులలోను బాగు పరిమళించు పుష్పజాతులతో గూర్చబడిన దండలచే నలంకరింపబడియున్నట్టియు 23

దివ్యమైన పరిమళయుతమైన రక్తచందనము నలందుకొనినట్టియు, పెక్కు చీనిచీనాంబరములచేతను, దండలచేతను, సుగంధపూతలచేతను నలంకరింపబడిన దివ్య మంగళ విగ్రహమును వహించునట్టియు 24

దేవేంద్రుడు మొదలగు దేవప్రముఖులచే సేవింపబడుచున్నట్టియు, మందార పుష్పములతో నిండిన దోసిలులను ధరించి చుట్టువారియున్న దేవతలచేతను 25

సనక సనందనాదులచేతను, అంతటను సేవింపబడుచున్నట్టియు, వీణానినాదముల నీనుచున్నదో యనదగిన నాధర్వవేద ఋక్కులతో విలసిల్లు 26

వీణను చేబూని నేను (దేవదర్శనుడు) భక్తితో పెక్కులగు నృత్తకీర్తనములను చేయుచుండగ, తుంబురుడు మొదలగు దేవగాయకులగు గంధర్వులచే పరమానందముతో స్తుతింపబడుచున్నట్టియు 27

పక్షీన్ద్రవిష్వక్సేనాభ్యాం । గణై స్తు కుముదాదిభిః ।
రహస్సదాత్మపర్య స్తే । సంవృతం పరిచారకైః ॥ 28

పరిబర్హా భూషణాని । హేతి మిజ్జితవేదినీమ్ ।
దధతీభిశ్శైష్ణవీభిః । శక్తిభిః వృత మన్తికే ॥ 29

రౌద్రీభి శ్శక్తిభి శ్చైవ । బ్రాహ్మీభిః పరితో వృతమ్ ।
పరమాత్మాన మాత్మీయ । మాత్మనా మభయప్రదమ్ ॥ 30

సేవ్యమానం సిద్ధసఙ్ఘైః । సప్తలోక నివాసిభిః ।
నరసింహాత్మకం బ్రహ్మ । ప్రతిష్ఠాప్యే హ భూతలే ॥ 31

సన్నిధిం ప్రార్థ్య సర్వేషాం । దృష్టాదృష్టఫలప్రదమ్ ।
ఉపచారై స్సమభ్యర్చ్య । సంస్కారై స్సంస్కృతో భవాన్ ॥ 32

పరావరాణాం భూతానాం । ఈశ్వర స్స మహేశ్వరః ।
సమతిష్ఠత సర్వాత్మా । కుర్వ న్నయన మాత్మని ॥ 33

ధర్మం భాగవతం తత్ర । చరన్ భగవతీసఖః ।
పురాణే సుఖ మా స్తే ఽస్మిన్ । పురారిః పురుష స్సదా ॥ 34

తస్మా దయం నీలకణ్ఠః । ప్రసిద్ధ స్సర్వతో మహాన్ ।
జన్తూనా మపి జీవాతుః । జఙ్గమాజఙ్గ మాత్మనామ్ ॥ 35

## శ్రీనృసింహసాన్నిధ్యేన నీలకణ్ఠాశ్రమస్యాధిక్యవర్ణనమ్

పుణ్యపుష్కరిణీ చే యం । పుణ్యా పుణ్యఫలప్రదా ।
పురుషార్థప్రదా పుంసాం । పురారిప్రీతిపూరణీ ॥ 36

నవ మే తదహిర్బుధ్న్య । తపఃక్షేత్రం పవిత్రభూః ।
పుణ్యారణ్యం యత్ర త ప్తం । తపః కోటివిధం భవేత్ ॥ 37

గరుడ విష్వక్సేనులచేతను, కుముదాది గణములచేతను స్తుతింపబడుచున్నట్టియు,
గుప్త సభయందు తనకు దగ్గరగా చుట్టుకొనియున్న పరివారకులు కలిగియున్నట్టియు 28

రాజోచిత ఛత్రచామరాదులను ఆభరణములను సంజ్ఞలచే పంచరించు నాయుధ
ములు ధరించియుండు సాత్విక వైష్ణవశక్తులచేతను 29

తామసశక్తులచేతను, రాజసశక్తులచేతను వలుగడల వలందుకొనబడియున్నట్టి
తన భక్తులందరకు నభయమొసంగునట్టియు 30

ఏడు లోకములలోనున్న సిద్ధుల బృందములచే సేవింపబడుచున్న నరసింహా
కృతిగల పరంబ్రహ్మను నేను (నీలకంఠుడు) భూమియందు ప్రతిష్ఠింతును. 31

తన దరిజేరిన చేతనులందరకును ఐహికాముష్మిక ఫలములనొసంగు నా
మూర్తిని నీవు (దేవలుడు) స్నానశుద్ధవస్త్ర ఊర్ధ్వపుండ్రాదులను ధరించి షోడశోపచార
ములతో పూజింపుము. 32

బ్రహ్మాదులకేమి, ఇంద్రాదులకేమి సకల ప్రాణులకును ఆతడు నియంత.
అన్నిటి కంతరాత్మ కావున నీవు ఆతనియందు ఏకాగ్రమగు దృష్టిని నిలిపియుండుము. 33

లక్ష్మికి తోడైయుండు నారాయణు డచ్చట భాగవత ధర్మమును నిరంతరము
విడువక సంచరించుచుండును. ఈ ప్రాచీనాశ్రమమునందు పురములను దహించిన ఈశ్వ
రుడు సర్వదా సుఖముగ నివసించియుండును. 34

కావున నీ నీలకంఠుడు మహాత్ముడని యంతటను పేరెక్కియున్నాడు. చరాచర
ములగు సకల ప్రాణులకు నీతడు జీవగఱ్ఱ. 35

## శ్రీ నరసింహుని సాన్నిధ్యముచే కలిగిన మహాత్మ్యముగల నీలకంఠాశ్రమ వర్ణనము

ఇచ్చటనున్న చెరువు పవిత్రమైనది. పుణ్యమునిచ్చి తత్ఫలము ననుభవింప
జేయును. చేతనులకు చతుర్విధ పురుషార్థముల నొసంగును. శివుని యభీష్టముల నొసంగును.

ఇదియొక నూతనమైన ఈశ్వరుని తపోభూమి. మిక్కిలి పవిత్రమైనది. దీనికి
పుణ్యారణ్యమని పేరు. ఇచ్చట గావించిన తపస్సు స్థానబలముచే కోటిమడుంగులై ఫలము
నొసంగును. 37

అసౌ వక్త్రోపలవటః । పటుః పాపవినాశనే ।
సకృద్దర్శనమాత్రేణ । సర్వాభీష్టఫలప్రదః ॥ 38

నరకణ్ఠీరవతనోః । మన్దిరం త్విన్దిరాపతేః ।
శ్రీకణ్ఠార్చనతృప్తస్య । వైకుణ్ఠస్య మహాత్మనః ॥ 39

సింహాహార్యో హరః పాపాత్ । కృతశౌచ స్త్వ హోబిలే ।
నీలకణ్ఠాశ్రమ ఇతి । స్థానాని స్పృహరేః హరేః ॥ 40

ఏతేషా మపి పఞ్చానాం । స్థానానాం స్థాణుసేవితమ్ ।
స్థాన మేత త్సముద్దిష్టం । ప్రథితం సుప్రతిష్ఠితమ్ ॥ 41

నీలకణ్ఠాశ్రమం సింహ । మహీధరమహాహ్వయమ్ ।
మహితాశ్చర్యమాహాత్మ్య । భూమిః భూమి ర్నిరాగసామ్ ॥ 42

## పాణ్డవతీర్థమాహాత్మ్యమ్

కిఞ్చ వక్ష్యామి విప్రర్షే ! । సమాహితమనా శ్శృణు ।
ప్రాచీనబర్హిఃహరితి । శ్రీనివాసగిరేః సరిత్ ॥ 43

ప్రసృతా ప్రస్థత స్స్వామి । పుష్కరిణ్యవిదూరతః ।
విద్రావిణీ చా వద్యానాం । నిరవద్యేఽతి భూమిదా ॥ 44

మాయావినో మహావిష్ణోః । మహామాయాసమాశ్రయాః ।
పురా జ్ఞాతివధం కృత్వా । పాణ్డవాః చణ్డవిక్రమాః ॥ 45

సమేత్య యత్ర తత్రాప । న్నుత్తయే దీనమానసాః ।
కాళీయవ్యాళకాలేవ । వాసుదేవేన చోదితాః ॥ 46

సమ్పూర్ణమానసా శ్చక్రుః । అప్లవం విరుపప్లవాః ।
తుల్యప్రధ్వంసినీం మాయాం । మహిషాసురమర్దనీమ్ ॥ 47

ఈ యుపలవట మిచ్చటచే కలదు పాపములను వినాశమొనరించుటకో సమర్థమైనవి, ఒక్కసారి సందర్శించినంతనే సకలాభీష్టముల నొసంగును. 38

ఇది లక్ష్మీపతియగు నరసింహావి యాలయము. ఈ నరసింహుడు శ్రీకంఠుని తపస్సుచే ప్రసన్నుడైన పరమదైవము. 39

సింహాహార్యము, పాపహరము, కృతశౌచము, అహోబిలము, నీలకంఠాశ్రమము అనునవి శ్రీ నృసింహ పుణ్యక్షేత్రములు. 40

ఇట్లు రుద్రునిచే సేవింపబడిన పై యైదు స్థానములలోను యీ నీలకంఠాశ్రమము సుప్రతిష్ఠితమవి ప్రసిద్ధినిగాంచెను. 41

ఈ నీలకంఠాశ్రమమునకు సింహమహీధరమనెడు పూజ్యనామధేయ మొందు కలదు. ఇయ్యది యాశ్చర్యముల కొక అద్వితీయ ఖని ఇది పాపమూరులకు తాపకము.

## పాండవతీర్థ మహిమ

ఇంకనో దేవలమహర్షీ ! నే జెప్పునది స్వస్థచిత్తుడవై వినుము. వేంకటాద్రి యొక్క తూర్పు దిక్కునందు దాని చరియనుండి 43

స్వామిపుష్కరిణికి దగ్గరలో దోషములను పారద్రోలునట్టియు. స్వతఃదోషములు లేనట్టియు ఐహికైశ్వర్యము నొసంగునట్టియు 44

ఆశ్చర్యశక్తియుక్తుడగు శ్రీ మహావిష్ణువుయొక్క సంకల్పరూప జ్ఞానములచే సృష్టింపబడినట్టి నది యొకటి కలదు. 45

పూర్వము జ్ఞాతులగు కౌరవులను జంపి భయంకర పరాక్రమశాలులగు పాండవులు ఆ పాపమెట్లు పోవునా యని విచారించుచు, దీనమనస్కులై కాళీయసర్పమువలె నల్లనైన శరీరకాంతిగల (కాళియసర్పమునకు మృత్యువైన) శ్రీకృష్ణునిచే ప్రేరేపింపబడినవారై 46

అద్వైన్యముతీరిన మనస్సుకలవారై ఏ విధమైన ఉపద్రవముగాని లేక యీ నదియందు స్నానమొనరించిరి. మాలిన్యమును హరించునట్టియు, ఆశ్చర్యశక్తియుక్తమైనట్టియు మహిమను ముదిజంపిన కాశివి 47

సమ్పూజ్య సంస్తూయ తే ఽపి । శ్రీనివాస మధోక్షజమ్ ।
అతీన్ద్రియం సమభ్యర్చ్య । స్వామిపుష్కరిణీతటే ॥ 48

విరేసస శ్చుద్ధధియో । యయుః తస్మా ద్యథాగతమ్ ।
విధిజ్ఞావిమలప్రజ్ఞా । నానాజ్ఞాన విలాసినః ॥ 49

అమూ ముశ స్తి సరితం । తీర్థం పాణ్డవమి త్యతః ।
పశ్చా త్తస్యాః పుష్కరిణ్యా । నారాయణగిరిన్మహాన్ ॥ 50

## నారాయణగిరి ప్రభాతవర్ణనమ్

యస్య దర్శనమాత్రేణ । ముచ్య న్తే జ న్తవ స్స్వతః ।
సంవర్తోదితదుర్దర్శ । సహస్రకిరణప్రభః ॥ 51

తేజఃపుఞ్జై రశ్చితాశః । కఞ్జ కిఞ్జల్కపిఞ్జరః ।
పర్వతాధిపతి స్తత్ర । సుఖ మా స్తే సురో త్తమః ॥ 52

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే
నీలకణ్ఠాశ్రమవర్ణనే నీలకణ్ఠకృత నృసింహారాధనవిద్యాదికవర్ణనం నామ
ఏకత్రింశో ఽధ్యాయః.

---

# ద్వాత్రింశో ఽధ్యాయః

## నారాయణాద్రిస్థభైరవాఖ్యక్షేత్రపాలకోద న్తః

దేవలః —

కుక్షౌ వృషక్షితిభృతో । దివ్యదేశస్య వైభవమ్ ।
దేవదర్శన మా ఽఽచక్ష్వ । వైష్ణవం వైదికర్ష భః ॥ 1

ఆ స్వామి పుష్కరిణీ తీరమునందే పూజించి, స్తుతించి కంటికి గోచరించని జితేంద్రియుడగు శ్రీనివాసుని పూజించిరి. 48

అందుచే పాపదూరులై నిర్మల బుద్ధియుక్తులై యచ్చటనుంచి వచ్చిన దారినే యేగిరి. 49

శాస్త్రపద్ధతి నెఱింగినట్టియు, నిష్కలంక బుద్ధిశాలులైనట్టియు, సకలవిధజ్ఞాన వికాసచే ప్రకాశించునట్టి మహాత్ములిట్లు పాండవులు స్నానమొనరించుటచే దీనిని పాండవ తీర్థమని చెప్పనొడంగిరి. ఆ పుష్కరిణికి పశ్చిమభాగమున గొప్పదియగు నారాయణపర్వత మొకటి కలదు. 50

## నారాయణపర్వత మహిమ వర్ణనము

ప్రళయకాలమునం దుదయించిన కనులను మిఱిమిట్లు గొలుపు కిరణములుగల సూర్యునివలె వెలుంగునట్టియు, చూచినంతనే సకల ప్రాణులను స్వయముగ తరింప జేయునట్టియు 51

కాంతి సముదాయములచే దిక్కులకు మైపూతను బెట్టునట్టియు, శామర కేసర ములవలె పచ్చనగునట్టి యా పర్వతరాజముపై నా దేవాధికుడు సుఖముగా విరాజిల్లు చుండెను. 52

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శనుల సంవాదమున పీలకంఠాశ్రమవర్ణనలోని ఈశ్వరు డొనరించిన నృసింహారాధన విధి మొదలగు వానిని వర్ణించుట యనెడు ముప్పదియొకటవ అధ్యాయము

---

# ముప్పదిరెండవ అధ్యాయము

## నారాయణ పర్వతమందున్న భైరవుడు మొదలగు క్షేత్రరక్షకవృత్తాంతము

దేవలుడు —

వైదికశ్రేష్ఠా ! ఓ దేవదర్శనా ! వృషభాద్రి గర్భమునందున్న శ్రీ మహావిష్ణువు యొక్క దివ్యదేశ వైభవమును నాకెఱింగింపుము — 1

దేవదర్శనః —

శృణు దేవల! మేధావిన్! । సమాహితమనా మునే! ।
కణ్ఠీరవగిరే ర్వృత్తం । వైకుణ్ఠవసతే రిదమ్ ॥ 2

వైకుణ్ఠాదీన్ దివ్యలోకాన్ । సన్త్యజ్య భగవాన్ స్వయమ్ ।
మాయావీ తత్ర రసికః । శ్రీనివాసః పరః పుమాన్ ॥ 3

సర్వాఽఽవాసః సహస్రాక్షః । పరమాత్మా సనాతనః ।
ఇచ్ఛావృత్తప్రపఞ్చో ఽసౌ । హృషికేశ శ్చ కేశవః ॥ 4

తం దేశం రక్షతి సదా । భైరవః పరిచారకః ।
అసితైః సారమేయై శ్చ । ప్రమథైః మథితాసురైః ॥ 5

కాకోదరాలఙ్కృతాఙ్గ । స్ఫురత్ఖడ్గకపాలభృత్ ।
రవస్ఫూర్జడ్డమరుక । త్రిశూలః శూలిభృత్యకః ॥ 6

ప్రాచీనే తస్య దేశస్య । స్థితో ఽఞ్జనగిరే స్తటే ।
తరుణాదిత్యసఙ్కాశా । ఽఖిలాభీష్టఫలప్రదా ॥ 7

## గౌర్యా నారాయణాద్రితపఃకరణేన దుర్గాత్వ–శివార్ధశరీరత్వప్రాప్తిః

పరిభూతా పురా గౌరీ । దక్షయాగే పురారిణా ।
అన్తర్హితా ఽభూత్ ఉద్వేగాత్ । కపర్దీ చ తిరోదధే ॥ 8

ఆహర్తుకామా వామార్ధం । తనో స్తస్య హరస్య సా ।
తప స్తప్తుమనా స్తూర్ణం । ఆజగామ తటీ మిమామ్ ॥ 9

సమాహితమనా స్తస్యాం । సా తేపే దుర్గమం తపః ।
ఘోరేణ తపసా తాం తు । 'దుర్గే' త్యూచుర్మహర్షయః ॥ 10

దేవదర్శనుడు —

దేవల ! బుద్ధిశాలీ ! మననశీలా ! శ్రీ వైకుంఠవాసియగు శ్రీ నారాయణుని నృసింహాద్రి వృత్తాంతమును వినుము — 2

శ్రీమన్నారాయణునకు వైకుంఠాది దివ్యలోకములున్నను వానిని విడిచి స్వాధీన ప్రకృతిగల నా మహాత్ముడగు శ్రీనివాసుడా కొండయందే ప్రీతితో నివసించును. 3

సర్వాంతర్యామియును, వేయి కన్నులున్నవాడును, అనాదియు, సంకల్ప మాత్రముచే సకలలోక సృష్టికర్తయు, జితేంద్రియుడునగు నారాయణుడు ("ఈ కొండ యందే ప్రీతితో నివసించునని" వెనుకటి శ్లోకముతో నన్వయము) 4

రుద్రుని పరిచారకుడైన భైరవుడా ప్రదేశమునంతను నల్లని కుక్కలతోను, అనేక రాక్షస సంహారములను గావించిన ప్రమథగణములతోను కాపాడుచుండును. 5

ఆతడు తన శరీరమునంతను భయంకర పాములతో నలంకరించుకొని, తళ తళ మెఱయుచున్న విచ్చుకత్తితోను కపాలములను ధరించియుండి కాపాడుచుండును. ఈతడు రుద్రుని భక్తుడు. ఆతనిచేతిలో దబ దబ ధ్వనించు ఢక్కా త్రిశూలాద్యాయుధ ములు నుండును. 6

అయంజనాద్రి చరియయందు తూర్పుదిక్కున బాలసూర్యునిపోలిన కాంతికలిగి సకలాభీష్టముల నొసంగు 7

## నారాయణాద్రియందు తపస్సుచేసి పార్వతి దుర్గయై, శివుని అర్ధాంగియగుట

పార్వతి పూర్వకాలమున దక్షుని యజ్ఞమునందు శివుని నిమిత్తముగ పరాభవిం పబడి యంతర్ధానమయ్యెను. ఆ విచారమున రుద్రుడును అంతర్ధానమయ్యెను. 8

అంత నా పార్వతి యా రుద్రుని శరీరమునందలి యర్ధ వామభాగమును బడయ గోరి తపస్సును జేయనెంచి వెంటనే యీ పర్వతచరియ కేతెంచెను. 9

ఆమె యచ్చట నిశ్చలచిత్తయై దుశ్చరమైన తపంబొనరించుటచేతనే మహర్షు లామెకు 'దుర్గ' యని పేరిడిరి. 10

ప్రీతః కపర్దీ దత్త్వా ఽస్యై । శరీరార్ధం ప్రసాదతః ।
అర్ధనారీవపుః రుద్రో । యయౌ సో ఽపి యథాగతమ్ ॥ 11

పురారిదయితా పుణ్యా । పురుషార్థఫలప్రదా ।
సమీపే శ్రీనివాసస్య । సైషా ఽఞ్జనగిరే స్తటే ॥ 12

## అత్ర్యాదిపఞ్చాశన్మహర్షి ప్రశంసిత స్వామిపుష్కరిణీ మాహాత్మ్యమ్

స్వామిపుష్కరిణీ తత్ర । పురాణే పుణ్యపూరణీ ।
స్వర్భూపాతాళవాసిన్యాః । త్రిస్రోతసః ప్రసూతిభూః ॥ 13

త్రివిక్రమకృతో విష్ణోః । సపర్యాయై యదాత్మజా ।
సురజ్యేష్ఠేన నియమాత్ । కమణ్డలు సముద్ధృతా ॥ 14

యస్యా స్తీరే చ విన్దన్తి । చతుర్వర్గా నభీప్సితాన్ ।
సురానరా శ్చ తిర్యఞ్చః । ప్రపఞ్చీకృతకారణాః ॥ 15

మాహాత్మ్య మూచిరే తస్యాః । పరస్పర మతీన్ద్రియమ్ ।
అప్లుతా విమలప్రజ్ఞా । మునయో బ్రహ్మవాదినః ॥ 16

అత్రిః —

జపం కుర్వన్ అపాం మధ్యే । 'తద్విష్ణో'రి తి యః సకృత్ ।
స్వామిపుష్కరిణీస్నాతో । ముచ్యతే పాతకా త్స తు ॥ 17

వ్యాసః —

అవగాహ్య జలే స్వామి । పుష్కరిణ్యాః సమాహితః ।
వ్యపోహ్య భ్రూణహత్యాఘం । అశ్నుతే ఽభీష్టసమ్పదమ్ ॥ 18

వసిష్ఠః —

[illegible] స్నాయీ ద్వారిణి స్వామి । పుష్కరిణ్యాః స్మరన్ హరిమ్ ।
సప్తజన్మకృతం పాపం । సహసా స వ్యపోహతి ॥ 19

రుద్రుడును ఆమె తపస్సునకు మెచ్చి తన శరీరమున యథమపట్టు సగము భాగమామె కొసంగెను. అందుచే నాతదర్ధనారీశ్వరుడయ్యెను అట్లొసంగి తన దారినేగెను.

అంజనాద్రి దరియయందు శ్రీనివాసునికి ప్రక్కగా శివునకు ప్రియమైనట్టియు పుణ్యాత్ములకు చతుర్విధ పురుషార్థములను స్నానఫలముగా నొసంగునట్టియు 12

## అత్రి మొదలగు ఏబదిమంది మహర్షులు ప్రశంసించిన స్వామిపుష్కరిణీ మాహాత్మ్యము

మూడు లోకములను పావనమొనరించునట్టి గంగానదికి తల్లియగు ప్రాపీనమై సమస్త పుణ్యములను తానే యొసంగు స్వామిపుష్కరిణి కలదు. 13

త్రివిక్రమరూపధారియగు శ్రీ మహావిష్ణువుయొక్క ఆరాధనార్థమై దేవప్రముఖుడగు బ్రహ్మచే నీ పుష్కరిణికి బిడ్డయైన గంగ కమండలమునుండి యెత్తబడినది. 14

దేవతలుగాని, మనుష్యులుగాని, పశుపక్ష్యాదులుగాని యా పుష్కరిణీ తటమునందు తమకు కావలసిన పురుషార్థముల నన్నింటిని బడయగలుగుదురు. 15

వేదాధ్యయననిరతులును, నిర్మల జ్ఞానరాశులును నగు మునీశ్వరులు ఆ పుష్కరిణియందు గ్రుంకులిడి యొకరితో నొకరీ క్రింది విధముగ నా పుష్కరిణియొక్క వైభవమును వర్ణించిరి. 16

అత్రిమహర్షి —

స్వామిపుష్కరిణియందు స్నానమాడి నీటి మధ్యనిలచి 'తద్విష్ణోః పరమం పదం' అను మంత్రమునొక తడవ జపించినవాడు పాపదూరుడగును. 17

వ్యాసమహర్షి —

స్వామిపుష్కరిణీ జలములయందు నియతచిత్తుడై స్నానమొనరించినచో బ్రహ్మహత్యవంటి ఘోరపాపములను కూడ పరిహరించుకొని కోరిన సంపదలను బడయగల్గును. 18

వసిష్ఠుడు —

స్వామిపుష్కరిణియందు శ్రీహరిని దలంచుచు స్నానమును చేయువాడు యేడు జన్మల పాపము నొక్కక్షణమున బోగొట్టుకొనును. 19

పరాశరః —

యః కరోత్యా ప్లవం స్వామి । సరసీజలమధ్యతః ।
సో ఽతీత్య నిరయం సర్వం । బ్రహ్మభూయాయ కల్పతే ॥ 20

గౌతమః —

కీర్తయిత్వా జలే ఽన్యత్ర । 'స్వామిపుష్కరిణీ' తి యః ।
స్నాయా ద్ధ్యాయన్ శ్రీనివాసం । ముచ్యతే సో ఽతి పాతకాత్ ॥ 21

భరద్వాజః —

ప్రాత రుత్థాయ యే ప్రాజ్ఞాః । 'స్వామిపుష్కరిణీ'తి వై ।
కీర్తయ న్త్యాహితాత్మానః । తే యాన్తి పరమం పదమ్ ॥ 22

మనుః —

స్వామిపుష్కరిణీతీర్థ । జలం ప్రీతాః పిబన్తి యే ।
తే ఽపి నిర్ధూతపాప్మానో । యాన్తి బ్రహ్మ సనాతనమ్ ॥ 23

యమః —

స్వామిపుష్కరిణీకూలే । నరా నక్తం దివ ఙ్చ యే ।
వసన్త్య భోజనా స్తే ఽపి । లభేరన్ పరమం పదమ్ ॥ 24

యాజ్ఞవల్క్యః —

విగాహ్య స్వామిసరసో । జలం వీతక్లమా జనాః ।
ప్రార్థితం ప్రాప్నుయుః ప్రాజ్ఞాః । ప్రజాపతి రువాచ హ ॥ 25

హారీతః —

హరిం స్మరన్తః కుర్వన్తి । స్నానం స్వామిసరోజలే ।
వీతాంహసో వీతనిద్రా । విశన్తి విమలం పదమ్ ॥ 26

అఙ్గిరాః —

యే ఽనుతిష్ఠ న్త్యనుష్ఠానం । స్వామిపుష్కరిణీజలే ।
అనేకజన్మజనిత । మేషా మేనో వినశ్యతి ॥ 27

పరాశరుడు —

స్వామిపుష్కరిణీ జలములమధ్య స్నానమొనరించువాడు నరకములనన్నిటిని దాటిపోయి పరిశుద్ధాత్మ స్వరూపమును బడయును. 20

గౌతమః —

ఇతర తీర్థములలోనైనను 'స్వామిపుష్కరిణీ స్నానం' అని సంకల్పించి శ్రీనివాసుని తలంచుచు స్నానమొనరించిన సకల పాపములనుండియు విముక్తుడగును. 21

భరద్వాజమహర్షి —

తెల్లవారుయామున లేచి నిశ్చలచిత్తులై "స్వామిపుష్కరిణీ" యని యనుసంధించు బుద్ధిమంతులు పరమపదమును బడయుదురు. 22

మనువు —

స్వామిపుష్కరిణీ తీర్థమును ప్రీతితో గ్రోలినవారును పాపవిముక్తులై పరమాత్మ సాయుజ్యమును బడయుదురు. 23

యముడు —

స్వామిపుష్కరిణీ తీరమున ఒక పగలు ఒక రాత్రియును క్రమముగ నుపవాసముతో వసించువారు పరమపదమును బడయగలుగుదురు. 24

యాజ్ఞవల్క్యుడు —

స్వామిపుష్కరిణీ జలములలో స్నానమొనరించువారి క్లేశములన్నియునుపోయి వారు తమ కభీష్టమైన సకల పురుషార్థములను బడయుదురని ప్రజాపతి సెలవిచ్చెనని చెప్పెను. 25

హారీతుడు —

స్వామిపుష్కరిణిలో శ్రీహరిని తలంచుచు స్నానమొనరించు మానవులు పాపదూరులై నిద్రాది దోషవివర్జితులై శుద్ధ సత్వమయమైన పరమపదము నలంకరింతురు. 26

అంగిరసుడు —

స్వామిపుష్కరిణిలో స్నానమొనరించి స్నానానుష్ఠానములనండే నిర్వర్తించుకొనువారు అనేక జన్మార్జిత పాపరాశినంతను తొలంగించుకొందురు. 27

ఉశనాః —

ఉదీరయన్తి యే నిత్యం । 'స్వామిపుష్కరిణీ' తిచ ।
దుష్కర్మపఙ్కం నిర్ధూయా । ఋవతే తేఽపి సత్ఫలమ్ ॥ 28

సంవర్తః —

యే కీర్తయన్తి సర్వత్ర । సదా స్వామిసరోవరమ్ ।
తే ఽప్యనద్యం వినిర్ధూయ । నిరవద్యా భవన్తి వై ॥ 29

ఆపస్తమ్బః —

స్వామిపుష్కరిణీతోయే । స్నానపానాదికర్మ యే ।
కుర్వన్తి పాపస్తమ్భాః । తేపరిత్యజ్యా ఉప్లవన్తి సత్ ॥ 30

మరీచిః —

నారాయణగిరేః ప్రాన్తే । స్వామిపుష్కరిణీతటే ।
యః కిల్బిషీ వస త్యేకం । దినం నిష్కిల్బిషీ భవేత్ ॥ 31

మృకణ్డుః —

కణ్ఠీరవగిరేః కుక్షౌ । పక్షిరాడ్వాహహర్షకే ।
యః సేవతే స్వామిసరః । స నరః సురసఙ్గతః ॥ 32

పులస్త్యః —

క్రోడే వేఙ్కటశైలస్య । సరః క్రోడాభినన్దకమ్ ।
గాయతే యస్త్రిషవణం । స నరః సర్వసమ్మతః ॥ 33

కాత్యాయనః —

వైకుణ్ఠస్య ప్రీతికరే । కణ్ఠీరవగిరే స్తటే ।
స్వామిపుష్కరిణీం యోఽసౌ । సేవతే స మహాన్ భవేత్ ॥ 34

బృహస్పతిః —

కుఞ్జే ఽఞ్జనగిరేః స్వామి । పుష్కరిణ్యప్సు యో నరః ।
కృతాప్లవః సకృత్ సత్యం । కృతకృత్యో భవే న్నరః ॥ 35

ఉశనస్సు —

నిత్యమును "స్వామిపుష్కరిణీ" యని యనుచుండువారు పాపమనెడు బుర దను పూర్తిగ వదలించుకొని పుణ్యఫలములనన్నిటిని బడయగలుగుదురు. 28

సంవర్తుడు —

అంతట నన్నివేళలను "స్వామిపుష్కరిణీ" యని యనుచుండువారు సకల దోషరాశిని పారద్రోలి పరిశుద్ధులగుదురు. 29

ఆపస్తంభుడు —

స్వామిపుష్కరిణిలో గ్రుంకి యా తీర్థమునే త్రాగువారు స్తంభమువలె పాతు కొనియున్న పాపములనుండి విముక్తులై సచ్చిదానందాత్ముడగు సర్వేశ్వరుని సాయుజ్యమును బడయుదురు. 30

మరీచుడు —

పాపాత్ముడని లోకమున పేరునుబడసిన దుర్మార్గుడును, నారాయణపర్వతము నందున్న స్వామిపుష్కరిణీ తీర్థమున మునుకలిడి ఆ యొడ్డున నొక దినమంతయు నివ సించిన నిష్పాపుడై పోవును. 31

మృకండుడు —

నృసింహగిరి గర్భముననున్న నారాయణునకు మిక్కిలి అభీష్టమైన స్వామి పుష్కరిణి సేవించువాడు దేవత్వమును బడయును. 32

పులస్త్యుడు —

వేంకటాద్రికి వక్షోభాగమునందున్న వరాహస్వామి కభీష్టమైన స్వామిపుష్కరిణి యందు మూడు ప్రొద్దుల గ్రుంకులిడు వాడందరకును (శ్రియఃపతికి) ప్రియుడగును. (సర్వః = నారాయణః) 33

కాత్యాయనుడు —

శ్రియఃపతికి ప్రియమైన నృసింహాద్రి చరియలోనున్న స్వామిపుష్కరిణి సేవిం చువాడు సకలలోకారాధ్యుడగును. 34

బృహస్పతి —

అంజనాద్రియొక్క కుంజమునందున్న స్వామిపుష్కరిణీ తీర్థమున ఒక్కసారి స్నానము నొనరించిన మానవుడు కృతకృత్యుడగును. ఇది నిక్కము. 35

భృగువుః —

ప్రాత రుత్థాయా నుదినం । స్వామిపుష్కరిణీం స్మరన్ ।
గోఘ్నో యో మాస మాసీత । గోప్రదానాత్ స శుద్ధ్యతి ॥ 36

వాల్మీకిః —

స్వామిపుష్కరిణీతీరే । యో వసత్య ప పాతకీ ।
మాసం గోదానతః శుద్ధో । భవేత్ నర ఇతి శ్రుతిః ॥ 37

శఙ్ఖలిఖితౌ —

పారే స్వామిసరో విద్వాన్ । స్మార్తం శ్రౌతం కరోతి యః ।
సహస్రధా కృతం తేనే । త్యశన్తి బ్రహ్మవాదినః ॥ 38

శాతాతపః —

హవ్యకవ్యాత్మకంకర్మ । స్వామిపుష్కరిణీతటే ।
వార్ధుషిః నాస్తికో వా ఽపి । యః కరోతి స సత్ఫలః ॥ 39

బోధాయనః —

స్వామిపుష్కరిణీతీర । నివాసీ హరిమేధసః ।
అశ్వమేధాదికం యజ్ఞం । యః కరోతి మహేశ్వరః ॥ 40

మార్కణ్డేయః —

మృగరా డద్రికుహరే । హరే రానన్దదాయిని ।
కీర్తయన్ స్వామిసరసీం । నా వసీదతి మానవః ॥ 41

మాణ్డవ్యః —

గోవిన్దమన్దిరే స్వామి । పుష్కరిణ్యా స్తటే వసన్ ।
వాసుదేవపరో మర్త్యో । భవే ద్వాసవపూజితః ॥ 42

శాణ్డిల్యః —

ఆస్వామిపుష్కరిణీతీరే । పఞ్చకాలపరో వసన్ ।
వ్రపఞ్చతో భవే న్ముక్తః । పఞ్చోపనిషదాత్మకః ॥ 43

భృగువు —

గోహత్యను ప్రమాదవశమున గావించినవాడు ఒక నెలవరకును ప్రతిదినము వేకువన మేల్కాంచి స్వామిపుష్కరిణిని తలంచి గోదానమొనరించిన పాపదూరుడగును.

వాల్మీకి —

ఉపపాతకములను చేసినవాడు ఒక నెల స్వామిపుష్కరిణీ తీరమున వసించి గోదానమును చేసినచో శుద్ధుడగును. 37

శంఖలిఖితుడు —

స్వామిపుష్కరిణీ తీరమున నే బుద్ధిశాలియైనను శ్రౌతక్రియలనుగాని, స్మార్త క్రియలనుగాని గావించినచో నవి సహస్రగుణితములై ఫలప్రదములగునని బ్రహ్మవేత్తలు సెలవిత్తురని జెప్పెను. 38

శాతాతపుడు —

వడ్డివ్యాపారమొనరించి జీవించువాడుగాని, నాస్తికుడుగాని పితరుల నుద్దేశించి గాని, దేవతల నుద్దేశించిగాని కర్మల నీ స్వామిపుష్కరిణీ తీరమున చేసినచో వాడు మంచి ఫలమును బడయును. 39

బోధాయనుడు —

భగవదారాధన తత్పరుడగు మానవుడు స్వామిపుష్కరిణీ తీరమున వసించుచు అశ్వమేధాది యజ్ఞములను గావించునేని వాడు మహేశ్వరుడే యగును. 40

మార్కండేయుడు —

నారాయణునకు ప్రియమైన నరసింహాద్రి గహ్వరమునుండి స్వామిపుష్కరిణి నిరంతరమును కీర్తించుచున్నచో వాడెన్నడును చెడడు. 41

మాండవ్యుడు —

స్వామిపుష్కరిణీ తీరమునందున్న భగవదాలయములో నివసించుచు భగవంతుని ధ్యానించు మానవుడు దేవేంద్రునకును పూజింపదగినవాడగును. 42

శాండిల్యుడు —

స్వామిపుష్కరిణీ తీరమునుండి ప్రాతస్సంగవమాది ఐదువేళలయందును భగవదారాధనను నియమము తప్పక చేయుచుండినచో ముక్తుడై తిరిగి జన్మించక అప్రాకృత దివ్యదేహముతో నుండును. 4

కాశ్యపః —

యో నరః స్వామిసరసి । స్మరన్ శౌరిం కృతాప్లవః ।
కర్మనిర్మూలకో ఘోరః । కృతకృత్యో భవే త్సహి ॥ 44

కణ్వః —

స్వామిపుష్కరిణీతీర్థం । యః పిబేత్ చులుకత్రయమ్ ।
అహోరాత్రకృతం పాపం । తత్క్షణాదేవ నశ్యతి ॥ 45

అగస్త్యః —

ఇన్ద్రియైః కర్మభిః జ్ఞానైః । మనసా సహ యత్కృతమ్ ।
ఆప్లవాత్ స్వామిసరసి । త దేనః శుద్ధ్యతి క్షణాత్ ॥ 46

దుర్వాసాః —

కీర్తయేత్ స్వామిసరసీం । సహ సర్వేన్ద్రియై ర్హి యః ।
పూజ్యతే సిద్ధసఙ్ఘైః స । సనన్దసనకాదిభిః ॥ 47

విశ్వామిత్రః —

పవిత్రం స్వామిసరసి । స్పృష్ట్వా తోయం నిరేనసః ।
విజ్ఞానసమ్పదో విష్ణుం । ద్రష్టుకామా భవన్తిహి ॥ 48

శక్తిః —

పవిత్రవన్తః పరమాః । పఞ్చసన్మన్త్రవిగ్రహాః ।
భవన్తి తే ఒవగాహన్తే । యే స్వామిసరసీజలమ్ ॥ 49

శుకః —

స్వామిపుష్కరిణీ సైషా । పురాణీ పుణ్యపూరణీ ।
సురాణాఞ్చ నరాణాఞ్చ । తిరశ్చాఞ్చాత్మశోధినీ ॥ 50

యస్యాం కోలవపు ర్భూత్వా । శ్రీనివాసః పరః పుమాన్ ।
దేవీభిః శక్తిభి శ్చైవ । క్రీడానుగుణభూతిభిః ॥ 51

విచిత్రవివిధానేక । శృఙ్గయన్త్రధృతిక్రమైః ।
జలక్రీడాం వితనుతే । విశ్వాప్యాయకరీం సదా ॥ 52

శౌనకః —

సైషా హి స్వామిసరసీ । సమఞ్జసజగద్ధితా ।
కీర్తనస్నానపానైశ్చ । తాపత్రయనివారిణీ ॥ 53

నారదః —

మాధవానన్దజననీ । మదనజ్వరమాధినీ ।
మదయత్యాత్మజాతాని । స్వామిపుష్కరిణీ హ్యసౌ ॥ 54

క్రతుః

స్వామిపుష్కరిణీ సోమ్యా । సోమపీథీ సురర్షభః ।
యస్యా మవభృథస్నానం । కురుతే ఽద్యాపి విశ్వసూః ॥ 55

కుఞ్జరారిగిరేః కుఞ్జే । వ్యఞ్జితాఖిలభావనాః ।
సాధవః స్వామిసరసి । స్నానాత్ సంసారతారితాః ॥ 56

వేదప్రధానా విబుధా । యస్యాం స్నాత్వా నిరంహసః ।
విష్ణుం సాక్షాత్కర్తుకామాః । స్వామిపుష్కరిణీ హి సా ॥ 57

సత్యాషాఢః —

ఆషాఢానా మాశ్రమశ్రీః । ఆశ్రమాచారశాలినామ్ ।
అన్యేషాం భూతిభూమి శ్చ । సైషా స్వామిసరోఽభిధా ॥ 58

కుణ్డినః —

కుహరే సింహశైలస్య । సరసీస్వామిపూర్వికా ।
శీలాచారవతాం నృణాం । అశీలానా మపీ ష్టదా ॥ 59

హారీతః —

జయన్తి చా పదాం భూమిః । సమ్పదాం సర్వకామదా ।
సరసీ స్వామ్యుపపదా । సైషా విష్ణుపదీజనిః ॥ 60

సమస్త విచిత్ర శృంగయంత్రాదులతో (పిచికార్లు) తిత్తులతో ప్రపంచము నంతను ఆనందింపజేయు జలక్రీడను జరుపుచుండును. 52

శౌనకమహర్షి —

ఈ పుష్కరిణి జగత్తునకు యుక్తమైన హితము నొనగూర్చునదియై తన పేరు నుచ్చరించుటచేతను, స్నానము నొనరించుటచేతను తీర్థమును త్రాగుటచేతను తాపత్రయ ముల బాపునదిగానుండెను. 53

నారదుడు —

ఈ పుష్కరిణి శ్రియఃపతి కపారానందము నొనగూర్చును. కామవికారముల నణగించును, తననుండి పుట్టిన వానినన్నిటిని ఆనందముతో మదింపజేయును. 54

క్రతుమహర్షి —

ఈ స్వామిపుష్కరిణి మిక్కిలి సౌమ్యమైనది. అనేక క్రతువులనుజేసి సోమ పాన మొనరించిన స్వయంభువగు బ్రహ్మ దీనియందు దీక్షాంత స్నానముల నిప్పటికిని యాచరించును. 55

నృసింహ పర్వతమునందున్న లతాగృహములలో తమ తమ యభీష్టసిద్ధికై తపంబులనొనరించు సాధుపుంగవులు ఈ స్వామిపుష్కరిణిలో స్నానములను గావించి సంసారమును తరించిరి. 56

వేదైకశరణ్యులగు బ్రాహ్మణశ్రేష్ఠులు భగవంతుని సందర్శింపగోరి స్నానము లను గావించి విరోధులగు పాపములను పోగొట్టుకొనునదీ పుష్కరిణియందే. 57

సత్యాషాఢఋషి —

సన్యాసాశ్రమ ధర్మములను శ్రద్ధతో నాచరించువారిచ్చట గావించిన చాతుర్మాస్య వ్రతముజ్జ్వలమగును. ఇతరాశ్రమస్థులకు సకల సంపదల నొసంగును. 58

కుండినఋషి —

నృసింహపర్వత గహ్వరమునందున్న యీ స్వామిపుష్కరిణి సదాచారసంపన్ను లకుగాని, దురాచారులకుగాని సకలాభీష్టముల నిచ్చును. 59

హారీతుడు —

శ్రీవిష్ణు పాదములనుండి బుట్టిన నీ స్వామిపుష్కరిణి ఆపదలను బాపునది. సంపదలకు తావళము. సకలాభీష్టముల నిచ్చునది. 60

జైమినిః —

శిరస్యఞ్జలి మాబధ్నన్ । స్వామిపుష్కరిణీం స్తువన్ ।
స్మరన్ హరిం స్నానుష్ఠానం । యః కరోతి స పుణ్యభాక్ ॥ 61

స్నానం సకృత్ కుర్వతే యే । స్వామిపుష్కరిణీ జలే ।
హవ్యకవ్యేషు తే యోజ్యా । నరా నారాయణప్రియాః ॥ 62

జాబాలిః —

స్నానా దన్యేషు తోయేషు । స్వామిపుష్కరిణీం స్మరన్ ।
కృతకృత్యః కృతాత్మా స । మర్త్యః తత్ఫలమాప్నుయాత్ ॥ 63

పితామహః —

స్వామిపుష్కరిణీతీర్థ । పరిచర్యాపరో హి యః ।
స మర్త్యో వైష్ణవీం భూతిం । మర్త్యత్వే సమవాప్నుయాత్ ॥ 64

సనకః —

యస్యాస్తీరే నివసతి । శ్రీనివాసః పరాత్పరః ।
సా ధన్యా స్వామిసరసీ । సేవతే తాం య ఆత్మవాన్ ॥ 65

సనన్దనః —

విష్ణుపాదోద్భవం బ్రహ్మ । కరస్పర్శపవిత్రితమ్ ।
పవిత్రితేశానజటా । జూటం స్వామిసరోజలమ్ ॥ 66

సనత్కుమారః —

యా పునాత్యాప్లవాత్ సమ్యక్ । భువనాని చతుర్దశ ।
స్వామిపుష్కరిణీ ధన్యా । సా సర్వఫలదాయినీ ॥ 67

వాసుదేవః —

సరాంసి యాని దివ్యాని । సన్తి త్రిజగతీతలే ।
తేషా మేషా స్వామినీ హి । 'స్వామిపుష్కరిణీ' త్యతః ॥ 68

సనాతనః —

యే నరాః ప్రాత రుత్థాయ । తా మిమాం కీర్తయన్తి తే ।
స్వామిపుష్కరిణీం భక్త్యా । విశన్తి విమలం పదమ్ ॥ 69

జైమినిఋషి —

కరములను శిరమునజోడించి, స్వామిపుష్కరిణీ తలంచుకొనుచు నారాయణుని ధ్యానించుచు తమ విధ్యుక్త ధర్మములను జేయువారు పుణ్యాత్ములు. 61

ఈ పుష్కరిణిలో నొక్కసారియైనను స్నానమును చేయువారు పావనులు. నారాయణునకెంతో ఇష్టులు. హవ్యకవ్యములతో వారిని ఆమంత్రించవలెను. 62

బాజాలి —

ఇతర నదులలో స్నానమొనరించుచున్నను అది స్వామిపుష్కరిణీ స్నానమనియే భావించి గావించినచో మానవుడు కృతకృత్యుడగును. ఆ పుష్కరిణీ స్నానఫలమునే బడయును. 63

బ్రహ్మ —

ఈ స్వామిపుష్కరిణీ జలముతోనే నిత్యమును భగవదారాధనను గావించువాడు మనుష్యుడుగా భూమండలమున జన్మించియున్నను శ్రీవైష్ణవ శ్రీని చేబట్టును. 64

సనకుడు —

శ్రీనివాసుడీ స్వామిపుష్కరిణీ తీరమునందు వేంచేసియుండుటచే నిది చాల ధన్యమైనది. దీనిని సేవించువాడు లబ్ధసత్త్వకుడు. 65

సనందుడు —

ఈ స్వామిపుష్కరిణీ తీర్థము శ్రియఃపతి పాదారవిందములనుండి పుట్టినది. చతుర్ముఖుడు దీనిని చేతితో తాకుటచే పవిత్రమైనది. ఈశ్వరుని జడలలో నుండుటచే పావనమొనరింపబడినది. 66

సనత్కుమారుడు —

తనలో స్నానమొనరించుటచే పదునాలుగు లోకములను పవిత్రమొనరించు నీ స్వామిపుష్కరిణి ధన్యమైనదై సకల ఫలముల నొసంగును. 67

వామదేవుడు —

మూడు లోకములయందున్న సరస్సులన్నింటికిని యీ స్వామిపుష్కరిణి రాణీ వంటిది. 68

సనాతనుడు —

ఉదయముననే లేచి భక్తితో స్వామిపుష్కరిణిని గూర్చి ఉచ్చరించిన మానవులు శుద్ధ సత్త్వమయమైన పరమపదమును చేరుదురు. 69

దేవదర్శనః —

ఇ త్యూచివాంసో విద్వాంసః । కృతకృత్యా హ్యమర్షణాః ।
తస్యా స్తీరే పుణ్యభూమౌ । ఆసతే మునిపుఙ్గవాః ॥ 70

క్వచిత్ కదాచిత్ క్రీడార్థం । దివ్యైః పరిజనై స్సహ ।
శేషసేనేశగరుడైః । ప్రధానై స్సేవితం శుభమ్ ॥ 71

సేవమానాః శ్రీనివాసం । సాక్షాత్ అక్షిపథం గతమ్ ।
చతుర్భుజ ముదారాఙ్గం । అతసీగుచ్ఛసచ్ఛవిమ్ ॥ 72

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే
అత్ర్యాదిపఞ్చాశన్మహర్షికృత స్వామిపుష్కరిణీప్రశంసనం
నామ ద్వాత్రింశోఽధ్యాయః.

---

# త్రయస్త్రింశో ఽధ్యాయః

## దైత్యోపద్రవజ్ఞాపనార్థం బ్రహ్మాదీనాం క్షీరసాగరగమనమ్

దేవలః —

స్వామిపుష్కరిణీకూలే । నారాయణగిరే ర్భృగౌ ।
ఆవిర్భావః కథం విష్ణో । శ్రీనివాసస్య శార్ఙ్గిణః ॥ 1

దేవదర్శనః —

శృణు బ్రహ్మన్ ! సమాచక్షే । సమాహితమనా మునే ।
ప్రశ్నం సర్వాణ్డగర్భస్య । ప్రాదుర్భావాత్మకం విభోః ॥ 2

పురా దుర్మేధసా దైత్య । ప్రవరేణా మరారిణా ।
పీడితా రుద్రశక్తేన । భృశం బ్రహ్మాదయ స్సురాః ॥ 3

దేవదర్శనుడు —

జితేంద్రియులగు మునిపుంగవులిట్లు పలికినవారై తమను కృతకృత్యులుగా భావించి పరమపవిత్రమైన ఆ నదీతీరప్రదేశమున నివసించిరి. 70

ఆ ప్రదేశమొకానొక సమయమున నారాయణునిచే అనంత గరుడ విష్వక్సేనాది ప్రముఖ ప్రియ పరిజనముతోపాటు విలాసముగా నాదరింపబడిన మంగళకరమైనది. 71

ఆ స్థలమున నీ ఋషిపుంగవులందరును ప్రత్యక్షముగ దర్శనమొసంగుచున్న నాలుగు భుజములను కలిగి మహోన్నత దివ్యమంగళ విగ్రహము చీకటి వృక్షపుష్పగుచ్ఛ చ్ఛాయతో వెలుంగుచుండ సేవించుచుండిరి. 72

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శన సంవాదమున అత్ర్యాది యేబదిమంది ఋషులచే గావింపబడిన స్వామిపుష్కరిణీప్రశంస యనెడు ముప్పదిరెండవ అధ్యాయము.

---

# ముప్పదిమూడవ అధ్యాయము

## రాక్షసులు గావించు ఉపద్రవములు నెఱింగించుటకై బ్రహ్మాదిదేవతలు క్షీరసాగరమునకేగుట

దేవలుడు —

నారాయణాద్రి తుంగముననున్న స్వామిపుష్కరిణీ తీరమున శారంగధారియైన శ్రీ మహావిష్ణువునకు శ్రీనివాసుని యవతారమెట్లు సంభవించెనో తెలుపుమనగా 1

దేవదర్శనుడు —

ఓ పూజ్యుడవైన దేవలమహామునీ! బ్రహ్మాండములనన్నిటిని తన కడుపున నిడుకొనిన నారాయణుని యవతార విశేషమును గురించి చెప్పెదను స్వస్థచిత్తుడవై వినుము.

పూర్వము శివునికి భక్తుడగు దుర్బుద్ధియైన చైత్యుడను రాక్షసునిచే బ్రహ్మాది దేవతలందరును బాధింపబడినవారై 3

శాన్తాగ్నిసదృశాః శుష్క । వదనాః శోకవిహ్వలాః ।
పరాజితా జడాత్మానః । కింకర్తవ్యావివేకినః ॥ 4

దైత్యారిం శరణం ప్రాప్తుం । ప్రయతా యతమానసాః ।
క్షీరాబ్ధిం ప్రాపు రప్రాప్త । స్వావాసా స్తస్య శాన్తయే ॥ 5

తుష్టువు స్తత్ర దైతేయ । విధ్వంసనవిచక్షణమ్ ।
లక్ష్మ్యుపలక్షితం విష్ణుం । విశ్వరక్షణదీక్షితమ్ ॥ 6

## బ్రహ్మాదికృత క్షీరాబ్ధిశాయి స్తుతిః

దేవాః —

ఓం నమో దేవదేవాయ । పూర్వదేవాయ ఖడ్గినే ।
శ్రీవత్సాఙ్కాయ చ నమః । పరస్మై పరమాత్మనే ॥ 7

నమః పరస్మై వ్యూహాప । వ్యూహాన్తరవిభూతయే ।
విభవాయ నమ స్తస్మై । విశ్వాన్తర్యామిణే ఽణవే ॥ 8

అర్చావతారాయ నమః । అజన్మనే జన్మభాజినే ।
మాయావినే జగత్స్రష్ట్రే । లక్ష్మీనారాయణాత్మనే ॥ 9

జగత్ప్రత్యవరోహాయ । జగదానన్దినే నమః ।
జగన్మఙ్గళభూతాయ । జాహ్నవీజనకాఙ్ఘ్రయే ॥ 10

జఙ్గమాజఙ్గమజగ । ద్ధాతుః జననకారిణే ।
జనార్దనాయ జమ్భారేః । అనుజాయ నమో నమః ॥ 11

శ్రియఃపతేః నమ స్తుభ్యం । సభ్యసన్దోహసఙ్గినే ।
సదావిష్ణో మహావిష్ణో । విష్ణో ఽపారాదిరూపిణే ॥ 12

నమో నళిననేత్రాయ । నేత్రభూతాయ నాకినామ్ ।
నారాయణాయ నాథాయ । నాగభోగశయాయ తే ॥ 13

ప్రజ్వలించి, ప్రజ్వలించి చల్లారిన నిప్పువలెనైనవారై యెండిన నోళ్లు కల వారై భయభీతులై రాక్షసులచే నోడింపబడి చైతన్యశూన్యులై 4

యేమిచేయుటకును తోచనివారై, స్థానభ్రష్టులై, బాహ్యాంతఃకరణములను స్వాధీనపరచుకొన్నవారై రాక్షసహంతయగు నారాయణుని తమ దుఃఖశాంతికై వేడుటకై పాలసముద్రమున కేగిరి. 5

అచ్చట సకలలోకములను రక్షించెదనని కంకణమును కట్టుకొని కూర్చున్న లక్ష్మీ నారాయణుని రాక్షస సంహారదక్షుడవు నీవేయని యిట్లు స్తోత్రమును చేయుట కారంభించిరి.

## బ్రహ్మాదులు గావించిన క్షీరాబ్ధినాథ స్తోత్రము

దేవతలు —

దేవతలందరకును దేవుడైనట్టియు, వారందఱకంటెను ముందుగనే యున్నట్టియు, విచ్చుకత్తిని చేబట్టియు, శ్రీవత్సమనెడు మచ్చను నిరూపకముగా కలిగియున్నట్టియు, పరాత్పరుడై యున్న పరమాత్మకే యీ యాత్మలన్నియు శేషభూతమైనవి. అంతియేగాని స్వతంత్రమైనవికావు, 7

పరవాసుదేవ స్వరూపుడును, వ్యూహవాసుదేవ స్వరూపుడును, వ్యూహాంతరములను విభూతిగలవాడును, మత్స్యకూర్మాద్యవతార స్వరూపుడును, సర్వాన్తర్యామిత్వమునకు తగిన సూక్ష్మరూపుడగు శ్రియఃపతికి వందనము. 8

అర్చామూర్తియై ఆలయములలో వేంచేసియున్న నారాయణునకు నమస్కారము. కర్మకృతజన్మ లేకున్నను సంకల్పముచే నవతరించు శ్రీ మహావిష్ణువునకు వందనము. సంకల్పమయుడై జగత్తును సృష్టించు లక్ష్మీనారాయణమూర్తికి వందనము. 9

దుష్టశిక్షణ, ధర్మరక్షణకై భూలోకమున నవతరించునట్టియు, భక్తలోకమునకానందప్రదుడగునట్టియు, లోకములన్నిటికి మంగళముల నొసంగునట్టియు, గంగకు బుట్టినిల్లగు పాదముగల శ్రియఃపతికి నమస్కారము. 10

స్థిరచర రూపమైన జగత్తునకాధారభూతుడైనట్టియు, చతుర్ముఖునికి జనకుడైనట్టి ఉపేంద్రుడైన జనార్దనస్వామికి పదే పదే వందనము. 11

లక్ష్మీనాథ! నీకు వందనము, సజ్జనబృందసంగతా! వందనము. సర్వదా సర్వత్ర వ్యాపించేయుండు మహావిష్ణో! నీకంటె ముందుగ నొక్క శరీరధారినైనను లేనివాడా! నమస్కారము. 12

పుండరీకాక్ష! వందనము. దేవతలకు (నాయకుడా) మార్గదర్శకుడా! ప్రధానుడా! వందనము, నాగపర్యంకమున పవళించు సర్వలోకనాధుడవగు నారాయణా! వందనము. 13

విశ్వేశ్వరాయ విశ్వాయ । విశ్వాతీతాయ తే నమః ।
విశ్వాధ్యక్షాయ వీశాన । వాహనాయాదివేధసే ॥ 14

నిత్యాయ నిరవద్యాయ । నిరాకారాయ నీతయే ।
నిస్సీమకల్యాణగుణ । గణాతీతాయ తే నమః ॥ 15

సచ్చిదానన్దసన్దోహ । దేహవృద్ధి క్షయాక్షమ ।
అచ్యుతానన్తగోవిన్ద ! । నమ స్తుభ్యం మహాత్మనే ॥ 16

అపారకరుణామ్భోధే । నిస్తరఙ్గాత్మనిశ్చల ।
లక్ష్మీవిలక్షణవిభో । విచక్షణ ! నమోఽస్తు తే ॥ 17

ఋత ! సత్య ! పరబ్రహ్మ ! । కృష్ణ ! పిఙ్గళపూరుష ! ।
ఊర్ధ్వరేతాః ! విరూపాక్ష ! । విశ్వరూప ! నమోఽస్తు తే । 18

నమో నమః కారణకారణాయ । నమో నమోఽనన్తమహావిభూతయే ।
నమో నమః శఙ్కరచాపహారిణే । నమో నమః శాశ్వతశార్ఙ్గధన్వనే ॥ 19

నమోఽన్తరాదిత్యహిరణ్యరూప ! । నీరూప ! తుభ్యం పురుషోత్తమాయ ।
నమో నమోభిః నిగమాన్తభూతైః । కృతస్తుతప్రస్తుతభావనాయ ॥ 20

ప్రసీద పుణ్డరీకాక్ష ! । ప్రసీద పురుషోత్తమ ! ।
ప్రసీద పరమానన్ద । ప్రసీద పరమేశ్వర ॥ 21

ప్రసీద కమలాకాన్త ! । ప్రసీద కరుణాకర ! ।
ప్రసీద భక్తార్తిహర । ప్రసీద విబుధర్షభ ॥ 22

## బ్రహ్మాదీనాం పురతః క్షీరార్ణవాత్ లక్ష్మీసఖీ ప్రాదుర్భావః

దేవదర్శనః —

దేవ మేవం స్తుతవతాం । దేవానాం మహితాత్మనామ్ ।
హిరణ్యగర్భపూర్వాణాం । భవిష్యద్భూతభావినామ్ ॥ 23

సమస్త ప్రపంచమునకు నియంతయగువాడా ! ప్రపంచమును శరీరముగా గలవాడా ! లౌకికవికారదూరుడా ! నీకు వందనము. సకల విశ్వసాక్షిభూతా ! గరుడ వాహనా ! అద్వ్యబ్రహ్మస్వరూపుడా ! వందనము. 14

నిత్యుడా ! దోషదూరుడా ! ప్రాకృతాకరరహితుడా ! ధర్మసంస్థాపకా ! నిరవధిక అసంఖ్యాక మంగళగుణగణములకు నిధియైనవాడా ! నీకు వందనము. 15

సత్ చిత్ ఆనందనిధీ ! వృద్ధిక్షయములను సహించని దివ్యమంగళవిగ్రహా ! భక్తులను భంగపరచనివాడా ! గుణములకంతులేనివాడా ! మహాత్మా ! గోవిందా ! నీకు వందనము. 16

హద్దుమీరిన దయాసముద్రుడా ! నిర్వికారమగు మనస్సుతో చలించనివాడా ! సర్వలోక విలక్షణమైన శ్రియఃపతీ ! (లక్ష్మికి నిరుపమ వల్లభా !) విలక్షణముగ గీతాదులను పలుకువాడా ! నీకు వందనము. 17

సత్కర్మఫలభూతా ! చేతనాచేతననియన్తా ! స్వరూపముచేతను గుణముచేతను అంతటను నిండియుండువాడా ! పరమానందస్వరూపుడా ! బంగరువలె స్పృహణీయమైన విగ్రహధారీ ! నిత్యబ్రహ్మచారీ ! చంద్రసూర్య నేత్ర ప్రపంచశరీరీ ! నీకు వందనము.

కారణ పదార్థములకన్నిటికిని పరమకారణుడా ! నీకు వందనము. అపరిచ్ఛిన్న నియామ్యపదార్థములు కలవాడా ! నీకు నమస్కారము. శివధనుర్భంజకా ! వందనము.

సూర్యమండలవర్తీ ! స్పృహణీయవిగ్రహా ! వందనము. ప్రాకృతరూప రహితా ! బద్ధముక్త నిత్యవిలక్షణా ! పలుమారు నీకు వందనము. ఉపనిషత్ప్రిద్ధస్తుతి వాక్యములచే స్తోత్రముచేయబడువాడా ! నీకు నమోవాకములు 20

కమలదళాయతేక్షణా ! అనుగ్రహింపుము. త్రివిధచేతనాచేతనవిలక్షణా ! నిరవధికానందస్వరూపా ! అనుగ్రహింపుము. సర్వనియన్తా ! అనుగ్రహింపుము. 21

లక్ష్మీపతే ! అనుగ్రహింపుము. దయానిధే ! అనుగ్రహింపుము. భక్తుల బాధల బాపువాడా ! అనుగ్రహింపుము. దేవదేవా ! అనుగ్రహింపుము. 22

## బ్రహ్మాదుల యెదుట పాలసముద్రమునుండి లక్ష్మీదేవి సహచరి యావిర్భవించుట

దేవదర్శనుడు ——

ఇట్లు స్తోత్రమును చేయునట్టి పూజనీయులను, త్రికాలజ్ఞులను నగు బ్రహ్మ మొదలగు దేవగణముల ముందు 23

ప్రాదుర్బ భూవ పురతః । క్షీరాబ్ధే ర్దుహితుః సఖీ ।
పుణ్డరీకనిభా సా ఽపి । పుణ్డరీకాయతేక్షణా ॥ 24

పుణ్డరీకాఽననా పుణ్యా । పుణ్డరీకాక్షశాసనాత్ ।
అఖిలక్లేశహారిణ్యా । వ్యాహారిణ్యార్థసమ్పదామ్ ॥ 25

లక్ష్మీసఖీ కథితభగవదావాసజ్ఞాపన పూర్వకాభయోక్తిః

సుధాం స్రవన్త్యా వాచా చ । బభాషే తాన్ దివౌకసః ।
స్వాగతం భవతా మస్తు । కార్యసిద్ధి శ్చ దేవతాః ॥ 26

బాధా క్వచి దిదానీం కిం? । సురా దైత్యాసురై రపి ।
తేషా న్తు నిధనం కర్తుం । ధ్రువ మవ్యాజరక్షకః ॥ 27

శ్రీవత్సలక్షణ శ్శార్ఙ్గీ । దక్షిణో వ శ్చ రక్షణే ।
మా భైషిష్ట సురా యూయం । మాప్రత్యూహో భవిష్యతి ॥ 28

అచిరా ద్భగవాన్ విష్ణుః । శ్రీనివాసః స్వరా డ్విభుః ।
ప్రత్యక్షో భవితా వ శ్చ । సర్వం సిద్ధం సమీహితమ్ ॥ 29

ఆమోదాదీన్ దివ్యలోకాన్ । సన్త్యజ్య భగవా న్హరిః ।
ఇదానీం రమతే లక్ష్మ్యా । నారాయణగిరే స్తటే ॥ 30

స్వామిపుష్కరిణీతీరే । సర్వాన్తర్యామ్యధోక్షజః ।
సహస్రశీర్షాపురుషః । సహస్రాక్షః సహస్రపాత్ ॥ 31

త దితో దక్షిణం భాగం । భూమే ర్గచ్ఛత సత్వరాః ।
అవిఘ్న మస్తు వః కార్యం । బ్రహ్మేన్ద్రత్రిదివౌకసః ॥ 32

ఇత్యుక్త్వా తుసఖీ లక్ష్మ్యాః । సహసా ఽన్తర్దధేపి చ ।
తస్యాః శ్రుత్వా వచో విష్ణు । పత్నీసఖ్యాః సమాహితాః ॥ 33

పాలసముద్రమునుండి తెల్లతామరను బోలినట్టియు. తెల్లతామర దళమువలె విశాలమైన నేత్రములు కలదియు నగు పాలకడలిపట్టికి సఖియగు నొక దివ్యసుందరి యావిర్భవించెను. 24

పద్మమువంటి సుందరమైన ముఖముగలదియు, పుణ్యరూపియు, ప్రేక్షకుల వ్యధలను బాపునట్టియు శ్రియఃపతి యాజ్ఞచే సమస్త సంపదలను సమకూర్చునట్టి యా సుందరాంగి 25

## లక్ష్మీసఖి భగవంతుని స్థానమును చెప్పుచు దేవతలకభయము నొసంగుట

ఆ దేవతను గూర్చి అమృతరసస్యందియగు వాక్కుతో నిట్లు పల్కెను. ఓ దేవతలారా ! మీకు స్వాగతమగుగాక ! మీరేతెంచిన కార్యము సఫలమగుగాక ! 26

ఓ దేవతలారా ! మీకు దైత్యులవలనగాని, రాక్షసులవలనగాని ఏమైనను బాధలు కలుగుచున్నవా ఏమి ? నిర్నిమిత్త భక్తరక్షకుడగు నారాయణుడు ఆ రాక్షసులను సంహరించుటకై నిశ్చయముగ సంసిద్ధుడై యున్నాడు. 27

శ్రీవత్సమును వక్షస్థలమందుగల నా నారాయణుడు శారంగమను ధనుస్సును చేబూని మిమ్ములను గాపాడుటలో సమర్థుడు. మీరు భయపడకుడు. మీకిక నంతరాయము లుండవు. 28

అకర్మవశ్యుడును బహు అవతారముల నెత్తువాడును సర్వవ్యాపకుడునగు శ్రీనివాసుడు త్వరలో మీకు దర్శనమొసంగును. మీ కోరికలన్నియు నీడేరినట్లే. 29

జ్ఞానశక్తి బలైశ్వర్యాదిషడ్గుణపూర్ణుడైన శ్రీ మహావిష్ణువు ఆమోద ప్రమోద సంమోదాది లోకములను విడిచి యిప్పుడు లక్ష్మితో నారాయణాద్రియందు ప్రీతితో వర్తించుచున్నాడు. 30

వేయి తలలుకలవాడు, వేయి కన్నులను కాళ్ళను కలవాడు, అన్నిటిలోను అంతర్యామిగానుండి శాసించువాడు, స్వాధీనసకలేంద్రియుడు నగు స్వామి స్వామిపుష్కరిణీ తీరమున నివసించుచున్నాడు. 3

కావున మీరిప్పుడు వెంటనే భూమికి దక్షిణ భాగమువైపు యేగుడు. మీపని నిరాఘాటముగ నెఱవేరును. 32

అని లక్ష్మి సహచరి బ్రహ్మేంద్రాది దేవతలను గూర్చి పలికి వెంటనే యదృశ్యమయ్యెను. ఆ సఖీవచనములను విన్నవారై దేవతలందరును స్వస్థచిత్తులై 33

ప్రణమ్య దణ్డవ ద్దేశం । తం పరీయుః ప్రదక్షిణమ్ ।
సవిస్మితమనసా దేవా । సావధానాః ససమ్భ్రమాః ॥
తస్మా ద్దక్షిణతో భూమి । భాగం గన్తుం ప్రచక్రముః ॥ 34

## బ్రహ్మాదీనాం క్షీరార్ణవాత్ శ్రీనారాయణాచలాగమనమ్

తత స్తే విబుధా స్సర్వే । పరమేష్ఠిపురోగమాః ।
భూయో నారాయణగిరేః । పాదా నాశ్రియు ర్ముదా ॥ 35

పుణ్యాతిపుణ్యతోయాని । సరాంసి సరిత శ్చ హి ।
సేవమానాః కృతాతిథ్యాః । సిద్ధసఙ్ఘై శ్చ తాపసైః ॥ 36

మిథునైః కిన్నరాణాం హి । లతాగృహనివాసిభిః ।
గీయమానాని గీతాని । ప్రాదుర్భావాత్మకాని చ ॥ 37

మన్ద్రమధ్యోచ్చమహిమ । మాధురీధూర్వహాణిచ ।
శిలాతలేషుశృణ్వన్తః । సర్వాయేషుసమాశ్రితాః ॥ 38

సప్తతన్త్రీనాదగర్భ । సప్తస్వరవిభావనమ్ ।
వేణువీణామృదఙ్గాఢ్యం । నవనాట్యరసాన్వితమ్ ॥ 39

ఆవిర్భావాత్మకం కాల । శ్రుతికల్పితమూర్ఛనమ్ ।
అప్సరోగణసఙ్గీతం । లోకయన్తో ఒథ తే శనైః ।
వీతక్లేశా వీతమోహాః । విమలానన్దభావనాః ॥ 40

## స్వామిపుష్కరిణీవర్ణనమ్

నారాయణాద్రౌ ప్రాపు శ్చ । సామిపుష్కరిణీతటమ్ ।
క్రౌఞ్చైః కారణ్డవై ర్హంసైః । సారసై స్సరసస్వరైః ॥ 41

తారాభి శ్చ బలాకాభిః । అన్యై ర్వనవయోగణైః ।
విబిడాన్తరకల్లోల । కోలాహలసమాకులమ్ ॥ 42

ఆ దివ్యదేశమునకు సాష్టాంగముగ ప్రణమిల్లి దానికి ప్రదక్షిణ మొనరించిరి. వారు మిక్కిలి తొందరలోనున్నను సావధానముగ మాత్రముండిరి. అచ్చటినుండి దక్షిణ భాగమున్గూర్చి బయలువెడలిరి. 34

## బ్రహ్మాదులు క్షీరసాగరమునుండి నారాయణాద్రి కేతెంచుట

అటుపిమ్మట బ్రహ్మను పురస్కరించుకొనిన ఆ దేవతలందరును తిరిగివచ్చి నారాయణాద్రి ప్రత్యంతప్రాంతముల నానందముతో నాశ్రయించిరి. 35

నిరతిశయ పుణ్యప్రదములగు తీర్థములతో నిండిన పెద్ద చెరువులను, నదులను సేవించుచు సిద్ధులయొక్కయు, తాపసులయొక్కయు సంఘములచే నతిథిపూజలు గావింపబడిరి. 36

పొదరిండ్లలో నివసించు కిన్నర మిథునములచే మందమధ్యమ ఉచ్చైస్స్వరములతో పాడబడుచున్న మధురరసభరితములగు భగవదవతారకథా సందర్భములతో గూడియున్న గీతములను వినుచు సర్పములు పరుండియున్న పెద్ద బండలున్నవి. 37,38

సప్తస్వరములను పలుకు సప్తతన్త్రులను ప్రయోగించు వీణలు, పిల్లనగ్రోవులు, మద్దెలధ్వనులతో నాట్యానుగుణ నవరసములతో నొప్పుచున్న 39

భగవదవతారములను గూర్చిన అప్సరస స్త్రీజన సంగీతమును అనుభవించుచు వారలను జూచుచు, వారు మెల్లమెల్లగా యాత్రాయాసమునుబాపి విగతమోహులై దుఃఖ గంధరహితానందము ననుభవించుచు 40

## స్వామిపుష్కరిణీ వర్ణనము

నారాయణాద్రియందున్న స్వామిపుష్కరిణీ తీరమునకు చేరిరి. (ఆ తీరవర్ణనము) రసవంతమైన కూతలుగల కొంగలు, కన్నెలేడి పక్షులు, హంసలు, బెగ్గురులు 41

తెల్లకొక్కెరలు, ఇంకను అనేక అడవి పక్షిసమూహములచేతను, పుష్కరిణియందలి తరంగధ్వనులచేతను నిండియున్నట్టియు 42

తమాలై స్తిలకై ః పూగై ః । నారికేళై శ్చ పాటలైః ।
కేతకై స్సురపున్నాగైః । పున్నాగైః పుత్రదీపకైః ॥ 43

జమ్బీరై శ్చమ్పకై శ్చూతైః । లికుచైః కుటజై ర్ధవైః
మన్దారైః కేసరై శ్శ్వేత । మన్దారైః హరిచన్దనైః ॥ 44

కింశుకాశోకసన్తాన । సాలనీపహరీతకైః ।
శ్రీవృక్షై శ్చన్దనై ర్బిల్వైః । కదళీభిశ్చ దాడిమైః ॥ 45

మాతులుఙ్గైః కురవకైః । కున్దైఃఆమలజమ్బుభిః ।
సమన్తత స్సమాకీర్ణం । సాన్ద్రచ్ఛాయై శ్చభూరుహైః ॥ 46

వీరుద్భి ర్ద్రుమనీభి శ్చ । మాధవీమాలతీ ధ్రవైః ।
ఫలపుష్పద్రుమైః ఫుల్లైః । మల్లివనజాతిభిః ॥ 47

జాతీభి శ్శతపత్రీభిః । పరాభి ర్విష్ణుపర్ణకైః ।
తులసీకృష్ణతులశీ । పళర్ణతులసీశతైః ॥ 48

సన్ధ్యావనై స్త్రిసంధీభిః । జపాభిః కరవీరకైః ।
శృఙ్గబేరైః హరిద్రాభిః । కర్పూరైః రజనీకులైః ॥ 49

పనసై రార్ద్రపనసైః । అనేకైః కన్దజాతిభిః ।
పుణ్యగన్ధం కిరన్తీభిః । లతాతతిభి రావృతమ్ ॥ 50

కహ్లారకమలానీక । మధుమత్తమధువ్రతైః ।
కూజద్భిః కోకిలై శ్చాపి । మదాన్ధైః మహితాన్తరమ్ ॥ 51

పద్మాశ్రితార్తిహిరణ । సాన్ద్రచ్ఛాయం సమన్తతః ।
తత్ర స్థిత్వా ముహూర్తం తే । బ్రహ్మాద్యా దేవతాగణాః ॥ 52

చీకటిచెట్లు, తిలకవృక్షములు, కొబ్బరిచెట్లు, కలిగొట్టుచెట్లు, మొగలిచెట్లు, దేవ పున్నాగచెట్లు, పొన్నచెట్లు, పుత్రదీపక వృక్షములు 43

పెద్దనిమ్మలు, సంపెంగలు, మామిడి, చిన్ననిమ్మ, కొండమల్లె, మట్టి, ఎర్ర మందార, మొగలి, తెల్లమందార, హరిచందన వృక్షములచేతను 44

మోదుగ, అశోక, కల్ప, మద్ది, కడిమి, కరక, చిన్నమారేడు, చందన, పెద్ద మారేడు, అరటి, దానిమ్మచెట్లచేతను 45

మాదీఫల, పెద్దగోరింట, మల్లి, నిర్మలనేరేడు, మొదలగు దట్టమైన నీడలనిచ్చు పెద్దచెట్లచే వ్యాప్తమైనట్టియు 46

తీగల పొదలచేతను, దమనీలతికలచేతను, బండిగురివింద, జాజి, చంద్ర మొదలగు చెట్లచేతను, ఫలములను పుష్పాలను యిచ్చు వికసించియున్న చెట్లతోను, అడవి మొల్ల జాతి తీగలచేతను 47

మంచి జాతికిచెందిన తామర పువ్వులచేతను, ఉత్తమమైన విష్ణువర్ణక మనబడు ఓషధి వృక్షములచేతను, శ్వేతతులసీ, కృష్ణతులసీ మొదలగు పెక్కు తులసీ వృక్షముల చేతను 48

సాయంకాలము పూయు చంద్రకాంతలు, మూడు సంధ్యలలోను పూచు వృక్ష విశేషములు, మంకెనచెట్లు, కరివేపాకు, అల్లముచెట్లు, పసుపుచెట్లు, కర్పూర వృక్షములు, రాత్రులందు పూచు రాత్రిరాణీ చెట్లు 49

పనసచెట్లు, సదాపనసచెట్లు, అనేక రకముల దుంపజాతులు, మొదలగు చెట్ల చేతను, మంచి పరిమళమును వెదజల్లునట్టి యనేక తీగెలచే నావరింపబడియున్నట్టిదియు 50

ఎరుపు తెలుపు కలసిన కలువపువ్వుల యందున్నట్టియు, తామరపువ్వుల యందు న్నట్టియు తేనెను త్రాగి మదించిన తుమ్మెదలతోను, మిక్కిలి మదించి కూయుచున్న కోకిలలచేతను, దర్శనీయ భూభాగములు కలిగినట్టియు 51

దగ్గరకువచ్చినవారి తాపమును హరించు దట్టని నీడలు అంతటను కలిగినట్టియు, నా స్వామిపుష్కరిణీ తటప్రదేశమునందు ఆ బ్రహ్మాది దేవతాగణములొక క్షణముండి 52

కమలాల్యాక్త్యా బ్రహ్మాదికృత శ్రీనివాస సాక్షాత్కారోద్యోగః

క్షీరాబ్ధికన్యాసఖ్యా స్తు । సంస్మరన్తో వచ ఘృభమ్ ।
శ్రియశ్శ్రియం శ్రీనివాసం । శ్రీవత్సకృతలక్షణమ్ ॥ 53

శ్రీకణ్ఠకృతకైఙ్కర్యం । శ్రీమహీమహితం హితమ్ ।
ఏక మేకాయనవిదా । మేకాన్తహృదయాలయమ్ ॥ 54

ద్వితీయామ్నాయనిష్ఠానా । మాత్మనా మాత్మభూతిదమ్ ।
త్రిమూర్తి మత్రిగుణకం । త్రివిధాత్మకకాలకమ్ ॥ 55

చతుర్మూర్తిధరం శాన్తం । చతుర్వింశతిమూర్తికమ్ ।
చతుర్థావస్థాతిభూమిం । చతుర్వర్గఫలప్రదమ్ ॥ 56

పఞ్చోపనిషదాత్మానం । పఞ్చరాత్రప్రవర్తకమ్ ।
పఞ్చాధర్వశిరోరత్నం । పఞ్చమూర్తిధరం పరమ్ ॥ 57

షడధ్వమయచక్రస్థ । షట్కోటిగృహమేధినమ్ ।
సప్తార్చిఃపఞ్జరావాస । హంసం పరమహంసకమ్ ॥ 58

అష్టాఙ్గయోగవిత్సిద్ధ । సంఘహృత్పద్మవాసకమ్ ।
దశావతారచతురం । దశానన శిరశ్ఛిదమ్ ॥ 59

చరమోపాయ సుగమం । చరాచరగురుం హరిమ్ ।
గఙ్గాజన్మగృహోఙ్గుష్ఠ । పాదపఙ్కజవైభవమ్ ॥ 60

ప్రణతార్తిహరం ప్రాజ్ఞం । ప్రణవార్ణ ప్రభావకమ్ ।
ప్రసాదమాత్ర ప్రభవ । ప్రమామాత్ర ప్రమాణకమ్ ॥ 61

అవ్యాజమిత్రం శత్రుఘ్నం । శరణ్యం శరణార్థినామ్ ।
జ్ఞానశక్తిబలైశ్వర్య । వీర్యతేజోవిజృమ్భితమ్ ॥ 62

## కమలాలి చెప్పినట్లు బ్రహ్మాదులు గావించిన శ్రీనివాసుని సాక్షాత్కార ప్రయత్నము

లక్ష్మీ ప్రియసఖి చెప్పిన మంచి మాటలను బ్రహ్మాదులు జ్ఞాపకమునకు తెచ్చుకొని లక్ష్మికి నిత్యాశ్రయభూతుడగునట్టియు, శ్రీవత్సమను మచ్చను వక్షస్థలమున కలిగియున్నట్టియు 53

రుద్రునిచే నారాధింపబడినట్టియు, భూదేవిచే పూజింపబడినట్టియు, అందరకు హితుడైనట్టియు, ఏకాయనశాఖీయుల కద్వితీయుడైనట్టియు, పరమైకాంతుల హృదయమునందు నిత్యవాసము చేయునట్టియు 54

యజుర్వేదీయులగు భక్తులకు ఆత్మైశ్వర్యము నొసంగునట్టియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల కంతర్యామియగునట్టియు, భూతభవిష్యద్వర్తమాన కాలాధిపతియైనట్టియు 55

వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపములతో నున్నవాడును, ఆకలి, దప్పి, శోక, మోహము, జరామరణములు లేనివాడును, యిరువదినాలుగు తత్వముల కంతరాత్మయు, బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యావస్థలు లేనట్టియు, ధర్మార్థ కామ మోక్షములనిచ్చునట్టియు 56

పరమేష్ఠిపుమానిత్యాది పంచోపనిషన్మయమైన శరీరము కలవాడును, పాంచరాత్రాగమ ప్రవర్తకుడును, ఐదువిధములైన అధర్వణోపనిషత్తులయందు ప్రధానుడుగా ప్రతిపాదింపబడునట్టియు, పరవ్యూహవిభవాన్తర్యామ్యర్చా రూపధారియైనట్టియు 57

సూర్యమండల మధ్యవర్తియును, పరమహంసవలె నిర్లిప్త స్వభావుడును 58

అష్టాంగయోగములను బాగుగనెఱింగిన సిద్ధ బృందములయొక్క హృదయములయందు నివసించుచున్నట్టియు, దశావతారములను నేర్పుతో ధరించునట్టియు, రావణుని సంహరించినట్టియు 59

ప్రపత్తిచే సుఖముగ పొందదగినట్టియు, స్థిరచరములకు గురుడగునట్టియు, గంగనుబుట్టించు బొట్టనవ్రేలుగల పాదమహిమ గలిగినట్టియు 60

భక్తుల బాధలను బాపునట్టియు, సర్వజ్ఞుడైనట్టియు, ఏకాక్షరమగు ఓంకార ప్రతిపాద్య ప్రభావమును కలిగియున్నట్టియు, తన యనుగ్రహముచే జనించు భక్తిచేతను మాత్రమే యెరుంగదగియున్నట్టియు 61

నిర్హేతుకహితైషియై శత్రుసంహార మొనరించునట్టియు, తనను పాయమని నమ్మినవారిని రక్షించుటలో దక్షుడైనట్టియు, జ్ఞానశక్త్యాదిషడ్గుణస్ఫూర్తి కలిగియున్నట్టియు

రజ స్తమస్స త్త్వసఙ్గ । విమోహితజగత్త్రయమ్ ।
సంసృష్టిస్థితిసంహార । విగ్రహానుగ్రహాత్మకమ్ ॥ 63

భక్తానా మప్యభక్తానాం । చిన్తనా న్మోక్షకారణమ్ ।
నాదా న్తగగనావాసం । శుద్ధం సూక్ష్మం నిరఞ్జనమ్ ॥ 64

నిరవద్యం నిరాకారం । నిరాబాధం నిరామయమ్ ।
నిరాశ్రయం నిస్తరఙ్గ । నీరరాశినిభం విభుమ్ ॥ 65

అతీన్ద్రియం పరం బ్రహ్మ । చే న్ద్రియైః స్పష్టు మిచ్ఛవః ।
పూ్యాహాత్మక మిదం సూక్తం । సుపర్వాణః సముత్సుకాః
ఉదాత్త ముచ్చైః ఉచ్చేరుః । సమ్ప్లుతం నిరుపప్లవాః ॥ 66

## శేషాద్రౌ శ్రీనివాససాక్షాత్కారాయ బ్రహ్మాదికృత స్తుతిః

జితం తే పుణ్డరీకాక్ష ! । నమ స్తే విశ్వభావన !
నమ స్తే ఽస్తు హృషీకేశ । మహాపురుష ! పూర్వజ ! ॥ 67

నమః శ్రీధామనిలయ । నమః శ్రీవత్సలక్షణ ! ।
నమ స్త్రిధాత్మనే తుభ్యం । నమః శ్రీఘనమోహన ॥ 68

నాకౌకః ప్రత్యనీకారే । నారాయణ నమో ఽస్తు తే ।
నాగపర్యఙ్కశయన । అనాథనాథ నమో నమః ॥ 69

విశ్వస్రష్ట్రే విశ్వభర్త్రే । విశ్వత్రాత్రే విచక్షణ ! ।
విశ్వాన్తర్యామిణే తుభ్యం । విశ్వోత్తీర్ణ విభో ! నమః ॥ 70

సత్త్వరజస్తమోగుణములచే ముల్లోకములను మోహింపజేయునట్టియు, సృష్టించుట, రక్షించుట, సంహరించుట, కోపించుట, అనుగ్రహించుట యను వీనిని స్వాభావిక గుణములుగా కలిగియున్నట్టియు 63

భక్తులైనను, తదితరులైనను నిశ్చలముగ ధ్యానింతురేని మోక్షము నొసంగు నట్టియు, శబ్దమున కాకరమగు పరమవ్యోమమును నిలయముగా కలిగియున్నట్టియు, తన సంపర్కముచే నన్నిటిని పావనమొనరించునట్టియు, సర్వాంతః ప్రవేశసమర్థుడైనట్టియు, కర్మసంబంధగంధమైనను లేనట్టియు 64

దోషరహితుడైనట్టియు, ప్రాకృతాకారములు లేనట్టియు, ఏవిధమైన బాధలకును లోనుగానట్టియు, వ్యాధిగంధరహితుడైనట్టియు, తనకొక ఆధారము నపేక్షించనట్టియు, సర్వవ్యాపకుడైనట్టియు 65

ఇంద్రియములకు గోచరించనట్టి వ్యూహస్వరూపుడగు పరమాత్మను తమ యింద్రియములతో నంటగోరినవారై దేవతలు పరమపురుషుని పంచవ్యూహములను తెలుపు మంత్రములమధ్యగల పురుషసూక్తము నుచ్చైస్స్వరముతో తొట్రుపడక నుదాత్తముగా పఠించిరి. 66

## శేషాద్రిపై శ్రీనివాసుని దర్శించగోరిన బ్రహ్మాదులు గావించిన స్తోత్రము

ఓ పుండరీకాక్షుడా ! మేము నీకు జితులమై దాసులమైతిమి. సంకల్పముచే సృష్టించు నారాయణా ! నీకు వందనము. స్వాధీనేంద్రియా ! నీకు నమోవాకములు చెందు గాక ! ఓ మహాపురుషా ! నీ వందరకు నాదికారణభూతుడవు. 67

పరమపదనిలయా ! వందనము. శ్రీవత్సమను గుర్తును వక్షస్థలమున వహించు స్వామీ ! వందనము. బ్రహ్మ విష్ణు మహేశ్వర శరీరములతో రాజిల్లు నీకు వందనము. కాంతిపుంజముచే లోకమును మోహింపజేయువాడా ! నీకు నమస్కారము. 68

దేవశత్రువులను ద్రుంచువాడా ! నారాయణా ! నీకు వందనము. శేషశాయీ ! దిక్కులేని దీనుల బ్రోచువాడా ! వందనము. 69

జగత్తులను సృష్టించువాడా ! భరించువాడా ! రక్షించువాడా ! సర్వసమర్థుడా ! ప్రపంచమున కంతర్యామియైయుండి శాసించువాడా ! ప్రపంచ మర్యాదలను దాటిపోయిన వాడా ! నీకు వందనము. 70

## స్వామిపుష్కరిణీతీరే స్తుతిప్రసన్నభగవద్విమానావిర్భావః

ఏవ ముచ్చరతాం తేషాం । హర్షోత్ఫుల్లాస్యచక్షుషామ్ ।
అగ్రే సుధాన్ధసాం వ్యాఘ్ర । మనసాం సమ్ప్రదర్శినామ్ ॥ 71

న్యక్కృతాఖిలతేజస్కం । చక్షుర్హారిసమీక్షితమ్ ।
పశ్చిమే స్వామిసరసః తీరే । ప్రత్యగ్రవిగ్రహమ్ ॥ 72

విమాన మావిర్బభూవ । విమలానన్దకారకమ్ ।
దివ్యదున్దుభినిర్ఘోష । జయశబ్దసమన్వితమ్ ॥ 73

ద్యోతయ చ్చ దిశ స్సర్వాః । పుష్పవృష్టిపురస్సరమ్ ।
తద్వీక్ష్య నిమిషా స్సర్వే । విమానం విస్మయాన్వితాః ॥ 74

అభితుష్టువు రాత్మేశం । శ్రీనివాసం సమఞ్జసమ్ ।

## బ్రహ్మాదికృతవిమానమధ్యగత శ్రీనివాసస్తుతిః

జయ శ్రియః పతే విష్ణో ! । జయ సత్యాచ్యుతానిశమ్ ।
జయాఽనిరుద్ధభగవన్ । జయ పూరుషపూర్వజ ॥ 75

జయేశ ! సర్వజగతాం । జయ శ్రీకణ్ఠపూజిత ।
జయాఽఽత్మేశ్వరజీవాతో । జయ త్వ మపరాజిత ॥ 76

## శ్రీశ్రీనివాసావిర్భావః

స్తుత్యా నయా ప్రసన్నో ఽస్మిన్ । విమానే పరమః స్వరాట్ ।
సహస్రాదిత్యసఙ్కాశః । సహస్రేన్దుసమప్రభః ॥ 77

సహస్రసహాంతభు గ్రవ్రభ్యో । విఖ్యాతవిభవోదయః ।
చతుర్భుజ శ్శఙ్ఖచక్ర । వరావనతహస్తకః ॥ 78

## ఇట్టి స్తోత్రముచే సంతుష్టినిచెందిన శ్రీనివాసుడా పుష్కరిణీతటమున తన విమానమును బుట్టించుట

ఇట్లుచ్చరించుచు ఆనందపారవశ్యమున వికసించియున్న ముఖములను, నేత్రములను కలిగినట్టియు సంపదలనుగోరుచు తత్తరపడు హృదయములుగల నా దేవతల సమక్షమున — 71

స్వేతర సమస్త తేజములను ధిక్కరించునట్టియు, చూచువారి నేత్రములను మిరిమిట్లు గొలుపునట్టియు, నూతన రూపము గలిగినట్టియు 72

నిర్మలమైన ఆనందము నొసంగునట్టియు విమానమొకటి స్వామిపుష్కరిణికి పడమటి దిశయందు ఆకసమున దేవతల దుందుభిధ్వనులతో కూడిన జయశబ్దములతో పుష్పవర్షములు కురియుచుండగ సాక్షాత్కరించెను. 73

అది యన్నిదిక్కులను వెలుగొందింపజేయుచుండెను. దానిని గాంచి దేవతలందరును ఆశ్చర్యసాగరాంతర్నిమగ్నులైరి. నిఖిలాత్మలకు నాథుడగు శ్రీనివాసుని తగిన స్తోత్రములతో నుతించిరి. 74

## విమానమధ్యమందున్న శ్రీనివాసుని బ్రహ్మాదులు స్తుతించుట

లక్ష్మీకాంతా! సర్వవ్యాపీ! సర్వోత్కృష్టముగా నుందుము. చేతనాచేతన నియన్తా! స్వరూపమునకు చ్యుతిలేనివాడా! జయింపుము. అనిరుద్ధావతారా! షడ్గుణపూర్ణా! నీకు జయము. సకల చేతనుల కాదికారణభూతుడా! జయము జయము. 75

సకలలోకపాలకా! నీకు జయము. రుద్రునిచే బూజింపబడిన స్వామీ! నీకు జయము. అనన్యేశ్వరా! నీకు జయము. జీవనౌషధమా! నీకు జయము. ఎవ్వనిచేగాని, నెప్పుడుగాని పరాజయము నెఱుంగనివాడా! నీకు జయము. 76

## శ్రీ శ్రీనివాసులు సాక్షాత్కరించుట

ఇట్లు దేవతలు గావించిన స్తోత్రముచే ప్రసన్నుడైన శ్రీనివాసుడా విమానమునందే తన ప్రాభవముట్టిపడ వేయి సూర్యులొక్కసారి యుదయించినట్లు వెలుంగుచు వేయి చంద్రులొక్కసారి వెలుంగునట్లు వెలుంగుచు 77

వేయి యగ్నిహోత్రము లొక్కసారి వెలుంగుచున్నట్లు వెలుంగుచు జగత్ప్రసిద్ధమైన మహిమతో చతుర్భుజములను ధరించి. శంఖ చక్రాయుధముల భారముచే నొకింత వంగిన భుజములు కలవాడై 78

శ్రీవత్సకౌస్తుభోరస్కో । వైజయన్త్యా విరాజితః ।
ఉద్యత్ప్రచణ్డమార్తాణ్డ । ప్రతీకాశకిరీటకః ॥ 79

మాణిక్యకణ్ఠహారశ్రీ । వీరపట్టవిరాజితః ।
కర్ణపాలీసమాలమ్బి । మకరాననకుణ్డలః ॥ 80

హారకేయూరకటక । కఙ్కణాఙ్గదసున్దరః ।
అఙ్గుళీయఘనన్నకరో । దరబన్ధనశోభితః ॥ 81

ప్రవాళముక్తాప్రత్యుప్త । నవరత్నసుదామకః ।
శృఙ్గలాఢ్యకౌశేయ । కిఙ్కిణీకకటిస్థలః ॥ 82

పీతకౌశేయవసనో । దీప్తమఞ్జీరహంసకః ।
కిఙ్కిణీదామాఙ్గుళీయ । విరాజితపదామ్బుజః ॥ 83

సర్వాభరణసంయుక్తః । సర్వావయవసున్దరః ।
పుణ్డరీకవిశాలాక్షః । పుష్పదామవిరాజితః ॥ 84

అష్టాఙ్గైర్ధూపకైర్ధూప్యై । లేపనైః పుజ్యగన్ధిభిః ।
సమ్యక్స్థానాఙ్కితాఙ్గశ్రీః । పూర్ణచన్ద్రనిభాననః ॥ 85

అప్రాకృతాఙ్గమహిమా । ప్రాకృతాఙ్గవిడమ్బనః ।
ప్రాదుర్బభూవభగవాన్ । భక్తభావాత్మకః పుమాన్ ॥ 86

## బ్రహ్మాదీన్ ప్రతి భగవత్కృతకుశలప్రశ్నః

ఈషదుత్స్మయమానస్తు । గీర్వాణాన్ వీక్ష్య విస్మితాన్ ।
బభాషేచసురశ్రేష్ఠః । పూర్వాన్ పూర్వవిదాత్మభూః ॥ 87

శ్రీభగవాన్ —

కచ్చిద్దేవాః స్వాగతం వః । సహస్రాక్షపురోగమాః ।
పితామహం పురస్కృత్య । కిమర్థం యూయ మాగతాః ॥ 88

వక్షస్థలమున శ్రీవత్సము కౌస్తుభమాణిక్యము, వైజయంతీమాలయు నలరారు చుండ తీక్ష్ణకిరణుడగు సూర్యుడుదయించుచున్నాడో యనిపించు కిరీటము శిరమున రాజిల్ల

మాణిక్యములతో గ్రుచ్చబడిన హారకాంతితోను, పీరపట్టముతోను విరాజిల్లుచు రెండు చెవులనుండియు వ్రేలాడు మకరకుండల కాంతులు తాండవించుచుండ 80

ముత్యాలహారములు, భుజకీర్తులు, మురుగులు, తోడాలు, బాహుబందులతో సుందరుడై, ఉంగరములచే గప్పబడిన వ్రేళ్ళతోను, మొలకు బిగించిన కాశీకోకతోను శోభించుచున్నవాడై 81

పగడములు, ముత్యములతోచేర్చి గ్రుచ్చబడిన నవరత్నహారమును ధరించిన వాడై, చిరుగంటల గొలుసుచే చుట్టువారుకొనిన నడుముకలవాడై 82

పచ్చని పీతాంబరమును ధరించి ప్రజ్వలించుచు, హంసధ్వనుల నీనుచున్న నూపురములతోను చిరుగంటల బంగరు మాలతోను, ఉంగరములతోను విరాజిల్లు పాద పద్మములు కలవాడై 83

ఆపాదమస్తకము స్వస్వస్థానముల నుండదగిన ఆభరణములతో నలంక రింపబడినవాడై శోభాయమాన సకలావయవుడై, ఎఱ్ఱతామరవంటి సుందర విశాల నేత్ర ములు కలవాడై, పుష్పమాలాలంకృతకంఠుడై 84

సౌగంధ్యము, శైత్యము, మార్దవము, సౌరూప్యము మొదలగు ఎనిమిది గుణములుకలిగి దేహకాంతి వినుమడింపజేయుచు పుణ్యగంధములను చిమ్ముచున్న మైపూ తలతో నా యా స్థానములలో లెస్సగ నలంకరించుకొని ప్రకాశించుచు. పూర్ణిమనాటి చంద్రునిబోలిన ముఖముకలవాడై 85

అప్రాకృతమైన అంగసౌష్ఠవమును కలిగియున్నను లోకవిడంబనకై ప్రాకృత దేహధారివలె గాన్పించువాడై, భక్తుల భావనామయుడైన, షడ్గుణపూర్ణుడైన పరమపురుషు డావిర్భవించెను. 86

## భగవానుడు బ్రహ్మాదులను కుశలప్రశ్న గావించుట

ఆశ్చర్యచకితులై నివ్వెరబోయి నిలచి చూచుచున్న దేవతలను జూచి శ్రీని వాసుడు చిరునగవు తళుకొత్తు నెమ్మోముతో దేవాదిదేవుడును, సర్వజ్ఞుడును నగు నా పరమపురుషు డిట్లు పలికెను. 87

భగవంతుడు —

దేవేంద్రుడు మొదలుగాగల నో దేవతలారా! సుఖముగ నేతెంచినారుగదా! బ్రహ్మదేవుని ముందుంచుకొని మీరందరేల విచ్చేసిరి? 88

కచ్చి త్త్వాయేణ బాధ్యధ్వే । ధ్రువ మవ్యాజశత్రుభిః ।
ఏవ ముక్తే హృషీకేశే । కేశవే కేశిమర్దనే ॥ 89

## భగవతే బ్రహ్మకృతలోకోపద్రవకార్యసురోదన్త విజ్ఞాపనమ్

ప్రత్యూచే విబుధశ్రేష్ఠః । ప్రణిపత్య పితామహః ।
జాగరూకే ఽత్ర భవతి । భగవన్ భక్తవత్సలే ॥ 90

సర్వత్రారిష్ట మాపన్నం । త్వదధీనా వయం హితత్ ।
కింవా ఽకుశల మస్మాకం । జీవితం కఞ్జలోచన ॥ 91

ఇన్ద్రాదయో లోకపాలా । వివర్ణ వదనా ఇమే ।
స్వపదప్రచ్యుతా దుఃస్థాః । స్వస్థా న ప్రచకాశిరే ॥ 92

దైవతానా మమీషా న్తు । భీతివిహ్వలచేతసామ్ ।
నక్తం దివం న చేరు స్స్వ । విమానాని వియత్తలే ॥ 93

ఏతే హి ద్వాదశాదిత్యాః । తమోవిధ్వస్తదీప్తయః ।
గ్రస్తా ఇవ తమోభి స్తు । న బభుః విగతప్రభాః ॥ 94

అష్టౌ వసుగణాః ప్రాయో । నా సత్యౌ ద్వౌ చ నాకినౌ ।
బభాసిరే న వీతాభాః । ప్రణష్టవసుకా ఇవ ॥ 95

మమ లోకే నివాస శ్చ । దుఃస్థితో ఽస్వస్థచేతసః ।
కైలాసవాసో రుద్రస్య । మహాక్లేశకరో ఽభవత్ ॥ 96

స్వకృతి వ్రీడయా సో ఽపి । తత్త్రైవ వ్యవతిష్ఠతే ।
కశ్చి న్నిదాన మేతేషాం । తృణీకృతజగత్త్రయః ॥ 97

అమరారి రితి ఖ్యాతో । దైతేయేన్ద్రో మహేన్ద్రజిత్ ।
శిపివిష్టం సముద్దిశ్య । దుర్వినీతగణాధిపమ్ ॥ 98

" నిష్కారణ శత్రులగు రాక్షసప్రముఖులచే తరుచుగ బాధపెట్టబడుచున్నారా ? బొసిది నిజమేకావచ్చును " అని యిట్లు జితేంద్రియుడును కేశిహంతయు ప్రశస్త కీర్తి ములనుకలిగియున్న నారాయణుడడుగగనే — 89

## బ్రహ్మ నారాయణునకు లోకమునకు ముప్పుల నాపాదించు రాక్షసుల చరిత్రనివేదించుట

దేవనాయకుడగు చతుర్ముఖుడు నమస్కరించి యిట్లు పలికెను. భక్తవత్సలా ! స్వామీ ! నీవు మా రక్షణలో నేమరక వేంచేసియుండగా 90

పుండరీకాక్షా ! అందరకును దాపరించు అరిష్టములు నీ యధీనమునందున్న మా కెట్లువచ్చును ? మా జీవితమున కమంగళము లేమియుండును ? 91

యింద్రాదులును, లోకపాలురును చూడుము ఎట్లు మలినముఖులుగా గాన్పించు చున్నారో. పాపము వారు స్థానభ్రష్టులై దురవస్థ ననుభవించుచు స్వస్థచిత్తులుగా గోచరిం చుటలేదుగదా ! 92

భయభీతహృదయులగు నీ దేవతల విమానములు దివారాత్రములు ఆకసమున తిరుగుటయేలేదు. 93

ఈ పన్నెండుగురు సూర్యులును దుఃఖానుభవముచే భ్రష్టతేజస్కులై చీకట్లావ రించినవో యనునట్లు కాంతిశూన్యులై ప్రకాశించకయున్నారు. 94

అష్టవసువులును, నాసత్యులను యిద్దరు స్వర్గవైద్యులున్ను భ్రష్టైశ్వర్యులవలె తేజోవిహీనులై భాసిల్లకయున్నారు. 95

బెంగగొనిన మనస్సుగల నాకును సత్యలోకమున వాసము దుస్తరముగానున్నది. వేయేల మన రుద్రునకు కైలాసవాసము మిక్కిలి దుఃఖావహముగానున్నది. 96

పాపము తన కన్ను తానే పొడుచుకున్నట్లు తానే (వారికి వరములిచ్చి) తెచ్చి పెట్టుకొనిన పీడయగుటచే చప్పగ నచ్చటనే పడియున్నాడు. వీరి దౌష్ట్యమున కండగా ముల్లోకముల నొక గడ్డిపరకగ భావించు నొకడున్నాడు. 97

వాడు దేవేంద్రుని కూడ నోడించి రాక్షసరాజగు అమరారియని ప్రసిద్ధి కెక్కినవాడు. 98

ఘోరాకారో ఘోరతరం । చకారాతిచిరం తపః ।
తపసా తేన సన్తుష్టః । పినాకీ స చ తామసః ॥ 99

అజయ్యత్వ మవధ్యత్వ । మమరై రమరాధి పైః ।
అన్యై రతిబలై శ్చైవ । తస్మై దుర్మేధసే దదౌ ॥ 100

అమరారి ర్ద్విషదాం । అన్యేషాం చ సతా మరిః ।
దుష్టాత్మా దుష్టచేతాః స । త్రిషు లోకేషు చేష్టతే ॥ 101

విశేషతో దేవవర్గాన్ । దరిద్రాన్ దీనమానసాన్ ।
దివానిశం సదా క్రూరః । తదా ప్రభృతి బాధతే ॥ 102

దైత్యారిః దేవతామిత్రం । శార్ఙ్గీ ఖడ్గీ చ చక్రభృత్ ।
దేవః ప్రమాణం సర్వేషాం । అన్తర్యామీ భవాన్ స్వతః ॥ 103

నమ స్తే కమలాకాన్త ! । నమః కమలలోచన ।
నమః కారుణ్యపుణ్యశ్రీః । నమః కాలాత్మక ! ప్రభో ॥ 104

అర్దితాన్ అసురేన్ద్రేణ । దుర్హృదా చా మరారిణా ।
అస్మా ననేకవిధయా । భవాన్ రక్షతు రక్షతు ।
ఇతి బ్రువాణే గీర్వాణ । గణే శ్రేయోభిశంసిని ॥ 105

### బ్రహ్మాదిప్రార్థనయా భగవదుక్తాభయోక్తిః

శరత్ప్రత్యగ్రఫుల్లాబ్జ । వక్త్రో భేపరమేష్ఠిని ।
కారుణ్యామృతవారాశి । కల్లోలామృతలీలయా ॥ 106

వీక్షయా వీక్ష్య విశ్వాత్మా । విధ్వస్తజరయా ఒఒదరాత్ ।
ఉవాచ భగవా న్విష్ణుః । స్మయమానముఖామ్బుజః ॥ 107

భయంకరాకారుడగువాడు అవిధేయులగు గణములకు ప్రభువగు రుద్రునిగూర్చి యెవ్వరును చేయలేని మిక్కిలి ఘోరమైన తపంబొనరించెను. ఆ తామస చక్రవర్తియగు నా శివుడు తపస్సునకు సంతుష్టుడై 99

ఆ దుర్బుద్ధికి దేవతలచేగాని, దేవాధిపతులచేగాని మరి యితరయెట్టి బలాఢ్యులచే గాని జయింప శక్యముకాకుండుటను, చంపబడకుండుటను వరములుగా ప్రసాదించెను 100

ఆ యమరారి రాక్షసుడు దేవతలకును, ఇతర సజ్జన పురుషులకును శత్రువై దుర్మార్గుడై, దుర్బుద్ధియై మూడులోకములలోను యధేష్టముగా తిరుగజొచ్చెను. 101

అది మొదలు ఆక్రూరుడు ప్రధానముగా దేవతాబృందములను, దీనమనస్కులగు దరిద్రులను రాత్రింబవళ్లు బాధింపదొడంగెను. 102

స్వామీ! నీవు రాక్షసహంతవు. దేవతలకు మిత్రుడవు. శారంగమను ధనస్సును, నందమను ఖడ్గమును, చక్రమును చేబూనియుందువు. సహజముగనే యందరి యంత రాత్మలలో నంతర్యామియై వేంచేసియుండు నీవే యెఱుంగుదువు. నీ దయ. 103

లక్ష్మీపతే ! నీకు వందనము, పుండరీకాక్షా ! నమస్కారము, దయాసముద్రా ! నమోవాకములు. యమున కంతర్యామివై సంహారము నొనరించు నీకు మా వందనము 104

దేవశత్రువును దుష్టహృదయుడును నగు రాక్షసరాజుచే ననేక రీతుల పీడింప బడుచున్నాము, నాధా ! మమ్ములను నీవు కాపాడుము. కాపాడుము. 105

దేవతలంద రిట్లు పలుకుచుండగ వీరి శ్రేయస్సునే గోరునట్టియు, శరద్రుతువు నందు నూతనముగ వికసించిన తామరపువ్వువంటి ముఖశోభగల చతుర్ముఖుడును పలుకు చుండగను, బ్రహ్మాదులిట్లు ప్రార్థించగా కృపాపీయూష సాగరతరంగములవంటి కటాక్ష వీక్షణములచే 106

వారిని జూచి వారి తాపమంతయు నంతరించునట్లు సర్వాత్ముడు ఆదరముతో చిరునగవు ముఖపద్మమున తళుకొత్త పూజ్యుడగు నా శ్రీ మహావిష్ణువు 107

దన్తపఙ్క్తి-ద్యుతిజ్యోత్స్నా । స్నపితాఽశాన్తరాలకః ।
"మా భిష్యతు భవన్తోఽహం । కరిష్యే తత్ప్రతిక్రియామ్ ॥ 108

స్వస్మిన్ స్వస్మిన్ పదే యూయం । స్థాతారో ఽనార్తమేవ చ ।
వధ్యఏవత్వవధ్యత్వం । ప్రాప్తవానపిశూలినః ॥ 109

## రక్షోగణసంహారాయ భగవత్కృతకుముదాక్షనియోజనమ్

అమరారి రముష్యాస్తు । త్రిలోక్యా దుష్టకణ్టకః ।
ఇత్యుక్త్వా తాన్ సురగణాన్ । సుప్రసన్నః సురర్షభః ॥ 110

ఇఙ్గితాకారచేష్టాజ్ఞం । ఇన్దిరారమణః ప్రభుః ।
కుముదాక్షం గణాధ్యక్షం । గదాపాణిముదైక్షత ॥ 111

శ్రీవత్సకౌస్తుభాభ్యాం చ । ఋతే సారూప్యసమ్పదమ్ ।
విష్వక్సేనాభిదానం చ । సేనాపత్యం ప్రదాయ చ ॥ 1 2

నియుజ్య తం తస్య వధేఽ । మరారాతేః గణాధిపమ్ ।
దేవాన్ సమ్భాష్య సహసా । సర్వాన్ స్వపదకాఙ్క్షిణః ॥ 113

## భగవతో బ్రహ్మాదిప్రేషణపూర్వకమన్తర్ధానమ్

కృత్వా ఽభయప్రదానం చ । దత్త్వా ఽఽశిష మనేకశః ।
స్మయమానముఖః శ్రీమాన్ । అచ్యుత స్తు తిరోదధే ॥ 114

తతో దేవా దేవదేవా । భిహితం వచనం హితమ్ ।
శ్రుత్వా ప్రీత్యా ప్రణమ్యైతం । దేశ ముద్దిశ్య చోర్జితమ్ ॥ 115

శిరస్య ఞ్జలిపుఞ్జాన । ప్యా బద్ధ్వా న్తః సుధాన్ధసః ।
ప్రదక్షిణం పరిక్రమ్య । యయుః సంహృష్టమానసాః ॥ 116

తన దంత కాంతిచే దిగంతములను వెలుగొందించుచు ఓ దేవతలారా! మీరు భయపడకుడు. నేను దానికి ప్రతిక్రియను చేయుదును. 108

మీరు మీ స్థానములలో నిరుపద్రవముగ నుండగలరు. రుద్రునివలన చావకుండ వరమును బడసినను యీ రాక్షసుడు నాచే చంపబడితీరును. 109

## రాక్షసబలమును నాశనముచేయుటకై భగవంతుడు కుముదాక్షు నాదేశించుట

ఈ యమరారి దైత్యుడు మూడులోకములలో నుండువారికిని దుఃఖమునే కలిగించు దుష్టుడు అని సుప్రసన్నుడగు శ్రీయఃపతి ఆ దేవతలను గూర్చి పలికెను. 110

ఇంతలో చేత గదను ధరించిన యంగితజ్ఞుడైన గణాధ్యక్షుడగు కుముదాక్షుని ప్రభువగు నా శ్రీయఃపతి జూచెను. 111

శ్రీవత్సము, కౌస్తుభమాణిక్యమును తప్ప మిగిలిన సకల పరమాత్మ లక్షణములతో నొప్పు విష్వక్సేను లను పేరుగల సేనానాయకుని కూడ తోడిచ్చి 112

తన గణాధిపతియగు కుముదాక్షుని అమరారిని చంపుటకై యాజ్ఞాపించి తమ తమ పదవులను స్థిరముగ నేలుకొనగోరు దేవతలనందరితోను కొన్ని మాటలు పలికి 113

## పరమాత్మ బ్రహ్మాది దేవతలను పంపివేసి యంతర్ధానమగుట

ఇట్లభయమొసంగి, అనేకాశీస్సులనందజేసి, చిరునగవు ముఖమున తాండవించు చుండ నా లక్ష్మీనాధుడగు అచ్యుతుండంతర్ధానమయ్యెను. 114

అటు పిమ్మట దేవతలు తమ వాసస్థానములను గూర్చి శ్రీయఃపతి సెలవిచ్చిన హితమైన ఉదారమైన ఆదేశమును విని మిక్కిలి ఆనందముతో నమస్కరించి 115

తలయందు అంజలిని జోడించి ప్రదక్షిణముగా తిరిగి మిక్కిలి సంతుష్టాంతరంగులై ఆ దేవతలందరును తమ స్థానములకేగిరి. 116

## శ్రీనివాసా వాసస్థలస్య సర్వఫలప్రదత్వవర్ణనమ్

దేవదర్శనః —

ఇతి దేవార్య మిత్రస్య । సర్వాన్తర్యామినోవిభోః ।
ఆవిర్భావో మయాఽఽఖ్యాతః । శ్రీనివాసస్య దేవల ! ॥ 117

శృణ్వతాం పఠతాం చైవ । చతుర్వర్గఫలప్రదః ।
ఏతద్దైవ వైష్ణవం క్షేత్రం ! పవిత్రం చిత్రవైభవమ్ ॥ 118

అనాయాసేన జగతాం । అభీష్టఫలదాయకమ్ ।
ముక్తిభాజాం ముముక్షూణాం । లక్ష్మీవైభవకాంక్షిణామ్ ॥ 119

కిన్నరాణాం నరాణాం చ । సురాణాం సుఖశాలినామ్ ।
భూతానాం భూతయోనీనాం । భైరవాభైరవాత్మనామ్ ॥ 120

పరమైకాన్తినాం పఞ్చ । కాలాకలుషితాత్మనామ్ ।
పఞ్చశాఖాధర్వవిదాం పఞ్చోపనిషదాత్మనామ్ ॥ 121

నిత్యానాం నియమస్థానాం । నివాసో యోగినా మపి ।
మాహాత్మ్య మస్య దేశస్య । వక్తుం వర్షశతై రపి ।
అశక్యం దేవల ! భవాన్ । కృతకృత్యః శుచిశ్రవాః ॥ 122

## శ్రీశ్రీనివాసావతారదేశకాలనిర్ణయః

ఇత్థ మాత్మభువః కల్పే । హార్దామ్భోజభువో హరేః ।
ఆదౌ కృతయుగే జమ్బూ । ద్వీపే భారతవర్షకే ॥ 123

గఙ్గాయా దక్షిణే భాగే । యోజనానాం శతద్వయే ।
పఞ్చయోజనమాత్రే తు । పూర్వామ్భోధే స్తు పశ్చిమే ॥ 124

## శ్రీనివాసుడు వేంచేసియున్న ప్రదేశము సకలఫలప్రదమని వర్ణించుట

దేవవర్మనుడు —

దేవలఋషీ ! ఇట్లు దేవశ్రేష్ఠుల హితైకతత్పరుడును. సర్వాంతర్యామియు నగు జగన్నాథుడగు శ్రీనివాసుని యవతారమును గూర్చి నేను నీకు తెల్పితిని. 117

దీనిని చదివినవారికిని, వినినవారికిని యిది ధర్మార్థకామమోక్ష పురుషార్థముల నొసంగును. ఇది విష్ణువునకత్యంత ప్రియమైన పుణ్యదేశము. పాపహారి. ఆశ్చర్యకరమైన మహిమకలది. 118

లోకులకు కష్టపడకుండగనే కోరిన కోరికలనిచ్చునది. ఇది ముక్తులకును, మోక్షార్థులకును అపారైశ్వర్యకాముకులను 119

కిన్నరులకును, మనుష్యులకును, సుఖానుభవపరులైన దేవతలకును, సమస్త ప్రాణులకును, వానిని పుట్టించు వారికిని, భయంకరమైన ప్రాణులకును, సౌమ్యమైన ప్రాణులకును 120

పరమైకాంతులకును (ఈశ్వరునినుండి మోక్షమునైనను కోరనివారు) పంచ కాలారాధనచే పవిత్రముగావింపబడిన హృదయములు కలవారికిని, ఐదు శాఖలుగల అథర్వోపనిషదర్థముల నెఱింగి యనుష్ఠించినవారికిని, పరమేష్ఠిపుమావిత్యాది ఐదు విధములైన ఉపనిషత్తులనబడు పంచభూతములచే నిర్మింపబడిన దేహములు కలవారికిని 121

అనంత గరుడాది నిత్యసూరులకును, శాస్త్రీయమైన నియమబద్ధమగు జీవితమును గడుపువారికిని, యోగులకును నివాసయోగ్యమగు స్థానము. ఈ దేవదేవుని మహిమను వర్ణించవలెననిన యెన్నివందల సంవత్సరములైనను శక్యముకాదు. దేవలా ! నీవు కృతకృత్యుడవు. నీ చెవులు దీనిని విని పావనమయ్యెను. 122

## శ్రీనివాసుని యవతార దేశ, కాలములను నిర్ణయించుట

ఇట్లు బ్రహ్మకల్పమున ఉపాసకుల హృదయపుండరీకమును స్థానముగా గల నారాయణుని ఆద్యకృతయుగమున జంబూద్వీపమున భారతవర్షమున 123

గంగానదికి దక్షిణదిగ్భాగమున రెండువందల యోజనముల దూరముననను, తూర్పు సముద్రమునకు పశ్చిమదిశగా నైదు యోజనముల దూరమునందును 124

మాసే భాద్రపదే విష్ణు । తిథౌ విష్ణుసమన్వితే ।
సిద్ధయోగే సోమవారే । గిరౌ నారాయణాహ్వయే ॥ 125

స్వామిపుష్కరిణీతీరే । పశ్చిమే భూత్యపశ్చిమే ।
బృన్దారకాణాం బృందై స్తు । ప్రార్థితో లోకరక్షకః ॥ 126
ఆవిర్బభూవ భగవాన్ । శ్రీనివాసః పరఃపుమాన్ ।
శ్రీనివాసాయ మహతే । నిష్కలా నిష్కలాత్మనే ।
నమో ఽస్తు పద్మనేత్రాయ । పవిత్రాయా దివేధసే ॥ 127

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే శ్రీశ్రీనివాసావిర్భావ
వర్ణనం నామ త్రయస్త్రింశో ఽధ్యాయః

---

# చతుస్త్రింశో ఽధ్యాయః

## పద్మసరోవరమాహాత్మ్యమ్

దేవలః —

దేవదర్శన భూయో ఽపి । శ్రోతుం కౌతూహలం హి మే ।
పద్మాఖ్యసరసో బ్రహ్మన్ । మాహాత్మ్యం జన్మ మే వద ॥ 1

యస్మిం స్తపస్యతో వై యా । సకేః సిద్ధి రుపాగతా ।
శుక స్తు ముక్త ఇతి వై । ప్రసిద్ధః జగతీ తతే ॥ 2
బ్రహ్మలోకా దాగతో యః । శుకో ఽన్యో వా వదస్వ మే ।
కృపాం మయి కురుష్వా ద్య । వద సర్వజ్ఞ మే గురో ॥ 3

### భృగుపాదాహతికుపితాయా లక్ష్మ్యాః కపిలాలయగమనమ్

శృణు పద్మాఖ్యసరస । ఉత్పత్తిం దేవలా ! ద్య భోః ! ।
భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా । శ్రీః పూర్వం ధర్మనాయక ! ॥ 4

భాద్రపదమాసమున ఏకాదశియందు శ్రీ మహావిష్ణు యోగమున సోమవారమున నారాయణాద్రియందు 125

స్వామిపుష్కరిణీ తీరమున ఐశ్వర్యమున కగ్రగణ్యమగు పరమటితట్టున దేవతాగణములచే ప్రార్థింపబడిన లోకరక్షకుడైన పరమపురుషుడగు శ్రీనివాసుడు షడ్గుణోపేతుడై యవతరించెను. 126

పూజ్యుడైనట్టియు, పుండరీకాక్షుడైనట్టియు, పవిత్రుడైనట్టియు, ఆద్యబ్రహ్మ స్వరూపుడైనట్టియు, ఇంద్రియాధీనజ్ఞానము లేనట్టియు, పూర్ణకళాస్వరూపుడును నగు శ్రీనివాసునికి నమస్కారము. 127

ఇది శ్రీ పద్మపురాణమున క్షేత్రఖండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శనుల సంవాదమున శ్రీ శ్రీనివాసు లవతరించుట యనెడు ముప్పదిమూడవ అధ్యాయము

---

# ముప్పదినాల్గవ అధ్యాయము

## పద్మసరోవర మాహాత్మ్యము

దేవలుడు —

దేవదర్శనా ! పూజ్యుడా ! పద్మసరస్సుయొక్క పుట్టుకయును, మాహాత్మ్యమును ఇంకను వినవలెనని నాకు చాల కుతూహలముగనున్నది. 1

ఏ ప్రదేశమున తపస్సుచేయుటచే వ్యాసపుత్రుడగు శ్రీ శుకునకు సిద్ధి కరతలామలకమైనదో దాని మాహాత్మ్యమును చెప్పుము. ప్రపంచమున శ్రీ శుకుడు ముక్తుడయ్యెనని ప్రసిద్ధికలదుగదా ! 2

సర్వజ్ఞా ! నా గురుపుంగవా ! నాయందు దయయుంచి యీ శుకుడు బ్రహ్మలోకమునుండి వచ్చిన శుకుడా ! వేరొకడా ! నాకు సెలవిమ్ము. 3

## భృగుమహర్షి పాదముతో తన్నుటచే కోపగించిన లక్ష్మీదేవి కపిలుని ఆలయమునకేగుట

ఓ దేవలా ! ధర్మనాయకా ! నేడు పద్మసరస్సుయొక్క పుట్టుకను గూర్చి వినుము. పూర్వము లక్ష్మీదేవి భృగుమహర్షికి ఖ్యాతియను భార్యయందు పుట్టినది. 4

భృగుపాదాహతస్యాస్య । విష్ణోః వైకుణ్ఠవాసినః ।
విప్రపాదరజఃస్పృష్టా । కుపితా కపిలాలయమ్ ॥ 5

గత్వా పాతాలమూలం సా । మునినా తేన పూజితా ।
శ్రీమతా సా హితేనైవ । కపిలేన కృతాలయా ॥ 6

పూజితా చ చిరం కాలం । తత్ర వాసం తదాఽకరోత్ ।
ధరణీ సహితో విష్ణుః । లీలయా ధృతచామరః ॥ 7

## లక్ష్మ్యన్వేషణార్థం ధరాతలం ప్రతి భగవదాగమనమ్

తం మునిం పూజయిత్వాఽథ । భృగుం బ్రహ్మర్షిసత్తమమ్ ।
నీలాం నిఃక్షిప్య వైకుణ్ఠే । భూదేవ్యా భూమి మాగతః ॥ 8

శఙ్ఖచక్రగదాకున్త । పాణిఃపద్మదలేక్షణః ।
శ్రీదేవ్యన్వేషణం కుర్వన్ । నానారూపి జనార్దనః ॥ 9

షట్పఞ్చాశత్సు దేశేషు । విచిన్వన్ పురుశోత్తమః ।
కొల్హాపురం సమాగమ్య । శ్రియో ఽధిష్ఠాన ముత్తమమ్ ॥ 10

తత్రా పశ్య న్మహాలక్ష్మీం । అర్చారూపేణ రాజతీమ్ ।
అగస్త్యారాధితాం పూర్వం । ప్రతిష్ఠాప్యాఽలయోత్తమే ॥ 11

తాం దృష్ట్వా తత్ర దేవేశో । మహితాం మునిసత్తమైః ।
అర్చయంశ్చ స్వయం విష్ణుః । ఉవాస దశ వత్సరాన్ ॥ 12

## శ్రీకొల్హాపురవాసిలక్ష్మీ మర్చయన్తం భగవన్తం ప్రత్యశరీరోక్తిః

అథా బ్రవీత్తదా విష్ణుం । అశరీరా సరస్వతీ ।
విష్ణో ! ప్రసీద భగవన్ ! । లక్ష్మీదర్శనలాలస ॥ 13

ఇతో దక్షిణతో గచ్ఛ । కృష్ణవేణ్యాశ్చ దక్షిణే ।
ద్వావింశద్యోజనే విష్ణో ! । సువర్ణముఖరీ నదీ ॥ 14

వైకుంఠమున నివసించు శ్రీ మహావిష్ణువు భృగుమహర్షి పాదముచే తన్నబడగా నట్టి బ్రాహ్మణుని పాదధూళిసోకి లక్ష్మీదేవి కోపగించి కపిలుని ఆలయమునకేగెను. 5

అట్లు పాతాళమూలముననున్న ఆ కపిలాలయమునకేగి భక్తిసంపన్నుడై నట్టియు హితుడైన ఆ కపిలమహర్షిచే పూజింపబడినదై అచ్చటనే నివాసమునకేర్పాటుగావించుకొనినది

ఆయనచే నట్లు పూజింపబడుచు చాలకాల మచ్చట కల్పించుకొనెను. (ఇట్లుండగా) శ్రీ మహావిష్ణువు భూదేవితో కూడినవాడై ఆమెచే విలాసముగా చామరముచే వీచబడుచున్నవాడై 7

## లక్ష్మీదేవిని వెదుకుటకై శ్రీనివాసుడు భూమికేతెంచుట

అట్లు తన్నిన బ్రహ్మర్షులలో నుత్తముడైన భృగుమహర్షిని పూజించి పిమ్మట వైకుంఠమున నీళాదేవిని నిలిపి భూదేవితో భూమండలమునకు వచ్చెను. 8

ఆ జనార్దనుడు పెక్కు రూపములను ధరించుచు శంఖచక్రగదాకున్తాయుధములను చేతులలో ధరించి లక్ష్మీదేవిని వెదకుచు 9

ఆ పురుషోత్తముడు (ఛప్పన్న) ఏబదియారు దేశములయందామెను వెదకుచు కొల్హాపురమునకు చేరెను. ఆ స్థలము లక్ష్మికి శ్రేష్ఠమగు ఉనికిపట్టు. 10

అచ్చట పూర్వకాలమందే అగస్త్యమహర్షి లక్ష్మీదేవిని అర్చావిగ్రహరూపముగా ఉత్తమమైన ఆలయమున వేంచేపుచేసి ఆరాధించుచుండగ దర్శించెను. 11

దేవాధిదేవుడగు శ్రీనివాసుడామె నచ్చట ప్రసిద్ధ మునిపుంగవులచే పూజింపబడుచుండగా జూచి తానుకూడ వారితోనా లక్ష్మిని పూజించుచు పది సంవత్సరములుండిపోయెను. 12

## శ్రీ కొల్హాపురమునందున్న లక్ష్మీదేవిని పూజించుచున్న భగవంతుని గూర్చి అశరీరవాణి పలుకుట

అటుపిమ్మట ఆకాశవాణి యప్పుడా విష్ణువునుగూర్చి యిట్లు పలికెను. లక్ష్మీదేవిని చూడగోరు పూజ్యుడవగు నో మహావిష్ణో! అనుగ్రహింపుము. 13

నీవిచ్చటినుండి దక్షిణదిశగా కృష్ణవేణీ (కృష్ణా) నదియొక్క దక్షిణముగా వెళ్ళుము. ఇరువదిరెండు యోజనముల దూరమున సువర్ణముఖరీ యను నొక నదికలదు. 14

తీర మాసాద్య తస్యా స్త్వం । ఉత్తరం మునిసేవితమ్ ।
కున్తేనా ఽహత్య తత్తీరే । సరః కృత్వా తపః కురు ॥ 15

ఆహృత్య దేవలోకా త్త్వం । సువర్ణకమలాని చ ।
సంస్థాప్య తస్మిన్ సరసి । సర్వాణి కమలాని చ ॥ 16

తత్తీరే పుష్పజాతీ శ్చ । పుష్పవృక్షశతాని చ ।
పద్మా ఽరామే చ సరసి । పద్మాయాః పద్మవల్లభ ! ॥ 17

జప న్నేకాక్షర మనుం । సహస్రాక్షర మేవ వా ।
అర్చయన్ కమలైః పద్మాం । ద్వాదశాబ్దం వస ప్రభో ॥ 18

తతః ప్రసన్నా సా దేవీ । స్త్వయా మావిర్భవిష్యతి ।
సువర్ణకమలే దేవ ! । సువర్ణకమలాకృతిః ॥ 19

ఊనషోడశవర్షా సా । శ్రీః పద్మనయనా తవ ।
గచ్ఛ శీఘ్ర మితో విష్ణో ! । సువర్ణముఖరీ తటమ్ ॥ 20

## శేషాచలాధ్వనా రాజరూపస్య భగవతః సువర్ణముఖరీతీరాగమనమ్

ఆతి సౌమ్యం వచః శ్రుత్వా । విష్ణు రాకాశసమ్భవమ్ ।
జగామ గరుడారూఢః । సువర్ణ ముఖరీతటమ్ ॥ 21

పశ్యం శ్చ వివిధాన్ దేవాన్ । పర్వతాం శ్చ వనాని చ ।
వరాహాధిష్ఠితం పుణ్యం । అఞ్జనాద్రిం సురారిహా ॥ 22

స్వామిపుష్కరిణీం దృష్ట్వా । భూవరాహస్య సన్నిధౌ ।
గరుడా దవతీర్యా సౌ । స్నాత్వా స్వామిసరోజలే ॥ 23

వైఖానసై శ్చ మునిభిః । ఆతిధ్యేన సుపూజితః ।
వ జ్ఞాతో రాజరూపేణ । మునిభిః పురుషోత్తమః ॥ 24

ఆ నదీతీరమునకు నీవు వెళ్ళుము. దాని కుత్తరదిశలో మునీశ్వరులు తపం బొనరించుచుందురు. నీవచ్చట ఒడ్డునందే బల్లెముతో త్రవ్వి చిన్న సరస్సును కల్పించి యచ్చట తపంబొనరింపుము. 15

దేవలోకమునుండి బంగారు కమలములను దెచ్చి వానినన్నిటిని ఆ సరస్సున పడవేయుచు 16

ఆ యొడ్డుననే అనేక జాతుల పుష్పవృక్షములను నాటుము. లక్ష్మీనాథా! ఆ పద్మవనములతో నిండిన ఆ సరస్సునందు 17

లక్ష్మీ ఏకాక్షరీ మంత్రముగాని, సహస్రాక్షర మంత్రమునుగాని జపించుచు లక్ష్మీదేవి పూజించుచు పన్నెండు సంవత్సరములు నివసింపుము. 18

అంత నా దేవి ప్రసన్నురాలైనంతనే నీకు బంగరు పద్మములో బంగరు పద్మాకారముగ 19

పదునారు సంవత్సరములకు లోబడిన వయస్సుగలదై తామరపువ్వులను బోలిన కండ్లుగల లక్ష్మీదేవి నీకు ప్రత్యక్షమగును. శ్రీ మహావిష్ణో! సువర్ణముఖరీ నదీతీరమునకు వెంటనే వేంచేయుము. 20

## శేషాచల మార్గమున రాజరూపమును ధరించి వేంచేయుచున్న భగవంతుడు సువర్ణనదీ తీరమున కేతెంచుట

ఈ విధముగ ఆకాశవాణియొక్క మృదువైన మాటను విని గరుడునెక్కి సువర్ణనదీ తీరమున కేతెంచెను. 21

దేవశత్రుహంతకుడగు నారాయణుడు అచ్చట అనేకమంది దేవతలను, పర్వతములను, వనములను చూచుచు వరాహభగవానునిచే ముందుగనే అధిష్ఠింపబడియున్న అంజనాద్రిని

స్వామిపుష్కరిణిని జూచి భూదేవితో కూడి వేంచేసియున్న వరాహస్వామి సన్నిధిలో గరుడవాహనమునుండి దిగి స్వామిపుష్కరిణీ జలమున స్నానమొనరించి 23

వైఖానసవ్రతధారులైన మునులచే ఆతిథ్యపురస్సరముగ బూజింపబడెను. కాని ఆ మునులచేత నా పురుషోత్తముడు రాజకుమారుడుగా తలంపబడలేదు. 24

యయౌ ప్రాతః సముత్థాయ । మునీ నామన్త్ర్య తాన్ విభుః ।
అశ్వరూపస్తు గరుడం । ఆరుహ్య పురుషోత్తమః ॥ 25

గదా కున్తధరో దేవో । గిరే ర్దక్షిణతో వ్రజన్ ।
సువర్ణపఙ్కజాకీర్ణం । సువర్ణముఖరీం హరిః ॥ 26

దృష్ట్వా స విస్మయో భూత్వా । గరుడా దవరుహ్య చ ।
తత్ర పుణ్యే సమే దేశే । కున్తేనా ఽహత్య భూతలమ్ ॥ 27

భగవత్కృతపద్మసరోవరనిర్మాణ ప్రకారః

గోకర్ణమాత్రవిస్తారం । చకార రుచిరం సరః ।
స్మృత్వా వాయుం సమాహూయ । తమువాచ మహామనాః ॥ 28

ఇన్ద్రస్యా నుమతే వాయో । రుక్మపద్మాని చాహర ।
స్థాపయిష్యామి సరసి । లక్ష్మీపూజావిధౌ మరుత్ ! ॥ 29

త చ్ఛ్రుత్వా వాయు రాహై నం ! తస్యాం నద్యాం హి సన్తి వై ।
కాఞ్చనాని చ పద్మాని । కిమర్థం సురలోకతః ॥ 30

శ్రీభగవాన్ —

కొల్హాపురే మహావాణీ । హ్య శరీరా ఽబ్రవీ త్త్వరా ।
దేవలోకా త్సమానీయ । కాఞ్చనాబ్జాని చా ర్చయ ॥ 31

ఇతి మా మబ్రవీ ద్వాయో । తస్మా దానయ మే ఽమ్బుజమ్ ।
గత్వాలోకంతతోవాయుః । ఇన్ద్రలోకాదుదారధీః ॥ 32

దేవేన్ద్రానుమతేః శీఘ్రం । ఆనయామాస తాని వై ।
కాఞ్చనాబ్జాని నిక్షిప్య । తస్మిన్ సరసి మాధవః ॥ 33

పద్మవికాసనైరన్తర్యార్థం భగవత్కృత సూర్యనారాయణ ప్రతిష్ఠా

విష్ణు ర్సూర్యం ప్రతిష్ఠాప్య । ప్రాఙ్ముఖం సరస స్తటే ।
అర్చయన్ పఙ్కజాధీశం । కమలావాప్తయే విభుః ॥ 34

ఆ ప్రభువు ప్రాతఃకాలమున మేల్కాంచి యా మునులవద్ద సెలవుతీసుకొని గుఱ్ఱపు రూపమును ధరించియున్న గరుడునెక్కి 25

గదను, కుంత (బల్లె) మను నాయుధములను చేబూని ఆ కొండకు కుడితట్టుగ నేగుచు బంగరు పద్మములతో నిండియున్న సువర్ణముఖరీనదిని 26

జూచి ఆశ్చర్యమును చెందినవాడై గరుడునినుండి దిగి, అచ్చట సమతలముగ నున్న ప్రదేశమునందు బల్లెముతో భూమిని త్రవ్వెను. 27

## భగవానుడు పద్మసరోవరమును నిర్మించుట

ఆవుచెవి యంతమాత్రమొక అందమైన సరస్సును నిర్మించెను. వాయుదేవుని తలంచి రప్పించి ఆతనితో నిట్లనెను — 28

ఓ వాయుదేవుడా ! నీ వేగి దేవేంద్రుని యాజ్ఞనుబడసి స్వర్గమునుండి బంగరు పద్మములను తెమ్ము. లక్ష్మీదేవి పూజకై వాని నీ సరస్సున పడవేయుదును. 29

దానిని విని వాయువాతనితో నిట్లనెను. స్వామీ ! ఆ నదియందు సహజముగనే స్వర్ణపద్మములున్నవిగదా ! ఇక స్వర్గలోకమునుండి తేనేల ? యని పల్కెను. 30
భగవానుడు ——

పూర్వమాకాశవాణి కొల్హాపురమున లక్ష్మీదేవి యున్నది. కావున నీవు దేవలోకమునుండి కనక కమలములను దెచ్చి వానితో నర్చింపుము. 31

అని యో వాయుదేవుడా ! నన్నుగూర్చి పలికెను, కావున నా కా పద్మములను తెమ్ము. ఆ పిమ్మట నా యుదారబుద్ధిగల వాయువు దేవలోకమునకేగి ఇంద్రలోకమునుండి

దేవేంద్రుని యనుమతినిబడసి వేగముగ నా కనక పద్మములను దెచ్చెను. అంత నా లక్ష్మీవల్లభు డా పద్మములను ఆ సరస్సులో సమర్పించెను. 33

## పద్మములు సర్వదా వికసించియే యుండుటకు భగవాను డచ్చట సూర్యనారాయణుని ప్రతిష్ఠించుట

విభువగు నా మహావిష్ణువు నదీతీరమున తూర్పుముఖముగ సూర్యుని ప్రతిష్ఠించి లక్ష్మీదేవిని బడయుటకై యాతని నర్చించుచుండెను. 34

శక్తిపూర్వం శ్రియో బీజం । కామబీజ మతః పరమ్ ।
ఆద్యన్తః ప్రణవోపేతం । అక్షరత్రయసమ్పుటమ్ ॥ 35

## లక్ష్మీమన్త్రోపాసనపూర్వక భగవత్కృత తపోవిధిః

త్రిసహస్రం జప న్నిత్యం । దశాంశం తర్పయన్ విభుః ।
అర్చయన్ పద్మ సాహస్రైః । దివ్యైః కాఞ్చనసమ్భవైః ॥ 36

తర్పయన్ పద్మసరసో । రసేనో షసి మాధవః ।
క్షీరాహారో యతాహారో । లక్ష్మ్యారాధనతత్పరః ॥ 37

తద్భానుసన్నిధౌ తీరే । పశ్చిమాభిముఖో విభుః ।
దీక్షాం వివేశ దేవేశో । ద్వాదశాబ్ద మనన్యధీః ॥ 38

## నృపశఙ్కయా భగవత్తపోభఙ్గాయే న్ద్రాదికృతరమ్భాదిప్రేషణమ్

ఏవం స్థితే మహావిష్ణౌ । శ్రీకాఙ్క్షిణి సమాహితే ।
ఇన్ద్రాదిదేవాః సంక్షుబ్ధాః । మాయామోహసమన్వితాః ॥ 39

భూపతేః పార్థివేన్ద్రస్య । విష్ణోర్మానుషరూపిణః ।
విఘ్న మిచ్ఛ తపసః కర్తుం । ఉద్యమం చక్రు రుద్ధతాః ॥ 40

ఆహూయా ప్సరస స్సర్వాః । ప్రోచు స్సేన్ద్రా దివౌకసః ।
యూయం గచ్ఛత భూలోకం । అఞ్జనాద్రే స్సమీపతః ॥ 41

సువర్ణముఖరీనామ । నదీ మునినిషేవితా ।
తస్యా ఏవో త్తరే తీరే । కుమ్భయోనే ర్మహాఽఽశ్రమః ॥ 42

తదాశ్రమా త్పూర్వభాగే । కశ్చి ద్రాజా తపస్యతి ।
కనకాబ్జసర స్తీరే । పురస్తా ద్భాస్కరస్య చ ॥ 43

త్రైలోక్యలక్ష్మీ మాకాఙ్క్షన్ । మాయావీ స చతుర్భుజః ।
క్షోభయధ్వం నృత్యగీతైః । అన్యైః శృఙ్గారచేష్టితైః ॥ 44

ముందుగ శక్తిని కూర్చి ఆపై లక్ష్మీబీజమును, దానిపై కామబీజమును చేర్చి ఆదియంతములయందు ప్రణవమును కూర్చి మూడక్షరముల సంపుటమైన మంత్రమును 35

## లక్ష్మీమంత్రము నుపాసించుచు భగవంతుడు తపమొనరించుట

ప్రతిదినము మూడువేలు జపించి అందు పదియవ భాగము (అనగా మూడు వందలు) తర్పణమునుచేయుచు, వేయి దివ్యకనక పద్మములతో నర్చించుచు 36

శ్రియఃపతి లక్ష్మినారాధించు ఆసక్తితో ఆహారనియమమును కలవాడై పాలను మాత్రమే గ్రోలుచు ఉదయమునందే ఆ పద్మసరస్సు నీటిలో తర్పణ మొనరించుచు 37

ఆ తీరమున సూర్యుని సన్నిధానమున పడమటిముఖముగా కూర్చొని పన్నెండు సంవత్సరములు యితర చింతలు లేకుండగ నారాయణుడు దీక్షనువహించెను. 38

## అది యొక రాజుచేయు తపస్సని భ్రమించి దానిని చెడగొట్టుటకై ఇంద్రాదులు రంభాదులను పంపించుట

ఇట్లు శ్రీ మహావిష్ణువు నిశ్చలచిత్తుడై లక్ష్మిని బడయుటకు ఉద్యమించుచుండగా విష్ణుమాయావిమోహితులైన దేవేంద్రాది దేవతలు తల్లడిల్లినవారై 39

ఒక చక్రవర్తి వేషమును ధరించియున్న శ్రీ మహావిష్ణువు యొక్క తపస్సును చెడగొట్టవలెనని ప్రబల ప్రయత్నమును చేయుటకుద్యమించిరి. 40

ఇంద్రాధి దేవతలు అప్సరసల నందరను రప్పించి వారితో మీరు భూలోక మునకేగి అంజనగిరికి సమీపముగ 41

మునులచే సేవింపబడుచున్న సువర్ణముఖరీయని ప్రసిద్ధిగల నది యొకటి కలదు. దాని యుత్తరతీరమున అగస్త్యమహర్షి యాశ్రమ మొకటి కలదు. 42

ఆ యాశ్రమమునకు తూర్పుగా నొక రాజెవ్వడో తపస్సును చేయుచున్నాడు. సువర్ణపద్మ సరస్సు వద్దున సూర్యునకెదురుగా 43

ముల్లోకాధిపత్యమును గోరుచు మాయలమారియగు నా నారాయణుడే కావచ్చు (తపస్సును చేయుచున్నాడు) మీరు ఆటలతోను, పాటలతోను, ఇంకను ఇతరములైన శృంగారచేష్టలతోను 44

## రాజవేషధృద్భగవత్తపోవనం ప్రతి ఇన్ద్రప్రేషిత రమ్భాద్యాగమనమ్

ఇతి దేవై స్సమాదిష్టాః । సర్వా హ్యప్సరసాం వరాః ।
వసన్తకామసహితా । జగ్ముః పద్మసరోవరమ్ ॥ 45

అవతీర్ణో వసన్త స్తు । జజృమ్భే తద్వనే భృశమ్ ।
చూతకింశుకమన్దార । కర్ణికారానతోజ్జ్వలైః ॥ 46

కోకిలైః భృఙ్గరాజైశ్చ । శోభితై ర్వివిధైః ఖగైః ।
రమ్యే వనే తపస్యన్తం । పురుషం సుభగాకృతిమ్ ॥ 47

దృష్ట్వా చతుర్భుజం చిత్రం । మోహితా శ్చాప్సరోగణాః ।
జగుః కల ఇచ్ఛ నన్నృతుః । తదగ్రే తావరాఙ్గనాః ॥ 48

కల్హారశీతలో వాయుః । చాలయన్ పుష్పవాటికామ్ ।
వవౌ మలయ సమ్భూతో । మదయన్ వనవాసినః ॥ 49

## స్వాశ్రమాగతాప్సరోవఞ్చనార్థం భగవత్కృతమాయానిర్మాణమ్

ఏతస్మి న్నన్తరే విష్ణుః । కిఞ్చి దున్మీల్య చక్షుషీ ।
మాయా మన్యాం విససృజే । తాసాం సమ్మోహనాయ వై ॥ 50

తాం విష్ణుమాయాం వీక్ష్యైవ । వివశా వినతాననాః ।
స తు పద్మాని సఞ్చిన్వన్ । చచార సరసీజలే ॥ 51

యథా పూర్వం పూజయం శ్చ । నిర్వికారో నిరఞ్జనః ।
తం దృష్ట్వా నిర్వికారం తా । వికర్తుం పురుషోత్తమమ్ ॥ 52

అశక్తా జగ్ము రాకాశం । విష్ణుమాయావిమోహితాః ।
తాం మాయాం భగవా నాహ । "లోకపూజ్యా భవిష్యసి" ॥ 53

ఇక్షుచాపాసిచక్రాబ్జ । పుష్పబాణధరా సతీ ।
చతుర్వర్గప్రదా పుంసాం । వర్ణకీరాదిపూజితా ॥ 54

## రాజవేషమును ధరించిన భగవంతుని తపోవనమునుగూర్చి ఇంద్రుని పంపున రంభాదులు వచ్చుట

ఇట్లింద్రాదులచే నాజ్ఞాపింపబడిన ఉత్తమాప్సరస లందరును వసంతుడు, మన్మథుడు తోడుగరాగా పద్మసరోవరమున కేగిరి. 45

వసంతుడు క్రిందికి దిగి ఆ వనమునందంతటను మిక్కిలి విజృంభించెను. మామిడిగున్నలు, మోదుగులు, మందారములు, కర్ణికారములును పూగుత్తులతోను, నూతన చిగుళ్ళతోను వంగి రాజిల్లుచుండెను. 46

కోకిలలు, శ్రేష్ఠమగు తుమ్మెదలు, ఇంకను నానారకముల పక్షులతో శోభిల్లుచున్న సుందరాకారుడగు శ్రీ మహావిష్ణువును 47

చతుర్భుజములతో విచిత్రముగ వేంచేసియుండ జూచి యా యప్సరసలందరును తామే మోహించి మధురముగపాడుచు నాతనిముందా సుందరాంగులందరును ఆడదొడంగిరి.

మలయపర్వతమున బుట్టి యగ్రకలవల సంపర్కముచే చల్లనైన గాలి పూలతోటనంతను కదల్చుచు తన వాసులకు కామోద్రేకమును కలిగించుచు వీచదొడగెను. 49

## తన యాశ్రమమునకు వచ్చిన అప్సరసలను మోసగించుటకై నారాయణుడు నిర్మించిన మాయలు

ఇంతలో నా శ్రియఃపతి కొంచెము కన్నులను తెఱచి వారిని మోహపెట్టుటకై మరియొక మాయను విడిచెను. 50

ఆ మాయను చూచినంతనే యప్సరసలు పరవశలై సిగ్గుచే తలలను వంచుకొనిరి, నారాయణుడు మాత్రము ఆ నదీజలమున పుష్పములను కోయుచు 51

ఏ వికారములును ఏ కర్మలును లేకయే వెనుకటివలెనే నిశ్చింతగా పూజను సలుపుచుండెను. అట్లు నిర్వికారుడై తన పనిని సాగించుకొనుచున్న ఆ పురుషోత్తము నా స్త్రీలు జూచి వికరింపజేయుటకు 52

అసమర్థులై పైగా తామే ఆతని మాయలో మిక్కిలి వ్యామోహితులై ఆకసమున కెగసిపోయిరి, అంత నా మహావిష్ణువా మాయతో నీవు లోకపూజ్యురాలవగుదువు 53

నీకు చెఱకు విల్లగును. శంఖము, చక్రము, ఖడ్గము, పుష్పబాణములను ధరించి ఆకులు, పాలతో పూజింపబడి మానవులకు ధర్మార్థకామమోక్షముల నొసంగుచుందువు 54

ఇత్యా దిశ్య చ తాం దేవీం । అర్చయామాస పద్మినీమ్ ।
ఏవం తపస్యత స్తస్య । ద్వాదశాబ్దా గతా ద్విజ ॥ 55

## పద్మసరోవరా ల్లక్ష్మ్యాః ప్రాదుర్భావః

తత స్త్రయోదశే వర్షే । కార్తికే శుక్ల పక్షకే ।
పఞ్చమ్యాం శుక్రవారే చ । ముహూర్తే మన్త్రసఙ్ఞకే ॥ 56

వవుః పుణ్యా స్సుఖా వాతా । ఉత్తరాషాఢ తారకే ।
ప్రసన్నం సలిలం సర్వం । త్రైలోక్యా న్తర్గతం ద్విజ ॥ 57

సుప్రభో భానుమా నాసీత్ । ప్రసన్నాని మనాంసి చ ।
తతః పద్మసరో మధ్యే । తేజోరాశి ర్మహా నభూత్ ॥ 58

బాలభానుసహస్రాభః । సువర్ణసదృశచ్ఛవిః ।
తన్మధ్యే కాఞ్చనైః పద్మైః । నిర్మితో రథ ఉత్తమః ॥ 59

పద్మిభి ర్ధృతపార్శ్వ శ్చ । చతుర్భిర్మదగన్ధిభిః ।
తన్మధ్యే కాఞ్చనే పద్మే । సహస్రదళశోభితే ॥ 60

తత్పద్మకర్ణికామధ్యే । పద్మాఽసనసమన్వితా ।
పద్మహస్తా పద్మనేత్రీ । రక్త పద్మపదద్వయా ॥ 61

సువర్ణపద్మముకుళ । ద్వయశోభికుచానతా ।
స్మేరపద్మరజోగన్ధి । సముచ్ఛ్వాసముఖామ్బుజా ॥ 62

బిమ్బాధరసుసంవృద్ధ । స్మితశోభిసుధారసా ।
సమ్పల్లక్ష్మీసమావాస । విశాలనయనద్వయా ॥ 63

సర్వరత్నసముత్క్షిప్త । జామ్బూనదవిభూషణా ।
కర్ణికోత్పలతాటఙ్కా । మౌక్తికాలకబన్ధనా ॥ 64

అని యిట్లా మాయాదేవి కాజ్ఞయొసంగి తాను లక్ష్మీయారాధనను చేసుకొనెను. ఓ దేవలా ! ఇట్లు తపస్సుచేయుచు పన్నెండు సంవత్సరములను గడపెను. 55

## పద్మసరోవరమునుండి లక్ష్మి ఆవిర్భవించుట

ఆపైన పదమూడవయేట కార్తీకమాసమున శుక్లపక్షమందు పంచమీ శుక్ర వారమున మంత్రమనెడు శుభముహూర్తములో 56

సుఖకరమైన పుణ్యవాయువులు వీచుచుండగ ఉత్తరాషాఢ నక్షత్రమున ముల్లో కములలోని మునీశ్వరంతయు నిర్మలముగానుండగా 57

సూర్యుడు నిర్మల తేజస్సుతో వెలుంగుచుండ, సజ్జనచిత్తములు ప్రసన్నమై యుండ, ఆ పద్మసరస్సునకు మధ్యభాగమున గొప్ప వెలుగొకటి యావిర్భవించెను, 58

దానికి మధ్యమందు వేయిమంది బాలసూర్యులతో సమానమై బంగరుతో సమా నమైన కాంతిగలదై బంగరుపద్మములతో చేయబడిన శ్రేష్ఠమైన రథమొకటి 59

మంచిజాతికి చెందిన నాలుగు మదగజములచే నలుగడల ధరింపబడినదై గాన్పిం చెను. దానికి మధ్యభాగముల్లో వేయిదళములుగల సువర్ణపద్మములో 60

దాని దుద్దుపై పద్మాసనాసీనయై పద్మమును చేతిలో ధరించి పద్మములను బోలిన కండ్లు, ఎఱ్ఱని పద్మములవంటి పాదములుకలదై 61

బంగరు పద్మమొగ్గలను బోలిన స్తనద్వయముచే కొంచెము ముందుకు వంగినదై, వికసించిన తామరపువ్వునందలి పరాగమువలె పరిమళించు ఉచ్ఛ్వాస నిశ్శ్వాస ములుగల ముఖపద్మముకలదై 62

దొండపండువంటి అధరముపై తళుకొత్తు చిరుగవుతో చిమ్మబడిన పీయూష రసాన్వితయై, వికసించు శోభచే నావరింపబడుటచే విశాలమైన రెండు కండ్లుకలదై 63

సకలరత్నములచే పొదగబడిన బంగరు ఆభరణములను ధరించినట్టిదై తామర దుద్దును, నల్లకల్వను చెవులకు కమ్మలనుగాగలదై, ముంగురులను ముత్యాలహారముతో బంధించినదై 64

ఆముక్తముక్తామకుట । కటకాఙ్గదకఙ్కణా ।
విద్యుత్పుఞ్జప్రతీకాశ । విచిత్రామ్బరచిత్రితా ॥ 65

మన్దస్మితా మనోజ్ఞాఙ్గీ । మాధవం వీక్ష్య సాదరమ్ ।
కల్హారమాలా మాదాయ । యక్షకర్దమలేపనామ్ ॥ 66

సుగన్ధితులసీదూర్వా । మధూకకమలోత్పలామ్ ।
స్థితాపద్మరతేదేవీ । దేవం వీక్ష్య చతుర్భుజమ్ ॥ 67

తతో దేవగణా స్సర్వే । వాదయన్ దేవదున్దుభీః ।
శఙ్ఖానాపూరయామాసుః వీణా శ్చ ముముచు స్స్వరాన్ ॥ 68

షడ్జాదీన్ సమతాలేన । గన్ధర్వా లలితం జగుః ।
ననృతుర్దివ్యాప్సరసః । సుస్వరం గీతలాలసాః ॥ 69

తూర్యఘోషేణ మహతా । కృత్స్నమాపూరితం జగత్ ।
తేన ఘోషేణ విజ్ఞాయ । శ్రియః ప్రత్యక్షతాం విధిః ॥ 70

### లక్ష్మ్యవతారదర్శనార్థం పద్మసరస్తీరం ప్రతిబ్రహ్మాద్యాగమనమ్

హంసారూఢ స్సహమునిః । బ్రహ్మా తత్ర సమాయయౌ ।
కైలాసా చ్ఛఙ్కర శ్చాపి । గౌరీ గణసమన్వితః ॥ 71

ఇన్ద్ర శ్చాద్యా లోకపాలైః । శ్రుత్వా శఙ్ఖధ్వనిం యయౌ ।
వసిష్ఠాద్యా శ్చ మునయః । సనకాద్యా శ్చ యోగినః ॥ 72

కాఞ్చనాబ్జసరస్తీరం । పద్మనాభాశ్రమం యయుః ।
సర్వలోకేశ్వరీం తత్ర । శ్రియం పద్మరథస్థితామ్ ॥ 73

దృష్ట్వా విద్యాధరా స్సర్వే । పుష్పవృష్టి ముచో దివి ।
విస్మితా స్సస్మితా స్సర్వే । దేవా స్తుష్టు శ్చ సస్పృహాః ॥ 74

ముత్యముల కిరీటమును ధరించి, మురుగులు, దండకడియములు, తోడాలను ధరించినదై మెరుపుల గుత్తులను బోలిన విచిత్రమైన చీరెను చిత్రముగా ధరించినదై 65

మనోహరమైన సమస్తావయవము లనుకలదై, చిరునగవు ముఖమున తళుకొత్త మాధవుని ఆదరముతో జూచి సుగంధ ద్రవ్యములచే చేర్చిన చందనము పూయబడిన ఎఱ్ఱ కలువమాలను చేధరించి 66

సహజముగ పరిమళించు తులసీ, దూర్వా, ఇప్ప, పద్మ, కలువ మాలలను ధరించినదై పద్మరథముపై నాసీనయైన లక్ష్మీదేవి చతుర్భుజుడైన ఆదిదేవుని గాంచెను. 67

అంతలో దేవతలందరును దేవదుందుభులను ప్రయోగించిరి. శంఖములను గట్టిగానూదిరి. వీణానాదములను వినుపించిరి. 68

గంధర్వులు షడ్జాది సర్వరములతో తాళము తప్పకుండగ పాడిరి. పాడుటలో పరవశులగు అప్సరసలు మంచి స్వరములతో పాడుచు నాడిరి. 69

మహత్తరమైన వాయిద్యధ్వనులతో ప్రపంచమంతయు నిండిపోయెను. ఆ ధ్వనిని విన చతురాననుడు లక్ష్మి ప్రత్యక్షమైనదని యెఱింగి 70

## లక్ష్మీదేవి యవతారమును సందర్శించుటకై పద్మసరస్సీరమునకు బ్రహ్మాదులు విచ్చేయుట

బ్రహ్మదేవుడు హంసవాహనమునెక్కి మునీశ్వరులతోగూడి యచ్చటకు విచ్చే సెను. కైలాసమునుండి శంకరుడును పార్వతీదేవితోను, గణములతోను వచ్చెను. 71

ఆ శంఖధ్వనిని విని దేవేంద్రుడు శచీదేవితోను, దిక్పాలురతోను అక్కడ కేతెంచెను. వసిష్ఠాది మునీశ్వరులున్ను, సనకాది యోగులున్ను 72

పద్మనాభుని ఆశ్రమమగు సువర్ణపద్మ సరస్సుకడ్డునకు విచ్చేసిరి అచ్చట వారందరును పద్మరథమందు వేంచేసియున్న సకలలోకేశ్వరియగు లక్ష్మీదేవిని 73

దర్శించిరి. విద్యాధరులందరును ఆకసమున పుష్పవృష్టిని గురిపించిరి దేవతలందరును ఆశ్చర్యావిష్టులై నగుమొగములతో లక్ష్మీదేవియందాశతో నిలచియుండిరి. 74

దైతేయా దానవా శ్చాపి । నాగాః పాతాళవాసినః ।
సాభిలాషా రమాం వీక్ష్య । స్థితా మదనమోహితాః ॥ 75
మా మా్రశయే న్మా మా్రశయేత్ । ప్రత్యేకం మేనిరే హృది
ఇతి తేషు స్మరత్స్వే వ । దేవదానవభోగిషు ॥ 76

## లక్ష్మీకృతమాలార్పణపూర్వకభగవద్వరణమ్

ఉత్థాయ సస్మితా లక్ష్మీః । ఆగత్య హరి మఞ్జసా ।
కహ్లారమాలా మున్ముచ్య । విష్ణోః కణ్ఠే సమర్ప్యా చ ॥ 77
ఆలిఙ్గ్య తం చతుర్బాహుం । సర్వలోకాన్ వ్యలోకయత్
హరివక్షఃప్రతిష్ఠాయాః । శ్రియో దృష్ట్యాఽఽప్రేక్షితాః ॥ 78
స్వస్వాధికారాన్ సమ్ప్రాపుః । దేవదానవయోగినః ।
శ్రియా సమేతో భగవాన్ । కృతార్థః కమలాపతిః ॥ 79

## భగవతః పద్మసరోవరవరదానపూర్వకం శేషాచలగమనమ్

పాద్మం సర స్సమీక్ష్యై థ । వరం తస్మై దదౌ హరిః ।
హేసరః తవ తీరే ఽస్మిన్ । పద్మకాన్తస్య భాస్వతః ॥ 80
తపః కుర్వ న్నహం పద్మాం । ఆప్తవా నస్మి శాశ్వతీమ్ ।
తస్మా త్త్వ మద్య ప్రభృతి । పద్మవాపీతి నామతః ॥ 81
'పాద్మం' 'పద్మసర'శ్చే తి । పద్మాప్రీతికరం భువి ।
త్రిలోకీప్రథితం భూయా । హృద్దేశకమలాలయ ॥ 82
ఇత్యు క్త్వా గరుడేశానం । అధిరుహ్యా రమాసఖః ।
భోగిరాజగిరిం గత్వా । స్వామిపుష్కరిణీ తటే ॥ 83

## నారదాద్యష్టమహర్షిప్రశంసితపద్మసరోవరమాహాత్మ్యమ్

రమతే రమయై కాన్తే । రమణీయే శ్రియఃపతిః ।
తం దృష్ట్వా మునయ స్సర్వే । ప్రశశంసు స్సరోవరమ్ ॥ 84

రాక్షసులును రక్కసులును పాతాళమునందు నివశించు సర్పములును లక్ష్మీ దేవిని సందర్శించి కామజ్వరపీడితులై లొట్టలువేయుచు నిలచియుండిరి. 75

" నావద్దకే వచ్చును, నావద్దకే చేరు "నని ప్రతివారును తమ తమ హృదయములలో తలంచుచుండిరి. ఇట్లు దేవతలు, రాక్షసులు, పన్నగులు తలంచుచుండగనే 76

## లక్ష్మీ భగవంతుని కంఠమున పుష్పమాల నర్పించి వరించుట

లక్ష్మీదేవి చిరునగవుతో లేచివచ్చి వెంటనే తన మెడలోని ఎఱ్ఱ కలవపూవులను తీసి నారాయణుని మెడలోవైచెను. 77

ఆ చతుర్భుజుని కౌగిలించుకొని అపైన లోకులనందరను జూచెను. విష్ణు వక్షస్థలమున విరాజిల్లుచున్న శ్రీ మహాలక్ష్మీదేవి యొక్క కటాక్షవీక్షణముచే 78

ఆ దేవతలు, రాక్షసులు, యోగులు మొదలగువారందరును తమ తమ అధికారములను బడసిరి. షడ్గుణపూర్ణుడగు నా మాధవుడు కృతార్థుడై లక్ష్మీదేవితో కూడుకొని

## భగవానుడు ఆ పద్మసరోవరమునకు వరములొసంగి శేషాచలమున కేగుట

శ్రీహరి ఆపైన పద్మసరోవరమును కటాక్షించి దానికిట్లు వరమొసంగెను. ఓ సరస్సా ! పద్మముల కాంతితో భాసిల్లుచున్న నీ యొక్క యీ తీరమునందు 80

నేను తపంబొనరించుచు శాశ్వతమైన లక్ష్మిని పొందితిని. కాబట్టి నీవీనాటినుండి " పద్మవాపి " యను పేరుతో బరగుదువు. 81

"పాద్మ" మనియు "పద్మసరస్స" నియును నీకు పేరుండును. భూలోకమున నీవు లక్ష్మికెంతయు ప్రియమగుదువు. లక్ష్మికి స్థానమైన మధ్యభాగముకల సరస్సా ! నీవు మూడులోకములయందును ప్రసిద్ధిని గనుము. 82

అని పలికి భగవానుడు గరుడునిపైనెక్కి శేషాద్రికేగి స్వామిపుష్కరిణీ తీరమున 83

## నారదాది యెనమండుగురు ఋషులచే కొనియాడబడిన పద్మసరస్సుయొక్క మహిమ

మనోహరమగు నచ్చోట శ్రియఃపతి ఏకాన్తమున శ్రీ మహాలక్ష్మీదేవితో రమించుచుండెను. ఆ సరోవరమును జూచి మునులందరును ఇట్లు స్తుతించిరి — 84

నారదః —

యః పద్మసరసి స్నాతః । సప్తజన్మాఘనాశనే ।
శ్రియ మాప్నోతి విమలాం । శ్రియఃపతి రివా మలః ॥ 85

వసిష్ఠః —

రుక్మాబ్జసరసి స్నాతో । రుక్మనద్యా స్తటోద్భవే ।
కోటిజన్మకృతైః పాపైః । ముచ్యతే శ్రియ మాప్నుయాత్ ॥ 86

మరీచిః —

సువర్ణముఖరీకూలే । స్నాతః పద్మసరోవరే ।
మహాపాతక ముక్తో యః । స ముచ్యేతాం హసః క్షణాత్ ॥ 87

అత్రిః —

అత్ర పద్మసరస్స్నాతో । యో రుక్మతటీనీతటే ।
స సర్వపాపనిర్ముక్తః । శ్రియ మాప్నో త్యసరశయమ్ ॥ 88

అఙ్గిరాః —

భ్రష్టరాజ్య స్తు యో రాజా । స్నాత్య స్మి న్మణ్డలం యమీ ।
పద్మాకరాఖ్యే సరసి । స రాజ్యం ప్రాప్నుయా చ్ఛ్రియమ్ ॥ 89

పులస్త్యః —

విప్రో యః పద్మసరసి । వ్రాత్యో మన్త్రవివర్జితః ।
సో పి పూత స్త్రిషవణాత్ । దినే నైకేన శుద్ధ్యతి ॥ 90

పులహః —

వైశ్యో యో వఞ్చనాజీవీ । వ్యవహారవిశారదః ।
స పద్మసరిసి స్నాత్వా । రాజా భవతి ధార్మికః ॥ 91

క్రతుః —

శూద్ర స్త్వాచారవిభ్రష్టో । దేవబ్రాహ్మణదూషకః ।
స పద్మసరసి స్నాత్వా । పూతో వైశ్యో భవిష్యతి ॥ 92

దేవదర్శనః —

ఇతి ప్రస్తూయ మునయో । యయు స్తే స్వాశ్రమాన్ మునే ।
ఉత్పత్తిః పద్మసరసః । తవో క్తా దేవలా ! మలా ! ॥ 93

నారదమహర్షి —

ఏడుజన్మల పాపములను హరించు ఈ పద్మసరస్సునందు స్నానమొనరించు వాడు నిర్మలుడై నారాయణునివలె అపారమైన లక్ష్మిని బడయగల్గును. 85

వసిష్ఠఋషి —

సువర్ణనది యొడ్డున బుట్టిన సువర్ణపంకజ సరస్సులో స్నానమాడినవాడు కోటి జన్మలనుండియు చేసిన పాపమునంతను బాపుకొని లక్ష్మీసంపన్నుడగును. 86

మరీచి —

సువర్ణముఖరీ నదీతీరమున బుట్టిన పద్మసరస్సులో స్నానము చేసినవాడు మహా పాతకియైనను ఒక్క క్షణమున ఆ పాపమునుండి విముక్తుడగును. 87

అత్రి —

సువర్ణనదీ తీరముననున్న పద్మసరస్సులో స్నానమొనరించువాడు పాపములకు దూరుడై లక్ష్మినిబడయును. ఇందు సందియములేదు. 88

అంగిరసుడు —

రాజ్యమును పోగొట్టుకొనిన రాజు పద్మాకర మనెడు సరస్సునందు ఇంద్రియ నిగ్రహముతో నలుబది దినములు స్నానమును గావించినచో ఆ రాజ్యలక్ష్మిని తిరిగి బడయగల్గును. 89

పులస్త్యబ్రహ్మ —

మంత్రమును విడిచి ఆచారభ్రష్టుడైన బ్రాహ్మణుడు పద్మసరస్సులో మూడు వేళల స్నానము నాచరించినచో ఒక్కరోజునకే పరిశుద్ధుడగును. 90

పులహుండు —

మోసగించి జీవించు వ్యవహారకుశలుడగు వైశ్యుడు ఆ పద్మసరస్సునందు స్నానముచేసినచో ధార్మికుడైవ రాజగును. 91

క్రతువు —

వర్ణాచార భ్రష్టుడై దేవతలను దూషించు శూద్రుడు పద్మసరస్సులో స్నానము చేసి పవిత్రుడై వైశ్యుడగును. 92

దేవదర్శనుడు —

ఇట్లా ఋషులందరును ఆ సరస్సును పొగిడి తమ తమ ఆశ్రమములకేగిరి. పాపరహితుడవగునో దేవలా ! పద్మసరస్సుయొక్క పుట్టుకను నేను నీకు జెప్పితిని. 93

## శుకచారిత్రవర్ణనమ్

ఇతః పరం శుకోత్పత్తిం । వదామి శ్రుణు దేవల ! ।
పురా శుకో బ్రహ్మచారీ । సాక్షా ద్వైయాసకిః మహాన్ ॥ 94

లబ్ధ్వా బ్రహ్మోపదేశ స్తు । రుద్రాత్ జ్ఞానీ బభూవ హ ! ।
తప స్సిద్ధో జగామై వ । పశ్యన్ బ్రహ్మాత్మకం జగత్ ॥ 95

ఏవం జగా చ సతతం । జ్ఞానోన్మత్త స్స బాలవత్ ।
ఊనషోడశవర్షా ఒసౌ । సాక్షా త్కృష్ణ ఇవో జ్జ్వలః ॥ 96

మాతా చ కమలాదేవీ । పితా దేవో జనార్దనః ।
బాన్ధవా విష్ణుభక్తా శ్చ । స్వదేశో భువనత్రయమ్ ॥ 97

ఇత్యు క్త్వా వ్యాస మున్ముచ్య । భానుం ప్రతి జగామ హ ।
గచ్ఛన్తం శుక మాలోక్య । తీవ్రాంశో శ్చ సమీపతః ॥ 98

వ్యాసః పుత్రే తి చుక్రోశ । పుత్రే తి చ పునః పునః ।
ఆలోక్యా థ శుకం భానుః । ఉవాచ ప్రణయా ద్వటుమ్ ॥ 99

హేవటో గచ్ఛ భూలోకం । అపుత్ర స్త్వ మవాక్శిరాః ।
ముక్తః పితృఋణా త్పుత్రం । ఉత్పాద్యా గచ్ఛ శీఘ్రతః ॥ 100

అపుత్రస్య గతి ర్నాస్తి । తపః కృత్వా పి భూతలే ।
యజ్ఞం కృత్వా పి లోకార్థీ । స్వర్గం నై వాప్నుయాత్ పుమాన్ ॥ 101

## ఛాయాశుకోత్పత్తిః

ఇతి భానువచః శ్రుత్వా । శుకో ధ్యాత్వా జనార్ధనమ్ ।
ఆత్మచ్ఛాయా మథ శ్శీఘ్రం । అసృజ త్త్వాత్మపూరుషమ్ ॥ 102

ఛాయాశుక ఇచ్ఛ తం కృత్వా । స్వాత్మపుత్ర మివా త్మవాన్ ।
పితు ర్మే శోకనాశం త్వం । కురు పుత్ర త్వ మాగతః ॥ 103

## శుకుని చరిత్రను జెప్పుట

దేవలా ! ఇకమీదట శ్రీ శుకుని జన్మనుగురించి చెప్పెదను వినుము. పూర్వ కాలమున పూజ్యుడైన బ్రహచారియగు వ్యాసపుత్రుడగు శ్రీ శుకమహర్షి 94

రుద్రునినుండి బ్రహ్మోపదేశమును బడసి జ్ఞానియయ్యెను. తపస్సుచేసి సిద్ధిని పొంది జగత్తునంతను పరమాత్మాత్మకమున జూచుచు పోయెను. 95

జగత్తంతయు బ్రహ్మాత్మకమేయని నిరంతరము పలుకుచున్నవాడై జ్ఞానపార వశ్యమున బాలునివలె సంచరించుచు పదునాలేండ్లింకను నిండకనే సాక్షాత్ శ్రీకృష్ణునివలె ప్రకాశించెను. 96

నాకు లక్ష్మి తల్లి; జనార్దనుడు తండ్రి. విష్ణుభక్తులే బంధువులు. మూడులోకములు నాకు స్వదేశములే. 97

అని చెప్పి వ్యాసమహర్షిని విడచి సూర్యునియొద్ద కేగెను. సూర్యునియొద్ద కేగుచున్న శ్రీ శుకుని జూచి 98

వ్యాసమహర్షి పుత్రా ! పుత్రా ! యని మాటిమాటికి కేకలిడెను. అటుపిమ్మట సూర్యుడా శుకుని జూచి పరిచయమువలన నా బ్రహ్మచారినిగూర్చి యిట్లు పలికెను. 99

ఓ బ్రహ్మచారీ ! నీవు బిడ్డలను కనలేదు. తలక్రిందుగా భూమికిపొమ్ము. కుమారుని గని పితృఋణమునుండి విముక్తుడవై వెంటనే నాయొద్దకు రమ్ము, పొమ్ము. 100

పుత్రులు లేనివానికి ఊర్ధ్వగతిలేదు. ఊర్ధ్వలోక ప్రాప్తికి భూమియందెంత తపస్సును చేసినను, యెన్ని యజ్ఞములను చేసినను స్వర్గమును బడయలేడు. 101

## ఛాయా శుకుడు పుట్టుట

అనెడు సూర్యుని మాటలను విని శ్రీ శుకుడు శ్రీమన్నారాయణుని ధ్యానించి తలక్రిందుగాగల తన నీడను తన బిడ్డగా సృజించెను. 102

లబ్ధస త్తాకుడగు నా శ్రీ శుకుడు ఆ ఛాయా రూపమగు శుకుని తన బిడ్డనుగా జేసి నీవు నాకు పుత్రుడవై నా తండ్రి దుఃఖమును పోగొట్టుము. 103

ఇత్యుక్త్వా భాను మాలోక్య । వివృతం త త్పథం గతః ।
ఛాయా శుక స్సమాగత్య । వ్యాసం క్రోశన్త మాత్మజమ్ ॥ 104

నమస్కృత్య పితుః పాదౌ । శ్రుత్వా భాగవతం సుధీః ।
కృత్వా వైవాహికం కర్మ । పుత్రా నుత్పాద్య పుణ్యధీః ॥ 105

పురాణం శ్రీభాగవతం । ప్రతిష్ఠాప్యా వనౌ సుధీః ।
కృష్ణప్రసాదా త్సశుకః । ఋషిత్వం ఇచ్ఛ ప్రపద్య చ ॥ 106

సశరీరో బ్రహ్మలోకం । గత్వా ప్రీతో వసన్ సుధీః ।
శ్రీవేఙ్కటాద్రిమాహాత్మ్యం । శ్రుత్వా పద్మసరోవరమ్ ॥ 107

ప్రాప్య కృత్వా తప స్తీవ్రం । సరో ఒమ్బుజదశైః సృజన్ ।
స సభ్యాన్ మానసాన్ పుత్రాన్ । అష్టోత్తరశతం ద్విజాన్ ॥ 108

తా నధ్యాప్య బ్రహ్మవిద్యాం । తైః స్సహా ద్రిం గతో మునిః ।
మాసి భాద్రపదే పుణ్యే । బ్రహ్మణా నిర్మితో త్సవే ॥ 109

వర్తమానే శ్రీనివాస । సేవార్థం వ్యాసపుత్రకః ।
ఉత్సవే వాహనాన్ కృత్వా । శత మష్టోత్తరాన్ ద్విజాన్ ॥ 110

ఉత్సవా న్తే చా వ భృథే । శ్రవణర్షే ప్రసన్నధీః ।
స్నాత్వా చ స్వామిసరసి । తై ర్ద్విజైః కమలోద్భవైః ॥ 111

సభాయాం వేఙ్కటేశస్య । వాహకార్థం వ్యజిజ్ఞపత్ ।
స్వనామ్నా య త్పురం దేవ । మయా క్లృప్తం సురేశ్వర ॥ 112

తత్క్షేత్ర సమ్భవం సస్యం । జీవితం శ్రీపతే కురు ।
సేవాం కుర్వ న్త్వాశ్రయం । వాహకా ఉత్సవేషు తే ॥ 113

శ్రుత్వా మునివచో దేవః । శ్రీనివాస స్తథా ఒస్త్వి తి ।
ఛాయాశుకస్యా త్మ జానాం । సభ్యానాం జీవ మబ్రవీత్ ॥ 114

అని పలికి సూర్యుని జూచి తెఱవబడిన ఆ మార్గమున నేగెను. ఆ ఛాయా శుకుడు బిడ్డకై యేడ్చుచున్న వ్యాసుని యొద్దకువచ్చి 104

తండ్రి పాదములకు ప్రణమిల్లి ఆతనినుండి శ్రీమద్భాగవతమును విని బుద్ధిమంతుడై పెండ్లాడి పుణ్యబుద్ధిగలవాడై బిడ్డలను గని 105

శ్రీ భాగవతపురాణమును ప్రపంచమున స్థిరముగ స్థాపించి కృష్ణుని యనుగ్రహమున ఋషియునై 106

ప్రాకృత శరీరముతోనే బ్రహ్మలోకమునకేగి సంతుష్టాంతరంగుడై యచ్చట వసించుచు శ్రీ వేంకటాచలమాహాత్మ్యమును విని పద్మసరోవరమునకు 107

వచ్చి తీవ్రమగు తపస్సుచేసి యందలి తామరపువ్వుల రేకులతో తన సంకల్పబలముచేతనే నూటయెనమండ్రు ఉత్తములగు బ్రాహ్మణ బిడ్డలను సృజించి 108

వారికి వేదాంతవిద్యను బాగుగ బోధించి వారితో నా శ్రీ శుకముని శేషాద్రికేతెంచి భాద్రపద మాసమున బ్రహ్మచే నిర్మింపబడిన పవిత్రమగు బ్రహ్మోత్సవము 109

జరుగుచుండ శ్రీనివాసుని సేవించుటకై వచ్చి తాను సృష్టించిన నూటయెనిమిదిమంది బ్రాహ్మణ బిడ్డలను నూటయెనిమిది వాహనములనుగాజేసి 110

ఆ ఉత్సవము పూర్తికాగానే శ్రవణానక్షత్రమునందు దీక్షావసానస్నానదినమున నిర్మలచిత్తుడై తామరపువ్వులతో బుట్టింపబడిన నా బ్రాహ్మణ బిడ్డలతో స్వామిపుష్కరిణిలో స్నానమును గావించి 111

శ్రీనివాసుని సభలో వారిని భగవంతుని వాహకులనుగా విజ్ఞాపనజేసెను. స్వామీ! నేను నా పేరుతో సృజించిన పురమునందలి 112

క్షేత్రములోబుట్టిన పంట వీరి కాహారముగా నంగీకరింపుము. వీరు ప్రపంచమున్నంతకాలము నీ ఉత్సవములలో నీకు వాహకులై సేవలను చేయుదురుగాక! 113

ఇట్టి ఛాయా శుకమహర్షి మాటలను విని వేంకటేశ్వర భగవానుడు ఆప్తేయని సమ్మతించి సభ్యులగు ఛాయా శుకుని బిడ్డలను అంగీకరించెను. 1 4

బ్రహ్మలోకం జిగమిషుః । పునః ఛాయాశుకో మునిః ।
కృష్ణ శ్చ బలభద్ర శ్చ । ధానుం పద్మసరోవరమ్ ॥ 115

ప్రదక్షిణీకృత్య శుకః । స్థీయతా మితి చాత్మజాన్ ।
భరద్వాజాదిషడ్గోత్రాన్ । శత మష్టో త్తరం సుధీః ॥ 116

సభ్యాన్ సభాసదః పాద్మాన్ । ఉక్త్వా ఽ కాశం జగా మహ ।

దేవదర్శనః —

ఉక్తం పద్మసరోజన్మ । ఛాయాశుకమునే రపి ।
సభార్హాణాం ద్విజాతీనాం । శుకమానసజన్మనామ్ ॥ 117

దేవలః —

దేవదర్శన ! సర్వజ్ఞ । కృతార్థో ఽస్మి నతో స్మి తే ।
నా స్తి శ్రోతవ్య మేతస్మాత్ । సంశయో విగతో మమ ॥ 118

ఇతి శ్రీపాద్మపురాణే క్షేత్రకాణ్డే శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యే దేవలదేవదర్శన సంవాదే
పద్మసరోవరమాహాత్మ్యాదివర్ణం నామ చతుస్త్రింశో ఽధ్యాయః

ఇతి పాద్మపురాణా న్తర్గత వేఙ్కటాచలమాహాత్మ్యమ్
స మ్పూ ర్ణ మ్.

ఛాయా శుకమహర్షి బ్రహ్మలోకమునకు తిరిగిపోగోరి శ్రీకృష్ణుని బలరాముని సూర్యుని పద్మసరోవరమును 115

ప్రదక్షిణ మొనరించి భారద్వాజుడు మొదలగు ఆరు భిన్నగోత్రులై నట్టియు 116

పద్మదళములనుండి బుట్టినట్టియు సదాచారులగు వారినందరను నా శ్రీనివాసుని సభాసదులను నుండుడని ఆ బ్రాహ్మణ బిడ్డలతోచెప్పి ఆకాశమార్గమున నేగెను. 117

దేవదర్శనుడు —

దేవలా : నీకు నేనీ విధముగ పద్మసరస్సుయొక్క పుట్టుకను. ఛాయా శుక మహర్షి పుట్టుకకు సభార్యులైన బ్రాహ్మణ బాలకులయొక్క శ్రీ శుకమహర్షి సంకల్పము వలన బుట్టుటను చెప్పితిని. 117

దేవలుడు —

సర్వజ్ఞుడవగు నో దేవదర్శనా ! నేను కృతకృత్యుడనైతిని. నీకిదే వందనము. నా కింతకుమించినది, వినదగినదిలేదు. నాకిక దేనినిగూర్చియు సంశయములేదు. అని పలికెను. 118

శ్రీ పద్మపురాణమున క్షేత్రకాండమున శ్రీ వేంకటాచలమాహాత్మ్యమున దేవల దేవదర్శనుల సంవాదమున పద్మసరోవరమాహాత్మ్యములోని వర్ణమున ముప్పదినాల్గవ అధ్యాయము

సంపూర్ణము